* కలేకూరి రచనలు

# పిడికెడు ఆత్మగౌరవం కోసం

వ్యాసాలు - సంపాదకీయాలు



## కలేకూరి ప్రసాద్



బహుజన కెరటాలు ప్రచురణలు

# పిడికెడు ఆత్మగౌరవంకోసం

**(వ్యాసాలు - సంపాదకీయాలు)**

**కలేకూరి ప్రసాద్ - 50వ జన్మదిన సాహిత్య సంబరం**


ముఖచిత్రం : **అక్బర్**

ముద్రణ : 25 అక్టోబర్ 2012

ప్రచురణ : **బహుజన కెరటాలు**

ప్రచురణ సంఖ్య : 11

ప్రతులు : 1000

ప్రతులకు : **కడియం నాగమణి**
**C/o** పల్నాటి శ్రీరాములు
4/15, ఆర్.టి.సి. స్టాఫ్ కాలనీ
సత్యనారాయణపురం
ఒంగోలు -2, ప్రకాశం జిల్లా
సెల్ : 9849944170
మరియు అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు

**ముద్రణ : అంకుష్**
నల్లకుంట, హైదరాబాద్ -44.
ఫోన్ : 040-27663211, 9912929078

**Composed & Layout : ShawnKoti**
*(Srinivasa Off-Set Printers), ONGOLE - 9848151731*

వెల : **150/-**

## Special Thanks to



# M. Madhusudana Rao

Chairman




**m madhusudana rao**

engineers & Contractors

**TELECOM * CIVIL * ELECTRICAL**

Hyderabad



కలేకూరి ప్రసాద్ (యువక)

అక్టోబర్ 25 -1962 - మే 17-2013

## లోపలి పేజీల్లో

## I - అంబేడ్కరిజం - బౌద్ధం


1 ఒక విప్లవం పుట్టిన రోజు 1
2 స్వర్ణోత్సవ రాజ్యాంగం – డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ 3
3 అంబేద్కర్‌ను వెలివేసి సాధించేదేమిటి? 11
4 భారత జర్నలిజానికి వైతాళికుడు డా॥ అంబేద్కర్ 22
5 ఒక్క దళితులకే కాదు మొత్తం దేశానికే ఇవాళ్టి అవసరం అంబేద్కర్ 25
6 అర్ధసత్యాల, అసత్యాల అరుణ్‌శౌరి పుస్తకం 33
7 జగమంతా అంబేద్కర్ మయం! 39
8 నవ బోధిసత్వుడు అంబేద్కర్ 42
9 అంబేద్కర్ నవయానం ఒక కొత్త ప్రపంచం కోసం... 46


## II - దళిత కిరణాలు


10 వికసిత బుద్ధం.... నిర్మిత సంఘం.... సమతాధమ్మం
"ఏతం బుద్ధాను సాసనం" 49
11 మానవత్వం కోసం కవిత్వం నారు బోసిన కబీరు 54
12 గుండె గుహల్లో "జ్యోతి" బా ఫూలే 58
13 స్త్రీ విమోచనా తొలికిరణం సావిత్రిబాయి ఫూలే 61
14 సామాజిక విప్లవ సేనాపతి మహరాజ్ సాహు ఛత్రపతి 64
15 నడిచే నిశ్శబ్ద విప్లవం నారాయణగురు 68
16 మూర్తీభవించిన ఆత్మ గౌరవం పెరియార్ 71
17 అణగారిన బతుకుల ఆశాదీపం అంబేద్కరిజం 74

## III - దళిత సాహిత్యం


18 దళిత సాహిత్యం 81
19 దళిత ఉద్యమం – దళిత సాహిత్యోద్యమం 101
20 దళిత కవితా పోరు పతాక జాషువా 126
21 దళిత వాదం – చూపు, దారి 132
22 మేమూ, వాళ్ళు, మీరూ 137
23 శివమెత్తిన సాగరం 140
24 ఏతం బుద్ధాను శాసనం 143
25 గుండె గొంతుకను దాటిన 'పంచమ' స్వరం 145
26 గుండెను ఏకునాదంగా మీటిన పాట 148
27 అంతర్ముఖుడి గాయాలాపన 151
28 సాహితీ కాలుష్యంలో ఒక స్వచ్ఛమైన శ్వాస 'కక్క' 153
29 పాటా.... రేలాపూతా.... గోరటి వెంకన్నా... ఎందుకు పుడతాయి! 158
30 పిడికిళ్ళై మోహరించిన గుప్పెడు కవిత్వం 161
31 బాధిత వర్గాల గొంతుల ప్రతిధ్వనులు 165
32 సిరాచుక్కల నుండి శాంతి పావురాలను ఎగరేస్తున్న నేతల ప్రతాప్ కుమార్ 168
33 ఇది దళితుల యుగం 171


## IV - దళిత ఉద్యమం


34 కంచికచర్ల కోటేశు – స్టాన్లీ సురేషూ 174
35 రెండు ఉద్యమాలు, రెండు కేసులు, దళిత ఉద్యమం వర్ధిల్లాలి 178
36 చుండూరు గుండెల గాయం ఇప్పుడు సాక్ష్యం చెబుతుంది! 186
37 మాదిగ దండోరా – మాల మహానాడు 188
38 దళిత ఉద్యమం పురుగుల మందు తాగింది 195
39 దళితులకు ఆయుధాలివ్వండి 200
40 ఆదివాసీ గుండెల్లో ఆగ్రహజ్వాల 202
41 ముస్లింలు దళితుల ఐక్యత అత్యంత అవసరం 207

# V - స్మృతి పథం


42 బుద్ధుడు.. అశోకుడు.., అంబేద్కర్.. కాన్షీరామ్ 209
43 నగేష్ అంటే సాహితీ సముద్రంలో సునామీ 210
44 ఆకురాలు కాలంలో ఆగ్రహ గీతం 213
45 చావులేని ఆశయాల ఆవాహనే సంస్మరణ 218
46 మనిషితనం తప్ప ఏమీ తెలియని ఒట్టి చేతల మనిషి... 221
47 దళితుల గుడిసెల్లోనా.... వెలిగిన చందామామా! 224
48 దగ్ధమైనా సరే సూర్యుడినే కౌగలించుకున్నవాడు 226
49 డా.కె.ఆర్. నారాయణన్ అమర్ రహే 228
50 నాలుగో హరిశ్చంద్రుడు యికలేడు! 233


# VI - బహుజన చూపు


51 బోధిసత్వ అంబేద్కర్ కలలపంట సామ్రాట్ కాన్షీరామ్ 236
52 మాయావతిని గెలిపించి తాము గెలిచిన బహుజనులు! 239
53 విజేతలను వణికించిన ఓటమి 242
54 కరుణానిధికి జేజేలు పలుకుదాం! 245
55 ఒక మహా విద్రోహానికి ముప్పాతికేళ్ళు! 247
56 యింతకీ... గెలిచింది ఎవరు!? 250
57 మతాల్లో హంతక ముఠాలు! 252
58 రెండు అస్తమయాలు, ఒకటే గాయం 254
59 శిలువల గుండెల్లో త్రిశూలాలు 258
60 బీహార్ దళితులకు ఆయుధాలివ్వండి 264
61 కులమూ, మేడే 266
62 కాషాయ ఫాసిస్టులకు వ్యతిరేకంగా రాజకీయోద్యమం రావాలి 267
63 ఈ ఫలితాల నుండి పాఠాలేమైనా నేర్చుకుంటామా!? 270
64 సోనియా ... సోనియా 272

65 దేశం 'వె..లి...గి...పోతుందా!!? 274
66 ఉత్తరాపథాన ప్రతిధ్వనించిన దక్షిణాది విప్లవజ్వాల 276
67 కాలమేమీ మారలేదు! బాధలేవీ తీరలేదు!! 279
68 పోతివిరో చంద్రబాబు... పేదోళ్ళ ఉసురుతగిలి... 281
69 ద్రోహకాలం 283
70 ఉండవల్లి ఉన్మత్త ప్రేలాపన 285
71 గ్లామర్ రాజకీయాలకు బలైన సౌందర్యం! 287
72 సుఖానికైనా, దుఃఖానికైనా ఎప్పుడు కలిసున్నామని!? 289

## VII - విశ్వ వీక్షణం

73 ఉన్న ఆ ఒక్కడూ పట్టుబడి పోయాడు 290
74 కాలం.. వీరులకే సలాం చేస్తుంది ! 295
75 నెత్తురోడిన శాంతి కపోతం రేచెల్ కోరీ 297
76 ఇకనైనా పశ్చాత్తాప ప్రకటన చేస్తారా? 300
77 అరాఫత్ అసలుపేరు ప్రేమ, పోరాటం 302
78 నల్లనల్ల సూరీడి గుండె గాయపడింది 304
79 ప్రపంచం గుండెల్ని కొల్లగొట్టిన కవి పాబ్లో నెరూడా 306
80 పంజరంలో పాలపిట్ట పాట పాడే దెందుకో!? 309

# మా మాట

**క**లేకూరి ప్రసాద్ మనసున్న కవి. మట్టిచేతులను ముద్దాడిన మహాకవి. కన్నీటికి కారణాలు వెతకగల విజ్ఞాని. ఆ కన్నీటిని దూరం చేయడానికి నిత్యం మార్గాలు వెతికే అన్వేషి. ఆ మార్గాలు అంబేడ్కర్ చూపించిన దారిలోనే వున్నాయని నమ్మి పయనమైనవాడు, ప్రయాణిస్తున్నవాడు. దుర్మార్గాన్ని సహించలేని ఆగ్రహం ఆయనది. అలాంటివాడు కనుకనే కర్మభూమిలో పూసి విరియకుండానే కట్నపు జ్వాలలకు బలైపోతున్న చిన్నారి చెల్లెళ్ళ కోసం కన్నీటి జలపాతమౌతాడు. కష్టజీవులందరూ కలసిపోయి హాయిగా నవ్వుకునే రోజు రావాలని కోరుకునే గొప్ప స్వాప్నికుడు కలేకూరి ప్రసాద్. ఈయన యువకగా మొదలై శబరిగా, సంఘమిత్రగా, కవనగా, సంచారిగా, అరుంధతిగా పరిచయమవుతాడు. దళిత బహుజన ఉద్యమాలతో పెనవేసుకొని ఎన్నో పుస్తకాలు, కవితలు, పాటలు, ఎన్నెన్నో వ్యాసాలు, మరెన్నో అనువాదాలు ఆయన సొంతం. ఏ పుస్తకం పట్టుకున్నా ఏ వ్యాసం చదివినా, కలేకూరి మనసే కన్పిస్తుంది. ఈ దళిత సాహిత్య సేద్యగాడికి యాభై ఏళ్ళు వచ్చిన సందర్భంగా దళిత సాహిత్య పండుగ జరగడం, నిజమైన అట్టడుగు అణగారిన జాతుల సాహిత్య పండుగ. ఈ పండుగ ఒంగోలులో జరుగుతున్న సందర్భంగా బహుజన కెరటాలులో గౌరవ సంపాదకుడుగా ఆయన రాసిన రచనలతో పాటుగా వివిధ పత్రికలలో ప్రచురితమైన కలేకూరి ప్రసాద్ వ్యాసాలను సేకరించి సమగ్రంగా ఒక పుస్తకంగా రూపొందించి పాఠకులకు అందించాలని బహుజన కెరటాలు సంకల్పించింది. మా సంకల్పానికి అండగా అడిగిన వెంటనే కలేకూరి వ్యాసాలు పంపిన నామాడి శ్రీధర్‌కి, చూపు కాత్యాయినికి, సజ్జా వెంకటేశ్వర్లుకి, ఒమ్మి రమేష్‌బాబుకి, పగడాల నాగేందర్‌కి, బి.బాలసుబ్రహ్మణ్యంకి, స్కైబాబకి, బత్తుల కార్తీక్ నవయాన్‌కి కృతజ్ఞతలు. వార్త దినపత్రిక (ఆదివారం అనుబంధం), ఆంధ్రజ్యోతి దినపత్రికలోని వ్యాసాలు, కె.జి.సత్యమూర్తి సంపాదకత్వంలో నడిచిన ఏకలవ్య, జె. గౌతమ్ సంపాదకత్వంలో నడిచిన బహుజన మహాబోధి, చూపు, మరోదారి, అరుణతార పత్రికలోని వ్యాసాలు తీసుకోవడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ సారథ్యంలో దేవరపల్లి మస్తాన్‌రావు సంపాదకత్వంలో డా॥ కత్తిపద్మారావు నేతృత్వంలో నడిచిన "దళిత రాజ్యం" పత్రికలోని వ్యాసాలు, లోకాయత ప్రచురణ అయిన "దళిత కిరణాలు" లోని వ్యాసాలూ, దళిత స్త్రీ సాహిత్య పరిషత్ కన్వీనర్ బి.ఎం.లీలాకుమారి ప్రచురించిన "దళిత సాహిత్యం" వ్యాసాన్ని ఈ పుస్తకంలో వేయడం జరిగింది. వారికి బహుజన కెరటాలు ధన్యవాదాలు తెలుపుకుంటుంది.

బహుజన కెరటాలు అందిస్తున్న "పిడికెడు ఆత్మగౌరవం కోసం" పుస్తకానికి అందమైన ముఖచిత్రాన్ని అందించిన ఆత్మీయుడు **అక్బర్**కి ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ పుస్తకం రూపకల్పనలో బహుజన కెరటాలు గౌరవ సంపాదకులు **దుర్గం సుబ్బారావు** చేసిన విశేషమైన కృషి మరువలేనిది. డి.టి.పి. మొదలు లే అవుట్ డిజైన్ వరకు శ్రమించిన **పులిపాటి షాన్‌కోటి** (శ్రీ శ్రీనివాస ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ఒంగోలు) కి మరియు ఈ పుస్తకం రూపొందుటకు శ్రమించిన ఎన్నెలనవ్వు రచయిత ఏకుల వెంకటేశ్వర్లు (ఇ.వి.), కత్తి కళ్యాణ్, ఆత్మకూరి చెన్నయ్య, నూకతోటి రవికుమార్, జర్నలిస్ట్ శివ, చప్పిడి కోటేశ్వరరావులకు జైభీమ్‌లు. సకాలంలో పుస్తకాన్ని ముద్రించి అందించిన అంకుష్, హైదరాబాద్ వారికి ప్రత్యేక ధన్యవాదాలు. బహుజన చైతన్యంకోసం పనిచేసే ఉద్యమకారులకి, కార్యకర్తలకి, కవులకు, కళాకారులకు ఈ పుస్తకం కరదీపిక కావాలని కోరుకుంటున్నాం.

ప్రచురణ కర్తలు

**బహుజన కెరటాలు**

**25-10-2012**

**ఒంగోలు**

# ఎగిరే ధిక్కార పతాకం

తెలుగు సమాజంలో దళిత ధిక్కార కవిగా, ప్రజాపాటల రచయితగా, దళిత విప్లవ వుద్యమకారుడిగా, సృజనకారుడుగా, సామాజిక పత్రికల సంపాదకుడిగా, అనువాదకుడిగా రాజకీయ విశ్లేషకుడిగా, సాహితీ విమర్శకుడిగా, మార్క్సిస్టుగా, మావోయిస్టుగా, అంబేద్కరిస్టుగా, అరాచకుడిగా, ఆప్తవాక్యంగా, స్నేహకరచాలనంగా, ఉద్యమ యువకగా, మనకాలం వీరుడిగా... ఇలా బహుముఖంగా విస్తరించిన మేధావి కలేకూరి ప్రసాద్. విప్లవోద్యమం నుండి దళిత వుద్యమం దాకా, స్త్రీలు, మైనారిటీలు, ఆదివాసీ, తెలంగాణా, దండోరా వుద్యమాలకి బాసటగా వుంటూ తనని తాను నిత్య ప్రజాస్వామికుడిగా ఆవిష్కరించుకుంటూ అన్ని ప్రత్యామ్నాయ ప్రజా వుద్యమాలకి మీటింగ్ పాయింట్ కలేకూరి.

హిందూ మతోన్మాద, సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా బిగించిన ఉక్కు పిడికిలి కలేకూరి. ఈ దేశంలోని, ప్రపంచంలోని అన్ని ప్రజాస్వామిక ఉద్యమాలకి గొంతుకలిపిన కవి. అస్తిత్వ ఉద్యమాలన్నింటిని మనస్ఫూర్తిగా కౌగిలించుకొని వాటికెంతో స్ఫూర్తినిచ్చిన ప్రజల మనిషి. ముస్లిం మైనార్టీ, మాదిగ దండోరా, బి.సి., తెలంగాణ, స్త్రీల, ఆదివాసీ ఉద్యమాలకి కొండంత అండగా నిలిచిన నేటి తరం ఉద్యమ రచయిత కలేకూరి.

కారంచేడు దళిత పోరాటం నుండి నేటి లక్షింపేట పోరాటం దాకా క్రియాశీలకంగా అన్ని దళిత వుద్యమ పోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొనడమేగాక, అన్ని సాహితీ ప్రక్రియల్లో తనదైన ముద్రవేస్తూ ఒక నూతన మానవీయ సమాజం కోసం స్వాప్నికుడిగా బతుకుతున్నవాడు కలేకూరి. ఈ కలల ప్రపంచంలో పీపుల్స్‌వార్, దళితమహాసభ, బహుజన సమాజ్ పార్టీ, బహుజన రిపబ్లికన్ పార్టీ, మహాజన పార్టీ.. మన బతుకు బాగుచేసుకోవడం కోసం ఒక్క అడుగైనా ముందుకు పడితే బాగుండని, ఈ పార్టీల పరిమితులు తెలుసుకునే నడిచేడు. జీవితంలోనైతే ఎన్ని మజిలీలో.. ఒంటరిగా, సామూహికుడిగా, సాహసికుడిగా, వొకేఒక్కడిగా, తోవ ఎక్కడ సోనియా అనుకుంటూ.. నేనిప్పుడు రాస్కల్నికోవ్‌ననుకుంటూ, కంచికచర్ల కోటేసునను కుంటూ... గుండెనిండా గాయాల్ని ఎవరికీ కన్పించకుండా దాచుకున్నోడిలా, నిరాశనే దరిచేరనివ్వని నిండు మనిషిగా, రగిలిపోయే వుద్యమ రణనినాదంగా తన జీవితాన్ని, సాహిత్యాన్ని రచనలని మలచుకున్నాడు. అట్లాగే జీవితాన్నంతా ఇప్పుడే ఈ క్షణంలోనే అనుభవించాలను కుంటాడు. శరీరంలోని ప్రతి కణమూ పులకరించిపోవాలంటాడు. కలేకూరి ప్రసాద్ జీవితంలో ఎంత అరాచకంగా వున్నట్టు కన్పిస్తాడో అదే సాహిత్యంలోనూ, తన రచనల్లోనూ ఎంతో నిక్కచ్చిగా రాజకీయ నిబద్ధతతో వుంటాడు. గాలివాటంగా ఎప్పుడూ వుండడు. కెరీరిస్టుగా వుండటమంటే అసహ్యం. భద్రమైన బతుకుల్లో ఒక క్షణం కూడా వుంటానికి ఇష్టపడడు. ఆత్మగౌరవం అనే ఆయుధాన్ని ఎప్పుడూ తన వెంటబెట్టుకుని తిరిగే సంచార సాహితీ జీవి. దళితుడంటే, ఏ సంకోచాలూ భయాలూ లేకుండా, వూరి మధ్య నిట్టనిలువుగా నుంచొన్న అంబేద్కర్ విగ్రహంలా వుండాలనుకుంటాడు. దళితుడంటే

సృజనాత్మకతా, సాహసికత సొంత హక్కుగా వుండేవాడనుకుంటాడు. కులవ్యవస్థ, హిందూ మతమూ, మనుధర్మంగా మనపై రుద్దిన అమానవీయత, అణచివేత, దోపిడీ మీద తిరుగుబాటు చేయడమే దళితతత్వంగా కలేకూరి నమ్ముతాడు. అది దళితుల హక్కుగా కూడా చెబుతాడు. తన అన్ని రచనల్లోనూ ఈ ధిక్కారమే కేంద్రకంగా వుంటుంది. దళిత జీవన సాంద్రతనీ, గాయపడ్డ గుండెల్లో వుండే భావోద్రేకాల్ని, ఎగిసిపడే ఆవేశాల్ని, పిడికెడు ఆత్మగౌరవం కోసమంటూ అక్షరాల్లో ఆవిష్కరించే పనిలో మునిగిపోయిన కవి కలేకూరి ప్రసాదు. "అవమానం ఈ దేశంలో విరగపండే సంపదని" గుర్తించిన కలేకూరి ఈ అమానవీయమైన పంటను తగలబెట్టేందుకు కావాల్సినంత పదసామాగ్రిని పోగుచేసి, కవిత్వంగా, కతలుగా, పాటలుగా, వ్యాసాలుగా చేసి ఆ పదాల చేత యుద్ధ కవాతు చేయించాడు.

రాయడం కోసం రాయలా. ఏం రాసినా, చేసినా ఓ మహోన్నత వుద్యమం కోసమే. ఆ వుద్యమాన్ని దళిత జనవిముక్తి కోసంగా జీవితం, సాహిత్య సృజన, ఉద్యమంల మధ్య గీతలు చెరిపేసి సాహిత్యాన్ని జీవితమంత గొప్పగా, జీవితాన్ని సాహిత్యంగా చేసిన గొప్ప రొమాంటిక్ కలేకూరి. దళిత కవుల్లో బలమైన గొంతు కలేకూరిది. తన రచనల్ని పోగు చేసి పుస్తకాలేసుకోకపోవడంవల్ల యూనివర్శిటీలకీ, పరిశోధకులకీ చేరకపోవచ్చేమోగాని, ఉద్యమ రాజకీయాల్లో వున్న వాళ్ళకి కలేకూరిది గుండెసంబంధం. జనం మధ్య నాటుకుపోయినోడిని ఎలా పరిచయం చెయ్యాలన్నది పెద్ద సమస్యే. కలేకూరి రచనలు ఏ కొలమానాలతో చూడాలన్నది మరో సవాలు.

కలేకూరి ప్రసాద్ రచనలన్నీ కవిత్వంతో నిండిపోయింటాయి. తెలుగు సాహిత్యంలో కవిగా ఎన్నో ప్రత్యేకతలున్నవాడు. చెప్పే విషయాన్ని స్పష్టంగా, సూటిగా, గుండెలో గుచ్చేలా చెబుతాడు. మనకి తెలిసిన పదాల్నే ఎలక్ట్రిఫై చేసి జనం మీదకి వదులుతాడు. కవిత్వంలో యుద్ధానికే సై అంటాడు. కాంప్రమైజులుండవు. కన్నీళ్లు వుండవు. జాలిచూపులకోసం వెతుకులాట వుండదు. ప్రత్యామ్నాయ పురాణ ప్రతీకల మధ్య దాక్కోవటం వుండదు. అంతా వర్తమానంలోనే. పిడికెడు ఆత్మగౌరవం కోసం తలెత్తి, చరిత్ర పుటల్లోకి సుందర భవిష్యత్తునై పరివ్యాపిస్తానంటాడు. జీవన రవళిని విన్పించే వెదురు వనాన్నై వికసిస్తానంటాడు.

సామాన్య జనానికి కలేకూరి ప్రసాద్ పేరు తెలియక పోవచ్చేమోగాని, తను రాసిన పాటలన్నీ తెలుసు. వరకట్న హత్యల మీద రాసిన 'కర్మభూమిలో పూసిన ఓ పువ్వా' రైతుల ఆత్మహత్యల మీద రాసిన 'భూమికి పచ్చాని రంగేసినట్టు' ఇవి ప్రజల్లో పాపులర్ అయ్యాకే శ్రీరాములయ్య సిన్మాలో పాటలయ్యాయి. అదే విధంగా 'కుమిలిపోయినా, నలిగిపోయినా / చుండూరు గుండెల గాయం దళితా.. సాగుతున్న సైనిక శపథం.. ఆవేదనంతా పోరాట సెగలై / ఊరూరా చుండూరు మండుతుందిలే /రక్తధారలే.. ఉదయతారలై వికసించులె ఆత్మగౌరవం... దళితా' అన్నపాట ఎప్పటికీ దళితపోరాట పాటే. చర్చిలో పాడుకునే క్రైస్తవ పాట బాణిలో ఈ పాట దళితులకి మరింత దగ్గరయింది. 'పల్లెపల్లెనా దళిత కోయిలా / బతుకుపాట పాడుచుండగా / గుండె గుండెనా పోరు పుట్టగా / బతుకులోన పొద్దుపొడిచి

వెలుగునిండగా / ఆహా సాగే పేదోళ్ల జాతరా / ఒహో కూలీ గుండెల్లో పండగా...ఇదో దళిత మార్చింగ్ సాంగ్.

కలేకూరి కవిత్వం, పాట వొక ఎత్తయితే, తను చేసిన అనువాదాలు తెలుగు మేథో లోకానికి మరింత దగ్గరకి చేర్చినవి. తను ఎంచుకున్న అనువాదాలన్నీ, ఎంతో సామాజిక ప్రయోజనమున్నవే. మనల్ని ఆలోచింపచేసేవే. కలేకూరి చేసిన అనువాదాల్లో స్వామి ధర్మ తీర్థ రాసిన 'హిందూ సామ్రాజ్యవాదం' (1998) (History of Hindu Imperialism), అరుంధతీరాయ్ రాసిన 'ఊహలు సైతం అంతమయ్యేవేళ' (1998) (End of Imagination), కిశోర్ కుమార్ కాళే ఆత్మకథ 'ఎదురీత' (Against All Odds), యూదులపైన జరుగుతున్న నాజీ దురాగతాలపై ప్రిమొ లెవీ రాసిన ఖైదీనెంబర్ 174517 (2003).. ఈ రచనలన్నీ జీవితం పైన ఆశని పెంచేవి. బతుకు పోరు పైన విశ్వాసం సడలనివ్వనివి. వీటితోపాటుగా అనేక ప్రముఖుల వ్యాసాలని.., వందనాశివ, ఉత్సా పట్నాయక్, కృష్ణకుమార్, సోనాల్కర్‌ల చిన్నవ్యాసాల్ని, గొప్పరచయితలైన మహాశ్వేతాదేవి, బషీర్ కథల్ని కొన్నింటిని అనువాదం చేసేడు. ఈ అనువాదాలన్నీ హైద్రాబాద్ బుక్‌ట్రస్ట్ చొరవతో తన అభిరుచికొద్దీ చేసినవి. అనువాదమంటే పెద్దపెద్ద యూనివర్శిటీ డిగ్రీలున్నవాళ్లే తలలు పట్టుకుంటుంటే కలేకూరి ఎంత అలవోకగా అనువాదాలు చేస్తాడో! అసలు కన్నా అనువాదమే బాగుందనోళ్లు ఎందరో వున్నారు. భావం చెరగకుండా, తనదైన తెలుగు పదాల్లో పాఠకుల్ని కట్టిపడేసేవిగా వుంటాయి. ఇందులో అంబేడ్కర్ మహద్ సత్యాగ్రహం సందర్భంగా చేసిన ప్రసంగానికి చేసిన అనువాదం ఒక మచ్చు తునక.

అక్టోబర్ 25, 1962 విజయవాడ పక్కనున్న కంచికచర్లలో పుట్టిన కలేకూరి ప్రసాద్ ఇప్పుడు యాభయ్యో సంవత్సరంలోకి అడుగు పెడుతున్నాడు. అమ్మా,నాన్నలు లలిత సరోజిని, శ్రీనివాసరావులు. దళిత టీచర్లు. యువకుడిగానే విప్లవ రాజకీయాల్లోకి దూకిన కలేకూరి యువకగా, విప్లవ రచయితగా, కారంచేడు ఉద్యమంలో విప్లవపార్టీ నుండి చురుకుగా పాలు పంచుకోవడమేగాక, కారంచేడు ఒగ్గు కథ రచనల్లో ప్రధాన భాగస్వామి అయ్యాడు. 1987లో పీపుల్స్ వార్ పార్టీ నుండి బయటకొచ్చేడు. 1987లోనే కర్మభూమిలో విరిసిన పువ్వా పాట రాసాడు. చుండూరు నరమేథాన్ని (1991) ఖండిస్తూ 'పిడికెడు ఆత్మగౌరవం కోసం' కవిత రాసాడు. 1991లో విరసం నుండి తప్పుకున్నాడు. చుండూరు దళిత ఉద్యమంలో చురుకుగా పాల్గొని, ఆ తర్వాత వచ్చిన దళిత వుద్యమాలన్నిటిలోనూ, దళిత సాహిత్యవుద్యమంలోనూ తనదైన గొంతుకతో నిలబడ్డాడు. 1994 నందిగామ నియోజకవర్గం నుండి బహుజన సమాజ్ పార్టీ తరపున పోటీచేసి ఓడిపోయాడు.

ఆ తర్వాత కాలంలో హైద్రాబాద్ కేంద్రంగా చేసుకొని దళిత వుద్యమంలో ప్రధాన పాత్ర పోషించాడు. ముఖ్యంగా దళిత సాహితీ సభల్లో ప్రధాన వక్తగా, మిగిలిన దళిత రచయితలకి ధైర్యాన్నిస్తూ సత్యమూర్తి సారధ్యంలో నడిచిన ఏకలవ్య పత్రికకి తన వంతు

సహకారాన్నందిస్తూ, దళిత రాజకీయ వుద్యమాల వూపు తగ్గిన రోజుల్లో కాసేపు 'సాక్షి' ఎన్.జి.వోలో పనిచేశాడు. ఎన్.జి.ఓలు తన మేథోబలాన్ని వుపయోగించు కోవాలనుకుంటే అక్కడ కూడా తనకిష్టమైన దళిత ఎజెండానే తనకు నచ్చిన రీతిలో రూపొందించుకున్నాడు. ఆ సంస్థలో వున్న రోజుల్లో దళితులపైన జరుగుతున్న అత్యాచారాల గురించి విశ్లేషణలతో ఒక పెద్ద చార్జిషీటుని పుస్తకంగా తీసుకురావడం జరిగింది. కలేకూరి పర్యవేక్షణలో దళిత హక్కుల పరిరక్షణకోసం, హక్కుల ప్రచారం కోసమని సాక్షి కొద్ది నెలలు నడిపిన 'నిఘా' పత్రికకు సంపాదకుడిగా వ్యవహరించాడు.

ఆంధ్రప్రదేశ్‌లో ఒక అలగా వచ్చిపడిన దళితవుద్యమం, దళిత సాహిత్యం వలన, కులసమస్య పట్ల అవి లేవనెత్తిన ప్రశ్నల వల్ల ప్రత్యామ్నాయంగా వున్నవనుకున్న విప్లవ రాజకీయాల్లో, వుద్యమాల్లో కదలికతోబాటు, కులసమస్యపైన తమదైన ధోరణిలో ఆలోచించుకోవడం జరిగింది. ఈ క్రమంలోనే సి.పి.ఎం. పార్టీకి అనుగుణంగా కులవివక్ష పోరాట సమితి, ప్రధాన నక్సలైట్ పార్టీ అయిన పీపుల్స్ వార్ పార్టీ చొరవతో కుల నిర్మూలనా పోరాట సమితి ముందుకురాగా, మరో నక్సలైట్ పార్టీ అయిన జనశక్తి పార్టీలో నుండి వీరన్న గ్రూప్ విడిపోవడమేగాక ఫూలే, అంబేద్కర్ ఆలోచనా వెలుగులో కులనిర్మూలన ప్రధాన ఎజెండాగా విప్లవ వుద్యమాన్ని నడపాలనుకొన్నక్రమంలో 'బహుజన కెరటాలు' పత్రిక ఒక సాహితీ వేదికగా పుట్టుకొచ్చింది. ఆ తర్వాత కాలంలో అదో స్వతంత్ర పత్రికగా దళిత మేథావులకి, రచయితలకి కేంద్రమయింది. ఆ క్రమంలో సహజంగానే కలేకూరి ప్రసాద్ క్రమం తప్పకుండా బహుజనకెరటాలులో అనేక విషయాలపైన వ్యాసాలు, సంపాదకీయాలు, కవితలు రాయడం జరిగింది. బహుజన కెరటాలు పత్రికకి ఇప్పటికీ కలేకూరి ప్రసాద్ గౌరవ సంపాదకులుగా వున్నారు. ఒక విధంగా ఈ పత్రికకి ఇప్పటివరకు శ్వాస, డైరెక్షన్ కలేకూరే. బహుజన కెరటాలుతో తన అనుబంధం తర్వాత తను రాసిన ప్రతిమాటా ఇందులోనే ప్రచురించబడ్డాయి. అంటే, గత పదేళ్లుగా కలేకూరి ప్రసాద్ రాసిన వ్యాసాలన్నీ ఎక్కువ భాగం బహుజన కెరటాల్లోవే. వీటితో బాటు సమగ్రతకోసం అంతకు ముందు కలేకూరి రాసిన, మాకు దొరికిన ముఖ్య వ్యాసాలని కూడా ఇందులో చేర్చడం జరిగింది.

ఈ సంకలనంలోని వ్యాసాలు అంబేద్కర్ గురించి రాసినా, ప్రజావుద్యమాల గురించి రాసినా, ఆంధ్రప్రదేశ్ రాజకీయాల గురించి రాసినా, అంతర్జాతీయ ప్రాముఖ్యమున్న విషయాల గురించి రాసినా, ఆఫ్రికన్ కవుల గురించి రాసినా, అంతటా దళిత దృక్కోణమే కన్పిస్తుంది. ఈ వ్యాసాల్లో రచయిత అవగాహన, జ్ఞానపరిధి, అణచివేతకూ, అవమానాలకీ గురవుతున్న ప్రజానీకం విముక్తికోసం, వాళ్ళను తన రచనలద్వారా చైతన్య పరచాలన్న తపన బలంగా కన్పిస్తుంది. అనేక విషయాల పైన అవగాహనతోబాటు, అర్థవంతంగానూ పాఠకుడి గుండెకి తగిలేలా ఎలా చెప్పాలో అలాగే చెప్పేడు. సిద్ధాంత గాంభీర్యం కనిపించదు. జ్ఞానప్రదర్శన కనిపించదు. గాఢమైన భావాన్ని, ఆవేశాన్ని చిన్నచిన్న మాటల్లో, చిక్కనైన భావుకతతో

చెబుతాడు కలేకూరి. శీర్షికలు పెట్టటాన్నిగానీ, లీడ్ రాసే విధానాన్నిగాన్ని చూస్తే కలేకూరి ఎంత ప్రతిభావంతుడో తెలుస్తుంది.

అంబేద్కర్ జననాన్ని 'ఒక విప్లవం పుట్టినరోజు' అంటాడు. అంబేద్కర్‌ని విభిన్న దృక్పథాలవాళ్లు ఆవాహన చేసుకున్న దాన్ని 'జగమంతా అంబేద్కర్ మయం', మాయావతి పార్లమెంటులో అణు ఒప్పందంపై యు.పి.ఎ.కి వ్యతిరేకంగా ఓటువేసిన సమయంలో పరిస్థితిని 'విజేతలని వణికించిన ఓటమి', చుండూరు బాధితులు కోర్టులో ఆత్మగౌరవ ప్రకటనలు చేసిన దాన్ని 'చుండూరు గుండెల గాయం ఇప్పుడు సాక్ష్యం చెబుతుంది', తెలంగాణ వుద్యమ నేపథ్యంలో సమైక్యాంధ్ర వుద్యమాన్ని నిరసిస్తూ అగ్రకుల అహంకారాన్ని గురించి చెబుతూ 'సుఖానికైనా, దుఃఖానికైనా ఎప్పుడు కలిసున్నామని', కబీర్ గురించి 'మానవత్వం కోసం కవిత్వం నారుబోసిన కబీర్', చార్వాక ఆశ్రమం, నాస్తిక నాయకుడు రామకృష్ణ గురించి 'మనిషితనం తప్ప ఏమీ తెలియని ఒట్టి చేతలమనిషి', సత్యహరిశ్చంద్ర పాత్రధారి చీమకుర్తి నాగేశ్వరరావు సంతాపంగా 'నాలుగో హరిశ్చంద్రుడు ఇకలేడు', సినీనటి సౌందర్య అకాల మరణాన్ని 'గ్లామర్ రాజకీయాలకు బలైన సౌందర్యం', కంచిపీఠాధిపతి జయేంద్రసరస్వతి పైన హత్యారోపణల నేపథ్యాన్ని 'మఠాల్లో హంతక మఠాలు', నల్లజాతి విప్లవ రచయిత గూగీ పైన దాడిని నిరసిస్తూ 'నల్లనల్ల సూరీడి గుండె గాయపడింది', మరో ఆఫ్రికన్ అమెరికన్ రచయిత మాయా ఏంజలో గురించి 'పంజరంలో పాలపిట్ట పాటపాడేదెందుకో' (Caged Bird కవితను దృష్టిలో వుంచుకొని), త్రిపురనేని శ్రీనివాస్‌కి సంతాపంగా 'దగ్ధమైనా సూర్యుడినే కౌగిలించు కున్నవాడు', పాబ్లో నెరుడాని 'ప్రపంచం గుండెల్ని కొల్లగొట్టిన కవి పాబ్లో నెరుడా', అమెరికా సామ్రాజ్యవాదులని గడగడలాడించిన సద్దాం హుస్సేన్ పట్టుబడ్డ సమయాన్ని 'ఉన్న ఆ ఒక్కడూ పట్టుపడిపోయాడు', సద్దాంని అమెరికా సేనలు ఉరితీసిన తర్వాత 'కాలం వీరులకే సలాం చేస్తుంది', పాలస్తీనా విమోచనా నాయకుడు అరాఫత్‌కి ప్రేమగా 'అరాఫత్ అసలు పేరు.. ప్రేమ, పోరాటం', నక్సలైట్లతో చర్చలకని చెప్పి ప్రభుత్వం ప్రదర్శించిన నిరంకుశత్వం మీద 'ద్రోహకాలం', గాంధీ కమ్యూనల్ అవార్డుని వ్యతిరేకిస్తూ, ఆ తర్వాత జరిగిన పూనా ఒప్పందాన్ని గురించి 'ఒక మహావిద్రోహానికి ముప్పాతికేళ్ళు' ఇలా ఈ శీర్షికలను గమనిస్తేనే కలేకూరి ఎంతటి తడిగుండె వున్న భావుకుడో తెలుస్తుంది.

ఈ సంకలనంలోని వ్యాసాలను గమనించినట్టయితే ఎక్కువ భాగం అంబేద్కర్ జీవితం గురించి, ఆయన రచనలగురించి విశ్లేషణాత్మక వివరణలతోబాటు సమకాలీన సామాజిక ఉద్యమాలు, మరీ ముఖ్యంగా దళిత వుద్యమాలు అంబేద్కరిజాన్ని ఎలా అన్వయించుకోవాలో సూటిగా, సృజనాత్మకంగా చెప్పడం జరిగింది. తెలుగు సమాజంలో అంతగా అంబేద్కర్‌ని చదివి అర్థంచేసుకుని సగటు దళితుడికి అర్థమయ్యే రీతిలో చెప్పిన ఏకైక మేధావి కలేకూరి ప్రసాదనే చెప్పుకోవాలి. అంబేద్కరంటే ఒక సంపూర్ణ సామాజిక పరివర్తనను ప్రతిపాదించి ఆచరించిన విప్లవకారుడంటాడు. ఈ దేశంలోని ప్రగతిశీల ప్రజాస్వామ్యవాదులూ, విప్లవపార్టీలు అంబేద్కర్‌ని సరిగా అర్థం చేసుకోలేకపోగా, లిబరల్ బూర్జువా అంటూ, సామ్రాజ్యవాదుల

తొత్తు అంటూ, కులతత్వ వాదిగా ముద్రవేయటాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తూ, ఆ వుద్యమాల వైఫల్యాన్ని ఎండగడుతూ, అంబేద్కర్ తాత్వికతకు మరింత పదునుపెడుతూ మనముందు నేటి తరానికి కావాల్సిన రాడికల్ అంబేద్కర్‌ని ఆవిష్కరిస్తాడు కలేకూరి. దళిత ప్రజానీకం అంబేద్కర్‌ని సొంతం చేసుకున్నాక హిందుత్వ పార్టీలు, విప్లవ పార్టీలు అంబేద్కర్‌ని తమదైన స్టయిల్లో గుర్తించడంలోని లొసుగులని విప్పిచెప్పడమేగాక, దళితులు అంబేద్కర్ ఆలోచనా ధోరణిని మరింతగా ముందుకు తీసుకెళ్లటంలో వెనకబడటాన్ని గురించి కూడా చెబుతాడు. ఏదేమయినా ఇప్పుడు జగమంతా అంబేద్కరేనంటాడు. అంబేద్కర్‌ని ఎంత గొప్పగా ఎత్తిపట్టేడో, అంబేద్కర్ నమ్మిన బౌద్ధాన్ని కూడా అంతే గొప్పగా చెప్పాడు. అంబేద్కర్ బౌద్ధం సమాజాన్ని మతాతీత, నైతిక, సామ్యవాద సూత్రాలపై పునర్నిర్మించిందిగా చెబుతాడు. అంబేద్కర్ నవయాన బౌద్ధంలోని కీలకాంశం కులనిర్మూలనంటాడు. 'నవయానమంటే మనం జీవిస్తున్న ప్రపంచంలోనే సామాజిక, ఆర్థిక, రాజకీయ విముక్తి సాధించడంగా చెబుతాడు. అంబేద్కర్ బౌద్ధంలో దేవుడు లేడు. మూఢ విశ్వాసాలు, దుర్మార్గపు క్రతువులు, కర్మకాండలు లేవు. కులవ్యవస్థ తాలూకు దారుణమైన అణచివేత లేదు. ఉన్నదంతా హేతుబద్ధత, సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం'. ఈరోజు అంబేద్కర్‌ని, బుద్ధుడినీ గ్లోబల్ మార్కెట్‌లో సరుకుగా మార్చి అమ్ముకోవటాన్ని ఈసడించుకుంటాడు. ఇటీవల కాలచక్రంలో జరిపిన క్రతువులని నిరసించడమే గాక నవయాన బౌద్ధుడైన అంబేద్కర్‌ని ఉపేక్షించడాన్ని వ్యతిరేకిస్తాడు.

దళిత ప్రజానీకాన్ని తన రచనల ద్వారా చైతన్యపరుస్తూ, దళిత ఉద్యమ నిర్మాణాల్లో ప్రధానపాత్ర వహిస్తూ, దళిత వుద్యమ తీరుతెన్నులపైన ఆత్మవిమర్శ చేసుకోవాల్సిన అవసరంవుందని కూడా ఎటువంటి సంకోచాలు లేకుండా ప్రకటించినవాడు కలేకూరి. భూమికోసం, అత్యాచారాల నిరోధంకోసం, గౌరవ ప్రదమైన జీవితంకోసం, వనరులపైన, రాజ్యాధికారంలోనూ వాటా సాధించడం కోసం ఒక సమగ్ర దళితవుద్యమం రూపొందలేదంటాడు. సమగ్ర వ్యూహం మాట బుద్ధెరుగు, కనీసం పది సంవత్సరాలకు ఒక కార్యాచరణ ప్రణాళిక కూడా తయారుచేసుకోలేని దయనీయ స్థితిలో ఈనాడు దళిత వుద్యమముందని వాపోతాడు. మనం విజయాలనెన్నైనా చెప్పుకోవచ్చు. కానీ లోపాలను గుర్తించి సవరించకపోతే ఏ వుద్యమమైనా మరణిస్తుందని హెచ్చరిక కూడా చేస్తాడు. నేటి దళిత వుద్యమ ఆత్మహత్య సదృశ్యాన్ని గురించి, ఖలీల్ జిబ్రాన్‌ని ఉటంకిస్తూ ఆకు రాలిపోవటానికి మొత్తం చెట్టు బాధ్యత వహించాలంటాడు. అందుకు ప్రధానంగా వుద్యమ నాయకత్వాన్ని తన రచనల్లో నిలేశాడు. 'ఉద్యమాన్ని మొదలు పెట్టిన నాయకుడు బాధిత ప్రజలు మేలు కోసం అన్ని శక్తుల్ని సమీకరించడు. అందర్నీ ఆహ్వానించడు. తన సొంత యింట్లో పెళ్లి వ్యవహారంగా, దళిత నాయకత్వం మైకుల ముందూ, శవాల ముందూ, సమాధుల ముందూ, ప్రభుత్వ అధికారుల ముందూ, రాజకీయనాయకుల ముందూ అంగలార్చుతున్నారు' అని ఆగ్రహంగా ఆవేదనగా అంటాడు. విజేతలు మాత్రమే నేతలు, ఒక్కరే నాయకుడు అన్న బ్రాహ్మణీయ భావజాలం

దళితవుద్యమం నరనరానికి జీర్ణించుకుందంటాడు. 'అందరి తత్వమూ అంబేద్కరిజమే అయినపుడు, అందరి లక్ష్యమూ నిజంగా దళితవిముక్తి, రాజ్యాధికార సాధనే అయినపుడు ఐక్యత ఎందుకు సాధ్యం కాదు? కనీసం ఒక ఉమ్మడి వ్యూహాన్ని, ఎత్తుగడలనీ, పోరాటరూపాలనీ అందరూ కలిసి నిర్ణయించుకునే పద్ధతిలో వుండాలని కోరుకున్నాడు. దళిత వుద్యమం ప్రపంచ మానవాళికే ఒక ఆదర్శంగా వుండాలని కలగన్నవాడు కలేకూరి. **'మూడువేల సంవత్సరాల అణిచివేతనూ, అవమానాలనూ, హింసనూ భరిస్తూ వున్న జాతి మొత్తం ప్రపంచానికి మనుషులుగా బతికే పాఠాలు నేర్పాలి.'** నేటి దళిత వుద్యమాన్ని ఆ విధంగా వుండే అవసరం చెబుతూనే, అంబేద్కర్ సాధించిన హక్కులు తప్ప ఆయన చనిపోయిన తర్వాత ఏభై సంవత్సరాలలో రూపొందిన దళితనాయకత్వం ఒక్క కొత్త హక్కుని కూడా సాధించుకోలేకపోయిందని, ఇది మనందరి వైఫల్యంగానే చెప్పుకోవాలంటాడు.

ఆంధ్రప్రదేశ్‌లో దళిత వుద్యమం మాదిగ దండోరా, మాలమహానాడు దశకు చేరుకున్నాక, దండోరా వుద్యమాన్ని సమర్థించేలా మాల కులానికి చెందినవాడిగా, రచయితగా, మేధావిగా, అది తన బాధ్యతగా గుర్తిస్తూనే, మాల కులస్థులు బేషరతుగా దండోరా వుద్యమాన్ని సమర్థించాలనీ, అందులో వాళ్లకుపోయేదేమీ లేదని చెబుతాడు. అలాగే మాదిగ దండోరా నాయకత్వం కూడా మాలల వలనే తమకు అన్యాయం జరిగిందనీ, తమ దుస్థితికంతటికీ మాల కులస్థులే కారణమన్న అభిప్రాయాన్ని కలిగించిందని, అది సరైనది కాదని చెప్పే ప్రయత్నం చేశాడు. ఏదేమయినా ఇప్పుడొక విషాదమైన స్థితిలోకి నెట్టబడ్డాం అని గుర్తిస్తాడు. 'ఇప్పుడు అగ్రకులాలకు దళితులపైన దాడులు చెయ్యడానికి తమ చేతులకు మట్టికాకుండానే సాధ్యమవుతుంది. మాలల్ని దెబ్బతీయటానికి మాదిగల్ని రెచ్చగొట్టి, మాదిగల్ని దెబ్బతీయటానికి మాలల్ని రెచ్చగొట్టి తమ పనిని కానిచ్చుకుంటారు. ఈ క్రమం ఇప్పటికీ కొన్నిచోట్ల మొదలయింది. ఆఫ్రికా దేశాల్లో ఈ స్థితిని పాలకవర్గాలు యిప్పటికే సాధించాయి. ఆయా కులాల్లో సాధ్యమైనంతమందిని దళారుల్ని తయారుచేసుకుని పబ్బం గడుపుకుంటున్నారు. ఈ స్థితిలో మాల మాదిగల నాయకత్వాలు ఎంతో జాగ్రత్త వహించాలి. మేధావులు సామరస్య వాతావరణంకోసం పూనుకోవాలంటాడు'.

దళితవుద్యమం జీవితానికి సంబంధించిన అన్ని రంగాలకి తాకాలంటాడు. రాజకీయ, సామాజిక, ఆర్థిక విప్లవంతోబాటు సాంస్కృతిక విప్లవం ఆవశ్యకతని కవిగా కలేకూరి గుర్తిస్తాడు. దళిత ఉద్యమానికీ, దళిత సాహిత్యానికీ అంబేద్కరిజమే అసలైన మార్గం అంటూ, అంబేద్కర్‌ని అటు దళిత వుద్యమానికీ, దళిత సాహిత్యానికి నాయకుడంటాడు. అంబేద్కర్‌ని అంతకుముందు ఈ దేశంలో రకరకాల రూపాల్లో జరిగిన సామాజిక విప్లవాల్ని, వాటిని ప్రవచించిన తాత్వికులని ఒక్కచోట పోగుచేసినవాడిగా చూస్తాడు. అంతేగాకుండా ఒక సమగ్రమైన సంపూర్ణమైన సామాజిక పరివర్తనకోసం తాత్విక భూమికను తయారుచేసే దానిలో భాగంగా బుద్ధుడు, జ్యోతిబాఫూలే, సావిత్రిబాయి ఫూలే, పెరియార్, నారాయణగురు,

సాహుమహరాజ్, కబీర్‌ల జీవితాన్ని తరచి బ్రాహ్మణీయ భావజాలాన్ని ఎదుర్కొనే ప్రత్యామ్నాయ దళిత కిరణాల వెలుగు నందించాడు. అదే క్రమంలో తెలుగునేల పైన వేమన, వీరబ్రహ్మంల తాత్త్విక ఔచిత్యం చెబుతూ, గొప్ప సాంస్కృతిక వారసత్వాన్ని అందించిన జాషువాను హత్తుకుంటాడు. జాషువాను హృదయానికి హత్తుకోలేని సాహితీ చరిత్ర ఆత్మహత్య చేసుకోవాలంటాడు.

'తెలుగు సమాజానికి మహాకవుల, కవి సామ్రాట్‌ల అధికార పీఠాల బరువులు ఇకపై వుండవు. ఏ ప్రజాస్వామిక విలువల కోసమైతే జాషువా ప్రస్థానించాడో ఆ పోరాటం కొనసాగుతుంది. ఆ పోరాటానికి సజీవ స్ఫూర్తి జాషువానే' అంటాడు. ఈ సంకలనంలోని దళిత సాహిత్య వ్యాసం దళిత కవి అయినటువంటి కలేకూరి ప్రసాద్ వ్రాసిన సమగ్ర సాహితీ వ్యాసం. దళిత సాహిత్య వికాసాన్ని, గొప్పతనాన్ని గానం చేయడమేకాక, దళిత సాహిత్యం ఎలా వుండాలో కూడా చెబుతాడు.

ఆయన మాటల్లోనే మనం చేయాల్సిందల్లా రాయడమే. బాగా "రాయడం. వాళ్ళ ప్రమాణాల్లో,వాళ్ళ ఆమోదం కోసం కాదు. పువ్వులు వికసించినట్లు, నవ్వులు రాలినప్పుడు గుండెలు మండినట్లు, గట్లు తవ్వేటప్పుడు కందిమోదు గుచ్చుకుంటే గుండెలు కలుక్కుమన్నట్లు అప్పటిదాకా కళకళలాడిన పల్లెపల్లెంతా స్మశానమై, పీనుగుల పెంటగా తయారైతే కోట్ల పిడికిళ్ళు ఒక్కసారిగా బిగుసుకొని ఒక బ్రహ్మాండమైన మెరుపు మెరిసినట్లు, మన భాషలో మనం రాయాలి. మన ప్రమాణాలతో మనం రాయాలి. కొత్త సూర్యుడ్ని చూడలేని వాళ్ళు కళ్ళు మూసుకుంటే మూసుకోనీ, వెన్నెల నవ్వితే వళ్ళు మండి పోయే వాళ్ళు మాడి మసైపోనీ, మనం చేయాల్సిందల్లా బతుకే ఎడతెగని పోరాటమై పోయిన మన బతుకు మనం బతుకుతున్నంత సహజంగా రాయడమే. పల్లెపల్లెనా దళిత కోయిల పాట పాడినట్లు, గుండె గుండెనా పోరు మంటలు రాజుకున్నట్లు, జాతర జాతరగా దళిత సమూహాలు ఈ గడ్డ గుండెల మీదుగా ఊరేగింపై నడచి పోతున్నట్లుగా మనం రాయాలి.

మనది ఓడిపోయిన మానవుల తుది విజయగీతం. ఇది దళితయుగం. దళిత సాహితీయుగమ"ని పిడికెడు ఆత్మగౌరవంతో వెయ్యిగొంతుకలతో నినదించిన ఓ ధిక్కార పతాకమా నీకు సలామ్‌లు.

**తేది: 25-10-2012**

**డా॥ పి. కేశవకుమార్**
**చీఫ్ ఎడిటర్**
**బహుజన కెరటాలు**
**04132656250**

# ఒక క్రియేటివ్ లెజెండ్ కలేకూరి

**"నా దేహం ఈ దేశంలో కరిగిపోయి**
**గంగా సింధూ మైదానమైంది**
**నా కనుగుడ్లు కన్నీరై ద్రవిస్తే**
**ఈ దేశంలో జీవనదులు ప్రవహించాయి**
**నా సిరల నుండి జీవధాతువులు స్రవిస్తే**
**ఈ దేశం సస్యశ్యామలమై సిరులు కురిసింది"**

అంటూ సమస్త ప్రగతికి ప్రాణభూతమైన దళిత ఔన్నత్యాన్ని, తాత్వికతను దశదిశలా రాసిపోసిన అసాధారణ ప్రజాకవి కలేకూరి ప్రసాద్. తన కవితా జీవధాతువులతో, రచనా సిరులతో సమకాలీన సాహిత్య క్షేత్రాన్ని సస్యశ్యామలం చేసిన అక్షర కృషీవలుడు కలేకూరి. వెలివాడల గుండెలనిండా నిప్పుల నినాదాల్ని వెలిగించి, అంటరాని బతుకుల్లో పిడికెడు ఆత్మగౌరవాన్ని ప్రసరించిన ప్రత్యామ్నాయ సాంస్కృతిక సమరయోధుడు ప్రసాద్. "నేను జనసమూహాల గాయాన్ని / గాయాల సమూహాన్ని" అంటూ 'తన సృజన రహస్యాన్ని ప్రకటించి దళిత, బహుజన ఆదివాసీ సమూహాల గాయాలకు గొంతునిచ్చి మూడు దశాబ్దాల పాటు పీడిత వాణిని వినిపించిన కవన పిల్లన గ్రోవి కలేకూరి ప్రసాద్. అందుకే గాయాలనే స్వర మాతృకలుగా మార్చుకొని విప్లవ, దళితోద్యమాల దారిలో పెను చేతనా ప్రవాహమై, పోరుపాటల జలపాతమై ప్రతిధ్వనించాడు. అధికార పీఠాలకు, అధినాయకత్వానికి రచయిత శాశ్వత ప్రతిపక్షంగా వ్యవహరించాలని చెప్పిన కలేకూరి, ఈ మాట తప్పకుండా, మడిమ తిప్పకుండా అత్యంత ప్రభావశీలమైన, స్ఫూర్తివంతమైన, తాత్విక సమన్వితమైన సాహిత్యాన్ని సృష్టించాడు! పాత్రికేయునిగా, కవిగా, విమర్శకునిగా, అనువాదకునిగా కలేకూరి నిశితమైన దార్శనిక దృష్టితో ఈనాటి అస్తిత్వ ఉద్యమాల విస్తృతికి, తదనుగుణమైన సాహిత్య పరిణితికి అదనపు ఉత్పాదితాలను (Additional Inputs) అందించాడు.

యువక, శబరి, సంఘమిత్ర, నవత, కవన తదితర కలం పేర్లతో ప్రసిద్ధమైన కలేకూరి ప్రసాద్ లలితా సరోజినీ, శ్రీనివాసరావు దంపతులకు 1962 అక్టోబర్ 25న కృష్ణాజిల్లా కంచికచర్లలో జన్మించాడు. కంచికచర్ల, ఏలూరు పాఠశాలల్లో ప్రాథమిక విద్యనభ్యసించి, గుంటూరు ఏసీ కాలేజ్‌లో ఇంటర్ పూర్తి చేశాడు. డిగ్రీ చదువుతున్నప్పుడే రాడికల్ విద్యార్థి సంఘ రాజకీయాల వైపు ఆకర్షితుడై ప్రజా యుద్ధ తీరాల్లో సంచరించాడు. కొడుకు బుద్ధిగా చదువుకొని ఉద్యోగం సంపాదించుకుంటాడని తల్లిదండ్రులు ఆశపడితే అందుకు విరుద్ధంగా కలేకూరి ప్రసాద్ అసమ సమాజాన్ని అధ్యయనం చేసి విప్లవోద్యమ కార్యకలాపాలకు అరుణోత్తేజంతో అంకితమయ్యాడు. కారంచేడు, చుండూరు సంఘటనల నేపథ్యంలో కలేకూరి సృజనాత్మక ప్రస్థానం గుణాత్మకమైన మలుపు తిరిగింది. 'దళిత మహాసభ' రగిలించిన ఆత్మ

గౌరవపోరాటాన్ని అందిపుచ్చుకొని అణగారిన జీవితపు సన్నని సందుల్లోకి చొచ్చుకొని పోయాడు. బహుజన సమాజ్ పార్టీ ఇచ్చిన పిలుపుతో ప్రత్యక్ష రాజకీయాల బరిలో దిగిన కలేకూరి ఓటుబ్యాంకు లావాదేవీలు భరించలేక ఓటమి పాలయ్యాడు. 'చలపతి, విజయవర్ధనం'ల ఉరిశిక్ష వ్యతిరేక ఉద్యమంతోపాటు, అనేక సామాజిక విముక్తి ఉద్యమాల్లో కలేకూరి క్రియాశీలంగా పాలుపంచుకొంటూనే ప్రభుత్వేతర సంస్థల (ఎన్.జి.ఓ) సేవా కార్యక్రమాలకు చేదోడు వాదోడుగా నిలిచాడు.

విరసం, దళిత మహాసభ వంటి ఉద్యమ సంస్థల్లో అనేక బాధ్యతల్ని చాకచక్యంగా నిర్వహించిన కలేకూరి వీటికి భిన్నమైన ప్రభుత్వేతర సంస్థల్లో కూడా నిర్ణయాత్మకమైన పాత్రను పోషించాడు. జాతి వివక్షను నిరసిస్తూ దర్బన్‌లో జరిగిన ప్రతిష్టాత్మక సదస్సుకు హాజరైన 'సాక్షి హ్యూమన్ రైట్స్' ప్రతినిధి బృందానికి కలేకూరి దిశానిర్దేశం చేశాడు. ఈ సందర్భంగా కలేకూరి రూపొందించిన పరిశోధనాత్మక నివేదికలు, ప్రసంగ పాఠాలు అంతర్జాతీయ మానవ హక్కుల కార్యకర్తల్ని ఆలోచింపజేయటమే కాకుండా, క్యూబా అధ్యక్షుడు ఫెడరల్ కాస్ట్రో' దృష్టిని కూడా ఆకర్షించటం గొప్ప విశేషంగా భావించవచ్చు. 'వెలుగు', ప్రత్యామ్నాయ సంస్థల్లో Resource Person గా, ప్రాజెక్ట్ డైరెక్టర్‌గా కలేకూరి ప్రసాద్ వందలాది సామాజిక కార్యకర్తలకు, అధికారులకు శిక్షణనిచ్చి, గ్రామీణాభివృద్ధి సాధన కవసరమైన కార్యనిర్వహణా దక్షతను, మానసిక స్థైర్యాన్ని వారిలో పెంపొందించాడు.

'బహుజన కెరటాలు' గౌరవ సంపాదకునిగా కలేకూరి ప్రసాద్ ఆ పత్రికకు వెన్నుదన్నుగా నిలిచి భావజాల వనరుల్ని సమకూర్చాడు. ఒకప్పుడు ఆంధ్రభూమి దినపత్రికను దళిత కరపత్రంగా మార్చి వేస్తున్నాడన్న నెపంతో యాజమాన్యం కలేకూరిని ఉపసంపాదకుడి బాధ్యతల్నుంచి తొలగించింది. ఏ పని మూలంగా కలేకూరి 'ఆంధ్రభూమి'లో ఉద్యోగాన్ని కోల్పోయాడో 'బహుజన కెరటాలు' ద్వారా అదే పనిని ఆయన ఎంతో ఇష్టంగా, బాధ్యతగా, పరిపూర్ణంగా నెరవేర్చాడు. వర్తమాన పత్రికా ప్రపంచంలో 'బహుజన కెరటాలు'కు సుస్థిరమైన ప్రత్యేక స్థానం లభించటానికి కలేకూరి శక్తివంచన లేకుండా కృషిచేశాడు.

"శీర్షాసనం వేసిన సూర్యోదయాన్ని నిటారుగా నిలబెట్టేందుకు / సూర్యుడి నెత్తిమీద ఈడ్చి తన్నినవాణ్ని" అని సగర్వంగా చాటి చెప్పిన దళిత అహంకారి కలేకూరి. ఎవరికీ తలవంచని, ఎక్కడా రాజీపడని ధీరోదాత్త నైజం ఆయన సొంతం. కత్తి పద్మారావుతో కలిసి నడిచినా, సత్యమూర్తి వెంటసాగిపోయినా, కాన్షీరామ్‌తో రాజకీయ కరచాలనం చేసినా కలేకూరి ఎప్పుడూ ఎవరినీ గుడ్డిగా అనుకరించలేదు. అవసరమైనప్పుడు అంగీకరిస్తూ, అనవసరమైనప్పుడు విబేధిస్తూ, నిలదీస్తూ వారి ఉద్యమ పంథాలకు బాసటగా నిలబడ్డాడు. వ్యక్తిగత ఇమేజ్‌ల కన్నా సమిష్టి ఇమేజ్‌లతోనే వ్యక్తులకు కూడా పేరు ప్రతిష్టలు సమకూరుతాయన్న సత్యాన్ని ఉద్యమకారులకు తెలియజెప్పాడు. సాహిత్య వేత్తగా ధిక్కార పతాకమై ప్రభాసించిన కలేకూరి వ్యక్తిగా బలహీనతకు బానిసైనప్పటికీ విలువైన తన కర్తవ్యాన్ని మాత్రం అవిచ్ఛిన్నంగా

కొనసాగించాడు. "ఫిర్ దేఖ్నా అందాజె – గులఫ్షాని –యె– గుఫ్తార్ / రఖ్‌దే కోయి పై మానవ సహెబా మెరే అగే" నా ముందర ఎవరైనా పానపాత్రను, మధుకలశాన్ని ఉంచండి. పూలవానలా నా నోట జాలువారే మాటలు వినండి అని గాలిబ్ అన్నట్లుగా కలేకూరి తాను మత్తులోకి జారిపోతూ పౌర సమాజానికి మేలుకొలుపుల స్పృహను కలిగించాడు.

అగ్రవర్ణ భూస్వాముల దురహంకార అగ్నికి ఆహుతై పోయిన కంచికచర్ల కోటేశు ఆక్రందన, ధన మదాంధ కులోన్మాదుల అకృత్యానికి దగ్ధమైన టంగుటూరి ఇందిర మూగవేదన కలేకూరి గుండె గొంతుల్లో బాధా సరిత్సా గరమై పోటెత్తింది. ఈ ఆటు పోటుల్లోంచే కలేకూరి విప్లవకవిగా అవతరించాడు. "కవిగా, రచయితగా, విమర్శకుడిగా నా అధ్యయనానికి, ఎదుగుదలకి దోహదం చేసింది విరసమే" (ప్రకృతి సాహితీ 2007) అని కలేకూరి తెలిపినట్లుగా విప్లవోద్యమ నేపథ్యం, విప్లవ సాహిత్య ఆశయాలు ఆయనకు ప్రజాకళా ఒరవడిని అలవర్చాయి. అందుకే పాటల రచయితగా ప్రసాద్ అతిచిన్న వయస్సులోనే విశేషమైన ప్రజాదరణను సంపాదించుకున్నాడు. 'యువక' పేరుతో ఆయన రాసిన పాటలు అనేక ప్రజాస్వామ్య పోరాటాలకు సాంస్కృతిక సామర్థ్యాన్ని అందించాయి. సంఘటనకు సంబంధించిన మౌలిక రాజకీయాలను సూక్ష్మంగా విశ్లేషిస్తూ, బాధితుల భావోద్వేగాలను పరమ ఆర్ద్రంగా ఆవిష్కరిస్తూ ఉద్యమ గీతాలను రచించటంలో ప్రసాద్ ఎంతో చాతుర్యాన్ని ప్రదర్శించాడు. ఉద్యమ చైతన్య విద్యుత్తును ఊరూవాడ ప్రసరింపజేయటంలో కలేకూరి పాట కరంటుతీగలా పనిజేసింది. రచయితగా ప్రారంభ దశలోనే కలేకూరి రాసిన కర్మభూమిలో పూసిన ఓ పువ్వా! అనే అద్భుతమైన పాట ప్రజల గుండె గొంతుల్లో జీవనాదమై ఈనాటికీ ప్రతిధ్వనిస్తూనే ఉంది. కాలమే మైమరిచి హమ్ చేసిన ఈ కమ్మని పాట కలేకూరి రచనా పాటవాన్ని ప్రపంచానికి పరిచయం చేసింది. "భూమికి పచ్చని రంగేసినట్టు", "కుమిలిపోయినా నలిగిపోయినా", "పల్లెపల్లెనా దళిత కోయిల", "దళితాకాశపు ధృవతార" లాంటి హృద్యమైన పాటల ద్వారా ప్రసాద్ సాహిత్య సాంస్కృతిక రంగాలపై చెరగని ముద్రవేశాడు. ప్రగాఢమైన కళా సౌందర్య దృష్టితో పాటు ఉన్నతమైన గేయ ప్రమాణాల (Lyrical Value) తో కూడిన సజీవ శైలితో కలేకూరి తెలుగు పాటకు సరికొత్త గతిని శ్రుతిని సమకూర్చాడు. "రక్తధారలే ఉదయతారలై / వికసించులే ఆత్మగౌరవం", "పున్నమి రువ్విన వెన్నెల నవ్వా / కారుమేఘములు క్రమ్మేశాయా / చీకటి చితిలో స్మశానమయ్యావా?", "పురుగుల మందే రైతుకు పెరుగన్నమాయరో", "ఎద్దు కొమ్ముల నడుమ ఎర్ర ప్రొద్దు పొడిచెరో", లాంటి అరుదైన, పదునైన వ్యక్తీకరణలతో సమ్మిళితమైన కవితాశిల్పం ప్రసాద్ పాటల్లో ఆద్యంతము పరిమళిస్తుంది. ఆలపించినా, పఠించినా, శ్రోతకూ పాఠకుడికీ ఏకస్ఫూర్తి కలిగించటమే కలేకూరి పాట విశిష్టత.

ఎప్పటికప్పుడు ఉద్యమ అవసరాలను తీరుస్తూ, సాహిత్య మూలాలను పరిరక్షించటం సృజనకారుడి కర్తవ్యం. దళితోద్యమం, దళిత సాహిత్యంలో మిగిలిపోయిన ఖాళీలను కలేకూరి ప్రసాద్ సమర్థవంతంగా పూరించాడు. ఈ దిశగా ఆయన వెలువరించిన దళిత సాహిత్యం

(దళిత స్త్రీ సాహిత్య పరిషత్) (1993), దళిత కిరణాలు (లోకాయిత) (1996) అనే రెండు గ్రంథాలు ఎంతో ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. జి. లక్ష్మీనరసయ్య కంటే ముందుగానే కలేకూరి ప్రసాద్ దళిత సాహిత్య విమర్శకు పునాదులు వేశాడు. దళితవాద చారిత్రక నేపథ్యాన్ని విశ్లేషిస్తూ ఆయన రాసిన "దళిత సాహిత్యం" అనే గ్రంథం చాలా విలువైనది. తొలి దళిత కవితా సంకలనం 'చిక్కనవుతున్న పాట' కంటే రెండేళ్ళు ముందుగానే వెలువడిన ఈ గ్రంథం దళిత సాహిత్య విమర్శకు, పరిశోధనకు ఉపయక్త గ్రంథం. భక్తి ఉద్యమం, బ్రాహ్మణ వ్యతిరేక పోరాటాలు, మరాఠీ దళిత పాంథర్స్ సాహిత్యాలను సమీక్షిస్తూనే, జాతీయోద్యమం నుండి చుండూరు ఉద్యమం వరకు విస్తరించిన దళిత, దళితేతర కవుల రచనల్లోని హరిజన స్పృహను, దళిత చైతన్యాన్ని కలేకూరి పరిశీలనాత్మక దృక్పథంతో కూలంకషంగా చర్చించి ప్రామాణిక ప్రతిపాదనలు చేశాడు. బుద్ధుడు, కబీర్, జ్యోతిబా పూలే, నారాయణగురు, పెరియార్, అంబేద్కర్ లాంటి దళిత తాత్విక, సాంస్కృతిక యోధుల బృహత్తరమైన కృషిని, వివేచిస్తూ 'దళితరాజ్యం' పత్రికలో ధారావాహికగా వెలువడిన కలేకూరి వ్యాసపరంపరకు పాఠకుల నుండి గొప్ప స్పందన లభించింది. 'దళిత కిరణాలు' పేరుతో ప్రచురితమైన ఈ వ్యాస సంకలనం దళితోద్యమ కార్యకర్తలకు కరదీపికలా ఉపయోగ పడుతుంది.

అగ్నిపర్వతం నుండి ఎగజిమ్మిన లావాలాగా కలేకూరి ఎదలోతుల్లో నుండి శక్తివంతమైన కవిత్వం ఆవిర్భవించింది. ఒక పెనుమంటల పెనుగులాట వలె ఆయన కవిత్వం వర్తమాన సాహిత్యాన్ని తేజోవంతం చేసింది. 'పిడికెడు ఆత్మగౌరవం' నుండి 'అతడొక నిబద్ధ వజ్రాక్షరం' వరకు కలేకూరి రాసిన కవితలు రాసిలో తక్కువైనప్పటికీ వాసిలో ఉన్నతమైనవి. లక్షింపేటలో నెత్తుటి బలికి వ్యతిరేకంగా 'కోబలి' అంటూ కలేకూరి కవితాగ్రహాన్ని వ్యక్తం చేశాడు. 'పిడికెడు ఆత్మగౌరవం', 'అంటరాని ప్రేమ' వంటి రచనల్లో కంచికచర్ల కోటేశు ఆత్మఘోషను Poetic Monologue రీతిలో సమర్థవంతంగా కవిత్వీకరించాడు. దళిత సాహిత్య సాంద్రతకు ప్రబల తార్కాణంగా నిలిచిన 'పిడికెడు ఆత్మగౌరవం కోసం' కవితను తన ఉపన్యాసానికి ఉద్విగ్న భరితమైన ఉపోద్ఘాతంగా ఉపయోగించుకొని కలేకూరి ఎన్నో సభావేదికలను వక్తృత్వ పటిమతో రక్తికట్టించాడు. 'రోడ్డు నాలాగే దళిత', 'సొరాజ్జెం', 'అవిశ్వాసం', 'కులం ఉరితాడు' తదితర కవితల్లో దళిత సంవేదనల్ని దగాకోరు రాజ్య కౌటిల్యాన్ని శిల్పసుందరంగా అక్షరబద్ధంచేశాడు. హైదరాబాద్ నగరం సాక్షిగా 1997లో వేలాది మాల మహానాడు కార్యకర్తలపై ప్రభుత్వం సాగించిన హింసాకాండను 'మళ్ళొక్కసారి' అనే కవితలో చిత్రించాడు.

"మీరు గంపల్లోకెత్తి పారబోసిన గాయాల కోసం / ఆసుపత్రి కారిడార్లలో రాలిపడిన కలల కోసం / రోడ్డు రోడ్డునా రికార్డయిన ఎగశ్వాసల చప్పుళ్ళకోసం / మళ్ళొక్కసారి మీ నగరానికొస్తాను / ... మండుతున్న గుండెలయల్ని "మీ పొదిరిళ్ళకు తగిలించి / మీ నిదర దీపాన్ని ఆర్పేసిపోతాను / మీ హైటెక్ కంప్యూటర్ల సచివాలయాల మీద / లాఠీ దెబ్బలతో

పగిలిన నా జాతి పాదాలతో / నెత్తుటి ముద్రలేసి పోతాను" (అముద్రిత కవిత) అంటూ తాజా అభివ్యక్తితో పోలీసు రాజ్య హింసోన్మాదాన్ని ఖండించాడు. "ఎద మీటిన కనురెప్పల జలతరంగిణీ రాగం" అంటూ దుఖ్ఖాన్ని కూడా అద్భుతమైన నవకల్పనా శీలతతో అభివర్ణించిన కలేకూరి Dynamic Poet గా విమర్శకుల ప్రశంసలందుకున్నాడు.

అనువాదకునిగా కలేకూరి ప్రసాద్ చారిత్రాత్మకమైన కృషి చేశాడు. ప్రపంచ ప్రఖ్యాత గాంచిన మహారచయితల సార్వకాలిక ఆశయాలను, సామాజిక తత్వవేత్తల సిద్ధాంతాలను తెలుగులోకి దిగుమతి చేసి అమూల్యమైన వారి భావధారలతో వర్తమాన సాహిత్యానికి కొత్త రక్తాన్ని ఎక్కించాడు. డిగ్రీ కూడా పూర్తి చేయని ఆయన అపారమైన భాషా పాండిత్యంతో, మేధో శక్తితో అనేక గ్రంథాలు తెలుగులోకి తర్జుమా చేసి అనువాదకునిగా తిరుగులేని స్థానాన్ని సంపాదించుకున్నాడు. Literary Legends గా పేర్గాంచిన పాబ్లో నెరుడా, అరుంధతీరాయ్, మహాశ్వేతాదేవి, గెయిల్ ఆమ్‌వెత్, స్వామి ధర్మతీర్థ, దయాపవార్, రవీంద్రనాథ్ ఠాగూర్, నామ్‌దేవ్ ధసాల్, వందనా శివ లాంటి మహోన్నత సృజన కారుల రచనల్ని సగటు పాఠకుడి అవగాహనా సామర్థ్యానికి అనుగుణంగా అనువాదం చేసి, తెలుగు లోగిలికి నవీన జ్ఞాన గవాక్షాలను అమర్చాడు. ఇనుపగుగ్గిళ్లలా ఏమాత్రం కొరుకుడు పడని పారిభాషిక పదాలను, సంక్లిష్ట ఆంగ్లవాక్య సముదాయాలను మూల రచనా స్ఫూర్తికి భంగం కలుగకుండా అర్థవంతంగా అనువదించటంలో మిగతా రచయితలందరికీ ఒక రోల్ మోడల్‌గా నిలిచాడు. దయాపవార్, శంకర్రావు కారత్ లాంటి మరాఠీ రచయితల కథలను తెలుగులోకి అనువదించిన కలేకూరి దళిత పాంథర్స్ ప్రభావంతో గ్రామాల్లోని క్షేత్రస్థాయి కుల రాజకీయాలను, అట్టడుగు బతుకు స్థితిగతులను చిత్రిస్తూ ఆత్మకథా శైలితో 'మల్లెతీత', 'వెంటాడే బులుగు మంట' వంటి కథలు రాయటమే కాకుండా తద్వారా కృష్ణా జిల్లా దళిత మాండలిక భాషకు పట్టం గట్టాడు.

కలేకూరి ప్రసాద్ దళితవాదం దగ్గరే ఆగిపోకుండా ఇతర ప్రజాస్వామ్య ఉద్యమాలకు, అంతర్జాతీయ విముక్తి పోరాటాలకు మద్ధతు ప్రకటించాడు. మాదిగ దండోరా ఉద్యమానికి క్రియా శీలకమైన సంఘీభావం తెలియజేసి అందులోని విపరీత ధోరణుల్ని నిర్మొహమాటంగా విమర్శించాడు. విలాస్ గోగ్రే లాగా ప్రతిక్షణం దళిత నాయకుల ఐక్యతకు పరితపించాడు. "నీదా ధర్మపోరాటం / నీ రణక్షేత్రానికి నా శ్వాస కాపలాగా పెడుతున్నానని" తెలంగాణా ప్రజల చేతిలో చేయి వేసి బాస చేశాడు. సుఖానికైనా, దుఖ్ఖానికైనా మనమెప్పుడు కలిసున్నామని సీమాంధ్ర పెట్టుబడిదారుల గుండెలదిరేలా సింహగర్జన చేశాడు. వైఫల్యం ఆస్తుల్ని సంపాదించలేకపోవటం కాదని, ఉద్యమానికి చేయూతనందించ లేకపోవటమే ఘోర వైఫల్యమని కలేకూరి గొప్ప తీర్పు చెప్పాడు. "శిల్పి ఉలితో కఠిన శిలల్లో ఉండకూడని భాగాలను నిర్దాక్షిణ్యంగా చెక్కేసి, అద్భుతమైన శిల్పంగా మలచినట్లు మన మీదకి మనం పోరాటాన్ని ఎక్కు పెట్టుకోవాలని (ఆగస్టు 2004-బహుజన కెరటాలు) నాయకులకు కార్యకర్తలకు

నచ్చచెప్పాడు. ఉమ్మడి వ్యూహాలను ఎత్తుగడలను ఆమోదిస్తూ బహుజనుల ఆకాంక్షలకు ప్రాతినిధ్యం వహించే సమాఖ్య స్వభావంతో రాజ్యాధికార సాధన దిశగా ముందడుగు వేయాలన్న కలేకూరి ప్రజా వుద్యమాల నేపథ్యం, విస్తృతమైన అధ్యయనం, మార్క్స్, అంబేద్కర్‌ల ఆలోచనా విధానం మూలంగా తనకంటూ ఒక నిర్దిష్టమైన అవగాహన ఏర్పరచుకున్నాడు. "నేను మొదట మార్క్సిజమే ఏకైక మార్గమని నమ్మా. అంబేద్కర్‌ను చదివాక, అంబేద్కర్ సిద్ధాంతం ఆసరా లేనిదే ఈ దేశంలో దళిత, బహుజన విముక్తి సాధించలేమన్న (ప్రకృతి సాహితీ 1997) స్పష్టమైన తాత్విక ఎరుకతో తన రచనా రీతిని మరింత మెరుగు పరుచుకున్నాడు. ప్రపంచీకరణ సందర్భంలో అంబేద్కర్ ప్రాసంగికతను తన వ్యాసాల ద్వారా కలేకూరి పరిశీలనాత్మకంగా నిరూపించాడు. అంబేద్కర్‌ను కాదన్న పీపుల్స్‌వార్ పైకి ఆయన అనేక ప్రశ్నాస్త్రాలను సంధించాడు. అంబేద్కర్ సిద్ధాంతాన్ని, ఆచరణను వక్రీకరించిన వెంకటరామ్ డాక్యుమెంటుకు ఆమోదయోగ్యమైన జవాబు చెప్పాడు. "కులం వర్గం ప్రశ్నలో కులాన్ని సౌకర్యవంతంగా తప్పించుకోవడానికి అంబేద్కర్ ప్రస్తావనను కమ్యూనిస్టులు ఇష్టపడటంలేదని కలేకూరి 'ఎర్ర' రహస్యాన్ని తేటతెల్లం చేశాడు. సూర్యుడి మీద ఉమ్మేసినట్లు అంబేద్కర్‌పై నిందలు కురిపించిన అరుణ్‌శౌరి, బి.జె.పి. మతోన్మాద ఎజెండా, ప్రపంచ బ్యాంకు సామ్రాజ్యవాద ఎజెండాల అక్రమ సంతానమని ఆయన లోగుట్టును బట్టబయలు చేశాడు. "బుద్ధుణ్ణి కోల్పోయిన దేశం వేలఏళ్ళు దుఃఖితమతియై చీకటి సొరంగాల పయనించిందని, ఇప్పుడు అంబేద్కర్‌ను కూడా వొదులుకుంటే ఈ దేశం మరోసారి శాశ్వత వంచితగా చరిత్ర దుఃఖపు పొరల్లో కూరుకుపోతుందని (ఒక్క దళితులకే కాదు మొత్తం దేశానికే ఇవాళ్టి అవసరం అంబేద్కర్) అంటూ వామపక్ష వాదులను హెచ్చరించి 'భీమ' పక్షవాదులకు కూడా బాధ్యతను గుర్తుచేశాడు. ఆర్థిక తీవ్రవాద ఉధృతిలో వస్తు వినిమయ సంబంధాలు పెచ్చు పెరుగుతున్న తరుణంలో బౌద్ధం ఆవశ్యకతను కలేకూరి సప్రమాణంగా ఋజువు చేశాడు. బౌద్ధాన్ని ఒక పర్యాటక రంగంగా దిగజార్చిన పాలకవర్గాల కుట్రను ఛేదించి అంబేద్కర్ ప్రతిపాదించిన నవయాన బౌద్ధంలోని హేతుబద్ధతను, ఆచరణ, అనివార్యతను కలేకూరి అనేక వ్యాసాల్లో నిర్ధారించాడు. బుద్ధుడు అశోకుడు అంబేద్కర్ కాన్షీరామ్‌ల చతుర్ముఖీన తత్వాన్ని – వారందించిన సాంస్కృతిక, రాజకీయ విప్లవాల ఉమ్మడి చైతన్యాన్ని కలేకూరి ఎంతో సమతౌల్యంతో వ్యాఖ్యానించాడు. "మతాల్లో హంతక ముఠాలు", "ఉన్న ఆ ఒక్కడు పట్టుబడిపోయాడు" లాంటి వ్యాసాల్లో హిందూ సామ్రాజ్యవాదం, అమెరికన్ సామ్రాజ్యవాదాల వల్ల కలిగే ప్రమాదాల పట్ల దళిత బహుజనులు, ముస్లింలు, అప్రమత్తంగా ఉండాలని హితవు చెప్పాడు. కాషాయ ఫాసిస్టులకు వ్యతిరేకంగా రాజకీయోద్యమం రావాలని పిలుపునిచ్చాడు. బహుజన కెరటాలులో కలేకూరి రాసిన సంపాదకీయాలు అటు పత్రికా ప్రపంచంలోనూ, దళిత ఉద్యమ, సాహిత్యాల చరిత్రలోనూ ఎంతో ప్రామాణికతను సంతరించు కున్నాయి. గత ఇరవై సంవత్సరాల్లో జరిగిన రాష్ట్ర జాతీయ అంతర్జాతీయ రాజకీయ, ఆర్థిక, సాహిత్య, సాంస్కృతిక పరిణామాల తీరుతెన్నుల్ని దళిత దృక్కోణంలో నుండి శాస్త్రీయంగా విశ్లేషిస్తూ కలేకూరి ప్రయోజనవంతమైన వ్యాసాలు

రాశాడు. జాషువా నుండి గూగివాధియోంగో వరకూ గల అనేక మంది సుప్రసిద్ధ కవుల ప్రతిభా విశేషాలను, బాంబుల అంకమ్మ నుండి సద్దాంహుస్సేన్ వరకు గల వీరయోధుల ప్రతిఘటనాత్మక వ్యక్తిత్వాన్ని, గోరటి వెంకన్న, విలాస్‌గోగ్రే వంటి అసామాన్య వాగ్గేయకారుల పాటల ప్రాభవాన్ని విమర్శనాత్మకంగా ఉన్నతీకరించాడు.

'గద్యమ్ కవీనామ్ నికషమ్ వదంతి' అన్నట్లు కలేకూరి ప్రసాద్ వచనం ఆయన రచనా గరిమకు తార్కాణంగా నిలుస్తుంది. "కలేకూరి రచనల నిండా కవితాంశ ప్రవహిస్తుంది. ఎత్తుగడలో ఒక వినూత్న పద్ధతి దాగుంటుందని (దళిత కిరణాలు – ముందుమాట) డా॥ కత్తిపద్మారావు చెప్పినట్లుగా మనోహరమైన కలేకూరి వచన విన్యాసం పాఠకుల్ని పరవశింపజేస్తుంది. సంపాదకీయం, వ్యాసం, పీఠిక, సమీక్ష ఏది రాసినా సాధికారికమైన వచన రచనా నైపుణ్యం, విడిచిపెట్టలేని వాక్య సముదాయం ఆయన రచనల నిండా పరిమళిస్తుంది.

ఏ నిర్మాణాల్లోను, జీవన చట్రాల్లోను ఇమడని విలక్షణ వ్యక్తిత్వం కలేకూరిది. సృజనకారునిగా కలేకూరిని ఆదర్శంగా గ్రహించటంతో పాటు ఆయన ఆరోగ్య పతనానికి కారణమైన పరిస్థితులన్నీ దళిత బహుజన కవులు హెచ్చరికగా స్వీకరించాల్సిన అవసరముంది. కీర్తి ప్రతిష్టల్ని బద్ధ శత్రువులుగా భావిస్తాడు. స్థిరత్వాన్ని, క్రమశిక్షణను చూసి చిరాకు పడతాడు. సంచారాన్ని సదా ఇష్టపడతాడు. ఓపికతో రాసి పారేయటం తప్ప, దేన్నయినా సరే భద్రపరచటం తెలియని సాహిత్య బైరాగి. పత్రికల్లో ప్రచురితమైన తన రచనల తారీకులు దస్తావేజుల్ని ససేమిరా గుర్తుంచుకోడు. అలాంటి కలేకూరి వ్యాసాలను ఎంతో బాధ్యతగా సేకరించి, ఆయనకు బాగా ఇష్టమైన 'పిడికెడు ఆత్మగౌరవం కోసం' అనే శీర్షికతో బహుజన కెరటాలు ప్రచురణలు పక్షాన వ్యాస సంకలనాన్ని వెలువరించటం గొప్ప విశేషం. విశిష్టమైన, అర్థవంతమైన ఈ వ్యాస సంకలనం కలేకూరి ప్రసాద్ బహుముఖీన మేథో సంపత్తికి, అపురూపమైన ఆయన విమర్శనా ప్రతిభకు అక్షర సాక్ష్యంగా విరాజిల్లుతూ, దళిత బహుజన విముక్తి మార్గంలో దిక్సూచిగా నిలుస్తుంది. ఈ సంకలనంలో కలేకూరి వ్యాసాలు చదువుతుంటే తరతరాల బతుకు సంకెళ్ళు తెగుతున్న చప్పుడు వినిపిస్తుంది. అంబేద్కర్ దళిత చైతన్య రథచక్రాలు కదులుతున్న సవ్వడి ధ్వనిస్తుంది. గౌతమ బుద్ధుని ధమ్మపథం కనుల ముందు సాక్షాత్కరిస్తుంది. 'మాస్టర్ కీ' రహస్యం బోధపడుతుంది. సారవంతమైన కలేకూరి ప్రసాద్ ఆలోచనల, ఉదాత్త ఆశయాల సమాహారమైన ఈ వ్యాస సంకలనాన్ని ప్రచురించటం ద్వారా బహుజన కెరటాలు తెలుగు ప్రజలకు ఆయన సారవంతమైన ఆలోచనలను అందిస్తోంది.

**– డా॥ కోయి కోటేశ్వరరావు**
**సంపాదకవర్గ సభ్యులు**
**బహుజన కెరటాలు**
**9440480274**

# ఒక విప్లవం పుట్టిన రోజు

1891, ఏప్రిల్ 14, మధ్య ప్రదేశ్‌లోని ఇండోర్‌కు సమీపంలో మిలటరీ హెడ్ క్వార్టర్స్ ఆఫ్ వార్ **MHOW** అనే గ్రామంలో ఒక విప్లవం పురుడు పోసుకుంది. చీకట్లు ముసిరిన బతుకుల్లో వెలుతురు నింపేందుకు ఒక చిరునవ్వు పుట్టింది. అంధయుగాల గుండె శోకతప్తమైనప్పుడు వచ్చిన చరిత్ర కనుకొలకుల్లో నిలిచిన ఒక్క కన్నీటి చుక్కను తుడిచేందుకు చిట్టి చేతులు పుట్టాయి. అణగారి, కుమిలి, కనలి బానిస బతుకుల్ని యీడుస్తున్న బతుకులకు ఒక విముక్తి ప్రదాత పుట్టాడు. ఈ దేశానికి ఆరోగ్యవంతమైన భవిష్యత్‌ను వాగ్దానం చేసిన ఒక ప్రవక్త పుట్టాడు. అతని పేరు భీమ్‌రావు రాంజీ అంబేడ్కర్. ప్రపంచం ప్రేమగా బాబాసాహెబ్ అని పిలుచుకుంది.

అంటరాని మహర్ కులంలో ఆయన పుట్టాడు. తండ్రి రామ్‌జీ సక్పాల్. సైన్యంలో సుబేదార్‌గా పని చేశారు. అప్పటికే బ్రాహ్మణీయ రాచరిక వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తున్న పీష్వాలను తుద ముట్టించడంలో ఆయన పోషించిన పాత్ర గణనీయమైనది. యుద్ధవీరులుగా మహర్‌లు చరిత్రలో ఖ్యాతి గాంచారు. సైన్యాలలో మహర్‌ల హక్కుల కోసం ఉద్యమించిన వారిలో రామ్‌జీ ఒకరు. తల్లి భీమాబాయి. కబీర్ భక్తి మార్గాన్ని అనుసరించే కుటుంబం నుంచి వచ్చింది. కబీర్ భక్తి కవితలగానంతో ఆ యిళ్ళ లోగిళ్లలో తెల్లవారేది. సూఫీ సంగీతపు వాయిలీన రాగాల్ని కొనసాగేది. అంతకు ముందే మహాత్మా జ్యోతిరావ్ పూలే నాయకత్వంలో మహారాష్ట్ర గడ్డ మీద గొప్ప సామాజిక విప్లవం నడిచింది. శూద్ర, అతిశూద్రుల హక్కుల కోసం పూలే నాయకత్వంలో సత్యశోధక్ ఉద్యమించింది. అంతకు ముందు వేల ఏళ్ళ క్రితమే బుద్ధుడి నాయకత్వంలో, మార్గదర్శకత్వంలో గొప్ప సామాజిక విప్లవం నడిచింది.

బుద్ధుడు, కబీర్, జ్యోతిరావ్ పూలే ముగ్గురూ తన గురువులని అంబేడ్కర్ ప్రకటించుకున్నారు. ఏ మాత్రం అనుకూలంగాలేని పరిస్థితుల్లో అంటరానివాడిగా అనేక అవమానాలను, అవరోధాలను ఎదుర్కొంటూ ఉన్నత విద్యను అభ్యసించాడు. జీవితాన్ని, సమాజాన్ని సమాజ చలన సూత్రాలనీ అధ్యయనం చేశాడు. బుద్ధ విప్లవాన్ని, మార్క్సిజాన్ని, సునిశితంగా, లోతుగా అధ్యయనం చేశాడు. ఈ దేశంలో ఆరోగ్యకరమైన మానవ సంబంధాలు నెలకొనాలనీ, ప్రజాస్వామిక సంస్కృతి ఈ గడ్డమీద విలసిల్లాలనీ, హైందవం ఈ సమాజం మీద రుద్దిన కులవ్యవస్థను, మతమౌఢ్యాన్ని వదిలించుకొని ఈ దేశ ప్రజలు హేతువు ఆధారంగా, శాస్త్రీయత ఆధారంగా జ్ఞానవంతులు కావాలని ఆకాంక్షించాడు.

కులం పునాదుల మీద ఒక జాతినిగాని, నీతినిగాని నిర్మించలేరని జాతీయోద్యమ నాయకులను ఆయన హెచ్చరించారు. ఈ దేశం ఒక జాతిగా అభివృద్ధి చెందాలంటే, దేశ ప్రజల్లో జాతీయతా భావాలు వెల్లివిరియాలంటే దానికి ఆటంకంగా ఉన్న కులవ్యవస్థను,

అంటరానితనం దురాచారాన్ని నిర్మూలించాలని ఆయన వారికి హితవుచెప్పాడు. అంబేద్కర్ మాటను జాతీయోద్యమ నాయకత్వం పెడచెవిన పెట్టింది. పైకి గౌరవిస్తున్నట్లు నటిస్తూనే ఆయనను తిరస్కరించింది. దాని ఫలితాన్ని ఈ దేశం ఇప్పటికీ అనుభవిస్తుంది. ఒక జాతి నిర్మాణం సరిగ్గా జరగలేదు. జాతీయ నాయకులుగా ఎదగవలసినవారు సంకుచిత కుల నాయకులుగా మిగిలిపోయారు.

ఈ దేశ ప్రజానీకానికి దుర్మార్గమైన శత్రువులు బ్రాహ్మణిజం, క్యాపిటలిజం అని అంబేద్కర్ పేర్కొన్నాడు. తాను బతికి ఉన్నంతకాలం వీటిని తీవ్రంగా వ్యతిరేకిస్తూ వాటిపైన తిరుగులేని పోరాటాన్ని సాగించాడాయన. దేశ సామాజిక ఆర్థిక రాజకీయ పరిస్థితులను సరిగ్గా అంచనావేసి దేశ విముక్తికి కుల నిర్మూలన, స్టేట్ సోషలిజం, ప్రజాస్వామ్యం అన్న సూత్రాలను ఆయన ప్రవచించారు. దేశంలో విప్లవాన్ని సాధించి అన్ని అసమానతల్ని తొలగిస్తామని ప్రకటించుకున్న కమ్యూనిస్టులు ఒక సమగ్ర విప్లవాన్ని ప్రతిపాదించిన విప్లవకారుడ్ని లిబరల్ బూర్జువాగా పిలిచారు. కులవ్యవస్థ నిర్వహిస్తున్న దుర్మార్గమైన పాత్రను అంచనా కట్టడంలో విఫలమై అంబేద్కర్‌నే కులతత్వవాదిగా అభివర్ణించారు. అనేక అగ్రకుల పరిమితులకు లోనై సమగ్ర సామాజిక విప్లవాన్ని ముందుకు తీసుకెళ్ళడంలో విఫలమౌతూ కిందామీద పడుతున్నారు.

చాలా మంది దళితులకు, దళిత నాయకులకు అంబేద్కర్ అంటే రిజర్వేషన్ సాధించి పెట్టినవాడు లేదా తమకోసం కొన్ని హక్కుల్ని సాధించినవాడు లేదా అపారమైన మేధోసంపత్తులు కలిగినవాడు లేదా రాజ్యాంగ నిర్మాత. అవన్నీ నిజమే కానీ అంబేద్కర్ అంటే ఒక సంపూర్ణ సామాజిక పరివర్తనను ప్రతిపాదించి ఆచరించిన విప్లవకారుడు. నేటికీ నిరంతరం కర్తవ్య నిర్దేశనం చేస్తున్న వైతాళికుడు. ఆయన్ని విగ్రహ మహాత్ముడ్ని చేసి ఏప్రిల్ 14వ తేదీనో, డిశెంబరో ఆరో తేదీనో స్మరించుకొనే ఒక పేరుగా మాత్రమే అంబేద్కర్ స్ఫూర్తిని కుదించివేశారు. ఈ దేశంలో సమానత్వాన్ని సాదించడానికి, రాజ్యాధికారాన్ని సాధించడానికి అంబేద్కర్ చూపిన మార్గం, సిద్ధాంతం ఇప్పటికీ సజీవంగా నిలిచివుంది. మరి అంబేద్కర్ని పూర్తిగా వదిలివేయడమో లేదా ఒక అంశాన్ని మాత్రమే తీసుకొని మిగతా అంశాలను వదిలివేయడమో ఎందుకు చేస్తున్నాం?

ఈ దేశంలో బ్రాహ్మణీయ శక్తులకీ, పెట్టుబడిదారి భూస్వామ్య శక్తులకీ, వారి దళారీలకు అంబేద్కర్ అవసరం లేదు. ఈ దేశంలో అణగారిన వర్గాలకీ, ప్రజాస్వామ్యాన్ని కోరుకునే శక్తులకీ, దేశం ఆరోగ్యవంతమైన సూత్రాలమీద నడవాలని ఆకాంక్షించేవాళ్ళకి అంబేద్కర్ అవసరం. ఈదేశంలో విప్లవం పూర్తిపేరు బాబాసాహెబ్ అంబేద్కర్. కళ్ళకు వెలుగు, భూమిక, ఒక ఓదార్పు, ఒక సంయమనం. ఒక సమ్యక్ మార్గం. ఆ కాంతి కిరణాలను చేదుకుంటూ ఒక వెలుతురు ప్రపంచంలోకి అడుగుపెడదాం! అంబేద్కర్ ఆశయాల సాధనకు మనల్ని మనం పునరంకితం చేసుకుందాం!

**ఏప్రిల్ 2004 - బహుజన కెరటాలు సంపాదకీయం**

# స్వర్ణోత్సవ రాజ్యాంగం-డాక్టర్ బి.ఆర్.అంబేడ్కర్

**“దేవతలను ప్రతిష్టించాలని ఈ దేవాలయాన్ని నిర్మించాం. కానీ మనం వెళ్ళేలోపుగానే దాన్ని దెయ్యాలు ఆక్రమించాయి” - డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్**

“సిద్ధాంతాలు మతపరమైన పిడివాదంగా మాత్రమే గుర్తించేవాళ్ళకు ఒకే ఒక్క విషయం చెప్పదలచుకున్నాను. మీ పిడివాదం కుక్కపెంట కన్నా పనికిమాలినది. మనిషి మలం కనీసం పందులకు ఆహారంగా పనికివస్తుంది. పందిపెంట పొలానికి ఎరువుగా పనికివస్తుంది. కానీ కుక్కపెంట దేనికి పనికివస్తుంది? మీ పిడివాదమూ అంతే...’ - మావో -సే-టుంగ్

భారత రాజ్యాంగం స్వర్ణోత్సవాలను జరుపుకొంటోంది. ఈనాటికీ రాజ్యాంగంపైనా, దాని నిర్మాణం వెనుకనున్న స్ఫూర్తిపైనా, రాజ్యాంగ రచనా చరిత్రంతా పరుచుకొన్న పెనుగులాట పైనా ఇంకా సరైన అంచనాకు రాలేకపోతున్నాము. 1946 డిసెంబర్ 9వ తేదీ సోమవారం ఉదయం 11 గంటలకు న్యూఢిల్లీలోని కౌన్సిల్ హౌస్‌లో ప్రారంభమైన రాజ్యాంగచర్చ ఈ నాటికీ ఒక కొలిక్కి రాలేదు.

రకరకాల చర్చోపచర్చలమధ్య, రాజకీయ నాయకుల ఉపన్యాసాలమధ్య 1996 డిసెంబర్ 9వ తేదీన పార్లమెంట్ భవనంలోని సెంట్రల్ హాల్లో రాజ్యాంగ స్వర్ణోత్సవ సంరంభాలు అమిత అట్టహాసంగా జరిగాయి. రాజీవ్‌గాంధి భార్య శ్రీమతి సోనియాగాంధి ముందు వరసలో కూర్చోగా ఆమె వెనుకవరసలో మాజీ ప్రధానులు పి.వి. నరసింహారావు, చంద్రశేఖర్, అటల్ బిహారీ వాజ్‌పేయి తదితరులు కూర్చున్నారు. వారి చుట్టూ అధికార, అనధికార వందిమాగధ జనాంగం కూర్చున్నారు. సభాస్థలం అంతా కడక్ ఖద్దరు బట్టల గరగరలతో పూలదండల పరిమళాలతో, అన్ని రాజకీయ విభేదాలనూ మరిచి ఒకరిని ఒకరు పొగడుకొనే వాతావరణంతో తిరునాళ్ళలాగా జరిగింది. ప్రతి ఒక్కరూ రాజ్యాంగం ఉన్నతమైన విలువలు కలిగిందనీ దాన్ని మనం సరిగా అమలు చేయలేకపోతున్నామనీ రాజ్యాంగ విలువలకు కట్టుబడి వుంటామని ప్రతిజ్ఞల ప్రగల్భాలకి పోయారు. ఊకదంపుడు ఉపన్యాసాలు చేశారు. ఫోటోలు దిగారు. దేశాన్ని మళ్ళీ సరైన విలువలతో కూడిన రాజకీయాచరణతో ముందుకు తీసుకువెళ్తామని రాజ్యాంగం మీద ప్రమాణాలు చేసి సంతృప్తిగా సభను ముగించారు. ఈ మొత్తం ప్రహసనంలోనూ భారత రాజ్యాంగ నిర్మాత డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ ప్రస్తావనే రాలేదు. వచ్చినా ఏదో కంటితుడుపుకు పేరు చెప్పుకోక తప్పదు కాబట్టి ఒకటో అరో మాటలతో దాటవేశారు. రాజ్యాంగ చర్చ ప్రారంభమైన యాభైఏళ్ళ తర్వాత దేశంలో జరుగుతోన్న రాజకీయ చారిత్రక విపరిహాసమిది.

ఇప్పుడు అంబేద్కర్ పేరు వదిలించుకోక తప్పని పెనుభూతమైపోయింది. హిందూ మతోన్మాదుల దగ్గరనుండి, కమ్యూనిస్టుల దగ్గర నుండి చివరకు రాజ్యంలో అంతర్భాగం

కాదలుచుకున్న దళితవాదులదాకా అంబేద్కర్‌పైన ఏదో ఒకరూపంలో దాడి మొదలుపెట్టారు. అంబేద్కర్ అన్న మాటను ప్రజల చేతనాక్రమం నుండి కరకు కత్తులతో చెరిపేయాలని తీవ్రమైన ప్రయత్నాలు సాగుతున్నాయి.

అరుణ్‌శౌరి అనే ప్రఖ్యాత విఖ్యాత పాత్రికేయుడు భారత ప్రజాస్వామిక విప్లవ చరిత్ర నుండి అంబేద్కర్ పేరును తుడిచిపెట్టడానికి కంకణం కట్టుకొన్నాడు. గతంలో ఇదే అరుణ్‌శౌరి కమ్యూనిస్టులపైన విరుచుకుపడ్డాడు. అప్పుడు విపరీతంగా గింజుకున్న కమ్యూనిస్టులు ఇప్పుడా దాడి తమపైనుండి దారి మరలి అంబేద్కర్ మీదకు మళ్ళేసరికి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నట్టున్నారు. ఒక 'కమ్యూనిస్టు' మిత్రుడు అరుణ్‌శౌరి చెప్తున్న విషయాలు ఏదో మేరకు నిజమేనేమోననిపిస్తుంది. నిప్పులేనిదే పొగరాదు కదా! అన్నాడు. దేశంలో యధాతథవాదులు, ప్రగతి వ్యతిరేకులూ, ప్రగతిశీలవాదులూ అందరికీ అంబేద్కర్ విషయంలో ఏకాభిప్రాయం కుదరడం ఎలా సాధ్యమైందనేది ఒక ప్రశ్న. ఈ ప్రశ్నను పక్కనబెడితే అరుణ్‌శౌరి.. అంబేద్కర్ రాజ్యాంగం రాయనేలేదనీ రాజ్యాంగ రచనాసభలో వున్న అనేకమందితోపాటు అంబేద్కర్ కూడా తనవంతు మాత్రమే పనిచేశాడనీ, అదీ వివిధ దేశాల రాజ్యాంగాలను చదివి దాన్నుంచి కొంత, దీన్నించి కొంత ఎత్తిరాయడమే ఆయన చేసిన పని అని దేశంలోని పత్రికలనిండా రాయడం మొదలుపెట్టాడు. మొదట అంబేద్కర్‌ను భారత రాజ్యాంగ నిర్మాత అని అందరూ విపరీతంగా పొగిడారు. ఒక దశలో అంబేద్కర్ అంటే రాజ్యాంగం తప్ప మరేమీ కాదన్న అభిప్రాయాన్ని ప్రజలకు ఒక పథకం ప్రకారం కలిగించారు. దళితవాదులతో సహా అందరూ అదే నిజమని నమ్మడం ప్రారంభించిన తర్వాత అంబేద్కర్ రాజ్యాంగం రాసిన అనేక మందిలో ఒకడు మాత్రమేనని ప్రచారం చేశారు. ఆ తర్వాత అసలు అంబేద్కర్ రాజ్యాంగమే రాయలేదనీ కేవలం ఆయా రాజ్యాంగాలనుండి కొన్ని కొన్ని అంశాలు ఎత్తికొచ్చి ఒకచోట చేర్చాడనీ ప్రచారం చేస్తున్నారు. ఇదంతా ఒక పథకం ప్రకారం జరుగుతోంది. ఇంతకీ అరుణ్‌శౌరి చెప్తున్నట్టుగా అంబేద్కర్ రాజ్యాంగం రాయనే లేదా? ఈ అంశాన్ని మనం ఖచ్చితంగా పరిశీలించాలి. అందులో ఏ మాత్రం నిజం వున్నా దాన్ని మనం ఆమోదించాలి. ఏ వ్యక్తికీ, ఏ పరిణామానికీ దాన్ని మించిన ఎక్కువ కీర్తినీ, గొప్పతనాన్నీ ఆపాదించడానికి వీలులేదు. ముఖ్యంగా అంబేద్కర్ విషయంలో ఆయన తనకన్నా ఏమాత్రం తక్కువ కావడానికి వీలులేదు. అలాగని తనకన్నా ఏమాత్రం ఎక్కువ కావడానికి వీలులేదు. వ్యక్తులపైన వున్న ప్రత్యేక అభిమానాల వల్ల ఆయా వ్యక్తులకు లేని మహిమలను ఆపాదించడం భారతీయ చరిత్రలో, సంస్కృతిలో సర్వసాధారణమైన విషయమై పోయింది. ఈ లక్షణాన్ని అంబేద్కర్ తీవ్రంగా నిరసించాడు. కాబట్టి రాజ్యాంగరచనలో అంబేద్కర్ పాత్రను సరిగ్గా అంచనా వేయవలసి వుంది.

అంబేద్కర్ గొప్ప విద్యావేత్త కాబట్టి, దేశ విదేశాల్లో చదివి వచ్చినవాడు కాబట్టి దేశం

ఆయనను రాజ్యాంగం రాయమని కోరిందని చాలామంది నమ్ముతున్నారు. కానీ ఇది ఇంత సులువుగా, సజావుగా జరగలేదు. అంబేద్కర్ నడిపిన కులనిర్మూలన ఉద్యమాలతోనూ, సంస్కరణవాదుల, స్వతంత్ర సమరయోధుల అగ్రవర్ణత్వంపైనా, వారి ఆలోచనల్లోని పరిమితులపైనా అంబేద్కర్ సాగించిన నిరంతరరాయమైన పోరాటంతోనూ ముఖ్యంగా రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌లో వెనుకబడిన జాతుల ప్రతినిధిగా అంబేద్కర్ చేసిన ఉపన్యాసం ప్రకటించిన ఆవేదనతోనూ తలలు బొప్పికట్టిన గాంధి, కాంగ్రెస్ వాదులు అంబేద్కర్‌ను ఎలాగైనా రాజ్యాంగ సభలోకి రానీయకుండా వుండేందుకు తీవ్రమైన ప్రయత్నాలు చేశారు. అప్పటికి పాకిస్తాన్ డిమాండ్ రాకపోవడం వలన నామశూద్ర ఉద్యమం, ముస్లింలీగ్ మద్ధతుతో బెంగాల్ ప్రావిన్స్‌నుండి అంబేద్కర్ రాజ్యాంగసభకు ఎన్నికయ్యాడు. అంబేద్కర్‌ను నిలవరించడం కుదరకపోవడంతో మెజారిటీ సభ్యులను తమకు అనుకూలంగా వుండేవారిని గెలిపించుకున్నారు. ఆ తర్వాత ప్రత్యేక పాకిస్తాన్ కావాలన్న డిమాండ్ ముందుకు రావడంతో రాజ్యాంగ సభ నుండి ముస్లింలీగ్ తమ సభ్యులను ఉపసంహరించుకొన్నది.

రాజ్యాంగసభకు డాక్టర్ సచ్చిదానంద సిన్హాను తాత్కాలిక అధ్యక్షుడిగా ఆచార్య జె.ఎ. కృపలానీ ప్రతిపాదించాడు. ఆయన అధ్యక్షతన జరిగిన సమావేశం డాక్టర్ వి.బి. రాజేంద్రప్రసాద్‌ను అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నది. ఆ తర్వాత అనేక ఉపకమిటీలు ఏర్పడ్డాయి. నియమావళి కమిటీకి, సన్నాహక కమిటికీ, ఆర్థిక కమిటీకి అధ్యక్షుడుగా రాజేంద్ర ప్రసాద్‌నే ఎన్నుకున్నారు. క్రెడియన్షియల్స్ కమిటీకి అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, సభాకమిటీకి పట్టాభి సీతారామయ్య, సభ వ్యవహారాల కమిటీకి కె.యం. మున్షి, జాతీయపతాకం అడహాక్ కమిటీకి మళ్ళీ రాజేంద్రప్రసాద్, రాజ్యాంగ సభా కార్యనిర్వాహక కమిటీకి జి.వి. మాల్వంకర్, రాష్ట్రాలకమిటీకి జవహర్‌లాల్ నెహ్రూ, ప్రాథమికహక్కులు, మైనారిటీలు, ఆదివాసీ మినహాయించిన ప్రాంతాల కమిటీకి వల్లభభాయిపటేల్, మైనారిటీల ఉపకమిటీకి హెచ్.సి. ముఖర్జీ, ప్రాథమికహక్కుల ఉపకమిటీకి కె.బి.కృపలానీ, ఈశాన్య సరిహద్దు ఆదివాసీ ప్రాంతాల, అస్సాం, ఇతర పాక్షికంగా, పూర్తిగా మినహాయించిన ప్రాంతాల ఉపకమిటీకి ఎ.వి. థక్కర్, కేంద్ర అధికారాల కమిటీకి కేంద్ర రాజ్యాంగ కమిటీకి జవహర్ లాల్ నెహ్రూ, రాజ్యాంగ రచనా కమిటీకి డా॥ బి.ఆర్. అంబేద్కర్‌లను అధ్యక్షులుగా ఎన్నుకున్నారు.

అంబేద్కర్ అధ్యక్షుడుగా గల రాజ్యాంగ రచనా కమిటీలో ఎన్.గోపాలస్వామి, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, కె.యం. మున్షి, మహమ్మద్ సాదుల్లా, ఎన్. మాధవరావు, టి.టి. కృష్ణమాచారిలు సభ్యులుగా వున్నారు.

రాజ్యాంగ రచనా చరిత్ర జోలికి పోకుండా విషయాన్ని ఈ మేరకే అర్థం చేసుకోదలచుకున్న వారికి అరుణ్‌శౌరి వాదనలు నిజమేననిపిస్తుంది. ఇంతమంది ప్రముఖులైన వ్యక్తులతో

ఇంత పకడ్బందీగా రూపొందించిన ప్రణాళికలతో రాజ్యాంగ రచనా కార్యక్రమం జరిగిందనీ ఇందులో అంబేడ్కర్ పాత్ర చాలా స్వల్పమేనని అందరికీ అన్పిస్తుంది. కానీ చరిత్ర అందుకు భిన్నంగా జరిగింది. ప్రతి ఒక్కరూ ఆయా హోదాలవలన తమకు సంక్రమించిన హక్కులను, అధికారాలనూ అనుభవించడంలో చూపించిన ఉత్సాహం తమ బాధ్యతలను నిర్వర్తించడంలో చూపించడంలేదు. రాజ్యాంగ రచనాసంఘంలో ఒక ప్రముఖ సభ్యుడైన టి.టి. కృష్ణమాచారి రాజ్యాంగసభలో ఉపన్యసిస్తూ చేసిన వ్యాఖ్యలు అందుకు స్పష్టమైన ఉదాహరణ.

"బహుశా నేను చెబుతున్న విషయం సభలోని సభ్యులందరికీ తెలిసిన విషయమే. రాజ్యాంగ రచన నిమిత్తం సభ ఏడుగురు సభ్యులను నియమించింది. అందులో ఒకరు తన సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఆ స్థానంలో ఎవరినీ నియమించలేదు. మరొక సభ్యుడు మృతి చెందాడు. ఆయన స్థానంలోనూ ఎవరినీ నియమించలేదు. మరొకసభ్యుడు అమెరికాలోనే వుంటూ ఎన్నడూ కార్యక్రమాలకు హాజరు కాలేదు. ఆ స్థానాన్ని భర్తీ చేయలేదు. ఒక సభ్యుడు ఇతర రాజ్యవ్యాపకాలలో పూర్తిగా నిమగ్నం కావడంతో రాజ్యాంగ రచనకు కాలాన్ని కేటాయించలేకపోయాడు. ఒకరిద్దరు ఢిల్లీకి దూరంగా వుండడం వల్లనూ, అనారోగ్యంతో వుండడం వల్లనూ కార్యక్రమాలకు హాజరు కాలేకపోయారు. ఏ బాధ్యతా నిర్వర్తించలేకపోయారు. ఇక మిగిలింది అంబేడ్కర్ ఒక్కరే. రాజ్యాంగ రచనా భారం అంతా ఆయన మీదే పడింది. ఆ కర్తవ్యాన్ని ఆయన ఒక్కరే నిస్సందేహంగా అసాధారణమైన రీతిలో నిర్వర్తించారని వేరే చెప్పనక్కర్లేదు". (Constituent Assembly Debates Vol 2 p.217)

అరుణ్‌శౌరికి టి.టి. కృష్ణమాచారి పేర్కొన్న అంశాలే సమాధానంగా సరిపోతుంది. ఇకపోతే ఇతర రాజ్యాంగాలనుండి అరువు తెచ్చుకోడం. ఇతర రాజ్యాంగాల్లోని ప్రగతిశీలమైన, మన దేశానికి పనికివచ్చే అంశాలను తీసుకురావడం అనేది నిజంగా గర్హనీయమైనదా? భారత రాజ్యాంగానికి ఆధారాలుగా పనిచేసిన 1935 భారత ప్రభుత్వ చట్టం గానీ, బ్రిటీష్ రాజ్యాంగం గానీ, అమెరికా, కెనడా రాజ్యాంగాలు గానీ ఆయాదేశాల్లో ప్రజలు అనేక త్యాగాలకోర్చి, రక్తం ధారపోసి నడిపిన ప్రజాస్వామిక విప్లవాల ఫలితం. ఒక ప్రజాస్వామిక దృక్పథం లేకపోతే ప్రజలపట్లా, దేశంపట్లా ప్రేమ లేకపోతే ఎవరూ ఈ పని చేయలేరు. వర్తమానంలోని ఏ మంచి అంశమైనా, ఏ మంచి సిద్ధాంతమైనా, ఏమంచి శాస్త్రమైనా గతంలోని మంచి అంశాలను స్వంతం చేసుకొనే అభివృద్ధి చెందాయి. ఇంతకీ అంబేడ్కర్ చేసింది ఇది మాత్రమేనా? దీంతోపాటు ఆయన స్వంతంగా చేసిన అద్భుతమైన కృషి ఎంతోవుంది. భారత రాజ్యాంగానికి ఇంకా ఏమాత్రమైనా విశ్వసనీయత మిగిలివుందంటే ఆ కృషివల్లనే. ముఖ్యంగా పౌరహక్కులు, స్త్రీలకు, ఎస్సీలకూ, ఎస్టీలకూ, వెనుకబడిన అల్పసంఖ్యాకవర్గాలకూ, ప్రత్యేక సదుపాయాలను కల్పించే అనేక అంశాలు అంబేడ్కర్ స్వతంత్రకృషే. ఇది మాత్రమే

కాక సమగ్ర స్వతంత్ర న్యాయ వ్యవస్థ అన్నభావనను అంబేద్కర్ అభివృద్ధి చేశారు. ఆర్థిక కమిషన్, భాషా కమిషన్, రాష్ట్ర కేంద్ర యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, రాష్ట్ర కేంద్రయూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్లు, ఏక పౌరసత్వం, ఒకే మనిషి ఒకే విలువ అన్న భావనలను అంబేద్కరే అభివృద్ధి చేశారు. ఆయన కేవలం వెనుకబడిన జాతుల, తరగతుల గురించే కాక మొత్తం దేశానికి సంబంధించి తపన చెంది ఆరోగ్యయుతమైన జాతి నిర్మాణానికి అవసరమైన నియమాలను రూపొందించారు.

అయితే ఈ రచనాక్రమం అంతటిలో అంబేద్కర్‌కు ఏ మాత్రం సహాయ సహకారాల నందించనివాళ్ళు ఆయన రాసిన అంశాలను.. ముఖ్యంగా ప్రగతిశీలమైన అంశాలను తొలగించడానికి లేదా ప్రధానమైన స్ఫూర్తిని మింగివేసే సవరణలను ప్రతిపాదించడానికి మాత్రం అమితమైన ఆతృతను చూపించారు. మొత్తం రెండు సంవత్సరాల పదకొండునెలల పద్దెనిమిది రోజుల పాటు రాజ్యాంగసభ సమావేశమయ్యింది. అంబేద్కర్ రాసిన రాజ్యాంగంలో 7,635 సవరణలను ప్రతిపాదించి ఆమోదింప చేసింది. అందులో ఎక్కువశాతం సవరణలను ఏమాత్రం చర్చ లేకుండానే ఆమోదించారు. కేవలం 1,475 సవరణలను మాత్రం 11 సెషన్లలో 114 రోజులపాటు చర్చించి ఆమోదించారు. ఈ మొత్తం క్రమంలో అంబేద్కర్ ఒంటరిగా పోరాడాడు. అంబేద్కర్ విజయం సాధించిన మేరకు భారత సమాజం ఇవాళ హక్కులను అనుభవిస్తున్నది. ఇదేమీ రహస్యంగా జరిగిన అంశమేమీ కాదు. రాజ్యాంగానికి సంబంధించిన చర్చలన్నీ అనేక వాల్యూములుగా అచ్చయ్యాయి. నిజంగా అంబేద్కర్ పాత్రను అంచనా వేయదలుచుకొంటే అచ్చయిన అందుబాటులో వున్న అంశాలు చాలు. కానీ అరుణ్‌శౌరి లాంటివారి ఉద్దేశ్యం అంబేద్కర్‌ను అంచనావేయడం కాదు. అంబేద్కర్‌ను ఆయన చారిత్రిక పాత్రను తిరస్కరించడం. అందుకు ఏ హేతువు గానీ, చరిత్రగానీ అవసరం లేదు కదా! అంబేద్కర్ రాజ్యాంగతత్వం అంతా ఆయన రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌లో చేసిన ఉపన్యాసంలోనూ, అఖిల భారత షెడ్యూల్డుకులాల సమాఖ్య తరఫున రాజ్యాంగసభకు సమర్పించిన మెమోరాండం "స్టేట్స్ అండ్ మైనారిటీస్" లోను స్పష్టంగా ప్రతిఫలించింది.

ప్రజాస్వామ్యం అంటే అది కేవలం ఒక ప్రభుత్వరూపం మాత్రమే కాదనీ, సకలమానవ సంబంధాలలోనూ అది ప్రతిఫలించాలనీ ఆయన పదేపదే పేర్కొన్నారు. దేశంలో ప్రజాస్వామిక విప్లవం జరగాలనీ, అందుకు ప్రభుత్వమే సారధ్యం వహించాలనీ ఆయన రాశారు. ఇది ప్రపంచంలో ఎక్కడా జరగని పరిస్థితి. ఫ్యూడల్ సంబంధాలను నాశనం చేసి పారిశ్రామికీకరణ, జరిగే క్రమంలో అందుకు అనువైన పరిస్థితులను రూపొందించుకోడానికి ప్రజాస్వామిక విప్లవాలు జరిగాయి. ఆ ప్రజాస్వామిక విప్లవాలు తమకు అనువైన రాజ్యాంగాలు రూపొందించుకున్నాయి. యూరప్ దేశాలలో ఆ విధంగా అధికారంలోకి వచ్చిన బూర్జువా వర్గాలు ఉత్పత్తిని మాత్రమే సామాజికం చేసి పంపిణీని వ్యక్తిగతం చేశాయి. ప్రభుత్వాలు ఆ

స్థితినే కొనసాగించాయి. అంబేద్కర్ అందుకు భిన్నంగా పారిశ్రామీకరణ జరగడం, ఉత్పత్తి సామాజికీకరణం కావడంతో పాటు పంపిణీ కూడా సామాజికీకరణం జరగాలని ప్రతిపాదించాడు. అందుకు భారతరాజ్యాంగం బాధ్యత వహించాలని ప్రతిపాదించాడు. దేశంలో ఎవరు ప్రభుత్వంలో వున్నా దీన్ని అమలు చేయాలని, అలా చేయకపోతే ఏ పౌరుడికైనా ప్రభుత్వాన్ని కోర్టులో సవాల్ చేసే హక్కు వుండాలని ఆయన రాశారు.

రెండవ ఆర్టికల్ రెండవ సెక్షన్ నాల్గవ క్లాజులో భూమినీ, ఇతర కీలకమైన పరిశ్రమలను జాతీయం చేయాలనీ, ముఖ్యంగా భూమిని పరిశ్రమగా అభివృద్ధి చేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా నిర్వహించాలని ఆయన ప్రతిపాదించారు. ఈ సోషలిస్టు సూత్రాల అమలులో ఎటువంటి అలక్ష్యం చూపరాదని ఆయన రాశారు. ప్రభుత్వం అంటే పెత్తనం చెలాయించే ఒక సాధనం కాదని అది కేవలం సమాజంలో అసమానతలను చట్టబద్ధంగా తొలగించి జనజీవనాన్ని క్రమపద్ధతిలో నడిపే ఒక మార్గదర్శిగా వుండాలని ఆయన పేర్కొన్నారు. "భారతదేశంలో పారిశ్రామికీకరణనూ, ప్రజాస్వామికీకరణనూ త్వరితం చేయడానికి స్టేట్ సోషలిజం ఉపయోగపడుతుంది. పరిశ్రమలనూ, భూమినీ ప్రైవేటువ్యక్తుల చేతుల్లోనే వుంచితే అది యూరప్ ప్రైవేటు పెట్టుబడిదారీ విధానం ఎంతగా అసమానతలను సృష్టించిందో మన దేశంలోనూ అంతగా అసమానతలు పేరుకుపోతాయి. యూరప్‌లో జరిగిన పరిణామాలు మన దేశానికొక హెచ్చరిక కావాలి" అని ఆయన రాశారు (స్టేట్స్ అండ్ మైనారిటీస్ (ఇంగ్లీష్) పేజి –42) ఈ విషయమై ఆయన నెహ్రూతో కూడా రాజీలేని పోరాటానికి తలపడ్డాడు. నెహ్రూ ప్రతిపాదించిన తీర్మానానికి తీవ్రంగా స్పందిస్తూ "ఏ ప్రభుత్వం అయినా నిజాయితీగా రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా సమానత్వాన్ని సాధించాలనుకొంటే దాని ఆర్థిక విధానం సోషలిస్టు ఆర్థికవిధానంగా లేకపోతే అది ఎలా సాధ్యం అవుతుంది? అని తీవ్రమైన స్వరంతో ప్రశ్నించారు, (Constitutuent assembly debates vol.5.P.100), రాష్ట్రాల గురించీ, కేంద్రం గురించీ, ప్రభుత్వాలు అనుసరించవలసిన పద్ధతులను గురించీ ఆయన ప్రతి అంశాన్నీ ఎంతో వివరంగా చర్చించారు.అయితే ఆయన ప్రతిపాదించిన స్టేట్ సోషలిజం రాజ్యాంగంలో చోటుచేసుకోలేదు. అనేక ఇతర అంశాలను తొలగించారు. కేవలం కొన్నింటిని మాత్రం కోర్టుల్లో సవాల్ చేయడానికి వీలులేని విధంగా ప్రభుత్వానికి ఏ బాధ్యతా లేని విధంగా ఆదేశిక సూత్రాల్లో చేర్చారు. ముఖ్యంగా ఆయన తీవ్రంగా వ్యతిరేకించిన ఆస్తి హక్కును ఆర్టికల్ 31లో చేర్చి మొత్తం అంబేద్కర్ రాజ్యాంగ రచనా స్ఫూర్తినే హత్య చేశారు. ఈ విషయాన్ని అనంతర కాలంలో స్వయంగా 1955 మార్చి 19వ తేదీన రాజ్యసభలో చేసిన ప్రసంగంలో చెప్పారు. "నా ఉద్దేశం ప్రకారం ఈ ఆర్టికల్ 31 అనేది పరమ వికృతమైన అంశం. దానివంక చూడడమే నాకు పరమ అసహ్యం"అని పేర్కొన్నారు.

ఈ మాట చెప్పినందుకు దోపిడీ దారులూ, దొంగలూ, స్వంతా స్త్రీవలన సకల సౌఖ్యాలనూ పొందుతున్నవాళ్ళూ, మతోన్మాదులూ అంబేడ్కర్‌పైన ఆగ్రహాన్ని ప్రకటిస్తే అందులో ఆశ్చర్యపోవాల్సిందేమీ లేదు. కానీ కమ్యూనిస్టులు సైతం అంబేడ్కర్‌ను దుయ్యబట్టారు. ఒకవైపున కమ్యూనిస్టు ఉద్యమాలు అంబేడ్కర్ రాజ్యాంగంలో పొందుపర్చిన హక్కులను పొందడానికి ఉద్యమిస్తూనే మరోవైపున అంబేడ్కర్ రాజ్యాంగం రాశాడు కాబట్టి ఆయన బూర్జువా ఏజంటని తెగనాడడం విచిత్రం.

అంబేడ్కర్ రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్ సమయంలోనే స్టేట్ సోషలిజం భావనను (భూమిని జాతీయం చేయాలని) ప్రతిపాదించగా 1948లో జరిగిన బుర్ద్వాన్ సమావేశంలో "మనం భూమిని జాతీయం చేయాలని ఉద్యమించాలి" అని కమ్యూనిస్టు పార్టీ తీర్మానం చేసింది. అదేదో వాళ్ళే తొలిసారి కనిపెట్టినట్టుగా ఎన్నో రోజులపాటు చర్చించి ఆ తీర్మానాన్ని ఆమోదించారు. ఆ చర్చలో అంబేడ్కర్ ప్రస్తావనే లేదు. "ఎవరినుండి దొంగిలించామో వారిని క్షమించలేము" అన్నట్లుగా అంబేడ్కర్‌ను తిట్టడమే పనిగా పెట్టుకొన్నారు. కమ్యూనిస్టులు సాధించే సోషలిస్టు రాజ్యాలకు రాజ్యాంగం ఉండనట్లుగా, అవి అంబేడ్కర్ రాసిన "స్టేట్స్ అండ్స్ మైనారిటీస్" కన్నా అభివృద్ధికరంగా వుంటాయన్నట్లు కమ్యూనిస్టులు విమర్శించటం విచిత్రం. నిజమైన కమ్యూనిస్టెవరైనా అంబేడ్కర్‌లో పనికివచ్చే అంశాలను స్వీకరించి, సమకాలానికి సరిపోవనిపించిన అంశాలను అభివృద్ధిచేసి, అసలు పనికి రావనుకున్నవాటిని తిరస్కరించాలి. కానీ ఆ ప్రయత్నం ఏ కమ్యూనిస్టు ఉద్యమమూ చేయడం లేదు.

దళిత ఉద్యమం అంబేడ్కర్‌ను తమ స్ఫూర్తిదాతగా, తమ సైద్ధాంతిక భూమికగా పేర్కొంది. అయితే ఆచరణలో కనీసం ఇప్పటికీ అంబేడ్కర్ అసలైన తత్వస్ఫూర్తిని అమలు చేయాలన్న ప్రయత్నం ఇంకా మొదలు కావలసే వుంది.

అంబేడ్కరిజంలో (1) కులనిర్మూలన (2) కమ్యూనిజం సాధించడానికి ముందు కర్తవ్యాలు, అవసరాలు (Pre requisites of communism) (3) స్టేట్ సోషలిజం అనే ప్రధాన అంశాలపట్ల ఇంకా దళిత ఉద్యమం దృష్టి సారించలేదు. కేవలం అత్యాచారాలు జరిగినప్పుడు బాధ్యులను శిక్షించడం, బాధితులకు నష్టపరిహారం అడగడం, రిజర్వేషన్ల రాయితీల కోసం 'వీరోచిత' యుద్ధాలు చేయడంవరకే ప్రస్తుతానికి దళిత ఉద్యమం పరిమితమైంది. లక్నోలో జరిగిన సభలో విద్యావంతులైన షెడ్యూల్డు కులాలవారిని ఉద్దేశించి ఈ తరం విద్యావంతులై సమాజాన్ని చైతన్యపరచి ఏ అసమానతలూ లేని సమాజం కోసం పాటు పడుతుందని విశ్వసించవచ్చు. కానీ యిక్కడ పొట్టకూటికోసం కుమ్ములాడుకొంటున్న గుమాస్తాల గుంపును చూస్తున్నాను" అని ఆయన ఆవేదనగా అన్నారు. ఆనాటికీ ఈనాటికీ పరిస్థితిలో ఎటువంటి మార్పు లేదు.

జనాభా నిష్పత్తిప్రకారం అన్ని కులాలకూ, రాజ్యాధికారంలోనూ, రాయితీల్లోనూ భాగస్వామ్యం వుండాలనీ, ఒక మనిషికి ఒకే విలువ వుండాలని ఆయన పదేపదే చెప్తున్న విషయాన్ని దళిత ఉద్యమం పట్టించుకోకపోతే ఎవరు పట్టించుకొంటారు? ఆయన బతికినంతకాలం నిరసించిన ప్రైవేటు ఆస్తిహక్కును నిర్మూలించడం కోసం దళిత వుద్యమం కాకపోతే మరెవరు ఉద్యమిస్తారు? అంబేద్కర్‌ను ప్రేమించడమంటే అంబేద్కర్ సిద్ధాంతాన్ని ఆచరణలో విజయవంతం చేయడానికి ఉద్యమాలు నిర్మించడం తప్ప మరేమీ కాదు. అంబేద్కర్‌ను విగ్రహంగా మార్చి, కొబ్బరికాయలు కొట్టి, పూజలు చేయడం అనేది అంబేద్కర్‌ను దళితులు తమ చేతులారా మరోసారి హత్యచేయడమే. ఒక సమగ్రమైన దళిత ఉద్యమం రూపొందడానికి అంబేద్కర్ రచనలను అధ్యయనం చేసి ఆచరణలో పెట్టడానికి కార్యక్రమాన్ని రూపొందించవలసివుంది. అదే విధంగా ఆయన కేంద్ర రాష్ట్ర సంబంధాలలో వ్యక్తం చేసిన అభిప్రాయాలను ప్రస్తుత కాలానికి అనుగుణంగా సవరించవలసి వుంది. ఈ కర్తవ్యాన్ని దళిత ఉద్యమమే సాధించాలి.

ఒక వైపున అరుణ్‌శౌరి లాంటివారు అంబేద్కర్ పాత్రను తుడిచిపెట్టే ప్రయత్నం చేస్తున్నారు. మరోవైపున ఆయన రాజ్యాంగ రచనా స్ఫూర్తిని దేశ నాయకులు ఏనాడో చంపేశారు. కులం, వర్గం ప్రశ్నలో కులాన్ని సౌకర్యవంతంగా తప్పించుకోడానికే అంబేద్కర్ ప్రస్తావనను కమ్యూనిస్టులు ఇష్టపడడంలేదు. అంబేద్కర్‌ను కేవలం ఒక కులానికే ప్రతినిధిగా మార్చడానికి ఆయన బ్రతికివున్నప్పటి నుండీ తీవ్రంగా ప్రయత్నాలే జరుగుతూనేవున్నాయి. స్త్రీల విషయాలకోసం తన పదవిని సైతం వదిలించుకోవడానికి సిద్ధపడిన అంబేద్కర్‌ను 'హిందూకోడ్ బిల్లు' చర్చ జరిగినంతకాలం అగ్రవర్ణ స్త్రీలు ఆయన పార్లమెంటుకు వెళ్ళేదారిలో, వచ్చేదారిలో టమోటోలు విసిరి, కుళ్లిన కోడిగ్రుడ్లు విసిరి, ఆయనకు వ్యతిరేకంగా నినాదాలు చేసి అవమానించారు. ఇన్ని అవమానాలనూ, కష్టాలనూ ఎదుర్కొని, ఎందరినో శత్రువులకు చేసుకొని, స్వంత సుఖాలను వదిలి ఆయన రూపొందించిన ప్రజాస్వామిక విప్లవస్ఫూర్తిని ఈనాటికీ మనం అందుకోలేకపోవడం విషాదం.

కేవలం రిజర్వేషన్లకీ, రాయితీలకి సంబంధించి కష్టంలేని, వెంటనే ఫలితాలొచ్చే వాటికి మాత్రమే పరిమితం (అవి కూడా ఎంతో అవసరం) అయితే దళితులు సైతం అంబేద్కర్‌కు అన్యాయమే చేసినట్లు. నిజానికి అది అంబేద్కర్‌కు కాదు. దళితులు తమకు తామే చేసుకొనే అన్యాయం. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే తర్వాతి తరాలు మనల్ని క్షమించవు. ఒక ప్రత్యామ్నాయ సాంస్కృతిక రాజకీయార్థిక ఉద్యమంగా దళిత ఉద్యమం నడవాలి. అందుకు నెత్తురు మండే శక్తులు నిండే ఈ తరం నడుంకట్టాలి.

**చూపు - మే, ఆగస్టు - 1997**

# అంబేడ్కర్‌ను వెలివేసి సాధించేదేమిటి?

"సత్యాలను వాస్తవాలనుండి గ్రహించాలి" - మావో సేటుంగ్

డాక్టర్ అంబేడ్కర్ అన్న పేరు కేవలం ఒక వ్యక్తి పేరుగా మాత్రమే కాక అది ఒక చైతన్యానికి ప్రతీకగా, అణగారిన ప్రజాసమూహాలను సంఘటితపర్చే ఒక స్ఫూర్తికి పర్యాయపదంగా, ఏ అణచివేతలూ, అసమానతలూ లేని ప్రజాస్వామిక విలువలను ప్రతిష్ఠించే ఒక సామాజిక ఆకాంక్షగా ముందుకు వచ్చింది. నిస్సందేహంగా సమకాలీన రాజకీయాలు, సంస్కృతీ సామాజిక నిర్మాణాలు అన్నింటికీ అంబేడ్కర్ పేరు కేంద్రమైంది. అంబేడ్కర్‌నూ, ఆయన ప్రతిపాదించిన సామాజిక నిర్మాణ సూత్రాలను గుర్తించి ఆమోదించడమో, తిరస్కరించడమో తప్పనిసరి పరిస్థితి అయింది. ఆమోదించినా, తిరస్కరించినా ఆయన ప్రస్తావన లేకుండా ఆయన ప్రబోధించిన ఆచరణాత్మక సూత్రాల ప్రస్తావన లేకుండా భారత సమాజంలో ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, నైతిక అంశాలు గానీ, వాటి మార్పు కోసం జరుగుతున్న అనేక ప్రయత్నాలుగానీ, ఉద్యమాలు కానీ లేవనడం అతిశయోక్తి కాదు.

అన్ని రంగాలనూ ఇంతగా ప్రభావితం చేస్తున్న వ్యక్తి నిజంగానే ఆయా లక్షణాలను కలిగి వున్నాడా లేక రాత్రికి రాత్రే ఏ అమెరికన్ సామ్రాజ్యవాదమో, ఏ బ్రిటీష్ సామ్రాజ్యవాదమో, ఏ బ్రాహ్మణ, బనియా బూర్జువా దోపిడీ దొంగల రాజకీయ విస్తరణ వాదమో హఠాత్తుగా అంబేడ్కర్ అనే వ్యక్తిత్వాన్ని పుట్టించి తమ ప్రయోజనాలను కాపాడుకోవడానికి, ప్రజలు విముక్తి ఆలోచనలు చేయకుండా వారి చేతనా ప్రపంచంలోకి శాశ్వతమైన మత్తుమందును దట్టించడానికి కుట్ర పన్నిందా అన్న చర్చ ఏనాటినుండో కొనసాగుతూనే వుంది. గాంధీ నుండి అరుణ్‌శౌరి దాకా అంబేడ్కర్‌పైన మళ్ళీ మళ్ళీ అంచనాలు వేస్తూనే వున్నారు. అంబేడ్కర్ నిజాయితీకీ, విశ్వసనీయతకూ పరీక్షలు పెడుతూనే వున్నారు. బహుశా ఇది ఒకందుకు మంచిదే. అంబేడ్కర్ తాత్విక రాజకీయ వ్యక్తిత్వం ఎదుర్కొన్న అనేకానేక అగ్ని పరీక్షల నుండి అనేక శాస్త్రీయ సత్యాలు వెలుగులోకి వస్తూనే వున్నాయి. దీని వలన అంబేడ్కర్‌ను గుడ్డిగా వ్యతిరేకించేవారూ ఆయన్ను మూఢంగా ప్రేమించేవారూ అందరూ ఎన్నెన్నో కొత్తపాఠాలు నేర్చుకొనే అవకాశం దొరుకుతుంది.

1996 జులై – ఆగస్ట్ 'ఈనాటి ఏకలవ్య' సంచికలో 'అంబేడ్కర్ పీడిత ప్రజల మనిషి కాదు' అన్న శీర్షికతో పీపుల్స్‌వార్ (గణపతి వర్గం) నాయకులు శ్రీ వెంకటరాం గారి పేరుతో ప్రచురితమైన అంచనాను చూశాను. రెండు దశాబ్దాలపాటు తెలుగు గడ్డను కుదిపివేసే పోరాటాలకు నాయకత్వం వహించిన పార్టీ నాయకులు మార్క్సిజం, లెనినిజం మావో ఆలోచనా విధానం వెలుగులో అంబేడ్కర్‌ను అంచనా వేసే పద్ధతి నుండి అంబేడ్కర్‌ను మరింతగా

## బౌద్ధానికి మూలం దేవుడు కాదు హేతువు – డా॥ బి.ఆర్. అంబేద్కర్

"ఏదైనా ఒక సంఘటన జరిగితే అది ఎలా జరిగింది, దానికి కారణమేంటి అన్న విషయాలను తెలుసుకోవడానికి మనిషి కుతూహలపడతాడు. ఒక్కొక్కసారి కార్యమూ, దాని కారణమూ స్పష్టంగా తెలిసిపోతుంటాయి. కాబట్టి దేనివలన ఏది జరిగిందో తెలుసుకోవడం పెద్ద కష్టం కాదు. అయితే తరచుగా కారణాలు స్పష్టంగా కనిపించని అంశాలు జరుగుతుంటాయి. స్పష్టంగా కనిపించే కారణం కన్పించక పోయినా ఇది ఎలా జరిగింది అన్న ప్రశ్న తలెత్తుతుంది. మామూలుగా వచ్చే సమాధానం ఏ అతీతశక్తి చేసిన అద్భుతం వలనో ఇది జరిగిందనేది. బుద్ధుడికి ముందున్న తత్వవేత్తలు దానికి వేర్వేరు పద్ధతుల్లో సమాధానం చెప్పారు. ప్రకృత కాత్యాయనుడు ప్రతి సంఘటనలకు కారణాలు ఉండనక్కరలేదని, సంఘటనలు స్వతంత్రంగా జరుగుతాయని చెప్పాడు. మక్కలి గోశాలుడు ప్రతి కార్యానికి ఒక కారణం తప్పనిసరిగా ఉంటుందని చెప్పాడు. అయితే ఆ కారణం మానవ సమాజంలోనే ఉండనక్కరలేదనీ, ప్రకృతిలోను, అవసరంలోనూ, వస్తుగత నియమాలలోనూ, తదితర అంశాల్లో ఆ కారణాలను తెలుసుకోవాలని చెప్పాడు.

బుద్ధుడు ఈ వాదాలను తిరస్కరించాడు. ప్రతి కార్యానికి ఒక కారణముంటుందని మాత్రమే కాకుండా ఆ కార్యం మానవ ఆచరణ వలనగాని ప్రాకృతిక నియమం వలన గాని సంభవిస్తుందని చెప్పాడు.

ఆయన కార్యకారణాలకు కాలం అనీ, ప్రకృతిశక్తి అనీ, ఆవశ్యకత అనీ చెప్పే సిద్ధాంతాలను తిరస్కరించాడు. ప్రపంచంలో జరిగే సంఘటనలకు కాలం, ప్రకృతి ఆవశ్యకతలే కారణమైతే మనం ఎవరం? అని ఆయన ప్రశ్నించాడు. మనిషి కేవలం కాలం, ప్రకృతి, ప్రాప్తకాలజ్ఞత, దేవుళ్ళ అవసరాల చేతుల్లో కీలు బొమ్మలు మాత్రమేనా? మనిషి స్వతంత్రుడు కాకపోతే మనిషి అస్తిత్వానికి అర్థం ఏమిటి? మనిషి అతీత శక్తుల్ని విశ్వసిస్తూ వుంటే అతని జ్ఞానం ఎందుకు? అని ఆయన ప్రశ్నించాడు.

మనిషి స్వతంత్రుడైతే ప్రతి కార్యమూ, మనిషి ఆచరణా ఫలితంగా గానీ, ప్రకృతి చలన సూత్రాల ఫలితంగాగానీ అవుతోంది. ఏ విషయమూ అతీతశక్తి వలన పుట్టింది కాదు. ఇప్పటికిప్పుడు ఆ సత్యాలను తెలుసుకోలేకపోవచ్చు. ఏదో ఒకరోజు అది తెలుసుకోదగిన అంశమే. ఈ విధంగా అతీతశక్తిని తిరస్కరించడం వలన బుద్ధుడు మూడు లక్షణాలను సాధించాడు. మొదటి లక్ష్యం మనిషిని హేతుబద్ధమైన మార్గంలో నడిపించడం, రెండవ లక్ష్యం మనిషిని సత్యాన్వేషణలో ఏ బంధనాలూలేని స్వతంత్రుణ్ణి చేయడం, మూడవ లక్ష్యం మనిషి సత్యాన్వేషణా శక్తిని నాశనం చేసే మూఢ విశ్వాసాలను అంతం చేయడం. ఈ కార్యాకారణ సంబంధాల సిద్ధాంతమే బౌద్ధానికి కేంద్ర బిందువు. అది హేతువాదాన్ని బోధిస్తుంది. బౌద్ధం హేతువాదం తప్ప మరేమీ కాదు. కాబట్టి అతీతశక్తుల్ని పూజించడం ధమ్మం కాదు.

**(Buddha and his Dhamma - P.174)**

తప్పి ఆయన చీకటి వెలుగులను సశాస్త్రీయంగా తెలుసుకొని మరింత జ్ఞాన సముపార్జన అవకాశం లభిస్తుందని ఆశపడ్డాను. శ్రీ వెంకటరాం గారు అంబేద్కర్‌పై ప్రకటించిన అంచనాలను పునశ్చరణ కోసం కింద పేర్కొంటున్నాను.

1) విదేశాలలో చదువుకున్న ఎందరో విద్యార్థులు మాతృదేశ విముక్తికి సాయుధులు కాగా అంబేద్కర్‌లో ఎలాంటి విప్లవ భావాలూ చెలరేగలేదు. రష్యాలో పీడిత ప్రజానీకం సాధించుకున్న అక్టోబరు విప్లవం అంబేద్కర్‌ను ఏమాత్రం ఆకర్షించలేకపోగా ఆయన కమ్యూనిస్టు సిద్ధాంతాలను, వర్గ పోరాటాన్ని అసహ్యించుకొనే దాకా వెళ్ళాడు.

2) అంబేద్కర్‌ది బూర్జువా సామ్రాజ్యవాద ప్రాపంచిక దృక్పథం.

3) అంబేద్కర్ పీడిత ప్రజలకు చేసిందేమీ లేదు. రిజర్వేషన్లు కూడా ఆయన కృషి వలన ఏమీ రాలేదు. తెలంగాణా ప్రజల్ని చిత్రహింసలపాలు చేస్తున్నప్పుడు రాజీనామా చెయ్యకుండా హిందూకోడ్ బిల్లు వీగిపోయినప్పుడు రాజీనామా చేశాడు. ఇది పెద్ద విప్లవకర చర్యేమీ కాదు.

4) కులం ఉపరితల అంశం, వర్గం పునాది.

5) మొత్తంగా అంబేద్కర్ ప్రజల మనిషి కాదు కాబట్టి ఆయన మార్క్స్ సరసన కూర్చోడానికి అనర్హుడు.

స్థూలంగా శ్రీవెంకటరాం గారి అంచనాలో వ్యక్తమైన అభిప్రాయాలు ఇవి. నిజానికి చాలా పాత అంచనాలే తప్ప శ్రీ వెంకటరాం గారు ఇవాళ కొత్తగా ప్రకటించినవి కావు. చాలామంది అంబేద్కర్ వ్యతిరేకులు ఏదో సందర్భంలో పైన పేర్కొన్న అన్నింటినో, కొన్నింటినో వ్యక్తంచేశారు. ఒక బాధ్యతగల పార్టీ నాయకుడినుండి మరింత శాస్త్రీయమైన విశ్లేషణనూ చారిత్రక కారణాలను ఆశించాను. ఆ వ్యాసం చదవడం ద్వారా మరింత జ్ఞానం పొందే అవకాశం రాకపోగా పాతబడిపోయిన సూత్రీకరణల దొంతరల బరువును మోయవలసి వచ్చింది.

'రూపమూ, సారమూ ఒకటే అయితే విజ్ఞాన శాస్త్రాల అవసరం లేదు, అంటాడు కామ్రేడ్ కారల్ మార్క్స్. కులమో, వర్గమో, లింగమో, మతమో, ఇంకేదైనా అంశమో దేన్నైనా దాని రూపసారాలను అర్థంచేసుకోవడానికి శాస్త్రీయమైన పరిశోధన, విశ్లేషణ, అధ్యయనం అవసరం. అందుకు మనం ఏ అంశాన్ని అధ్యయనం చేస్తున్నామో దాని చలన సూత్రాలను పట్టుకొని దాని ఆధారంగా మన విశ్లేషణనూ, స్వీకరించే అంశాలనూ తిరస్కరించే అంశాలనూ నిర్ణయించుకోవాలి. దురదృష్టవశాత్తూ శ్రీ వెంకటరాంగారి పరిశీలనలో అది లోపించింది. వెంకటరాంగారు భావించినట్లు అంబేద్కర్ చదువుకొనేటప్పుడు మాతృదేశం గురించి ఆలోచించలేదనడం, దాని విముక్తిని పట్టించుకోలేదనడం నిజం కాదు.

చాలామంది విదేశాల్లో చదువుకొన్న విద్యార్థుల్లాగా, వాళ్ళ కన్నా ఎక్కువగా ఆయన మాతృదేశాన్ని గురించి దాని విముక్తి గురించి కలలు కన్నాడు. అందరూ కేవలం బ్రిటీష్ వారి పాలన గురించి ఆలోచిస్తే, అంబేద్కర్ బ్రిటీష్ వారి పాలన గురించి మాత్రమే కాక తన గడ్డమీద జీవిస్తోన్న అశేష పీడిత ప్రజానీకానికి వేలాడుతున్న అనేక సంకెళ్ళను గురించి ఆలోచించాడు. అందరూ స్వాతంత్ర్య భారతం గురించి ఆలోచిస్తే అంబేద్కర్ స్వాతంత్ర్య ప్రజాస్వామిక భారతం గురించి కలలు కన్నాడు. భారతదేశపు ప్రత్యేక సమస్యలకు ప్రత్యేక విముక్తి వ్యూహాన్ని రూపొందించడానికి ఆయన ఘర్షణ పడ్డాడు. అందుకు భారత చారిత్రక పరిస్థితులనూ, సామాజిక పరిణామాలను, భారత భూఖండంలో చెలరేగిన అనేక విప్లవపోరాటాలను అర్థం చేసుకొని వాటినుండి సత్యాలను గ్రహించడంతోపాటు ఫ్రెంచి విప్లవాల నుండి, నల్లజాతి విముక్తి ఉద్యమాల నుండి మరీ ముఖ్యంగా కారల్‌మార్క్స్ నుండి ఎంతో నేర్చుకున్నాడు.అయితే ఆయన తన జ్ఞాన క్రమంలో ఎదురైన ప్రతి అంశాన్ని యధాతథంగా స్వీకరించలేదు. భారత సమాజంలో మానవ వికాసానికి, సమసమాజ నిర్మాణానికి ఆయా అంశాలను స్వీకరించి వ్యూహాన్ని రూపొందించాడు.కారల్‌మార్క్స్ చేసింది అదే. చైనాలో కామ్రేడ్ మావో చేసింది అదే.

శ్రీ వెంకటరాంగారు లేవనెత్తిన మరో అంశం అంబేద్కర్‌ది బూర్జువా సామ్రాజ్యవాద దృక్పథం అనీ, ఆయన బూర్జువాలకూ, దళారులకూ, బ్రిటీష్ సామ్రాజ్యవాదులకూ అనుకూలంగా వున్నాడనీ రౌండ్, టేబుల్ సమావేశాలకు హాజరయ్యాడనీ, సైమన్ కమిషన్‌ను బహిష్కరించలేదనీ.

అంబేద్కర్ ఏకకాలంలో అనేకమందితో గొడవపడ్డాడు. ఆయనకు ప్రధాన అంశం కులవ్యవస్థ. దాని వల్ల నలిగిపోతున్న మానవ సమూహాలు తరాలుగా విద్యకూ, విజ్ఞానానికీ, మానవ హక్కులకూ దూరమైన ప్రజాసమూహాలకు ప్రతినిధిగా ఆయన మాట్లాడటానికి ప్రతి వేదికనూ ఉపయోగించుకున్నాడు. మానవ గౌరవం కోల్పోయిన జన సమూహం తమను ఇతరులలాగానే మనుషులుగా చాటుకోవాలనే తపన అస్పృశ్య జీవితాన్ని అనుభవించిన వారికి తప్ప మరొకరికి తెలియదు. నిజానికి డాక్టర్ అంబేద్కర్ బ్రిటీష్ ఆర్థిక వ్యవస్థను సునిశితంగా విమర్శిస్తూ పరిశోధనా గ్రంథాలు రాశారు. 'ప్రాబ్లమ్ ఆఫ్ ద రూపీ', 'ఎవల్యూషన్ ఆఫ్ ప్రావిన్షియల్ ఫైనాన్స్ ఇన్ బ్రిటీష్ ఇండియా' అనే రెండు పుస్తకాలు బ్రిటీష్‌వారిపై తన అంచనాను స్పష్టంగానే ప్రతిఫలించాయి. వర్గ పోరాటాన్ని మాత్రమే ఆమోదించే చాలామంది కమ్యూనిస్టులు కేవలం జాతీయోద్యమాన్ని మాత్రమే ఆమోదించదగిన వర్గేతర ఉద్యమంగా గుర్తిస్తారు. సామ్రాజ్యవాద శక్తుల్ని పారద్రోలి ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని త్వరితపరిచే ప్రజాస్వామిక ఉద్యమాన్ని (పారిశ్రామీకరణ) విజయవంతం చేయడం ఎంతో అవసరం. అయితే ఆ ప్రజాస్వామిక విప్లవం ఎంతగా సామ్రాజ్యవాద వ్యతిరేకమైనదో అంతగా భూస్వామ్య

వ్యతిరేకమైనది కూడా. భారత దేశంలో భూస్వామ్యమంటే కులదొంతరల నిచ్చెనమెట్ల ఆధారంగా "నిర్మితమైన బ్రాహ్మణీయ కులదోపిడీ భూస్వామ్య వ్యవస్థే. భారతదేశంలో ఫ్యూడల్ దొరల, బూర్జువా ఆసక్తులున్న విద్యావంతులు సాగించిన జాతీయోద్యమాన్ని ప్రగతిశీలమైందిగా గుర్తించిన కమ్యూనిస్టులు, అంబేద్కర్ నాయకత్వంలో భారత సామాజిక విప్లవ శక్తులైన దళితులు సాగించిన భూస్వామ్య వ్యతిరేక కుల నిర్మూలనా పోరాటాలను గుర్తించకపోవడం నిజంగా విషాదకరమైన విచిత్రం. నిజానికి భారతదేశంలో బ్రిటీష్ పెట్టుబడిదారీవిధానం ఫ్యూడలిజాన్ని నాశనం చేసేదిగా కాక ఫ్యూడల్ జమిందార్లనూ, రాజ వంశీకులనూ ఆశ్రయించి స్థిరపడింది. దాంతో ఎక్కువమంది భ్రమ పడినట్టుగా బ్రిటీష్‌వారు ప్రవేశపెట్టిన విద్య, పరిశ్రమల వలన కులం పట్టు సడలిపోలేదు. కాగా అది మరింత బిగుసుకుపోయింది. 1793లోనే బ్రిటీష్‌వారు జమీందార్లతో శాశ్వత ఒప్పందానికి వచ్చారు. అంతకుముందు క్రైస్తవ మతబోధనూ, విద్యావ్యాప్తినీ కొనసాగించేందుకు మిషనరీలను ప్రోత్సహించిన బ్రిటీష్ ప్రభుత్వం ఆ తరువాత కాలంలో తమ స్వంత మిషనరీలను తామే నిషేధించారని కామ్రేడ్ కారల్ మార్క్స్ తన "భారతదేశంలో బ్రిటీష్ పరిపాలనా భవిష్యత్ ఫలితాలు" అనే గ్రంథంలో రాశారు. ముఖ్యంగా అంటరాని వారికి విద్యాబోధన చేయరాదని, మిషనరీలను కట్టడి చేశారు. 1892లో మహర్‌లను సైన్యంలో చేర్చుకోవడం నిలిపివేశారు. వేతన విధానం, ఖోటీ విధానం బ్రిటీష్‌వారి ఆమోదంతో నిరాఘాటంగా కొనసాగింది. అగ్రకుల భూస్వామ్య శక్తులూ, బ్రిటీష్ సామ్రాజ్యవాద శక్తులూ విడదీయరాని ఒకే అంశంగా కలగలసి పోయాయి. అంబేద్కర్ కుల భూస్వామ్య నిర్మూలనకు పోరాటాన్ని కొనసాగించాడు. తాను స్థాపించిన ఇండిపెండెంట్ లేబర్ పార్టీ ఎన్నో మహత్తరమైన పోరాటాలను నడిపింది. దాని జెండా ఎర్రజెండా. ఇవేమీ చరిత్రకు తెలియని రహస్యాలుకావు. కాకపోతే అంబేద్కర్ కదా అనే చులకన అంచనాల్లో స్పష్టంగా కనిపిస్తోంది. ఇదే భారత ప్రగతిశీల మనో నిర్మాణాల వైచిత్రి!

జాతీయోద్యమంలో బ్రిటీష్‌వారికి అనుకూలంగా వుండి చర్చల ద్వారా స్వరాజ్యం తీసుకురావాలనే ఒక ధోరణి ప్రబలంగా ఉంది. వారికి బ్రిటీష్ వాళ్ళు వెళ్ళిపోవాలి. అదేవిధంగా భారతదేశంలో వర్ణాశ్రమ వ్యవస్థ కొనసాగాలి. ఇక రెండవ ధోరణి వాళ్ళు వెళ్ళిపోవడంతోపాటు కుల నిర్మాణాలు కూడా కూలిపోయి సమసమాజం నిర్మాణం జరగాలని కోరుకున్నది. అంబేద్కర్ రెండవ ధోరణికి చెందినవాడు. అంబేద్కర్ సాగించిన పోరాటాలే అందుకు నిదర్శనాలు. కమ్యూనిస్టు పార్టీ పుట్టి దాని నాయకులు విప్లవాన్ని విజయవంతం చేయడానికి కార్మిక వర్గం కావాలి కాబట్టి దానికోసం బొంబాయి నగరంలోని ఫ్యాక్టరీ గేట్ల దగ్గర వెతుక్కుంటున్న సమయంలో మరాఠా పల్లెల్లో అంబేద్కర్ అసలైన సామాజిక శ్రామిక విప్లవ శక్తులైన బహుజన దళిత సమూహాలతో వీరోచిత విప్లవ సైనిక కవాతులు చేయించాడు.

మహత్తరమైన మానవ విముక్తి ఉద్యమాలను నడిపాడు. ఒక స్పష్టమైన అవగాహనతో భారతదేశానికి బ్రాహ్మణిజం, క్యాపిటలిజం రెండూ శత్రువులేనని ప్రకటించి అందుకనుగుణంగానే తన వ్యూహాన్ని అంబేద్కర్ రూపొందించుకొన్నాడు.

ఇకపోతే అంబేద్కర్‌ది బూర్జువా సామ్రాజ్యవాద ప్రాపంచిక దృక్పథం అన్న అభిప్రాయం. గిట్టనివాళ్ళెవరికైనా ఇట్టే ఇచ్చేయగలిగిన బిరుదిది. ఇందుకు శ్రీ వెంకటరాం చెప్పిన కారణం అంబేద్కర్ రాజ్యాంగం రాయడం. ఇది బ్రిటీష్ రాజ్యాంగ నమూనాలో ఉండడం. రాజ్యాంగ రచనా క్రమం, వాదోపవాదాలు, చర్చలు నిజంగా పరిశీలించిన వార్వెరూ అంబేద్కర్‌ను గురించి మాట్లాడరు. ఆదివాసీ వాల్మీకి రామాయణం రాసినట్టూ, బ్రాహ్మణేతరుడైన వ్యాసుడు మహాభారతం రాసినట్టూ అంటరాని అంబేద్కర్ భారతదేశానికి రాజ్యాంగం రాశాడు. రాజ్యాంగం రాయడం ద్వారా అంబేద్కర్ సోషలిస్టు సిద్ధాంతాన్ని రాజ్యాంగబద్ధం చేయాలనే ప్రయత్నం చేశాడు. తద్వారా సోషలిజం కోసం సాగే పోరాటాలకు రాజ్యాంగం ఆమోదం సాధించాలనే ప్రయత్నం చేశాడు. రాజ్యాంగ రచనా చరిత్రంటే అంబేద్కర్ ప్రజాస్వామ్యానికీ బ్రాహ్మణ, బనియా, భూస్వామ్య, పెట్టుబడిదారీ దోపిడీ వర్గాల ప్రయోజనాలకీ మధ్య జరిగిన పోరాటాల చరిత్రే. ఒకొక్కసారి అంబేద్కర్ గెలిచిన మేరకు భారత సమాజం హక్కులను అనుభవిస్తుంది. ఓడిపోయిన చోట ఇంకా పోరాడి సాధించుకోవాల్సిన కర్తవ్యాలు మిగిలిపోయాయి. ఈవేళ దేశంలో నడుస్తోన్న పౌరహక్కులు, మానవహక్కులు, స్త్రీ హక్కుల ఉద్యమాలకు పునాదిని మనం ఇక్కడ గమనించవచ్చు. నిజానికి, ప్రగతి వ్యతిరేకుల స్వభావాన్ని రాజ్యాంగ వ్యతిరేక స్వభావంగా చిత్రించడంలో అంబేద్కర్ విజయవంతం అయ్యాడు. ఆయన రాసిన అసలు రాజ్యాంగం "స్టేట్స్ అండ్ మైనారిటీస్"గా అచ్చయిన గ్రంథం. ఆయన దానిని షెడ్యూల్డ్ కులాల సమాఖ్య తరపున ప్రతిపాదించాడు. అందులో కేవలం మైనార్టీల, బలహీన వర్గాల హక్కులకు సంబంధించిన అంశాలతో మాత్రమే కాక ఆరోగ్యవంతమైన దృఢమైన సమసమాజ నిర్మాణానికి కావలసిన ప్రాథమిక నియమాలతో ఆయన దాన్ని నిర్మించారు. మెజారిటీ ద్వారా అధికారంలోకి వచ్చినవారు తమ ప్రయోజనాలు ఏమైనప్పటికీ ప్రతిపాదిత కార్యక్రమాన్ని ఏవిధమైన అడ్డంకులూ లేకుండా అమలు చేసేవిధంగా ఆయన రాజ్యాంగాన్ని రచించాడు.

అయితే దాన్ని కాంగ్రెస్ స్వీకరించలేదు. అసలు అంబేద్కర్‌ను రాజ్యాంగ రచనా సభలోకి ఎర్రతివాచీ పరచి ఆహ్వానించారనే భ్రమ చాలామందికి వుంది. అయితే అది పెద్ద పోరాట క్రమం. అంబేద్కర్‌ను రాజ్యాంగ రచనా సభలోకి ప్రవేశించనియ్యకుండా కాంగ్రెస్, గాంధీలు తీవ్రంగా ప్రయత్నం చేశారు. బెంగాల్ ప్రొవిన్షియల్ అసెంబ్లీ నుండి పోటీచేస్తున్న అంబేద్కర్‌ను ఓడించడానికి వారు సకల ప్రయత్నం చేశారు. అయితే నామశూద్రులు, ముస్లింలీగ్ మద్దతుతో అంబేద్కర్ ఎన్నికయ్యాడు. రౌండ్ టేబుల్ సమావేశాల్లోనూ, ఖోటీ వతన్ వ్యతిరేక పోరాటాల

సమయాల్లోనూ, వైస్‌రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ లేబర్ సభ్యుడిగానూ అంబేద్కర్‌తో ఎంతో తలనొప్పి తెచ్చుకొన్న పాలక వర్గాలు అంబేద్కర్‌ను నిలవరించడానికి చేసిన ప్రయత్నాలు విఫలంకాగా మెజారిటీ సభ్యుల్ని తమకు అనుకూలమైన వాళ్ళను ఎన్నికచేసుకున్నారు. హక్కులను మింగేసే అనేక సూత్రాలను చేర్చారు.

"నేను రాజ్యాంగాన్ని రాశానని నా మిత్రులంటున్నారు. కానీ దాన్ని తగులబెట్టే వాళ్ళలో మొదటి వాడిని నేనే, ఇది ఎంత మాత్రమూ నా శరీరానికి సరిపడదు" అన్నాడు అంబేద్కర్. రాజ్యాంగంలో వున్న అనేక అంశాలను ఆయన వ్యతిరేకించాడు. ముఖ్యంగా ఆస్తి హక్కును విపరీతంగా అసహ్యించుకున్నాడు.

అయితే అంబేద్కర్‌ను రాజ్యాంగ నిర్మాతగానే ప్రజలు గుర్తించాలనీ, ఆయన ఏంరాశాడో, రాజ్యాంగంలోని అనేక అంశాలను ఎలా వ్యతిరేకించాడో ప్రజలకు తెలయనివ్వకుండా

## 'బ్రిటీష్ వారు మనకేమీ చేయలేదు'

**- డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్**

"బ్రిటీష్ వారు మనదేశానికి రాకముందు అంటరానితనం వలన మీరు పరమ దారుణమైన పరిస్థితుల్లో జీవించేవారు. మీ అస్పృశ్యత పరిస్థితిని నిర్మూలించడానికి బ్రిటీష్ వారేమైనా చేశారా? బ్రిటీష్‌వారు రాకముందు గ్రామాల్లో మీరు నీరు వాడుకొనే పరిస్థితి ఉండేది కాదు. బ్రిటీష్‌వారు మీకు బావులపైన హక్కునేమైనా ఇచ్చారా? బ్రిటీష్‌వారు రాకముందు మీకు దేవాలయప్రవేశం నిషిద్ధం. ఇప్పుడు దేవాలయాల్లోకి వెళ్ళగలుగుతున్నారా? బ్రిటీష్‌వారు రాకముందు పోలీస్ విభాగంలో మిమ్మల్ని చేర్చుకొనే వారు కాదు. ఇప్పుడు చేర్చుకుంటున్నారా? మహాశయులారా! ఈ ప్రశ్నల్లో దేనికీ మీరు అవునని చెప్పలేరు. దేశంలో ఇంతకాలం అధికారాన్ని హస్తగతం చేసుకొన్నవాళ్ళు ఎంతో కొంత మేలు చేసి వుండాలి. కానీ మీ పరిస్థితిలో మాత్రం మార్పు రాలేదు. మీ విషయం వరకూ బ్రిటీష్‌వారు యధాతథంగా స్వీకరించి ఎటువంటి మార్పులూ లేకుండా భద్రపరిచారు. ఒక చైనా దర్జీకి చిరిగిపోయిన ఒక పాతకోటు ఇస్తే, దానిని చిరుగులతో, అతుకులతో ఎంత పవిత్రంగా దాచిపెడతాడో అలా మీ పరిస్థితిని బ్రిటీష్‌వారు ఏ మార్పులూ లేకుండా కాపాడారు. మీరు ఎదుర్కొనే అన్ని సమస్యలూ, అవలక్షణాలూ అలాగే వుండిపోయాయి. ఏమాత్రం సవరణకూ, దిద్దుబాటుకూ గురికాలేదు.

(1930 ఆగస్టులో అంబేద్కర్ చేసిన అఖిల భారత అణగారిన వర్గాల మహాసభ అధ్యక్షోపన్యాసం నుండి)

దాచివుంచే కుట్రలను పాలక వర్గం చేసింది. ఆ కుట్రలకు మనమూ బలైపోతే ఎలా?

స్టేట్స్ అండ్ మైనారిటీస్ ఆయన అసలు రాజ్యాంగం. అందులో ఆయన భూమిని జాతీయం చేసి సోవియట్ రష్యా తరహాలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను అమలు చేయాలని అన్ని కీలకమైన పరిశ్రమలనూ జాతీయం చేయాలనీ, సమానత్వం సామాజిక న్యాయం పునాదిగా స్వయం ఆధారిత ఆర్థికాభివృద్ధిని సాధించి, సంపదనూ, ఆదాయాన్ని, సమానంగా పంపిణీ చేయాలని, ఒక మనిషికి ఒకే విలువ వుండాలని ప్రతిపాదించాడు.

ఈ అంశాలు వెంకటరాం గారికి స్టేట్ క్యాపిటలిజంగానూ, ఇవి ప్రతిపాదించిన అంబేద్కర్ బూర్జువా ఏజంట్ గానూ కనిపించం విడ్డూరం. నిజానికి చైనాలో విప్లవం విజయవంతం అయిన తరువాత కామ్రేడ్ మావో కొద్దిపాటి మార్పులతో తన శైలిలో పై కార్యక్రమాన్నే అమలు చేశాడన్న వాస్తవం చైనా చరిత్రను పరిశీలించిన వారెవరికైనా అర్థం అవుతుంది. చైనా విప్లవానికి ముందే అంబేద్కర్ ఈ విషయాలను ప్రతిపాదించడం నిజం కాదా.

అంబేద్కర్ దళారీ బూర్జువాలకు తొత్తుగా వ్యవహరించాడని చెప్తూ అందుకు ఉదాహరణగా నెహ్రూ మంత్రివర్గంలో ఆయన చేరడమూ, తెలంగాణా ప్రజల్ని నెహ్రూ సైన్యాలు చిత్రహింసలు పెడుతున్నప్పుడు కాక, హిందూ కోడ్ బిల్లు వీగిపోయినప్పుడు రాజీనామా చేయడాన్ని ఆయన ఆక్షేపిస్తున్నారు. నిజంగా ఒక గర్వపడే విషయాన్ని ఉద్దేశాలు తలకిందులైతే ఎంత గర్హనీయమైన అంశంగా చిత్రించవచ్చో దీని ద్వారా అర్థమవుతోంది. అంబేద్కర్ హిందూకోడ్ బిల్లు విషయంలో కాక మరో దుర్మార్గ సందర్భంలో రాజీనామా చేసివుంటే తాను ప్రవేశపెట్టిన బిల్లు వీగిపోయినా ఆయన రాజీనామా చేయలేదన్న విమర్శ వచ్చేది. న్యాయశాఖ మంత్రిగా అంబేద్కర్ తాను చేయదలచుకున్నది చేసే ప్రయత్నాలు చేశాడు. కుదరనప్పుడు రాజీనామా చేశాడు. అంబేద్కర్ తన రాజీనామా ప్రకటనలో స్త్రీల, దళితుల, వెనుకబడిన తరగతుల, మైనార్టీల హక్కుల్ని దుర్మార్గంగా హరించివేసే పరిస్థితులకు నిరసనగా తాను రాజీనామా చేస్తున్నట్లు స్పష్టంగా ప్రకటించాడు. తెలంగాణా పోరాట సమయంలో జరిగిన అకృత్యాలపై నిరసన తెలియజేయడానికి, ఆయన రాజీనామా చేసిన స్ఫూర్తికి విభేధంలేదు. నిజానికి తెలంగాణ రైతు కూలీ పోరాటం ప్రభావం అంబేద్కర్ మీదా. అంబేద్కర్ ప్రభావం తెలంగాణా మీద ఉంది. ఈ విషయం దళితేతరులైన బహదూర్ గౌడ్, డాక్టర్ జయసూర్య వంటి కమ్యూనిస్టు నాయకుల రచనల్లో కనిపిస్తుంది. అంతకుముందే భాగ్యరెడ్డి వర్మ నాయకత్వంలో జరిగిన దళితపోరాటాల ప్రభావం తెలంగాణ మీద ఉంది. అంబేద్కర్, అసలు నెహ్రూ మంత్రివర్గంలో ఎందుకు చేరాడన్నది వెంకటరాం ప్రశ్న. అంబేద్కర్ ఉద్దేశాలు స్పష్టమే. కానీ ఆయన దళారీ బూర్జువాలను ఆశ్రయించారంటారు వెంకటరాం

గారు. అంబేద్కర్‌కు భారత పాలకవర్గాల దళారీ స్వభావం, కౌటిల్య స్వభావం స్పష్టంగా తెలుసు. స్వతంత్ర భారతంలో దళిత బహుజన జాతులు పాలితులుగా కాక పాలకులుగా వుండాలని ఆయన ప్రకటించాడు. రాజ్యాధికారం లేకుండా ఏమీ సాధించలేరన్న వాస్తవాన్ని ఆయన స్పష్టం చేశాడు.

ఈ ప్రయత్నాల్ని, ప్రజల్లో పెరుగుతున్న రాజ్యాధికార స్పృహను నిర్వీర్యం చేయడానికి భారత పాలక వర్గాలు దళిత బహుజన కులాల మధ్య అంతఃకలహాలు సృష్టించే ప్రయత్నం చేసి కులాల మధ్య అపనమ్మకాలనూ, పోటీలను సృష్టించాయి. ఈ నేపథ్యంలో తాను బతికున్న కాలంలో బహుజన జాతులకు సాధించగలిగినన్ని అవకాశాలను, సదుపాయాలను సాధించడానికి అంబేద్కర్ సిద్ధపడ్డారు. ఏ విప్లవమూ రాత్రికి రాత్రే విజయవంతం కాదనీ, అదొక సుదీర్ఘ పోరాటక్రమమని అంబేద్కర్‌కు తెలుసు. అందుకు 'బోధించు, సమీకరించు, పోరాడు, అన్న నినాదాలను ఇచ్చాడు. జన చైనా విప్లవ విజయానంతరం కామ్రేడ్ మావో కూడా ఈ సూత్రాలనే అనుసరించాడు. అయినా సరే నెహ్రూతో అంబేద్కర్ కలవడం తప్పేనంటే, సరే అంబేద్కర్ అంటరాని వెనుకబడినవాడు కాబట్టి కాసేపు చర్చకోసం ఆయనకు భ్రమలున్నాయనుకుందాం. దళారీ బూర్జువా ప్రతినిధి నెహ్రూతో కలసి జనచైనా ప్రథమ ప్రధాని కామ్రేడ్ చౌ–ఎన్–లై ఏ భ్రమలకు లోనై ఉంటాడంటారు వెంకట్రాం గారు? చౌఎన్–లై విప్లవ స్ఫూర్తిని దళితులెవ్వరూ శంకించరు. స్టాలిన్ కూడా నెహ్రూతో స్నేహ సౌహార్ధ సంబంధాలను కొనసాగించాడు. వీర తెలంగాణాకు సంబంధించి వారిద్దరి మధ్యనా చర్చలు కూడా జరిగాయి. అట్టని నెహ్రూ మీద స్టాలిన్‌కు భ్రమలున్నాయనుకోవాలా? అంబేద్కర్ పదవిలో వున్నప్పుడూ కాంగ్రెస్, నెహ్రూ విధానాలను దుయ్యబడుతూనే వున్నాడు.

ఇకపోతే అంబేద్కర్ బౌద్ధ ధర్మ స్వీకరణ, 'చైనా బౌద్ధ భూస్వాములూ 'దలైలామాల మలమూత్రాల ప్రసాదాల' ప్రస్తావన చేశారు వెంకటరాం గారు. వాటికీ, అంబేద్కర్ బౌద్ధానికీ ఏమిటి సంబంధం? బౌద్ధం పేరుతో చెలామణి అయ్యే అన్ని భావవాదాలను అంబేద్కర్ తిరస్కరించాడు. హెగేల్ గతి తర్కం నుండీ, ఫ్యూయర్‌బా భౌతిక వాదం నుండీ మార్క్సిజం అభివృద్ధి చెందింది. ఇది రెండు వందల ఏళ్ళ నాటి మాట. కానీ భారత దేశంలో రెండు వేల సంవత్సరాల పూర్వమే బౌద్ధం గతితర్కాన్ని, భౌతిక వాదాన్నీ అభివృద్ధి చేసింది. బౌద్ధంలోనే రెండు శాఖలుగా వున్న హీనయానం, మహాయానంల మధ్య హెగెల్ తరహా గతితార్కిక భావవాదం, యాంత్రిక భౌతికవాదాల సంఘర్షణ జరిగింది. అంబేద్కర్ హీనయాన బౌద్ధ భౌతిక వాదాన్ని, మార్క్స్ చారిత్రక దృక్పథాన్ని స్వీకరించి విప్లవ బౌద్ధాన్ని ఆవిష్కరించాడు. అదే అంబేద్కరిజం. అది కామ్రేడ్ మావో చైనాలో ప్రతిపాదించిన సాంస్కృతిక విప్లవం వంటిది.

అంబేద్కర్ బౌద్ధానికి పునాది దేవుడు కాదు, నీతి. మొత్తం సామాజిక శక్తులన్నీ సామాజికోద్యమంలో పాల్గొనాలనీ, లేదా బాధ్యతల్లో వున్న పొలిట్ బ్యూరోనో, బిక్కు సంఘమో పెత్తందారీ ధోరణులకు గురవుతుందని అంబేద్కర్ చెప్పారు. చైనాలో మావో అధికార పీఠాలను బద్దలు కొట్టండని ఇచ్చిన పిలుపులాంటిదిది. ఆయన ఏ పెత్తందారీ ధోరణులూ లేని ప్రజాస్వామిక కమ్యూనిజాన్ని ఆకాంక్షించారు. బౌద్ధం కేవలం అహింసను మాత్రమే ప్రోత్సహిస్తుంది కాబట్టి దుర్మార్గమైన పరిస్థితుల ముందు ఆత్మహత్యా సదృశ్యమైన అహింస నిలవజాలదని చాలామంది భావించారు. బౌద్ధ అహింస అంబేద్కర్ అహింసలు, గాంధీ అహింస వంటివి కాదు. నేను అహింసను ప్రబోధిస్తున్న మాట నిజమే. అయితే అది సంత్ తుకారాం ప్రబోధించిన అహింస. అందులో అహింసగా వుండడం, దుర్మార్గమైన పరిస్థితులను నిర్మూలించడం అన్న రెండు విషయాలున్నాయి అన్నాడు అంబేద్కర్. ఇతరుల మీద తాను దాడి చేయకుండా తన క్రౌర్యం మీద తాను పోరాటం ప్రకటించుకోవడమూ, తన మీదకు దాడికి వచ్చే దుర్మార్గపు శక్తులను నిర్మూలించే పోరాటం చెయ్యడమూ అనే రెండంశాలు ఇందులో వున్నాయి. చారిత్రాత్మకమైన మహద్ చెరువు పోరాటాన్ని ప్రారంభించే ముందు అంబేద్కర్ ఇదే అభిప్రాయాన్ని చెప్పారు. మేం ఈ పోరాటం శాంతియుతంగా సాగిపోవాలని కోరుకుంటున్నాం. అది అగ్రవర్ణాల వారి ప్రతిస్పందన మీద ఆధారపడి వుంటుంది. హింసాయుత మార్గంలోకి వెళ్ళితే అందుకు బాధ్యులు హింసాత్మక పాలక పక్షాలేనని అంబేద్కర్ చెప్పారు. ఇది కమ్యూనిస్టులు చెప్పే ప్రతిహింస వంటిది. పోతే ఆఖరి విషయం. వెంకటరాంగారు కులం ఉపరితల అంశం కాబట్టి పునాది మారితే ఉపరితలం మారిపోతుందని అన్నారు. ఇదే అసలు చర్చ. వెంకటరాం గారి వాదన ప్రకారం కులం అనేది భూస్వామ్య ఉత్పత్తి సంబంధాల పునాది నుండి పుట్టిన ఉపరితలం అంశం. అంటే అది కేవలం మతపరమైన సాంస్కృతిక అంశం. కేవలం భావాలకు సంబంధించిన అంశం. భూస్వామ్య దోపిడీకి నీడ, దోపిడీ పోతే ఆ నీడ దానంతటదే తొలగిపోతుంది. ఇది చాలామంది సాంప్రదాయ మార్క్సిస్టుల వాదన. అది అబద్ధం కాదు. అయితే అర్ధసత్యం మాత్రమే. కులానికి రెండు లక్షణాలున్నాయి. వెంకటరాం గారు, ఇతర కమ్యూనిస్టులూ చెప్తున్నట్టుగా కులం అస్పృశ్యతకూ వివక్షకూ దారితీసే మత సంబంధమైన సాంస్కృతిక అంశం. అదే సమయంలో ఉత్పత్తి శక్తులను శాశ్వతంగా విభజించే ఆర్థిక అంశం. మొదటి అంశాన్ని గుర్తించిన కమ్యూనిస్టులు, రెండవ అంశాన్ని గుర్తించడానికి నిరాకరిస్తున్నారు. కులం శ్రమవిభజన మాత్రమే కాక శ్రామికుల విభజన కూడా అని అంబేద్కర్ స్పష్టంగా చెప్పారు.

మనం చెప్పుకున్న మొదటి లక్షణం ఉపరితల సంబంధమైనదయితే రెండవ లక్షణం పునాదికి సంబందించింది. పునాది నుండి ఉపరితలానికి, ఉపరితలం నుండి పునాదికి విస్తరించి ఘనీభవించిన ప్రత్యేక అంశం కులం. ఏక కాలంలో పునాది ఉపరితలాల మీద

పోరాటం జరగకుండా భారతసమాజంలో వుత్పత్తి శక్తుల అభివృద్ధి జరగదు. ఉత్పత్తి సంబంధాలకూ, ఉత్పత్తి శక్తులకూ మధ్య ఘర్షణ తీవ్ర స్థాయికి పెరుగుతున్నప్పటికీ, సంఘటిత ఉత్పత్తి శక్తుల గుణాత్మక పరిణామానికి కులం అడ్డుగా నిలుస్తోంది. దాన్ని బద్దలు కొట్టకుండా ఉత్పత్తి శక్తుల్ని అభివృద్ధి పర్చలేరు. మీరెటువైపు తిరిగినా ఎదురయ్యే పెనుభూతం కులం అని అంబేద్కర్ పేర్కొన్నారు. అయితే ఆసక్తికరంగా ఈ అంశాన్ని వివేకానందుడూ, గాంధీ, అంబేద్కర్‌లు అందుకున్నారు. వారి వారి ప్రాపంచిక దృక్పథాలను బట్టి వారి పరిష్కారాలను సూచించారు. గాంధీ హరిజన ఉద్ధరణ అన్నాడు. వివేకానందుడు ఆధ్యాత్మిక సమానత్వం అన్నాడు. అంబేద్కర్ కులంతో ఎటువంటి రాజీపడకుండా కుల నిర్మూలనను ప్రతిపాదించాడు. వివేకానందుడు, గాంధీలు కూడా గుర్తించిన కుల వాస్తవికతలను భారతీయ కమ్యూనిస్టులు ఎందుకు గుర్తించలేకపోయారన్నది తేలాల్సిందే. దళిత ఉద్యమ కారుల భాషలో 'అగ్రకుల స్వభావం' అనకపోయినా కమ్యూనిస్టు భాషలో మధ్యతరగతి బూర్జువా మనస్తత్వం అనవచ్చునేమో. అదే భారత విముక్తి వుద్యమాల్లో కామెడీగా కాక, ట్రాజెడీగా పునరావృతమవుతున్న చరిత్ర. కామ్రేడ్ కారల్ మార్క్స్ ప్రపంచంలో దోపిడీని శాశ్వతంగా నిర్మూలించాలన్నాడు. ఆయన మహోన్నత విప్లవకారుడు. భారతదేశంలో తెల్లదొరల పరిపాలన అంతమొందాలన్నాడు భగత్‌సింగ్. ఆయన విప్లవకారుడు. కోట్లాది జీవితాలను విషాదమయం చేసిన కుల వ్యవస్థ సమూలంగా నిర్మూలన కావాలన్నాడు అంబేద్కర్. ఆయన్ని విప్లవకారుడిగా అంగీకరించడానికి ఏం అడ్డం వస్తోంది? ఒక మనిషికి ఒక ప్రమాణం, మరో మనిషికి మరో ప్రమాణం ఉండే చేతనా క్రమాన్ని ఏమని పిలవాలి?

చివరగా అంబేద్కర్, మార్క్స్‌ల్ని.. డాంగే, ఎం.ఎన్.రాయ్‌లు దూరం చేశారని ఐలయ్య గారనడమూ, అంబేద్కర్ తనకు తానుగా మార్క్స్‌కు దూరమయ్యాడని వెంకటరాం గారనడమూ రెండూ సరైనవి కావు.

"తత్వశాస్త్రం శ్రామిక వర్గానికి చేరి వారి చైతన్యాయుధంగానూ, తత్వశాస్త్రాన్ని అందుకున్న శ్రామికవర్గం దానికి భౌతికాయుధంగానూ మారతారని" మార్క్స్‌అన్నట్లుగా మార్క్స్, అంబేద్కర్‌లు ఇద్దరూ కలిసి కుల, వర్గ నిర్మూలనా పోరాటాల్లో చైతన్యాయుధంగా బహుజన దళిత సమూహాలకు అందుతోనే వున్నారు. వాస్తవిక పరిస్థితుల అంచనాల్లో మన స్వంత అభిరుచుల జోక్యం చేసుకోకూడదు కదా!

**సెప్టెంబర్ 1996 – ఏకలవ్య**

# భారత జర్నలిజానికి వైతాళికుడు డా॥ అంబేడ్కర్

సత్యాలు తెలిసిన మనిషి జ్ఞాన సంపన్నుడవుతాడు. ప్రపంచ పరిణామాల అవగాహనతో మనిషిలో ఇరుకుతనం తొలిగిపోతుంది. దైనందిన సంఘటనలు, వాటికి ఆయా ప్రాంతాల ప్రజల ప్రతిస్పందనలు, దేశ దేశాల్లో అభివృద్ధి చెందుతున్న సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, సాంకేతిక చింతన తదితర అంశాలు తెలుసుకొని మనిషి అస్పష్టతలను తొలగించాడు. అందుకే ప్రజలకు సమాచారం తెలుసుకొనే హక్కు ప్రాథమిక హక్కు. ఆ ప్రాథమిక హక్కును ప్రజలు వినియోగించుకొనేలా చేయడంలో పత్రికారంగం కీలకమైన పాత్ర వహిస్తుంది. ఒక నిర్జీవమైన కాగితపు ముక్కలో మొత్తం సాక్షాత్కరింపజేస్తుంది. ఏ పారిశ్రామికవేత్తో, ఏ రాజకీయ నాయకుడో ఇచ్చిన మందు పార్టీనో, బహుమానాలో కొట్టేసి ఉన్నది లేనట్టుగా, లేనిది ఉన్నట్టుగా రాసే కొందరు పాత్రికేయుల్ని చూసి పాత్రికేయ వృత్తిపైన చిన్న చూపును ఏర్పరచుకోవడం మంచిది కాదు. అత్యవసర పరిస్థితుల్లోనూ, యుద్ధ సమయాల్లోనూ, అట్టడుగున పడి కాన్పించని గాథల్ని వెలుగులోకి తీసుకరావడానికి ప్రాణాలర్పించిన త్యాగమయ సాంప్రదాయం కూడా పాత్రికేయ వృత్తిలో ఉంది.

జర్నలిజం కొన్ని విలువలు భూమికగావున్న వృత్తి. అదొక సామాజిక ఆచరణ. సమాజం నుండి సమాజానికి కట్టిన వంతెన లాంటిది జర్నలిజం. గుండెకూ, గుండెకూ మధ్య అక్షర పక్షులై వారధిని పత్రికా ప్రపంచం నిర్మిస్తుంది. అక్షరాలు పక్షులై మన ముంగిట వాలి వార్తా తరంగాల్ని వినిపిస్తాయి. అయితే పత్రికాధినేతలందరూ అగ్రకుల సంపన్న వర్గాలకు చెందినవారు కావడంతో భారతదేశంలో జర్నలిజం కట్టుబడిన విలువలకూ, యాజమాన్య కులవర్గ ప్రయోజనాలకూ మధ్య ఘర్షణ ఏర్పడడంతో అనివార్యంగా పత్రికలు పెట్టుబడికీ, కట్టుకథకూ పుట్టిన విషపుత్రికలుగానే మిగిలిపోతున్నాయి. ఎవరో కొంతమంది వాస్తవాలను రాసే జర్నలిస్టులు ఉద్యోగాన్ని కాపాడుకోడానికి యాజమాన్యానికి అనుకూలంగా తమ కలాలను అణిచిపెట్టి రాజీపడి బతకడమో, ఉద్యోగాలు కోల్పోవడమో, మనుషులెవరూ మసలని సుదూర ప్రాంతాల్లోకి బదిలీ కావడమో జరిగిపోతూనే వుంది.

డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ పొలిటికల్ సైన్స్‌లో విద్యాభ్యాసం చేస్తుండగానే ఆయన స్కాలర్‌షిప్ ఆగిపోవడంతో 1917లో తిరిగి భారతదేశానికి వచ్చేయాల్సొచ్చింది. బరోడా మహారాజు దగ్గర మిలటరీ కార్యదర్శి ఉద్యోగంలో చేరాడు. అయితే అంటరాని కులంలో పుట్టడం వలన దారుణమైన వివక్షకు గురయ్యాడు. అటెండర్లు, ప్యూన్లు కూడా అంబేడ్కర్‌ను ఎంతగానో అవమానించారు. కొంతమంది పార్శీలు కర్రలతో అంబేడ్కర్ పైన దాడిచేశారు. ఆ సమయంలో బరోడా మహారాజు కూడా అంబేడ్కర్‌ను రక్షించలేకపోయారు. ఆ సమయంలో అంబేడ్కర్ ఒక చెట్టుకింద కూర్చుని భోరున

విలపించారు. ఆ తర్వాత పొలిటికల్ ఎకానమీ ప్రొఫెసర్‌గా చేరాడు. అక్కడా కుల భూతం ఆయన్ని వెంటాడి వేధించింది. ఆ సమయంలో బొంబాయిలోని టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికకు హోమ్‌రూల్ గురించి ఒక లేఖ రాశారు. స్వయం పరిపాలన అనేది ఒక బ్రాహ్మణుడికి ఎంత అవసరమో ఒక మహర్‌కు కూడా అంతే అవసరమనీ, కాబట్టి అభివృద్ధి చెందిన వర్గాలవారు విధిగా అట్టడుగు వర్గాల వారిని చైతన్యవంతుల్ని చేయడానికి, పైకి తీసుకురావడానికి కృషిచేయాలనీ, అలా జరగనప్పుడు స్వతంత్రం వచ్చినా దానివలన అశేష ప్రజానీకానికి ఏ మాత్రం ఉపయోగంలేదని ఆయన పేర్కొన్నారు. ఆ కాలంలోనే పత్రికలన్నీ బ్రాహ్మణులతో నిండిపోయి, బ్రాహ్మణ వాద ప్రయోజనాలను కాపాడడంలో నిమగ్నమైనాయి. ఏ ఒక్క పత్రిక కూడా అస్పృశ్యుల పక్షాన నిలవడానికి సుముఖంగా లేవు. అంబేద్కర్ 1920లో పాత్రికేయుడిగా రంగ ప్రవేశం చేశారు. ఆయన పత్రికారంగ ప్రవేశం చేయడంలో రెండు అంశాలున్నాయి. అణగారిన జనాలకు గొంతుకనివ్వడం ఒక అంశమైతే, అసలైన పాత్రికేయ విలువలనూ, పత్రికారంగం కట్టుబడి వుండవలసిన సామాజిక నియమాలనూ పరిరక్షించి అభివృద్ధి పర్చడం రెండవ అంశం. పత్రికా స్వతంత్రంకోసం డాక్టర్ అంబేద్కర్ ఎంతగానో కృషి చేశారు. దాన్నొక ప్రాథమిక హక్కుగా రాజ్యాంగంలోని 19(1) ఆర్టికల్‌లో పొందుపర్చారు. తద్వారా ఈనాటి జర్నలిస్టుల స్వేచ్ఛా స్వతంత్రాలకు జీవం పోశాడు.

అట్టడుగు వర్గాల ఏకైక ప్రతినిధిగా పాత్రికేయ రంగంలో అడుగుపెట్టిన అంబేద్కర్ 1920 జనవరి 31వ తేదీన మూక్‌నాయక్ పత్రికను ప్రారంభించారు. పత్రిక మొట్టమొదటి సంచికలోనే భారత సమాజంలో దుర్మార్గంగా కొనసాగుతున్న అసమానతల గురించీ, హిందూ సమాజ నిర్మాణం గురించీ, దుర్భర దారిద్ర్యం గురించి సవివరంగా ఆయన రాశారు. జ్ఞానం, అధికారం పైన బ్రాహ్మణ గుత్తాధిపత్యాన్ని ఆయన ప్రశ్నించారు. సమాజంలో ఘర్షణలున్నప్పుడు ఒక అన్యాయం సామాజిక న్యాయాన్ని కబళిస్తున్నప్పుడు పత్రికా ప్రపంచం న్యాయం వైపు నిలబడాలని ఆయన ప్రబోధించారు.

మూక్ నాయక్, బహిష్కృత భారత్, జనత పత్రికలద్వారా అసలు పాత్రికేయ రంగం ఏ విధంగా వుండాలో ఆచరించి చూపారు అంబేద్కర్. సామాజిక విప్లవ జర్నలిజాన్ని భారతదేశంలో వ్యవస్థీకరించినవాడు బి.ఆర్. అంబేద్కర్. అయితే భారత పత్రికా చరిత్రకారులు పత్రికారంగానికి అంబేద్కర్ చేసిన కృషిని ఎక్కువగా చర్చించలేదు.

పాత్రికేయులంటే అక్షర గుమాస్తాలు కాదనీ, పాత్రికేయులంటే దేనికీ భయపడకుండా నిజాన్ని నిజంలాగా రాసేవారనీ ఆయన ఆచరించి చూపించారు. పాత్రికేయుల వెన్ను విరిచి ఆత్మగౌరవాన్ని నాశనం చేసే విధంగా తయారైన పత్రికాధిపతుల గుత్తాధిపత్యాన్ని ఆయన తీవ్రంగా నిరసించారు. అందుకోసం ప్రత్యామ్నాయంగా చిన్న పత్రికలను ఒక

ఉద్యమంగా ఆయన నడిపారు. ఆయన జీవించిన కాలంలోనూ, మరణానంతరం చిన్న పత్రికల ఉద్యమం నడిచింది. దేశంలో, ముఖ్యంగా మహారాష్ట్రలో చిన్న పత్రికల ఉద్యమం ఒక బలమైన ధోరణిగా నడవడానికి అంబేద్కర్ ప్రభావమే కారణం. అంబేద్కర్ స్ఫూర్తితో నడచిన దళిత పాంథర్స్ ఉద్యమం ఎన్నో చిన్న చిన్న పత్రికలను నడిపి ఎంతమందినో ఉత్తమ జర్నలిస్టులుగా తీర్చిదిద్దింది. నిజాన్ని నిర్భయంగా రాయడం, రాసినదానికి కట్టుబడి ఉండడం, అందుకోసం తయారయ్యే ఏ అవరోధాన్నైనా ధైర్యంగా ఎదుర్కొనడం భారత దేశంలో జర్నలిస్టు వృత్తికి అంబేద్కర్ నేర్పిన పాఠాలే. అంబేద్కర్ జర్నలిజాన్ని ప్రజాపరం చేయడానికి, ప్రజల జీవన గమనంలో ఒక విడదీయరాని అంశంగా దాన్ని మలచడానికి తీవ్రంగా కృషిచేశారు.

"భారతదేశంలో జర్నలిజం ఒక వృత్తిగా వుండేది. ఇప్పుడది వ్యాపారమయ్యింది. ఇప్పుడు దానికి నైతిక విలువలేం లేవు. జర్నలిజం కూడా సరుకుల తయారీగా మారిపోయింది. ప్రజలకు సంబంధించిన బాధ్యతలనూ, జనాభిప్రాయ రూపకల్పనలో తన కీలకమైన పాత్రనూ భారత జర్నలిజం విడనాడింది. ఎటువంటి పక్షపాతం లేకుండా వార్తను ప్రచురించడం, ప్రజా ప్రయోజనాలను ప్రతిబింబించే విధానాలను సరైన ధృక్కోణంలో ఆవిష్కరించడం, ఎటువంటి వత్తిళ్ళకూ లొంగకుండా, ఎంత గొప్ప వ్యక్తైనా అతని చెడును చూపించగలడమనేది జర్నలిజం ప్రాధమిక కర్తవ్యం. కానీ ఈనాడు నాయకులను ఆరాధించడం జర్నలిజం ప్రాధమిక కర్తవ్యంగా మారిపోయింది. తద్వారా సంచలనం సృష్టించే వ్రాతలకు, నిర్హేతుకమైన ఆకర్షణలకు హేతుబద్ధత కల్పించడం, బాధ్యతారహితమైన అనుభవాలకు ప్రతిస్పందించవలసిందిగా బాధ్యత కల్గిన వ్యక్తులను ప్రేరేపించడం ఈనాడు దాని వృత్తి. బ్రిటన్‌లోని నార్త్‌క్లిఫ్ జర్నలిజాన్ని శాలిస్‌బరీ వ్యాఖ్యానిస్తూ ఆ పత్రికలో పనిచేసేవారి కోసం ఆ పత్రికవారే రాసుకుంటారు" అన్నారు. భారతీయ జర్నలిజం అంతకంటే రెండాకులే ఎక్కువ చదివింది. అది కాకారాయుళ్ళకూ, వారి నాయకులకూ బాకాలూదే విధంగా తయారయ్యింది. దానికి మినహాయింపులు కూడా వున్నాయని నేను సగర్వంగా చెప్పగలను కానీ అది ఎవరికీ కన్పించకుండా, విన్పించకుండా వుండిపోయింది." (రెనడే, గాంధీ, జిన్నా) అని ఎంతో ఆవేదనగా అంబేద్కర్ పత్రికా ప్రపంచం గురించి వ్యాఖ్యానించారు. ఈ మాటలు చెప్పడం ద్వారా ఆయన పత్రికారంగం ఏ విధంగా ఉండకూడదో వివరించారు. జర్నలిజంలో అంబేద్కర్ సృష్టించిన ప్రమాణాలు ఈనాటి పాత్రికేయులకు ఎంతో అనుసరణీయాలు. అంబేద్కర్ వెలిగించిన బాటలో పాత్రికేయులు సత్యశోధకులుగా, నిజం కోసం దేనితోనైనా పోరాడగలిగే కలం యోధులుగా తయారవ్వాలి. పత్రికలపైన విరుచుకుపడే నల్ల చట్టాలకు వ్యతిరేకంగా అంబేద్కర్ ప్రజాస్వామిక విప్లవాచరణ పత్రికా ప్రపంచానికి ఆదర్శంకావాలి.

**దళిత రాజ్యం సౌజన్యంతో**

**బహుజన కెరటాలులో పునర్ముద్రితం**

# ఒక్క దళితులకే కాదు మొత్తం దేశానికే ఇవాళ్టి అవసరం అంబేద్కర్

**డా॥ బి.ఆర్. అంబేద్కర్ నివాసం, న్యూఢిల్లీ, డిసెంబర్ 6,1956**

**యింట్లో అన్ని పనులూ చూసే నౌకరు కాఫీ కప్పుతో బాబాసాహెబ్ గదిలో అడుగుపెట్టాడు. మహా విద్యుత్తులు ప్రసరించిన శరీరం. మహా జ్ఞాన విద్వత్తులు ప్రవచించిన శరీరం. మానవతా పరిమళాలను వెదజల్లిన శరీరం. బతుకంతా నిరంతరం అవిశ్రాంతంగా పరిశ్రమించిన శరీరం. ఒక శాశ్వత విశ్రాంతిలోకి ఒరిగిపోయినట్లుగా పడక మీద నిశ్చలంగా పడివుంది. 'బాబాసాహెబ్' అన్న గావుకేకతో ఆ నీరవ భవనం ఉలిక్కిపడి నిద్రలేచింది. శోకాలూ, అంగలార్పులతో ఆ ప్రత్యూష పవనాలు విషాద వాయులీనాలను మోసుకు పోయాయి.**

"ఈ రోజు తెల్లవారుజామున 3 గంటలకు డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ శాశ్వతంగా కన్నుమూశారు" అని ఆలిండియా రేడియో ప్రత్యేక ప్రసారం ద్వారా తట్టుకోలేని దారుణమైన వార్తను దేశమంతటికీ తెలియజేసింది. షోలాపూర్ పట్టణంలో సైకిళ్ళమీద కాలేజీకి వెళ్తూ ఈ వార్త విన్న యిద్దరు విద్యార్థులు స్పృహ తప్పి కింద పడిపోయారు. నాగపూర్, పూనా, షోలాపూర్, బొంబాయి పట్టణాలలో జనం లక్షలాదిమంది వీధుల్లో పరుగులు పెడుతూ కన్పించిన వారిని కౌగలించుకుని భోరున ఏడ్చారు. ఒక దిక్కుతోచని నిస్సహాయ నిట్టూర్పులతో వీధులు వేడెక్కాయి. అంబేద్కర్ మరణవార్త విన్నవెంటనే ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ, తంతి, తపాలా, రవాణాశాఖల మంత్రి జగజ్జీవన్‌రామ్‌లు హుటాహుటిన వచ్చారు. మదిలో ఏమేం తలపులు మెదిలాయో కానీ జగజ్జీవన్‌రామ్ దుఃఖం ఆపుకోలేక భోరున ఏడ్చేశాడు. అంబేద్కర్ భౌతికకాయాన్ని బొంబాయి తరలించడానికి ఏర్పాట్లు చేశారు. అప్పటికే ఉత్తర ప్రదేశ్, పంజాబ్, హర్యానా, ఢిల్లీ ప్రాంతాల నుండి వేలాదిమంది నిమ్న జాతీయులు అక్కడికి చేరుకున్నారు. ఆలీపూర్ రోడ్డు గుండా కిటకిటలాడే ఊరేగింపులో అంబేద్కర్ మృతదేహం విమానాశ్రయం చేరుకుంది.

**రాజగృహ (దాదర్), బొంబాయి, డిసెంబర్ 7,1956:**

అంబేద్కర్ భౌతిక కాయాన్ని ఒక పడక మీదుంచారు. కుడివైపున బుద్ధుడి విగ్రహాన్నుంచారు. యింటిలోపలా, బయటా రోడ్ల మీద లక్షలాదిమంది జనం. దిక్కుతోచక దుఃఖిస్తూ తండోపతండాలుగా జనం. మధ్యాహ్నం 1:30 గంటలకు బయలుదేరిన అంతిమయాత్ర దాదర్ నుండి చౌపట్టి చేరడానికి నాలుగు గంటలు పట్టింది. బౌద్ధ భిక్షువు భదంత్ ఆనంద కౌసల్యాయన్ త్రిశరణ పారాయణం చేస్తుండగా అంబేద్కర్ కుమారుడు

యశ్వంతరావు తలకొరివి పెట్టాడు. అంబేద్కర్ శరీరానికి నిప్పంటుకోవడం చూసి తట్టుకోలేక వేలాది మంది స్త్రీలు మూర్ఛ పోయారు.

చనిపోవడానికి కొన్ని రోజులు ముందు నుండీ అంబేద్కర్ బౌద్ధ దీక్షకు జనాన్ని సన్నద్ధం చేసే పనిలో నిమగ్నమయ్యారు. అక్టోబర్ 14 నాగపూర్‌లో తన లక్షలాది మంది అనుచరులతో స్వయంగా బౌద్ధాన్ని స్వీకరించిన అనంతరం డిసెంబర్ 14వ తేదీన బొంబాయిలో లక్షలాది మంది అనుచరులతో బౌద్ధ దీక్షను స్వీకరింపజేయాలని సర్వసన్నాహాలు చేస్తున్నారు. డిసెంబరు ఒకటవ తేదీన ఢిల్లీలోని మధురా రోడ్డులోని బౌద్ధ మ్యూజియంకు వెళ్ళివచ్చారు. డిసెంబర్ రెండవ తేదీన దలైలామా గౌరవార్థం ఢిల్లీలోని అశోకా హాలులో జరిగిన సన్మాన సభకు హాజరయ్యారు. డిసెంబర్ నాల్గవ తేదీన తాను అంతకుముందే రాసిన 'బుద్ధ అండ్ కారల్ మార్క్స్' అనే సిద్ధాంత గ్రంధానికి తుదిమెరుగులు దిద్దారు. అదేరోజు రాత్రి 'బుద్ధ అండ్ హిజ్ ధమ్మ' అనే గ్రంధానికి పరిచయవాక్యాలు రాశారు. ఐదవ తేదీన బొంబాయి వెళ్ళడానికి ప్రయాణ ఏర్పాట్లు చేసుకోవడం, దేశంలోని వివిధ ప్రాంతాల్లో బౌద్ధారామాల నిర్వాహకులతో ఫోన్‌లో సుదీర్ఘమైన సంభాషణలు చేశారు. ఆ రోజు సాయంత్రం తాను కొత్తగా నిర్మించబోయే రిపబ్లికన్ పార్టీలో చేరవలసిందిగా ఎస్.యం. జోషి, జి.కె. ఆత్రే వంటి మహారాష్ట్ర నాయకులకు లేఖలు రాశారు. లైబ్రరీ నుండి కొన్ని పుస్తకాలు తీయించి తన రీడింగ్ టేబుల్‌పైన ఉంచుకున్నారు. రాత్రి పన్నెండు దాటేవరకూ ఏదో చదువుతూనో, రాస్తూనో అంబేద్కర్ గడిపారని నౌకరు చెప్పాడు. శాశ్వతంగా కన్నుమూయబోయే సమయానికి ఒకటి రెండు గంటల ముందు వరకూ కూడా జాతి గురించీ, దేశం గురించీ ఆలోచిస్తూ, రాస్తూ, బోధిస్తూ, వాదిస్తూ, తగవుపడుతూ, ఖండిస్తూ, మెలకువతో జీవించిన అంబేద్కర్ ఆరవతేదీన మరణించారు. 14వ తేదీన దీక్ష కార్యక్రమం జరగవలసి వుంది. అప్పుడు రావలసిన జనమంతా ఏడవ తేదీకి వచ్చేశారు. దాంతో అంబేద్కర్ ముఖ్య సహచరుడు బి.కె. గైక్వాడ్ అంబేద్కర్ అంతిమ యాత్రకు వచ్చిన జనాన్ని ఉద్దేశించి "ఈ రోజే ఇక్కడ బౌద్ధ దీక్షను స్వీకరించడానికి ఎంత మంది సిద్ధంగా వున్నారు?" అని అడిగినపుడు లక్షలాదిమంది జనం చేతులెత్తి తమ సమ్మతిని తెలియజేశారు.

చందనపు చెక్కల చితిమంటల మీద దహనం అవుతున్న అంబేద్కర్ పార్థివ దేహం సన్నిధిలో దాదాపు ఐదు లక్షల మంది బౌద్ధధమ్మాన్ని స్వీకరించారు.

**భారతదేశం, డిసెంబర్ 6, 2003 :**

దళిత ప్రపంచంపైన రకరకాల రూపాలలో దుర్మార్గమైన దాడులు, అత్యాచారాలు, అవమానాలు పెచ్చరిల్లిపోయాయి.

హిందూ మతోన్మాదం, రాజ్యం కలగలసి పోయి హిందూ ఫాసిజంగా రూపొందే క్రమం

మొదలైంది. వేలయేళ్ళ క్రితం భారత జాతీయమతమైన బౌద్ధం పైన బ్రాహ్మణవాదం ఎక్కుపెట్టినదాడి ముస్లిం, క్రైస్తవ, శిక్కు, జైన, పార్శీ మతాలకు కూడా విస్తరించింది. దుర్మార్గపు హింస రచనతో హైందవీకరణ జరుగుతుంది.

ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకృత విధానాల పేరుతో విశృంఖల మార్కెట్‌కు తలుపు తెరుచుకున్నాయి. బహుళజాతి కంపెనీలు, ప్రపంచ వాణిజ్య సంస్థ, ఐ.ఎం.ఎఫ్, ప్రపంచ బ్యాంకు తదితర అంతర్జాతీయ సంస్థలు దేశ ఆర్థిక విధానాన్ని శాసించడం మొదలుపెట్టాయి. సంక్షేమంపైనా, సబ్సిడీలపైనా ఉక్కుపాదం విరుచుకుపడింది. ప్రపంచ బ్యాంకు తదితర అంతర్జాతీయ సంస్థల కనుసన్నల్లో మెలిగే కీలుబొమ్మ ప్రభుత్వాలు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ఏర్పడ్డాయి. దేశంలోని అగ్రకుల శక్తులు, సామ్రాజ్యవాద శక్తులు, హిందూ మతోన్మాద శక్తులు మిలాఖతై ఒక భయానకమైన సిండికేట్ ఏర్పడింది. వీరి ప్రయోజనాలకోసమే ప్రభుత్వాలు పనిచేయడం మొదలయ్యింది. ప్రభుత్వ విధానాలను ఈ శక్తులే నిర్ణయించడం మొదలైంది.

ప్రభుత్వ రంగ సంస్థల్ని ప్రైవేటు యాజమాన్యాలకు అప్పజెప్పే ప్రక్రియ మొదలైంది. ప్రైవేటీకరణ ఒక పారిశ్రామిక రంగానికే పరిమితం కాకుండా విద్య, ఆరోగ్యం, మౌలిక సదుపాయాల కల్పన వంటి సేవల రంగానికి కూడా విస్తరించబడింది.

భూ సంస్కరణ చట్టాలకు తూట్లు పొడిచే విధంగా విధానాలను తిరగరాయడం ప్రారంభమయ్యింది. వందలాది, వేలాది ఎకరాలను బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేయడం మొదలైంది. దళితులు, ఆదివాసీలు భూ పరాయీకరణకు గురయ్యారు. వ్యవసాయంలో ప్రపంచీకరణను ప్రవేశపెట్టడంతో వ్యవసాయంలో తీవ్రమైన సంక్షోభం ఏర్పడింది. చేతి వృత్తులు నాశనమయ్యాయి. సన్నకారు, చిన్నకారు, మధ్యతరగతి రైతాంగం పంటలు పండక, పండిన పంటకు ధరలు పలకక రోడ్లు మీద పడవలసిన పరిస్థితి ఏర్పడింది. బతుకుదెరువు వెతుకుంటూ వలసలు వెళ్ళిపోవలసిన పరిస్థితి ఏర్పడింది. లక్షలాదిమంది ప్రజా సమూహాలు పల్లెల్ని వదిలి పట్టణాలకు వలస వెళ్ళిపోయారు. నానాటికీ ఆకలి చావులు పెరిగిపోయాయి. వేలాదిమంది గ్రామీణ దళిత, ఆదివాసీ, బహుజన, మధ్యతరగతి స్త్రీలను వ్యభిచారం రొంపిలోకిదింపే సిండికేట్లు ఏర్పడ్డాయి. స్కాములకు, కుంభకోణాలకూ పాలనా యంత్రాంగంలో వెసులుబాటు దొరికింది. అవినీతి విశ్వరూపం తాండవం చేస్తుంది. చిన్నపాటి నిరసనను కూడా తట్టుకోలేని పాలకవర్గాలు చట్టబద్ధ ఉద్యమాలపైన కూడా దారుణమైన అణచివేతను అమలుచేయడం మొదలైంది. సమ్మె హక్కును కాలరాయడానికి పూర్తిస్థాయి ప్రయత్నాలు జరుగుతున్నాయి. రక్షణ చట్టాలనూ, రాజ్యాంగ అవకాశాలనూ అమలు చేయకుండా రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకమైన విధానాలను అమలుచేయడం మొదలైంది.

అంబేద్కర్ సాధించిన హక్కులు తప్ప ఆయన చనిపోయిన తరువాత 47 సంవత్సరాలలో రూపొందిన దళిత నాయకత్వం ఒక కొత్త హక్కును కూడా సాధించలేకపోయింది. ఈనాడు నెలకొన్న సంక్లిష్ట, సంక్షోభ సమయాన అంబేద్కర్ ఇచ్చిన సమగ్ర విముక్తి వ్యూహాన్ని అమలు చేయలేకపోవడమే కాక, అసలు అర్థం చేసుకోవడంలోనే దళిత నాయకత్వం విఫలమయ్యింది. 'నేను ఇక్కడ వరకూ తీసుకొచ్చిన దళిత చైతన్య రథాన్ని ముందుకు తీసుకుపోవడానికి మీకు చేతకాకపోతే ఇక్కడే ఉంచండి. కానీ వెనక్కి తీసుకుపోకండి' అని బాబాసాహెబ్ దళిత ప్రపంచాన్ని అర్థించాడు. ఇప్పటికి ఎన్ని వేల యోజనాలు వెనక్కి వెళ్ళామో కొలుసుకుంటేగాని తెలియని స్థితి.

ఒక్క మాటలో ప్రజలు గౌరవప్రదంగా జీవించే హక్కు పెనుప్రమాదంలో పడింది.

మరో ప్రపంచం సాధ్యమే అని ప్రపంచ సామాజిక వేదిక (వరల్డ్ సోషల్ ఫోరమ్) నినదించింది. మరో ఆసియా సాధ్యమేనని ఆసియన్ సోషల్ ఫోరమ్, మరో భారత్ సాధ్యమేనని అందులో పాలు పంచుకున్న 'భారతీయ' మిత్రులు నినాదాలిస్తున్నారు. జాతీయోద్యమ కాలంలో 'స్వరాజ్యం' అన్న ప్రసక్తివచ్చినప్పుడు ఎటువంటి స్వరాజ్యం? ఎవరి స్వరాజ్యం?' అని డాక్టర్ అంబేద్కర్ దళితుల పక్షాన ప్రశ్నించారు. యిప్పుడు 'మరో భారత్' అంటే ఎటువంటి భారత్? అన్న ప్రశ్న అడగవలసివుంటుంది. ఎవరి దగ్గరా స్పష్టమైన సమాధానాలను చిత్తశుద్ధితో అన్వేషించదలచుకున్నవాళ్ళు డాక్టర్ అంబేద్కర్ దగ్గరకు రావలసిందే. అంబేద్కర్ దగ్గర 'సర్వరోగ నివారణా మంత్రం' ఏదో వున్నదని కాదు. ఈనాడు నెలకొన్న పరిస్థితులను ఏనాడో పసిగట్టి దానిని ఎదుర్కొనడానికి అవసరమైన విధానాలను దేశం ముందు ప్రతిపాదించిన వాస్తవిక దృష్టి అంబేద్కర్‌ది. అంబేద్కర్‌ను చిత్తశుద్ధితో అధ్యయనం చేస్తే హిందూ మతోన్మాదం, ప్రపంచీకరణ, అగ్రకులతత్వం మొదలైన అంశాలను ఆయన పరిశీలించిన తీరు స్పష్టంగా అర్థం అవుతుంది. ఆయన పై సమస్యలను ఏ విధంగా అర్థంచేసుకున్నారు? ఎటువంటి పరిష్కార మార్గాలను సూచించారు? అన్న అంశాల్ని సునిశితంగా చూస్తే ఈనాడు  వటవృక్షాలుగా ఎదిగిన పై సమస్యల పరిష్కారానికి ఒక ఆచరణీయమైన కార్యాచరణ ప్రణాళిక రూపొందుతుంది. ఈనాడు అశేష ప్రజానీకాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలు అగ్ర కులతత్వం, మతోన్మాదం, ప్రపంచీకరణ అందులో భాగంగా ప్రైవేటీకరణ సరళీకరణ విధానాలు.

దళితుల విముక్తితోపాటు దేశ నిర్మాణానికి సంబంధించి అంబేద్కర్ ప్రతిపాదించిన అంశాలలో ఈ సమస్యలను ఎదుర్కొనే ఉద్యమ నిర్మాణానికి దారి దొరుకుతుంది.

ఎమర్జెన్సీకాలంలో మానవహక్కుల పరిరక్షణ కోసం నిలబడే పాత్రికేయుడిగా దర్శనమిచ్చిన అరుణ్‌శౌరి తర్వాతి దశాబ్ధంలో ప్రపంచబ్యాంకు సలహాదారుడిగా

ప్రత్యక్షమయ్యాడు. ఆ తర్వాత కొంతకాలం కమ్యూనిస్టుల మీద విమర్శలు గుప్పించాడు. కొంతకాలానికే కమ్యూనిస్టుల మీద అంత పెద్దఎత్తున సైద్ధాంతికదాడి అవసరం లేదనుకొని అంబేద్కర్ వ్యక్తిత్వం మీద బురదచల్లి ఆయన సిద్ధాంతాల విశ్వసనీయతను దెబ్బతీయడానికి 'వర్షిపింగ్ ద ఫాల్స్ గాడ్స్' అనే పుస్తకం రాశాడు. వందల పేజీలను అసత్యాలతో అసలు రాజ్యాంగమే రాయలేదన్న దగ్గర నుండి అంబేద్కర్‌కు దేశభక్తిలేదనీ, ఆయన అవకాశవాది అనీ, ఆయనకు పదవీ వ్యామోహం ఎక్కువనీ, బ్రిటీష్ వారి ఏజెంట్ అనీ చెప్పడానికి ఆయన విఫల ప్రయత్నాలు చేశాడు. అనేక మంది దళిత మేధావులు అతని పుస్తకానికి సూటిగా సమాధానం చెప్పారు.అంబేద్కర్ జీవితం, వ్యక్తిత్వమే అన్నింటికన్నా స్పష్టమైన సమాధానం. ఆ తర్వాత కొద్ది కాలానికే అరుణ్‌శౌరి బి.జె.పి. నాయకత్వంలోని ప్రభుత్వంలో డిసిన్వెస్ట్‌మెంట్ (పెట్టుబడుల ఉప సంహరణ) శాఖా మంత్రిగా పదవినీ స్వీకరించాడు. ఈ పరిణామాలు విడివిడిగా చూస్తే యాధృచ్ఛిక సంఘటనలుగా అన్పించవచ్చు. కానీ జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ పరిణామాల్లోని అంతసూత్రం స్పష్టంగా కన్పిస్తుంది. బి.జె.పి. మతోన్మాద ఎజెండాకీ, ప్రపంచబ్యాంకు సామ్రాజ్య వాద ప్రపంచీకరణ ఎజెండాకూ, (అక్రమ?) సంబంధం కుదిరిన చోట అరుణ్‌శౌరి నిలబడివున్నాడు. హిందూ ఫాసిజం, దుర్మార్గపు సామ్రాజ్యవాదం కలగలిసిపోడానికి ప్రతీకాత్మక సంకేతం అరుణ్‌శౌరి. మతోన్మాద ప్రపంచీకరణవాదులు కమ్యూనిస్టులంటే కూడా భయపడ్డారు. కానీ ఎప్పుడో వచ్చే,లేదా వస్తుందో రాదో తెలియని కమ్యూనిస్టు విప్లవం అంత పెద్దగా భయపడాల్సిన పెనుభూతం ఏమీకాదని వాళ్ళకు అర్థమయ్యింది. వాళ్ళను నిరంతరం చికాకుపరిచే భయానకమైన పెనుభూతం అంబేద్కర్. "బ్రాహ్మణవాదం, పెట్టుబడిదారీ విధానం రెండూ ఈ దేశ ప్రజలకు ప్రధాన శత్రువులు" అని ప్రకటించిన ఏకైక భారతీయ తత్వవేత్త డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ మాత్రమే. యిప్పుడు బ్రాహ్మణ వాదం హిందూఫాసిజంగా, పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద ప్రపంచీకరణగా ఎదిగి రెండూ కలగలిసిన ఒక వికృత విశ్వరూపం భారతదేశ ప్రజల జీవితాలలో కరాళతాండవం చేస్తున్నది. వాటికి తక్షణ పరిష్కారాన్ని సూచించింది అంబేద్కర్ మాత్రమే. అందుకనే హిందూ పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదులకు తక్షణశత్రువూ, శాశ్వత శత్రువూ అంబేద్కరే అయ్యాడు. దళితులు అధికారంలోకి వస్తేనో, విప్లవం విజయవంతం అయితేనో అమలయ్యే సూత్రాలు కాక ఏ ప్రభుత్వమైనా (బి.జె.పి. ప్రభుత్వమైనా సరే) అమలు చేయక తప్పని స్టేట్‌సోషలిజాన్ని ఆయన ప్రతిపాదించాడు. దేశంలోని కీలకమైన పరిశ్రమలనీ జాతీయం చేయాలని, మరీ ముఖ్యంగా భూమిని జాతీయం చేసి వ్యవసాయాన్ని ప్రభుత్వ పరిశ్రమగా అభివృద్ధి చేయాలనీ, ఇన్సూరెన్స్‌ను జాతీయం చేయాలనీ ఆయన ప్రతిపాదించారు. అనేక అంశాలను ప్రాథమిక హక్కుల రూపంలోనూ, ఆదేశిక సూత్రాల రూపంలోనూ రాజ్యాంగంలో ఆయన పొందుపరచాడు. అంబేద్కర్ ప్రతిపాదించిన

కులనిర్మూలన, బౌద్ధధర్మ స్వీకారం మొదలైన అంశాలు హిందూ మతోన్మాద ఎజెండాకు ఎంతగా తక్షణ శత్రువో, ఆయన ప్రతిపాదించిన స్టేట్ సోషలిజం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఎజెండాకూ అంతే బద్ధశత్రువు. అంబేద్కర్ స్టేట్ సోషలిజం ప్రపంచీకరణ, సరళీకృత విధానం, ప్రైవేటీకరణ ఎజెండాను నేరుగా ఢీకొట్టింది. అందుకే బి.జె.పి. పెంపకంలో ఎదిగి ప్రపంచ బ్యాంకు ప్రాపకంలో శిక్షణ పొందిన అరుణ్‌శౌరి అంబేద్కర్‌ని ప్రధాన లక్ష్యంగా ఎంచుకొని తన దాడిని ఎక్కుపెట్టాడు. యిప్పటికీ హిందూ మతోన్మాద ఎజెండాకి సరైన సమాధానం అంబేద్కరిజమే. అంబేద్కర్ ప్రతిపాదించిన అంశాల ఆధారంగా నిర్మితమయ్యే ఒక సరికొత్త జాతీయోద్యమం మాత్రమే.

ఒకసారి అగ్రకులస్తుల నాయకత్వంలో జాతీయోద్యమం ఈ దేశ ప్రజలను ఎంతగా మోసగించవచ్చునో, ఎన్ని విద్రోహాలకు పాల్పడవచ్చునో, ఎన్ని వెన్నుపోట్లు పొడవవచ్చునో చేసి చూపింది. కాబట్టి ఈ సరికొత్త జాతీయోద్యమంలో దళిత బహుజనుల నాయకత్వాన పాలుపంచుకోవడానికి వామపక్షాలు, సోషలిస్టులు, యితర ప్రజాస్వామిక ప్రగతిశీల శక్తులు సిద్ధపడాలి. అంబేద్కర్ కన్న మరో కల రిపబ్లికన్ పార్టీ నిర్మాణం. తాను కొత్తగా నిర్మించ తలపెట్టిన పార్టీలో చేరవలసిందిగా సోషలిస్టులతోనూ, కమ్యూనిస్టు భావజాలం వున్న నాయకులతోనూ, ఇతర ప్రజాస్వామిక వాదులతోనూ చర్చలు, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. చనిపోయే ముందు రోజు కూడా రిపబ్లికన్ పార్టీ నిర్మాణం గురించి మహారాష్ట్ర నాయకులకు లేఖలు రాశారు. అంతకు ముందు నుండే లోహియాతో ఈవిషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు అంబేద్కర్ జరిపారు. కుల నిర్మూలన, రాజకీయ, సామాజిక సమానత్వంతో పాటు ఆర్థిక సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వాలను విశ్వసించే శక్తులన్నింటినీ కలుపుకొని ఒక విశాల ప్రాతిపదిక మీద రిపబ్లికన్ పార్టీని నిర్మించాలని అంబేద్కర్ భావించారు. తన చేతుల మీదుగా పార్టీని నిర్మించకుండానే ఆయన కన్ను మూశారు. ఆయన మరణానంతరం ఆయన ఆశించిన విధంగా కాక అంతకు ముందువున్న షెడ్యూల్డ్ క్యాస్ట్ ఫెడరేషన్‌కే ఆయన అనుచరులు రిపబ్లికన్ పార్టీ అని పేరు పెట్టారు. అంబేద్కర్ ఆశించింది అది కాదు. ఆ తర్వాత రిపబ్లికన్ పార్టీ నాయకులు చీలికలుపేలికలై అంబేద్కర్ పేరును కాంగ్రెస్ దగ్గర నుండి శివసేన వరకు ఎవరికైనా అమ్ముకొని బతకడానికి సిద్ధపడుతున్నారు. అంబేద్కర్ ఆశించిన లక్ష్యాలతో ఆయన ఆశించిన నిర్మాణంతో ఒకపార్టీ నిర్మాణం యింకా జరగవలసి వుంది. దుర్మార్గమైన ఫాసిస్టు పాలనను అందిస్తున్న బి.జె.పి. (ఎన్.డి.ఎ.) కూటమికి ప్రత్యామ్నాయంగా ఒక కూటమి ఏర్పాటు చేయాలన్న ఆలోచనలు సర్వత్రా వినిపిస్తున్నాయి. కమ్యూనిస్టులు సైతం బి.జె.పి. మతతత్వానికి ప్రత్యామ్నాయంగా కాంగ్రెస్ పార్టీని బలపర్చాలన్న ఆలోచనలు చేస్తున్నారు. ఉన్న పార్టీలలో కాంగ్రెస్ పార్టీయే సెక్యులర్ పార్టీ అని కమ్యూనిస్టు పార్టీలు సైతం భావించి, ఆ పార్టీతో పొత్తుల కోసం ప్రయత్నించడం చేస్తున్నారు.

సమకాలీన రాజకీయాలలో ఇదొక విషాదం. ఒక చారిత్రక విపరిహాసం. బి.జె.పి. (ఎన్.డి.ఏ.) కూటమి ఎంతటి దుర్మార్గమైన ప్రజావ్యతిరేక పాలనను అందిస్తుందో, అంతే ఎక్కువ దుర్మార్గమైన పాలనను కాంగ్రెస్ పార్టీ అందించిన విషయాన్ని చారిత్రక దృష్టివున్న ఎవరూ మరచిపోరు. బి.జె.పి. నగ్నంగా మతోన్మాదాన్ని ప్రోత్సహిస్తూ అమలుచేస్తున్న మాట నిజమే. కానీ జాతీయ రాజకీయాలలోకి తొలిసారిగా మతాన్ని తీసుకొచ్చిన ఘనత కాంగ్రెస్ పార్టీదే. బాలగంగాధర్ తిలక్ గణేష్ ఉత్సవాలను రాజకీయ వేదికగా మలచిన దగ్గర నుండి, గాంధీ మత రాజకియాలదగ్గర నుండి, పి.వి.నరశింహారావు కాలంలో బాబ్రీ మసీదు కూల్చివేతకు మౌన అంగీకారం తెలపడం వరకు అనేక మత కలహాలలో ముస్లింల ఊచకోతలు, లక్షలాదిమంది శిక్కుల ఊచకోతలాంటి సంఘటనలను ఎన్నింటికో కాంగ్రెస్ పార్టీదే బాధ్యత. కాంగ్రెస్ పార్టీ ప్రజాస్వామ్యం ముసుగు కప్పుకొని రాత్రిపూట చేసిన పనులనే బి.జె.పి. అన్ని ముసుగులనీ చించుకొని పగటిపూటే చేస్తున్నది. సారాంశంలో ముఖ్యంగా మతోన్మాదం, సరళీకరణ, ప్రపంచీకరణ విషయంలో బి.జె.పి., కాంగ్రెస్‌ల ఎజెండాలలో పెద్దగా తేడా ఏమీ లేదు. ప్రజాస్వామిక శిబిరంలో గొప్ప రాజకీయ శూన్యం ఆవరించింది. ఆనాడు లౌకిక, ప్రజాస్వామిక, సోషలిస్టు, కమ్యూనిస్టు శక్తులు అంబేడ్కర్ నాయకత్వాన్ని బలపరిచి ఆయన చూపించిన మార్గంలో పనిచేసి వుండి వుంటే ఈరోజు ఇంతటి బోలుతనం వుండేది కాదు. యిప్పటికైనా అంబేడ్కర్ ప్రతిపాదించిన అంశాలతో ఒక కార్యాచరణను (అది ఎంతో దీర్ఘకాలికమైనదైనా సరే) రూపొందించుకొని ఉద్యమిస్తేనే ఒక ప్రత్యామ్నాయ జాతీయోద్యమ ప్రజాస్వామిక రాజకీయ వేదిక రూపొందుతుంది. అప్పటి వరకు మతోన్మాద వ్యతిరేక, ప్రపంచీకరణ వ్యతిరేక ఉద్యమాలు కేవలం నినాదాలు, ప్రదర్శనల స్థాయిలోనే వుండిపోతాయి. ప్రజాస్వామిక శక్తులు రాజకీయ అధికారంలో వుండడం ఈ వేళ ఎంత అవసరమో చెప్పనవసరం లేదు. ఎన్నికల ముందు వరకు స్తబ్ధంగా వుండి ఎన్నికలొస్తున్నాయనగా జెండాల దుమ్ము దులిపి హడావుడిచేసి ఎన్నికలై పోయిన తర్వాత మళ్ళీ మౌనంలోకి నిష్క్రమించే పార్టీల వలన పెద్దగా ఒరిగేది ఏమీ వుండదు. దురదృష్టవశాత్తు ఎక్కువ శాతం దళిత పార్టీలు అదే స్థితిలో వున్నాయి. ప్రతిసారీ ఎన్నికల్లో పోటీచేసి ఏదో ఒక రాజకీయపార్టీ గెలవడానికో లేదా ఓడిపోవడానికో ఉపయోగపడడం తప్ప వీటి వల్ల పెద్దగా ప్రయోజనం లేకపోగా, దళిత పార్టీలంటే యింతేనని దళితులు కూడా అనుకొనే దారుణమైన పరిస్థితి ఏర్పడింది. దీనివలన దళితులు ఆత్మ స్థైర్యంతో మనం అధికారం సాధించాలన్న పట్టుదల పెరగకపోగా, గెలవని పార్టీలకు ఓట్లు వేయడం కన్నా గెలిచే పాలకపార్టీలకే వేయడం మంచిదని భావించే ప్రమాదమే ఎక్కువ. కాబట్టి తక్షణావసరాలు, ఎటువైపు నెడితే అటు కొట్టుకుపోకుండా ఒక దీర్ఘకాలిక ప్రణాళికతో రాజకీయాధికార సాధనకు భూమికను ఏర్పర్చుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. అందుకు అంబేడ్కర్

ఆలోచనలు మార్గదర్శకంగా తీసుకోవాలి. బి.ఎస్.పి. లాంటి పార్టీలు ఎంతో ఆశను కల్పించిన మాట నిజమే. అయితే కాన్షీరామ్ గారు ఎన్నో దశాబ్దాలు కష్టపడి ఉత్తరప్రదేశ్‌లాంటి ప్రాంతాల్లో రాజకీయ సేద్యం చేస్తే ఆంధ్రప్రదేశ్‌లో పంట కోసుకోవడం సాధ్యంకాదు. ఎక్కడి ఫలాలను అక్కడి కష్టంతోనే పండించాలి.

ఒక దళితుల కోసమేకాక మొత్తం దేశంకోసం అంబేద్కర్ అందించిన మార్గం, సిద్ధాంతం యింకా సజీవంగానే వుంది. ఆయన అవసరం రోజురోజుకీ పెరుగుతున్నదే తప్ప ఏ మాత్రం తగ్గడంలేదు. ఒక సుసంపన్నమైన, మానవీయమైన సమాజం తన కాళ్ళమీద తాను నిలబడి ప్రగతి పథంలో ముందుకు సాగిపోవాలంటే అంబేద్కరిజం వెలుగులో జాతి పునర్నిర్మాణానికి పూనుకోవాలి. ఈ దేశానికి ఆయన అందించిన మహత్తరమైన సిద్ధాంతంలోని ముఖ్యాంశాలు 1) కుల నిర్మూలన 2) స్టేట్ సోషలిజం 3) రాజకీయ, సామాజిక, ఆర్థిక సమానత్వం 4) బౌద్ధం.

బౌద్ధ సంస్కృతి మాత్రమే ఈ దేశపు జాతీయతను ప్రతిఫలించగలదనీ, కులమత విద్వేషాలను రూపుమాపగలదనీ అంబేద్కర్ స్పష్టంగా సోదాహరణంగా వివరించారు. బౌద్ధం ఒక సాంస్కృతిక, రాజకీయ తత్వశాస్త్రం. ఈ నాలుగు అంశాలు లేకుండా భారతదేశంలో ప్రజాస్వామిక ప్రక్రియ పరిపూర్తికాదు. అందుకు అంబేద్కరిజం ఒక వెలుగు భూమిక.

బుద్ధుడిని కోల్పోయిన దేశం వేల ఏళ్ళు దుఃఖితమతియై చీకటి సొరంగాలగుండా పయనించింది. కలహాలు, ఘర్షణలు, హింస, రక్తపాతం, పరస్పర విద్రోహాలతో తిరోగమన దిశలో శీర్షాసన ప్రయాణం చేసింది. యిప్పుడు అంబేద్కర్‌ని కూడా వదులుకొంటే ఈ దేశం మరోసారి శాశ్వత వంచితగా చరిత్ర దుఃఖపు పొరల్లో కూరుకుపోతుంది. అంబేద్కర్‌ని అనుసరించకుండా ఈ దేశానికి భవిష్యత్ లేదు. అంబేద్కర్‌ని అనుసరించడమంటే ఆయన్ని విగ్రహ మహాత్ముడిని చేసి, దండలేసి, పూజలుచేసి దేవుడిని చేయడం కాదు. అంబేద్కర్‌ని అనుసరించడమంటే ప్రతి ఏప్రిల్ 14వ తేదీన కొత్తబట్టలు వేసుకొని, మాంసం కూరతో అన్నం తిని కాసేపు ఊరేగింపు చేసి సభలు నిర్వహించడం కాదు. ఒక ప్రత్యామ్నాయ సామాజిక ఆర్థిక రాజకీయోద్యమం కోసం క్షణక్షణం పరిశ్రమించడం. ఆ మహాప్రయత్నాలలో అంబేద్కర్ మనకొక సజీవ స్ఫూర్తి. ఆయనకు మరణం లేదు. మన నాల్కల మీద, గళాల మీద, కనురెప్పల మీద ఎన్నో కలల్ని ఆయన రాస్తూనే వున్నాడు. ఆ కలల సాఫల్యానికి నడుం కట్టడమే ఆయనకు యిచ్చే నిజమైన నివాళి.

**డిసెంబర్ 2003 – బహుజన కెరటాలు**

# అర్ధ సత్యాల అసత్యాల అరుణ్‌శౌరి పుస్తకం

అరుణ్‌శౌరి పుస్తకం 'వర్షిప్పింగ్ ఫాల్స్ గాడ్స్' మొత్తానికి మార్కెట్లోకి వచ్చేసింది. ఇది చాలాకాలం ముందే బయటికి రావలసింది. ప్రచురణకర్తల ఆలస్యమై వుంటుంది. ఈ పుస్తకాన్ని ప్రచురించిన ఎ.ఎస్.ఎ. పబ్లికేషన్స్, న్యూఢిల్లీ వారు ధర నాలుగు వందల యాభై రూపాయలు పెట్టారు. కొంచెం తక్కువ ధర పెడితే ఆసక్తివున్న వాళ్ళు కొనుక్కుని చదివే వీలుండేది. బహుశా అరుణ్‌శౌరి కలానికి ఆ మాత్రం సేలబిలిటి వున్నదని వాళ్ళు అనుకొని వుంటారు. ఎన్నో ఏళ్ళపాటు పరిశోధన చేసి అంబేద్కర్‌ని గురించిన 'వాస్తవాలను' వెలికితీసే గ్రంథమని అరుణ్ శౌరి దీని గురించి చెప్తున్నాడు. అంబేద్కర్‌ను గురించి చరిత్రలో తుడిపేసిన వాస్తవాలను వెలికితీశానని ఆయన చెప్పుకుంటున్నాడు (పుస్తకం శీర్షికే Worshipping false Gods : Ambedkar and the facts which have been erased)

పుస్తకాన్ని పరిశీలించే ముందు ఒక్క మాట. అరుణ్‌శౌరి ఈ పుస్తకంలో అంబేద్కర్‌ను అవమానించాడనీ, ఆయనపైన బురద చల్లాడనీ, కాబట్టి దాన్ని నిషేధించాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. జి. వెంకటస్వామి వంటి ఘనత వహించిన దళిత పార్లమెంటు సభ్యులు అట్టహాసంగా ఏర్పాటుచేసిన కార్యక్రమంలో అరుణ్‌శౌరి పుస్తకం ప్రతిని తగులబెట్టారు. బహుశా వాళ్ళకా సమయంలో మహద్ చెరువు పోరాటం తర్వాత డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ తన లక్షలాది మంది సహచరుల సమక్షంలో మనుస్మృతిని దగ్ధం చేసిన సన్నివేశం కనుల ముందు కదులాడి వుంటుంది. పెద్ద యుద్ధం చేసి జయించినంత సంతృప్తి వాళ్ళకా క్షణంలో కలిగి వుంటుంది. అంబేద్కర్ మనుస్మృతినీ ఇతర హిందూమత గ్రంథాలన్నీ కూలంకషంగా అధ్యయనం చేసిన తర్వాత కులాల పీడనకూ, అంటరానితనానికీ ధర్మబద్ధతను కలిగిస్తోన్న వైదిక స్మృతులు దళితులకు తిరస్కార యోగ్యాలు అని చెప్పడానికి ప్రతీకాత్మకంగా ఆయన మనుస్మృతిని దగ్ధం చేశారు. అయితే అందరూ హిందూ మత గ్రంథాలను చదివి, అన్ని విషయాలను తెలుసుకుని వాటిని తిరస్కరించాలని ఆయన చెప్పారు. తనకు వీలు కుదిరినప్పుడల్లా మత గ్రంథాల్లో ఏముందో వివరించడానికి ప్రయత్నం చేశారు. మహారాష్ట్ర ప్రభుత్వం అంబేద్కర్ రచన 'రిడిల్స్ ఆఫ్ రామా అండ్ కృష్ణ' ను నిషేధించినప్పుడు ఆ నిషేధాన్ని ఎత్తివేయాలని గొంతెత్తి నినదించి విజయం సాధించిన మనమే అరుణ్‌శౌరి పుస్తకాన్ని నిషేధించాలని అరవాల్సి రావడం నిజంగా విచిత్రమే. భారత రాజ్యాంగంలో భావ ప్రకటనా స్వేచ్ఛను స్వయంగా అంబేద్కర్ పొందుపర్చారనీ, దాన్ని మనం గౌరవించాలనీ ఈ నాయకులు మర్చిపోతున్నారు. అంబేద్కర్ వారసులుగా, ఆయన పేరు మీద నాయకులుగా చలామణీ అవుతున్న చాలామందిలో పేరుకుపోయిన ఈ తాత్విక బోలుతనం వల్లకూడా అరుణ్ శౌరి లాంటి వాళ్ళు యిలాంటి పుస్తకాలు రాయగలుగుతున్నారు.

"నిన్ను నువ్వు తెలుసుకో, నీ శత్రువును మరింత క్షుణ్ణంగా తెలుసుకో, నువ్వు వందల యుద్ధాలను గెలుస్తావు" అంటాడు మావో ఒక సందర్భంలో. అంబేడ్కర్ పైనా, అంబేడ్కర్ కలిగించిన చైతన్యం పైనా జరుగుతున్న శత్రుపూరితమైన యుద్ధంలో భాగంగానే మనం ఈ పుస్తకాన్ని చూడాలి. సమాజపు అట్టడుగు పొరల్లోంచి ఏ వ్యక్తిత్వం రూపొందుతున్నా దాన్ని నేలకూల్చడానికి ఎవరెవరు ఎటువంటి ప్రయత్నాలు చేస్తారో తెలుసుకోడానికైనా యీ పుస్తకాన్ని చదవాలి. నీతిపేరుతో, సత్యాల పేరుతో వెనకనుండి కాళ్ళు విరగ్గొట్టడానికి ఎన్నెన్ని కుట్రలూ కుయుక్తులు పన్నుతారో, ఎంతగా సంఘటితమవుతారో ఇప్పుడిప్పుడే అక్షరాశ్యులై సమాజంలో తమ స్థానం కోసం పెనుగులాడుతున్న దళిత తరం తెలుసుకోడానికి అరుణ్‌శౌరి పుస్తకం ఎంతగానో ఉపకరిస్తుంది.

ఎంత శత్రుపూరితమైన దాడి చేసినప్పటికీ అరుణ్ శౌరి కృతకత్వంలోని నిజాయితీని మనం అంగీకరించాలి. తన పేరును చర్చల్లో బతికించుకునేందుకు ఏదో ఒక సంచలనాత్మకమైన ప్రకటన చేసి కొన్ని రోజులు చర్చల్లో బతికేవాళ్ళతో అరుణ్‌శౌరిని పోల్చలేం. ఆయన నిస్సూచీగా దళిత చైతన్యాన్ని నేలకూల్చేందుకు సిద్ధమైనవాడు. మనం బలంగా బలహీనపడితే మొదటి దెబ్బ వేయడానికి సిద్ధంగావున్న కొందరు "ప్రగతిశీల మిత్రుల" కంటే అరుణ్‌శౌరి ఎన్నో రెట్లు నయం.

బాబాసాహెబ్ అంబేడ్కర్ పైన ఎంతో కాలంగా అరుణ్‌శౌరి విషం కక్కుతూనే వున్నాడు. ఈ పుస్తకం దానికి పరాకాష్ట. అయితే అరుణ్‌శౌరికి అంబేడ్కర్ పైనా, ఆయన చైతన్యం పైనా యుద్ధానికి సరైన ఆయుధం అందలేదు. భావాల యుద్ధంలో శత్రువు బలం పైన దెబ్బతీస్తేగానీ ఆ వాదం వీగిపోదు. గాంధీజీకి కుదిరినా కుదరకపోయినా అంబేడ్కర్ బలాన్ని దెబ్బతీయడానికే ప్రయత్నించాడు. అయితే అరుణ్‌శౌరి అంబేడ్కర్ బలాన్ని ముట్టుకునే ప్రయత్నమైనా చెయ్యకుండా ఆయన బలహీనతల్ని వెదికే ప్రయత్నం చేశాడు. దాంతో శౌరికి అసత్యాలపైనా, అర్ధసత్యాలపైనా ఆధారపడక తప్పలేదు.

"కొండంత అబద్దం కన్నా పిసరంత నిజం కలపిన అబద్ధం ఎక్కువ ప్రమాదకరమైనది" అన్న దాస్తోవిస్కీ మాటలపట్ల శౌరికి అచంచలమైన విశ్వాసం. అందుకే తాను అంబేడ్కర్‌ను గురించి ప్రచారం చెయ్యదలచుకున్న కొండంత అబద్ధానికి పిసరంత నిజం కలిపే ప్రయత్నం చేశాడు. అట్ట పేజీ నుండి పుస్తకంలోని 663 పేజీల నిండా ఈ ప్రయత్నమే మనకు తేటతెల్లంగా కన్పిస్తుంది.

పుస్తకం మొదటి పేజీలోనే 1924 మార్చి 9వ తేదీన దామోదర హాలు సభలో అంబేడ్కర్ పబ్లిక్ జీవితం మొదలయ్యే నాటికి దేశం జాతీయోద్యమ జ్వాలలతో రగిలి పోతుందని అప్పటి నుండి అంబేడ్కర్ చనిపోయేంత వరకు ఏ ఒక్క సంఘటనలోను ఆయన పాల్గొనలేదనీ,

అంతేకాక జాతీయోద్యమం కష్టాల పాలైతే సంతోషించిన వారిలో అంబేద్కర్ ముందున్నాడనీ ఆరోపిస్తూ అరుణ్‌శౌరి తన పుస్తకాన్ని ప్రారంభించాడు.

మొత్తం నాలుగు ప్రధాన అధ్యాయాలుగా పుస్తక రచన సాగింది. వాటిని మళ్ళీ 19 ఉప విభాగాలుగా విభజించి చర్చించాడు. మొదటి అధ్యాయం 'స్వాతంత్ర్య సమర యోధుడు'. అందులో అంబేద్కర్ ఎలా స్వతంత్ర యోధుడు కాదో వివరించాలని ఆయన స్కీము. కానీ నాలుగైదు పేజీలు రాసిన తర్వాత ఆయనకి హఠాత్తుగా అంబేద్కర్ బౌద్ధం గుర్తొస్తుంది. కాసేపు దాని గురించి మాట్లాడతాడు. మళ్ళీ వెనక్కి వెళతాడు. అధ్యాయం మారుతోంది. రెండో అధ్యాయం 'సాంఘిక సంస్కర్త' అనే శీర్షికతో ప్రారంభిస్తాడు. మళ్ళీ మొదటి అధ్యాయం గుర్తొస్తుంది. స్వతంత్ర పోరాట కాలంలో అంబేద్కర్‌ని చిత్రించాలని మళ్ళీ ప్రయత్నిస్తాడు. ఈ విధంగా ముందుది వెనక్కి వెనకది ముందుకి చేస్తాడు. చెప్పిందే మళ్ళీ చెప్తాడు. ఇతర అధ్యాయాలు 'మన కాలం మనువు' పరిశోధన, దుష్ప్రభావం, దాడి అనే అధ్యాయాలు కూడా ఇలాగే సాగాయి. బహుశా శౌరి మెదడు ఎక్కువ వత్తిడికి గురై వుంటుంది.

మొత్తం మీద ముందుదీ వెనకదీ, పదే పదే చెప్పిందీ పరిశీలిస్తే అంబేద్కర్‌కి దేశభక్తి లేదనీ, ఆయన స్వతంత్ర పోరాటాన్ని వ్యతిరేకించాడనీ, డబ్బు కోసం బ్రిటీష్ వారితో కుమ్మక్కై గాంధీని తిట్టాడనీ, ఆయనకి పదవీ వ్యామోహం అధికమనీ, అందుకోసం నానా పైరవీలు చేశాడనీ, సమాజంలో ఎంతో మంది శాంతియుత సహజీవనం చేస్తోంటే నారాయణ గురులాంటి వాళ్ళు శాంతి వచనాలతో మార్పును తెచ్చే ప్రయత్నం చేస్తుంటే అంబేద్కర్ కింది వర్గాలను రెచ్చగొట్టే ప్రయత్నం చేశాడనీ, ఆయన హింసావాదనీ, ఆయన బౌద్ధమతాన్ని స్వీకరించడం కేవలం రాజకీయ లబ్ధికోసం చేపట్టిన అవకాశవాద చర్య అనీ, ఆయన అసలు రాజ్యాంగం రాయలేదనీ అరుణ్‌శౌరి చెప్పదలచుకున్నట్టు మనకు అర్థమవుతోంది.

ఒక్క అంబేద్కరనే కాదు, జాతీయోద్యమ కాలంలో నాయకులుగా చలామణీ అయినవారిని ప్రశ్నించిన ప్రతి ఒక్కరినీ శౌరి అమ్ముడుపోయిన వారిగానే చిత్రించాడు. బ్రిటీష్‌వారు కోరిన విధంగానే గాంధీని అంబేద్కర్ తిట్టాడనీ అందుకు ఆయనకు భారీ ప్రతిఫలం ముట్టిందనీ శౌరి ఆరోపణ (పేజీ 82) కాబట్టే ఒకవైపున జాతీయోద్యమం సాగుతుంటే దానిలో పాల్గొనకుండా అంబేద్కర్ దిగువ కులాల ఉద్యమాన్ని చేపట్టాడు అంటాడు. అదే కాలంలో ముస్లింలు కూడా అసంతృప్తికి గురికావడానికి కారణం ఆగాఖాన్ వంటి ముస్లిం నాయకులు బ్రిటీష్‌వారి చెప్పుచేతల్లో వుండడమేనంటాడు. అంబేద్కర్ అంటరానివారి విముక్తికి ఉద్యమించిన మాట నిజమే. 'బ్రిటీష్‌వారి దుర్మార్గపు పాలనను నిరసిస్తున్న మీరు ఈ దేశంలోనే పుట్టి పెరిగిన అస్పృశ్యుల పట్ల ఏ నీతిని అవలంబిస్తున్నారు, అని నిలదీసిన మాట నిజమే. ఈ ప్రశ్నను ఒక వేళ శత్రువులు ఉపయోగించుకుంటే ఆ తప్పు ఎవరిది? నిజంగా చిత్తశుద్ధి వుంటే జాతీయోద్యమ నాయకులు కుల నిర్మూలనకోసం పాటుపడి

తాము అస్పృశ్యులుగా నెట్టివేసిన వారిని కూడా తమతో కలుపుకొనేవారు. అప్పుడు అందరూ కలిసిన అద్భుతమైన శక్తిగా జాతీయోద్యమం నడిచి వుండేది. అంబేడ్కర్ ఆ అవసరాన్ని గుర్తించాడు. కుల నిర్మూలన కోసం కోట్లాది దళితులతో ఉద్యమాన్ని సాగించాడు. 'ఇంతమంది కుల వ్యవస్థ సంకెళ్ళ నుండి, సకల అణచివేతల నుండి స్వతంత్రులు కావాలని ఉద్యమిస్తుంటే మీకెవరికీ పట్టదా?' అని అంబేడ్కర్ జాతీయోద్యమ నాయకుల్ని అడిగిన ప్రశ్ననే అరుణ్‌శౌరిని కూడా అడగవచ్చు. శౌరికి తెలియకపోతే కదా! ఆయన ఉద్దేశాలు వేరు. నిజానికి జాతీయోద్యమ నాయకులంతా పైనుండి 'స్వతంత్ర' పోరాటాన్ని నడిపితే అంబేడ్కర్ అట్టడుగు పౌరల నుండి స్వతంత్రోద్యమాన్ని నడిపాడు. అది ఈనాటికీ కొనసాగుతోంది. జాతీయోద్యమ నాయకుల లక్ష్యం తెల్లదొరల అధికారం పోవడం మాత్రమే. అయితే అంబేడ్కర్ లక్ష్యం భారత ప్రజలు అన్ని రకాల పీడనల నుండి స్వతంత్రులు కావడం. ఆయన వర్ణ పీడనను ఎంతగా నిరసించాడో బ్రిటీష్ ప్రభుత్వాన్ని అంతగా నిరసించాడు.

రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో దళిత వర్గాల ప్రతినిధిగా హాజరై "బ్రిటీష్ పాలన వచ్చిన నూట యాభై ఏళ్ళు గడిచిపోయినప్పటికీ ఇంత వరకు మీరు మా అంటరానివారికోసం చేసిన మేలేమీ లేదు. అంతకు ముందు మేం బావుల్లో నీళ్ళు వాడుకోలేక పోయాం. ఇప్పుడేమయినా పరిస్థితి మారిందా? అంతకు ముందు మేం దేవాలయాల్లోకి వెళ్ళలేకపోయాం. ఇప్పుడా స్థితిపోయిందా? మీరెవరికి మేలు చేశారు?" అని నిలదీశారు. గంటల సేపు ఆవేదనతో ఆగ్రహంతో బ్రిటీష్‌వారిని కడిగేశాడు. గాంధీ సైతం అంబేడ్కర్ దేశభక్తికి నేనెంతగానో పొంగిపోతున్నానన్నాడు.

సామాజిక న్యాయాన్ని మర్యాద పూర్వకంగా సాధించాల్సిందిపోయి తన పరుషమైన పదజాలంతో దళితులకు ఆగ్రహ భాషని అంబేడ్కర్ నూరిపోశాడనీ, నారాయణ గురులాంటి వాళ్ళు ఆ విధంగా చెయ్యలేదని అరుణ్‌శౌరి అంటాడు (పేజీ 380)

కులాల అసమానతలు పోవాలని తనదైవ పద్ధతుల్లో కృషిచేసిన నారాయణ్ గురు దళిత దార్శనికుల్లో ఒకరు. కుల నిర్మూలన కోసం అరుణ్‌శౌరి చెప్తున్న "మర్యాద" పద్ధతుల్లోనే కృషి చేసిన నారాయణ గురును వర్ణ సమాజం ఎంతగా వేధించిందో అరుణ్‌శౌరికి తెలుసా? కేసుల పాలు చేసి రకరకాల అవమానాలకు గురిచేసింది. వాటి గురించి అరుణ్‌శౌరి అసలు మాట్లాడడు. ఎవరూ ఎవరినీ దూషించరాదని నారాయణగురు చెప్పారు. నిజమే, అది అందరికీ ఆమోదయోగ్యమే. అది ఒక్క దళితులకే వుండాలంటాడు శౌరి. అటువైపున కులం పేరుతో మనుషుల్ని పశువులకన్నా హీనంగా చూస్తున్నవారికి ఈ సూత్రం అనువర్తింప చేయాలని ప్రయత్నించడు. అంబేడ్కర్ భాష ద్వేషభావాన్ని రేకెత్తించే పరుషమైన భాష అని ఎత్తిచూపుతాడు. ఒక విషయాన్ని తీవ్రంగా వ్యతిరేకించేటప్పుడు భాష ఎంత పరుషంగా వుంటుందో ఈ పుస్తకంలోనే అరుణ్‌శౌరి వాడిన ప్రతి వాక్యాన్నీ ఉదాహరణగా చూపించవచ్చు. కోట్లాది ప్రజల గుండెల్లో నిలిచిన అంబేడ్కర్ గురించి మాట్లాడేటప్పుడు నిజాలు చెప్తున్నప్పటికీ (శౌరి ఏ నిజమూ చెప్పలేదు) భాషను జాగ్రత్తగా ఉపయోగించాలని శౌరికి తెలియదా?

ప్రతి పేజీలోనూ పేగులు తెగిపోయే వ్యంగ్యమూ, అవహేళనా, వెటకారం, చులకనభావం ప్రకటిస్తాడు.

అంబేద్కర్ రాజ్యాంగం రాయలేదని పదేపదే చెప్తున్నాడు శౌరి. అందుకు అంబేద్కర్ 1953 సెప్టెంబర్ రెండవ తేదీన రాజ్యసభలో "నేనీ రాజ్యాంగాన్ని రాశానని నా మిత్రులంటున్నారు. దాన్ని తగులబెట్టేవాళ్ళలో నేనే మొదటివాణ్ణి. అది నాకు అక్కర్లేదు. అది ఎవరికీ పనికి రాదు" అని చేసిన ప్రకటనను ఉటంకించి అంబేద్కర్ ఒప్పుకుంటున్నాడని అంటాడు అరుణ్‌శౌరి. అంతకు ముందు ఎం.ఎన్. రాయ్ బ్రిటీష్ వాళ్ళతో కుమ్మక్కై డబ్బు తీసుకొని గాంధీని తిట్టాడని చెప్పడానికి టి.టి. కృష్ణమాచారిని అడిగిన ప్రశ్నల్ని సవివరంగా ఉల్లేఖించిన శౌరి (పేజీ 105) అదే కృష్ణమాచారి రాజ్యాంగ సభలో అంబేద్కర్ రాజ్యాంగ రచన గురించి చేసిన ప్రసంగాన్ని పట్టించుకోడు. రాజ్యాంగ రచనకు కమిటీ ఏర్పడినప్పటికీ ఎవరూ అంబేద్కర్‌కి సాయపడలేదనీ, అంబేద్కర్ ఒక్కరే రాజ్యాంగ రచనా బాధ్యతను నిర్వర్తించాడనీ అందరి ముందూ కృష్ణమాచారి చెప్పారు. దేశప్రజల భవిష్యత్తునీ, దేశ భవిష్యత్తునీ దృష్టిలో వుంచుకుని ఒక్కడే ఎన్నో కష్టాలకోర్చి అద్భుతమైన విలువలతో కూడిన రాజ్యాంగ ప్రతిని తయారు చేసి సభ ముందుంచితే వేల సవరణలు ప్రతిపాదించి దాని రూపాన్నే మార్చివేసిన వారినుద్దేశించి అంబేద్కర్ అన్నమాటల్ని ఉపయోగించి అంబేద్కర్ కృషిని తిరస్కరించే ప్రయత్నం చేశాడు. అంబేద్కర్ రాజ్యాంగాన్ని రచించాడు. దాని స్ఫూర్తిని చంపివేసే సవరణలను వ్యతిరేకించాడు. ఇది రికార్డయిన చరిత్ర.

ఇక బౌద్ధ ధర్మ స్వీకరణ కూడా అవకాశవాద రాజకీయ చర్యేననీ 1946 జనవరి 16వ తేదీన 'దళితులు హిందూమతం నుండి బయటకు రావాల్సిన అవసరం ఎంతైనా వుంది' అన్న సందేశాన్ని పంపుతూ స్టేట్ కార్యదర్శి లేఖ రాశాడనీ అందుకే అంబేద్కర్ బౌద్ధాన్ని స్వీకరించాడనీ శౌరి అంటాడు (పేజీ 87)

1933లోనే అంబేద్కర్ వైదిక మతం మరో పేరు అసమానత్వం కాబట్టి దీనిలో వుండలేమని చెప్పాడు. 1935లో 'నేను పుట్టడం హిందువుగా పుట్టానుగానీ హిందువుగా మరణించను' అని ప్రకటించాడు. యోలాలో జరిగిన సమావేశంలో బౌద్ధం దేవుడు అవసరం లేని మతం అనీ 'మానవ విలువలు' కేంద్రంగా వున్న మతమనీ కాబట్టి తన సహచరులందరూ బౌద్ధాన్ని స్వీకరించాలని ఆయన సుదీర్ఘమైన సందేశాన్ని ఇచ్చారు. బుద్ధుడి 2500 పుట్టిన రోజు సందర్భంగా జరిగిన సమావేశంలో ఖాట్మండు వెళ్ళి బుద్ధుడు - కార్ల్‌మార్క్స్ పైన తన తులనాత్మక పరిశోధనా పత్రాన్ని సమర్పించాడు. 1956 అక్టోబర్ 14వ తేదీన తన లక్షలాది మంది సహచరులతో బౌద్ధాన్ని స్వీకరించాడు. ఇరవై ఏళ్ళపాటు బౌద్ధమత సారాన్ని అధ్యయనం చేసిన మీదట తీసుకున్న నిర్ణయాన్ని ఏదో ఒక పిచ్చి కాగితాన్ని చూపించి కొట్టిపారేసే ప్రయత్నం చేస్తాడు శౌరి.

శౌరి యింకొక ఆరోపణ అంబేద్కర్‌కి అధికార దాహం ఎక్కువని, అందుకోసం పైరవీలు చేశాడని. స్వతంత్రానికి పూర్వం బ్రిటీష్ వైస్‌రాయ్ కౌన్సిల్‌లో లేబర్ మెంబర్‌గా

పనిచేయడమేకాక స్వతంత్రం వచ్చిన తర్వాత అంతవరకూ తాను ఏ కాంగ్రెస్‌నైతే వ్యతిరేకించాడో ఆ కాంగ్రెస్ ప్రభుత్వంలో మంత్రిగా చేరాడనీ, ఆ మంత్రి పదవిని పొందడానికి అనేక పైరవీలు చేశాడనీ, కీర్తిశేషులు జగజ్జీవన్‌రామ్‌గారి ద్వారా ఆయనకు ఆ మంత్రిపదవి వచ్చిందనీ అందుకోసం జగజ్జీవన్‌రామ్ గారి యింటి చుట్టూ అంబేద్కర్ ప్రదక్షిణలు చేశాడనీ శౌరి రాశాడు.

డాక్టర్ అంబేద్కర్‌ని మంత్రివర్గంలో చేర్చుకోవాలన్నది నెహ్రూ నిర్ణయం. అంబేద్కర్ మీద అభిమానం వుండి కాదు. కాంగ్రెసేతర సభ్యులను కూడా మంత్రివర్గంలో చేర్చుకోవాలన్నది నిర్ణయం. ఒక్క అంబేద్కర్‌నే కాదు, రకరకాల పార్టీలనుంచి, ఇండిపెండెంట్ల నుండి కూడా మంత్రివర్గంలోకి తీసుకున్నారు. తన తొలి మంత్రి మండలి పేర్ల జాబితాను పరిశీలిస్తే ఆ విషయం స్పష్టంగా తెలుస్తుంది. హిందూ మహాసభకు చెందిన శ్యాంప్రసాద్ ముఖర్జీ, అకాలీదళ్‌కు చెందిన సర్దార్ బలదేవ్‌సింగ్, స్వతంత్ర అభ్యర్థులైన బాబా, జాన్‌మత్తాయ్, సర్ షణ్ముగం చెట్టి, నిమ్నజాతుల ఫెడరేషన్‌కు చెందిన డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్‌లు నెహ్రూ మంత్రివర్గంలోని కాంగ్రెసేతర సభ్యులు. మంత్రిగా వుండి అంబేద్కర్ ఏం చేశాడో పరిశీలిస్తే ఆయన పదవుల్ని ఎంత తృణప్రాయంగా చూశాడో తెలుస్తుంది. హిందూ కోడ్ బిల్లు వీగి పోయినప్పుడు రాజీనామా చేసేంతవరకు ఆయన ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను విమర్శిస్తూనే వున్నాడు.

అంబేద్కర్‌కి పదవీ దాహం వుంటే ఏనాడో ఖద్దరు బట్టలు వేసుకుని, గాంధీ టోపి పెట్టుకుని కాంగ్రెస్ పార్టీలో చేరి వుండేవాడు. పైరవీలు చేయదలచుకున్నప్పుడు ఆ మాత్రం తెలివితేటలు లేనివాడు కాదు.

అంబేద్కర్ దేవుడు కాదు. మనుషులందరూ సమానంగా బతకాలని కలలుకన్న మనిషి. ఆ మనిషి బలం కుల నిర్మూలనా సిద్ధాంతం, ప్రజాస్వామ్యం, సోషలిజం. ఆయన రచనల్లో ఇది స్పష్టంగా కన్పడుతోంది. కులాల ఉనికి వున్నంతకాలం అంబేద్కర్ అవసరం దేశానికి వుంది. అరుణ్‌శౌరిని ఆయన బలం మీద యుద్ధానికి రమ్మని ఆహ్వానించడం తప్ప ఇప్పుడు ఏమీ చెయ్యలేం. ఆయన రాసిన 'వర్షిప్పింగ్ ఫాల్స్ గాడ్స్' పుస్తకం రకరకాల విన్యాసాలు చేసినా ఈ ప్రయత్నమైనా చెయ్యలేకపోయింది. అయితే అట్ట పేజీ మాత్రం అందంగా ముద్రించారు. అంబేద్కర్ సూటూ, బూటూ వేసుకుని అచ్చం బ్రిటీష్‌వారి వేషంలో విమానం ఎక్కుతున్న ఫోటో. శౌరి దీన్ని అంబేద్కర్ బ్రిటీష్ ఏజెంట్ అని చెప్పడానికి ఉపయోగించి వుంటాడు. ఆయన ఉద్దేశం ఏమైనా ఆ ఫోటోని ఆర్కైవ్స్ నుండి అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు కృతజ్ఞతలు.

ఒక పాపులర్ నవలను సమీక్షచేస్తూ రచయిత్రి రంగనాయకమ్మ "ఒక వైద్యుడు రోగి మలాన్ని పరీక్ష చేసినట్టు నేనీ నవలను చదివాను" అని చెప్పినట్టుగా అందరూ ఈ పుస్తకాన్ని పరిశీలించాలి.

**14 సెప్టెంబర్ 1997 : ఆదివారం 'ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో**

# జగమంతా అంబేద్కర్ మయం!

ఈవేళ ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న అసలైన పెనుభూతం అంబేద్కర్. గుండెల్లోకి ఆవాహన చేసుకోలేరు. హత్తుకోలేరు. తలకెత్తుకోలేరు. వదలుకోనూలేరు. ఇప్పుడు అంబేద్కరనే పేరు అన్ని రాజకీయ పార్టీలకు జపించక తప్పని మంత్రంగా మారింది. ఇష్టమున్నా లేకపోయినా అంబేద్కర్ విగ్రహాలకి దండవేసి, పూజలు చేయడానికి అన్ని రాజకీయపక్షాలు, ఉద్యమాలు ఆరాటపడుతున్నాయి. ఒకరిని మించి ఒకరు అంబేద్కర్ బొమ్మను స్వంతం చేసుకోవడానికి పోటీపడుతున్నారు. హిందూమతాన్ని తలకెత్తుకొని కుల వ్యవస్థే కేంద్రస్థానంగా ఉన్న మతానికి ప్రతినిధులుగా తమను తాము చెప్పుకుంటున్న సంఘ పరివారం దగ్గర నుండి, అంబేద్కర్‌ని లిబరల్ బూర్జువా అని నిందలు వేసిన నక్సలైట్ పార్టీల దాకా, అన్ని పార్టీలు ఇప్పుడు అంబేద్కర్‌ను గౌరవిస్తున్నాయన్నట్లుగా ప్రవర్తిస్తున్నాయి. ఆయన జీవితాశయం కుల నిర్మూలనా సిద్ధాంతాన్ని స్వీకరించినట్లుగా ప్రకటిస్తున్నాయి. ఆయన జీవితాంతం దేనికోసమైతే అహర్నిశలు శ్రమించాడో, తపించాడో, పెనుగులాడాడో, అదే అంశంపై ఎవరైతే ఆయన్ని వ్యతిరేకించారో, ఆయనతో ప్రత్యక్ష యుద్ధానికి తలపడ్డారో వాళ్ళే ఇప్పుడు అంబేద్కర్‌ని తలెత్తుకోవడం ఒక చారిత్రక విపరిహాసం.

కాలం గడిచిపోతుంది. అంబేద్కర్ అనే వ్యక్తిమాత్రుడు చనిపోయి, భౌతికంగా చివరి శ్వాసవిడిచి యాభై సంవత్సరాలు దాటిపోయాయి. ఇప్పుడు అంబేద్కర్ పేరును ఆయన తలపెట్టిన ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళడానికి మేమున్నాం అని జెండాలు మోసుకువస్తున్న రాజకీయపార్టీల ఉద్దేశ్యాలు, లక్ష్యాలు ఏమైనప్పటికీ అంబేద్కర్‌ను తిట్టిగాని, పొగిడిగాని మనుగడ సాగించలేని ఒక అనివార్య చారిత్రక సందర్భం ఇప్పుడు వచ్చింది. ఇది అంబేద్కర్ ప్రాసంగికతని మాత్రమే తెలియజేస్తుంది.

ఉదాహరణకి ఆయన జీవించిన కాలంలో హిందువులతో సఖ్యతను కోరుకున్నారు. తటాకాల్లోంచి, బావుల్లోంచి మంచినీళ్ళయినా నా ప్రజలకు దొరికితే చాలనుకున్నారు. ఒక దేవాలయంలోకి ప్రవేశించగలిగితే చాలనుకున్నాడు. రక్తసిక్త యుద్ధాలయ్యాయి. ప్రజాసమూహాలందరికీ సంబంధించిన ఒక చెరువులోంచి దోసిడు మంచినీళ్లు తీసుకోవడానికి రక్తం మూల్యంగా చెల్లించాల్సి వచ్చింది.

హిందూమతంలో కులవ్యవస్థ అనే ఒక భాగాన్ని తీసివేయడానికి జరగవలసిన సంస్కరణలకోసం మానవ ప్రయత్నాలన్నీ చేశాడు. కుదర్లేదు. ఒకవైపు హిందూ ఛాందసవాదం, మరొకవైపు హిందూ సంస్కరణవాదం ముఖ్యంగా గాంధీ, అస్పృశ్యత, హిందూ జీవన విధానంపై ఉన్న ఒక మాయని మచ్చగా పేర్కొంటూనే, కుల వ్యవస్థ ఉండాల్సిందేనని ప్రకటించడంతో అంబేద్కర్‌కి భ్రమలన్నీ తొలగిపోయాయి. రోజూ అత్యాచారాలు, పందుల్ని,

కుక్కల్ని, ఆవుల్ని దేవతలకంటే ఉన్నతమైన వాటిగా కీర్తిస్తూ మనుషుల్ని పశువులకంటే హీనంగా చూసే వర్ణ వ్యవస్థను సమర్థించే హిందూ జీవన విధానంతో అంబేద్కర్ రాజీపడలేకపోయారు.

అప్పటి నుండి రష్యా విప్లవం విజయవంతం కావడంతో అంబేద్కర్ మార్క్సిజం వైపు ఆకర్షితుడైనాడు. బహుశా భారతదేశంలో మార్క్సిస్టులమని చెప్పుకునే వారందరికంటే మార్క్సిజాన్ని అధ్యయనం చేశాడు. ఆ విషయాన్ని బొంబాయి జౌళిమిల్లుల సమ్మెకాలం 1937లో భారత కమ్యూనిస్టుపార్టీ ముఖ్యుడైన డాంగే ధృవీకరించాడు. అయితే మార్క్సిజాన్ని అమితంగా అభిమానించిన అంబేద్కర్, మార్క్సిస్టుల పేరుతో చలామణి అవుతున్న బ్రాహ్మణులతో రాజీ పడలేకపోయాడు. రష్యాలో వానపడితే బొంబాయిలోనో, బెజవాడలోనో గొడుగుపట్టడం ఆయనకు నచ్చలేదు. అదీకాక భారత సామాజిక మూలాల్లోని ప్రధానవైరుధ్యం అయిన కుల సమస్యని పట్టించుకోకపోవడంతో ఆయనిక కమ్యూనిస్టులతో పనిచేయలేననే నిర్ణయానికి వచ్చాడు. నిజానికి ఎక్కడో పుట్టిన కమ్యూనిస్టుపార్టీ, విప్లవానికి చోదక శక్తిగా భావించిన కార్మికవర్గం కోసం బొంబాయి వీధుల్లో వెతుకుతున్నప్పుడు,అసలైన శ్రామిక వర్గాలకి చెందిన దళిత బహుజన కులాల సమూహాలను ఈ దేశం గుండెల మీదుగా విజయ కవాతు చేయించాడు అంబేద్కర్.

మూడవ ఆశ, బహుశ చివరి ఆశ బౌద్ధం. బౌద్ధమే ఈ సమాజ పునర్నిర్మాణానికి ఏకైక ప్రత్యామ్నాయ మార్గంగా నిర్ణయానికి రావడానికి కనీసం 45 సంవత్సరాల పెనుగులాట, వెతుకులాట, సంఘర్షణ ఉన్నాయి. ఈ దేశం హిందూ దేశమా లేక బౌద్ధ దేశమా అన్న మేధోమథనంలోంచి ఒక అన్వేషణ అంబేద్కర్‌ని 2500 సంవత్సరాల వెనక్కి తీసుకెళ్లింది. “సింహాలు తమ చరిత్రను తాము చెప్పుకోకపోతే వేటగాళ్లు చెప్పే పిట్టకథలు, కట్టుకథలే చరిత్రగా చెలామణి అవుతాయి” అన్న వాస్తవాన్ని గుర్తించి అంబేద్కర్ చారిత్రక మూలాల్లోంచి తన సిద్ధాంతాన్ని రూపొందించడానికి పూనుకున్నాడు. సమానత్వం, సౌభ్రాతృత్వం, స్వేచ్ఛ అనే మూడు అంశాలు ఫ్రెంచి విప్లవం నుంచి కాక, బౌద్ధ విప్లవం నుంచి స్వీకరించానని ప్రకటించాడు. 1907లో అంబేద్కర్‌కి అతి చిన్న వయస్సులో బుద్ధుడు పరిచయం అయ్యాడు. వ్యక్తిగాకాదు, ఒక మూర్తీభవించిన చైతన్యంగా. ఆనాటి నుండి 1935 వరకు తన సామాజిక, ఆర్థిక, రాజకీయ అన్వేషణ కొనసాగుతూనే ఉన్నది. ఒకవైపున అన్ని హక్కులను కోల్పోయిన దళిత జాతులు అభ్యుదయం కోసం పోరాటం, మరొక వైపు క్రింది వర్గాలవారి స్వాతంత్ర్యం కోసం ఏ మాత్రం పనిచేయని జాతీయవాదులతో సంఘర్షణ, ఇంకొక వైపున సమాజ పునర్నిర్మాణంకోసం తనదైన శైలిలో వ్యూహరచన చేయడం ఇన్ని సంఘర్షణల మధ్య అంబేద్కర్ జీవించాడు.

ప్రపంచం అనేక చీకటి యుగాల సుడిగుండాల గుండా పయనిస్తున్న వేళ, చెక్కిళ్ళమీద జారుతున్న కన్నీటి బిందువులను తుడిచే ఒక వెలుతురు కిరణం బుద్ధుడు. ఆయన మహా పరినిర్వాణం పొందిన 2500 సం॥ తరువాత ఆయన బోధించిన సమతా సిద్ధాంతాన్ని ఈనాటి పరిస్థితులకు అనుగుణంగా, సృజనాత్మకంగా అన్వయించిన ఏకైక బోధిసత్వుడు అంబేద్కర్. అరెస్సెస్ ఒకందుకు అంబేద్కర్‌ను ఎత్తుకుంటుంది. బి.జె.పి. ఒకందుకు అంబేద్కర్‌ను పొగుడుతుంది. ఎ.బి.వి.పి. ఒకందుకు అంబేద్కర్ నినాదాలను గోడలమీద రాస్తుంది. మావోయిస్టు పార్టీ సైతం కులనిర్మూలన అనే కార్యక్రమాన్ని తన ఎజెండాలోకి చేర్చుకుంది. బహుశా మొట్టమొదటిసారిగా అంబేద్కర్ చిత్రపటాన్ని పత్రికలో అచ్చువేసింది.

ఎవరైనా సరే ఈ దారికి రావాల్సిందే. జగమంతా అంబేద్కర్ మయం!

ఎవరి ఉద్దేశాలు, లక్ష్యాలు ఏవైనా అంబేద్కర్ కలల్ని సాఫల్యం చేయడానికి నడుం కట్టడమే ఈ తరం కర్తవ్యం. బుద్ధుడిని కోల్పోయి ప్రపంచం వేల ఏండ్లు చీకటి గుహల్లో జీవచ్ఛవంలా బ్రతికింది. ఇప్పుడు అంబేద్కర్‌ని కోల్పోయి నిజంగానే శవం అయ్యింది. అయితే ఆ అంబేద్కర్ చూపుడువేలు సూర్యుడినే చూపిస్తుంది. మేల్కొన్న తరాలు ఆ వెలుతురును ఆస్వాదించండి!

అంబేద్కర్ చూపుడు వేలి దారిలో ప్రయాణించటానికి పల్లె నెత్తురు ప్రవహిస్తోన్న ఒక కొత్తతరం 'బహుజన కెరటాలు'గా విస్తరించి అంబేద్కర్ చూపిన వెలుగుల దారిలో అడ్డదిడ్డమైన సమాజాన్ని సరిచేయాలని పూనుకుంటున్నది. వారికిదే ఆహ్వానం.

**ఏప్రిల్ 2007 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# నవ బోధిసత్వుడు అంబేద్కర్

అమరావతిలో కాలచక్ర ఉత్సవాలకు ఏర్పాట్లు చేయటంలో బౌద్ధ బిక్షువులంతా తలమునకలై ఉన్నారు. వీరితోపాటు పాలకులు, వారి యంత్రాంగం అంతా కూడా బుద్ధుడి యెడల, బౌద్ధధర్మం యెడల ఎంతో ప్రేమాభిమానాలు వున్నట్లు కనిపిస్తున్నారు. అయితే బ్రాహ్మణీయ శక్తులు జాతీయ మతమైన బౌద్ధాన్ని వెంటాడి వేటాడి పుట్టిన దేశాన్నుంచే తరిమేస్తే దానిని పునరుద్ధరించినది బోధిసత్వుడైన బాబాసాహెబ్ డా.బి.ఆర్. అంబేద్కర్. అంబేద్కర్ పాత్రను ఈ బౌద్ధులనబడే వారుగాని, జపాను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలుగాని చాలా తెలివిగా విస్మరిస్తున్నాయి. పరిస్థితిని చూస్తుంటే బౌద్ధాన్ని పర్యాటక రంగంగా కుదించే ప్రయత్నం జరుగుతున్నట్లు అర్ధం అవుతుంది. బౌద్ధులనబడేవారు కూడా దానిని ఒక క్రతువుగా మార్చే పనిలోనే వున్నారు.

ఏదేమైనా పునరుద్ధరింపబడిన నవ బౌద్ధం యొక్క చరిత్రను డా॥ అంబేద్కర్ దళిత విముక్తి కోసం సాగించిన పోరాటాలతో వేరు చెయ్యలేము. ఎందుకంటే అవి రెండూ కలగలసిపోయి వున్నాయి.

డా॥ బి.ఆర్. అంబేద్కర్ 1956 డిశంబర్ 6న మరణించారు. ఆయన చనిపోవడానికి కొన్ని గంటల ముందు వరకు బౌద్ధాన్ని కొత్తతరాలకు, ఆధునిక సమాజానికి అనుగుణంగా మార్చడంలో నిమగ్నమైయున్నారు. అవసానదశలో కూడా ఎక్కువ సమయం పరిపూర్ణమైన తెలివిలో వుండి నిబద్ధతతో "బుద్ధుడు – ఆయన ధమ్మం" అనే పుస్తకానికి తుది మెరుగులు దిద్దడానికి కేటాయించాడు. డిశంబర్ అయిదు దినమంతా దేశవ్యాప్తంగా తన అనుచరులకు ఫోన్లు చేసి, చారిత్రాత్మక నాగపూర్ సామూహిక బౌద్ధమత స్వీకారం తర్వాత బొంబాయిలో జరపవలసిన మరొక కార్యక్రమానికి ఏర్పాట్లను పర్యవేక్షించడంలోనే గడిపారు. డిశంబర్ 4న ఆయన తన సుప్రసిద్ధ గ్రంథం "బుద్ధుడు – కార్ల్‌మార్క్స్" పూర్తిచేశాడు. అది ప్రపంచ విముక్తి కోసం కృషిచేసిన ఒక ప్రాచీన తత్వవేత్త, స్వేచ్ఛా తాత్వికుడైన మరొక ఆధునిక తత్వవేత్తలపై ఒక తులనాత్మక అధ్యయన గ్రంథం.

అంబేద్కర్ డిశంబర్ 2న దలైలామాను కలిసి బౌద్ధ ధర్మానికి సంబంధించిన విషయాలను చర్చించాడు. ఎంతో నిజాయితీగా నిబద్ధతతో అధ్యయనం చేసి ఆధునిక బౌద్ధాన్ని ప్రతిపాదించాడు. అదే నవయానం. బౌద్ధాన్ని దాని వివిధ పార్శ్వాలను అధ్యయనం చేయడానికి 40సం॥లు వెచ్చించాడు. అందులో అధ్యాత్మిక, సాంస్కృతిక, రాజకీయ అంశాలు ఇమిడి వున్నాయి. ఆధునిక భారతంలో ఆయన స్థానం గాంధీతో పోటీపడుతుంది. దళితులపై జరుగుతున్న దోపిడీని ఎట్లా నిర్మూలించాలనే విషయాల మీదనే కాక దేశాభివృద్ధికి సంబంధించిన విషయాలపై కూడా డా॥బి.ఆర్. అంబేద్కర్ గాంధీతో విభేధించేవాడు. ఈ

క్రమంలో గాంధీ సంస్కరించబడిన హిందూమతానికి ప్రతినిధిగా నిలబడగా, డా॥బి.ఆర్. అంబేడ్కర్ ఆధునికతకు, బౌద్ధ సాంప్రదాయాలకు వారసుడుగా నిలబడ్డాడు. 1930–1932లలో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశాలలో డా॥ బి.ఆర్. అంబేడ్కర్ గాంధీని సంస్కరించిన ఛాందస హిందువులతోనే గాక బ్రాహ్మణీయ మార్క్సిజంను కూడా ఎదిరించారు.

ఆయన ఎంతో శ్రద్ధగా మార్క్సిజంను అధ్యయనం చేశారు. ఒకదశలో తనలో తను మార్క్సిస్టుగాను, స్టేట్ సోషలిస్టుగాను ప్రకటించుకున్నాడు. 1930 నాటి సంక్షుభిత దశాబ్దంలో ఆయన కార్మికుల సమస్యలు, రైతాంగ పోరాటాలు మొదలైన అంశాలపై కమ్యూనిస్టులతో అంగీకారం కలిగివుండేవారు. ఆయన కమ్యూనిస్టులతో వేరుపడింది కులం, మతం అంశాలపైనే. 1940–1950ల నాటి చర్యలు పునరుద్ధరింపబడిన బ్రాహ్మణవాదంపై ఆయన విసిరిన రెండవ చారిత్రాత్మక సవాలు.

1907లో డా॥బి.ఆర్. అంబేడ్కర్ బుద్ధుని జీవితంపై ఒక పుస్తకాన్ని సంపాదించటంతో బౌద్ధం వైపు ఆయన ప్రయాణం మొదలైంది. బౌద్ధంలోని సాంప్రదాయాలను, బౌద్ధగ్రంధాలను దీనికి సంబంధించిన వివిధ చర్చాపత్రాలను అధ్యయనం చేస్తూ మహారాష్ట్రలోని బౌద్ధ విహారాలను సందర్శించాడు. 1935లో "నేను హిందువుగా జన్మించినప్పటికీ నేను హిందువుగా మరణించను" అని ప్రకటించడంతో ఆయన ప్రస్థానం ఒక ముఖ్య దశకు చేరుకుంది. 1956 అక్టోబర్ 14న నాగపూర్‌లో లక్షలాది అనుయాయులతో సాంప్రదాయిక బౌద్ధంలోని "త్రిశరణాలు" మరి ఇతర 22 వాగ్దానాలను తీసుకోవడంతో ఆయన ప్రయాణం పూర్తయింది. ఈ సంఘటన దళితుల మత సాంస్కృతిక గుర్తింపుకు సంబంధించిన ఒక పెద్ద మలుపుగా నిలిచిపోయింది.

డా॥బి.ఆర్. అంబేడ్కర్ బౌద్ధాన్ని ఆధునిక పరిస్థితులకు అన్వయం చేయడానికి సాంప్రదాయ బౌద్ధులను కూడా చర్చలకు ఆహ్వానించారు. ఆయన వారికి 4ప్రశ్నలు వేశాడు. బౌద్ధాన్ని సామాజిక ఆచరణవైపు నడిపించే ప్రయత్నం చేశాడు. డా॥బి.ఆర్. అంబేడ్కర్‌కు బౌద్ధం కేవలం ఆధ్యాత్మికం కాదు. అది మనుషులను దుఃఖం లేని ప్రపంచంలోకి నడిపించగల ఒక సహేతుకమైన మనో వైజ్ఞానిక సాధన. ఆయన పాళీ భాషలోని బౌద్ధగ్రంధాల నుండి పలు అంశాలను తీసుకున్నట్లు తెలుస్తుంది. కొన్ని కొత్తవి. అనంతరం చేర్చబడినవి. మార్క్సిస్టు ప్రశ్నలకు బౌద్ధుల సమాధానాలుగా ఇవి వుంటాయి. డా॥బి.ఆర్. అంబేడ్కర్ వర్ధంతిని మహాపరి నిర్వాణంగా జరుపుకుంటారు. వేలాది మంది దళితులు ఆ సందర్భంగా తన గ్రామాలు, పట్టణాలు, మురికివాడల నుండి ముంబయికో, నాగపూర్‌కో చేరుకొంటారు. బౌద్ధంను తన జన్మభూమిలో పునరుజ్జీవింప చేయడంలో బాబాసాహెబ్ పేరే ప్రధానంగా కనిపిస్తుంది. కాబట్టి బౌద్ధ ధర్మాన్ని ఆధునికసమాజానికి అనుగుణంగా ఆయన వ్యాఖ్యానించిన విధానాన్ని ఉపేక్షించలేము. అసలు బౌద్ధం ఏమిటి? ప్రాచీన సమాజంపై దాని ప్రభావం,

భవిష్యత్తులో దాని పాత్ర, ఆధునిక సమాజం ఎలావుండబోతున్నది మొదలైన విషయాలకు ఆయన వ్యాఖ్యానాలే సమాధానాలైనాయి. డా॥బి.ఆర్. అంబేడ్కర్ "బుద్ధుడు – ఆయన ధమ్మం" రాసేవరకు బౌద్ధులకు ఒక సమగ్రమైన పవిత్ర గ్రంథం లేదు. ఆ పుస్తకానికి రాసిన ముందుమాటను పరిశీలిస్తే డా॥ అంబేడ్కర్ భావాలు ఎంత తీవ్రమైనవో అర్థం అవుతాయి.

అంబేడ్కర్ సిద్ధార్థుడి మహాభినిష్క్రమణం రోగిని వృద్ధుణ్ని చూసి పరివర్తన చెందడం అనే గాథను తిరస్కరిస్తూ ఇటువంటి ఘటనలు ఎవరి జీవితంలోనైనా జరిగేదేనని వాదించాడు. బుద్ధుడు ఆత్మ అస్థిత్వాన్ని నిరాకరిస్తూ కర్మ పునర్జన్మలను గురించి మాట్లాడటం పరస్పర విరుద్ధమైనదన్నాడు. పవిత్ర మానవునిగా కంటే సంఘసేవకునిగా నిలవగలిగిన భిక్షువే బౌద్ధానికి వేగుచుక్క అని ఆయన ప్రకటించాడు.

డా॥ అంబేడ్కర్ వివరణ ప్రకారం గౌతముని ప్రస్థానం మార్క్సిస్టు మార్గంలో సామాజిక దోపిడీని నిర్మూలించే వర్గ పోరాటాన్ని చేపట్టడంలో మొదలౌతుంది. పరివ్రాజకుడైన బుద్ధుడు శాక్య, కోలీయ గణాల మధ్య జరుగుతున్న జలయుద్ధాలను విజయవంతంగా నివారించడం దీనికి తార్కాణం అని అన్నారు. బాధలు, దుఃఖము జీవితంలో అవిభాజ్యాలని, ప్రపంచంలో దుఃఖాన్ని నివారించడమే బౌద్ధం యొక్క ధ్యేయమని డా॥బి.ఆర్. అంబేడ్కర్ వాదించారు. బుద్ధుని యొక్క తొలి బోధన, నాలుగు ఆర్య సత్యాలు కావని మధ్య మార్గమేనని ఆయన అభిప్రాయం. బుద్ధుని యొక్క తొలి బోధనను విన్న ఐదుగురు పరివ్రాజకుల ప్రతిస్పందన ఇలావుంది. "మనిషి యొక్క విముక్తి అతని చేతుల్లోనే వుందని, అది మనిషి యొక్క సౌజన్యం ద్వారానే సాధించవచ్చునని వినడం చరిత్రలో ఇదే మొదటిసారి." ఆయన ప్రస్తావించిన మరో అంశం కర్మ, పునర్జన్మ. కర్మను అంగీకరిస్తే కుల వ్యవస్థను, గత జన్మలో చేసిన పాపాల వల్ల ఈ జన్మలో అంటరానివాడిగా జన్మించారనే వాదనను అంగీకరించవలసి వస్తుంది. డా॥బి.ఆర్. అంబేడ్కర్ ఉద్దేశ్యంలో కర్మ, పునర్జన్మ అనే భావాలు బౌద్ధంలోని ప్రాథమిక సిద్ధాంతమైన "అనాత్మకే" వ్యతిరేకమైంది.

డా॥బి.ఆర్. అంబేడ్కర్ అభిప్రాయం ప్రకారం సంఘ సేవకు అంకితం కావాలి తప్ప సాంప్రదాయక ఆశ్రమ వ్యవస్థలో వలే "ఆత్మజ్ఞానం" ప్రధానాంశం కాకూడదు. బౌద్ధమతంలోని సంఘాల విధానం డా॥బి.ఆర్. అంబేడ్కర్ సామాజిక చారిత్రక అవగాహనలోని ఒక ముఖ్యమైన అంశం అవుతుంది. ఆయన 'అహింస', శాఖాహారం అనే అంశాలను కూడా చర్చించారు. బుద్ధిపూర్వకంగా హింసచేయడం, అవసరం కోసం చేసే హింసల మధ్య తేడాను ఆయన విశ్లేషించాడు. హింసలేని సంక్షేమరాజ్యాన్ని ఊహించారు.

డా॥బి.ఆర్. అంబేడ్కర్ వాఖ్యానించిన నవయాన బౌద్ధ సూత్రాలపై సాంప్రదాయక బౌద్ధుల ప్రతిస్పందన ఏంటి?

కాలచక్ర అనే ఈ అంతర్జాతీయ ఉత్సవం నవ బోధిసత్వుడైన అంబేద్కర్‌ను ఉపేక్షిస్తూ బౌద్ధ ఉత్సవంగా ఎట్లా పేర్కొంటుంది? బౌద్ధంలో హీనయాన సాంప్రదాయాలు, మహాయాన, వజ్రయాన సాంప్రదాయాలు వున్నాయి. ఏ సాంప్రదాయమూ రెండవదానిని ఉపేక్షించలేదు. అటువంటప్పుడు బౌద్ధం పుట్టిన దేశంలో అది చేపట్టిన విప్లవాత్మక సాంఘిక సంస్కరణను కొనసాగిస్తున్న వారసత్వం గల నవయానాన్ని ఎందుకు ఉపేక్షించాలి? సంఘరక్షిత వంటి బౌద్ధ గురువులు నవయానం ఎడల మంచిగా ప్రతిస్పందించారు. మరి కాలచక్ర ఎందుకు గుర్తించదు?

నవయాన సిద్ధాంతంలో కీలకాంశం కులనిర్మూలన. అంబేద్కర్ అభిప్రాయం ప్రకారం బౌద్ధం సమాజాన్ని మతాతీత, నైతిక, ప్రజాస్వామిక, సామ్యవాద సూత్రాలపై పునర్నిర్మించింది. ఈ సూత్రాలనే అశోకుడు ప్రయోగించి చూపించాడు.

నవయానం అంటే ఆధ్యాత్మిక సంస్కరణ కొరకు జరిగే ప్రయత్నం. నవయానం అంటే మనం జీవిస్తున్న ప్రపంచంలోనే సామాజిక, ఆర్థిక, రాజకీయ విముక్తి సాధించడం.

నవయానం చరిత్రలో ఒక గొప్ప చక్రవర్తి అమలువరచి చూపించిన సంక్షేమ రాజ్యాన్ని కోరుతుంది. నవయానం మానవజాతికి గొప్ప సౌజన్యాన్ని అందివ్వాలని ఆశిస్తుంది. ఒక మాటలో కులనిర్మూలన నవయానం యొక్క అంతఃసూత్రం. బుద్ధుడి నుండి గద్దర్ వరకు భారత సమాజంలో దళితుల పరిస్థితిపై వారి ఆనవాళ్లు నిలిచిపోతాయి. భారతదేశ చరిత్ర అంతా మూలవాసీ బౌద్ధ సంస్కృతి, బ్రాహ్మణీయ సంస్కృతుల కలయికగా వుంది. మేము బౌద్ధ సూత్రాలను పాటిస్తాం మేము బుద్ధుడి అనుచరుడైన ఆనందుని మార్గాన్ని పాటిస్తాం. అయోతిదాస్, లక్ష్మీనరసు అడుగుజాడల్లో నడుస్తాం. ఆ విధంగా దళితులమైన మేము బౌద్ధాన్ని స్వీకరించాం. ఎందుకంటే అది మా విముక్తి మార్గదాత డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ చూపిన మార్గం గనుక.

డా॥బి.ఆర్. అంబేద్కర్ లేని ఆధునిక బౌద్ధంలేదు. రండి! చర్చించండి! వీలైతే మాతో అంగీకరించండి లేదా విభేదించండి. వేరుపడండి. అంతే తప్ప కుట్రపూరిత మౌనాన్ని పాటించకండి. దళిత కవులు, రచయితలు, కళాకారులు, బౌద్దంలో విశ్వాసం కలిగినవారు బుద్ధుని అంబేద్కర్ సాంప్రదాయాల గురించి మాట్లాడటానికి సమావేశమౌతున్నాం. బుద్ధుడు, డా॥బాబాసాహెబ్ అంబేద్కర్ సంప్రదాయ వారసత్వాన్ని స్తుతిస్తున్నాం.

**జనవరి 2006 – బహుజన కెరటాలు**

# అంబేడ్కర్ నవయానం... ఒక కొత్త ప్రపంచం కోసం...

ఎన్ని కన్నీటి చుక్కలు బద్దలైతే జాతి ముఖంపైన ఇంద్రధనస్సు రంగులు వికసిస్తాయి? ఎంతగా గుండెలు బద్దలైతే వెదురుముక్క ఒక జీవన రవళిని వినిపిస్తుంది? గుండె, మస్తిష్కం, మానవ దేహంలోని కణంకణం ఎంతగా సంఘర్షిస్తే చీకటి మేఘాలలో ఒక వెలుతురు రేఖ పుడుతుంది?

లోకమంతటా ఎడతెగని దుఃఖం ఆవరించినప్పుడు, దారుణాతి దారుణంగా హింసా జ్వాలలు ప్రజ్వరిల్లుతున్నప్పుడు, సామాజికులు వర్ణ సామాజికులై, కొందరు దైవసమానులై, అధిపతులై, విజేతలై, మరికొందరు పశువులకన్నా హీనులై, పరాజితులై ఒక దుర్మార్గపు సామాజిక చలన సూత్రాల చట్రంలో నలిగీనలిగీ కనలి పోతున్నప్పుడు, సామాజిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, జ్ఞాన రంగాలు ఒక మహాసంక్షోభంలో కూరుకుపోయినప్పుడు ఒక చిరునవ్వుల వెలుతురు కిరణం సిద్ధార్థ గౌతముడిగా పుట్టింది. ఆయన నడయాడిన నేల నేలంతా వెలుతురు వానలు కురిసి మౌఢ్యపు మేఘాలు చెల్లా చెదురైపోయాయి. ఆయన హృదయ చాలనంతో సమాజపు అరచేతుల్లో సమతా కుసుమాల పతాకాలు రెపరెపలాడాయి. అట్టడుగు పొరల్లో కునారిల్లుతున్న అభాగ్యజీవులనే కాదు, పతితులు, భ్రష్టులు, దొంగలు, దోపిడీదారులు, వేశ్యలు, హీనమైనవృత్తుల వారు మాత్రమే కాదు, హింసను చెలరేపి రాజ్యాలకు రాజ్యాలను రక్తపుటేరుల్లో ముంచి సామ్రాజ్య విస్తరణ కాంక్షతో రగిలిపోతున్న రారాజులనుసైతం ఒక్క దయాపూరిత వీక్షణంతో సాధుజీవుల్ని చేసి, సంస్కారవంతులను చేసి మనుషులందరూ సమానులన్న భావనలను అందరి గుండెల్లోకీ ఆయన నింపాడు. మనిషిని కొట్టి, నరికి, చంపి జయించడం కాక, ఒక ప్రశాంతమైన వాక్కుతో హృదయాన్ని జయించడం ఆయన లోకానికి నేర్పాడు. ఆయుధాలను ఉపయోగించడం కన్నా మనిషే ఆయుధంగా మారడం ఎలాగో చూపించాడు. ఆ వెలుతురులో మనిషితనం పరిఢవిల్లింది. వైద్య, విద్యా, వైజ్ఞానిక రంగాలు వర్ధిల్లాయి. కళలు పరిమళించాయి. ఒక సంపూర్ణమైన వ్యక్తిత్వం ఆవిష్కృతమైంది.

అసమానత్వమే, మూఢత్వమే, దుర్మార్గమే, హింసాకాండే పునాదిగా బతికే హైందవం దీన్ని సహించలేకపోయింది. దారుణమైన కుట్రలు పన్నింది. పెను హింసాకాండకు పాల్పడింది. రక్తపాతాన్ని సృష్టించింది. ఆరామాలను ధ్వంసం చేసింది. బౌద్ధ భిక్కువుల శిరస్సులను ఖండించింది. నీచాతినీచమైన అత్యాచారాలకు పాల్పడింది. దుష్ప్రచారాలను సాగించింది. బౌద్ధాన్ని నాశనం చేయడానికి ఏమేంచేయాలో అన్నీ చేసి బుద్ధుడు పుట్టిన గడ్డ మీద నుండి తరిమి కొట్టడానికి అన్ని ప్రయత్నాలు చేసింది. భారత సామాజిక చరిత్రంతా బౌద్ధ సంస్కృతికీ, బ్రాహ్మణీయ హైందవ సంస్కృతికీ మధ్య జరిగిన సంఘర్షణల చరిత్రేనని బాబాసాహెబ్ అంబేడ్కర్ పేర్కొన్నారు.

కౌటిల్యపు బ్రాహ్మణ్యం బౌద్ధంపైన దాడిచేసి ధ్వంసంచేయగలిగినదానంతటినీ ధ్వంసం చేసి మిగిలిన అంశాలను తన ధృతరాష్ట్ర కౌగిలిలో యిముడ్చుకొని బౌద్ధ శిథిలాలపైన తన జెండాను పాతుకుంది. ఆనాటి నుండీ చరిత్ర పొడవునా బ్రాహ్మణీయ హైందవం సృష్టించిన రక్తసిక్త గాయాల మరకలే. అయినా ఆనాడూ ఈనాడూ దేశం గర్వపడే వారసత్వ సంపదగా చెప్పుకొంటున్న విలువలూ, ఆవిష్కరణలు అన్నీ బౌద్ధం అందించిన కానుకలే. బౌద్ధాన్ని తరిమిన హైందవం బుద్ధుడ్ని విష్ణువు దశావతారాలల్లో ఒకడ్ని చేసుకొంది. దుర్మార్గమైన కులవ్యవస్థను పటిష్టపరుచుకొని తన దోపిడీని అణచివేతనూ పటిష్టపరచుకొంది. ఒక సువర్ణయుగం అంతరించి మళ్ళీ ప్రజల బతుకుల మీదకు మళ్ళొక్కసారి కటిక చీకటి మేఘాలను ఆవరింప చేసింది.

అయినా... బౌద్ధం ప్రాబల్యం సన్నగిల్లినా దాని స్ఫూర్తి జాతి ఆత్మగా మిణుకు మిణుకు మిణుకుమంటూ వెలుగుతూనే వుంది. భక్తి ఉద్యమాల రూపంలో, కుల వ్యతిరేక ఉద్యమాల రూపంలో, దక్షిణాదిన అయోతీదాస్, అయ్యంకాళి తదితరులు నడిపిన ఉద్యమాల రూపంలో, ఫూలే సామాజిక విప్లవం రూపంలో బౌద్ధం స్ఫూర్తి ఒక మార్గదర్శిగా సమాజాన్ని నడిపిస్తూనే వుంది. అప్పుడు కాలం కడుపుతో వుండి బాబా సాహెబ్ అంబేద్కర్‌ను ప్రసవించింది.

ఒక దళిత నేతగా సామాజికరంగం మీదికి ప్రవేశించిన అంబేద్కర్, కేవలం దళితుల విముక్తికేకాక మొత్తంగా సమాజాన్ని ఆరోగ్యవంతమైన సమాజంగా పరివర్తింపజేయడానికి పెనుగులాడాడు. అందుకు బౌద్ధమే ఏకైక మార్గదర్శిగా ఆయన గుర్తించాడు. కారణం అందులో దేవుడు లేడు. మూఢవిశ్వాసాలు, దుర్మార్గపు క్రతువులు, కర్మకాండలులేవు. ముఖ్యంగా కులవ్యవస్థ తాలూకూ దారుణమైన అణచివేత లేదు. ఉన్నదంతా హేతుబద్ధత, సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం. అందుకే బాబాసాహెబ్ 1956 అక్టోబరు 14వ తేదీన తన లక్షలాది మంది సహచరులతో బౌద్ధాన్ని స్వీకరించారు. అప్పటివరకూ వున్న హీనయాన, మహాయాన, వజ్రయానాలలో తనది ఏ ధోరణీ కాదని ఆధునిక కాలానికీ, ఆధునిక పరిస్థితులకు అనుగుణంగా హేతు బద్ధంగా అభివృద్ధి చేసిన నవయానమే తన బౌద్ధమని ప్రకటించాడు. సనాతన ఛాందస హిందువులనుండేకాక, మార్క్సిస్టులు, సోషలిస్టుల నుండేకాక, సంప్రదాయ బౌద్ధుల నుండి కూడ ఆయన వ్యతిరేకతను ఎదుర్కొన్నాడు. అయినప్పటికీ సమాజంలో సమానత్వం కోసం, అజ్ఞానాంధకారాలను పారద్రోలడం కోసం, ప్రజల సంక్షేమాన్ని కాంక్షించే రాజ్యాన్ని పునర్నిర్మించడం కోసం ఆయన బుద్ధం, ధమ్మం, సంఘం శరణజొచ్చి తన ప్రజలకు తనను అనుసరించమని పిలుపునిచ్చాడు.

ఆ పిలుపుకు యిప్పుడు యాభై వసంతాలు (1956 – 2006). ఎక్కడికక్కడ స్వర్ణోత్సవ సంబరాలకు దళిత ప్రపంచం సిద్ధపడుతుంది. అంబేద్కర్ ఆశయాలకు పునరంకిత మయ్యేందుకు మళ్ళొక్కసారి సన్నద్ధమవు తుంది. ఆ ప్రయత్నాలన్నింటికీ "బహుజన కెరటాలు" ఆహ్వానం పలుకుతుంది. తానూ భాగస్వామ్యాన్ని స్వీకరిస్తుంది. అంబేద్కర్ అభివృద్ధి చేసిన

బౌద్ధాన్ని సామాజిక పునర్నిర్మాణ ఉద్యమాలకీ, వ్యక్తిగత జీవితాలకీ మరింత సృజనాత్మకంగా అన్వయించుకొని ఆచరణలో ముందుకు వెళ్ళేందుకు యిదొక సందర్భంగా, ఒక స్ఫూర్తిగా వుండాలని ఆకాంక్షిస్తుంది. ఈ సంవత్సరం మాత్రమే కాదు, యిక ముందునుండి అంబేద్కర్ నవబౌద్ధ యుగంగా కాలం నడవాలని కోరుకుంటుంది.

ఈ ఆనందసమయాన, ఈ సంరంభ సమయాన ధమ్మదీక్షా ఉద్విగ్నతా సమయాన, చిత్తశుద్ధితో అంబేద్కరిజానికి కట్టుబడి సామాజిక మార్పుకోసం కృషిచేస్తున్న అంబేద్కర్ వాదులకు "బహుజన కెరటాలు" ముందస్తుగా, సవినయంగా ఒక పారాహుషార్ హెచ్చరికను చేస్తుంది.

బ్రాహ్మణీయహైందవం, బౌద్ధాన్ని హతమార్చి, బుద్ధుడ్ని దేవుణ్ణి చేసి తనలో కలిపేసుకుంది. బౌద్ధాన్ని నాశనం చేయడానికి బ్రాహ్మణీయ శక్తులు స్వయంగా బౌద్ధంలోకి ప్రవేశించి లోపలి నుండి తూట్లుపొడిచారు.ఆయన అనుయాయులుగా, అనుచరులుగా వుంటూనే ఆయన స్ఫూర్తిని నాశనంచేసి తమ ప్రయోజనాలను కాపాడుకున్నారు.

బాబాసాహెబ్ అంబేద్కర్ ఉద్యమాన్ని తూట్లు పొడవడానికి ఆయన బతికుండగానే ఆయన వ్యతిరేక శక్తులు ఆయన అనుయాయులుగా చేరి లోపలినుండి దెబ్బతీయడానికి ప్రయత్నించారు. అంబేద్కర్ పేరుకూ, సిద్ధాంతానికీ పెరిగిన ప్రాబల్యాన్ని సొమ్ముచేసుకోడానికి ఆయన్ని అంతర్జాతీయ విపణి సరకుగా మార్చారు.

యిప్పుడీ ధమ్మ దీక్షా స్వర్ణోత్సవ సంబరాలు. యిప్పటికే బ్రాహ్మణీయ శక్తులు దలైలామాలను రంగంలోకిదించి కాలచక్రాలను తిప్పుతోంది. ఒక మహాసామాజిక విప్లవంగా కొనసాగవలసిన బౌద్ధ ఉద్యమాన్ని మతపరమైన కర్మకాండగా, క్రతువులుగా మార్చే ప్రయత్నాలు, కుట్రలు బహిరంగంగానే మొదలుపెట్టాయి. అంబేద్కర్ కారణంగా బౌద్ధానికి పెరిగిన ప్రాబల్యాన్నీ, జనాకర్షణనూ సొమ్ముచేసుకోడానికి ప్రభుత్వాలు బుద్ధిజాన్ని టూరిజంగా మార్చే ప్రక్రియ ఏనాడో మొదలుపెట్టాయి. అంబేద్కర్ పేరు చెప్పుకొని, బుద్ధుడిపేరు చెప్పుకొని వాళ్ళిద్దర్నీ గ్లోబల్ మార్కెట్‌లో సరుకులుగా మార్చి అమ్ముకోడానికి సిద్ధపడుతున్నవాళ్ళు తక్కువ మందిలేరు. వీరందరిపట్లా అంబేద్కర్ నిజమైన వారసులు అప్రమత్తంగా వుండాలని 'బహుజన కెరటాలు' పిలుపునిస్తుంది.

ఏమైనా... ఏది ఏమైనా ఈ దేశం బౌద్ధదేశం! ఈ దేశ సంస్కృతి బౌద్ధ సంస్కృతి!! ఓడిపోయినచోటే అది గెలిచి నిలబడుతుంది!!! ఎందుకంటే అది కోట్లాది ప్రజల ఆకాంక్ష. దాని ఆశయం మానవత్వం. అంబేద్కర్ అభివృద్ధి చేసిన బౌద్ధం వెలుతురులో మళ్ళీ దేశంలో సమతా మమతలు పురుడు పోసుకోవాలి. అందుకు మనమంతా మంత్రసానులం కావాలి.

ఏతం బుద్ధాను సాసనం!

**జైభీమ్!!**

**అక్టోబర్ 2006 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# వికసిత బుద్ధం.... నిర్మిత సంఘం.... సమతా ధమ్మం
# "ఏతం బుద్ధాను సాసనం"

"ఇవాళ ప్రపంచం
క్రూర ఘోర ద్వేషాగ్ని జ్వాలల్లో కనలిపోతున్నది
దుర్మార్గపు దుర్నీతి వలయాలుగా కమ్ముకొన్నది
ఓ అనంత జీవన ప్రదాతా!
నువ్వు మళ్ళీ పుట్టాలని
సమస్త జీవకోటి ఆక్రోశిస్తున్నది
మరణంలేని నీ ఆశావహ వాక్కులతో మమ్మల్ని కాపాడి
నీ విద్యుత్ తేజంలో సుమధుర ప్రేమ పద్మాన్ని వికసించనీ
విముక్తుడా! ఓ విమల హృదయుడా!
ఈ గడ్డ గుండెలమీద పరచుకున్న చీకటి మరకలను
నీ కరుణావర్షంలో కడిగివేయి...
... మాకు త్యాగంచేసే శక్తినిచ్చి
మాలోని అహంకారాన్ని నశింపచేయి...

– రవీంద్రనాథ్ ఠాగూర్

ఎవరు ఆవిష్కరించగలరు చిరుమందహాసంలో ఒక సుందర సమతా లోకాన్ని? మనిషికీ మనిషికీ మధ్యన మనసుకూ మనసుకూ మధ్యన అఖాతాలేర్పడుతున్నప్పుడు ఆ అఖాతాలను పూరించే ఒక అమృతగానాన్ని ఏ గుండెలు చిల్లులు పడ్డ వెదురుముక్క వినిపించగలదు? ఊపిరికీ ఊపిరికీ మధ్యన ఊపిరి సలపనంత యుద్ధం చెలరేగి మనిషి లోపలి సముద్రాలు కల్లోల వేదనై రోదిస్తున్నప్పుడు ఏ ప్రశాంత వదనం ఒక పిడికెడు శాంతిని ప్రసాదించగలదు? అడవులకు అడవుల్నే నరికి మొక్కల్ని పెంచమనే కాపట్యం, మనుషుల్ని చంపి మానవత్వం కోసం వలవలా విలపించే దుర్మార్గపు రాచధర్మం రాజ్యమేలుతున్నప్పుడు, హింస, ద్వేషం, అసూయ,దురాశలే యుగధర్మాలుగా విలయిస్తున్నప్పుడు ఏ విశ్వాసపు శ్వాస ఒక స్వచ్ఛమైన పసిపాప చిరునవ్వును వాగ్దానం చెయ్యగలదు?

మనుషులే... కొందరు సింహాలై, పులులై, నక్కలై, క్రూరాతిక్రూర మృగాలై భుజాలమీద అధికార దర్పాలను ధరించి వినువీధుల్లో విహరిస్తూ, మరికొందరు మేకలై, సాధుజంతువులై కనురెప్పలక్రింద కన్నీటి కొండల్ని మోసుకుంటూ పాతాళానికి జారిపోతూ... ఒక భయానక దమననీతి కరాళతాండవం చేస్తున్నపుడు, కుత్తుకలు తెగిపడ్డ ఆకాంక్షల నెత్తుటి చిత్తడిలో...

నెత్తురారబోసిన చీకటిలో ఎవరి గంభీరస్వరం శాసించగలదు భూమ్యాకాశాల మధ్య విస్తరించిన శోకసముద్రాలను? సమాజమొక బలిపీఠమై నిండు జాబిల్లిలా ఒక సంపూర్ణత్వంలోకి ప్రవహించవలసిన మనిషితనం శకలాలు శకలాలుగా విచ్ఛిన్నమైన ఒక అమానవీయవిలువల వలయంలో పరిభ్రమిస్తూ కులోన్మాద, మతోన్మాద, ధన మదోన్మత్త సామాజికులై మనుషులు తీవ్ర అలజడిలో పరితపిస్తున్నప్పుడు ఎవరి మార్గదర్శకత్వం సుఖదుఃఖాదిక ద్వంద్వాతీత స్థితిని కల్పించగలదు?

దాదాపు పాతికవందల ఏళ్ళ క్రితం ఈ గడ్డమీద తిరుగాడిన ఒక మహోన్నత వ్యక్తిత్వం అజ్ఞానాంధకారాన్ని, పారద్రోలేజ్ఞానజ్యోతులను వెలిగించింది. అంతంలేని విషాదగుహల్లో నివసిస్తున్న మానవ మస్తిష్కాలకు జీవనరహస్యాలను బోధించి హృదయాలను కరుణార్ద్రం చేసింది. ఆ వ్యక్తిత్వం సిద్ధార్థుడిది. చరిత్ర అతన్ని బుద్ధుడు అని పిలుచుకొంది.

సిద్ధార్థ గౌతముడు క్రీస్తుపూర్వం 563వ సంవత్సరంలో లుంబినీవనంలో పుట్టాడు. అతని తల్లిదండ్రులు శుద్ధోదనుడు, మహామాయ. సిద్ధార్థుడు పుట్టిన ఏడురోజులకే అతని తల్లి మహామాయ చనిపోయింది. తర్వాత ఆయన పినతల్లి మహాప్రజాపతి పెంపకంలో అల్లారుముద్దుగా పెరిగాడు. సిద్ధార్థుడి పుట్టుక గురించి అనేక కట్టుకథలు ప్రచారంలో వున్నాయి. కానీ ఏదీ చరిత్రకు నిలబడేదికాదు. అతని తండ్రిది శాక్యగణం. వారి రాజధానీనగరం కపిలవస్తు. వారి రాజ్యం నేపాల్‌కు దక్షిణంగా గంగానది వరకూ వున్న తొమ్మిది వందల చదరపు కిలోమీటర్లు విస్తరించి వుండేది. ప్రస్తుతం తెరై అని పిలువబడే ప్రాంతమే ఆనాటి సిద్ధార్థుడి వంశమైన శాక్యులు పరిపాలించిన ప్రాంతం.

రాజకుమారుడుగా విలాసవంతమైన జీవితాన్ని గడిపిన సిద్ధార్థుడు చిన్న వయసులోనే కోలీ రాజకుమార్తె యశోధరను పెళ్ళి చేసుకొన్నాడు. వారిద్దరికీ రాహుల్ అనే కొడుకు పుట్టాడు. అందమైన భార్య, ముద్దులొలికే కొడుకు ఏది కావాలని కోరితే అది అందించేందుకు సిద్ధపడే తండ్రి. చుట్టూ దాసదాసీ జనాంగం. సంపదలు ఎన్నివున్నా తన చుట్టూ వున్న సమాజంలో నెలకొన్న అశాంతి, దుఃఖం, కష్టాలపైనే సిద్ధార్థుడి ఆలోచన. తన చుట్టూవున్న బ్రాహ్మణపండితులు, మతాచార్యులూ సిద్ధార్థుడి ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానం చెప్పలేకపోయారు. సిద్ధార్థుడి ప్రశ్న దేవుడు కాదు మనిషి. నిండైన సంపూర్ణ మానవత్వం సాధించడమంటే ఏమిటి? ఎపుడు మనిషి రాగద్వేషాలకు అతీతుడై జీవిస్తాడు? ఈ ప్రశ్నలకు సమాధానం కోసం సిద్ధార్థుడు సకలరాజ్య సౌభాగ్యాలనూ పరిత్యజించి లోక సంచారానికి బయలుదేరాడు. సిద్ధార్థుడు బుద్ధత్వాన్ని సంతరించుకోవడం కోసం మహాభినిష్క్రమణం చేశాడు. మహా సామ్రాజ్యాన్ని నిర్లక్ష్యం చేసి కోట్లాది ప్రజల హృదయ సామ్రాజ్యాలను పరిపాలించడంకోసం మహా పరిత్యాగై రాజప్రసాదాన్ని వదిలి వెళ్ళాడు. ఆయన తపన

హెచ్చుతగ్గులు లేని ఒక నూతన సమాజాన్ని స్థాపించడం... దుర్మార్గపు ఆలోచనలు లేని ఒక సరికొత్త మానవుడ్ని ఆవిష్కరించడం. ఆయన గొడవ ఆత్మపరమాత్మలను సాధించడంగాదు. సామాజిక, పాకృతిక చలన సూత్రాలను దర్శించడం. ఆ ప్రయత్నంలో ఇల్లు విడిచి ఉరువేల అడవులకు (ప్రస్తుతం బోధ్‌గయ అని పిలుస్తున్న ప్రాంతం) వెళ్ళాడు. అక్కడ ఎందరో బ్రాహ్మణగురువుల్ని కలసికొని హిందూమత సారాన్ని గ్రహించాడు. తను కోరుకున్నది అది కాదన్నది తెలుసుకొన్నాడు. మాయలూమంత్రాలూ సాధించి మోక్షానికి వెళ్ళడమన్నది వట్టి భ్రమేనని తేల్చుకున్నాడు. మనిషి లోపలి అహం "నేను" అన్న భావనను విచ్ఛిన్నం చేయడానికి సరైన మార్గం కోసం సుదీర్ఘ అన్వేషణ చేశాడు. కార్యాకారణ సంబంధాలను తెలుసుకోవడానికి ఉరువేల అడవిలోని బోధివృక్షం క్రింద కూర్చుని దీర్ఘ ఆలోచనా నిమగ్నుడయ్యాడు. ఆరేళ్ళపాటు మస్తిష్క మధనం చేసిన తర్వాత జీవన సత్యాలకు సంబంధించిన జ్ఞానాన్ని తెలుసుకొన్నాడు. తన మొట్టమొదటి జ్ఞానబోధనను తన ఐదుగురు శిష్యులకు సారనాథ్‌లోని మృగవనంలో చేశాడు. అందులో నాలుగు ప్రాథమిక సత్యాలను బోధించాడు. 1) ప్రపంచంలో దుఃఖం వున్నది (దుఃఖ) 2) దానికి కారణమున్నది (సముదాయ) 3) దానిని తొలగించవచ్చును (నిరోధ) 4) అందుకు ఎనిమిది సూత్రాలతో ఆచరించవలసిన మార్గమున్నది (మార్గం) అని సోదాహరణంగా వివరించాడు. ఆ మార్గాన్ని అష్టాంగ మార్గమని పిలిచారు. 1) హేతువుతో కూడిన సక్రమమైన ఆలోచన (సమ్యక్ దృష్టి) 2) ఉన్నతభావాలతో, ఉన్నత ఆశయాలతో కార్యనిర్వహణ చేయడం (సమ్యక్ సంకల్పం) 3) సాటివారితో సత్యమైన మాటలాడడం (సమ్యక్ వాక్కు) 4) నీతి నిజాయితీ గలిగిన స్వచ్ఛమైన నడవడికతో ఉండడం (సమ్యక్ ప్రవర్తన) 5) ఇతరులను అగౌరవ పరచకుండా మంచి జీవితాన్ని గడపడం (సమ్యక్ జీవనం) 6) విధి నిర్వహణలో సక్రమమైన పద్ధతులను ఆచరించడం (సమ్యక్ ప్రయత్నం) 7) ఎల్లపుడూ జాగరూకతతో మెలగడం (సమ్యక్ జాగ్రత్త) 8) విధులను నియమం తప్పకుండా ఆచరిస్తూ మనసును స్వాధీనంలో ఉంచుకోవడం (సమ్యక్ ధ్యానం). ఇవి బుద్ధుడు సూచించిన అష్టాంగమార్గం.

ఈ మార్గాన్ని ఆవిష్కరించడానికి బుద్ధుడు దేశసంచారంచేసి, సామాజిక రుగ్మతలనూ, మనుషుల బలహీనతలనూ అవగాహన చేసికొని, ఆధ్యాత్మిక భావనలను, తాత్విక చింతనలను తార్కిక దృష్టితో అధ్యయనంచేసి ఎందరి జీవితానుభవాలతో తరచి చూసి ఎన్నో చేదు అనుభవాలను ఎదుర్కొని, ఎందరితోనో వాగ్యుద్ధాలు చేసి తన సుదీర్ఘమైన జీవితానుభవానికి మేధస్సును జోడించి బౌద్ధధర్మాన్ని రూపొందించాడు. బుద్ధుడు బోధించింది అహింసామార్గాన్నే కానీ అహింసను కాపాడడానికి హింసాయోగం గూడా తప్పనిసరి అని గుర్తించాడు. కుల, వర్గ, లింగ తదితర వివక్షలేని సమాజాన్ని స్థాపించేందుకు జీవితాంతం పరివ్రాజకుడై సంచరిస్తూ ధర్మబోధ చేశాడు.

తన ముగ్గురి గురువుల్లో ప్రథముడిగా బుద్ధుడ్ని పేర్కొన్న డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ 1956 అక్టోబర్ 14వ తేదీన లక్షలాదిమంది తన అనుచరులతో సహా బౌద్ధదీక్షను తీసుకొంటూ తాను బౌద్ధాన్ని ఐదు కారణాలవలన స్వీకరిస్తున్నానని దీక్షాభూమిలో ఇచ్చిన చారిత్రక ఉపన్యాసంలో వెల్లడించారు.

1) మొదటిది సమానత్వం. వేర్వేరు నదుల్లోని నీరువచ్చి సముద్రంలో కలిసినపుడు అది ఏకమై ఒకే నీరుగా మారుతుంది. ఆ విధంగా రకరకాల కులాలనుండి హోదాలనుండి బౌద్ధంలోకి వచ్చినవారు కులాలను, అంతస్తులనూ మరచి ఒకే బౌద్ధ సంఘంలో సభ్యులైపోతారు.

2) దేవుడు, పరలోకం, ఆత్మ, కర్మలమీద బౌద్ధానికి విశ్వాసంలేదు. ప్రజలు తమ బాధలను నిర్మూలించుకోడానికి దేవుడిమీద ఆధారపడకుండా స్వయంకృషితో హేతుబద్ధమైన మార్గాన్ని అనుసరించడమే బౌద్ధం.

3) ధర్మం అనేపదానికి బుద్ధుడు విప్లవాత్మకమైన అర్థాన్ని ప్రవచించాడు. బౌద్ధంలో ధర్మం అనే పదానికి పూజాపునస్కారాలతో, కర్మకాండలతో ఎలాంటి సంబంధము లేదు.

4) బౌద్ధమతం అంటే ఒక నీతిబాట. ఇతర మతాలకు దేవుడు ముఖ్యమైతే, బౌద్ధానికి లౌకికనీతి ఆధారం. మానవుడిని సత్ప్రవర్తనతో, నైతిక శిక్షణతో నడిపించడమే బౌద్ధ ధర్మం.

5) వర్ణ వ్యవస్థను ఖండించడం. శూద్రులకు, స్త్రీలకు కూడా బౌద్ధ సంఘంలో సమాన స్థాయిని కల్పించడం.

ఈ ఐదు విషయాలే బౌద్ద మతసారం. హిందూమతం బౌద్ధ మతాన్ని శత్రువుగా భావించింది. అగ్ని పురాణం బుద్ధుడిని 'గయాసురుడు' అనే రాక్షసుడిగా అభివర్ణించింది. జీవించినంత కాలం హిందూధర్మానికి వ్యతిరేకంగా కులవ్యవస్థకు వ్యతిరేకంగా ఉద్యమించి క్రీస్తుపూర్వం 483వ సంవత్సరం వైశాఖమాసం (ఏప్రిల్,మే) పౌర్ణమిరోజున కాశీకి 120 మైళ్ళదూరంలోని కుశినార అనే ప్రదేశంలో ఆఖరిశ్వాస విడిచాడు. ఆయన జీవించి ఉండగా ఆయనపట్ల పరమద్వేషాన్ని వెళ్ళగక్కిన హిందూమతం ఆయన్ని మరణానంతరం విష్ణువు దశావతారాల్లో ఒక అవతారంగా ప్రకటించి ఆయన బోధించిన ధర్మంలోకి ఆత్మవాదాన్ని జొప్పించింది. బౌద్ధ ఆరామాల్ని నాశనంచేసి హిందూ దేవాలయాలుగా మార్చివేసింది. అమరావతిలోని అమరలింగేశ్వర దేవాలయం, విజయవాడలోని కనకదుర్గ గుడి అందుకు ప్రత్యక్ష తార్కాణాలు.

బుద్ధుని నిర్యాణానంతరం బౌద్ధం మహాయాన, హీనయాన, వజ్రయాన శాఖలుగా విడిపోయింది. బ్రాహ్మణుడైన నాగార్జునుడు తన మాధ్యమిక శూన్యవాదాలను బౌద్ధమతంలోకి

ప్రవేశ పెట్టాడు. ఎన్ని వక్రీకరణలు జరిగినా బౌద్ధం ఒక జీవనవిధానంగా అంతర్జాతీయంగా వ్యాప్తి చెందుతూనే ఉంది. అజంతా, ఎల్లోరాగుహల్లోని శిల్పసంపద, చిత్రలేఖనం, బౌద్ధం అభివృద్ధి పరచిన కళాఖండాలే. నలందా, గయ విశ్వవిద్యాలయాలు బౌద్ధజ్ఞానాన్ని పంచి పెట్టాయి.

తెలుగు గడ్డ మీద ఒకప్పుడు బౌద్ధధర్మం విలసిల్లి సమతా పరిమళాలను వెదజల్లింది. పెరిగిన శాస్త్రవిజ్ఞానాన్ని, మారిన కాలాన్ని, చెలరేగిన మానవ విముక్తి ఉద్యమాలనూ, అవి ఆవిష్కరించిన సత్యాలనూ బౌద్ధసంఘవాదంలో మిళితంచేసి ఒక సంపూర్ణమైన సమాజనిర్మాణంలో తాత్విక ఆయుధంగా బౌద్ధాన్ని మనం స్వీకరించాలి. ప్రపంచంలో ఏర్పడిన సమతా రాజ్యాలు కుప్పకూలిపోయిన నేపథ్యంలో బౌద్ధసాంస్కృతిక విలువల ఆసరాతో సమసమాజ నిర్మాణానికి పూనుకోవాలి. చనిపోయేముందు బుద్ధుడే "భిక్షులారా! నామీద భక్తితో నేను చెప్పిన మాటల్ని యధాతథంగా స్వీకరించవద్దు. తర్కం అనే గీటురాయి మీద దాన్ని పరీక్షించి ఆ తర్వాతనే స్వీకరించండి" అని చెప్పాడు. ఆయన బోధించిన గతితర్కం, భౌతికవాదం ప్రస్తుత పరిస్థితులకు అనుకూలంగా అన్వయించుకోవాలి. బౌద్ధం ఆవిష్కరించిన విలువలను మన దైనందిన జీవితంలోకి ఆవాహన చేసుకోవాలి. బౌద్ధం ఒక సజీవ ఉద్యమం.

**బుద్ధం శరణం గచ్ఛామి**
**సంఘం శరణం గచ్ఛామి**
**ధర్మం శరణం గచ్ఛామి**

**లోకాయత ప్రచురణ : దళిత కిరణాలు నుండి**

# మానవత్వం కోసం కవిత్వం నారుబోసిన కబీరు

ఈ మాటలు కబీరు తనను గురించి తాను చెప్పుకున్న కవితలలోనివి. ఎలాచనిపోవాలో తెలుసుకున్న మనిషి ఎలా జీవించాలో తెలుసుకుంటాడు. మృత్యువును ఒళ్ళో పడుకోబెట్టుకొని జీవరహస్యాలు బోధించడం కదా జీవితం. లిప్తలు లిప్తలుగా కరిగిపోయే కాలమై లయించి ఒక సంపూర్ణత్వంలోకి ప్రవహించే నిరంతర యాత్ర కదా జీవితం. పుట్టుకకూ చావుకూ మధ్య మనిషితో కాలం ఆడే దాగుడు మూతల దోబూచులాట కదా జీవితం. "తల్లిగర్భం నుండి శ్మశానందాకా సాగే ఊరేగింపు" కదా జీవితం.

మనిషి మరణం అతను జీవించిన పద్ధతిని వివరిస్తుంది. అందుకే బతకటానికి, చావడం నేర్చుకోవాలి. చావుకు తెగించి బతకటం నేర్చుకోవాలి. బతుకును కబళించడానికి అడుగడుగునా పొంచియున్న చావు సంస్కృతిని కూల్చడం నేర్చుకోవాలి. కబీరుకు ఆ రహస్యం తెలుసు.

దళిత విముక్తి తత్వాన్ని ఆవిష్కరించిన డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ తన గురుత్రయంలో కబీరుని ఒకరిగా పేర్కొన్నారు. "ఎన్నెన్నో మాయలు చేసినవాళ్ళు మహాత్ములుగా బతికిపోతున్న కాలంలో మనిషిగా... మంచి మనిషిగా బతకడమే కష్టమైన విషయం" అన్న కబీరు సూక్తే అంబేద్కర్ మంచి మనిషిగా బతకడానికి ప్రేరణ. మంచి మనిషిగా బ్రతకడం అంటే చెడుమీద తిరుగులేని పోరాటం ప్రకటించి మానవతా విలువలను ప్రతిష్టించడం. దారిపొడవునా పాతుకున్న శిలువల్లా మృత్యు విలువలు మనిషిని ప్రతినిముషం కబళిస్తూ మృత ప్రాయుడిగా మారుస్తున్నప్పుడు ఆ మృత్యు విలువలను సమూలంగా నిర్మూలించడానికి చావుకైనా సిద్ధపడి పోరాడటమే జీవించడం అంటే. దుర్మార్గపు పరిస్థితులకు లొంగిపోయి బతకడం మరణంతోనే సమానం. వాటినెదుర్కొంటూ మరణించినా అది అమరత్వమే. ఇదే కబీర్ మన సమాజానికిచ్చిన సందేశం. కబీరుకు మరణించడం ఎట్లాగో తెలుసు. అందుకే జీవించడం ఎట్లాగో తెలిసింది.

కబీర్ భక్తి ఉద్యమకారుడే. భక్తి పేరుతో కొనసాగుతున్న దారుణమైన దుర్మార్గాల్ని ఎండగట్టి భక్తి పేరుతోనే, భక్తిలోని మూఢత్వం పైన విరుచుకపడి మానవతావాద స్ఫూర్తిని అందించినవాడు కబీరు. అందుకే ఆయన సందేశం మనకు ఆదర్శప్రాయం. భక్తి అనే టెంకను పడేసి మనం ఆయన ప్రభోదించిన మానవతావాదం అనే గుజ్జును స్వీకరించాలి. హిందూ మతంలోనూ, ఇస్లాం ఛాందస వాదంలోనూ గూడుకట్టుకున్న క్రౌర్యానికి వ్యతిరేకంగా ఆయా మతాల నుండే సంస్కరణ బాటలో భక్తి ఉద్యమాలు ఉద్భవించాయి. దుర్మార్గపు మూఢాచారాలమీదా, పురోహితుల స్వార్ధచింతన మీదా పోరాటం ప్రకటించి, కులాన్ని నిర్మూలించి, కులాన్ని నిరాకరించి, అస్పృశ్యతను నిర్మూలించేందుకు పాటుపడి మానవ

విలువల్ని ప్రతిపాదిస్తూ భక్తి ఉద్యమాలు ఆవిర్భవించాయి. ఆ భక్తి ఉద్యమాలలో అత్యున్నత స్థానానికి చేరుకున్నాడు కబీర్. బ్రాహ్మణవాద హిందూసమాజం పరమకర్కశంగా సగటు భారతీయ జీవితాన్ని చిద్రంచేస్తున్నప్పుడు, మనిషి పైకి మనిషిని ఉసిగొలిపి అమానుష విద్వేష జ్వాలల్ని చెలరేపుతున్నప్పుడు, మతం పేరుతో కుల వ్యవస్థ పేరుతో భయానక దారుణాలు అధికారికంగా సాగిపోతున్నప్పుడు సమాజానికి పరస్పరం ప్రేమించే గుణాన్ని నేర్పినవాడు కబీర్.

"పాపాత్ముడూ, పుణ్యాత్ముడూ రాల్చే కన్నీళ్ళకు తేడాలేదు. ప్రేమ పూరిత హృదయం రక్తాశ్రువుల్ని రాలుస్తుంది" అంటూ తన ద్విపద (దోహా) కవితలద్వారా రక్తచలన సంగీతాన్ని వినిపించినవాడు కబీరు. కబీరు స్మరించింది రామనామాన్నే. అయితే ఆ రాముడు హిందువులు పూజించే రాముడు కాదు. కబీరు విగ్రహారాధననూ, హైందవాచారాలనూ ద్వేషించాడు. మనుష్యులందరూ సహజీవనం చేయాలనీ, పరస్పరం ప్రేమతో మెలగాలనీ, మనుషుల్లో మానసిక పరివర్తన అవసరమనీ, "నిర్గుణ భక్తి" మార్గాన్ని ఆయన ప్రతిపాదించాడు. ఈ మార్గానికే ఆయన రామనామ స్మరణ అనేపేరు పెట్టుకున్నాడు. ఇందులో ప్రేమ, విరహం ప్రముఖంగా ఉంటాయి. ఈ మార్గంలో సమాజ పరివర్తన చేయడానికి ఆయన "సురటి యోగం" అనే నూతన విధానాన్ని రూపొందించాడు. మనుషులు స్వచ్ఛందమైన సహజీవనం గడుపుతూ వైదిక విధి నిషేధాలనూ, మత నియమాలనూ లెక్కచేయకుండా సరళమైన జీవితాన్ని గడపడమే సురటి యోగం. ఈ జీవన విధానాన్ని ప్రచారం చేయడానికి ఆయన తన బోధనలను కవితల రూపంలో వెలువరించాడు. ఆయన కవితల్లో సాంద్రత, జీవితాన్ని ప్రతిఫలించే తత్వం మెలాంకలీ రాగంలో వినిపిస్తుంది.

ఈ విషయాన్ని గురించి చెప్పిన ఆయన తర్కం అసమానమైనదిగా వుంటుంది. ఆయన జ్ఞానం పదునైన ఖడ్గంలా మెరుస్తుంది. ఆయన రచనల్లో భయరహితమైన, స్వతంత్రమైన, సంప్రదాయ వ్యతిరేకమైన ధోరణి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

కబీరు ముస్లిం మతానికి చెందిన చేనేత వృత్తి ఆధారంగా జీవించే కుటుంబంలో పుట్టాడు. హిందూ అగ్రవర్ణ సమాజంలో పుట్టుక రీత్యా అట్టడుగు వర్గంవాడు. ఆయన పుట్టినతేదీ, తల్లిదండ్రులు గురించి అనేక రకాల కథలు ప్రచారములో వున్నాయి. అనేక రకాల ఆధారాలను పరిశీలించిన మీదట 1455 ప్రాంతంలో కబీరు జన్మించి ఉండొచ్చని ఒక అంచనా. అతని తల్లిదండ్రులు వీరూ – వీమా దంపతులని అంటారు. వాళ్ళకు కబీరు ఎక్కడో దొరికాడనీ, వాళ్ళు తెచ్చుకొని పెంచారనీ మరొక వాదన. ఈ వాదోపవాదాలు మధ్యలో పుక్కిట పురాణ కల్పనలకీ అవకాశం ఉండనే వుంది. కబీరును భగవంతుని అవతారంగా ప్రచారంచేసి ఇప్పుడు అనేకచోట్ల గుళ్ళు గోపురాలుకట్టారు. ఎన్నో మహాత్యాలను వూరూరా ఆపాదించారు. హిందూవర్ణాశ్రమ ధర్మం తనకు వ్యతిరేకంగా నిలబడిన వారిని

నాశనం చేయడమో, కుదరకపోతే స్వంతం చేసుకొని తమ ధర్మంలో అంతర్భాగమేనని ప్రచారంచేసి ఆ పోరాట స్ఫూర్తిని జీవరహితం చేయడమో చేస్తూ వచ్చింది. వైదికమతం మీద తిరుగులేని పోరాటం నడిపిన బుద్ధుణ్ణి విష్ణువు దశవతారాల్లో ఒకటిగా ప్రచారం చేసినట్లు వైదిక ధర్మానికి వ్యతిరేకంగా బోధనలుచేసి ప్రజాబాహుళ్యం అభిమానాన్ని చూరగొన్న వారందరినీ తమ ముక్కోటి దేవతల్లో ఎవరో ఒకరి అవతారంగా ప్రచారంచేసి దానికి అనుకూలంగా ఒక పుక్కిటి పురాణాన్ని సృష్టించడం హిందూ ధర్మంలో ఆనవాయితీయే. ఇట్లా కబీరును గురించి ఎన్నో పుక్కిటి పురాణాలు పుట్టి ప్రచారమయ్యాయి.

నిజానికి కబీరు ఇస్లాం మతానికి చెందినవాడు. అప్పటి ముస్లిం పాలకులు హిందూపాలకుల్లాగానే పరమత సహనంలేని సంకుచితత్వంతో కూరుకుపోవడంవలన ఇతర మతస్తులను హింసించడం సాధారణంగా ఉండేది. మత ఛాందస భావంతో ఇతరులను క్రూరంగా హింసించే విధానాన్ని కబీరు తీవ్రంగా నిరసించాడు. అదే విధంగా హిందూ కర్మకాండల్ని, మతం పేరుతో జరుగుతున్న అరాచకత్వాన్ని ఎండగట్టి కబీరు ప్రేమతత్వాన్ని బోధించాడు. ఆ రోజుల్లో మతగురువులు పరాన్నభుక్కులుగా నాలుగు దేవుడు మాటలు చెప్పి తమ పబ్బం గడుపుకోవడానికి యాచన చేసుకొని సుఖభోగాలను అనుభవించేవాళ్ళు. ఆశ్రమాల నిర్వహణ పేరుతో రాజులనాశ్రయించి అమితమైన ధనరాశుల్ని కూర్చుకొనేవాళ్ళు. కర్మకాండల పేరుతో ప్రజల రక్తాన్ని పీల్చి పిప్పిచేసేవాళ్ళు. ఆ పరిస్థితుల్లో గురువు అనేవాడు సోమరిగా వుండరాదని, శ్రమ చేయాలనీ బోధించి తాను స్వయంగా మగ్గంనేసి వచ్చిన ఆదాయంతో అన్నదాన కార్యక్రమాలు నిర్వహిస్తూ మానవతావాద బోధనలు చేసేవాడు కబీర్.

ముస్లింగా పుట్టి హిందువుల దేవుడైన రాముణ్ణి స్మరిస్తున్నాడని ఆయన మీద ముస్లిం ఛాందసవాదులు కత్తిగట్టారు. రాముణ్ణి స్మరిస్తూ రాముడికి వ్యతిరేకంగా హిందూ విధానాలను తూర్పారబడుతున్నాడనీ, కర్మకాండల్ని నిరసిస్తున్నాడనీ హిందువులు ఆయనను ద్వేషించారు. పాలకులు ఆయనను చిత్రహింసలు పెట్టారు. అయినా తాను నమ్మిన విషయాన్ని చివరిదాకా బోధ చేస్తూనే బతికాడు కబీరు. ఆయన దగ్గర హిందువులూ, ముస్లింలూ శిష్యులుగా చేరారు.

మనిషి స్వార్థాన్ని ఎత్తిచూపుతూ "ఇంత పెద్ద గోడలతో ఎందుకంత విశాల భవనాన్ని నిర్మిస్తావు? ఆరడుగుల చోటు నీకు సరిపోతుంది కదా!" అంటాడు కబీరు. పరస్పరం కలహించుకొనే హిందూ ముస్లింలను దృష్టిలో ఉంచుకొని "రామరామ అంటూ హిందువులు మరణిస్తారు. ఖుదా పేరు తలచుకొని ముస్లింలు తనువు చాలిస్తారు. ఇద్దరికీ దూరంగా ఉన్నవాడే జీవిస్తాడు అంటాడు కబీరు" అని రాస్తాడు. జీవన విషాదాన్ని ప్రతిబింబిస్తూ "వీణ ఇక మీటదు... తీగెలన్నీ తెగిపోయాయి" అంటాడు కబీరు."కానీ... పాపం వీణను దూషించడమెందుకు... వాయించేవ్యక్తి వెళ్ళిపోయాక" అంటాడు కబీరు. జీవితంలో కానవచ్చే

వైచిత్రీ, వైవిధ్యాలను తలచుకొంటూ ఆక్రందనలోనే గానం...గానంలోనే ఆక్రోశం... సన్యాసి సంసారి అయ్యాడు. సంసారి వైరాగ్యంతో జీవిస్తున్నాడు." అని అచ్చెరువొందుతాడు. కుల వివక్షనూ, మతంలోని కాపట్యాన్నీ వివరిస్తూ "కలియుగంలో ఆయన కలామాను బోధించినవాడు. ఆయన నిజతత్వాన్ని శోధించలేకపొయ్యాడు. వేదాలూ, ఖురానూ కూడా శుష్కమైనవే. ఆయన మర్మం హిందువులకూ, ముస్లింలకూ ఎవరికీ తెలియదు. ఇద్దరూ తప్పులలో కాలు వేసి అదే మతం అంటున్నారు. గాలితో, నీటితో ఆయన ఈ లోకాన్ని సృజించాడు. ఈ జగత్తు శూన్యంలోనే అదృశ్యమైపోతుంది. అప్పుడు కులాల ప్రసక్తి ఎవరు ఎత్తుతారు" అని ప్రశ్నిస్తాడు. ఈవిధంగా తన కవితా కరవాలాలతో సామాజిక రుగ్మతల మీద తిరుగులేని యుద్ధం ప్రకటించిన కబీరు 1505లో " మఘర్" లో చనిపోయాడు. ఆ చనిపోవడంలో కూడా కబీరు తిరుగుబాటుతత్వమే కన్పిస్తుంది. మఘర్‌లో చనిపోయినవారికి మోక్షం ఉండదని హిందువుల నమ్మకం. ఆ నమ్మకానికి మూలాధారం పురాణాల్లో వుంది. పూర్వకాలంలో దక్ష ప్రజాపతి మఘర్ పట్టణంలో యజ్ఞంచేసి శివుణ్ణి ఆహ్వానించలేదు. తన భర్తను అవమానించినందుకు సతీదేవి ప్రాణత్యాగం చేసింది. అది తెలిసి ఉగ్రుడైన శివుడు ఆ యజ్ఞాన్ని ధ్వంసం చేయమని ప్రమథ గణాలను ఆజ్ఞాపించాడు. మఘర్‌లో మరణించినవారు గాడిదలై పుడతారని శపించాడు. అందువల్ల ఎవరూ మఘర్‌లో మరణించడానికి ఇష్టపడరు. కాశీ పుణ్యక్షేత్రం కాబట్టి చనిపోయే ముందు కాశీ చేరుకొని అక్కడ మరణించాలని కోరుకుంటారు. కాశీలో జీవించిన కబీరు మరణించడానికి మఘర్ చేరుకొని అక్కడే తన తుదిశ్వాస విడిచాడు. దీన్నిబట్టి కబీరు పట్టుదలా, ఆయన బోధనల సారం, మానవ విలువలకు ఆయన నిబద్ధతా మనకు ఎంత అవసరమో అర్ధమౌతుంది. ప్రత్యామ్నాయ సంస్కృతిని నిర్మించుకొనేందుకు ఉద్యమించే దళితశక్తులు కబీరులోని భావవాద భావజాలాన్ని పరిహరించి ఆయన తత్వసారాన్ని ఆయుధాలుగా మలచుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

**దళిత కిరణాలు నుండి**

**జూన్ 2002 – బహుజన కెరటాలు**

# గుండె గుహల్లో "జ్యోతి" బా ఫూలే

ఆయన గొంతు వెలుగు రవ్వల్ని చిమ్మే చెకుముకి రాయి. ఆయన కలం చీకట్లను చీల్చే విద్యుత్ ఖడ్గం. ఆయన హృదయం నవనీతం. ఆయన కార్యాచరణ మత్తు నిద్రనొదిలించే గానం. ఆయన జీవితం వెలుతురు చుట్టూ ముసిరిన చీకటి మేఘాలపైన ప్రకటించిన అవిశ్రాంత యుద్ధం. ఆయన పేరు మహాత్మా జ్యోతిరావ్ పూలే. భారతదేశంలో అట్టడుగు వర్గాల వారికి, అణిచివేతకు గురయిన పీడితులకూ, భారతీయ సంస్కృతిలో తరతరాలుగా హింసకూ, వివక్షకూ, పీడనకూ గురయిన స్త్రీలకు నూతన యుగద్వారాలను తెరచిన తొలి భారత దళిత కిరణం ఆయన.

1827లో మహారాష్ట్రలోని పూణేలో గోవిందరావు, చిమ్నాబాయి దంపతులకు పుట్టిన ఇద్దరు కొడుకుల్లో జ్యోతిరావుపూలే చిన్నవాడు. వీరి అసలు యింటిపేరు "గోరే". అయితే వీరి పూర్వీకుల నుండి పూల వ్యాపారంలోవుండి, పూలవ్యాపారులుగా పేరు, ప్రచారం పొందటంలో వీరికి పూలే అనే యింటి పేరు స్థిరపడింది. పుట్టిన ఏడాదికే తల్లిని కోల్పోయిన పూలే ఆయా ఒడిలో పెరిగాడు. ఏడో యేట బడిలో చేరాడు. ఆ రోజుల్లో శూద్రులు, అస్పృశ్యులు చదువుకోవడం అంటే అదేదో పాపం చేసినట్టు లెక్క. కొడుకుని బాగా చదివించాలని గోవిందరావు ఎన్నో కలలు కన్నాడు. అయితే బుద్ధిగా చదువుకొంటున్న జ్యోతిరావును చూచి బ్రాహ్మణులు కళ్ళల్లో నిప్పులు పోసుకొన్నారు. ఆయన తండ్రి మీద అనేక రకాల వత్తిళ్లు తీసుకువచ్చి చదువు మాన్పించేటట్టు చేశారు. జ్యోతిరావుకు 13ఏళ్ళ వయసులో (1940) సావిత్రిబాయితో వివాహమయ్యింది. అప్పటికి ఆమెకు 8 సంవత్సరాలు. చదువు మానేసిన దగ్గర నుండి పూలే పొలంలో పనిచేయటం, తోటపని చేయడంవంటి కాయకష్టం పనులుచేశాడు. పనులన్ని పూర్తయాక రాత్రి పూట బుడ్డిదీపం ముందు కూర్చొని చదువు కొనేవాడు. ఆ చదువు మీద పూలేకి వున్న శ్రద్ధని తెలివి తేటల్నీ చూచి ముచ్చటపడి జస్ఫర్ తాగ్మున్షి, రేడిట్ అనే పండితులు ఫూలేను మళ్ళీ చదువుకోవలసిందిగా ప్రోత్సహించారు.

ఒకరోజు జ్యోతిబా మిత్రుడివివాహం జరుగుతుంది. అతను బ్రాహ్మణుడు. అందరితోపాటు తానూ ఊరేగింపులో పాల్గొన్నాడు. దాంతో ఊరేగింపులో పాల్గొంటున్న బ్రాహ్మణులంతా నిప్పు తొక్కిన కోతుల్లా గంతులేశారు. సదాచారపరాయణులయిన బ్రాహ్మణులతోపాటు బీసీ కులానికి చెందిన పూలే నడవడం వాళ్ళకు సహించరాని దయ్యింది. అక్కడికక్కడే పూలేని అనరాని మాటలని అవమానించారు. ఆ సంఘటన పూలే జీవితములో పెద్ద మలుపునకు దారితీసింది. పుట్టుకతో ఒకరు గొప్ప ఒకరు తక్కువ అన్న భేద భావాలను పాటిస్తున్న బ్రాహ్మణవాదంపైన, అసమానంగా నిర్మితమైన సామాజిక స్థితిగతులపైనా తీవ్రమైన వ్యతిరేకత

ఆనాడే ఫూలే మనస్సులో నాటుకుపోయింది. ఆనాటి నుండి హిందూ మూఢత్వంపైనా దుర్మార్గపు ఆచారాలపైన యుద్ధం ప్రకటించి శూద్రులు. అతిశూద్రులు (బీసీ,ఎస్సీ,ఎస్టీ)ల విముక్తి కొరకు, స్త్రీ విముక్తి కొరకు, సమాజంలో పాతుకుపోయిన అనేకానేక రుగ్మతల నిర్మూలన కొరకు ఆయన నిరంతరం ఉద్యమించాడు. శూద్రులు, అతిశూద్రులు, క్షత్రియులను బయట నుండి వచ్చిన బ్రాహ్మణులు అణచివేసి సమాజం వెలుపలకి నెట్టివేసి బానిసలుగా, సంఘ బహిష్కృతులుగా చేశారని ఆయన చాటి చెప్పాడు. ఆయన పైన బ్రాహ్మణ దుండగులు అనేక రకాలుగా కత్తిగట్టారు. ఒకసారి హత్యా ప్రయత్నంచేశారు. అయినా ఏ మాత్రం బెదరక తను చనిపోయేవరకు తన వుద్యమాన్ని కొనసాగించాడు. తన ఇంటి ముందు బావిని అంటరాని వారికోసం అందుబాటులో వుంచాడు. స్త్రీలకూ, అస్పృశ్యులకూ విద్య నిషిద్ధమైన చోట మొట్టమొదట సారిగా 1848లో ఒక పాఠశాలను తెరిచాడు. విద్యలేని తన భార్య సావిత్రిబాయిని ఉపాధ్యాయినిగా తీర్చిదిద్దాడు. భారతదేశములో మొట్టమొదటి మహిళా ఉపాధ్యాయిని, సంఘసేవిక సావిత్రిబాయే.

మహాత్మ ఫూలే హిందూ కాపట్యాన్ని, కౌటిల్యాన్నీ ఖండ ఖండాలుగా చేస్తూ "అఖండాలు" అనే పద్య రూపంలో ఎన్నో గేయాలు రాశాడు. కింద కులాలవారి హైన్యాన్ని, దైన్యాన్ని, కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తూ రచనలు చేశాడు. సరికొత్త భావజాల పునాదిని నిర్మించటం కోసం ప్రాచీన పురాణ గాధలకు సరికొత్త కుల నిర్మూలనా వ్యాఖ్యానాలు రచించి ప్రత్యామ్నాయ సాహిత్యాన్ని ఆయన సృజించాడు. వితంతువు పునర్వివాహానికై వుద్యమించాడు. తండ్రెవరో తెలియని పిల్లల సంరక్షణకోసం ఆశ్రమాలను స్థాపించాడు. "తృతీయరత్న", 'గులాంగిరీ' 'సార్వజనిక సత్యధర్మపుస్తక' "బ్రాహ్మణాంచే కసబ్" లాంటి ఎన్నో రచనలు చేశాడు. గ్రామ గ్రామాన ఎన్నో ఉపన్యాసాలిచ్చాడు.

## సత్యశోధక్ సమాజ్

తన వుద్యమాన్ని కొనసాగించడం కోసం ఆయన సత్యశోధక్ సమాజ్‌ను 24-9-1873న తన సహచరులతో కలిసి స్థాపించారు. కులతత్వానికీ, మత తత్వానికీ, బ్రాహ్మణ ఆధిక్యతకూ వ్యతిరేకంగా ఈ సమాజం ఉద్యమించింది. బ్రాహ్మణుల నుండి మహర్‌లు, మాంగ్‌లవరకూ ఈ సమాజంలో సభ్యులుగా వున్నారు.

## ఫూలే ఆలోచనా విధానం

జ్యోతిబాఫూలే పైన జాన్ స్టువర్ట్‌మిల్ రాసిన "ఆన్ లిబర్టీ" పుస్తకం ప్రభావం ఎంతో వుంది. అదే విధంగా థామస్ పెయిన్ రాసిన "రైట్స్ ఆఫ్ మెన్" ప్రభావం కూడా వుంది. ఆన్ లిబర్టీ గ్రంథంలో స్వతంత్ర ఆలోచన, స్వతంత్రచర్య, స్వతంత్ర ప్రవర్తన అనే అంశాలు ఫూలేను యెంతగానో ఆకట్టుకున్నాయి. "వ్యతిరేకత వల్లా పోరాటం వల్ల వాస్తవం గుర్తించ

బడుతుంది. అను[శుతంగా ఆచరణలో "నిజం"గా చలామణి అయ్యే అభి[ప్రాయాన్ని నిర్మొహమాటంగా ఎదుర్కొని, సహేతుకంగా చర్చించి, విపులంగా ఖండించినపుడు అసలయిన వాస్తవికత బయట పడుతుంది" అన్న మిల్ మాటలు ఫూలేను యెంతగానో [ప్రభావితం చేశాయి. ఆ మాటల్ని భారతీయ పరిస్థితులకు ఫూలే అన్వయించాడు. అట్టడుగు వర్గాల అభివృద్ధి కోసం, [స్త్రీ విముక్తి కోసం ఆయన కృషి చేశాడు. వ్యక్తి సర్వతోముఖాభివృద్ధికి పాటుపడాలని, పాలనలో జనాభా నిష్పత్తి [ప్రకారం [ప్రాతినిధ్యం ఉండాలనీ, [ప్రతి వ్యక్తి తన అనుభవాలనుండి తనకు నచ్చిన జీవన విధానం నిర్ణయించుకోవాలని ఆయన చాటాడు. తాను రచించిన "గులాంగిరీ" [గంథాన్ని బానిసత్వాన్ని నిర్మూలించిన అమెరికా [ప్రజలకు అంకితం చేయడంలోనే విముక్తి వుద్యమాల పట్లా, [ప్రజల విముక్తిపట్లా ఫూలేకు ఎంతగాఢమైన నిమగ్నత, నిబద్ధత వున్నాయో అర్థమవుతుంది. డా॥ బి.ఆర్. అంబేద్కర్ తనకు ముగ్గురు గురువులని, వారు బుద్ధుడు, కబీర్, ఫూలే అని అన్నాడు. డాక్టర్ అంబేద్కర్ తాను రాసిన "శూ[దులెవరు?" అన్న [గంథాన్ని మహాత్మాఫూలేకు అంకితమిస్తూ "ఆధునిక భారత సమాజంలో మహాత్మ ఫూలే అందరికంటే గొప్ప శూ[దుడు. ఆయన హిందూ సమాజంలో అ[గ కులాల వారి బానిసలుగా బతుకుతున్న కింది కులాలవారిలో తమ బానిసత్వ విముక్తి పట్ల చైతన్యాన్ని రగిలించాడు. విదేశీ పాలకుల నుండి విముక్తిని సంపాదించడం కంటే సాంఘిక [ప్రజాస్వామ్యాన్ని సాధించడం ముఖ్యమనే మహత్తరమైన సందేశాన్ని ఆయన ఇచ్చారు" అని పేర్కొన్నాడు.

1890 నవంబర్ 28వ తేదీన ఆయన చనిపోయే రోజున ఆయన మంచం దగ్గర కూర్చున్న బాబా పద్మాంజీ "జీవిత చివరి క్షణాల్లో నీకేం కోరికలు లేవుకదా, మనసు [ప్రశాంతంగా వుందా! చనిపోవడానికి భయపడుతున్నావా?" అని అడిగాడు. అందుకు జ్యోతిబాఫూలే నిబ్బరంగా, ఎంతో [ప్రశాంతంగా తన జీవితాన్ని తాను ఆశించిన విధంగానే గడిపాననీ, తన ఆశయసాధన కొరకే [బతికాననీ, తను చనిపోడానికి ఏమా[త్రం భయపడడం లేదని చెప్పి చివరి శ్వాస విడిచాడు. తన కొడుకు యశ్వంత్, భార్య సావి[త్రిబాయిల బాధ్యతలను సత్యశోధక్ సమాజ్‌కు అప్పగించాడు. అయితే యశ్వంత్, సావి[త్రిబాయిలు తాము చనిపోయే వరకూ సత్యశోధక్ సమాజ్ బాధ్యతలు చూస్తూనే చనిపోయారు.

ఆయన వేసిన బాటల్లో జ్ఞానజ్యోతులు వెలిగి చీకట్లు తొలగి పల్లెలు నవ్వాలి. అ[గకుల రాజ్యాధికారాన్ని కూల్చడానికి ఆయన [ప్రారంభించిన పోరాటం ఆయన స్ఫూర్తితో కొనసాగి సఫలీకృతం కావాలి. దళితుల రాజ్యాధికార స్థాపనలో నిరంతరం మనల్ని నడిపే వెలుగుదివ్వె ఫూలే.

**నవంబర్ 2002 బహుజన కెరటాలు**

**దళిత కిరణాలు సౌజన్యంతో**

# స్త్రీ విమోచనా తొలికిరణం సావిత్రిబాయి ఫూలే

ఆమె పేరు వినబడితే కోటానుకోట్ల శాంతికపోతాలు రెక్కలు విప్పార్చి ఆకాశంలోకి ఎగిరిపోతున్న అనుభూతి కలుగుతుంది. ఆమె స్మృతి మదిలో మెదిలితే సంకెళ్ళు తెగుతున్న స్వేచ్ఛారాగం ఒక అమృతగానమై వినిపిస్తుంది. ఆమె గళం తలపుకొస్తే విముక్తికై పెనుగులాడుతున్న పీడిత జనాంగం ధిక్కార నినాదాల హోరు శతకోటి తరంగాల ఘోషలా మార్మోగుతుంది. ఆమె చిత్తరవు ముందు నిలబడితే సగం ఆకాశం నేలమీదికి వంగి భూమి చుబుకాన్ని ముద్దాడినట్లు, భూమి బంధనాలను తెగతెంచుకొని ఆకాశంలోకి జెండాలా ఎగిరినట్లు, ఒక విముక్తి దృశ్యం కనుల ముందు కదులాడుతుంది. ఆమె పేరు సావిత్రిబాయి ఫూలే. ఆమె పేరు చెప్పుకోకుండా భారత స్త్రీవిముక్తి వుద్యమాలను గురించి చెప్పుకోలేం. ఆమెను తలచుకోకుండా, ఆమెను అధ్యయనం చేయకుండా, ఆమె ఉత్తేజాలను ఆవాహనచేసుకోకుండా, ఆమె స్ఫూర్తిని పొందకుండా దళిత, స్త్రీ హక్కుల గురించిగానీ, సామాజిక విముక్తి ఉద్యమాల గురించిగానీ, ఏ వ్యక్తి సమగ్ర సామాజికాచరణలో మమేకం కాలేరు. మహాత్మా జ్యోతిరావు ఫూలే జీవిత సహచరిణిగా ఆయన నుండి ఎంతో స్ఫూర్తిని పొంది ఆయనకు ఎంతో ఉత్తేజాన్నిచ్చి ఒక యుగం ఆలోచనలకు నాయకత్వం వహించిన మహోన్నత వ్యక్తిత్వాలకు అమ్మతనాన్ని పంచి పెట్టిన దళిత కిరణం సావిత్రీబాయి.

స్త్రీలకు సమాన హక్కులకోసం, స్త్రీల విద్య కోసం ఆమె ఎన్నో అవమానాలకూ, కష్ట నష్టాలకు గురై అవిశ్రాంతంగా కృషిచేసింది. మొత్తం భారతదేశంలోనే తొలి మహిళా ఉపాధ్యాయురాలు ఈమె. ఇవాళ దేశంలో నడుస్తున్న అనేక మహిళా విమోచనా ఉద్యమాలకు ఆమె కృషి భూమిక. భారత మహిళల్లో తొలి ఉపాధ్యాయినిగా, సంఘసేవికగా, కవయిత్రిగా సమాజంలోని మూఢనమ్మకాలను రూపుమాపడానికీ, స్త్రీల ప్రగతికీ,సామాజిక అసమానతలను నిర్మూలించడానికి తన జీవితాన్నంతటినీ ధారవోసిన త్యాగమూర్తి సావిత్రిబాయి ఫూలే.

సావిత్రిబాయి ఫూలే 1831 జనవరి 3వ తేదీన పూనే దగ్గరలోని కవాడీ గ్రామంలో జగదేవ్ పాటిల్ కుటుంబంలో జన్మించింది. ఆమెకు ఎనిమిదేళ్ళ వయస్సులో (1840) జ్యోతిరావు ఫూలేతో వివాహమయ్యింది. అప్పటికి జ్యోతిబాకు పదమూడేళ్ళు. అప్పటికి వధూవరులలో ఎవరికీ పెళ్ళంటే ఏమిటో అందులో తమ పాత్రఏమిటో తెలియనే తెలియదు. ఆ వయస్సులోనే అత్తగారింట అడుగు పెట్టింది సావిత్రిబాయి. అయినా తన భర్తను ప్రేమించడమంటే భర్త ఆశయాలను ప్రేమించడమేనన్న మాటను అక్షరాలా రుజువు చేసిందామె. సావిత్రిబాయి లేకుండా జ్యోతిబా ప్రారంభించిన మహోజ్వలమైన సాంఘిక విప్లవాన్ని గానీ, అనేకానేక సాంఘిక సంస్కరణలనుగానీ, ముఖ్యంగా బాలికల కోసం,

శూద్ర, అతిశూద్రులకోసం ఆయన ప్రారంభించిన విద్యాలయాల నిర్వహణనుగానీ మనం ఊహించలేం.

ఆ రోజుల్లో హిందూమతం స్త్రీలకూ, అట్టడుగు కులాల వారికి విద్యను నిషేధించింది. సమాజంలో స్త్రీకి అత్యున్నతమైన స్థానం ఉందని ఒకవైపున చెప్తూనే మరోవైపున ఆమెను విద్యకు దూరంగా, వెలుగుకు దూరంగా, అజ్ఞానిగా, అవివేకురాలిగా, చంచల స్వభావంగలదానిగా, కపటిగా పరిగణిస్తూ అనేక బంధనాల కట్టడాల్లో ఉంచారు. ఆమెను నలుగురిలో తిరగనిస్తే ఎవరితోనైనా లేచిపోతుందేమో, స్వతంత్రత ఇస్తే గౌరవాన్ని మంటగలుపుతుందేమో అన్న భయసందేహాలతో స్త్రీని అసూర్యంపశ్యగా చేసి "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని శాసనం చేశారు. స్త్రీ చదువుకుంటే ఆమె భర్త అర్ధాంతరపు చావుకు గురవుతాడనీ ప్రచారం చేశారు.

ఆ సమయంలో స్త్రీలకోసం పాఠశాలను తెరిపించే సాహసం చేశాడు  జ్యోతిబాఫూలే. ఎవరూ ముందుకురాని సమయంలో సావిత్రిబాయి తాను నడుం కట్టి శ్రద్ధగా చదువుకొని బాలికల పాఠశాలలో ఉపాధ్యాయినిగా పనిచేయడానికి తనను తాను తీర్చిదిద్దుకుంది. ఒక శూద్ర స్త్రీ చదువుకోవడంతో ఆగకుండా శూద్రులకు, అతిశూద్రులకు, స్త్రీలకు చదువు చెప్పే పనికి పూనుకోవడం పూనే నగరాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. బ్రాహ్మణ సమాజం ఈ విషయాన్ని ఎంతో తీవ్రమైనదిగా పరిగణించింది. ఆమెను తిట్టడం, శాపనార్థాలు పెట్టడమే కాకుండా ఆమె బడికి వెళుతున్నప్పుడూ, వస్తున్నప్పుడూ ఆమె మీద బురద చల్లేవాళ్ళు. రాళ్ళు రువ్వేవాళ్ళు. అన్ని అవమానాలకూ సావిత్రిబాయి ప్రశాంతమైన చిరునవ్వే జవాబుగా పనిచేసింది. ఎన్ని అవమానాలు ఎదురయినా, ఎంత మానసిక క్షోభకు గురిచేసినా తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తున్నానన్న తృప్తితో ఒక దీక్షగా, ఒక తపస్సుగా తాను చేయదలచుకొన్న పనిని నిర్భయంగా చేసింది సావిత్రిబాయి. జ్యోతిబా ప్రతి అడుగులోనూ సావిత్రిబాయి ముందుండి నడిచింది. తన ఆశయాలను ప్రచారం చేయడానికి ఆమె అనేక కవితలు రాసింది. ఈమె రాసిన కవితల సంకలనం 1854లో "కావ్యఫూలే" అనే పేరుతో ప్రచురితమైంది. అనేక విషయాలపై ఆమె చేసిన ఉపన్యాసాలు,  రచించిన వ్యాసాలు ఎన్నో ఉన్నాయి. 1890లో జ్యోతిబా మరణించే సమయంలో భార్య సావిత్రిబాయి,కుమారుడు యశ్వంత్‌ల బాధ్యతలను సత్యశోధక సమాజ్‌కు అప్పగించాడు. అయితే జ్యోతిబా మరణానంతరం సత్యశోధక సమాజం బాధ్యతలన్నింటినీ తామే స్వీకరించి వాటి కార్యకలాపాలను ఎంతో బాధ్యతగా సావిత్రిబాయి, యశ్వంత్‌లు నిర్వహించారు.

1876-77 ప్రాంతంలోనూ, 1896-97 ప్రాంతంలోనూ మహారాష్ట్రలో సంభవించిన కరువు కాటకాలలో సావిత్రిబాయి చేసిన సేవలు మరువలేనివి. మహారాష్ట్ర మంతటా ప్లేగువ్యాధి ప్రబలినపుడు రోగుల దగ్గరనుండి సేవచేసింది. తన కుమారుడు యశ్వంత్ నడుపుతున్న

వైద్యశాలకు ప్లేగుపీడితుల్ని తరలిస్తూ వారికి ఎంతో సహాయపడింది. ప్లేగురోగుల్ని రక్షించే క్రమంలోనే వ్యాధికి గురై 1897 మార్చి పదవతేదీన ఆమె మరణించింది.

బతికినంతకాలం నిరుపేదల, నిమ్నవర్గాల స్త్రీల అభ్యున్నతికోసం కృషిచేసిన సావిత్రిబాయిని ఇవాళ భారత సమాజం మరచిపోయే స్థితి వచ్చింది. ఎవరు మర్చిపోయినా దళిత బహుజన ఉద్యమం ఆమెను మర్చిపోవడానికి వీల్లేదు. ఆమె సేవపైనా, ఆమె రచనలపైనా ఎన్నో పరిశోధనలు జరగవలసిన అవసరం ఉంది. ఆమె స్ఫూర్తి ఇప్పటికీ స్త్రీ విముక్తి ఉద్యమాలకు కావాలి. ముఖ్యంగా దళిత మహిళ ఆమెను ఆదర్శంగా తీసుకోవాలి. ఆమెను గుండెల్లో నిలుపుకోవాలి. ఆమె వెలిగించిన బాటల్ని కళ్ళకు వెలుగు భూమికలుగా అమర్చుకోవాలి.

**జనవరి 2002, బహుజన కెరటాలు**
**దళిత కిరణాలు సౌజన్యంతో**

# సామాజిక విప్లవ సేనాపతి మహరాజ్ సాహు ఛత్రపతి

అడుగు అడుగులో సంకెళ్ళు తెగుతున్న సవ్వడి. పెదవుల కదలికలో ఒక నిండు మానవతా స్పర్శ. అరచేతుల్లో పొతుకున్న ఆదర్శాల పతాకాలు, బురదనుండి పద్మాలను పరిమళింప చేయాలని మనసునిండా ఆరాటం, నెత్తురు కక్కుకుంటూ పడమటి సంధ్యలో ఒరిగిపోయినా సూరీడ్ని సరికొత్త తేజంతో తూర్పున ఆవిష్కరించి కొత్త యుగాలకు తలుపులు తెరవాలన్న తపన. చెరగని చిరునవ్వుల వెనుక మండుతున్న గుండెగోళాలు, అరమూసిన కనురెప్పల కింద రక్తసిక్తగాయాల స్వప్నాలు.

ఛత్రపతి సాహుమహరాజ్ పేరే ఒక మానవానుభూతుల సముద్రం. భారత సామాజిక విప్లవోద్యమాల చరిత్రలో ఒక బంగారు అక్షరాల కవితా మాలిక. అతన్ని ఆవాహన చేసుకొని చరిత్ర వర్తమానమై పోతుంది. కాలం సుందర భవిష్యత్తై ముందుకు సాగుతుంది. ఏ చరిత్రలోనైనా ఏ దేశాన్నేలిన ఏరాజైనా ఒక్కొక్క నరహంతకుడు. ప్రజలను పీడించి జనం రక్తాన్ని పీల్చి పిప్పిచేసిన పరాన్న భుక్కులు. కానీ సాహు మహరాజ్ తీరేవేరు. ఆయన నిజంగా అట్టడుగు బడుగు జనం హృదయాలనిండా నిండిపోయిన మారాజు. ఒక చల్లటి సూర్యుడు. చారిత్రక విభాత సంధ్యల్లో పొడిచిన పొద్దుపొడుపు. తాను స్వయానా ఒక మహారాజై వుండీ పాలకులకూ, పాలితులకూ మధ్య అసమానతలేమిటనీ సమానత్వం కోసం పోరాడిన ధీరుడు.

కొల్హాపూర్ పదిహేడవ శతాబ్ధంలో ఛత్రపతి శివాజీ స్థాపించిన మరాఠా సామ్రాజ్యంలో అంతర్భాగమయ్యింది. మరలా 1818లో మరాఠా సామ్రాజ్య పతనం తర్వాత స్వతంత్ర రాజ్యమయ్యింది. అప్పటినుండి ఎన్నో రాజకీయ సామాజిక పరిణామాలకు గురయ్యింది. ఎప్పటికప్పుడు కొల్హాపూర్ రాజ్య వారసులు లేక రాణులు పిల్లలను దత్తత తీసుకోవడమూ వారిని బ్రిటీష్ ప్రభుత్వం ఆమోదించడమూ, అనతికాలంలోనే మళ్ళీ దత్తత తీసుకోబడిన వారు వారసత్వం లేకుండా మరణించడం సాధారణమయ్యింది. అటువంటి క్రమంలో అబాసాహెబ్ మాట్లి పెద్ద కుమారుడు యశ్వంతరావు బాబాసాహెబ్‌ను కొల్హాపూర్ రాణి ఆనందబాయి దత్తత స్వీకారం చేసింది. యశ్వంతరావు బాబాసాహెబ్ 1874 జూలై 26వ తేదీన అబాసాహెబ్ మాట్లికూ, రాధాబాయికీ జన్మించాడు. తండ్రి అబాసాహెబ్ కొల్హాపూర్ సంస్థానానికి మంత్రిగా వుండేవారు. తల్లి రాధాబాయి ముధోల్ రాజాబాసాహెబ్ కుమార్తె. ఆమె యశ్వంతరావు తర్వాత 1876 జనవరి 3వ తేదీన మరొక కుమారుడు బాపూ సాహెబ్‌కు జన్మనిచ్చి 1877లో మరణించింది.

1884 మార్చి 17వ తేదీన యశ్వంతరావును కొల్హాపూర్ మహారాణి ఆనందబాయికి

దత్తత ఇచ్చిన అనంతరం ఆ బిడ్డకు మహారాణి సాహుమహరాజ్ అని పేరుపెట్టింది. ఆనాటి నుండి రకరకాల విద్యలల్లో సాహుమహరాజ్ పారంగతుడయ్యాడు. మాట్లాడటం నేర్చుకోక మునుపే గుర్రపుస్వారీ నేర్చుకున్నాడు. తెల్లవాళ్ళ సంరక్షణలో ఆంగ్ల విద్యను నేర్చుకున్నాడు. సాహుకి పన్నెండేళ్ళ వయస్సు వచ్చేనాటికి తండ్రి అబాసాహెబ్ మృతిచెందాడు. లండన్ నుండి కొల్హాపూర్ తిరిగి వస్తూ మార్గ మధ్యంలో అతిగా తాగడం వలన అబాసాహెబ్ మరణించాడు.

రాజవంశంలో త్రాగడం సర్వసాధారణమైన విషయం. కానీ తండ్రి మరణానికి కారణమైన త్రాగుడు పట్ల సాహు పసిమనసులో తీవ్రమైన వ్యతిరేకత ఆనాటి నుండే ఏర్పడింది. ఆనాటి నుండి సాహుమహరాజ్ ఎన్నడూ ఆల్కహాల్ జోలికి వెళ్ళలేదు. వైద్యం కోసం కూడా ఆల్కహాల్ కలిపిన మందులు వాడలేదు. తండ్రి మరణం నుండి పిల్లవాడైన సాహునేర్చుకున్న మొదటి పాఠం మద్యపానాన్ని విడనాడడమైతే, రెండవ పాఠం చిన్న తనంలోనే తండ్రిపోతే ఆ పిల్లలు ఎంత అల్లాడి పోతారో అనుభవించి తెలుసుకున్నాడు. ఆనాటినుండి ఎక్కడ ఏ రాచకుటుంబంలోని వారు కానీ, రాజోద్యోగులలో ఎవరు చనిపోయినా వారి పిల్లలకు సానుభూతి వచనాలతో పాటు కొంత డబ్బు పంపడం అలవాటు చేసుకున్నాడు సాహు. ఆ సమయంలోనే కిందివర్గాల వారితో, నిమ్న కులస్థులతో స్నేహం చేయడం మొదలు పెట్టాడు. సాహు మహరాజ్‌కు ట్యూటర్‌గా పనిచేస్తున్న కె.బి. గోఖలే కింది కులాలవాళ్ళతో కాక తన తండ్రి స్నేహితులతో సహవాసం చేయమని సలహా చెప్పినప్పుడు “నాకెవరితో సహవాసం చేయాలో తెలుసు. నాన్న స్నేహితులు నాన్న కేం నేర్పారు? తాగుడు లాంటి వ్యసనాలే కదా! నాకు ఇటువంటి ఉన్నత సమాజంతో సహవాసం వద్దు, అది నేర్పే దుర్గుణాలూ వద్దు... అని ధైర్యంగా సమాధానం చెప్పాడు.

ఒక వంక విద్యనభ్యసిస్తూ, సంగీత, కళా సాధన చేస్తూ, మరొక వంక సాముగరిడీలు, యుద్ధం, వేటలో నైపుణ్యాన్ని సంపాదిస్తూ మరొక వైపున సమకాలీన సామాజిక పరిస్థితులను నిశితంగా పరిశీలిస్తూ సాహు ఎదుగుతున్నాడు. దేశదేశాలు తిరుగుతూ సమాజాన్ని అధ్యయనం చేశాడు. 1891 ఏప్రిల్ ఒకటవ తేదీన సాహు మహరాజ్‌కి లక్ష్మీబాయితో వివాహం జరిగింది. ఆమె బరోడాకు చెందిన గుణాజీరావు ఖాన్ వీల్కర్ కుమార్తె, బరోడా మహారాజు గణపతిరావు గైక్వాడ్ సోదరి మనుమరాలు. వివాహం అనంతరం కూడా సాహు మహరాజ్ తన విద్యాభ్యాసాన్ని కొనసాగించాడు.

1894 ఏప్రిల్ రెండవ తేదీన సాహు మహరాజ్ కొల్హాపూర్ సింహాసనాన్నధిష్టించి సాహు ఛత్రపతి అయ్యాడు. సాహు మహరాజ్ సింహాసనాన్నధిష్టించే సమయానికి మహారాష్ట్రలో మూడు శక్తులు పనిచేస్తున్నాయి. ఒకటి గోవింద రనడే, అగార్కర్‌ల నాయకత్వంలో పనిచేస్తున్న సంఘ సంస్కర్తల బృందం. రెండు మహాత్మా జ్యోతిరావు పూలే స్థాపించిన సత్యశోధక సమాజ్.

మూడు బాలగంగాధర్ తిలక్ నాయకత్వంలో హిందూ రాజకీయ ఉద్యమం.

సంఘ సంస్కర్తలు ఉన్నత వర్గాలలో సంస్కరణలను బోధిస్తున్నారు. మూఢనమ్మకాలను విడనాడి శాస్త్ర విజ్ఞానాన్ని సంతరించుకొమ్మని బోధ చేస్తున్నారు. మహాత్మా జ్యోతిబా పూలే అనుచరులు నిమ్న వర్గాల ఉద్ధరణకు, స్త్రీ విముక్తికీ, సర్వమానవ సమానత్వానికీ కృషిచేస్తున్నారు. బ్రాహ్మణులైన బాలగంగాధర్ తిలక్ అనుచరులు సహజంగానే వారినీ సంఘ సంస్కర్తలను వ్యతిరేకిస్తున్నారు. మహరాజ్ సాహు ఛత్రపతి రంగంలోకి వచ్చేనాటికి బ్రాహ్మణాధిక్యత కొల్హాపూర్‌లో చలామణిలో వుంది. సాహుమహరాజ్ రంగంలోకి వచ్చిన తర్వాత నిమ్నవర్గాల అభ్యున్నతి కోసం ఎంతో కృషిచేశాడు. దేశంలో జరుగుతున్న బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలతో సంబంధాలు పెట్టుకున్నాడు. బ్రాహ్మణవ్యతిరేక ఉద్యమ నాయకుడు డాక్టర్ టి.యం. నాయర్‌తో కలసి పనిచేశాడు. అస్పృశ్యులుగా పిలువబడే వారిని సమాజంలో సమానస్థాయి కల్పించే నిమిత్తం తన దగ్గర చేర్చుకున్నాడు. రాజభవనంలో మోటార్లు నడిపేవారు, ఏనుగు మావటీలు, పూజారులుగా అస్పృశ్యులను నియమించాడు. చివరకు తన అంగరక్షకులుగా కూడా అస్పృశ్యులనే నియమించాడు. ఒకసారి సాహు మహరాజ్ ఊళ్ళోలేని సమయంలో గంగారామ్ కాంబ్లే అనే అస్పృశ్యుడు మరాఠాలు ఉపయోగించే బావిలో నుండి నీళ్ళుతోడుకున్నాడు. దాంతో మరాఠాలు కోపితులై అతన్ని పట్టుకొని చితకబాది అతనిపై దొంగతనం కేసు ఆరోపించారు. పోలీసులుకూడా అతన్ని చిత్రహింసలు పెట్టారు. గంగారామ్ కాంబ్లే తాను చేయని తప్పును ఒప్పుకోలేదు. అయితే అసలు దొంగ తర్వాత దొరికాడు. ఆ సమయంలో సాహు మహరాజ్ తిరిగివచ్చాడు. గంగారామ్ తన వంటి మీద తేలిన వాతల్ని చూపించాడు. విపరీతమైన ఆగ్రహం వచ్చిన సాహుమహరాజ్ తన స్వంతకులస్తులని కూడా చూడకుండా గంగారామ్ పట్ల అమానుషంగా ప్రవర్తించిన మరాఠాలను కొరడాలతో కొట్టించాడు. ఆ తర్వాత గంగారామ్ కాంబ్లేకి వ్యాపారం చేసుకొనే నిమిత్తం ధనసహాయం చేశాడు. ఆ డబ్బుతో గంగారామ్ కొల్హాపూర్‌లో ఒక హోటల్ ప్రారంభించాడు. అప్పట్లో అంటరానివారు హోటల్ పెట్టడం పాపంతో సమానం. మొదట్లో గంగారామ్ గురించి తెలియక పోయినా తర్వాత తెలుసుకున్న జనం కోపితులై అతన్ని శిక్షించమని సాహు మహారాజ్‌కి ఫిర్యాదు చేశారు. సాహు హుటాహుటిన హోటల్ దగ్గరకు వెళ్ళాడు. ఆయనతో పాటు జనం తండోపతండాలుగా గంగారాంకు విధించే శిక్షను తిలకించడానికి తరలి వెళ్ళారు. సాహు నెమ్మదిగా హోటల్ దగ్గరకు వెళ్ళి ఒక కప్పు టీ త్రాగి వెనుతిరిగాడు. అతడ్ని శిక్షిస్తాడనుకున్న జనం వెర్రిమొహాలేశారు, గంగారాంను శిక్షించకపోగా ఇక మీదట అస్పృశ్యత పాటించిన వారికి వందరూపాయిలు జరిమానా విధిస్తానని ప్రకటించాడు సాహు మహారాజ్. అడుగడుగునా బ్రాహ్మణ ఆచారాలను తిరస్కరిస్తూ, శూద్ర, అతిశూద్రులకు జీవన అవకాశాలు కల్పించడానికి సాహు మహరాజ్ ఎంతగానో

కృషిచేశాడు. రైతులకు అనేక రాయితీలిచ్చి వ్యవసాయాభివృద్ధికి పాటుపడ్డాడు. కాంగ్రెస్ ప్రభుత్వం సాధించిందని చెప్పుకుంటున్న హరిత విప్లవాన్ని ప్రారంభించినవాడు సాహు మహరాజ్. సహకార సంస్కరణలు పెట్టి నీటిపారుదల సౌకర్యాలను పెంపొందించాడు. వెట్టిచాకిరిని రద్దుచేశాడు. తన రాజ్యం కోల్పోయే పరిస్థితి వచ్చినా, ప్రాణాలే కోల్పోయే పరిస్థితి వచ్చినా వెనుదీయక విప్లవాత్మకమైన మార్పుల్ని ఆయన చేశాడు. ఇటు బ్రాహ్మణులు, అటు ఆంగ్లేయులు ఎన్ని ఇబ్బందులు పెట్టినా భయపడక నమ్మిన ఆశయం కోసం తుదిదాకా పోరాడాడు. బాలగంగాధర తిలక్ నుండి గాంధీ దాకా వాళ్ళెంతటి వారైనా వర్ణాశ్రమ ధర్మాన్ని కాపాడాలని ప్రయత్నం చేసేవారితో రాజీలేని పోరాటం చేశాడు. "నేను సనాతన వైష్ణవుణ్ణి, వర్ణాశ్రమ ధర్మం పరిరక్షింపబడాలని నేను బలంగా కోరుకుంటాను" అని గాంధీ చేసిన ప్రకటనకు "మహాత్మాగాంధీ మనల్ని వేదకాలంలోకి తీసుకువెళ్ళాలనుకుంటున్నట్లున్నారు. మా గడియారాలను మేం వెనక్కి తిప్పాలనుకోవటంలేదు" అని సూటిగా సమాధానం చెప్పాడు సాహు మహారాజ్.

డాక్టర్ అంబేద్కర్‌కు తన ఉద్యమంలో ఎన్నో విధాల ఆర్థిక, హార్థిక సహకారాన్నందించాడు సాహు. అంబేద్కర్ దేశంలో లేని సమయంలో సాహు మహారాజ్ దళితవర్గాలకు చేసిన సేవలకు అట్టడుగు జనం ఆయనను కీర్తిస్తుంటే మీ నాయకుడు డాక్టర్ అంబేద్కర్, ఆయన చేస్తున్నదానిలో కొంచెమైనా నేను చేయడం లేదు. ఆ గౌరవం అంబేద్కర్‌కే దక్కాలని, చిత్తశుద్ధితో చెప్పాడు.

జీవించిన కాలంలో ఎంతోమందిని స్నేహితులుగా పొంది తన తిరుగులేని ఆదర్శాల సాధనలో మరెంతోమందిని శత్రువులుగా చేసుకొని భారత సమాజంలో నిజమైన ప్రజాస్వామిక విలువల స్థాపన కోసం తుదికంటా పోరాడుతూ పాటుపడుతూ 1922 మే ఆరవ తేదీన సంతృప్తిగా కన్నుమూశాడు ఛత్రపతి సాహుమహరాజ్. సకల రాజ్యాధికారాలనూ, సంపదలనూ తృణప్రాయంగా ఎంచి మానవాళి సంక్షేమం కోసం తపించిన రాజులు ముగ్గురే మనకు చరిత్రలో కనిపిస్తారు. ఒకరు బుద్ధుడు, రెండవవారు అశోకుడు, మూడవ వారు ఛత్రపతి సాహుమహారాజ్. భారత సామాజిక ఉద్యమాల చరిత్ర బతికివున్నంత కాలం ప్రజల గుండెల్లో సజీవంగా నిలిచివుంటాడు సాహుమహరాజ్. వికసించే మానవతా కుసుమానికి పరిమళంగా నిలుస్తాడు సాహు మహరాజ్. సాహుమహరాజ్ అమర్ రహే.

**దళిత కిరణాలు - లోకాయత ప్రచురణలు**

# నడిచే నిశ్శబ్ద విప్లవం నారాయణగురు

లక్షలాది జీవితాలు ఆ మనిషిని అనుసరించడానికి ఆరాటపడ్డాయి. కణం కణం నెత్తురు సలసలా మరిగే మట్టి బతుకుల గుండెచప్పుళ్ళ పాట వినిపించడానికి అతను జాతిగుండెకు తన గొంతుకనిచ్చాడు. ఆ నిమీలిత నేత్రాల మౌనం వెనుక బద్ధలయ్యే నిశ్శబ్దవిప్లవం. జీవనదులు ప్రవహించే ఆ శరీరం అడుగు కదిలితే ఒక ఉపదేశం, పెదవి కదిపితే ఒక ఆదేశం. ఆ గళం నుండి వెలువడే కవితాక్షరాలు బుల్లి బుల్లి పాదాల జాబిల్లులై నడచిపోతుంటే ఆ పాదముద్రల్లో చీకటి కాలిపోతున్న దృశ్యం. అతను కవి. కవంటే గుండెల్లో అగ్ని పర్వతాలు నిక్షిప్తమైన మనిషి కదా! కవంటే తడికన్నుల ఆకాశం కదా! కవంటే మరిగి మరిగి ఉప్పెనై ఎగసిపడే లోహద్రవ కెరటాల సముద్రంకదా! అలజడితో నిండిన మానవ మస్తిష్కాలలో ఒక ప్రశాంతమైన చందమామను వెలిగించాలని, "దైవోపహత" సమాజం హృదయంలో మానవతా తుషారాల జల్లులు కురిపించాలని ఆయన జీవితం ప్రస్థానించింది. ఆయనపేరు శ్రీ నారాయణగురు. మలబారీ కొండల్లో ఆయన గొంతుక గర్జిస్తుంటే దేశం పిడికిళ్ళు బిగించి ప్రతిస్పందించింది. ఆయన ముందుకు పోతుంటే ప్రపంచం ఆయన వెంట నడిచింది.

"మీలో జ్ఞానం వికసిస్తే స్వేచ్ఛ రెక్క విప్పుకొంటుంది. చేయిచేయి కలిపి మీరు సంఘటితమైతే మీ శక్తి నవనవోన్మేషణమై వర్ధిల్లుతుంది. నిరంతరం మీరు శ్రమిస్తే మీ బతుకు ఉన్నత శిఖరాల నధిరోహిస్తుంది". ఇదే ఆయన ఈదేశంలోని అట్టడుగు వర్గాలవారికి ఇచ్చిన సందేశం. ఈ రెండు మాటలుచెప్పడానికి ఆయన తన బతుకు సర్వస్వాన్ని దగ్ధం చేసుకొని ఒక జ్యోతిని వెలిగించి చావుపుట్టుకల సంధ్యాకాశంలో ఆవిష్కరించాడు. స్వార్థాన్ని త్యాగంచేసి సన్యసించి బతికున్నంతకాలం బోధిస్తూ, సంఘటిత పరుస్తూ, పోరాడుతూ గడిపాడు. ఆయన పోరాటం ఒక నిశ్శబ్ధ విప్లవం. ఆయన హిందూమత సంస్కర్త అంటారు కొందరు. ఆయన అద్వైత తత్వవేత్త అంటారు మరి కొందరు. ఆయన ఏ పేరుతో చెప్పినా ఆయన కోరుకున్నది కులనిర్మూలనను. కులం పేరుతో, మతం పేరుతో మనిషిని ఉన్నతుడిగా, నీచుడిగా చూడకూడదనీ, మనిషిని మనిషిగా గౌరవించే సమాజ నిర్మాణం జరగాలని ఆయన ఉద్యమించాడు.

శ్రీ నారాయణగురు క్రీస్తుశకం 1856లో కేరళలోని త్రివేంద్రంకు పన్నెండు కిలోమీటర్లు ఉత్తరంగావున్న 'చెంబళంతి' అనే గ్రామంలో జన్మించాడు. ఆయన తండ్రి మదన్ అషాన్, తల్లి కుట్టి. పుట్టింది భారతదేశంలో కాబట్టి తనకిష్టమైనా, కాకపోయినా, ఉన్నతమైందో నీచమైందో ఒక కులం ఉండాలికదా! అతనిది ఎళవా" అనే శూద్రకులం. వారికంటే తక్కువ కులాలు చాలా ఉన్నప్పటికీ ఎళవాలను కూడా అంటరానివారిగానే భావించేవారు.

'ఎళవా'లు తమకు ముప్పైరెండు అడుగులదూరంలో వున్నా తాము మైలపడినట్లుగానే

బ్రాహ్మణులు భావించేవారు. అటువంటి కులంలో ఒక పశువులపాకలాంటి ఇంట్లో నారాయణగురు పుట్టాడు. ముద్దుగా అతనిని నానూ అని పిలుచుకొనేవాళ్ళు. నానూకి చిన్నప్పటినుండే మనస్సునిండా అన్నీ ప్రశ్నలే. తన్నుతాను తెలుసుకోవాలన్న తపన. ఆరేళ్ళ వయస్సులోనే సమాజంపట్లా, మనిషి పుట్టుకా, పెరుగుదల, మరణం తదితర అంశాలపట్ల ఎన్నో సందేహాలు చెలరేగేవి. పెద్దలు ఏదో సమాధానంచెప్పి నోరుమూయించాలని చూసే వారుగానీ ఏ సమాధానమూ ఆ పసి మనసులో రగులుతున్న జ్ఞానతృష్ణను సంతృప్తి పర్చేదికాదు. తనకుతానే సమాధానాన్ని అన్వేషించడానికి ఒంటరి ధ్యానముద్రలో మునిగిపోయేవాడు చిన్నారినానూ. 'మనుషులందరూ సమానులే' నని మనసుచెప్పిన సమాధానానికీ ఒకరు అధికులు, ఒకరు నీచులుగా కొనసాగే సామాజిక ధర్మానికీ మధ్య వైరుధ్యం నానూ గుండెల్లో తీవ్ర సంచలననాన్ని కలిగించింది. ఆ నిరంతర సంచలనంనుండి, సంఘర్షణలనుండి జీవన సత్యాలను వెలికితీసి సమాజంలోని ఎగుడు దిగుళ్ళను నరికేయాలని కంకణం కట్టుకున్నాడు నారాయణగురు. మతసంప్రదాయాలనూ, సాంఘిక దురాచారాలనూ చిన్నప్పటినుండే వ్యతిరేకించేవాడు. ఉదాహరణకు తమకంటే కింది కులస్థులను అంటుకొని అవే చేతులతో తమకంటే ఎక్కువ కులస్తులైన నంబూద్రి బ్రాహ్మణులను, నాయర్లను ముట్టుకోవడం ఒక ఆటగా చేసేవాడు. గుళ్లల్లో దేవుళ్ళకు పెట్టిన నైవేద్యాలను దొంగతనంగా ఎత్తుకొచ్చి తన స్నేహితులతో కలిసి తినేసేవాడు. అదేమిటని ప్రశ్నిస్తే అద్వైతం చెప్పేవాడు.

తన ప్రాథమిక విద్యను చెంబుళంతి మూతపిళ్ళై అనే ఒక సవర్ణ హిందువు దగ్గర కొనసాగించాడు. ఆ వయస్సులోనే సంస్కృతి శ్లోకాలనూ, కావ్యాలనూ ఆకళింపు చేసుకున్నాడు. ప్రాథమికవిద్య పూర్తయిన తర్వాత పైచదువులు చదవడానికి ఆ గ్రామంలో అవకాశంలేక కొంతకాలం ఆవుల్ని మేపడానికి వెళ్ళేవాడు. ఆవుల్ని పొలాలకు తోలుకువెళ్ళి వాటిదారిన వాటిని వదిలిపెట్టి ఏ చెట్టుకిందనో, కొమ్మ మీదనో కవితలల్లుకుంటూ గడిపేవాడు. మేనమామగారైన కృష్ణ వైదియార్ నారాయణగురు తెలివితేటలపట్ల అమితాశ్చర్యం కనపర్చేవాడు. సంస్కృతంలో దిట్టగా పేరొందిన తనకు సైతం అర్థంకాని జఠిలమైన సంస్కృత శ్లోకాలను సునాయాసంగా చదివి అర్థంచెప్పుతుంటే ఆనందించేవాడు. ఎలాగైనా పైచదువులు చదివించడానికి 1876లో కాయంకుళంలోని కుమ్మల్‌పల్లి ఆసాన్ అనే విద్వాంసుడిదగ్గరకు పంపించాడు. అక్కడ చదువుతోపాటు సమాజం బాగా తెలిసివచ్చింది. తనతో పాటు చదువుకొనే నాయర్లు, బ్రాహ్మణులు కింది కులాలవాళ్ళను ఎంతో హీనంగా చూస్తుంటే క్రుంగిపోక ప్రత్యామ్నాయ మానవ సంబంధాలను ఏర్పర్చడానికి కలలు కనే వాడు. ఆనాటినుండి కులమత వివక్షలను దూరం చేయడానికి తనదైన పద్ధతిలో నిరంతరం శ్రమించాడు. కిందికులాలవారు పైకి రావడమంటే వారు విద్యావంతులు కావాలనీ విడివిడిగా

కాక సమైక్యంగా ఉండాలని, కుటీర పరిశ్రమలు ఏర్పరచుకోవాలని బోధించి ఆ బోధనల అమలుకై కృషిచేశాడు. అప్పట్లో ఎళవాలను దేవాలయాల్లోకి ప్రవేశించనిచ్చేవాళ్ళు కాదు. ఆ వర్ణాల దేవాలయ ప్రవేశం కోసం ఉద్యమించాడు. తర్వాతి కాలంలో అవర్ణుల కోసం దేవాలయాలను ప్రత్యేకంగా నిర్మించాడు. ఆ దేవాలయాలు సాంప్రదాయక దేవాలయాల వలె ఉండేవికావు. వాటిలో అంటరానివారినే పూజారులుగా నియమించేవాడు. ఈ దేవాలయాలు కేవలం అంటరాని వారికి దేవాలయ ప్రవేశం నిషేధంగా వుంది కాబట్టి నిర్మిస్తున్నాము. వారికిష్టంలేనప్పుడు వాటిని విద్యాలయాలుగా, ఆసుపత్రులుగా మార్చు కోవచ్చును అని తనను దేవాలయాలను గురించి ప్రశ్నించిన వారికి సమాధానమిచ్చేవాడు. వాటి నిర్మాణంకూడా అందుకు అనువుగానే వుండేది.

ఆయనకు పార్వతి అనే ఆమెతో వివాహం జరిగింది. కానీ ఆయనకు సంసారం ధ్యాసేలేదు. 'నేను నాకునచ్చిన మార్గంలో నడుస్తున్నాను. నువ్వు కూడా నీకునచ్చిన పద్ధతిలో జీవించవచ్చు' అని ఆమెతో చెప్పాడు. ఆమె నారాయణగురు మార్గంలోకి నడిచింది. దిక్కులేని స్త్రీలకు ఆశ్రమాలను నిర్మించి వారి సేవలోనే జీవితాన్ని గడిపింది.

'శ్రీ నారాయణ ధర్మ పరిపాలనా యోగం' అనే సంస్థను కులమత వివక్షలను పాటించని సరికొత్త సమాజాన్ని నిర్మించడానికి ప్రారంభించారు. ఈ సంస్థకింద పదమూడు కళాశాలలను స్థాపించారు. ఈ సంస్థలో బ్రాహ్మణులతోపాటు అన్ని కులాలవారు సభ్యులుగా చేరారు. ఆ కాలంలోనే మద్యపానాన్ని నిషేధించాలని ఆయన ప్రబోధించారు. స్త్రీవిద్యకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చారు. నిద్రలేక, సరైన తిండిలేక, జీవితంలో క్రమబద్ధత లేక ఆయన ఆరోగ్యం నానాటికీ క్షీణించింది. 1928 సెప్టెంబరు 20వ తేదీ సాయంత్రం 3.30 నిమిషాలకు ఆయన మరణించారు. తన డెబ్బై రెండేళ్ళ జీవితంలో ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొని తను జీవించదలచుకున్నట్లుగా జీవించిన సంతృప్తితో ఆయన మరణించాడు.

ఆయన చనిపోయాక ఎన్నో అద్భుతాలను ఆయన జీవితానికి జోడించారు. ఆయన్నొక అవతారంగా మార్చే ప్రయత్నం చేశారు. కానీ ఆయనొక సామాజిక విప్లవకారుడు. చెప్పింది అద్వైతమే అయినా చేసింది కుల నిర్మూలనా పోరాటం. శాస్త్రీయ విజ్ఞానం అభివృద్ధి చెందిన ఈనాటి నేపథ్యంలో నారాయణగురు దీక్ష, తపనను మనం స్వంతం చేసుకోవాలి. ఈ దేశంలో కులాలు పోవాలని, మతవిద్వేషాలు నశించాలని నిండుహృదయంతో కోరుకొని ఉద్యమించిన ఆయన జీవితం మనకు ఆదర్శప్రాయం.

**దళిత కిరణాలు సౌజన్యంతో**

# మూర్తీభవించిన ఆత్మ గౌరవం పెరియార్

కొందరి పేర్లు తలచుకుంటేనే జాతి రక్తం ఉప్పొంగుతుంది. ఆ వ్యక్తిత్వాలు తిరుగాడిన నేల పులకించిపోతుంది. వాళ్ళ స్మరణ ఒక సజీవ ఉత్తేజమై మనల్ని నడిపిస్తుంది. వాళ్ళు బతికిన తీరు, వాళ్ళు నడిచిన నడక, వాళ్ళిచ్చిన సందేశం – మార్పుకోసం, మంచికోసం, సర్వమానవ సౌభ్రాతృత్వం కోసం, మానవ విలువల కోసం, సమకాలీన సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయాంశాలతో వాళ్ళు పడిన సంఘర్షణ... ఒక ఆచరణను ప్రేరేపిస్తుంది. మార్పు అవసరమైన బతుకులు గడుపుతున్న అశేష పీడిత జనాంగం, మార్పు కోసం నిరంతరం కృషిచేస్తున్న సామాజికోద్యమ కార్యకర్తలూ ఆ జీవితాల గురించీ ఆ వ్యక్తిత్వాల గురించీ, ఆ పోరాటాల గురించీ ఎంతో అధ్యయనం చేసి స్ఫూర్తిని పొందవలసిన అవసరం ఎంతయినా వుంది. ఆ ఎరుకే ఒక సజీవ ఉత్తేజం.

భారత సమాజంలో మానవ విలువల కోసం, అందరూ సమానంగా స్వేచ్ఛగా ఉండాలని పోరాడిన ఎందరో జాతిరత్నాల్లో పెరియార్ ఒకరు. 1879 సెప్టెంబర్ 17వ తేదీన తమిళనాడులోని ఈరోడ్‌లో జన్మించి 94 యేళ్లు సుసంపన్నమైన నిండు జీవితాన్ని గడిపి 1973 డిసెంబర్ 24వ తేదీన ఆయన చనిపోయారు. చనిపోయేంతవరకూ మానవ గౌరవం కోసం, సమానత్వంకోసం, కుల నిర్మూలన, పురుషాధిక్యత, నిర్మూలనకోసం ఆయన నిరంతరం పోరాటం సాగించాడు.

ఆయన సాంప్రదాయ సనాతనాచార పరాయణులైన కుటుంబంలో పుట్టాడు. వెంకట నాయకర్, చినత్యామ్మై ఆయన తల్లిదండ్రులు. వాళ్ళకు పుట్టిన నలుగురు పిల్లలలో పెరియార్ రెండవవాడు. ఆయన పూర్తిపేరు ఈరోడ్ వెంకట రామస్వామి నాయకర్. ప్రజలు ఆయనను ప్రేమగా, గౌరవంగా పెరియార్ అని పిలుచుకున్నారు. ఆయన పెద్దగా చదువుకోలేదు. ఆయన ఇరవయ్యోఏట పదమూడేళ్ళ నాగమ్మైను వివాహం చేసుకున్నాడు. రెండేళ్ళకు పుట్టిన ఆడపిల్ల ఐదు నెలలు మాత్రమే బతికి చనిపోయింది. తర్వాత వారికి పిల్లలు పుట్టలేదు. ఇంట్లోని సనాతన ఆచారాలకూ, సమాజంలోని అవలక్షణాలకూ విసుగుచెంది తన పాతికేళ్ళ వయస్సులో ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. ఒక సన్యాసిలా తిరుగుతూ కాశీ చేరుకున్నాడు. అక్కడ ఎన్నో చేదు అనుభవాలు ఎదురవ్వడంతో ఎన్నో భ్రమలు వదలి హైదరాబాద్‌కు వచ్చాడు. అతనికోసం వెతుకుతోన్న తండ్రి హైదరాబాదులో ఆయన్ని పట్టుకొని తిరిగి ఇంటికి తీసుకువచ్చి వ్యాపారంలోపెట్టాడు. వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకుంటూ సంఘంలో పలుకుబడి గలిగిన వ్యక్తిగా ఎదిగాడు. దేవస్థానం ఛైర్మన్ పదవి, పన్నెండేళ్ళపాటు గౌరవ మేజిస్ట్రేటు పదవి, మునిసిపల్ ఛైర్మన్ పదవులతోపాటు దాదాపు 29 బాధ్యతాయుతమైన పదవుల్ని నిర్వహించాడు.

దేవదాసి విధానాన్ని నిర్మూలించటానికి, కుల అసమానతలను తొలగించటానికి, సమాజంలో స్త్రీల స్థితిని అభివృద్ధిపరచడానికి, మానవులందరూ ఆత్మగౌరవంతో జీవించేలా చేయడంకోసం ఆయన కాంగ్రెసు పార్టీలోచేరాడు. వైకోమ్ ఆత్మగౌరవ ఉద్యమ కాలంలో గాంధీ తదితర కాంగ్రెసు నాయకుల వైఖరికి నిరసనగా కాంగ్రెస్‌ను వదిలి బయటకువచ్చి నిరంతర ఆత్మగౌరవ ఉద్యమాన్ని చనిపోయేంతవరకు నడిపాడు. సమాజంలో ఉన్న అసమానతలు పోయి మనుషులందరూ ఆనందంగా జీవించే శ్రమైక జీవన సౌందర్యం కోసం ఆయన నిరంతరం ఘర్షణపడ్డాడు. ఆయనకు కొందరు శత్రువులయ్యారు. మరెందరో ఆయనకు మిత్రులయ్యారు. ఎవరు కలిసి వచ్చినా ఎవరు దూరమైనా ఒక అంతంలేని జీవన పోరాటంగా ఆయన ప్రజలలోనే, ప్రజల కోసం ఉద్యమించాడు. ఎన్నో జీవిత సత్యాలను ఆవిష్కరించి వాటి సఫలీకరణ కోసం రాజీలేని పోరాటం చేశాడు. చిన్న పదవులను, ఉన్నత పదవులను అలంకరించాడు. అన్ని కష్టాలను అనుభవించాడు. ఎంత సౌమ్యంగా వున్నాడో అంత ఆగ్రహమూర్తియై దోపిడీ పీడనలపైన విరుచుకుపడ్డాడు. ఎన్నోసార్లు జైలుకువెళ్ళాడు. పాదయాత్రలు చేశాడు. స్త్రీ విముక్తి కోసం శ్రమించాడు. ప్రభుత్వం హిందీని బలవంతంగా దక్షిణాది రాష్ట్రాలపై రుద్దటానికి నిరసనగా జాతీయపతాకాన్ని తగులబెట్టాడు. 1925లో "కుడి అరసు" అనే పత్రికనూ, 1927లో ద్రలిజన్ అనే పత్రికనూ, 1927లో రివోల్టు (తిరుగుబాటు) అనే ఇంగ్లీషు పత్రికనూ 1933లో "పహుత్ తరివు" అనే వార, దిన పత్రికలనూ, 1937లో జస్టిస్ పార్టీకోసం "విడుదలై" అనే దినపత్రికను ఆయన నడిపాడు. 1919-1930లలో ఆయన సింగపూర్, మలేషియాలలో పర్యటించాడు. 1931లో జర్మనీ, రష్యా, ఫ్రాన్స్, ఇంగ్లాండ్ దేశాలలో 11 నెలలపాటు పర్యటించాడు. 1954లో బుద్ధుడి 2500వ జన్మదినోత్సవాలలో పాల్గొనేందుకు ఆయన బర్మా వెళ్ళాడు.

తన 93వ ఏట 183 రోజులు గ్రామాల్లో పర్యటనలు జరిపి 249 ఉపన్యాసాలిచ్చాడు. 94వ ఏట 177 రోజులు గ్రామాల్లో పర్యటించి 229 ఉపన్యాసాలిచ్చాడు. జీవితాంతం నిద్రలేని నిరంతర ప్రయాణికుడిలాగా అనేక ప్రదేశాలు తిరిగి అనేక ఉత్తేజకరమైన ఉపన్యాసాలిచ్చి, అనేక రచనలు చేశాడు. ఆయన అక్షరాలకీ, మాటలకి మాత్రమే పరిమితమైన మేధావికాదు. ఆయన ఆచరణశీలి. కుల నిర్మూలన కోసం, దేవదాసి విధానాన్ని రద్దుచేయాలనీ, స్త్రీలుకూడా సమాజంలో పురుషులతో సమాన ప్రతిపత్తిని పొందాలని, ప్రజలందరూ ఆత్మగౌరవంతో జీవించాలని, పేదరికాన్ని నిర్మూలించాలని ఆయన యెన్నో ఉద్యమాలను నడిపాడు. ఆయన జీవితమే ఒక మానవతా శిబిరం. ఒక అధ్యయన కేంద్రం, ఒక యుద్ధరంగం.

**పెరియార్ ఆలోచనా విధానం:** పెరియార్ ఏం ఆలోచించాడో అది బోధించాడు. ఏది బోధించాడో అది ఆచరించాడు. ఆయన హేతువాది. మూఢవిశ్వాసాలను, ఆచారాలను

వదులుకొని ప్రజలందరూ హేతుబద్ధంగా ఆలోచించి ఆచరించిననాడే సమాజంలో ఉన్న అన్ని రుగ్మతలు తొలగిపోతాయని బోధించాడు. ఏ అంశాన్నైనా ఆయన విశ్లేషించుకున్న పద్ధతి అనుసరణీయం. ఏ విషయాన్ని పరిశీలించడానికైనా ఆయన కొన్ని ప్రశ్నలు వేసుకునే వాడు.

1) ఇది అందరికి మేలు కలుగజేస్తుందా?

2) ఇది హేతువుకు నిలబడుతుందా?

3) ఇది స్త్రీ, పురుషుల సహజ కాంక్షలకు భిన్నమైనదా? అనుకూలమైనదా?

4) అనుకూలమైనది కాకపోతే దాన్ని మనం ఎందుకు అనుసరించాలి?

5) ఇది మానవత్వాన్ని పెంపొందించి మానవ అభివృద్ధికి దోహదం చేస్తుందా? లేదా?

ప్రతి విషయాన్ని, నిర్ణయాన్ని ఇన్ని హేతుబద్ధమైన ప్రశ్నలకు గురిచేసి అనుకూలమైన సమాధానం వస్తేనే దానిని ఆచరించేవాడు. మంచిని ప్రేమించాలంటే చెడును ద్వేషించాలి. దానిపైన ఆగ్రహం ప్రకటించాలి. మనుషులందరూ మానవగౌరవాన్ని పొంది సుఖప్రదమైన జీవితాన్ని అనుభవించడమే మంచి. దీనికి శత్రువులు మూఢ విశ్వాసం, బ్రాహ్మణిజం, పురుషాధిక్యతలు. వీటిని నిర్మూలించకపోతే ఈ దేశ ప్రజలు స్వేచ్ఛను, సమానత్వాన్ని అనుభవించలేరని ఆయన చాటిచెప్పాడు. ప్రతి అణచివేతకూ వ్యతిరేకంగా, ప్రతి దోపిడి రూపంపైనా, మానవాభివృద్ధికి ఆటంకంగా వుండే ప్రతి మూఢ విశ్వాసం పైనా ఆయన తిరుగులేని పోరాటాన్ని నడిపాడు.

"ప్రతి వ్యక్తి తత్వమూ ఒక విశాల మానవత్వం అయిననాడు, ప్రతి వ్యక్తి జీవిత లక్ష్యమూ మానవులందరి సంక్షేమం, ప్రగతి అయిననాడు ఒకరిని ఒకరు ద్వేషించుకునే ప్రశ్న ఉదయించదు" అని పెరియార్ అన్నట్లుగా ఆయన తత్వం మానవత్వం. ఆయన లక్ష్యం మనుషులందరి క్షేమం. ఆయన జీవితం, ఆయన ఆలోచన, ఆయన పోరాటం మనందరికీ ఒక ఉత్తేజం.

**దళిత కిరణాలు – లోకాయత ప్రచురణలు**

# అణగారిన బతుకుల ఆశాదీపం అంబేద్కరిజం

**"మాకు యజమానులుగా కొనసాగడం మీకు అమిత ఆనందదాయకమైన విషయమైతే కావచ్చుగానీ మీకు ఎప్పుడూ బానిసలుగానే వుండాలని మేమెందుకనుకుంటాం?" –థూసిడైస్**

బతుకు మీద చావు తెరలు పంచుకొనేవేళ ఒక జీవన వీచిక కావాలి. కళ్ళ లోగిళ్ళలోకి కారు చీకట్లు ముసురుకొస్తున్న చోట ఒక రేఖా మాత్రపు వెలుగు భూమిక కావాలి. సమూహాలకు సమూహాలే ఒక అనంత అంతర్ముఖత్వంలోకి కూలిపోయి, గుండెలు పగిలి ప్రవహించే కన్నీటి సాగరాల్లో కొట్టుకుపోతున్నప్పుడు పిడికెడు విశ్వాసాన్నిచ్చే ఒక ఆలంబన కావాలి... ఒక ఓదార్పుల బడి కావాలి. పేగు తెంచుకు పుట్టిన బిడ్డకు తల్లి ఎండిన స్తన్యం గుక్కెడు పాలు తాపలేక అల్లాడుతున్నప్పుడు ఆప్యాయంగా గుండెలకు హత్తుకునే ఒక అనురాగపు అమ్మతనం కావాలి. విరిసే ఆకాంక్షలపైన ఉక్కు పాదమేదో విరుచుకు పడుతున్నప్పుడు ఒక ఆగ్రహ నినాదం జ్వలించాలి.

ఈ దేశంలో రాచపుండులాగా పుట్టిన హైందవ కులవ్యవస్థ కొంత మందికి అధికారమిచ్చి, సంపదనిచ్చి, సౌభాగ్యానిచ్చి, సామాజిక హోదానిచ్చి, మిగతా అందరికీ బానిస సంకెళ్ళు వేసి క్షతగాత్ర యుగాల గుండా తరుముకు వస్తున్నప్పుడు, దుర్మార్గపు నిచ్చెన మెట్ల సమాజం మనిషి నుండి మనిషిని చీల్చి ఒకడికి దైవత్వానిచ్చి, మరొకడికి మనిషి హోదానే నిషేధించి అతని నుదుటి మీద స్మశానాలను ముద్రిస్తున్నప్పుడు, అణగారిన బతుకుల ఆక్రందనల నుండి, బడుగుల జీవుల బతుకు పెనుగులాటల నుండి, పోరుప్రభాతాల నుండి, చీకట్లను చీల్చే ప్రచండ సూర్యుడిలాగా, బతుకు విముక్తి ప్రదాత లాగా, మానవతా సౌరభాలను వెదజల్లే ఒక విప్లవ తేజంలాగా, సంకెళ్ళను తెగతెంచే ఒక ఆగ్రహమూర్తిలాగా అంబేద్కర్ వ్యక్తిత్వం పుట్టుకొచ్చింది.

1891 ఏప్రిల్ పధ్నాల్గవ తేదీన రామ్‌జీ సక్పాల్, భీమాబాయి దంపతులకు పధ్నాల్గవ బిడ్డగా రత్నగిరి జిల్లాలోని మౌ గ్రామంలో అంబేద్కర్ జన్మించాడు. తండ్రి రామ్‌జీ సక్పాల్ భక్తి ఉద్యమకారుడు. కబీర్ అనుయాయి. అంబేద్కర్ పుట్టిన రెండేళ్ళకు రామ్‌జీ సక్పాల్ సైన్యం నుండి పదవీ విరమణ చేశాడు. కబీర్ అనుచరుడిగా ఆయన కూడా అన్యాయానికి వ్యతిరేకంగా ఉద్యమించాడు. 1892లో భారత సైన్యంలోకి మహర్‌లను తీసుకోవడాన్ని నిషేధించినప్పుడు వీరులైన మహర్లు తిరుగుబాటు చేశారు. ఆ పోరాటానికి రామ్‌జీ నాయకత్వం వహించాడు.

అంబేద్కర్ ఆరేళ్ళ వయస్సులోనే తల్లిని కోల్పోయాడు. తల్లి భీమాబాయి మరణించే నాటికి ఆమెకు పుట్టిన పధ్నాల్గు మంది సంతానంలో ఐదుగురు మాత్రమే మిగిలారు. చిన్నవాడైన అంబేద్కర్ పైన తండ్రి రామ్‌జీ ప్రభావం బలంగా వుంది. అన్యాయాలను

ఏమాత్రం సహించని తండ్రి తత్వాన్ని జీర్ణించుకొని అంబేడ్కర్ ఎదిగాడు.

దుర్మార్గమైన కులవ్యవస్థ అడుగడుగునా అవమానిస్తుంటే, అన్ని అవమానాలనూ భరిస్తూ, అన్ని ఆటంకాలనూ అధిగమిస్తూ అంబేడ్కర్ తన వ్యక్తిత్వాన్ని రూపొందించుకున్నాడు. అంబేడ్కర్ తన ఇంటిపేరును తన గురువుగారి నుండి స్వీకరించాడు. పధ్నాల్గవ ఏట ఆయనకు రమాబాయితో వివాహం జరిగింది. 1908లో బొంబాయిలోని ఎల్ఫిన్‌స్టోన్‌లో మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తిచేసి అదే కాలేజీలో 1912లో డిగ్రీపూర్తి చేశాడు. కొడుకు పట్టభద్రుడు కావడం కళ్ళారా చూసి 1914లో తండ్రి మరణించాడు. అదే సంవత్సరం ఉన్నత విద్య కోసం బరోడా రాజు ఆర్ధిక సహాయంతో అమెరికాలోని కొలంబియా యూనివర్శిటీకి అంబేడ్కర్ వెళ్ళారు. 1916లో ఆర్ధిక శాస్త్రంలో ఎం.ఎ. డిగ్రీకోసం 'ప్రాచీన భారత వాణిజ్యం' అనే గ్రంధాన్ని రచించారు. కొలంబియా యూనివర్శిటీలో జరిగిన ఆంత్రోపాలజీ సెమినార్‌లో 'భారత దేశంలో కులాల పుట్టుక, అభివృద్ధి, పనితీరు' అనే సిద్దాంత గ్రంథాన్ని ప్రవేశపెట్టారు. 'నేషనల్ డివిడెంట్స్ ఆఫ్ ఇండియా' అనే అంశంపై ఆయన చేసిన పరిశోధనకు పి.హెచ్.డి వచ్చింది. ఒక అంటరానివాడు ఇతర దేశాలలో చదువుకోవడం చూసి ఓర్వలేని బ్రాహ్మణులు అసూయతో బరోడా రాజుకు తెలియకుండా అంబేడ్కర్‌ని వెనక్కి పిలిపించారు. స్వదేశానికి తిరిగి వచ్చిన అంబేడ్కర్ బరోడా సంస్థానంలో మిలటరీ సెక్రటరీగా పనిచేశారు. అక్కడ అగ్రకుల హిందువులు ఆయనను ఎంతగానో అవమానించారు. 1918లో ఆయన బొంబాయిలోని సిడెన్ హోమ్ కళాశాలలో ఆర్ధిక శాస్త్ర, వాణిజ్య శాస్త్ర ప్రొఫెసర్‌గా చేరారు.

దళితజాతుల దయనీయమైన స్థితిని గురించి వాస్తవమైన ఆందోళన చెందుతూ ఆయన గొంతు విప్పారు. సౌత్‌బరో ఎన్నికల సంస్కరణల కమిటీ ముందు హాజరై దళితజాతుల రాజకీయ హక్కుల కోసం తనవాదనను వినిపించారు. 1920లో 'మూక్ నాయక్' అనే మరాఠీ పక్షపత్రికను స్థాపించారు. 1920లో మళ్ళీ ఆయన విద్యాభ్యాసం కోసం విదేశాలకు వెళ్ళారు. 'ది ప్రొవిన్షియన్ డీ సెంట్రలైజేషన్ ఆఫ్ బ్రిటీష్ ఫైనాన్స్ ఇన్ ఇండియా' అన్న అంశంపై లండన్‌లోని లాస్కీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ నుండి ఆయనకు యం.ఎస్.సి పట్టా వచ్చింది. ఈ పట్టా పొందిన ప్రధమ భారతీయుడు అంబేడ్కర్. 1924 జూన్‌లో ఆయన బొంబాయి హైకోర్టులో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. నిమ్నజాతుల అభ్యున్నతి కోసం 'బహిష్కృత హితకారిణీ సభ'ను ఏర్పాటుచేసి సామాజిక కార్యకర్తగా,రాజకీయవేత్తగా, రచయితగా, విద్యావేత్తగా ఆయన తన జీవన సమరాన్ని ప్రారంభించారు. అస్పృశ్య విద్యార్థులకు విద్యావకాశాలను పెంపొందించడం కోసం ఆయన బొంబాయి రాష్ట్రంలో నాలుగు వసతి గృహాలను ఏర్పాటు చేశారు. 1926 నుండి 34 వరకూ బొంబాయి శాసన సభలో నామినేటెడ్ సభ్యుడిగా కొనసాగారు.

1927 ఏప్రిల్‌లో 'బహిష్కృత్‌భారత్ అనే పక్షపత్రికను ప్రారంభించారు. అదే సంవత్సరం డిసెంబరు 25వ తేదీన చారిత్రాత్మకమైన మహద్ చెరువు పోరాటాన్ని ప్రారంభించారు. అదే రోజూ కోట్లాది పీడితుల హక్కులను నిషేధించిన మనుస్మృతిని బహిరంగంగా దగ్ధం చేశారు. 1928లో బొంబాయి ప్రభుత్వపు కాలేజీలో ప్రొఫెసర్‌గా ఆ తర్వాత అదే కాలేజీ ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. అదే సంవత్సరం 'సమాజ్ సమతా సంఘ్' అనే సంస్థను స్థాపించి సాంఘిక సమానత్వం కోసం కృషి చేశారు. 1929లో సమతా సైనిక్ దళ్‌ను ప్రారంభించారు. 1930లో జనతా వారపత్రికను ప్రారంభించారు. నాసిక్‌లోని కాలారాం దేవాలయంలో అంటరానివారి దేవాలయ ప్రవేశం కోసం జరిగిన పోరాటానికి నాయకత్వం వహించారు. 1930 నుండి 33 వరకూ లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు హాజరయ్యారు. రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో అస్పృశ్యులకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలని డిమాండు చేశారు. దీనికి వ్యతిరేకంగా గాంధీ ఎరవాడజైలులో ఆమరణ నిరహారదీక్షకు పాల్పడడంతో దేశవ్యాప్తంగా తీవ్రమైన వత్తిడివచ్చిన కారణంగా 1932 సెప్టెంబర్ 24వతేదీన పూనా ఒప్పందంపై సంతకం చేశారు. 1936లో ఇండిపెండెంట్ లేబర్ పార్టీని స్థాపించారు. జాత్‌పాత్ తోడక్ మండల్ వార్షికోత్సవానికి అధ్యక్షోపన్యాసంగా "కుల నిర్మూలన" రచించారు. ముందుగా పంపిన ఆయన వ్యాసాన్ని సంఘంవారు తిరస్కరించారు. ఆ తర్వాత ఆయన దాన్ని గ్రంథంగా ప్రచురించారు. కులవ్యవస్థ హేతువాదాన్నీ, వ్యక్తి సామర్థ్యాన్నీ నాశనం చేసిందనీ, నైతిక విలువల పునాదిగానే ఏ వ్యవస్థ అయినా సమానత్వ భావం కలిగి వుంటుందని చెపుతూ వర్ణాంతర వివాహాలు కులనిర్మూలనకు దోహదపడతాయని ప్రతిపాదించారు. 1937 నుండి 41 వరకూ బొంబాయి శాసన సభ్యునిగా వున్నారు. 1939లో 'ఫెడరేషన్ వర్సెస్ ఫ్రీడమ్' అనే రచన చేశారు. 1940లో పాకిస్తాన్‌పై ఆలోచనలు అన్న గ్రంథాన్ని ప్రచురించారు. కాంగ్రెస్ పెత్తందారీతనం, జిన్నా వారితో విభేదించిన విధానాలను ఆయన ఆ గ్రంథంలో వివరించారు. దేశ విభజన తప్పదనీ, అయితే ఆ తర్వాత ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుందనీ ఆయన చెప్పారు. ఈనాటికీ ఈ గ్రంథం ఎన్నో సమస్యల అధ్యయనానికి దోహదపడుతుంది. 1942 ఏప్రిల్‌లో 'అఖిలభారత షెడ్యూల్డు కులాల సమాఖ్య' అనే రాజకీయపార్టీని స్థాపించారు.

1942 నుండి 46 వరకూ వైశ్రాయి కౌన్సిల్‌లో కార్మిక మంత్రిగా వుండి నిమ్నజాతుల వారికి విద్య ఉద్యోగ సౌకర్యాలను కల్పించారు. 1943లో రెనడే – గాంధీ – జిన్నా గ్రంథాన్ని రాశారు. అదేకాలంలో 'లేబర్ అండ్ పార్లమెంటరీ డెమోక్రసీ' అనే వ్యాసం రచించారు. 1945లో "గాంధీ కాంగ్రెస్ అంటరాని వారికేం చేశారు?" అన్న గ్రంథాన్ని రాశారు. 1946లో మైనార్టీల నాయకుడిగా అంబేద్కరును బ్రిటీష్ కౌన్సిల్ కాబినెట్ ఇంటర్వ్యూ చేసినప్పుడు ఆయన స్వాతంత్ర్యం పైనా, నిమ్నజాతుల అభివృద్ధి పైనా తన అభిప్రాయాలను వెల్లడించాడు.

అదే సంవత్సరం 'శూద్రులెవరు?' అన్న గ్రంథాన్ని రాశారు. నాగులైన ఆదిమజాతులు క్షత్రియులుగా మారి బౌద్ధం స్వీకరించారు. బౌద్ధ, హిందూ ఘర్షణల్లో విజయం సాధించిన బ్రాహ్మణులు వీరిని లొంగదీసి శూద్రులుగా చేశారని ఆయన ఆ గ్రంధంలో ప్రతిపాదించారు.

1946లో మధ్యంతర ప్రభుత్వంలో రాజ్యాంగ నిర్మాణ కమిటీ సభ్యునిగా ఎన్నికయ్యారు. పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ, సిద్దార్ధ కళాశాలను స్థాపించారు. 1947 ఆగస్టు 15వ తేదీన నెహ్రూ మంత్రి వర్గంలో 'నాన్ కాంగ్రెస్' సభ్యుడిగా న్యాయశాఖా మంత్రిత్వాన్ని స్వీకరించారు. ఆగస్టు 29వ తేదీన భారత రాజ్యాంగ రచనా సంఘం అధ్యక్షునిగా ఎన్నికై రెండు సంవత్సరాల పదకొండు నెలల 18 రోజుల్లో ఆయనొక్కరే రాజ్యాంగ రచన పూర్తి చేశారు. "స్టేట్స్ అండ్ మైనారిటీస్" ప్రచురించారు. ఆయన వ్రాసిన అసలు రాజ్యాంగం ఇదే. భూములు భారీపరిశ్రమలు, భీమా కంపెనీలను జాతీయం చేయాలనీ, సమిష్టి వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టాలని ఆయన ఇందులో ప్రతిపాదించారు. 1948లో రెండవ వివాహంచేసుకున్నారు. అదే సంవత్సరం 'అస్పృశ్యులెవరు?' అన్న గ్రంధాన్ని రాశారు. ఆర్య ద్రావిడ ఘర్షణల్లో లొంగిన వారు శూద్రులు కాగా లొంగని వారు వెలికి గురైన 'బ్రోకెన్ పీపుల్స్' అస్పృశ్యులయ్యారు. వీరు బౌద్ధాన్ని అవలంబించారు. ఆర్యజాతి సిద్ధాంతాన్ని ఆయన తీవ్రంగా ఖండించారు. దాన్నొక సాంస్కృతిక పదంగా ఆయన పరిగణించారు. ఈ విషయమై అంబేద్కర్ అభిప్రాయం తీవ్ర భేధాభిప్రాయాలకు దారితీసింది. ఈ విషయమై ఎంతో పరిశోధన జరగాలని ఆయన అన్నారు.

అంబేద్కర్ ఈ దేశ పీడిత బతుకుల విముక్తి ఆకాంక్షలకు ప్రతీక. కుములుతున్న జనగణాల ధిక్కార నినాదాల గొంతుక. ఈ దేశంలో కుల, మతాల కుళ్ళు కరిగిపోయి మనుషులందరూ స్వేచ్ఛ, సమత, సౌభ్రాతృత్వాలతో వర్ధిల్లాలనీ, ఈ గడ్డమీద ప్రతి వ్యక్తిత్వం ఉన్నత సాంస్కృతిక విలువలతో వికసించాలనీ ఆయన శాస్త్రీయంగా స్వప్నించాడు. అంటరానివాడిగా చేసి, అగ్రవర్ణ సమాజం ఆయనకు ప్రసాదించిన అవమానాలూ, ఆవేదనలూ, మానసిక క్షోభలనుండి, అడుగడుగునా పోరాటంగా తనను తాను మేధావిగా తత్వవేత్తగాను మలచుకునే క్రమంలో ఆయన సలిపిన సమాజ మధనం నుండి ఒక ఆచరణాత్మక సిద్ధాంతంగా అంబేద్కరిజం ప్రభవించింది. అంబేద్కర్ తన సిద్ధాంతాన్ని రూపొందించడానికి భారత నిర్దిష్ట సామాజిక పరిస్థితులేకాక, ప్రముఖ తత్వవేత్తలు,విప్లవ మూర్తులు ఆయనను ఎంతగానో ప్రభావితం చేశారు. భారత సమాజంలో దుర్మార్గంగా కొనసాగుతున్న అసమానతలను రూపుమాపడానికి తమతమ పద్ధతుల్లో విప్లవించిన బుద్ధుడు. కబీర్, మహాత్మా జ్యోతిరావు పూలేల ప్రభావం అంబేద్కర్ పైన ఎంతగానో వుంది. అదే విధంగా కారల్ మార్క్స్, జాన్‌డ్యూయీ తదితరులు ప్రభావం ఆయనపైన వుంది. భారత సామాజిక పరిస్థితులకు అనుకూలమైన ఆచరణాత్మక సిద్ధాంతాన్ని ఆయన రూపొందించారు.

ఈ దేశంలో సామ్యవాదాన్ని స్థాపించాడానికి ఆయన విప్లవించారు.

బహుశా ఈ మాటలు చాలా మందికి మింగుడు పడవు. ముఖ్యంగా తమను తాము కమ్యూనిస్టులుగా చెప్పుకొనే చాలా మందికి అసలు మింగుడు పడవు. చాలా మంది దృష్టిలో అంబేద్కర్ ఒక బూర్జువా మేధావి. ఒక బూర్జువా రాజ్యాంగ రచయిత, మహా అయితే ఒక అంటరానివారి నాయకుడు. వారీ అభిప్రాయానికి రావడానికి వారు చెప్పే కారణం అంబేద్కర్ రాజ్యాంగం రాయడమే. సోషలిస్టు దేశాలకు రాజ్యాంగాలు ఉండనట్లూ, అవి అంబేద్కర్ రాసిన రాజ్యాంగం కన్నా అభివృద్ధికరంగా వుంటాయన్నట్టు వారీ విమర్శలకు పూనుకుంటున్నారు. రాజ్యాంగ చరిత్రనూ, రాజ్యాంగ రచనలో అంబేద్కర్ ఎదుర్కొనే అవరోధాలనూ తెలిసినవారెవ్వరూ అంబేద్కర్ సామ్యవాద భావాలను శంకించరు. అంబేద్కర్ రాసిన "స్టేట్స్ అండ్ మైనారిటీస్" గ్రంథమే ఆయన అసలు రాజ్యాంగం.

నిజానికి అంబేద్కర్ ఉద్యమాలనూ, జీవితాన్నీ, రచనలనూ, ఆయన సిద్ధాంతాన్నీ ఏ మాత్రం చిత్తశుద్ధితో అధ్యయనం చేసినా ఆయన ఒక తత్వవేత్తగా, భారత సమాజానికి అవసరమైన సమతా ఆర్థిక విధానాన్ని ప్రతిపాదించిన సామ్యవాద సిద్ధాంతకర్తగా, అణగారిన బతుకుల్ని విముక్తి చేయడానికి ఉద్యమాలను నిర్మించిన విప్లవమూర్తిగా, సామాజిక శాస్త్రవేత్తగా, ఆచరణశీలిగా గుర్తించి ఉండేవాళ్ళు. కానీ అంబేద్కర్‌ను వాళ్ళు అలా గుర్తించడానికి అగ్రకుల హిందూ సమాజం సృష్టించిన కుహనా విలువల భేషజాల పరిమితులెన్నో అడ్డుగా నిలుస్తాయి. మన దేశంలో డెబ్బై ఏళ్ళ కమ్యూనిస్టు ఉద్యమం భారత సామాజిక చలన సూత్రాలను పట్టుకోవడంలోనూ, అంబేద్కర్ తత్వాన్నీ, కృషినీ స్వంతం చేసుకోవడంలోనూ దారుణంగా విఫలమయ్యింది. మార్క్స్, ఏంగెల్స్‌లు ప్రతిపాదించిన సూత్రాలను అన్వయంతోనూ, ఆచరణతోనూ సంబంధంలేని పిడిసూత్రాలుగా వల్లెవేస్తూ ఆ సూత్రాల్లోని జవాన్నీ, జీవాన్నీ, అంతస్సారాన్నీ పోగొట్టి బొమ్మ గుర్రమెక్కి, ముందుకు పోతున్నామన్న భ్రమల్లో తాము మునగడమేకాక ఈదేశ దళిత శ్రామిక వర్గాన్ని ముంచెత్తారు. రష్యాలో వర్షం పడితే ఇక్కడ గొడుగు పట్టే విధానంలో అవగాహనతో భారత చారిత్రక పరిణామంలోని ప్రత్యేకతను పట్టుకోడానికీ, పునాది నుండి ఉపరితలానికీ, ఉపరితలం నుండి పునాదికి విస్తరించిన కుల వ్యవస్థ విశ్వరూపాన్ని గుర్తించడానికి అశక్తులయ్యారు.

అంబేద్కర్ అనే ఒక మహామనిషి పుట్టిన వందేళ్ళ తర్వాత రక్తసిక్తగాయాలతో కునారిల్లుతోన్న దళిత ప్రపంచం తన అస్థిత్వాన్నీ, విముక్తిని అంబేద్కర్ దర్శనంలో వెతుక్కోడం మొదలు పెట్టింది. అంబేద్కర్ సమగ్ర విప్లవ తత్వాన్ని ఆయుధంగా చేసుకొని తన విముక్తి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతుంది. ఈ నేపథ్యంలో అంబేద్కరిజాన్ని పరిశీలిద్దాం.

**"భారత ప్రజలకు బ్రాహ్మణిజం, క్యాపిటలిజం ప్రధాన శత్రువులు"**

భారతదేశంలో బ్రాహ్మణిజం సృష్టించిన కులదొంతరల అంతరాలను, పెట్టుబడిదారీ విధానం కొనసాగిస్తున్న ధనిక పేద వ్యత్యాసాలనూ, నిర్మూలించినప్పుడే సమతా సమాజాన్ని నిర్మించగలం అని అంబేడ్కర్ చెప్పారు. ఈ దేశంలో అణగారిన వర్గంగా వున్న యస్సీ, యస్టీ, బీసీ, మైనార్టీ వర్గాలు ఐక్యసంఘటనగా ఏర్పడి భారతదేశంలో ఉన్న అసమాన సంబంధాలను కూల్చివేయాలని ఆయన ప్రబోధించారు. అందుకు కులనిర్మూలన, స్టేట్ సోషలిజం అనే అంశాలను ప్రతిపాదించారు. కమ్యూనిస్టులు కులాన్ని ఉపరితలాంశంగా, మానసిక పరమైన మతాంశంగా గుర్తిస్తారు. కానీ అది ఎంతగా సాంస్కృతికాంశమైనా అంతగా సాంఘిక ఆర్థికాంశం.

"అంటరానితనం ఒక మతవ్యవస్థ అని చాలామంది నమ్మకం. అది నిజమే. కానీ దాన్ని కేవలం మతపరమైన అంశంగా గుర్తించటం పొరపాటు. అంటరానితనం ఆర్థిక వ్యవస్థకూడా. బానిస వ్యవస్థకన్నా క్రూరమైన ఆర్థిక వ్యవస్థ. బానిస వ్యవస్థలో బానిస కొనుగోలు శక్తి తగ్గకుండా ఉండటంకోసం అతనికి తిండి, బట్ట, నివాస సదుపాయాలను యజమాని సమకూర్చుతాడు. కానీ అస్పృశ్య వ్యవస్థలో అంటరానివాడి జీవన బాధ్యతలను ఏ హిందూ యజమానీ స్వీకరించడు. అస్పృశ్యత అంతులేని దోపిడీకి అవకాశమిచ్చే అదుపులేని ఆర్థికవ్యవస్థ" అని అంబేడ్కర్ సూత్రీకరించారు. అది పోవాలంటే కులనిర్మూలన జరిగి, సోషలిస్టు విధానాలను అమలు చేయాలని ఆయన ప్రతిపాదించారు. అదే ఆయన ప్రజాస్వామిక విప్లవ సిద్ధాంతం. ఆయన ప్రజాస్వామ్యం భూస్వాములకు కౌలురేట్లు పెంచే స్వేచ్ఛని ఇచ్చేదిగాదు. ఆయన ప్రజాస్వామ్యం వ్యక్తి కేంద్రంగా సమాజం సర్వతోముఖావృద్ధిని పొందే ప్రజాస్వామ్యం. అసలైన ప్రజాస్వామ్యం అణగారిన వర్గాలు రాజ్యాధికారానికి వచ్చినప్పుడే దాన్ని సాధించడం సాధ్యమవుతుందని ఆయన నొక్కిచెప్పారు.

భారతదేశంలోని భూమినంతటినీ ప్రభుత్వం జాతీయంచేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా నడపాలనీ, వ్యవసాయాన్ని ప్రభుత్వ పరిశ్రమగా అభివృద్ధి చేయాలనీ, దేశంలోని కీలకమైన పరిశ్రమలన్నింటిని జాతీయం చేయాలనీ, కీలకం కాని పరిశ్రమలను ప్రభుత్వ కార్పొరేషన్లుగా నడపాలనీ, ప్రజలకు భద్రతనిచ్చే జీవిత బీమా సంస్థలను కూడా ప్రభుత్వమే నడపాలనీ, పిల్లలు, వృద్ధులు తదితర ఆధారిత ప్రజల బాధ్యతను ప్రభుత్వమే చేపట్టాలనీ స్త్రీలు, పురుషులు అనే వివక్ష లేకుండా, అన్నిరకాల వివక్షలనూ తొలగిస్తూ సమాజాన్ని పునర్నిర్మించాలని అంబేడ్కర్ తన స్టేట్ సోషలిజంలో ప్రతిపాదించారు. వ్యక్తి సర్వతోముఖాభివృద్ధి సమాజ అభివృద్ధిగా పరిగణించాలని అంబేడ్కర్ ప్రతిపాదించారు. చిత్తశుద్ధి ఉన్న, సామ్యవాద భావాలు కల ఎవరైనా ఆమోదించే సూత్రాలివి. అయితే అంబేడ్కర్‌కు భారత పాలకవర్గాల మీద భ్రమలున్నాయనీ, అందుకనే వారిని గుడ్డిగా నమ్మాడనీ

చాలామంది విమర్శకులు ఆరోపిస్తుంటారు. భారత పాలకవర్గాలమీద అంబేద్కర్‌కు ఏనాడూ భ్రమలు లేవు. భారతపాలక వర్గాలకూ, వారికి సిద్ధాంత భూమికనిచ్చిన గాంధీని ఈ దేశంలో అంబేద్కర్ ఎదుర్కొన్నంతగా ఎవరూ ఎదుర్కొనలేదన్నదీ ఎవరూ కాదనలేని వాస్తవం. ఈ రాజ్యాంగం సరిగా అమలుకాకపోతే అది రాజ్యాంగం తప్పు కాదు. దాన్ని అమలు చేయాల్సిన అధికారంలో ఉన్న వారిదే తప్పు. అందుకని రాజ్యాధికారంలోకి దళిత శక్తులు రావాలని ఆయన పిలుపునిచ్చారు. రాజ్యాంగంలో ఉన్న ప్రజా వ్యతిరేకాంశాలపైన ఆయన విరుచుకుపడినంతగా ఎవరూ విరుచుకు పడలేదు. ముఖ్యంగా ఆర్టికల్ 31(ఆస్థిహక్కు) పైన ఆయన మండిపడ్డారు. అది నేను రాసింది కాదు. దానివైపు చూడడానికే నాకు అసహ్యం అని ఆయన రాజ్యసభలో చెప్పారు.

"1950 సంవత్సరం జనవరి 26వ తేదీనుండి మన భారతదేశంలో రాజకీయ సమానత్వం ఏర్పడినా, సాంఘిక, ఆర్థిక రంగాలలో అసమానత్వమే వుంది. ప్రజాస్వామ్య వ్యతిరేకమైన ఈ అసమానత్వాలను త్వరలో రూపుమాపక పోయినట్లయితే పీడిత ప్రజానీకం ఓర్పు సహనం కోల్పోయి తిరుగుబాటు చేస్తారు" అని ఆయన హెచ్చరించారు. ఈ రాజ్యాంగం ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే దాన్ని తగులబెట్టేవారిలో ప్రథముణ్ణి నేనే అని ఆయన స్పష్టం చేశారు. కొద్దిపాటి అవకాశాలతో సంతృప్తి చెందవద్దనీ, నిరంతరం ఉద్యమాన్ని నడిపేందుకు సన్నద్ధులు కండని ఆయన పీడితవర్గాలకు పిలుపునిచ్చారు.

"రాజకీయాల్లో దగ్గర మార్గం లేదు. ఎంతో కాలం శ్రమిస్తేగాని మనం అధికారం చేజిక్కించుకోలేం. అందుకు మనం గొప్ప ఉద్యమాన్ని నడిపించాలి. మన శక్తినంతా ధారపోయాలి" అని ఆయన ప్రజలకు పిలుపునిచ్చారు. అందుకు ఆయన అహింసను ప్రబోధించిన మాట నిజమే. అయితే ఆ అహింస బలప్రయోగంతోనైనా సరే హింసను రూపుమాపే అహింస. "నాకు అహింస మీద నమ్మకం ఉన్నమాట నిజమే. అయితే నా అహింసం సంత్ తుకారం చెప్పిన అహింస. సంత్ తుకారం చెప్పిన అహింసలో అహింసగా ఉండడం, దుర్మార్గపు శక్తుల్ని అంతం చేయడం అనే రెండంశాలు ఇమిడి వున్నాయి" అని అంబేద్కర్ తన మార్గాన్ని చెప్పారు.

అందుకోసం త్యాగాల పునాదితో అసిధారా వ్రతం జరగాలి. ఈ దేశంలో అంబేద్కరిజం వెలుగులో సమతా సౌరభాలు విరబూయాలి. మనుషులందరూ ఏకోదర సహోదరులుగా మసిలే అమహూర్తాలాగమించాలి. అందుకు మనతరం నడుంకట్టాలి.

**ఏప్రిల్ 2002 – బహుజన కెరటాలు**

**దళిత కిరణాలు సౌజన్యంతో**

# దళిత సాహిత్యం

**"నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి రూప రే**
**ఖా కమనీయ వైఖరుల గాంచి భళీ భళి యన్న వాడె నీ**
**దే కులమన్న ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోవుచో**
**బాకున గ్రుమ్మినట్లగును పార్థివ చంద్ర! వచింప సిగ్గగున్"**
**"గవ్వకు సాటిరాని పలుగాకులు మూకలసూయచేత న**
**న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే?**
**యివ్వసుధా స్థలిన్ బొడమరే రసలబ్ధులు గంటమూనెదన్**
**రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్"**

**– దళిత యుగ కవి జాషువా**

ఇది దళిత యుగం. దళిత సాహితీ యుగం. ప్రకృతినీ, ప్రకృతి అనుమతించిన సమాజాన్ని, వాటి చైతన్యాల మొత్తాన్ని దళిత ప్రశ్న భేతాళుడై నిలదీసి, సకల రంగాలనూ కుదిపివేస్తున్న యుగం. ఆ ప్రశ్నలకూ కుదుపులకూ సాహితీరంగం అలీనంగా, నిశ్చలంగా వుండడం అసాధ్యమైన విషయం.

సముద్రమంత విశాలమైనది జీవితం. సముద్రమంతా జీవితమంతా, విశాలమైనది సాహిత్యం. జీవితంలోని అన్ని కోణాలనూ, పార్శ్వాలనూ సాహిత్యం స్పర్శిస్తుంది. జీవితం ఎదుర్కొనే ప్రతి సంఘర్షణనూ, సంవేదనలనూ, ఆటుపోట్లనూ, జీవితం మీద పరచుకునే అన్ని చీకటి వెలుగులనూ సాహిత్యం రికార్డు చేస్తుంది. సామాజిక జీవితంలో వ్యక్తమయ్యే ప్రతి ఆకాంక్ష, మార్పుకోసం, అభివృద్ధి కోసం జరిగే ప్రతి పెనుగులాటా సాహిత్యంలోనికి అనుసృజనం కావాలి. సామాజిక జీవితంలో లేనిదేదీ సాహిత్యంలో ఉండే వీలులేదు. సామాజిక జీవితమే సాహిత్యానికి భూమిక, ప్రాతిపదిక.

జీవితమంటే ఒక అమూర్త కాదు. తెలుగు గడ్డమీద జీవితం అనేక వైవిధ్యాలతోనూ, వైరుధ్యాలతోనూ, ఘర్షణలతోనూ అనేకానేక నిర్దిష్టతలతోనూ కొనసాగింది. తరాలుగా మనిషితనాన్ని ధ్వంసం చేస్తున్న వికృత విలువలకూ, మానవ విలువలకూ మధ్య సంఘర్షణ జరుగుతూనే ఉంది. మనుషుల్ని మనుషులుగా కాక పశువుల్లా, బానిసల్లా చూసే హిందూ దోపిడీ ధర్మానికీ, మానవ ధర్మానికీ మధ్య తరతరాలుగా యుద్ధం జరుగుతూనే వుంది. ఈ ఘర్షణల్లో నలిగిపోయిన మానవ సమూహాలు తమ ఆవేదనల్ని, అనుభూతుల్నీ, ఆలోచనల్నీ సాహితీ రూపాల్లోకి అనువదించుకుంటారు. తమ కలలనూ, భవిష్యత్ ఆకాంక్షలనూ, తమ బతుకుల్ని శాసిస్తున్న దౌష్ట్యం మీద కసినీ, ఆగ్రహాన్ని, గుండెమంటలనూ, కన్నీళ్ళనూ సాహితీ వ్యక్తీకరణలుగా మలచుకుంటారు. అయితే సమాజాన్నీ, సామాజిక జీవితాన్నీ ఎవరు

ఆక్రమించుకొని, హస్తగతం చేసుకుని రాజ్యమేలుతుంటారో వారి భావజాలమే సమాజ భావజాలంగా, వారి చరిత్రే సమాజ చరిత్రగా, వారి సాహిత్యమే సమాజ సాహిత్యంగా చలామణి అవుతుంది. దానికి భిన్నంగా తమ విముక్తి కోసం ఉద్యమించే ప్రజానీకం తమ విముక్తి సాహిత్యాన్ని తమ విముక్తి పోరాటాల్లో భాగంగా సృజించి రికార్డు చేసుకుంటారు. గుండెనుండి గుండెకు ప్రవహించే పాటలా కొనసాగే ఒక విముక్తి యుద్ధంలా ధిక్కార సాహిత్యం ప్రజ్వలిస్తుంది.

మనది వర్ణాశ్రమ హిందూ ధర్మం రాజ్యమేలుతున్న నిచ్చెన మెట్ల సమాజం. 'చాతుర్వర్ణాం మయాం సృష్టం' అని శ్రీకృష్ణ పరమాత్మతో చెప్పించి, దాన్ని అమలుపర్చడానికి మారుతున్న కాలానికి అనుగుణంగా వర్ణధర్మాన్ని తీర్చిదిద్దడానికి రాజ్యం సకల ఉపాయాలనూ అనుసరిస్తుంది. ధర్మ రక్షణ కోసం యుద్ధాలు చేస్తుంది. సంధి చేసుకుంటుంది. దాడులు చేస్తుంది. శిక్షలు విధిస్తుంది. దానికి ధర్మబద్ధ పరిపాలన అనే ముద్దు పేరు పెట్టుకుంటుంది.

ధర్మరక్షణ అంటే హిందూవర్ణ ధర్మరక్షణే. అంటే కొంతమందిని బ్రాహ్మణులుగా, కొంతమందిని రాజులూ చక్రవర్తులుగా, కొంతమందిని వైశ్యులుగా, కొందరిని శూద్రులుగా భగవంతుడే సృష్టించాడనీ, వారివారి గుణకర్మాలను బట్టి వారికి జన్మలనిచ్చి వారికి కొన్ని విధులను కేటాయించాడనీ, ఆయా విధులను ఆచరించడమే ధర్మమనీ దానిని అతిక్రమించకుండా చూడడమే పాలకుల పవిత్ర కర్తవ్యమనీ హిందూ ధర్మం చెబుతుంది. ఆ ధర్మం ప్రకారం బ్రాహ్మణులు పూజాది కార్యక్రమాలను నిర్వర్తిస్తూ పాలకులకు మార్గ దర్శకులుగా వుంటారు. క్షత్రియులు రాజ్యపరిపాలనా భారాన్ని మోస్తూ ధర్మాన్ని రక్షిస్తారు. వైశ్యులు వ్యవసాయ, వ్యాపారాది కార్యక్రమాలను చేస్తారు. శూద్రులు పై వారందరికీ సేవలు చేస్తారు. కాలగమనంలో 'భారతమ్మోరి కడగొట్టు బిడ్డల్లా' అన్ని వెట్టి పనులూ చేసే బానిసలుగా, సకలమూ తామే అయ్యి దేనికీ చెందక కాలగమనములో సమాజం అట్టడుగుపొరలలో మిగిలిపోయారు.

అధికారం చెలాయిస్తూ సుఖాలనుభవించడమే తమ ధర్మంలో భాగమైనందుకే అస్పృశ్యులుగా, సకలసుఖాలకూ దూరంగా బతుకులీడుస్తున్న వాళ్ళు తమ ధర్మాన్ని ఐచ్ఛికంగా నిర్వర్తించలేరు. నమ్మినంతకాలం తమ కర్మాన్ని తిట్టుకుంటూ కుమిలిపోతూ పై వర్ణాలకు దాస్యం చేస్తారు. ధర్మం విశ్వసనీయత పట్ల ప్రశ్నలూ, సందేహాలు చెలరేగే కొద్దీ 'ధర్మం చెర' నుండి బయటపడేందుకు పెనుగులాడతారు. అగ్రకుల హిందూరాజ్యం ధర్మాన్ని బలవంతంగా రుద్దే ప్రయత్నం చేస్తుంది. దళిత కులాల వాళ్ళు ధర్మం బరువును దించుకునేందుకు ఘర్షణ పడతారు. భారతదేశ చరిత్ర అంతా వర్ణ ధర్మాన్ని కాపాడేందుకు అగ్రవర్ణ పాలకులకూ, వర్ణ ధర్మానికి వ్యతిరేకంగా దళిత పాలితులకూ మధ్య జరిగిన ఎడతెగని పోరాటాల చరిత్రే. భారతదేశ చరిత్ర అంతా సేవకునిగా, అస్పృశ్యులుగా, పంచములుగా, ఛండాలురుగా,

అనేకానేక వికృత ప్రత్యేకతలతో అణగారిపోయిన "ధర్మోపహతులు" కింది కులాలవారిగా, ఆదివాసులుగా, స్త్రీలుగా, అల్పసంఖ్యాకులుగా తాము అనుభవిస్తున్న ప్రత్యేక, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, లైంగిక అణచివేతకు వ్యతిరేకంగా సాగించిన మహోజ్వల పోరాటాల చరిత్రే.

జీవితంలోని ప్రతి ఘర్షణనూ, సామాజిక జీవితం నడిపిన ప్రతి ఉద్యమాన్నీ, ప్రతి మలుపునూ సాహిత్యం ప్రతిబింబిస్తుంది. అయితే వీరుల చరిత్ర, విజేతల చరిత్రే సామాజిక చరిత్రగా ప్రచారమైనట్లే, ప్రభువుల సాహిత్యమే, పాలకుల భావజాలం నిండిన సాహిత్యమే సామాజిక సాహిత్యంగా ప్రచారమవుతుంది. ప్రజలు సృష్టించుకున్న సాహిత్యం అవాచకంగా, అముద్రితంగా, పాలకుల పాదాల కింద నలిగిపోయి కునారిల్లుతూ ఉంటుంది. ధిక్కార భావజాలాన్నీ, సాహిత్యాన్నీ హిందూ మనుధార్మిక రాజనీతి పరమ క్రూరంగానాశనం చేసింది. జీవితం లోతుల్ని తవ్వి గతం గనుల నుండి మళ్ళీ చరిత్రను నిర్మించుకోవాల్సిన బాధ్యత మనమీదే వుంది. జానపదాల రూపంలో, పిట్టకథల రూపంలో, మౌఖిక సంప్రదాయ రీతుల్లో ఇప్పటికీ సజీవంగా వున్న వర్ణ ధర్మ వ్యతిరేక సాహిత్యాన్ని వెలికితీసి వ్యాఖ్యానించే కర్తవ్యాన్ని దళిత పరిశోధకులు బాధ్యతగా స్వీకరించాలి.

* * *

ధర్మం పేరుతో, హిందూత్వం పేరుతో సాగుతున్న అమానవీయ ఆచారాలకు వ్యతిరేకంగా లోకాయత, చార్వాక, బౌద్ధ, జైనదర్శనాలు తిరుగులేని పోరాటాన్ని సాగించాయి. హిందూ మౌఢ్యానికి, క్రౌర్యానికీ వ్యతిరేకంగా తమ పోరాటాన్ని, వాదనలనూ అద్భుతమైన భౌతిక వాద తర్కంతో నిండిన సాహితీ రూపాలుగా వారు వ్యక్తీకరించారు. వేదాలనూ, వేద సాహిత్యాన్నీ ఎదుర్కొని వేల సంవత్సరాలు తమ తర్కాన్ని సజీవంగా వుంచగలిగారు. బౌద్ధ, జైన సాహిత్యం ఇప్పటికీ సజీవంగా వుండి తాము వైదిక ధర్మాన్ని ఎదుర్కొన్న తీరుకు ప్రత్యక్షసాక్షులుగా నిలిచి వున్నాయి. సంస్కృత భాష ఆధిపత్యాన్ని ధిక్కరిస్తూ ప్రజల భాషయైన పాళీ భాషలో ఎంతో సాహిత్య సృజన జరిగింది.

సామాజిక పరిస్థితులలోని అంతరాల వలన చెలరేగిన కుల నిర్మూలనా చైతన్యానికి భక్తి ఉద్యమకారులు తమ కలాలనూ, గళాలనూ అంకితం చేశారు. రామానుజుడు, స్వామి రామానంద, శ్రీ చైతన్య, బసవేశ్వరుడు, నానక్, కబీర్ తదితరులు భక్తి ఉద్యమాల ద్వారా కుల వ్యవస్థను నిరసిస్తూ ఎంతో సాహిత్యాన్ని సృష్టించారు. భక్తి ఉద్యమకారులంతా వర్ణధర్మానికి వ్యతిరేకంగా తమ బోధనలను కవితా రూపాల్లోనే వెలువరించారు. సూటిగా అంటే సరళమైన భాషలో, సునిశితమైన తాత్విక అంశాలను కవిత్వంగా మలచి వాళ్ళు ప్రజలకు అందించారు. కబీర్ ద్విపంక్తి (దోహా) కవితలు ఈనాటికీ సజీవంగా ఉండటానికి

కారణం ఆయనలోని కుల నిర్మూలనా దృక్పథమే. గురునానక్ 'లంగర్' (సమిష్టి భోజనశాల) నాలుగు శతాబ్దాలపాటు కులనిర్మూలనా పద్ధతిలో సాగింది. హిందూమతంలోని కుళ్ళును కడిగివేస్తూ భక్తి ఉద్యమకారులు ఉద్యమించారు. తెలుగులో వేమన సకల దురాచారాలకూ వ్యతిరేకంగా కలం దూసి యుద్ధంచేశాడు. వేమన విసిరిన కవితా కరవాలాల దాటికి తట్టుకోలేక ధర్మమూ, ధర్మపరాయణత్వమూ బిక్క చచ్చిపోయాయి. అస్పృశ్యత వలన మనుషుల మధ్య ఐక్యత దెబ్బతింటుందనీ, సమాజంలో కొన్ని వర్గాల వారికే సర్వాధికారాలూ ఉన్నంతకాలం నిమ్న వర్గాల వారికి విముక్తి లేదనీ ఆయన చాటి చెప్పాడు. వేమనకు ముందు కులాలను నిరసిస్తూ పాల్కురికి సోమన్న రచనలు చేశాడు. పోతులూరి వీరబ్రహ్మం తన కాలజ్ఞాన తత్వాలతో కులమతాలను నిరసించాడు.

దక్షిణ భారత దేశంలో క్రీస్తు పూర్వం నుండి దశలు దశలుగా విలసిల్లిన సంగం సాహిత్యం బ్రాహ్మణేతర సాహిత్యంగా ఈనాటికీ నిలిచి వుంది. సంగం సాహిత్యంలో ఇప్పటికీ సజీవంగా నిలిచిన తిరువళ్ళువర్ రచించిన "తిరుక్కురళ్" తమిళ వేదంగా ప్రసిద్ధి పొందింది. రాజకీయ పరంగా, నైతిక పరంగా, ప్రేమ సంబంధమైన 1330 గీతాలు అందులో వున్నాయి. ఈ గీతాల నిండా భౌతిక వాదం తొణికిసలాడుతుంది.

మహారాష్ట్రలో మహాత్మా జ్యోతిరావు ఫూలే హిందూ కౌటిల్యాన్నీ, కాపట్యాన్నీ ఖండఖండాలు చేస్తూ "అఖండాలు" అనే పద్యరూపంలో ఎన్నో కవితలు రాసి వేదాల మీదా, హిందూ ధర్మశాస్త్రాల మీదా విరుచుకు పడ్డాడు. స్త్రీలు, కింది కులాల వారి విముక్తి కోసం ఆయన ఎన్నో కవితలూ, నాటికలూ, తాత్విక గ్రంథాలూ రచించాడు. కిందికులాల వారి జీవితాల్లో ఒక విప్లవాత్మకమైన మార్పు తేవడానికీ, స్త్రీల, దళితుల చరిత్రను భౌతిక వాద దృక్పథంతో తిరగ రాయడానికీ ఆయన మహత్తరమైన కృషి చేశాడు. ఆయన అగ్రకుల హిందూ దోపిడీ తత్వానికి వ్యతిరేకంగా తన కలాన్నీ, గళాన్నీ, జీవితాన్ని ఎక్కుపెట్టాడు. ఆయనది అగ్ని గొంతుక. వైదిక కర్మకాండల అమానుషత్వానికి తీవ్రంగా చలించిన నవనీతం ఆయన హృదయం. దళితులంటే ఒకప్పుడు రాజ్యాలేలిన వారనీ, దళితులంటే ఈ భారతభూమి పుత్రులనీ, వారి హక్కుల్ని,వారి జీవనావకాశాలనూ కొల్లగొట్టిన ఆర్యమూకలు కనీసం వారికి మనిషి హోదాను కూడా ఇవ్వడానికి నిరాకరించాయనీ చెప్పి ఆయన క్రింద కులాల వారి హక్కుల కోసం, ముఖ్యంగా స్త్రీల విముక్తి కోసం నిరంతరమైన ప్రతిఘటనోద్యమాలను నడిపాడు. ఆయన జీవితమే ఒక సామాజిక సాహిత్యోద్యమం. సత్యశోధక్ సమాజ్‌ను స్థాపించి కరుడు గట్టిన అమానుష విలువలకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించి, మరణించే వరకూ ఆయన యుద్ధాన్ని కొనసాగించాడు. స్త్రీలకూ, అస్పృశ్యులకూ విద్య నిషిద్ధమైన చోట వారికోసం మొట్టమొదటి సారిగా పాఠశాల తెరచి విద్యలేని తన భార్యను ఉపాధ్యాయినిగా తీర్చిదిద్ది విద్యా ఉద్యమాన్ని నడిపి సంఘ బహిష్కృతుడయ్యాడు. అంటరాని వారికోసం తన

యింటి ముందు మంచినీళ్ళ బావి తవ్వించి అందరికీ అందుబాటులో ఉంచాడు.

కిందికులాలను హీనంగా చూసిన మనుస్మృతిని అవహేళన చేస్తూ సవాల్ చేస్తూ ఎన్నో కవితలు రాశాడు. కింది కులాల వారి దైన్యాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తూ రచనలు చేశాడు. సరికొత్త భావజాల పునాదిని నిర్మించడం కోసం ప్రాచీన పురాణగాథలకు సరికొత్త కుల నిర్మూలనా వ్యాఖ్యానాలు రచించి, ప్రత్యామ్నాయ సాహిత్యాన్ని సృజించాడు. తాను రాసిన 'గులాంగిరీ' అనే గ్రంథంలో "కుల వ్యవస్థ నుండే అస్పృశ్యత పుట్టింది. ఈనాటి సమాజంలోని మహర్‌లూ మాంగ్‌ల పూర్వీకులు బ్రాహ్మణ దురాక్రమణదారులపై అత్యంత తీవ్రమైన పోరాటాన్ని సాగించారు. ఈ పోరాట ఫలితంగా బ్రాహ్మణ పాలకులు వారిని సమాజం నుండి వెలివేసి అస్పృశ్యత అనే ప్రత్యేక శిక్షకు గురిచేశారు. సమాజం నుండి వెలివేయడం వలన ఏర్పడిన దారిద్ర్యంతో వారు మృత కళేబరాలను తినే దుస్థితికి వచ్చారు. దీనికి బ్రాహ్మణేతర కులాల వారు కూడా ఖచ్చితంగా బ్రాహ్మణులు కోరుకున్నట్లే ప్రతిస్పందించారు"అని పేర్కొన్నారు. మహాత్మా జ్యోతిబా ఫూలే ఉద్యమం నుండీ, రచనలనుండీ తాను ఎంతో ఉత్తేజితుడనైనానని డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ పేర్కొన్నారు. తనకు బుద్ధుడు, కబీర్, జ్యోతిబా ఫూలేలు ముగ్గురూ గురువులని ఆయన ప్రకటించాడు. మహాత్మా 'జ్యోతిబా ఫూలే' గురించి "ఆధునిక భారత సమాజంలో మహాత్మాఫూలే అందరికంటే గొప్పశూద్రుడు, హిందూ సమాజంలో అగ్రకులాల వారి బానిసలుగా బతుకుతున్న కింది కులాల వారిలో తమ బానిసత్వం పట్ల చైతన్యాన్ని ఆయన రగిలించారు, విదేశీ పాలకుల నుండి విముక్తిని సంపాదించడం కంటే సాంఘిక ప్రజాస్వామ్యాన్ని సాధించడం భారతదేశానికి ముఖ్యమనే మహత్తరమైన సందేశాన్ని ఆయన ఇచ్చారు" అని డాక్టర్ అంబేద్కర్ పేర్కొన్నారు. అణగారిన కులాలన్నీ హిందూ అగ్రకులాధిపత్యానికి వ్యతిరేకంగా ఉద్యమించేందుకు సంఘటిత పర్చిన కవి – సామాజిక విప్లవ కారుడు మహాత్మా ఫూలే.

ఈ నేపథ్యంలో మనం దళిత సాహిత్యాన్ని గురించి పరిశీలన చేయాలి. దళిత సాహిత్య పుట్టుక గురించి అనేక అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. దళిత సాహిత్యం క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దంలో బుద్ధుడితో ప్రారంభమైందనీ, క్రీస్తుశకం పద్నాల్గవ శతాబ్దంలో చోఖమేళుడితో ప్రారంభమైందనీ, మహాత్మా జ్యోతిరావు ఫూలే (1827–1890) తో ఆరంభమైందనీ, ప్రొఫెసర్ ఎస్.ఎం. మాతే (1886–1957) తో మొదలైందనీ చాలామంది అభిప్రాయపడుతున్నారు. పైన చెప్పిన ప్రముఖులందరూ అస్పృశ్యతా సమస్యపైనా, దళితుల జీవితాల పట్లా ఎంతో తీవ్రంగా స్పందించినవారే. అయితే దళితుల ఆత్మగౌరవం కోసం, సామాజిక ఆర్థిక సాంస్కృతిక విముక్తికోసం పోరాడే శాస్త్రీయమైన దళిత చైతన్యాన్ని రగిల్చి దళిత సాహిత్యానికి ఒక వెలుగు భూమికను అమర్చి ఒక సమగ్రమైన తాత్త్విక దృక్పథాన్నిచ్చిన వాడు డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్. దళిత ఉద్యమానికీ, దళిత సాంస్కృతిక సాహిత్యోద్యమానికీ, దళిత

తాత్విక వికాసానికి స్ఫూర్తి అంబేద్కర్ అంటున్నామంటే వెనుకటి వారి కృషిని తక్కువ చేయడం కాదు. గతంలోని ప్రగతిశీలమైన అంశాలన్నింటినీ స్వీకరించి ఒక పోరాట చైతన్యాన్ని అందించినవాడు అంబేద్కర్. గతానికీ వర్తమానానికీ మధ్య శాస్త్రీయపరమైన వారధిగా నిలిచి స్పష్టమైన పథ నిర్దేశన చేసినవాడు అంబేద్కర్. పత్రికా రచయితగా, సాహితీ వేత్తగా, ఉద్యమకారునిగా గతంలో జరిగిన బ్రాహ్మణ వ్యతిరేక కుల నిర్మూలనా పోరాటాల సారాంశాన్నంతటినీ స్వీకరించి ఒక శాస్త్రీయమైన వ్యాఖ్యానంతో మార్పు కోరే దళిత తత్వాన్ని ఆవిష్కరించినవాడు అంబేద్కర్. ఆ తత్వం వెలుగులో భారత దేశమంతటా ఎన్నో సామాజిక, సాహిత్యోద్యమాలు పుట్టాయి.

1958లో మహారాష్ట్రలో జరిగిన 'దళిత సాహితీ మహాసభ' లో దళిత సాహిత్యాన్ని నిర్వచించేందుకు విస్తృతమైన చర్చ జరిగింది. అసలు దళితులంటే ఎవరు? దళితులు సృష్టించేదే దళిత సాహిత్యమా? లేక దళితేతరులు దళితుల పట్ల సానుభూతితో రాసింది కూడా దళిత సాహిత్యమేనా? అన్న అంశాలపై చర్చ జరిగింది.

కులం తాలూకు అన్ని ప్రత్యేకతల్ని చర్చించి, కుల నిర్మూలనా ధ్యేయంతో దళితులు ఎదుర్కొంటున్న అన్ని అణచివేతలకూ, వివక్షలకూ వ్యతిరేకంగా, ఒక ప్రత్యామ్నాయ ప్రజాస్వామిక మానవ సంబంధాల నిర్మాణాన్ని కోరుకొని రచించింది దళిత సాహిత్యం. దళిత అనే సంస్కృత శబ్దానికి ఛేదించబడిన, ఖండించబడిన, అణచివేయబడిన, అణగారిన అని అర్థం. హిందూ అగ్రకుల సమాజం అణచివేసిన స్త్రీలు, ఎస్సీ,ఎస్టీ,బీసీ, మైనారిటీలు అంతా దళితులు. ఆ దళితుల సమగ్ర అభివృద్ధి కోసం, విముక్తి కోసం వచ్చిన సాహిత్యం దళిత సాహిత్యం. దళితేతరులు సృష్టించిన దళితసాహిత్యం ఉదారవాద సానుభూతి సాహిత్యంగానే వున్నది. దళితులు సృష్టించుకుంటున్న సాహిత్యం ఆత్మాభిమాన దళిత సాహిత్యం. దళిత రచయిత, తత్త్వవేత్త బి.ఎస్.రాములు గారన్నట్లు దళితులు సృష్టించుకుంటున్న దళితసాహిత్యం పురుటి నొప్పులు పడే తల్లే తన బాధలు చెప్పుకొన్నట్లుగా వుంటే, దళితేతరులు సృష్టించిన దళితసాహిత్యం భార్య పురుటి నొప్పులు పడుతుంటే బయట వుండి బాధను అనుభవించే భర్త పరిస్థితి వంటిది. భార్య పురిటి నొప్పుల పట్ల అల్లాడిపోయే భర్త ఆవేదనను శంకించాల్సిన అవసరంలేదు. అలాగే దళిత సమస్యపట్ల రచనలు చేసిన దళితేతరుల నిజాయితీని, నిబద్ధతను శంకించాల్సిన అవసరంలేదు. చరిత్రను పాజిటివ్‌గా స్వీకరించడం అలవాటు చేసుకోవాలి. అదే సమయంలో దళితేతరులకుండే పరిమితులను అర్థం చేసుకుని వారి నుండి ఎక్కువ ఆశించకుండా వుండాలి.

దళితుల సమస్యను మొట్టమొదటగా చిత్రించిన భారతీయ నవల ముల్క్‌రాజ్ ఆనంద్ రచించిన "అన్‌టచ్‌బుల్". మున్షీ ప్రేమ్‌చంద్, రవీంద్రనాథ్ ఠాగోర్‌లు తమ అనేక రచనల్లో అస్పృశ్యతను నిరసించారు. మహారాష్ట్రలో డెబ్భైల దశకంలో ఉవ్వెత్తున లేచి మొత్తం సమాజాన్ని

ఒక కుదుపు కుదిపిన దళిత్ పాంథర్స్ ఉద్యమం దళిత సాంస్కృతికోద్యమానికి ఒక అవగాహనను అందించింది. దళిత్ పాంథర్స్ ఉద్యమ నాయకులందరూ రచయితలు కావడం ఒక చారిత్రక విశేషం. బ్రాహ్మణ విలువలు కరుడుగట్టుకుపోయిన పత్రికా ప్రపంచానికి దళిత ఉద్యమాన్ని గుర్తించి నిరాకరించడం అసాధ్యమైపోయింది. దళిత్ పాంథర్స్ ఉద్యమం తమకు అంబేద్కర్ ప్రారంభించిన ఉద్యమాన్ని స్ఫూర్తిగా ప్రకటించుకుంది. పేరును కూడా బ్లాక్ పాంథర్స్ నుండే వారు తీసుకున్నారు. అమెరికన్ నీగ్రో రచయితలైన పాల్ లారెన్స్ డన్‌బార్, చార్లెస్ చెస్ట్‌నట్, జేమ్స్ వెల్‌డన్ నల్లజాతి హృదయాన్ని ప్రతిబింబిస్తూ రచనలు చేశారు. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత రంగంలో కొచ్చిన లాంగ్‌స్టన్ హగ్స్ తన కవితలతో, నవలలతో అమెరికా తెల్ల సమాజాన్ని కలవరపెట్టాడు. తమ స్వంతదైన భాష, వ్యక్తీకరణను నల్లజాతి సాహితోద్యమం ఆవిష్కరించింది. 1940లో రిచర్డ్‌రైట్ రాసిన "నేటివ్‌సన్" నవలలోని నల్లజాతి హీరో అమెరికా సంస్కృతిని అల్లాడిస్తాడు. రాల్ఫ్ ఎలిసన్ రాసిన "ఇన్‌విజిబుల్ మాన్" నవల మూడున్నర శతాబ్దాల నీగ్రో జీవితంపైన పరుచుకున్న విషాదాన్ని అద్భుతంగా చిత్రించింది. జేమ్స్ బాల్డ్విన్ తన శక్తివంతమైన కలంతో నీగ్రోజీవితాల్లో చెలరేగుతున్న ఆగ్రహజ్వాలల్ని చిత్రిస్తూ "గో, టెల్ ఇట్, ఆన్ ద మౌంటెన్", "ఎనదర్ కంట్రీ" తదితర నవలలు రాశాడు. నీగ్రో మహిళా రచయిత లోరెన్ హాన్స్‌బరీ "ఎరైజింగ్ ఇన్ ద సన్"అనే నాటకం ద్వారా ఎంతో పేరు ప్రఖ్యాతుల్ని సంపాదించింది. మరో నీగ్రో మహిళా కవి గ్వెండోల్వన్ బ్రూక్స్ ప్రతిష్టాత్మకమైన పులిట్జర్ బహుమతి పొందింది. విలియండెంబీ, బాన్ విలియమ్స్, మొల్విన్ కెల్లీ, లిరోయి జోన్స్ తదితరులు నల్లజాతి జీవనాన్ని రచనల్లో అద్దం పట్టారు. ఇక ఓనీల్ రచనల సంగతి చెప్పనక్కరలేదు. బ్లాక్ పాంథర్స్ ఉద్యమం, బ్లాక్ పాంథర్స్ సాహిత్యోద్యమంతో మహారాష్ట్రలోని దళిత్ పాంథర్స్ ఉద్యమం ఎంతో స్ఫూర్తిని పొందింది. రెండు ఉద్యమాల్లోనూ ఉన్న సాధారణాంశాలు.

1) నల్లజాతి రచయితలూ, దళిత రచయితలూ సాహిత్యంలో తమ అస్తిత్వాన్ని అన్వేషించుకున్నారు.

2) రెండు ఉద్యమాల సాహిత్యమూ, అసమానత పునాదిగా గల సామాజిక జీవితం నేపథ్యం నుండే పుట్టింది.

3) రెండు ఉద్యమాల సాహిత్యానికీ భూమిక జీవితమే.

4) ఇద్దరి సాహిత్య భాషా సాంస్కృతిక ధిక్కారమే.

5) రెండు సాహిత్యోద్యమాల లక్ష్యమూ కొత్త సాంస్కృతిక విలువలను ప్రతిపాదించడమే.

అంబేద్కర్ బోధనల నుండీ, బ్లాక్ పాంథర్స్ ఉద్యమం నుండీ ప్రేరణ పొందిన దళిత పాంథర్స్ సాహిత్యోద్యమం సమకాలీన సమాజంలో ఉండే మానవేతర అంశాలతో రాజీ

లేకుండా తగాదాపడింది. ఎవరికీ తీసిపోని సాహితీ విలువలతో వారు సాహిత్యాన్ని సృజించారు. అగ్రకుల భూస్వామ్య సంస్కృతి మీదా, గుత్త సంస్థలుగా వేళ్ళూనుకుపోయిన పత్రికా ప్రపంచం మీదా వాళ్ళు మహోజ్వలమైన పోరాటాన్ని సాగించి ఎన్నో విజయాలను సాధించారు. దళిత పాంథర్స్ ఉద్యమం మామూలు మనుషులైన వందలమందిని సాహితీవేత్తలుగా, రచయితలుగా, కళాకారులుగా మలచింది. అర్జున్ డాంగ్లే, నామ్‌దేవ్ థాసాల్, జె.వి.పవార్, అన్నాబాపుసాథె, శంకరరావు కారత్, బాబూరావు బాగుల్, దయాపవార్, త్రయంబక్ సస్కాల్, అవినాష్ తదితరులు దళిత సాహితీవేత్తలుగా ముందుకొచ్చారు. దళితులుగా బ్రతికిన వాళ్ళుగా తమ అనుభవాలనూ, అనుభూతులనూ శక్తివంతంగా వివిధ సాహితీ ప్రక్రియల్లో వారు వ్యక్తీకరించారు. దళిత పాంథర్స్ రచయితల భాషలో, వ్యక్తీకరణల్లో, ప్రతీకల్లో దళిత జీవన తత్త్వం ప్రస్ఫుటంగా ప్రతిఫలించింది. దళితుల వేదన, దళితుల దర్శనం వారి రచనల్లో వ్యక్తమయ్యాయి. తరాలుగా అణచివేతకూ, అవమానాలకూ గురై మౌన రోదనలో వున్న దళిత ప్రపంచానికి మహారాష్ట్ర దళిత సాహిత్యోద్యమం తన గొంతునిచ్చింది.

* * *

ఎన్నెన్నో సాహితీ ధోరణులు వెల్లివిరిసిన తెలుగు సీమలో దళిత వాస్తవికత ఏ విధంగా ప్రతిస్పందించిందో, దళితుల పట్ల తెలుగు సమాజం ఏ విధంగా ప్రతిస్పందించిందో పరిశీలిస్తే తెలుగు గడ్డమీద కుటిల బ్రాహ్మణత్వం స్పష్టంగా కన్పిస్తుంది.

తెలుగులో నన్నయ్యను ఆదికవిగా చెప్తారు. అంటే అంతకుముందు పుట్టిన సాహిత్యం మొత్తాన్నీ, కవులనందరినీ ఒక్క కలంపోటుతో, ఒక తృణీకారపు చూపుతో తిరస్కరించడమన్నమాట. ప్రతిభావంతులే సాహిత్యాన్ని సృష్టిస్తారనీ, ఆ ప్రతిభావంతులు అనివార్యంగా బ్రాహ్మణులు, బ్రాహ్మనిష్టులు అవుతారని ప్రకటించడమన్నమాట. అమెరికాలోని స్థానికులైన రెడ్ ఇండియన్లను, వారి జీవన సంస్కృతిని తెల్లవారు చిన్నా భిన్నం చేసి పరమ దుర్మార్గంగా కబళించినట్లే, భారతదేశంలో, తెలుగుసీమలో బ్రాహ్మణ సంస్కృతీ, సంస్కృత భాషా, ఇక్కడి ఆదివాసుల సంస్కృతినీ భాషనూ, జీవన విధానాన్ని నాశనం చేసింది. తగులబెట్టింది. తద్వారా ఎంతో అమూల్యమైన సాహిత్యాన్ని మనకు అందకుండా చేసింది. నాశనం చేసిందాన్ని చేసి, చేయడం సాధ్యంకాని సాహిత్యాంశాల పైన బ్రాహ్మణ ముద్రను వేసి రక్తసిక్తం చేసింది. ఆ శిథిలాలమీద నిలబడి నేను "ఆదికవి"ని అని నన్నయ్య ప్రకటించుకున్నాడు."గాసట బీసటే చదివి గాథలు త్రవ్వు తెలుగువారికిన్ వ్యాసముని ప్రతీతమైన భారతాన్ని" వినిపిస్తానన్నాడు నన్నయ్య. తెలుగు మూలవాసుల, ప్రజల సాహిత్యాన్ని అవహేళన చేస్తూ గొప్పలు చెప్పుకున్న ఈ 'ఆదికవి' చేసిందంతా భారతాన్ని తెలుగులోకి అనువాదం చేయడమే.

దళితుల్నీ, ఆనాటి దళిత మతమైన బౌద్ధాన్ని అవహేళన చేయడానికి సాహిత్యాన్ని అగ్రవర్ణాల వారు వాడుకున్నారని డాక్టర్ అంబేద్కర్ "అస్పృశ్యులెవరు" అనే గ్రంథంలోచెప్తూ మృచ్ఛకటికంలో బౌద్ధసన్యాసిని హేళన చేయడం ఉదాహరణగా చూపుతారు. అదేవిధంగా వర్ణధర్మాన్ని రక్షించుకోవడానికి కింది వర్ణాలవారిని అణచివేయడానికి పుట్టిన సాహిత్యానికి కూడా తెలుగులో ఏ కొదవా లేదు. అయితే ఎన్నో విముక్తి ఉద్యమాలూ, విప్లవోద్యమాలూ, సాహిత్యోద్యమాలూ నడిచిన తెలుగునేలలో దళిత సాహిత్యాన్ని వెతుక్కోవలసిన దుస్థితే వుంది. ప్రజల విముక్తిని వాగ్దానం చేసిన ప్రతి ఉద్యమమూ కొద్దిపాటి మినహాయింపులతో దళిత జీవితానికి దూరంగానే ఉండిపోయింది. దళిత సాహిత్యాన్ని సాహితీ సముద్రంలో గాలించి పట్టుకోవలసిన దౌర్భాగ్య పరిస్థితే వుంది. ఈ దౌర్భాగ్యమైన పరిస్థితి పట్ల ప్రతి సామాజిక సాహిత్యోద్యమమూ ఆత్మ విమర్శ చేసుకోవలసి వుంది. అయితే ఆయా ఉద్యమాల్లో భాగంగానూ, ఉద్యమాల బయటా దళితుల సమస్యపట్ల సానుభూతితోను, దళితుల దుర్భరమైన పరిస్థితులకు నిరసనగానూ సాహిత్యం వచ్చింది. మన దేశంలో జాతీయోద్యమం తీవ్రంగా సాగుతున్న దశలో జాతి జీవన విధానాన్ని మార్చాలనీ, దళితులను ఉద్ధరించాలనే భావనతో కొన్ని నవలలు వచ్చాయి.

అస్పృశ్యత సమస్యను ప్రధానంగా తీసుకుని రాసిన మొదటి తెలుగు నవల "హేలావతి", దీనిని శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణగారు 1913లో రచించారు. అప్పటికి గాంధీ తన "హరిజనోద్ధరణ" ఉద్యమం మొదలు పెట్టలేదు. అంబేద్కర్ వర్ణవ్యవస్థ పైన తిరుగులేని పోరాటాన్ని ప్రకటించడంతో గాంధీకి 'అస్పృశ్యత' తదితర దళిత సమస్యలపై కార్యక్రమాన్ని ప్రకటించక తప్పలేదు. ఆ తర్వాత ఆ ప్రభావంతో తెలుగులో చాలా నవలలొచ్చాయి. శ్రీ తల్లాప్రగడ వారు రచించిన 'హేలావతి' నవలలో హిందూ సమాజం దళితులను గురించి తమ మనసును మార్చుకోకపోతే వారు ఇంకెంత మాత్రమూ హిందువులుగా కొనసాగరని హితబోధ చేస్తూ దళితుల జీవితాన్ని ఎంతో హృద్యంగా చిత్రించారు. హేలావతి అంటరాని వాడైన వీరబలుడి కూతురు. ఒక్కొక్కసారి అన్నంలేక, వండుకోవటానికి చేరెడు గింజలు లేక పేడలోని గింజలను ఏరి, కడుక్కుని వండుకునితినే దుర్భరమైన జీవితం వాళ్ళది. హేలావతి ఆ పరిస్థితిని తీవ్రంగా ద్వేషిస్తుంది. మరో అంటరానివాడైన గౌతముడు ఆమెను ప్రేమిస్తాడు. ఆ విషయాన్ని ఆమెతో చెపితే హేలావతి గౌతముడి ప్రేమను తిరస్కరిస్తుంది. అంటరానివాణ్ణే చేసుకుని అంటరాని బతుకు బతకలేను, పైకులాల వాళ్ళనెవరినైనా చేసుకుంటానని చెబుతుంది. గౌతముడికి హేలావతి తన ప్రేమను తిరస్కరించిందన్న బాధకన్నా హేలావతి కోరికపట్ల ఆశ్చర్యమే కలుగుతుంది.

భారతదేశ చక్రవర్తి హుమయూన్ ప్రాణపాయస్థితిలో ఉన్నప్పుడు హేలావతి తండ్రి వీరబలుడు కాపాడతాడు. ఆ కృతజ్ఞతతో చక్రవర్తి ఇచ్చిన డబ్బుతో వీరబలుడు

ధనవంతుడౌతాడు. దానితో వాళ్ళ బ్రతుకులే మారిపోతాయి. అయితే హేలావతి పెళ్ళి పెద్ద సమస్య అవుతుంది. చివరకి ఆమెను మొగలాయీ వంశస్థుడైన మంత్రి కుమారుడు పెళ్ళి చేసుకుంటాడు. వీరబలుడు మతం మార్చుకుని చాన్ మహ్మద్‌గా మారిపోతాడు. కథ సుఖాంతం అవుతుంది. కథాగమనంలో ఎన్ని నాటకీయమైన మలుపులున్నప్పటికీ కథాచిత్రణ కళ్ళను చెమరింపజేస్తుంది. 1919లో వెంకటపార్వతీశం కవులు రాసిన 'మాతృమందిరం' నవల వచ్చింది. 1922లో ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన "మాలపల్లి" వచ్చింది. మాలపల్లి నవలకు రంగస్థలం మంగళాపురం అనే గ్రామం. కథానాయకుడు మాలదాసరి రామదాసు. రామదాసు చెల్లెలు లక్ష్మి చేను గట్టుమీద నడిచినందుకే బసివిరెడ్డి ఆమెను కొడతాడు. వైద్యం చేయించినా ఆమె బ్రతకదు. ఆమె చనిపోతూ చనిపోతూ 'అమ్మా దేవుడి దగ్గరకు వెళుతున్నావమ్మా' అని జ్యోతితో చెప్తుంది. "దేవుడి దగ్గరకు నిన్ను రానిస్తారా? ఇక్కడ గుడిలోకి రానివ్వరుగా' అని అంత విషాదంలోనూ జ్యోతి ఆశ్చర్యపోతుంటే గుండెలు పిండేసినట్లవుతుంది. ఆవిధంగా ప్రారంభమైన నవల ఎన్నెన్నో మలుపులు తిరుగుతుంది. మంగళాపురం జీవితం ఎంతో ఘర్షణకు గురువుతుంది. అయినా రామదాసు స్థిరంగా తను నమ్మిన ఆశయంకోసం నిలబడతాడు. ఒక పక్క ఇటు భూస్వాములకు వ్యతిరేకంగా ఎంత గట్టిగా నిలబడతాడో, ఎన్ని ఆశలు చూపినా మతాంతరీకరణకు వ్యతిరేకంగా కూడా అంతే గట్టిగా నిలబడతాడు. రామదాసు పాత్రద్వారా గాంధీ బోధనలను దళితులకు చెప్పే ప్రయత్నం చేస్తారు, ఉన్నవ. దళితుల జీవితాలకు సంబంధించిన గాంధీకి ఎంత రిలవెన్స్ ఉందో, మాలపల్లి నవలకీ అంతే వుంది. గాంధీ ఆలోచనను దాటిరాలేదు మాలపల్లి. ఇవాళ పెరిగిన దళిత చైతన్యంతో మరో మాలపల్లి నవల రావాల్సి వుంది.

1936లో ఆచార్య ఎన్.జి.రంగా రాసిన "హరిజన నాయకుడు", అడవిబాపిరాజు రాసిన "నరుడు", అంతటి నరసింహం రాసిన ఆదర్శం (1946), ఇల్లందుల రంగనాయకులు రాసిన 'మల్లిక' (1950), వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి' (1952) నవలలు వచ్చాయి. 1962లో ముప్పాళ్ళ రంగనాయకమ్మ గారు వ్రాసిన 'బలిపీఠం' నవలలో కులాంతర వివాహాల వలన వివిధ సాంస్కృతిక నేపథ్యాల నుండి వచ్చిన రెండు వ్యక్తిత్వాలు ఎంత నలిగిపోతాయో ఎంతో శక్తివంతంగా చిత్రికరించారు. అరుణ అనే బ్రాహ్మణ విధవ భాస్కర్ అనే దళితుడ్ని పెళ్ళి చేసుకుని తన బ్రాహ్మణత్వాన్ని వదులుకోలేక పోవడం వలన సంబంధం ఎలా విచ్ఛిన్నమవుతుందో రాశారు. కులాంతర వివాహాలన్నీ ఇలానే కానక్కరలేదనే ఆశావహమైన దృష్టినివ్వడం కోసం అమల, జేమ్సుల వివాహం విజయవంతం కావడం చిత్రించారు.

మహీధర రాసిన 'కొల్లాయి గట్టితేనేమి?' (1965), వాచస్పతి రాసిన 'అంతస్తులు – అంతః కరణలు' (1965), దాశరధి రంగాచార్య రాసిన 'చిల్లర దేవుళ్ళు' (1970), డాక్టర్

కేశవరెడ్డి 'బానిసలు' (1971), 'ఇన్ క్రెడిబుల్ గాడెస్, స్మశానం దున్నేరు (1974) నవలలు, ఇల్లెందుల సరస్వతీ దేవి 'నీబాంచన్ కాల్మొక్తా' (1976), నండూరి సుబ్బారావుగారి 'విరిగిన కెరటాలు'(1977) నవలలు అస్పృశ్యతా సమస్యను చిత్రించాయి. 1978లో తెన్నేటి హేమలత గారి 'మిసెస్ కోకిల' నవల వచ్చింది. కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యురాలిగా ఆమె అందరికీ తెలిసినవారే. రంగనాయకమ్మగారు కులాంతర వివాహాలకు సంబంధించి ఎంతో సానుభూతితోను, వస్తుగతంగానూ చర్చిస్తే లతగారు అవహేళన చేయడానికి మిసెస్ కోకిల రాశారు. యర్రంశెట్టి సాయి 'చివరి మజిలీ', కేతు విశ్వనాథరెడ్డి 'వేర్లు' (1978), వాణి రాసిన 'మోహనరాగం' (1979), కె. రామలక్ష్మి రాసిన 'కోటిగాడు' (1980), దశరథ్ రాసిన 'చీకటి బెదిరింది', జె.రామలక్ష్మి రాసిన 'తపోభంగం', అక్కినేని కుటుంబరావు 'సొరాజ్జెం' (1984), ఎన్.ఆర్. నంది 'నైమిశారణ్యం' (1984), భూపతి రామారావు 'కులకన్య', దడాల చంటబ్బాయి 'అంతులేని అమావాస్య' (1984) నవలలొచ్చాయి. ఎన్ని పరిమితున్నా దళితేతరులు రచించిన ఈ నవలల్లో చిత్రితమైనది దళిత జీవితమే. ఏదోమేరకు దళిత బతుకుల్లో మార్పును ఆకాంక్షించే ఆయా రచయితలు రచనలు చేశారు. అయితే 1946లో విశ్వనాథ సత్యనారాయణగారు కూడా దళితుల బతుకు కథాంశంగా 'వీరవల్లుడు' అనే నవల రాశాడు. అది '46లో రాసినప్పటికీ కథాకాలం మాత్రం 19వ శతాబ్దానిది. విశ్వనాథవారి కలం "నన్నెరుగరో" అన్న ఆయన మాటలాగానే ఎంతో శక్తివంతమైనది. ఎంతో 'ప్రతిభా'వంతంగా ఆయన రచనలల్లగలరు. అయితే దళితులు దళితులుగానే బతకడమే ధర్మమన్నది ఆయన అంతరంగం త్రికరణ శుద్ధిగా నమ్మిన ధర్మం. ఏ దాపరికాలూ లేకుండా, నిజాయితీగా తన అగ్రవర్ణ ధర్మతత్వాన్ని ఆయన రచనల్లో చాటిచెప్పాడు. వీరవల్లుడి నవలలో సేవాభావంతో యజమాని కుటుంబాన్ని ఆదుకున్న దళితుడి కథ చిత్రితమైంది. ఈ కథ మొత్తంలోనూ తన తాతముత్తాతలు తనకు మిగిల్చిపోయిన బానిసత్వాన్ని కాపాడుకునేందుకు వీరవల్లుడు పడే తపన వుంటుంది. సమాజం ముందుకు నడవడానికి పోరాడుతూవుంటే, కొద్దో గొప్పో సానుభూతి వున్న రచయితలు ఆ వాస్తవాన్ని ప్రతిఫలించడానికీ, పైకి రావడానికి చేరుకుంటున్న అణగారిన పక్షాల తరఫున నిలిచేందుకు ప్రయత్నిస్తుంటే విశ్వనాథ వారు సమాజాన్ని మళ్ళీ మధ్య యుగాల్లోకి మళ్ళించడానికి తన శాయశక్తులా కృషిచేశారు. అయితే శత్రువైనా ఒక మెచ్చుకోతగ్గ విషయమేమిటంటే ఆయన ఎప్పుడూ తన అంతరంగాన్ని దాచుకోలేదు. నమ్మినదాన్ని ఏ కాపట్యమూ లేకుండా నిష్కర్షగా రాశారు. ఇక్కడ యుద్ధానికి లక్ష్యం స్పష్టమే. లోపల ఒకటీ బయట ఒకటీ మాట్లాడే వారికన్నా ఆయన లక్షల రెట్లు నయం. దళితసాహిత్యం ఒక చారిత్రక అవసరంగా రంగం మీదికి వచ్చి బలం పుంజుకునే కొద్దీ వందలమంది విశ్వనాథ సత్యనారాయణలు, ఆయన మానసపుత్రులూ అన్ని వేషాలనూ చీల్చుకుని ముఖాలను బయటేసుకుంటున్నారు. రకరకాల పద్ధతుల్లో, మాటలు, వాదనలు

ముసుగులు ధరించి దళితసాహితీ చైతన్యానికి విశ్వనాథ వాదాన్ని పోటీ పెడుతున్నారు.

ఒక ప్రక్క విశ్వనాథ సమాజాన్ని మధ్యయుగాల్లోకి తీసుకువెళ్ళే ప్రయత్నం సాహిత్యంలో తీవ్రంగా చేస్తుంటే, కృష్ణశాస్త్రి లాంటి వాళ్ళు "దిగిరాను దిగిరాను దివి నుండి భువికి" అంటూ తెలియని ఊహాల్లోకాల్లో ఎగిరిపోతూనే, "ఎవ్వరని ఎంతురో నన్ను ఏననంత శోకభీకర తిమిర లోకైక పతిని' అంటూ ఊహాప్రేయసి ఊహావియోగపు 'విషాదాశృ తుషారాల నిషా'లో మునిగిపోతూనే ఉంటే జాషువా దళితుల బాధల గాథల్ని 'సల సల కాగి చిందిన కన్నీటి బిందువులుగా' కరుణ, కసి కలగలిసి అగ్ని దుఃఖంతో అక్షరాలు అక్షరాలుగా, అక్షరాలు ఆయుధాలుగా నాల్గు పడగల హైందవ నాగరాజుపైన విరుచుకుపడ్డాడు. దళితుడుగా పుట్టి, దారుణమైన అస్పృశ్యతను అనుభవిస్తూ అంటరానితనం పైన కసితో సమత కోసం, మమత కోసం, నవసమాజ నిర్మాణం కోసం కలంపట్టి దళితులపైనా, స్త్రీలపైనా జరుగుతున్న అన్యాయాలకూ, అక్రమాలకూ వ్యతిరేకంగా పోరాడిన కలం యోధుడు జాషువా. తన జీవితంలో అనుభవించిన అవమానాల్నీ, ఎదుర్కొన్న సన్నివేశాల్నీ ఆయన కావ్యాల్లో చిత్రించాడు.

"కలడంబేద్కరు నా సహోదరుడు మాకై యష్ట కష్టాల కుం బలియై సీమకు పోయి, క్రమ్మరిన విద్వాంసుడు ..." అంటూ అంబేద్కర్ పోరాట స్ఫూర్తిని జాషువా అక్షర బద్ధం చేశాడు. జాషువా గాంధీజీ నుండి స్ఫూర్తి పొందారని చెప్తారు. అయితే ఆయన జీవితంలోని దళితవాస్తవికతకూ, దళిత సమస్యపట్ల గాంధీజి ఆలోచనకూ మధ్య కల వైరుధ్యం, ఘర్షణ జాషువా రచనల్లోనే మనకు స్పష్టంగా కన్పిస్తుంది. కవిత్వంలో పరాకాష్టకు చేరిన పరిపక్వతనూ,స్పష్టమైన దృక్పథాన్ని చూపించిన జాషువాను తెలుగు సాహిత్యం అస్పృశ్యతకే గురిచేసింది. అగ్రకుల హిందూ మతప్రవక్త విశ్వనాథను ఎదుర్కొన్న కవి జాషువాను గుర్తించడానికి నిరాకరించిన తెలుగు సాహితోద్యమాలు సిగ్గుతో తలలు దించుకోవాలి. సాంప్రదాయవాదులు ఆయన్ని గుర్తించకపోవడం, అవమానించడాన్ని అర్థంచేసుకోవచ్చు. అభ్యుదయ వాదులుగా, విప్లవ కారులుగా చెప్పుకుంటున్న వారు కూడా ఆయన్ని గుర్తించక నిరాకరించి కోట్ల జీవితాల ఆవేదనలకు సంఘర్షణలకు గొంతుకనిచ్చిన జాషువాను అవమానపర్చారు. ఇది చరిత్ర కాదనలేని సత్యం. వైతాళికుల్లో ఎవర్ని బడితే వాళ్ళను చేర్చిన ముద్దుక్రిష్ణ నవయుగ సాహితీ వైతాళికుడు జాషువాను ముట్టుకోవడానికే భయపడ్డాడు. తనను సమకాలీకుల వింత నిరాదరణకూ, అవమానాలకూ గురిచేసినా, జాషువా అస్తిత్వ వేదనతో కుమిలి పోలేదు. తన కర్తవ్యాన్ని తానే నిర్దేశించుకుని.

**"గవ్వకు సాటిరాని పలు గాకులు మూకలసూయచేత న**
**న్నెవ్విధి దూరినన్ ననువరించిన శారద లేచిపోవునే?**

**యివ్వసుధా స్థలిన్ పొడమరే రసలబ్ధులు, గంటమూనెదన్**
**రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరిచెద నాంధ్రవాణికిన్"**

అని తన దళిత ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించుకున్నాడు. దళితుల అస్పృశ్యల జీవితాన్ని వర్ణిస్తూ

**"ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి**
**ఇనుప గజ్జెల తల్లి జీవనము సేయు**
**కసిరి బుసగొట్టు నాతని గాలిసోక**
**నాల్గు పడగల హైందవ నాగరాజు" (గబ్బిలం)**

అంటూహైందవ విషసర్పం ఏ విధంగా దళిత జీవితాలను అణచి వేస్తుందో రాశారు.

**"ఆదరణ లేక దుస్సహ**
**వేదనలం గ్రుంగి మానవీయత కెడమై**
**యే దెసలేక తపించెదు**
**నైదవ వర్ణంబున కల్గునస్పృశ్యంబై"**

అంటూ ఆదరణలేని వేదనలతో గౌరవానికి దూరంగా పంచమ కులంగా జీవించడమే అస్పృశ్యత అని ఆయన రాశారు.

**"నేను చిందులాడి నేను డప్పులు కొట్టి**
**యలసి సొలసి సత్తికొలువు కొలువ**
**ఫలితమెల్ల నొరులు భాగించుకొని పోవు**
**నీచమైన భూమి చూచినావె?"**

అంటూ విషాద వాస్తవాన్ని ఆయన ప్రశ్నించాడు. స్త్రీలు తమ హక్కుల కోసం పోరాడాలనీ, స్త్రీలు అబలలుకాదు సబలలేనని నిరూపించుకొనేందుకు పోరాటం చెయ్యాలనీ ఆయన ప్రబోధించాడు. స్త్రీ శక్తులను అబల అనే పేరుతో అణచివేశారని ఆయన రాశారు.

**"అబల యన్న బిరుదమంటించి కాంతల**
**స్వీయ శక్తులదిమి చిదిమినారు**
**సబలయన్న బిరుదు సాధించి హక్కులు**
**గడన చెసికొమ్మ కష్ట చరిత"**

తెలుగు సాహితీ వేదిక మీద జాషువా స్థానం ఒకరు గుర్తిస్తే వచ్చేది, గుర్తించకపోతే పోయేది కాదు. ఆయన ముద్రను తెలుగునేల మీది నుండి చెరిపేయడం ఎవరికీ సాధ్యంకాని విషయం. దళితుల బతుకుల్లో, పోరాటాల్లో జాషువా ఒక పోరాట స్ఫూర్తిగా, ఒక చైతన్యాయుధంగా చిరస్థాయిగా నిలిచివుంటారు.

గురజాడ 'మంచియన్నది మాలయైతే మాలనేనగుదున్' అని రాశారు. అస్పృశ్యత పట్ల

నిజాయితీగానే ఆయన తన కలాన్ని కదిలించారు. ఈ మధ్య గురజాడ కన్యాశుల్కం శత సంవత్సర పండగలు చేస్తూ ఆధునిక సాహిత్యానికి గురజాడ యుగకవి అని చెప్పే ప్రయత్నం చేస్తున్నారు. బ్రాహ్మణ సమాజంలో సంస్కరణాభిలాషతో ఆయన రచనలు చేశాడనడం వరకూ ఎవరికీ ఏ పేచీ లేదు. ఆ మేరకు గురజాడ గౌరవనీయుడు. స్మరణీయుడు. మొత్తం తెలుగు సమాజానికే ఆయన ఆధినాయకుడు, 'కన్యాశుల్కం ఆధునిక సాహిత్యానికి ప్రణాళిక' దాన్ని ఒప్పుకోండి అని ఎస్సీ,ఎస్టీలకు ఏమీకాని కన్యాశుల్కాన్ని దళిత సాహిత్యానికి కూడా మార్గదర్శిగా, నాయకురాలిగా అంగీకరించమనటం శుద్ధ బ్రాహ్మణత్వమే. ఒక బ్రాహ్మణుడు అయి వుండి కూడా తమ బ్రాహ్మణ సమాజంలో కుళ్ళుని కడిగేసే రచనలు చేశాడు. తన కులంలోని కల్మషాన్నంతటినీ ఎత్తి చూపిస్తున్నాడంటే నిజమేననుకుంటాం. అలాకాకుండా మొత్తం ఆధునిక సాహిత్యానికే 'గురజాడది అడుగుజాడ' అన్నప్పుడు దళిత జనాంగం అద్దంలో తమ ముఖాలను చూసుకున్నట్లు తమ వ్యక్తిత్వాలను గురజాడ సాహిత్యంలో చూసుకోవాలనుకుంటారు. తమ ఆవేదనలకూ, సంఘర్షణలకూ సంబందించిన స్పష్టమైన ప్రతిఫలమేదీ కన్పించనప్పుడు ఆయనను తాము సృష్టించుకునే సాహిత్యానికి కూడా అధినాయకుడుగా అంగీకరించలేరు. అంగీకరించమని వత్తిడి చేసేవాళ్ళను అనుమానంగా కూడా చూస్తారు. నిజానికి తన పరిసర ప్రాంతాల్లోనే మహోజ్వలమైన గిరిజన పోరాటాలు సాగుతూ ఉండగా, ఆ ప్రసక్తేలేని కన్యాశుల్కం నాటకాన్నిగానీ, గురజాడ రచనలు కానీ ఎందుకు ఆమోదించాలి? ఎస్సీలకూ, ఎస్టీలకూ సంబంధించి గురజాడ అవసరంలేని రచయితే. కాదు గురజాడ అవసరం మీకుంది ఒప్పుకోండి అని బలవంతం చేసినప్పుడు ఆయన రాయని విషయాల చర్చ వస్తుంది. రాసినా ఇలా ఎందుకు రాశాడన్న ప్రశ్న వస్తుంది. 'మంచియన్నది మాలయైతే మాలనేనగుదున్' అన్నప్పుడు కూడా మొత్తం సాహితోద్యమాలకు ఆయన నాయకత్వాన్ని క్లెయిమ్ చేయనంతవరకూ ఆయన్ని ఆమోదించవచ్చు. ఆధునిక సాహితీ ప్రవక్త అని ఆయన పిలిచినప్పుడు మాత్రం గురజాడ 'మంచియన్నది మాలయైతే' అన్న క్లాజెందుకు పెట్టాడు అన్న అనుమానం వస్తుంది. మాలయన్నది మంచా? కాదా? మాలల్నీ, మాదిగల్నీ మంచి అని ఏ ధర్మశాస్త్రమూ చెప్పలేదు. ఎవరైనా మాలా, మాదిగా కాదలుచుకుంటే అది కూడా మంచనీ, కాబట్టి తాను మాలామాదిగా కాదల్చుకున్నాననీ ప్రకటించాలి. మంచైతే మాలవుతా, లేకుంటే లేదు అన్న గోడమీద పిల్లివాటం గురజాడ బ్రాహ్మణుడైనందువల్ల ఏర్పడిన పరిమితే. కనీసం అలాగైనా రాసినందుకు సంతోషమే కానీ, అంతకంటే శక్తివంతమైన వ్యక్తీకరణలు అంతకుముందూ, తర్వాతా వచ్చి మాలమాదిగల్ని ఉత్తేజరపరుస్తుంటే 'మంచియన్నది, మాలయైతే' అన్న పేలవమైన మాటను ఎవరి మెహర్బానీ కోసమో వేదంగా ఆమోదించాల్సిన అవసరం, ఆగత్యం దళితులకు లేదు. కాకపోతే "మాలవాళ్ళు రెండు రకములు, డ్రామాల వాళ్ళు, సినిమాల వాళ్ళు" (వారం, వారం,

విరసం ప్రచురణ) అని రాసిన శ్రీశ్రీ కంటే గురజాడ నయం అనుకోగలం అంతే.

జాషువా తరువాత పేర్కొనదగిన దళిత కవులు జాలారంగ కవి, కుసుమ ధర్మన్న కవి, నక్కా చినవెంకయ్య, బోయి భీమన్న, జ్ఞానానంద కవి తదితరులు జాతీయోద్యమ కాలంలో ఆ తర్వాత దళిత సమస్యలపైన కవిత్వం రాశారు. ప్రజాకవి, కళాకారుడు నాజర్, దోనేపూడి మోహన్‌ప్రసాద్ ఎన్నో దళిత గీతాలను రాశారు. సాహితీలోకం మొత్తం స్థబ్దంగా తయారై వున్నప్పుడు సి.వి. 'కారు చీకట్లో కాంతిరేఖ' కవిత రాసి నిశ్శబ్దాన్ని బద్దలు చేశాడు. సత్యకామ జాబాలి తదితర రచనల ద్వారా సి.వి. హిందూ మౌఢ్యంపైన విరుచుకుపడ్డాడు. ప్రముఖ దళిత విప్లవ కవి శివసాగర్ రాసిన 'చెల్లీ చంద్రమ్మ' దళిత స్త్రీకి ప్రతీక. భూస్వామి చేతుల్లో అత్యాచారానికి గురైన చంద్రమ్మ కన్నీళ్ళల్లో మునిగిపోలేదు. ఏ గంగలోనూ దూకలేదు. ఆ భూస్వామిపై కసి దీర్చుకుని ఉద్యమంతో కలిసిపోతుంది. ఆయన రాసిన 'నర్రెంగ చెట్టుక్రింద నరుడో బాస్కరుడో' విరసంకు మార్గదర్శకమయ్యింది. అయితే కవిత్వంలో ఉన్నత శిఖరాలకెదిగిన శివసాగర్ దళితసాహితీ సృజన ఈనాటి చైతన్యంతో మళ్ళీ మొదలు పెట్టాల్సివుంది. వేమన, జాషువాల్లాగా మొత్తం సాహితీ స్వరాల్లో విలక్షణమైన గొంతుకతో కన్పించే వ్యక్తిత్వం దళిత విప్లవ కవి గద్దర్‌ది. బతుకుపాటలల్లి గుండె గుండెకూ తన డప్పుల చప్పుళ్ళలో దళితజీవిత సంఘర్షణను తనపాటలో పలికించాడు గద్దర్. 'బాంచెన్ బాంచేనంటూ గులాపోణ్ణి దొర అంటూ' అన్న పాటా, 'యాలరో ఈ మాదిగబతుకూ' అన్న పాటా దళితుల జీవితాల లోతుల్ని చూపిస్తాయి. "సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మో" పాటలో లచ్చుమమ్మ గద్దర్ తల్లి. తల్లి పొలంలో పనిచేసే దృశ్యాన్ని గద్దర్ సజీవ చిత్తరువుగా చిత్రించాడు. కారంచేడులో కమ్మ భూస్వాములు పరమ దుర్మార్గంగా ఊచకోత కోసిన సంఘటనకు స్పందించి 'దళిత పులులమ్మా' పాట రాశాడు. గద్దర్‌లాగా దళిత జీవితాలను రచించిన దళిత కవి వంగపండు ప్రసాదరావు. 'ఉందర్రా మాలపేటా...' పాట వింటుంటే మాలపల్లి కళ్ళముందు కదలాడ్తుంది. చుండూరు మారణకాండకు స్పందించి ఆయన రాసిన 'గండర గండర గండ దళిత బిడ్డలేవరా..! పాట అగ్రకులాల గుండెల్లో భేరీ మోగిస్తుంది. ఊరు, పేరు లేనట్లు తమ వ్యక్తిత్వాలను సమూహంలో కరగదీసుకున్న ఎందరో జననాట్యమండలి, అరుణోదయ కవులు దళిత గీతాలను రాశారు. "ఊరుమనదిరో" అంజయ్య, బి.ఎన్.బి. దళిత జీవితం చిత్రిస్తూ పాటలల్లారు. దళితేతరుడైనా ఏ మినహాయింపులూ లేకుండా దళిత తత్త్వాన్ని సంతరించుకునే దిశగా తన ఆచరణనూ, రచననూ సాగించి అమరుడైన కవి చెరబండరాజు. ఆయన 'ఏ కులమబ్బీ మాదే కులమబ్బీ' పాట దళిత కులాల ఐక్యతను ప్రబోధిస్తుంది.

దళిత ఉద్యమానికి 1985 కారంచేడు సంఘటన ఒక మైలురాయి ఆనాటి నుండే దళిత ఆత్మగౌరవ పోరాటం మొదలైంది. దళిత ఉద్యమ నాయకులు శ్రీ కత్తి పద్మారావుగారు,

శ్రీ బొజ్జా తారకం గారలిద్దరూ కవులూ, సాహితీవేత్తలు, శ్రీ కత్తి పద్మారావుగారు అంబేడ్కర్ ఆలోచనల వెలుగులో, గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథంతో ఎన్నో తాత్విక, చారిత్రక గ్రంథాలు రాశారు. శ్రీ కత్తి పద్మారావు రాసిన జైలుగంటలు, దేశం డైరీ, జనగీతం తదితర కవితల్లో దళిత ఉద్యమాన్ని కళాత్మకంగా రికార్డు చేశారు. కులం పునాదులు, చార్వాక దర్శనం, భారతీయ సంస్కృతిలో స్త్రీ, కులం– ప్రత్యామ్నాయ సంస్కృతి తదితర గ్రంథాలను రాశారు.

**శ్రీ బొజ్జాతారకం తన 'నది పుట్టిన గొంతుక'లో**

**'బతుకును విఫణి వీధిలో పెట్టిన**
**వ్యాపారారణ్యాన్ని నరుక్కుంటూ**
**మనిషికీ, మనిషికీ తేడా తీసిన**
**కులమతాల గోతులు పూడ్చుకుంటూ**
**నీకోసం బాటవేసుకొస్తున్నాను**
**తూర్పు నుండి చరచరా పైకి వస్తున్న**
**సూర్యుడివా నువ్వా?**

అని రాసి దళితుల ఆత్మగౌరవ పోరాట స్పృహను వ్యక్తం చేశారు. ఆయన ఇంకా ఎన్నో కవితలు రాశారు. దళిత చైతన్యంతో ఎన్నో కవితలు, పాటలు రాసిన మాస్టార్జీ కృషి మరువలేనిది. దళిత జీవనాన్ని ఎవరూ కథల్లోకి ఎత్తడానికి ప్రయత్నించని కాలంలో విస్తారమైన దళిత జీవనాన్ని ఎన్నో కోణాల నుంచి 'సన్న జీవాలు' కథా సంకలనం, చెప్పులు, బిళ్ళల మొలతాడు.. వంటి ఎన్నో కథల్ని రాసిన కరుణకుమార, మునివాహనుడు నాటకం, ఊరబావి కథల్ని రచించి కొలకలూరి ఇనాక్ గారు, 'జాతర' నవల రచించిన బోయజంగయ్యగారు, బిసిల, దళితుల హక్కులకోసం ఎన్నో రచనలు చేసి, రజకగీతాలు సంకలనం చేసిన శ్రీ దేవరపల్లి మస్తాన్‌రావుగారు, దళిత పోరాట కథల పి.నాసరయ్యగారు ప్రముఖ దళిత రచయితలు. బతుకుపోరు, అడవిలో వెన్నెల, పాలు వంటి నవలలు, కథలు రచించిన దళిత రచయిత, తత్వవేత్త శ్రీ బిఎస్.రాములుగారు దళిత ఆశయాలకోసం ప్రకటించిన యుద్ధం చారిత్రాత్మకమైనది. ఎంతో దళిత సాహిత్యాన్ని వాగ్దానం చేసి మన గుండెల్లో మానని గాయంలా మధ్యలోనే మనల్ని వదలి అమరుడైన దళిత కలం యోధుడు సాహూ చిరస్మరణీయుడు. ఆయన అల్లంరాజయ్యతో కలసి రచించిన 'కొమురం భీం' నవల చారిత్రకమైనది. గిరిజనుల జీవితాల్లో కలసిపోయి వారి పోరాటాల్లో, వారి ఆవేదనల్లో కరిగిపోయిన వ్యక్తిత్వం సాహుది! ఆయన రాసిన 'నీ కన్నీరు... నా కన్నీరు' పాట వింటుంటే భవిష్యత్ భారతం వర్తమానంలో రోడ్ల మీద ఎలా ఆవిరైపోతోందో తెలుస్తుంది.

విప్లవకారుడిగా, గెరిల్లా యోధుడిగా ఎన్నో పోరాటాలు నడిపి అగ్రకుల హిందూ రాజ్యం కర్కశ నిర్బంధంలో ఏళ్ళకు ఏళ్ళు గడిపి, దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్యవేదిక వ్యవస్థాపనలో చురుకుగా పాల్గొని సాహు అంతర్థానమైపోయాడు. ఆయన చనిపోవడానికి ముందు పత్రికలకు ఇచ్చిన ఇంటర్వ్యూలో తన నిర్బంధం గురించి విరసం ప్రతిస్పందించిన తీరు పట్ల ఆవేదనను వ్యక్తం చేశాడు. వరవరరావుగారు అరెస్టయితే దేశవ్యాప్తంగా మేధావులను కదిలించి, అమ్నెస్టీ ఇంటర్నేషనల్ దాకా తీసుకువెళ్ళి ఆయన విడుదల కోసం ఉద్యమించిన విరసం సాహు నిర్బంధాన్ని గురించి పట్టించుకోలేదన్నది విషాదకరమైన వాస్తవం. ఆ విషయంలో విరసం పెద్దల అంతరాంతరాల్లో ఏం పనిచేసిందో బహిరంగ రహస్యమే. కనీసం ఆ విషయాన్ని గుర్తుచేసినప్పుడయినా భవిష్యత్‌లో అలాంటిది పునరావృతం కాకుండా ఆత్మవిమర్శ చేసుకోవలసిన పెద్దలు చేసుకోకపోగా అరుణ్ అనే సోమశేఖర శర్మతో సమాధానం రాయించారు. బహుశా ఆ సమాధానం రాసినందుకే అరుణ్ అనే సోమశేఖర శర్మ తర్వాతి కాలంలో విరసానికి కార్యదర్శి అయినా ఆశ్చర్యపోనక్కరలేదు. అరుణ్ సమాధానానికి విరసం కార్యవర్గ సభ్యుడు శ్రీ కె. నరసింహాచారి సరైన బదులు చెప్పాడు. ఒక ఆవేదనకు చర్మం మొద్దుబారిపోయిన సమాధానం చెప్పిన అరుణ్ అనే సోమశేఖర శర్మ బ్రాహ్మణుడు కావడం, దానికి పూర్తి వ్యతిరేకంగా స్పందించిన చారి దళితుడు కావడం యాదృచ్ఛికమైన విషయాలుకాదు. విరసం చూపిన వివక్షకు వరవరరావు గారిని బాధ్యుణ్ణి చేయనక్కరలేదు. నిజానికి వరవరరావుగారు రిజర్వేషన్ మీద మంచి దళిత చైతన్యంతో 'డార్ఘువు' అనే కవిత రాశారు. అయితే దళిత సాహిత్యం గురించి చర్చ వచ్చినప్పుడు ఇది విప్లవ ప్రవాహంలో ఒక పాయ మాత్రమే అని ప్రకటించారు వరవరరావు. కారంచేడు హత్యాకాండ తర్వాత, ఆ నెత్తుటి జ్వాలల నుండి పుట్టిన 'దళిత మహాసభ' సాగించిన ఉద్యమం లేకపోతే, రిజర్వేషన్‌లకు అనుకూలంగా దళితవిద్యార్థులు సాగించిన మహత్తరమైన పోరాటాలు లేకుండా ఆయన ఆ కవిత రాసేవారేనా అన్నది ప్రశ్నే. దళితుల ఆత్మగౌరవ ఉద్యమం ప్రేరణతో ఎంతో నిజాయితీగా స్పందించి ఒక మంచి కవిత రాసి కూడా తన ప్రేరణలను ప్రకటించ నిరాకరించడం బ్రాహ్మణ కాపట్యమే. 85కు ముందు నెహ్రూ మీద కూడా కవిత్వంరాసిన వరవరరావుగారు దళిత సమస్యమీద కవిత్వం ఎందుకు రాయలేదు? సర్వం నేనే అని ప్రకటించుకునే వాళ్ళను, వాళ్ళు రాయని విషయాల గురించి ప్రశ్నించడం అవసరం కూడా. అయితే రాయని దళితేతర కవుల్ని రచయితలనూ ప్రశ్నించుకుంటూ కూర్చునే కన్నా దళితుల అంతరంతరాల్లో దాగున్న సృజనాత్మక శక్తుల్ని వెలికి తీసి దళితులను కళాకారులుగా, మేధావులుగా రచయితలుగా తీర్చిదిద్దుకోవడంలో ఎక్కువ శ్రద్ధ చూపిస్తే నిర్మాణాత్మకమైన కృషి చేసిన వాళ్ళమవుతాం.

నిజానికి విరసంలో ప్రముఖ రచయితలైన అల్లం రాజయ్య, బి.ఎస్.రాములు, శివసాగర్,

గద్దర్, వంగపండు, కళ్యాణరావు, విరసం పతాక గీతం రాసిన రుద్రజ్వాల, సజ్జా వెంకటేశ్వర్లు తదితరులంతా దళితులే. వాళ్ళే విరసాన్ని నిలబెట్టారు.

దళిత చైతన్యంతో, దళిత వ్యక్తీకరణలతో ఎంతో దళిత సాహిత్యాన్ని సతీష్ చందర్ వాగ్దానం చేస్తున్నారు. ఆయన రాసిన రెండు బావులు తదితర కవితలు కొత్త దర్శనాన్నిస్తాయి. కల్లూరి ఆనందరావు, ఎండ్లూరి సుధాకర్, యువక, ఎ.వై.ప్రభుదాస్, చక్రవేణు, శంబూకుడు, కో.ప్ర., దారా గోపి, కృపారావు, ఈదుమూడి విజయకుమార్, అరుణోదయ వెంకటయ్య, మరియదాస్, లక్ష్మయ్య, కోటయ్య, మహాకవి వేమన, కొరబండి ఆంథోని, దుర్గం సుబ్బారావు, చంద్రశేఖర్ దళిత చైతన్యంతో రచనలు చేస్తున్నారు. దళిత వాస్తవికతను కథలుగా, తాత్విక వ్యాసాలుగా, పాఠాలుగా ఉషా ఎస్. డానీ వెలువరిస్తున్నారు.

ఈ అగ్రకుల హిందూ రాజ్యంలో మైనారిటీలూ దళితులే, బాధితులే అన్న చైతన్యంతో ఖాదర్ మొహియిద్దీన్ రాసిన పుట్టుమచ్చ కవిత చారిత్రాత్మకమైనది. 'నేను పుట్టకముందే దేశద్రోహుల జాబితాలో నా పేరు నమోదైంది...' అంటూ ఆ కవిత కన్నీళ్ళను తెప్పిస్తుంది. కసిని రగిలిస్తుంది. "మహాకవి"శ్రీశ్రీ తన వికట ప్రయోగవాద ఉత్సకతతో 'కసాయి', 'సాయిబు' అన్న రెండు పదాలను కలిసి 'కసాయిబు' అన్న పదబంధాన్ని సృష్టించాడు. సాయిబులు, కసాయిలు కారని ఈ దుర్మార్గపు వ్యవస్థలో ప్రతి చిన్న విషయానికీ హిందూ ఉన్మాదులు విరుచుకుపడే అల్పజీవులనీ మహాకవికి తెలియలా. ఆయన రాసిన ప్రతి పొల్లునీ అందంగా అచ్చుకెక్కిస్తున్న వాళ్ళకూ తెలియలా. ఇక్బాల్ చంద్ ఆరవ వర్ణం కవిత రాశాడు. అఫ్సర్ తనదైన శైలిలో చక్కటి కవిత్వాన్ని రాస్తున్నారు.

దేశవ్యాపితంగా దళిత సాహిత్యాన్ని సృష్టించిన సృష్టిస్తున్న దళిత రచయితల్లో పశ్చిమబెంగాలుకు చెందిన జతిన్‌బాగ్చీ, బి.కె.విశ్వాస్, సురేందర్ శిక్దా, కర్నాటకకు చెందిన చంద్రకాంత్ పోస్తే, శాంతకుమార్, మధ్యప్రదేశ్‌కు చెందిన కె.ఆర్. పటార్కర్, రాజస్థాన్‌కు చెందిన సీతారాం, కేరళకు చెందిన కుమార్ హసన్, తిరువళ్ళువర్, కె.కె. ఎస్టా, తమిళనాడుకు చెందిన మోహన్ తదితరులు ప్రముఖులు. ఇంకా పేరు తెలియని చెప్పుకోనిరాకరించే అజ్ఞాత సాహితీ వ్యక్తిత్వాలెన్నో. చలం స్త్రీవాద దృక్పథంతో చేసిన రచనలు భద్ర సమాజాన్ని కలవరపరిచాయి. ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు, మల్లాది సుబ్బమ్మగారు, ఓల్గా గారు స్త్రీ విముక్తి దృక్పథంతో ఎంతో సాహిత్యాన్ని సృష్టించారు. జయప్రభ, కొండేపూడి నిర్మల, ఘంటశాల నిర్మల, వాణీరంగారావు, రావులపల్లి సునీత, విమల, పద్మావతి తదితరులు ఎంతో శక్తివంతమైన స్త్రీవాద వ్యక్తీకరణలతో సాహిత్యాన్ని రాశారు.

డాక్టర్ జయసలోమి, పద్మావతి, విజయభారతి లాంటివారు తమతమ రంగాల్లో కృషి చేస్తున్నప్పటికీ దళిత స్త్రీ అంతరంగాన్ని ప్రతిఫలించే రచనలు రాలేదనే చెప్పుకోవాలి. కారణం

దళిత స్త్రీలు రచయితలుగా ఇంకా ఎదిగిరాకపోవడమే. దళిత స్త్రీ సాహిత్యం రాకపోతే దళిత సాహిత్యానికి సంపూర్ణత్వంరాదు. చరిత్రలో దళిత గణ నాయకురాలిగా, మాతృమూర్తిగా ఎన్నో కళలకు కూడా ఆధినాయకత్వాన్నీ, పుట్టుకనూ ఇచ్చిన దళిత స్త్రీ కళా సాంస్కృతిక సాహితీ రంగాల్లోకి అడుగు పెట్టకపోతే అత్యంత అవసరమైన పోరాటం ఇంకా ప్రారంభం కావాలనే వుందనే అర్థం. ఆ లోపాన్ని దళిత సాహిత్యోద్యమం పూరింపవలసి వుంది.

ఇప్పుడు వస్తున్న దళిత సాహిత్యం ఎంతో సాహితీ భవితవ్యాన్ని వాగ్దానం చేస్తోంది. అయితే కొంతమంది దళిత రచయితల్లో 'గొప్ప' సాహితీ విమర్శకులు, చేయి తిరిగిన ప్రఖ్యాత, విఖ్యాత రచయితలు తమను గుర్తించలేదన్న వేదన కన్పిస్తుంది. అధికారిక, అనధికారిక సాహితీ పీఠాలుగా చెలామణి అవుతున్న విమర్శకాగ్రేసరులు ఎవరెవరినో పేర్లు చెప్పి కవులుగా ప్రచారం చేసి ఆకాశానికెత్తుతున్నారే తప్ప తమను పట్టించుకోవడం లేదన్న గుర్తింపు వేదన కనిపిస్తుంది. నిజానికి తరాలుగా గుర్తింపులేక, దారుణమైన వివక్షకు గురైన వారిగా గుర్తింపునూ, కాస్తంత ప్రోత్సాహాన్ని కోరుకోవడం సహజం. అయితే అధికార సాహితీ పీఠాలుగా, గుర్తింపు పత్రాలిచ్చే గురుకులాలుగా కేంద్రీకృతమైన ఓ ఐదారుగురు వ్యక్తి మాత్రులు, వారిచ్చే సర్టిఫికెట్లను ఆకాశానికెత్తే మరో పదీ, పధ్నాలుగు మంది సోకాల్డ్ సాహితీవేత్తలు రచయితలను కొలుస్తున్న ప్రమాణాలేమిటి? అన్న విషయాన్ని పరిగణలోనికి తీసుకోవాలి. ఒక చేరా పొగిడితేనో, ఒక మధుసూధనరావుపర్వాలేదు వీడూ రచయితే పైకి వస్తాడు' అని భుజం తట్టి ఆమోదముద్ర వేస్తేనో రచయితలకు సాహితీవేదిక మీద స్థానం రాదు. తరతరాల జీవన మధనంలో పుట్టిన భాషను వాగ్దేవిని చేసి చీరెకట్టి, బొట్టుపెట్టి, గుడిలో పెట్టి దేవేరిని చేసి పూజలు చేయనక్కరలేదు. పొలంగట్లు మీదుగా, పాల కంకుల మీదుగా, తెగిపడే తల్లిపేగుల మీదుగా, బొగ్గు పొరల మీదుగా, పాత బస్తీ ఇరుకిరుకు సందుల మీదుగా వీచే సాహితీ పవనాలను పట్టి తూచే శక్తి లేనందుకు ఆ విమర్శకాగ్రేసరులే సిగ్గుతో అస్త్ర సన్యాసం చేయాలి.

మనం చేయాల్సిందల్లా రాయడమే. బాగారాయడం. వాళ్ళ ప్రమాణాల్లో, వాళ్ళ ఆమోదం కోసం కాదు. పువ్వులు వికసించినట్లు, నవ్వులు రాలినప్పుడు గుండెలు మండినట్లు, గట్లు తవ్వేటప్పుడు కందిమోదు గుచ్చుకుంటే గుండెలు కలుక్కుమన్నట్లు, అప్పటిదాకా కళకళలాడిన పల్లెపల్లెంతా స్మశానమై, పీనుగుల పెంటగా తయారైతే కోట్ల పిడికిళ్ళు ఒక్కసారిగా బిగుసుకొని ఒక బ్రహ్మాండమైన మెరుపు మెరిసినట్లు, మన భాషలో మనం రాయాలి. మన ప్రమాణాలతో మనం రాయాలి. కొత్త సూర్యుడ్ని చూడలేని వాళ్ళు కళ్ళు మూసుకుంటే మూసుకోనీ, వెన్నెల నవ్వితే వళ్ళు మండి పోయే వాళ్ళు మాడి మసైపోనీ, మనం చేయాల్సిందల్లా బతుకే ఎడతెగని పోరాటమై పోయిన మన బతుకు మనం బతుకుతున్నంత సహజంగా రాయడమే. పల్లెపల్లెనా దళిత కోయిల పాట పాడినట్లు, గుండె గుండెనా పోరు మంటలు రాజుకున్నట్లు,

జాతర జాతరగా దళిత సమూహాలు ఈ గడ్డ గుండెల మీదుగా ఊరేగింపై నడచి పోతున్నట్లుగా మనం రాయాలి. మన ప్రమాణం మన జనంలో చైతన్య జ్వాలలు రగల్చడం. దళితులు చైతన్యవంతులైతే మనకు లాభమా? నష్టమా? అని చర్చోపచర్చల్లో మునిగి తేలే మహామహా మేధావుల్ని అలా పడక్కుర్చీల్లోనే కూర్చోనిద్దాం. "ఇచ్చట విప్లవాలు తీసుకురాబడును", 'ఇచ్చట అందరికీ అందంగా విముక్తి చేయబడును' అని బోర్డులు తగిలించుకుని ఆఫీసులు తెరచుకుని, మీరు మా దగ్గరకు రాకపోతే మీరు విచ్ఛిన్నకారులేనని సముద్రాలను శాసిస్తూ కూర్చున్నామనుకునే "కాన్యూట్" మహాశయుల్ని తమ ఆనందాన్ని తమని పొందనిద్దాం. మనం రాద్దాం. చీకటి గురించి రాద్దాం. వెలుతురుకోసం రాద్దాం. కలల్లోకి చేయిపెట్టి కెలికి గుండెల్లో గానం చేసే వెలుతురు పిట్టల గొంతులు నులిమే క్రౌర్యోత్సుక శిరోమణుల కేసి ఒక ధిక్కారపు చిరునవ్వు విసిరినట్లుగా మనమిప్పుడు రాద్దాం.

కాలం రాజహంస. కాలం చంద్రవంక. కాలం చీకటి వెలుగుల పెనుగులాట. లక్ష కరిమేఘాలు చీకటి కాటుకను వర్షించనీ, మనది వెలుతురు పాట. మనది ఓడిపోయిన మానవుల తుది విజయగీతం. కథలై, గీతాలై, నవలలై, రకరకాల సాహితీ రూపాలై దళిత ఆకాంక్ష వెల్లువగా వ్యక్తం కావాలి. దళిత ప్రజల కలల సాఫల్యానికి మన తరం నడుం కట్టాలి.

**"ఇది దళిత యుగం. దళిత సాహితీ యుగం"**

**దళిత స్త్రీ సాహిత్య పరిషత్ కన్వీనర్**
**బి.ఎం.లీలాకుమారి ప్రచురించిన "దళిత సాహిత్యం" సౌజన్యంతో**
**ప్రథమ ముద్రణ: సెప్టెంబర్ 1993**

# దళిత ఉద్యమం - దళిత సాహిత్యోద్యమం

**భూమిక**

దళిత వుద్యమం, దళిత సాహిత్యోద్యమం మొదలై ఏళ్లు గడిచిపోయిన తర్వాత, అడుగడుగునా అవరోధాలను ఎదుర్కొంటూ విజయాలను సాధిస్తూ, అపజయాలను చవిచూస్తూ, వైఫల్యాల గుండా పయనిస్తూ, విద్రోహాలకు గురవుతూ, అద్వితీయమైన ఆశావహదృష్టిని ప్రదర్శిస్తూ, ఎన్నో ప్రయోగాలు చేస్తూ సాగుతోన్న ఉద్యమాన్ని ఎప్పటికప్పుడు సమీక్షించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

విజయాలు మితిమీరిన ఆత్మవిశ్వాసాన్ని పెంచి తప్పటడుగుల వైపుకి మనల్ని లాకెళ్ళవచ్చు. అపజయాలు ఆత్మన్యూనతను పెంచి ఒక నిష్క్రియాపర్వతంలోకి మనల్ని తోసేయవచ్చు. ప్రతి దశలలోనూ ఒక సమీక్ష, గడచివచ్చిన దశల్లోని పొరపాట్లను పరిహరించి ఎప్పటికప్పుడు నూతన తేజంతో ముందుకు సాగేందుకు ఆచరణాత్మక వ్యూహాన్ని రూపొందించుకొనే ఒక ఆత్మ పరిశీలన, ఆత్మ విమర్శ ఏ ఉద్యమాన్నైనా సజీవంగా వుంచుతోంది. దళిత ఉద్యమమైనా, దళితసాహితోద్యమమైనా అందుకు మినహాయింపు కాదు.

ఒక కొసన దళిత ఉద్యమం పని అయిపోతుందని, దళిత సాహిత్యం అనేది ఒక గాలి తెమ్మెరలాగా వచ్చి కాసేపు కనిపించి మటుమాయం అయిపోతుదని అది యిక లేదనీ చంకలు గుద్దుకుంటూ సంబరపడుతోన్న వాళ్ళూ వున్నారు. మరొక కొసన దళిత ఉద్యమం మహత్తరంగా కొనసాగుతున్నదని, రేపు రాత్రికో, మరుసటి రోజు ఉదయమో దళితులు రాజ్యాధికారాన్ని సాధించబోతున్నారనీ, రాజ్యాధికారం ఒక్కసారి చేతుల్లోకి వచ్చాక అన్ని ద్వారాలను తెరిచే తాళం చెవి అదే కాబట్టి దళిత విముక్తి దానంతట అదే ఛార్జీలు పెట్టుకొని మరీ వస్తుందని ప్రకటనలు చేసి ముఖ్యమంత్రిగా ఎవరుండాలి, ప్రధానమంత్రిగా ఎవరుండాలి, ఏయే శాఖల్ని ఎవరెవరికి కేటాయించాలి, ఎవరెవర్ని దూరంగా ఉంచాలి, ఎవరెవరికి రాజ్యసభ్యతం ఇవ్వాలి అని చర్చోపచర్చల్లో మునిగి తేలుతున్న పరిస్థితి ఉంది.

ఒకవైపు అద్భుతమైన వ్యక్తీకరణలతో వస్తోన్న దళిత కవిత్వాన్నీ, సరికొత్త జీవిత కోణాలను ఆవిష్కరిస్తున్న దళిత ఆత్మ కథల్నీ, నవలల్నీ చూడటానికి తిరస్కరించి దళిత సాహిత్య అస్తిత్వాన్ని నిరాకరించే ప్రయత్నం జరుగుతుంది. మరోవైపు ప్రకటించుకున్న కర్తవ్యాలకూ, సాధించిన అంశాలకూ మధ్య పెద్ద ఎత్తున అంతరం కన్పిస్తున్నా కూడా విజయాలను మాత్రమే చెప్పుకుంటూ, చేసిన పనుల్ని మాత్రమే చెప్పుకుంటూ చేయలేకపోయిన, చేయవలసిన అంశాలను విస్మరించే పరిస్థితి కొనసాగుతొన్నది. ముఖ్యంగా ఆత్మవిమర్శ లోపిస్తున్నది. లోలోపలికి చూసుకొని సరిచేసుకొనే ప్రక్రియ కోల్పోయిన తర్వాత ఆయా

ఉద్యమాలు ఏమవుతాయో చరిత్ర పొడవునా దృష్టాంతాలు వున్నాయి. చరిత్ర నుండి గుణపాఠాలు నేర్చుకోలేకపోతే చరిత్ర నిర్మాణంలో మన పాత్ర వుండదు.

దళిత ఉద్యమం సుదీర్ఘకాలం వర్ధిల్లాలనీ, అది ఎప్పటికి కొనసాగుతూనే వుండాలనీ దళితులం మేమెవరమూ కోరుకోవడం లేదు. అదే విధంగా చిరకాలం దళిత కవులుగా రచయితలుగా బతకాలనీ, దళిత సాహిత్యాన్ని సృష్టిస్తూ కాలం గడిపేయాలని దళిత రచయితలం మేమెవరం అనుకోవడం లేదు. దళితులుగా బతకాల్సిన అవసరం ఎంత త్వరగా పోతే అంత మంచిదని భావిస్తున్న వాళ్ళం. దళిత ఉద్యమం నడవాల్సిన అవసరమే లేని సమాజం ఏర్పడాలనీ, దళిత సాహిత్యం అవసరం సాధ్యమైనంత త్వరగా తీరిపోవాలనీ మేమనుకొంటున్నాం. దళిత ఉద్యమం ఏ పరిస్థితిల్లోంచి పుట్టిందో, దళిత ఆకాంక్షల, ఆవేదనల, ఆగ్రహాల ప్రతిఫలంగా దళిత సాహితోద్యమం ఎందుకు వచ్చిందో ఆ పరిస్థితులు సమూలంగా లేకుండా పోతేనే దళిత ఉద్యమం, దళిత సాహితోద్యమాల పని పరిసమాప్తి అవుతుంది. కానీ ఆ పరిస్థితులు యింకా పోలేదు. కులం విచ్చుకత్తులను దళితుల్ని క్షణం క్షణం ఊచకోతలకు గురిచేస్తూనే వుంది. 'అంటరానితనం' రకరకాల రూపాలలో విశృంఖలంగా అమలవుతూనే వుంది. జీవితంలోని అన్ని రంగాల్లోకి 'కులం' వ్యాపించి జీవితాన్ని శాసిస్తూనే వుంది.

ఈ పరిస్థితుల నుండే దళిత ఉద్యమం పుట్టింది. దళిత ఉద్యమం అగ్రకులాల వారి దుర్మార్గపు అణచివేత నుండి పుట్టింది. దళితుల నెత్తుటి మంటల నుండి పుట్టింది. నిరాశా నిస్పృహల నుండి పుట్టింది. పాలకుల, మంత్రుల, నాయకుల విద్రోహాల నుండి పుట్టింది. వాగ్ధాన భంగాల నుండీ, వెన్నుపోట్ల నుండీ పుట్టింది. అవమానాల నుండి, అత్యాచారాల నుండి, దుర్భరమైన దారిద్ర్యం నుండి, దారుణమైన వివక్షల నుండి పుట్టింది. దళిత వుద్యమం దళితుల ఆత్మగౌరవ చైతన్యం నుండి పుట్టింది. భవిష్యత్‌ల పట్ల దళితులు కనే కలలే దళిత సాహిత్యం.., దళిత ఆకాంక్షలూ, ఆగ్రహ నినాదాలూ, సమతా భావనలు. వీటి అభివృద్ధే దళిత సాహిత్యం.

ఆశలేవీ తీరలేదు. బతుకులేమీ మారలేదు. ప్రయత్నాలెందుకు మునిగిపోతాయి? ఏదో ఒక రూపంలో ఏదో ఒక పద్ధతిలో దళిత నిరసన వ్యక్తం అవుతోనే వుంది. దళితుల సర్వతోముఖాభివృద్ధి జరిగి 'పౌర సమాజం'లోకి, 'ప్రధాన స్రవంతి' లోకి చేరిపోయి అన్ని రకాలుగా ఒక మనిషికి ఒకే విలువ దక్కేంతవరకూ యిది కొనసాగుతూనే వుంటుంది. కొనసాగుతూనే ఉంది.

అలాగని దళిత ఉద్యమం, దళిత సాహిత్యం అప్రతిహతంగా, అజేయంగా, 'జంకు గొంగులేక ముందుకు' సైనిక కవాతులాగా సాగిపోతుందని మేము బుకాయించబోవడంలేదు.

మేమక్కడా తప్పటడుగు వేయలేదని, ఓడిపోలేదనీ, వెనుకంజ వేయలేదనీ, దారితప్పలేదనీ అబద్ధమాడబోవడంలేదు. అనేక ఘర్షణల్లోంచి, అనేక అన్వేషణల్లోంచి దళిత ఉద్యమం, దళిత సాహితోద్యమం ముందుకు పోతుంది. ఒక్కొక్కసారి అమితోద్ధృతంగా, ఒక్కొక్కసారి మెల్లమెల్లగా... మందకొడిగా సాగుతోంది. అంతా చల్లారి పోయిందనుకున్నప్పుడు ఎక్కడో దళిత ఆకాంక్ష నిప్పురవ్వై రాజుకుంటూనే వుంది. అంతా బ్రహ్మాండంగా సాగుతోందనుకున్నప్పుడు ఏదో ఒక పరిమితి అడ్డుపడుతూనే ఉంది. ఒక్కొక్కసారి పైకి, ఒక్కొక్కసారి కిందికి ఒక చక్రంలాగా పడుతూ లేస్తూ సాగుతోన్న దళిత వుద్యమ, దళిత సాహిత్యోద్యమ గమనాన్ని క్లుప్తంగా వివరించడానికి చేస్తున్న చిన్న ప్రయత్నం యిది.

ఈ ప్రయత్నం కూడా అనేక పరిమితులకు గురవుతున్నది.

1. 1999 డిసెంబర్ 29,30 తేదీ తేదీల్లో జరిగే రాష్ట్ర స్థాయి 'దళిత సాహిత్య సదస్సు'లో దళిత ఉద్యమం, దళిత సాహిత్య ఉద్యమం' అనే అంశాలపై జరిగే సెషన్‌లో సమర్పించడానికి దీన్ని తయారు చేయడం.

2. ఎక్కువ సమయం దీనికోసం కేటాయించక పోవడం. ముఖ్యమైన పరిమితులు. ఈ దృష్టితోనే దీన్ని స్వీకరించాలనీ, దీన్నింకా విస్తరించాల్సిన అవసరం వుందనీ మనవి చేస్తున్నాను.

ఒక పరాయికరణం నిరంతరం నీడలాగా దళిత జీవితాల్ని వెంటాడుతోంది. పుట్టిన గడ్డకూ, వెచ్చించిన శ్రమకూ, సృష్టించిన సంపదకూ, నిర్మించిన చరిత్రకూ, సంస్కృతికీ, చివరకు మనిషి స్థానానికి పరాయిలుగా బతుకులీడ్వవలసిన పరిస్థితి ఇవేళ్టికీ కొనసాగుతోంది. అస్తిత్వాలు లేని నిర్భాగ్యపు నీడలు వెంటాడినట్లుగా బతుకులు వెళ్ళమారిపోతున్నాయి.

ఈ మిలీనియం అంచున నిలబడి ఒక్కసారి వెనక్కి తిరిగిచూస్తే దళిత జీవితం గడచివచ్చిన పాదముద్రల జాడలు అస్పష్టంగానైనా లిఖిత చరిత్రలో కన్పించడం లేదు. కోటానుకోట్ల దళిత స్త్రీలు, పురుషులు, పిల్లలు ఈ మట్టి పైన చేసిన నెత్తుటి 'చేవ్రాళ్ళు' భూమి పొరల్లో కప్పడిపోయాయి. ఈ దేశ చరిత్రగా చలామణీ అవుతున్న లిఖిత చరిత్ర అశేష దళిత జనాంగం తమ నెత్తురు కన్నీళ్ళతో నిర్మించిన నాగరికతల, సంస్కృతుల చరిత్రను నమోదుచేయలేదు. ఆయా కాలాలలో, ఆయా అవరోధాలకు వ్యతిరేకంగా జరిగిన మహత్తర మానవ ప్రయత్నాలు, అనుభవాలు లిఖిత చరిత్రలో నమోదు కాలేదు.

భారతదేశపు లిఖిత చరిత్ర అంతా ఈ భూమి బిడ్డల అణచివేతకు సంబంధించిన సుదీర్ఘచరిత్ర. దళితుల ఆత్మగౌరవ ప్రకటన, స్వేచ్ఛకోసం, సమానత్వం కోసం, సోదరభావం కోసం, స్వావలంబన కోసం దళితులు తరాలుగా చేసిన, చేస్తున్న ప్రయత్నం అంతా ఈ దేశపు అలిఖిత చరిత్రగా మిగిలిపోయింది. ఈ దేశ లిఖిత చరిత్ర అసలు చరిత్రకు వ్యతిరేకంగా కుట్ర చేసింది. రాజుల చరిత్రే, అగ్రకులాల వారి చరిత్రే, విజేతల చరిత్రే దేశ చరిత్రగా

చలామణీ చేసింది. పురాణాల నుండి జాతీయోద్యమం దాకా ఆ మాటకొస్తే ఇప్పటి దాకా ఆ పరిస్థితే కొనసాగుతోంది. తెలుగు గడ్డ మీద భారతాన్ని తెలుగులోకి అనువదించిన నన్నయ్య అంతకు ముందున్న దళిత సాహితీ వ్యక్తీకరణలనూ, మౌఖిక, జానపద కవితారీతులను ఒక్క కలంపోటుతో తిరస్కరించి తాను ఆది కవినని ప్రకటించుకున్నాడు. రాజులు, అగ్రకుల పాలకుల, బ్రాహ్మణుల సాహిత్యమే తెలుగు సాహిత్యంగా తెలుగు సాహితీ చరిత్ర లిఖితమైంది. యిందులో దళిత జనాంగం సృష్టించిన అత్యద్భుతమైన సాహితీ అభివ్యక్తులు మాయమైపోయాయి.

ఈ క్రమాన్ని దళిత ఉద్యమం, దళిత సాహితీ ఉద్యమం ప్రశ్నించింది. మూలాల్లోకి వెళ్ళి తమ చరిత్రను తమ సాహితీ చరిత్రనూ పునర్నించుకోడానికి దళితులు ప్రయత్నాలు మొదలు పెట్టారు. ఆశయం యింకా పూర్తి కాలేదు. అయితే ఈ క్రమంలో కూడా వ్యక్తి సమాజంలోకి అడుగుపెట్టగలిగినంత మేరకే దళిత చరిత్ర, దళిత సాహితీ చరిత్ర నిర్మితమవుతున్నది. దళిత సాహిత్యానికి సంబంధించి లిఖిత (దళిత) సాహిత్యమే సాహిత్యంగా చలామణీ అవడం ఒక విషాదం. అచ్చుతో సంబంధం లేకుండా ఉత్పత్తి అవుతోన్న దళిత సాహితీ రూపాలనూ, సాహితీ వేత్తలనూ తనలోకి యిముడ్చుకొనే క్రమం యింకా సరిగా ప్రారంభం కాలేదు. అదే విధంగా దళిత ఉద్యమాలకు సంబంధించి కూడా రాజుల చరిత్రే, పాలకుల చరిత్ర, వీరుల చరిత్రే, చరిత్రగా చలామణీ అయినట్లుగా, నాయకుల చరిత్రే ఉద్యమ చరిత్రగా చలామణీ అయ్యే పరిస్థితి వుండడం విషాదం. దళిత నాయకులెవ్వరూ అడ్డదారిన నాయకులు కాలేదు. ఎన్నో కష్టాలు పడి, త్యాగాలు చేసిన మీదటనే, దళిత ఆశయం కోసం ఎంతో కృషి చేసిన మీదటనే వాళ్ళు నాయకులయ్యారు. తెలుగులో భాగ్యరెడ్డి వర్మ (మ్యాదరి భాగయ్య) దగ్గర నుండి మంద కృష్ణ మాదిగ దాకా, యింకా గ్రామస్థాయి నాయకుల దాకా నాయకులుగా రూపొందే క్రమం అంతా కష్టాలతో, త్యాగాలతో కూడుకొన్నదే. అయితే చరిత్ర పునర్నిర్మాణానికి ఒక దళిత పద్ధతి యింకా మనం కనిపెట్టుకోలేదు. అదే విధంగా నాయకత్వాన్ని రూపొందించుకొనే విషయం కూడా. అధికారం కేంద్రీకృతం కావడం దళిత ఆశయానికి భిన్నమైనది. అధికార పీఠాలను బద్దలు కొట్టడమే దళిత ఉద్యమ లక్ష్యం. ఒక చోటు కేంద్రీకృతమైన అధికారాన్ని బద్దలు కొట్టి కింది స్థాయి వరకూ అది ప్రవహించే వికేంద్రీకరణా పద్ధతిని యింకా మనం కనిపెట్టాల్సి ఉంది. అది నాయకత్వం విషయంలోనూ అన్యాయం అవుతుంది. అదే విధంగా సాహిత్యంలోనూ బ్రాహ్మణీయ భావజాలం అధికార పీఠాలను స్థిరపర్చింది. ఆయా పీఠాలు గుర్తించిందే సాహిత్యంగా, మహాకవులుగా చలామణీ అయిన వాళ్ళు మెచ్చిన వారే సాహితీ వేత్తలుగా కొనసాగే పరిస్థితిని అది కల్పించింది. అభ్యుదయ విప్లవ సాహిత్యోద్యమాలు కూడా ఈ మహాకవుల సంప్రదాయాన్ని అనుసరించాయి. దళిత సాహిత్యం ఉనికిలోకి వచ్చిన తర్వాత

యిక తెలుగు సాహిత్యానికి మహాకవుల బరువును లేకుండా చేసే ఒక ప్రజాస్వామిక విలువను సమాజానికి యిచ్చింది. కవులుగా, రచయితలుగా పేరొందని అనేక మంది 'మామూలు మనుషులు' తమ రోజు వారీ జీవితంలో, సంభాషణల్లో అద్భుతమైన కవితా అభివ్యక్తినీ, కథన శైలినీ కనపరుస్తున్నారనీ,వారి అభివ్యక్తి ముందు 'మహాకవులు'గా చలామణీ అయ్యే వాళ్ళు రాసిన చాలా వాక్యాలు ఎందుకూ కొరగావనీ, ఆ అభివ్యక్తినీ కవిత్వంగా, కథలుగా మలుస్తామని దళిత కవులు, రచయితలం ప్రకటించుకున్నాము. ఒక దశ గడిచిన తర్వాత దళిత కవులు, రచయితల్లోనే (ప్రచ్ఛన్నంగానైనా సరే) ఎవరు నెంబర్ వన్ అనే పోటీ తలెత్తడం శోచనీయం. ఈ కఠిన వాస్తవాల మధ్య దళిత ఉద్యమాన్ని, దళిత సాహిత్యోద్యమాన్ని సమీక్షించుకునే బాధ్యతలను తలకెత్తుకుంటున్నాం.

ఏం జరిగినా దళిత ప్రశ్న సజీవంగా ఉంది. అది రేకెత్తించిన అనేక అంశాలు ఆచరణను డిమాండ్ చేస్తున్నాయి. అనేక కొత్త సమస్యలు, కొత్త రంగాలూ ఆవిష్కృతమవుతున్నాయి. సమస్యల్లోంచి నాయకత్వం రూపొందుతోంది. కదలికల్లోంచి సాహితీ సృజన జరుగుతోంది.

విమర్శ విధ్వంసానికి కాదు, పరిరక్షించుకోడానికి. ఆత్మ విమర్శ ఆత్మ నిందకు కాదు, సరిచేసుకోడానికి.

వర్తమానంలో జీవిస్తున్న ఎవరైనా సరే చరిత్రను చెప్పుకొని బతికే అవకాశం లేదు. గతంలో అది చేశాం. ఇది చేశాం అని చెప్పుకొంటూ కాలం గడిపే అవకాశాన్ని ఈ దేశం దళితులకు యివ్వలేదు. యిప్పుడు కాలం అనేక సవాళ్లను మనముందుకు తెచ్చిన సందర్భంలో మనం ఏమి చేస్తున్నామన్నది ముఖ్యం. ఏం చేయాలో నిర్ణయించుకోవడం ముఖ్యం. అందు కోసం ఈ పునరావలోకనం.

మిగతా వక్తలు ఆయా సాహితీ ప్రక్రియలను గురించి వివరంగా మాట్లాడతారు కాబట్టి, ఉద్యమానికి సంబంధించి కూడా తాత్విక అవగాహన సెషన్ వేరే వుంది కాబట్టి ఎక్కువ చర్చల్లోకి వెళ్ళకుండా దళిత ఉద్యమం, దళిత సాహిత్యోద్యమాలు ఆయా సందర్భాలలో లేవనెత్తిన ప్రశ్నలు, ఆయా సందర్భాల్లో ఎదుర్కొన్న పరిమితులను చర్చించడానికి నేను పరిమితమవుతాను. దళిత జీవితం ముందున్న సవాళ్ళు, దానికి దళిత ఉద్యమం రూపొందించిన కార్యక్రమం, సాహితీ స్పందన, దళిత రచయితల కర్తవ్యాలు మొదలైన అంశాలకు నా చర్చను పరిమితం చేస్తాను

**చారిత్రక నేపథ్యం**

వేల ఏళ్ళనాటి వర్ణవ్యవస్థే దేశంలో యింకా కొనసాగుతున్నది. పుట్టుక కారణంగా, మత కర్మకాండలకు సంబంధించిన 'పవిత్రత' ప్రాతిపదికగా ఒక సంక్లిష్టమైన నిర్మాణంగా కులవ్యవస్థ రూపొందింది. ఇది హిందూ మతంలోని విశిష్ట కోణం. ఒక కులంలో పుట్టిన

వాళ్ళు చనిపోయే వరకూ అదే కులంలో కొనసాగుతారు. కులాల హోదాలకు కర్మసిద్ధాంతం సాధికారతను కల్పిస్తుంది. గత జన్మలో చేసిన కర్మాల ఫలితాన్ని ఈ జన్మలో అనుభవించాలనీ, పూర్వజన్మల కర్మఫలాన్ని బట్టే ఈ జన్మలో వ్యక్తి స్థానం నిర్ణయం అవుతోందని చెప్పేదే కర్మ సిద్ధాంతం.

బ్రాహ్మణులు అగ్రస్థానంలోనూ,తర్వాత క్షత్రియులూ, ఆ తర్వాత వైశ్యులూ, అటు తర్వాత చివరన శూద్రులు వుండాలని వర్ణ వ్యవస్థ ఆయా కులాల హోదాలను నిర్ణయించింది. ఈ నాలుగు వర్ణాలకు చెందని, వర్ణ వ్యవస్థకు బయట ఉన్నవారిని పంచమ వర్ణంగా పేర్కొని వారిని అస్పృశ్యులుగా పరిగణించింది హిందూమతం. ఈ నాలుగు ప్రధాన కులాల నుండి వేలాది ఉపకులాలు పుట్టుకొచ్చాయి. స్థల కాలాలను బట్టి కులాల స్థానాలు మారుతూ వచ్చాయి. జాతి, ప్రాంతం, భాష, వృత్తి మొదలైన కారణాలతో ఇవి మరింతగా విడిపోయాయి. అయినప్పటికీ వీళ్ళంతా "సవర్ణ హిందువులు"గానే చలామణీ అయ్యారు. వేల ఏళ్ళుగా కొనసాగుతోన్న విషయం యిది. ఏ కులం స్థానం ఎక్కడికి వెళ్ళినా అస్పృశ్యుల స్థానం మాత్రం సమాజంలో చెక్కుచెదరలేదు. తరాలు మారినా, రాజులు, పాలకులు మారినా, పాలనా పద్ధతులు మారినా 'అంటరానివారి' పరిస్థితుల్లో మాత్రం ఏ మార్పూ లేదు. వారి ఉనికే కలుషిత కారకమని వేల ఏళ్ళ క్రితం హైందవ బ్రాహ్మణీయ సమాజం ఊరికి వాడకు మధ్య గీసిన "కలుషిత రేఖ' యింకా చెరిగిపోలేదు. వారిపైన అగ్రకుల సమాజం అమలు చేస్తున్న అణచివేత, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, లైంగిక రాజకీయ దోపిడీ కొనసాగుతూనే ఉంది.

నిరంతరం హింస, అవమానాలు, దోపిడీలతో పాటు అమానవీయమైన పరిస్థితుల్లో జీవనం సాగిస్తున్నారు. పిడికెడు మెతుకుల కోసం వట్టి చేతులతో మనిషి పెంటను ఎత్తివేయాల్సిన దుస్థితిని అగ్రవర్ణ సమాజం దళితులకు కల్పించింది. వేల సంవత్సరాల నుంచీ దళితులు ఈ పని చేస్తున్నారు. స్వతంత్రం వచ్చిన తర్వాత కూడా మనిషి చేత మలాన్ని ఎత్తివేయించడం యింకా కొనసాగుతూనే వుంది. చచ్చిపోయిన పశువుల్ని, యితర చెత్తనీ, కుళ్ళుని పారవేయడం కూడా వీళ్ళ పని.

స్వంత భూమి లేక చాలీచాలని కూలీ కోసం లక్షలాది మంది దళితులు ఆరుగాలం పొలాల్లో రెక్కలు ముక్కలు చేసుకుంటున్నారు. భూమికి కులానికీ కూడా అవినాభావ సంబంధం ఉంది. కింది కులస్థులే, దళితులే సాధారంగా భూమిలేని కూలీలై ఉంటారు. ఆ రకంగా కుల వ్యవస్థ ఆర్థిక వ్యవస్థ కూడా. భూమికీ, విద్యకూ దళితుల్ని దూరం చేసి నిరంతరం కట్టుబానిసలుగా దళితుల్ని మార్చేశారు.

మతంపేరుతో ఆచారాల పేరుతో దళిత స్త్రీలను దేవదాసీలుగా, జోగినులుగా మార్చి బలవంతంగా వ్యభిచార వృత్తిలోకి కుల వ్యవస్థ నెట్టేస్తుంది.

ఉన్న పరిస్థితిని మార్చడానికి ఎవరు ఎప్పుడు ప్రయత్నించినా వర్ణాశ్రమ ధర్మ పరిరక్షణార్థం రక్తపు టేరులు ప్రవహించాయి. గ్రామాలకు గ్రామాలు మంటల్లో మాడిమసై పోయాయి. వేదకాలం నాటి నుండీ ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని రూపొందించుకొని ఆచరిస్తామని ప్రకటించిన నేటి దాకా గ్రామీణ భారతంలో యిదే జరుగుతోంది. అగ్రకుల సమాజం దేన్నైనా సహించింది కానీ కుల వ్యవస్థలోని మార్పుని సహించలేదు. అందుకోసం మారుతున్న కాలానికి అనుగుణంగా వివక్షా రూపాలను మార్చుకొంటూ, చిత్రహింసా పద్ధతులను అవలంబిస్తూ వచ్చింది.

ఎక్కడ అణచివేత ఉంటుందో అక్కడ తిరుగుబాటు, అధికారం ఉండి తీరుతుంది. అగ్రకుల సమాజం ఉన్న పరిస్థితుల్లో ఎటువంటి మార్పు లేకుండా ఉండడం కోసం తీవ్రమైన హింసనూ, బలప్రయోగాన్నీ అమలు చేస్తూనే వచ్చింది. హింసకూ, అణచివేతకూ వ్యతిరేకంగా కింది కులాలు కదలబారుతూనే వున్నాయి. సంఘర్షిస్తూనే వున్నాయి.

చార్వాకుల తర్కాన్ని పరిశీలిస్తే బ్రాహ్మణవాదం ముందుకు తెచ్చిన మాయాజాలాలకు వ్యతిరేకంగా వాళ్ళు భౌతికవాద దృక్పథాన్ని ఎలుగెత్తి చాటారు. బ్రాహ్మణీయ కుయుక్తులను అడ్డుకోడానికి ప్రయత్నించారు. శాక్తేయులు, సాంఖ్యులు మొదలైన తాంత్రికవాదులు బ్రాహ్మణ వాదం ముందుకు తెచ్చిన పితృస్వామ్యాన్ని వ్యతిరేకిస్తూ స్త్రీ ఆరాధకులుగా ముందుకు వచ్చారు. బౌద్ధం సమతా విలువల సమాజాన్ని ప్రబోధించింది. రకరకాల భక్తి ఉద్యమాలు కుల నిర్మూలననూ, సమానత్వాన్నీ ప్రబోధించాయి. వీటన్నింటినీ ఆనాటి దళిత జీవుల విముక్తి ఆలోచనలకు ప్రతిఫలాలుగా, వ్యక్తీకరణలుగా అర్థం చేసుకొంటే మనుగడ కోసం, మానవ గౌరవం కోసం భారత సమాజపు అట్టడుగు పొరల్లో జీవించే దళిత జనాంగం ఎంతటి సుదీర్ఘమైన పోరాటాలను సాగిస్తూ వచ్చిందో స్పష్టమౌతోంది. బ్రాహ్మణవాదం, అగ్రకుల సమాజం వీటన్నింటినీ కుట్రలు, కుయుక్తులతో, హింసతో అణచివేసినప్పటికీ సమాజంలో వాటి ప్రభావం తుడిచిపెట్టుకుపోలేదు.

ఈ సంఘర్షణ అంతా మనకు తత్వాల రూపంలో, భక్తి గీతాల రూపంలో, వీరగాథల రూపంలో రకరకాల మౌఖిక సాహితీ రూపాల్లో ప్రతిఫలించింది. తెలుగునాట కూడా పోతులూరి వీరబ్రహ్మం, సిద్దప్ప, వేమన వంటి కవులు కుల నిర్మూలనా తత్వాలను ప్రచారం చేశారు. పల్నాటి బ్రహ్మన్న, కన్నమదాసులు కుల నిర్మూలన కోసం పనిచేశారు. ఒక్కొక్క కాలాన్ని బట్టి ఆయా పరిస్థితులను బట్టి నిరసన రూపాలూ, కుల నిర్మూలనా ప్రయత్నాలూ మారాయి.

కుల వ్యవస్థను కాపాడాలని ఆధిపత్య కులాలూ, బ్రాహ్మణీయ భావజాలమూ ఒక పక్క, కుల సంకెళ్ళను తెంచేయాలని కింది కులాల వాళ్ళూ, ధిక్కార తత్వమూ మరోపక్కా సాగించిన

పోరాటాల చరిత్రే భారతదేశ చరిత్ర. అయితే కింది కులాల పోరాటాల చరిత్ర నమోదు కాకుండా అలిఖితంగా ఉండిపోయింది. అదే విధంగా కులాలను కాపాడడానికి, కులవ్యవస్థను పరిరక్షించడానికి రాజాస్థానాల్లో మహారాజపోషకుల కనుసన్నల్లో సృష్టించిన సాహిత్యం సాహిత్యంగా మిగిలిపోయింది. దళితుల ధిక్కార సాహిత్యం సాహిత్యంగా మిగిలిపోయింది. దళితుల ధిక్కార సాహిత్యం జానపదుల నోళ్ళలో మౌఖిక సాహిత్యంగా మిగిలిపోయింది. ధిక్కార సాహిత్యాన్నీ, ధిక్కార భావజాలాన్నీ విధ్వంసం చేశారు.

దేశంలో అనేక మార్లు పాలకులు మారారు. ముస్లిం రాజులు పరిపాలించారు. బ్రిటీష్ వారు వచ్చారు.స్వతంత్రం వచ్చింది. సామాజిక ఆర్థిక పరిస్థితుల్లో మార్పులు వచ్చాయి. ఉత్పత్తి విధానంలో మార్పులు వచ్చాయి. అయినప్పటికీ ఈనాటికీ మానవ విలువలున్న ఏ సమాజమూ ఆమోదించని దుర్మార్గమైన కులవివక్షా రూపాలు యింకా కొనసాగుతూనే ఉన్నాయి. స్వతంత్ర్య భారతదేశంలో ఆత్మగౌరవ చైతన్యాన్ని చూపినందుకు దళితుల్ని ఊచకోత కోసిన సంఘటనలు ఎన్నో. కంచికచర్ల కోటేశు దగ్గర నుండి, కారంచేడు, నీరుకొండ, చుండూరు, వేంపెంట వంటి సామూహిక హత్యాకాండలు సాగిపోతూనే వున్నాయి. కులం గీసిన చట్రాన్ని దాటి బయటకు వచ్చేందుకు ప్రయత్నించిన ఎవరైనా అగ్రకుల అహంకారానికి ఏదో రూపంలో బలవుతూనే వున్నారు.

- ఈ నాటికీ దేశంలో ఉన్నవేలాది గ్రామాల్లో ఆధిపత్య కులాల వారితో కలసి కూర్చోవడం నిషేధం. ఆధిపత్య కులాల వారి ప్రాంతాల్లో దళితుల పెళ్లి ఊరేగింపులు నిషేధం. పెళ్ళికొడుకు గుర్రం ఎక్కి ఊరేగడం నిషేధం.
- ఆధిపత్య కులాల వారి గ్రామాల్లో దళితులు చెప్పులేసుకొని తిరగడం నిషేధం. దళితులు ఎవరైనా చనిపోతే ఆ శవాలను ఆధిపత్య కులాల వారి వీధుల గుండా తీసుకువెళ్ళడం నిషేధం.
- కాఫీ హోటళ్లలో దళితుల కోసం ప్రత్యేకమైన గ్లాసులుంటాయి. వాటిని వాళ్ళే కడగాలి.
- ఊరుమ్మడి చెరువుల నుండి, బావుల నుండి దళితులు నీరు తీసుకోవడం నిషేధం.
- అగ్రకులాల వారి ఇళ్లల్లో పుట్టుక, పెళ్ళి, చావు మొదలైన సందర్భాలలో దళితులు ఎటువంటి ప్రతిఫలాన్నీ కోరుకోకుండా చాకిరీ చేయాలి.
- దళిత స్త్రీలపై రోజు వారీ అత్యాచారాలు, అవమానాలు సర్వసాధారణం. దళితులను కొట్టడం, చిత్రహింసలు పెట్టడం, హత్యాప్రయత్నాలు చేయడం, హత్య చేయడం మామూలు విషయం.
- ఎన్నికల్లో ఓటు హక్కును వినియోగించుకోనీయకుండా దళితులను నిరోధించడం, ఎన్నికైన ప్రతినిధులను హత్యచేయడం, దళితులు ప్రజాస్వామ్య ఎన్నికల్లో పాల్గొనకుండా నిరోధించడం.

- చేసిన పనికి న్యాయమైన కూలీ రేట్లను తిరస్కరించడం.
- భూమిపైన ఇతర వనరులపై దళితుల హక్కును నిరాకరించడం.
- కనీస అవసరాలు కూడా దక్కని దుర్భరమైన దారిద్ర్యంలోకి దళితుల్ని నెట్టివేయడం.
- ఇటువంటి అనేక వివక్షా రూపాలనూ, అస్పృశ్యతా రూపాలను అమలు చేస్తూనే ఉన్నారు.

వీటిని ఏ మాత్రం ప్రశ్నించినా సాధారణంగా మొదట అమలు చేసే శిక్ష సాంఘిక బహిష్కరణ. అసలే ఏ రోజు కూలీ ఆ రోజు తెచ్చుకున్నా రోజు గడవని బతుకులకు సంఘ బహిష్కరణ అంటే దాదాపు ఆకలి చావుకు గురికావడమే. సాంఘిక బహిష్కరణ అంటే ఇక ఆ గ్రామంలో దళితులకు మంచి నీరు పుట్టదు. రోజువారీ నిత్యావసర వస్తువుల్ని కొనుక్కుందామన్నా అమ్మనివ్వరు. కూలీ పనికి పిలవరు. తప్పితే శిక్షలు భయంకరంగా ఉంటాయి.

స్వతంత్ర్యం వచ్చిన యాభై రెండేళ్ళ తర్వాత, దళిత ఉద్యమాలు ఉవ్వెత్తున తలెత్తి సామాజిక న్యాయం నినాదం దేశం అంతా మారుమోగిన తర్వాత, ప్రభుత్వాలు, రాజకీయ పార్టీలు కూడా దళిత విముక్తిని వాగ్దానం చేసిన తర్వాత కూడా రోజూ దేశంలోనూ, ఆంధ్ర ప్రదేశ్‌లోనూ జరుగుతోన్న తతంగం యిదే. ఈ చారిత్రిక నేపథ్యంలో దళిత వుద్యమాన్నీ, దళిత సాహిత్యోద్యమాన్నీ సమీక్షించుకునే ప్రయత్నం చేస్తున్నాం.

సత్యాలను వాస్తవాల నుండి గ్రహించడం హేతుబద్ధంగా ఆలోచించేవారు చేసే పని. అందుకోసం వస్తుగతంగా పరిస్థితులను అంచనా వేయాలి. దాని కోసం ప్రయత్నం, నిర్మాణాత్మకంగా వచ్చే ప్రతి విమర్శనీ, సూచననీ స్వంతం చేసుకోవాలి. అందుకు మనం సిద్ధపడాలి. తరాన్ని సిద్ధం చేయాలి.

**దళిత ఉద్యమం - దళిత సాహిత్యోద్యమం**

**18, ఫిబ్రవరి 1969**

ఒక మంటల ఆకారం 9వ నెంబర్ జాతీయ రహదారిపైన నడుచుకొంటూ వస్తుంది. ఇంకా 36 కిలో మీటర్లు వెళ్తే విజయవాడ.

సాయంత్రం మ్యాట్నీ సినిమా వదిలేవేళ. పొగాకు కంపెనీ గ్రేడింగ్ పూర్తయ్యే వేళ. మనుషులు, మనుషులు. రోడ్డంతా మనుషులు. ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. భయం. ఉత్కంఠ. ఏమి జరుగుతుంది. ఆ ఆకారం మనిషి. ఆ మనిషి పేరు కోటేశు. ఆరుకుట్ల కోటేశు. కంచికచర్ల కోటేశు. ఎప్పుడో చూసిన దృశ్యమే కదూ! ముప్పై రెండేళ్లుగా కలవర పెడుతున్న దృశ్యం.

ఒక పాలేరు తెల్ల బట్టలేసుకున్నందుకు
ఒక దళితుడు తలకు నూనె రాసుకుని దువ్వుకున్నందుకు
ఒక మాదిగోడు అగ్రకులం అమ్మాయిని ప్రేమించినందుకు

కొట్టీ కొట్టీ కొట్టీ కొట్టీ అలుపు వచ్చిందాకా కొట్టి పందిరి గుంజకు కట్టేసి వంటి మీద కిరసనాయిలు పోసి చావుబతుకుల ఆటాడి నిప్పంటించారు.

గాయాలు సలుపుతున్నా గుండెల మీద
నీ పాద ముద్రల్నే కదా మోశాను
ఏం గొణుగుతున్నాడో ఏడుస్తున్నాడో పశ్చాత్తాప పడుతున్నాడో

ప్రియా! అమ్మగోరూ.. పలవరింత. ప్రేమించినందుకు శిక్ష యింతగా వుంటుందని తెలుసో తెలియదో... "నేను దొంగనని రచ్చబండ ఆరోపణ సాక్షివి నువ్వేకదా". మంటలు శరీరాన్ని కబళించి వేస్తున్నాయి.

"గుండెల్లో నువ్వంటించిన నిప్పుల కుంపటి
వంటిమీద మీ వాళ్ళంటించిన కిరసనాయిలు మంటలు
రెండింటిలో ఏది ఎక్కువ బాధ అని అడిగితే
నేను చెప్పలేను.
ప్రియా!
ఈ మంటలు నన్ను ఆలుముకుంటుంటే
నువ్వు నన్ను వాటేసుకున్నట్టే ఉంది"

చెప్పాడో లేదో! తన వాళ్ళంతా చూస్తున్నారు. భయం. నిష్క్రియాపర్వతం. అలజడి. ఆందోళన. పోలీస్‌స్టేషన్‌కి పరుగెత్తాడు. అక్కడి నుండి ఆస్పత్రికి పరుగెత్తాడు. డాక్టర్‌కి చట్టం న్యాయం గుర్తొచ్చాయి. ససేమిరా వైద్యం చేయనన్నాడు. అటు పరుగెత్తి యిటు పరుగెత్తి కుప్పకూలిపోయాడు కోటేశు. అతన్ని విజయవాడ ఆస్పత్రికి తీసుకెళ్ళారు. నాలుగు రోజుల పాటు చావుతో పెనుగులాడి చనిపోయాడు కోటేశు.

ఊరు గగ్గోలు మంది. చుట్టుప్రక్కల పల్లెలు తల్లడిల్లిపోయాయి. బతుకు భయం. భవిష్యత్ భయం. ఈ రోజు కోటేశు. రేపెవరో... కళ్ళముందు ఎందుకు కనుమరుగవ్వలేదు!

పరిటాల నుంచి వేముల జార్జిగారు కదలివచ్చారు. పక్కన తంగిరాల షద్రక్. పరిటాలంటే పరిటాలే. నైజాంను గడగడ లాడించిన పల్లె కంచికచర్లకు రెండడుగుల దూరం. కాంగ్రెస్ నాయకుల్నీ వాళ్ళనీ వీళ్ళనీ కలిశారు. డిఎస్పీకి, కలెక్టర్‌కి టెలిగ్రాములిచ్చారు. కేసు పెట్టారు. దళిత పల్లెలకు తిరిగారు. ఊరూరా తిరిగారు... డిఎస్పీ విచారణ. అప్పటి వరకూ భయం

భయంగా బతికిన వాళ్ళు ముందుకొచ్చి సాక్ష్యాలు చెప్పారు. గ్రేడింగ్ చేసే అక్కలు సాక్ష్యం చెప్పారు. నిందితులందరినీ అరెస్టు చేశారు.

అందరికీ కోర్టు యావజ్జీవ శిక్ష వేసింది. పార్లమెంటులో బాబూ జగజ్జీవన్‌రామ్ ఈ విషయమై ఆందోళనగా ఉపన్యసించారు. బీహారు దళితుల నుండి 5000 రూపాయలు పోగుచేసి తీసుకువచ్చి కోటేశు కుటుంబానికిచ్చాడు. అమెరికా పత్రికలు కూడా ఈ విషయాన్ని రాశాయి.

దిగంబర కవులు తమ మూడో సంపుటాన్ని 1968 సెప్టెంబరులో కంచికచర్ల కోటేశుకు అంకితమిచ్చారు. దీన్ని కుళ్ళు వ్యవస్థ అని పేర్కొన్నారు.

కోటేశు కుప్పకూలిన చోట యిప్పుడు అంబేడ్కర్ విగ్రహం. ఉద్యమాల తరం ఉరకలెత్తింది. ఇప్పుడెలా ఉందో తెలియదు.

స్వతంత్రం వచ్చిన తర్వాత పోలీసుల రికార్డుల్లో నమోదైన మొదటి కేసు యిదే. జాతీయ అంతర్జాతీయ స్థాయిలో సంచలనం రేపిన కేసు. యిప్పటికీ దళితకవులకు కవితా వస్తువు కోటేశు. దళిత ఆకాంక్షలకు ప్రతీక కోటేశు. అగ్రకుల భూస్వాముల బలిపీఠం మీద మాయని పచ్చినెత్తుటి మరక కోటేశు.

కంచికచర్ల మెట్ట కృష్ణలో ఉంది. అటు నల్లగొండ. ఇటు ఖమ్మం. కోస్తాలో తెలంగాణా, తెలంగాణాలో కోస్తా. అప్పుడప్పుడే వరి అన్నం తినడం నేర్చుకుంటోంది పశ్చిమ కృష్ణ. పొగాకు పంటొచ్చింది. రైతుల యిళ్ళు సంపదల లోతుల తూగుతున్నాయి. కొత్తగా డబ్బొచ్చిపడిన సంపన్న వర్గం ఒకటి తయారైంది. అహంకారం పెరిగింది. అసహనం పెరిగింది. కింది కులాల్లో కదలికల్ని సహించలేని తనం పెరిగింది.

దళితుల్లోనూ ఆత్మగౌరవ చైతన్యం మొగ్గతొడగడం మొదలైంది. నిరాశల నుండి నిస్పృహల నుండి ఒక ధిక్కార స్వభావం పెరుగుతోంది. రాష్ట్ర వ్యాప్తంగా దళితులు సంఘటితపడడం మొదలు పెట్టారు.

స్వతంత్రం వచ్చిన తర్వాత దళిత ఉద్యమానికి ఈ సంఘటనతో ఊతం వచ్చిందని చెప్పవచ్చు.

ఇన్నేళ్ళ తర్వాత యిప్పుడాలోచిస్తుంటే ఏ మలుపుకామలుపుకు యిదే గొప్పదనిపిస్తుంది కానీ వెనక్కి తిరిగి చూస్తే స్వాతంత్రోద్యమ కాలం నుండి అంతకు ముందు నుండీ కులనిర్మూలనా స్పృహ ఆంధ్రప్రదేశ్‌లో ఉంది. తెలుగులో వచ్చిన భక్తి సాహిత్యాన్ని పరిశీలిస్తే కుల వ్యతిరేకత, బ్రాహ్మణ వ్యతిరేక చైతన్యం స్పష్టంగా కన్పిస్తుంది.

నీటి పారుదల సౌకర్యం పెరగడం, వ్యవసాయం అభివృద్ధి కావడం, క్రైస్తవ మిషనరీల విద్యావ్యాప్తి, బ్రహ్మసమాజం. హిందూమత సంస్కర్తలు, జాతీయోద్యమం మొదలైన అనేక

అంశాలు అంటరాని కులాల్లో చైతన్యానికి కారణాలయ్యాయి. బ్రహ్మ సమాజం ఆశ్రమ పాఠశాలల్ని తెరవడం, వసతి గృహాలు తెరవడం, పోరంబోకు భూముల్ని దళితులకు పంచిపెట్టడం వంటి కార్యక్రమాలను చేపట్టింది. బ్రహ్మసమాజం దళిత నాయకత్వాన్ని ప్రోత్సహించింది. ఈ దశలో చైతన్యం పొంగి పొరలింది. సుంద్రు వెంకయ్య, కుసుమ వెంకట్రామయ్య, కుసుమ ధర్మన్న, జాలా రంగకవి, నక్కా చినవెంకయ్య మొదలైన దళిత నాయకులు రంగం మీదకి వచ్చారు. వాళ్ళంతా కవులు కావడం యాదృచ్ఛికం కాదు. కుసుమ ధర్మన్న రాసిన "మా కొద్దీ నల్లదొరతనమూ" అన్న పాట ఆనాటి దళిత ఆకాంక్షల్ని ప్రతిఫలించింది. నక్కా చినవెంకయ్య రాసిన 'అంటుదోషము' జాలా రంగకవి రాసిన 'అంటరానివారెవరు?', 'మాలశుద్ధి' మొదలైన కవితలు స్వేచ్ఛకోసం, సమానత్వం కోసం, ఆత్మగౌరవం కోసం, మానవత్వం కోసం దళితులు పడే తపనను వ్యక్తం చేశాయి. అప్పటికే గాంధీ ఉద్యమం బాగా ఊపందుకున్నప్పటికీ వీళ్ళు స్వరాజ్యమంటే దళితుల కులపీడన నుండి విముక్తి కూడానని చాటుకున్నారు. అప్పటికే ఆయా సంస్కర్తల ప్రయత్నాలతో పాటు మాంటేగ్ చేమ్స్ ఫర్డ్ చట్టం, మొదలైన రాజ్యాంగపరమైన సంస్కరణలు రావడంతో దళితుల్లో రాజకీయ చైతన్యం పెరిగింది.., వలసవాదుల పాలనా వ్యవస్థల్లో తమకూ ప్రాతినిధ్యం కావాలని దళితులు డిమాండ్ చేయడం మొదలుపెట్టారు. ఈ సందర్భంలో భాగ్యరెడ్డి వర్మ పాత్రను, ఆయన నాయకత్వంలో జరిగిన దళిత ఉద్యమాన్నీ చెప్పుకోవాలి.

1920,30ల నాటికి దళితులు పంచమ, 'హరిజన' అన్న పదాలను తిరస్కరించడం మొదలు పెట్టారు. తమను తాము 'ఆది ఆంధ్రు'లుగా పిలుచుకోవడం మొదలు పెట్టారు. 1927లో గూడూరు రామచంద్రరావు నాయకత్వంలో విజయవాడలో 'పంచమ మహాజన సభ'ను నిర్వహించారు. ఈ సభలో భాగ్యరెడ్డి వర్మ 'పంచమ' పదాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. దాంతో ఆ సభను "ప్రథమ ఆది – ఆంధ్ర మహాజన సభ"గా మార్చారు. స్థానిక సంస్థల్లోనూ, శాసన మండలిలోనూ ఆది ఆంధ్రులకు ప్రాతినిధ్యం కల్పించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. మాల, మాదిగ ప్రాంతాల్లో ప్రత్యేకంగా బావులు పాఠశాలలు ఏర్పాటు చేయాలని కోరింది. "ప్రథమ ఆది ఆంధ్ర మహాజన సభ" జరుగుతున్నప్పుడు వీళ్ళందరూ గుడిలోకి బలవంతంగా ప్రవేశిస్తారేమోనని భయం వేసి కనకదుర్గ గుడిని మూసేసి వుంచారంటే ఆ మహాసభ అంటేనూ, దళిత ఉద్యమం అంటేనూ ఎంతగా అగ్రకుల సమాజం, పూజారులూ భయపడ్డారో అర్థమవుతుంది.

1910 ప్రాంతం నుండీ నైజాంలోని హైదరాబాద్‌లో భాగ్యరెడ్డి వర్మ (మదారి భాగయ్య) అరిగె రామస్వామి మొదలైన వాళ్ళ నాయకత్వంలో దళిత ఉద్యమం నడిచింది. భాగ్యరెడ్డి వర్మ బ్రహ్మసమాజంలో చేరి దళితులను సమీకరించడం మొదలు పెట్టాడు. అంతర్గతంగా సంస్కరణలు జరగాలని భాగ్యరెడ్డి వర్మ స్థాపించిన మాన్యసంఘాలు కృషిచేశాయి. మద్యపాన

నిషేధం, మాంసం తినడం మానేయడం, దేవదాసీ వ్యవస్థనిర్మూలన, వివాదాలను పంచాయతీల్లో పరిష్కరించడం, బడులు, లైబ్రరీలు, భజన మండలులు స్థాపించడం మొదలైన కార్యక్రమాలను వీరు చేపట్టారు. స్త్రీల విముక్తికి ప్రత్యేకమైన శ్రద్ధతో పనిచేశారు.

తర్వాతి కాలంలో దళిత ఉద్యమం సంస్కృతీకరణకు గురైంది. అగ్రకుల సమాజాన్ని అనుకరించి వారిలాగా జీవిస్తూ వారితో కలగలసిపోవాలన్న ఆకాంక్షలు పెరిగాయి. భాగ్యరెడ్డి వర్మ సహచరుడు అరిగె రామస్వామి 'ఆది హిందు' పదాన్ని హైందవత్వానికి చిహ్నంగా చేసి హిందూ మతానికీ, దళిత సంస్కృతి, దళితేతరులకూ మధ్య పోలికలు తెచ్చి హైందవీకరణ వైపు మొగ్గుచూపాడు. ఆ తర్వాత గాంధీవైపుకు కాంగ్రెస్ వైపుకు వెళ్ళాడు. భాగ్యరెడ్డి వర్మ 'ఆది హిందూ' అన్న పదాన్ని దళితులు ఈ దేశానికి మూలవాసులు అన్న అర్థంలో తీసుకున్నాడు. ఆ తర్వాత ఆయన బౌద్ధాన్ని స్వీకరించి స్వతంత్ర అస్తిత్వాన్ని నిలబెట్టుకున్నాడు.

1930ల నాటికి అంబేద్కర్ ప్రభావంలో ఆంధ్రలో దళితులు సంఘటితపడడం మొదలు పెట్టారు. అదే కాలంలో గాంధీ హరిజనోద్ధరణ కూడా ఊపందుకుంది. హరిజన సేవక సంఘాలు ఏర్పడి దళితవాడల్ని ఊడ్వడం, వాళ్ళను మాంసం తినొద్దనీ, మద్యం తాగొద్దనీ హితబోధ చేయడం వంటి కార్యక్రమాలు చేపట్టారు. అయితే ఆచరణలో హరిజనుల పట్ల ఎంత ప్రేముందో త్వరలోనే తెలిసిపోయింది. మాటల్లో హరిజనోద్ధరణ వల్లిస్తూ చేతల్లో మాత్రం కుల వివక్షను వదలించుకోలేక పోయారని అనేక సంఘటనలు రుజువు చేశాయి. దళిత పట్టభద్రుడిని హరిజన సేవక సంఘం వారు కూడా సభ్యులుగా ఉన్న స్కూలు కమిటీలో చేర్చుకోడానికి నిరాకరించడం, అనంతపూర్ జిల్లాలో ఒక గ్రామంలో దళితుల్ని చెరువులో నీళ్ళు తీసుకోనీయకుండా వీళ్ళే అడ్డుపడి, హద్దుమీరితే సాంఘిక బహిష్కరణను విధిస్తామని బెదిరించారు. ఆ సంఘటన "మాలపిల్ల" సినిమాలో దృశ్యాన్ని చిత్రీకరించారు. 1930ల కాలంలో దళిత జర్నలిజం అభివృద్ధి చెందింది. కుసుమ ధర్మన్న నడిపిన జయభేరి పత్రిక, బి.ఎస్.మూర్తి నడిపిన నవజీవన మొదలైన పత్రికలు రాష్ట్ర వ్యాప్తంగా దళితులపై జరుగుతున్న అత్యాచారాలను వెలుగులోకి తెచ్చాయి. గాంధీ పద్ధతిలో అమలవుతున్న హరిజనోద్ధరణ ఎంత అన్యమనస్కంగా జరుగుతుందో కూడా ఈ పత్రికలు ఎండకట్టాయి.

గాంధీ హరిజనోద్ధరణ అలా సాగుతుండగానే ఆ ప్రభావంతో దళిత ఉద్యమ కార్యక్రమాలు నడిచినప్పటికీ, గాంధీ భావానికీ, జాతీయ వాదానికీ సమాంతరంగా ఆది హిందూ మహాసభ నాయకత్వం దళిత ఆకాంక్షలకూ, అభివృద్ధికీ అనుగుణంగా స్వతంత్ర దళిత ఉద్యమాన్ని రూపొందించి నడిపించింది. అంబేద్కర్ ఆంధ్ర రాష్ట్ర పర్యటన ఆ ప్రయత్నాలకు మరింత ఊతాన్నిచ్చింది.

స్వరాజ్యం అంటే తెల్లదొరల పాలన నుండి మాత్రమే విముక్తి కాదు. నల్లదొరల పాలన

నుండీ, కులం అణచివేతల నుండీ, అంటరానితనం, అవమానాల నుండీ విముక్తి కావాలని దళిత నాయకత్వం స్పష్టంగా కరాకండీగా తేల్చి చెప్పింది.

స్వతంత్రానికి పూర్వం, అటు తర్వాత ఈ ఉద్యమ ప్రభావం దళిత జీవితాలపైన ఎంతగానో ఉంది. వేముల కూర్మయ్య, బి.ఎస్. మూర్తి, కుసుమ ధర్మన్న మొదలైన ఆది ఆంధ్రమహాసభ నాయకులందరూ దళితుల విద్యకు కూడా ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. మొదటి తరం పట్టభద్రులు న్యాయవాదులు, ఉద్యోగులు దళితుల నుండి రావటానికి దోహదపడ్డారు.

భాగ్యరెడ్డి వర్మ, కుసుమ ధర్మన్న, జాలారంగ స్వామి, బి.ఎస్.మూర్తి, వేముల కూర్మయ్య వంటి వారు నడిపిన ఉద్యమాన్ని గానీ, వారు సృష్టించిన సాహిత్యాన్ని గానీ, వారు స్థాపించిన పాత్రికేయ విలువలు గానీ యిప్పటి కొలమానాలతో కొలచి అంచనా కట్టడానికి వీలు లేదు. సాహసంలో గానీ, ధిక్కారంలో గానీ అవి దేనికన్నా తక్కువ కావు. ఆ చారిత్రిక సందర్భంలో ఆ ప్రయత్నాలు, ఆ సాహిత్యం ఆనాటి దళిత ఆకాంక్షల్ని ప్రతిఫలించాయి. దళిత ఉద్యమమూ, దళిత సాహిత్యోద్యమమూ చేతిలో చేయివేసుకొని నడిచాయి. ఉద్యమ నాయకులే కవులుగా నాటి నుండీ కొనసాగారు.

జాతీయోద్యమం పైనుండి వలసపాలనను వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తే దళిత ఉద్యమం కిందనుండి అన్ని రకాల అణచివేతలకు వ్యతిరేకంగా ఉద్యమించింది.

ఆ తర్వాత స్వతంత్రం వచ్చింది. ఒక అద్భుతమైన రాజ్యాంగం వచ్చింది. స్వేచ్ఛ, సమానత్వాలను అందరికీ అందించడం తన కర్తవ్యంగా ప్రకటించింది. నెహ్రూ ప్రధానమంత్రిగా ఎన్నికైన తొలి ప్రభుత్వం అన్ని అవరోధాలనూ దాటి 'అభివృద్ధి కోసం' పని చేయడానికి అంకితమవుతానని ప్రకటించుకొంది.

ఈ రోజు నుండీ మనం వైరుధ్యాల ప్రపంచంలోకి అడుగు పెడుతున్నామనీ ప్రజాస్వామిక విలువలు కలిగిన రాజ్యాంగం, ప్రజాస్వామిక రాజకీయాలు ఒకవైపునా, భూస్వామ్య సామాజిక సంబంధాలు, మరోవైపున వున్న సమాజంలోకి అడుగుపెడుతున్నామని డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఆనాడే హెచ్చరించారు.

భారత రాజ్యాంగం షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు తెగల అభ్యున్నతి కోసం ఎన్నో అవకాశాలను కల్పించింది. అంటరానితనాన్ని ఏ రూపంలో ఆచరించినా అది శిక్షార్హమైన నేరంగా ప్రకటించింది. వెనుకబడిన తరగతులు, ప్రత్యేకించి దళిత వర్గాల విద్య, ఆర్థిక అభివృద్ధికి చర్యలు చేపట్టవలసిందిగా ప్రభుత్వాన్ని నిర్దేశించింది.

భారత రాజ్యాంగంలోని ప్రగతి శీలమైన అంశాలన్నీ సూక్ష్మంగా చూస్తే అంబేద్కర్,

స్థూలంగా దళిత ఉద్యమం సాధించిన విజయాలే అని చెప్పుకోవడం ఏ మాత్రం అతిశయోక్తి కాదు. ఆనాటి నుండీ ఒక కొత్త వైరుధ్యం దేశంలో ప్రారంభమైంది. దళితుల ఆకాంక్షలకీ, ఆధిపత్యకుల సమాజానికి మధ్యనున్న వైరుధ్యం రాజ్యాంగ స్ఫూర్తికీ, అగ్రకుల రాజకీయాలకీ మధ్య వైరుధ్యంగా మారింది. పౌర సమాజంలో ఆధిపత్యం వహిస్తున్న అగ్రకులాలవారే దేశ నాయకులుగా, ప్రభుత్వాధినేతలుగా వచ్చారు. రాజ్యాంగ స్ఫూర్తిని త్రికరణశుద్ధిగా అమలు చేస్తామని ప్రతిజ్ఞ చేశారు. అయితే వారు ప్రాతినిధ్యం వహిస్తున్న కులాల ప్రయోజనాలు, వారు ప్రతిజ్ఞ చేసిన రాజ్యాంగ స్ఫూర్తి రెండూ పరస్పరం ఖండించుకొనే అంశాలు కావడంతో దళితులకు విద్రోహాలు, వాగ్దాన భంగాలు తప్పలేదు.

స్వతంత్రం వచ్చిన పరిస్థితుల్లోనూ, ఆ తర్వాతా ఆంధ్రలో ఎన్నో సామాజిక మార్పులు సంభవించాయి. కులాల బలాబలాలు మారడం మొదలయ్యింది. కొన్ని కులాలు పైకి ఎగబాకాయి. అప్పటి వరకూ బ్రాహ్మణ వైశ్య కులాల ప్రాబల్యం కొనసాగింది. వారి సాంస్కృతికాధిపత్యమే ఆంధ్రలో రాజ్యమేలింది. ఆ తర్వాత ఆంధ్రాలోని పొరుగు రాష్ట్రాలలోనూ చెలరేగిన బ్రాహ్మణ వ్యతిరేక, కుల వ్యతిరేక పోరాటాల ఫలితంగా బ్రాహ్మణ – వైశ్య ఆధిక్యత తగ్గుముఖం పట్టింది. కమ్యూనిస్టు ఉద్యమాలు, రైతాంగ ఉద్యమాలలోకి బ్రాహ్మణేతర ప్రజానీకం ఆకర్షితులయ్యారు. కమ్మ, వెలమ, రెడ్డి, రాజు, కాపు వంటి బ్రాహ్మణేతర కులాలు బలపడ్డాయి. భూమిపైన కొత్తగా వారికి ఆధిపత్యం వచ్చింది. దాంతో భూస్వామ్య సంబంధాలపైన ఆధిపత్యం వచ్చింది. దళితులపై, యితర వెనుకబడిన సాలె, చాకలి, కుమ్మరి, మంగలి.., తదితర కులాలపైన వారికి ఆధిపత్యం పెరిగింది. కొత్తగా అగ్రకులాల స్థాయిని పొందిన ఈ పైన చెప్పిన కులాల వారే స్వతంత్రానంతరం ఆంధ్రప్రదేశ్ దళితులపైన జరిగిన అత్యాచారాలకూ, ఆర్థిక దోపిడికి కారణమయ్యారు. వీరి అహంకారపు ఆధిపత్యానికి వెనుకబడిన తరగతుల వారు కూడా బలయ్యారు.

1991 జనాభా లెక్కల ప్రకారం 665.08 లక్షల మంది రాష్ట్ర జనాభాలో 105.92 లక్షల మంది షెడ్యూల్డు కులాల వారు (15శాతం) ఉన్నారు. 1984 జనాభా విశ్లేషణ ప్రకారం షెడ్యూల్డ్ కులాల వారు 15 శాతం (60 కులాలు), వెనుకబడిన కులాల 44.5 శాతం (93 కులాలు) ఉన్నారు. రెడ్డి కులస్తులు 9 శాతం, కమ్మకులస్తులు 3శాతం, బ్రాహ్మణ, వైశ్యకులాలు సుమారు 5శాతం ఉన్నారు. అయితే అధికారం, వనరుల పంపిణీని పోల్చుకుంటే జనాభాలో 12 శాతం ఉన్న కమ్మ, రెడ్లు దాదాపు రాష్ట్ర రాజకీయాలను శాసిస్తూ ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నారు. కాంగ్రెస్ పార్టీలో రెడ్డి కులస్తులు, కమ్మకులస్తులు నాయకత్వం స్థానంలో ఉన్నారు. ఆ తర్వాత పుట్టిన తెలుగుదేశం పార్టీ కమ్మ కులస్తుల పార్టీగానే కొనసాగుతోంది. భూమిపైన ఆధిపత్యం విషయానికొస్తే 12శాతం ఉన్న అగ్రకులాల వారి చేతిలో 63 శాతం

సాగుయోగ్యమైన సారవంతమైన భూమి ఉంది.

స్వతంత్ర భారతం దళితులకిచ్చిన వాగ్దానాలను నెరవేర్చలేక పోయింది. మరింతగా పరాధీనత పెరిగింది. స్వతంత్ర ఫలాలు దళితులకు అందలేదు. కొత్తగా సంపన్నులైన వర్గాలు దళితులపైన మరింతగా అత్యాచారాలకు పాల్పడడం, కుల వివక్షా రూపాలను వికృతమైన స్థాయిలో అమలు చేయడం కొనసాగించారు. దళిత ఆకాంక్షలు ప్రతినిత్యం చితికి పోతూనే ఉన్నాయి.

కంచికచర్ల కోటేశు సజీవ దహనం వెనుక ఇంతటి నేపథ్యం ఉంది. ఇంతటి సామాజిక చలనం ఉంది. ఇంతటి ఘర్షణ ఉంది. ఇంతటి విద్రోహం ఉంది.

ఈ సంఘటన ఆధారంగా ఎంతో సాహిత్యం వచ్చింది. దళితుల కోసం కలంపట్టిన ప్రతి కవీ, ప్రతి రచయితా, ప్రతి పాత్రికేయుడు కంచికచర్ల కోటేశు పేరు రాయకుండా లేరు. ఈ నాటికీ దళిత కవులకూ, రచయితలకూ కోటేశు ఒక స్ఫూర్తి.

ఈ కాలంలో దిగంబర కవులతో పాటు అంతకంటే ముందే కవిత్వం, సామాజిక విశ్లేషణా వ్యాసాలు, పుస్తకాలు రాసిన సి.వి.ని చెప్పుకోకపోతే అది చారిత్రికంగా పెద్ద పొరపాటు అవుతుంది. కులవ్యవస్థను చీల్చి చెండాడుతూ అనేక రచనలు చేశాడాయన. ఫూలే ఏ విధంగానైతే పౌరాణిక సాహిత్యాన్ని భౌతిక వాద దృక్పథంతో పునర్ వ్యాఖ్యానించాడో అదే విధంగా సి.వి. తెలుగు సాహిత్యంలో మరింత స్పష్టతతో ముందుకు సాగాడు. ఆయన రాసిన 'సత్యకామ జాబిలి' ఈనాటికీ ఎంతో ఉత్తజపూరితంగా ఉంటుంది. కమ్యూనిస్టు పార్టీ సాయుధపోరాట విరమణ చేసిన తర్వాత, అభ్యుదయ రచయితలందరూ సినిమా రంగానికి వలసెళ్లిపోయిన తర్వాత సాహిత్యంలో శూన్యత ఏర్పడిందని అందరూ భావిస్తున్న తరుణంలో 'కారుచీకట్లో కాంతి రేఖ' రాసి శూన్యతను పటాపంచలు చేశాడు. ఆ తర్వాతనే దిగంబర కవులు రంగం మీదికి వచ్చారు.

సామాజిక రాజకీయ రంగంలో చూస్తే అంబేద్కర్ ఆలోచనలతో, స్ఫూర్తితో యువజన సంఘాలు నడుస్తున్నప్పటికీ, కాంగ్రెస్ 'ఆకర్షణీయమైన నినాదాల' ప్రభావంతో దళితులు ఎక్కువ మంది కాంగ్రెస్ వైపు ఉండిపోయారు. ఆ పరిమితుల్లో దళిత ఉద్యమం నడుస్తుంది. కంచికచర్ల కోటేశు హత్య దళిత సమాజాన్ని ఒక కుదుపు కుదిపింది. కోటేశు హత్య జరిగిన కొన్ని నెలల్లోనే నగ్జల్బరీ పోరాటం బద్దలైంది. ఆంధ్రలో ఆ మార్గంలో పోరాటం చెలరేగింది. నగ్జల్బరీ ఉత్తేజంతో నడిచిన పోరాటాల్లో దళితుల నాయకత్వం లేకపోయినప్పటికీ ఆ పోరాటాల్లో అత్యధికంగా పాల్గొన్నది దళితులు, ఆదివాసీలే. దళితుల పోరాటాల చరిత్ర గురించి చెప్పుకోవలసి వచ్చినపుడు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో జరిగిన ఉద్యమాలను గానీ, ఆ తర్వాత నగ్జల్బరీ ఉత్తేజంతో జరిగిన పోరాటాలను గానీ విస్మరించలేము. నగ్జల్బరీ పోరాటాలు ఉధృతంగా చెలరేగడం, దళిత ఆకాంక్షల్ని వ్యక్తం చేసే శక్తి వంతమైన ఉద్యమం

లేకపోవడంతో దళిత ఉద్యమం తాత్కాలికంగా స్తంభించిపోయినట్లయింది. అంతకు ముందు, అప్పుడూ, ఆ తర్వాత దళిత ఆకాంక్షని శక్తివంతంగా, ప్రధాన స్రవంతి పండితులకూ కవులకూ ధీటుగా, వారికంటే ఎక్కువగా వ్యక్తం చేసింది జాషువా కలం. జాషువా దళిత ఆకాంక్షలకు గొంతుక. జాషువా రాసిన గబ్బిలం దళిత మానిఫెస్టో.

1985 నాటికి రాష్ట్రంలో తెలుగుదేశం అధికారంలోకి వచ్చింది. కులాల మధ్య అంతరం మరింత స్పష్టమైంది. దళిత వర్గాల్లో అసంతృప్తి, ఆందోళన, ఆత్మగౌరవ చైతన్యం పెరగడం మొదలైంది. దళిత నాయకుల దళారీతనంపట్ల అసంతృప్తి. వామపక్షాల 'వర్గ' చైతన్యం, కులం ప్రత్యేకతలను గుర్తించకపోవడం పట్ల అసంతృప్తి పెరుగుతోంది.

**17, జులై 1985**

పచ్చని పంట పొలాలు నెత్తురుతో తడిసిపోయాయి. కత్తులు, గొడ్డళ్ళు, బరిశెలు, కరాళతాండవమాడాయి. అగ్రకుల అహంకారం వికటాట్టహాసం చేసింది. దళితుల్ని కమ్మదొరలు ఊచకోత కోసి చంపారు. స్త్రీలను గాయపర్చారు. రేప్ చేశారు. మంచినీళ్ళ చెరువులో పశువును కడగడాన్ని ఒక దళితుడు ప్రశ్నించిన సంఘటన యింత దారుణానికి దారి తీస్తుందంటే నమ్మరు కానీ నిజం. దాని వెనుక దళితుల్లో పెరుగుతున్న ఆత్మగౌరవ చైతన్యం పట్ల తీవ్రమైన ద్వేషం ఉంది. దళితులు చదువుకోవడం పట్ల వ్యతిరేకత ఉంది. ఎక్కడ ఉండవలసిన వాళ్ళను అక్కడే ఉంచాలన్న అగ్రవర్ణపు అహంకార నిర్ణయం ఉంది.

ఇది జరిగే నాటికి సాహిత్య రంగంలో విరసం ధోరణి అధికారిక ధోరణిగా చెలామణీ అవుతుంది. మాస్టార్జీ దళిత కళామండలి పని చేస్తున్నది. దళిత జీవితంలోని అనేక అంశాలపైన ఆయన పాటలు కట్టారు. కానీ సాంస్కృతిక రంగంలో జననాట్యమండలి, గద్దర్‌ల ప్రభావం తారాస్థాయిలో ఉంది.

దళిత ఉద్యమంలో శెట్టి కన్నమరాజా, పేర్లి భూషణం, వామన దాసు మొదలైన వారు నాయకులుగా చెలామణీ అవుతున్నారు.'దళిత మహాసభ' అనే ఒక సంస్థ అప్పటికే ఉనికిలో ఉంది. కారంచేడు సంఘటన జరిగే నాటికి ఆ దళిత మహాసభే నాయకత్వం వహించింది. అయితే కొత్త అంశం ఏమిటంటే పౌర హక్కుల సంఘంలో పని చేస్తున్న బొజ్జా తారకం, కాంగ్రెస్ పార్టీలో పని చేస్తున్న సలగల రాజశేఖర్, హేతువాద సంఘంలో పనిచేస్తూ పొన్నూరు సంస్కృత కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న కత్తి పద్మారావు, తేళ్ళ జడ్సన్ చీరాలలోని 48 మాల పల్లెల్లోని యువకులు, చుట్టుపక్కల మాదిగ పల్లెల యువకులు, తెనాలి, పొన్నూరు మాలమాదిగ యువకులు ఉద్యమంలో కలిశారు. దాంతో అంతకు ముందు ఉద్యమాలు నడిపిన తీరుకు భిన్నమైన స్వరంలో దళిత ఉద్యమం మొదలైంది. పేర్లి భూషణం మొదలైనవారి నాయకత్వంలో నడిచిన 'దళిత మహాసభ'నే కారంచేడు ఉద్యమం స్వంతం చేసుకొంది.

చీరాలలో బాధితుల శిబిరం ఏర్పాటయ్యింది. బహిరంగ సభలు, నిరసన ప్రదర్శనలు జరిగాయి. రాష్ట్ర వ్యాప్తంగా దళితులు కదంతొక్కారు. ప్రతి జిల్లాలో కారంచేడు నినాదం మారుమోగింది. 1985 సెప్టెంబర్ 1వ తేదీన చలో చీరాల పిలుపుకు లక్షలాది మంది దళితులు తరలివచ్చారు. 1985 అక్టోబర్‌లో ఢిల్లీలో ధర్నా జరిగింది. 1985 సెప్టెంబర్ 10వ తేదీన దళిత ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న సలగల రాజశేఖర్, కత్తి పద్మారావులను అరెస్టుచేసి అక్టోబరు 30వ తేదీన విడుదల చేశారు. 1985 నవంబర్6వ తేదీన హైదరాబాద్‌లో బొజ్జాతారకం అధ్యక్షుడుగా కత్తి పద్మారావు కార్యదర్శిగా దళిత మహాసభ ఏర్పడింది.

కారంచేడు నెత్తుటి మంటలు లేవనెత్తిన అనేక ప్రశ్నల్ని స్వంతం చేసుకొని దళిత మహాసభ ఏర్పడింది. ఆంధ్రలో దళిత ఉద్యమ చరిత్రలో కారంచేడు సంఘటన ఒక గొప్ప మలుపు అని చెప్పవచ్చు. కారంచేడు ఉద్యమం ప్రభావం అన్ని రాజకీయ పార్టీలపైనా, అన్ని ఉద్యమాలపైనా పడింది. అన్ని ఉద్యమాలూ తమను పునర్నిర్వచించుకోవలసిన పరిస్థితి దళిత ప్రశ్న కల్పించింది.

జననాట్యమండలి నాయకుడు గద్దర్ 'దళిత పులులమ్మా' పాట రాశాడు. దళిత ఉద్యమం ప్రతి సందర్భంలో ఆటపాటను ఉపయోగించుకొన్నది. కలేకూరి ప్రసాద్ విరసం, జననాట్యమండలి సహచరులతో కలిసి 'కారంచేడు ఒగ్గు కథరాశాడు'. అనేక మంది కవులు, కళాకారులు కారంచేడు సంఘటనకు స్పందించారు.

గొప్ప ఉపన్యాసకుడిగా కత్తి పద్మారావు నిర్వహించిన పాత్ర గణనీయమైనది. దళితుల హృదయాలను స్పృశించే ఉపన్యాసాలను ఆయన పల్లె పల్లె తిరిగి ఇచ్చారు. ఉపన్యాసాన్ని కళగా అభివృద్ధి చేశాడు. దళిత ఉద్యమానికి నాయకత్వం వహించిన బొజ్జాతారకం, కత్తి పద్మారావులు ఇద్దరూ కవులే కావడం కూడా ఇక్కడ యాధృచ్ఛికంకాదు. ఆనాడు కత్తిపద్మారావు కవిత్వానికి ఈనాడు ఆయన రాస్తున్న కవిత్వానికీ ఎంతోతేడా ఉంది. కారంచేడు సంఘటన జరిగి దళిత ఉద్యమం ఎంతో ఊపుతో నడుస్తూ కవుల్నీ, కళాకారుల్నీ ఉత్తేజితపరుస్తున్న రోజుల్లో ఆయన రాసిన కవిత్వం, యిప్పటిలో ఆయన రాస్తున్న కవిత్వంలో పోల్చుకుంటే ఎంతో పేలవంగా ఉంది. శ్రీశ్రీని పేలవంగా అనుకరించినట్లుంది. శ్రీశ్రీ.., విరసం ప్రభావం ఆయనపైనా, అప్పట్లో దళిత కవిత్వం రాసిన వారెవరిపైనా లేదని చెప్పలేం.

అయితే ఆయన నాయకత్వంలో జిల్లాల్లో ఎంతో మంది నాయకులు ఎదిగారు. కష్టాలను లెక్క చెయ్యక త్యాగపూరితంగా పనిచేసే నాయకులు ప్రతి జిల్లాలో ఎదిగివచ్చారు. దానికి తోడు అప్పటికే, ఆ తర్వాత ఏర్పడిన అంబేడ్కర్ యువజన సంఘాలన్నీ దళిత మహాసభ పిలుపునీ, ఎజెండానీ స్వంతంచేసుకొని పని చేశాయి.

దళిత ఉద్యమం ప్రభావంతో వామపక్ష ఉద్యమాలలో కూడా చర్చ మొదలైంది. 1989లో

పశ్చిమగోదావరి జిల్లా పిప్పరలో రాజులు మాల మాదిగలపైన దాడి చేసిన సందర్భంలో 1991లో తిమ్మసముద్రం (ప్రకాశంజిల్లా)లో మాలల్నీ, మాదిగల్నీ మరో 13 వెనుకబడిన కులాల కుటుంబాలనూ సాంఘిక బహిష్కరణ చేసిన సందర్భంలోనూ దళిత మహాసభ గొప్ప ఉద్యమాలను నడిపింది.

అయితే ఆ తర్వాత దళిత ఉద్యమం చీలిపోయింది. కారణాలు పెద్దగా ఏమీ లేవు. అంతకు ముందు నక్సలైట్ ఉద్యమం నుండీ కమ్యూనిస్టు ఉద్యమం నుండీ దళిత ఉద్యమం ఏం నేర్చుకుందో తెలియదు కానీ సైద్ధాంతిక విభేదాలు ఏమీ లేకుండానే అవసరం లేకుండానే వ్యక్తిగత కారణాలతో చీలిపోవడం మాత్రం బాగా నేర్చుకుంది.

ఆ తర్వాత 1991 ఆగస్టు 6వ తేదీన చుండూరులో రెడ్లు మాలపల్లిపైన దాడి చేసి కర్కశంగా ఊచకోత కోసేంత వరకూ దళిత మహాసభ చీలిక వర్గాలన్నీ నిష్క్రియాపరంగానే ఉన్నాయి. నామమాత్రమపు సభలు, ఉపన్యాసాలకే పరిమితమయ్యాయి. కారంచేడు ఉద్యమం తర్వాత దళిత రక్షణ, ఆర్థిక అభివృద్ధి అనే రెండు అంశాల దళిత ప్రణాళిక ఎన్నో వాగ్దానాలు చేసింది. ఆ రెండు కారణాల్లో (దళితుల రక్షణ, దళితుల ఆర్థిక అభివృద్ధి) దళితుల అభివృద్ధి కోసం ఒక ఉద్యమంగా ఎదగవలసిన దళిత మహాసభ అత్యాచారాల సంఘటనలు జరిగినప్పుడు కొన్ని డిమాండ్లతో ఆందోళన చేపట్టడం వరకే పరిమితమై పోయింది. దళిత జీవితం ముందుకు తెచ్చిన మహత్తరమైన ప్రశ్నలతో ఒక సమగ్రమైన ఉద్యమంగా ఎదగవలసిన దళిత ఉద్యమం ఆందోళనల స్థాయికి కుంచించుకుపోయింది. కారంచేడు ఉద్యమం, చుండూరు ఉద్యమం అని పిలుచుకోవడంలో అర్థం అదే. 1991లో మళ్ళీ చుండూరు సంఘటన జరిగిన తర్వాత మళ్ళీ దళిత ఉద్యమం ఊపందుకుంది. యూత్ కాంగ్రెస్‌లో పని చేస్తున్న ఎ.వై. ప్రభుదాసు, యం.సి.పి.ఐలో పని చేస్తున్న వినయ్‌కుమార్, ఐకఫ్‌లో పని చేస్తున్న బి.ఎం.లీలాకుమారి, దారాగోపి, దుర్గం సుబ్బారావు చుండూరు ఉద్యమానికి ముందు కత్తిపద్మారావుతో కలిశారు.

ఇదే కాలంలో విరసంలో పని చేస్తున్న బి.ఎస్.రాములు, ఐ. రామచంద్రయ్య, సాహు తదితరులు దళిత చైతన్యంతో రాయడం మొదలుపెట్టారు. జనసాహితిలో పని చేస్తున్న ఉ.సా. లాంటి వారు దళిత చైతన్యంతో రాయడం మొదలు పెట్టారు. పీపుల్స్ వార్ కార్యదర్శిగా పని చేసి, విరసం రచనాశైలికి ఆద్యుడుగా ట్రెండ్ సెట్టర్‌గా గొప్ప కవిత్వాన్ని రాసిన శివసాగర్‌గా ప్రసిద్ధుడైన కె.జి.సత్యమూర్తి దళిత శిబిరంలోకి వచ్చాడు. చుండూరు సంఘటన స్పందనతో ఎంతో కవిత్వం, సాహిత్యం, వ్యాసాలు వచ్చాయి.

అయితే రచయితలకూ, దళిత ఉద్యమానికీ సమన్వయం లేకుండా పోయింది. ఉద్యమం దారిన ఉద్యమం, రచయితల దారిన రచయితులు తమ పని తాము చేసుకుపోయారు.

కత్తిపద్మారావు రకరకాల రచనలు చేసినప్పటికీ దళిత సాహిత్యోద్యమంలో భాగం కావడంగానీ, దళిత సాహిత్యోద్యమానికి దోహదపడడం కానీ లేకుండా వ్యక్తిగత ప్రయత్నం లాగే మిగిలిపోయింది. దళిత రచయితల సంఘం అనే పేరుతో ఒక సంఘాన్ని ప్రకటించినప్పటికీ దానికి పనేం లేదు. అప్పటికి దళిత స్పృహతోరాస్తున్న రచయితలెవరూ దానితో మమేకం కాలేదు. ఆ తర్వాత బి.ఎస్.రాములు, సాహు, మాస్టార్జీ, ఉ.సా. మొదలైన వాళ్ళు దళిత రచయితలచే కళాకారుల, మేధావుల ఐక్యవేదికను ఏర్పాటు చేశారు. ఈ కాలంలో కంచ ఐలయ్య చేసిన కృషిని తక్కువ చేయలేము. అయితే త్వరలోనే ఐక్యవేదిక నిష్క్రియాపర్వతంలోకి కూరుకుపోయింది. సాహు ఆకస్మిక మరణం తీరని లోటుగా మిగిలిపోయింది. 93-94 ప్రాంతానికి దళిత సాహిత్యోద్యమం తారాస్థాయికి చేరుకుంది. కోదాడ దళిత సాహిత్య సదస్సు ఎంతో భవిష్యత్తును వాగ్ధానం చేసింది. ఆ తర్వాత రంగం మీదికి వచ్చిన లక్ష్మీ నరసయ్య చేసిన కృషి గొప్పది. కమ్మ కులానికి చెందిన త్రిపురనేని శ్రీనివాస్ బతికున్నంత కాలం ఆంధ్రజ్యోతి దళిత సాహిత్యానికి వేదిక అయ్యింది. శ్రీనివాస్ బతికున్నంత కాలం లక్ష్మీనరసయ్య ఆంధ్రజ్యోతిలో సీరియల్‌గా వ్యాసాలు రాశారు. సతీష్‌చందర్, ఎండ్లూరి సుధాకర్, పైడి తెరేష్‌బాబు, మద్దూరి నగేష్‌బాబు లాంటి వాళ్ళు రంగం మీదికి రావడంతో దళిత అభివృద్ధికి పదును తేలింది. విరసం ధోరణిలో గొప్ప కవిగా పేరొందిన శివసాగర్ పైన కూడా వీరి ప్రభావం పడిందంటే వీళ్ళెలాంటి గొప్ప అభివ్యక్తిని చూపారో అర్థం చేసుకోవచ్చు. కత్తి పద్మారావు చుండూరు ఉద్యమం ముగిసిపోయిన తర్వాత కాలంలో రాసిన కవిత్వంపైన కూడా వీరి ప్రభావం పడిందని చెప్పవచ్చు.నల్గొండ నుండి వచ్చిన బహువచనం, మేమే. మొదలైన సంకలనాలు దళిత సాహిత్యాన్ని ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్ళాయి. దళిత సాహిత్యాన్ని పదునుగా, కొత్తగా, సజీవంగా ఉంచడంలో నల్గొండ కవులు అద్భుతమైన కృషిచేశారు. దళిత ఉద్యమం మరొక్క సారి వెనుకడుగు వేసిన తర్వాత దళిత సాహిత్యోద్యమమే దళిత ప్రశ్నను సజీవంగా ఉంచింది. దళిత ఉద్యమాన్ని నడిపిన నాయకులు కత్తిపద్మారావు, సత్యమూర్తి లాంటి వాళ్ళు కవులుగా కొత్తగా రాయడం మొదలు పెట్టిన వారిని అనుసరించారు. ఒక దశలో దళిత ఉద్యమ ఎజెండాకీ, దళిత కవిత్వం ఎజెండాకీ సంబంధం లేకుండా పోయింది. ఎన్నో వాగ్దానాలనీ, ఎంతో భవిష్యత్తునూ వాగ్ధానం చేసి ఒక సమగ్రమైన సాహితీ సాంస్కృతిక ఉద్యమంగా ఎదుగుతుందనిపించిన ప్రయత్నం కేవలం వచన కవిత్వానికే పరిమితమై, ఆ తర్వాత వ్యక్తిగత ఇమేజ్‌ల ప్రలోభాలకు గురై బలహీనపడడం మొదలైంది. కథ, నవల, ఆత్మకథ ప్రక్రియల్లో బాగావెనుకబడింది. ఉద్యమంతో సంబంధం లేకుండా ఎంతో మౌఖికంగా ఉత్పత్తి అవుతున్న దళిత కళారూపాల్ని సమన్వయం చేయడంలో విఫలమయ్యింది. దళిత సాహితీ విమర్శ నచ్చిన వాళ్ళను పొగడడం, నచ్చని వాళ్ళని తెగడడం స్థాయికి కుదించుకుపోయింది. ఈ క్రమానికి లక్ష్మీనరసయ్యతో

పాటు మిగతా దళిత నాయకులు, దళిత కవులు, రచయితలు కూడా బాధ్యత వహించాలి.

ఇదే కాలంలో మాదిగ రిజర్వేషన్ పోరాటసమితి ముందుకు వచ్చింది. సమాజంలో దళితులకు అన్యాయం జరిగినట్లుగా దళితుల్లో మాదిగలకు మరింత అన్యాయం జరిగిందని పేర్కొంటూ, రిజర్వేషన్ ఫలితాలను మాదిగల కంటే మాలలే ఎక్కువ అనుభవించారనీ, కాబట్టి రిజర్వేషన్ కోటాను జనాభా ప్రాతిపదికగా, ఎ.బి.సి.డి.లుగా వర్గీకరించాలని ఉద్యమం మొదలయ్యింది. అంతకు ముందే కాంగ్రెస్ నాయకురాలైన సదాలక్ష్మి, ప్రస్తుతం బీజేపీ నాయకుడు వెంకటస్వామి తదితరులు వర్గీకరణ డిమాండ్ చేస్తూ వచ్చారు. దళిత మహాసభలో మాదిగలకు సరైన ప్రాతినిధ్యం లేదని, నాయకత్వం, నిర్ణయాత్మక స్థానాల్లో మాదిగలు లేరనీ ఎ.వై. ప్రభుదాస్, నాగార్జునాచార్య, ఆ తర్వాత కాలంలో పొనుగోటి కృపాకర్ (కృపాకర్ మాదిగ), నందేటి ప్రభాకర్ మొదలైన వాళ్ళు ప్రశ్నించారు.

సత్యమూర్తి గ్రూపులో పనిచేసిన మంద కృష్ణ మాదిగ, దళిత మహాసభ గుంటూరు జిల్లా కార్యదర్శిగా (అంతకు ముందు జనశక్తి) పనిచేసిన కృపాకర్ మాదిగల నేతృత్వంలో ఈ డిమాండ్‌కు ఎంతో శక్తి వచ్చింది. రాష్ట్ర వ్యాప్తంగా మాదిగలు వీరి నాయకత్వాన్ని బలపర్చారు. లక్షలాది మంది మాదిగలు వీరిని స్వంతం చేసుకొన్నారు. డిమాండ్ న్యాయమైనది కాబట్టి మిగతా ప్రజాస్వామిక శక్తులు కూడా ఈ ఉద్యమానికి మద్దతునిచ్చాయి.

పీడుతులంటే అమూర్త మనుషులు కారనీ, వాళ్ళకు స్వంత ముఖము, కులం ఉన్నాయనీ, వాటిని గుర్తించి ప్రత్యేక సమస్యలకు ప్రత్యేక పరిష్కారాలుగా ఉద్యమాన్ని నిర్మించడంలో కమ్యూనిస్టులు విఫలమయ్యారని విమర్శించిన దళిత నాయకత్వం మాదిగలు తమ ప్రశ్నను ముందుకు తెచ్చినప్పుడు ఉలిక్కిపడింది. దళితులు కూడా. అమూర్త పదం అయిపోయింది. దళితులంటే రకరకాల కులాల వారనీ, వారికి ప్రత్యేకమైన సమస్యలుంటాయనీ, ప్రత్యేకమైన సమస్యలను ప్రత్యేకంగా పరిష్కరించాలనీ గుర్తించడానికి నిరాకరించారు. మాదిగ నాయకత్వం మాలలపైన తమ దాడిని ఎక్కుపెట్టింది.

మాదిగ ఉద్యమం నుండి చైతన్యం పొందిన మాదిగ కవులు అద్భుతమైన కవిత్వం రాశారు. ఎండ్లూరి సుధాకర్, నాగప్పగారి సుందరరాజు మొదలైన వాళ్ళు ఉద్యమ ఆకాంక్షలను ప్రతిఫలిస్తూ మంచి కవిత్వం రాశారు. నాగప్పగారి సుందరరాజు కతలు బహుళ ప్రచారం పొందాయి.

దళిత కవులుగా చెలామణీ అవుతున్న వాళ్ళు మాల కవులు, మాదిగ కవులుగా చీలిపోయారు. దళిత కవులుగా తమ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో విఫలమయ్యారు. మాదిగ దండోరా ఉద్యమం రాగానే ఆ డిమాండ్ న్యాయమైనదనీ, మనం వ్యతిరేకించాల్సిన అవసరంలేదనీ, దీని వలన మనకు నష్టం ఏమీ లేదనీ ఆందోళన పడుతున్న మాలల్ని

సముదాయించి, వాళ్ళల్లో దళిత స్ఫూర్తిని నిలబెట్టాల్సిన కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో మాల కవులు విఫలమయ్యారు. మాలలు మనకు శత్రువులు కారన్న విషయాన్ని మాదిగపల్లెల్లో ప్రచారం చేయడంలో మాదిగ కవులు విఫలమయ్యారు. పల్లెల్లో మాల మాదిగలు శత్రు శిబిరాలుగా విడిపోయే పరిస్థితి ఏర్పడినప్పుడు దళిత కవులు దారుణంగా విఫలమయ్యారు. తర్వాతి కాలంలో మాదిగ దండోరా నాయకత్వం కూడా దళిత మహాసభ నాయకత్వంలాగా ఏ విధమైన సైద్ధాంతిక విభేదాలు ఏమీ లేకుండానే కేవలం వ్యక్తిగత కారణాలతోనే చీలిపోయింది. కేవలం మాదిగ దండోరా న్యాయమైన డిమాండ్‌ను వ్యతిరేకించడం కోసమే మాల మహానాడు ఏర్పడింది. అది కూడా తర్వాత చీలిపోయింది. సమూహాలకు సమూహాలు లక్షలాది మంది మాలలు, మాదిగలు కదలబారుతూనే ఉన్నారు. కానీ దళితులపైన జరుగుతున్న అత్యాచారాలు గానీ, అస్పృశ్యతా లోపాలు గానీ, వివక్షగానీ పోలేదు. మాదిగ దండోరా ఉద్యమం కేవలం వర్గీకరణ డిమాండ్‌కే పరిమితమైంది. వేంపెంటలో దుర్మార్గమైన మారణకాండ జరిగితే దానిపైన చెప్పుకోదగ్గ ఉద్యమమే జరుగలేదు. మాల మహానాడు పుట్టుకే దళిత చైతన్యానికి ఒక వక్రీకరణ. మాల యువకులకు ఉరిపడినప్పుడుగానీ, తోట త్రిమూర్తులు మాల యువకులకు శిరోముండనం చేసినప్పుడుగానీ వీళ్ళు ఏవీ చేయలేదు. ఇప్పటికే ఎన్నో మాల పల్లె భూమిలేక, రక్షణ లేక, క్షణ క్షణం భయంతో, అవమానాలతో మాలలు బతుకుతున్నారు. వారి కోసం మాల మహానాడు చేసిందేమీ లేదు. మాదిగ దండోరా కూడా మిగతా మాదిగ సమస్యల్ని పట్టించుకోలేదు. రిజర్వేషన్ అమలుకు కేంద్రంగా ఉన్న ప్రభుత్వ రంగమే మూసుకు పోతుంటే కేవలం ఉద్యమాన్ని రిజర్వేషన్ పైనే కేంద్రీకరించడం అన్యాయం.

మొత్తం మీద మాదిగ దండోరా ఉద్యమం లేవనెత్తిన ప్రశ్నలు అద్భుతమైనవి. దళిత ఉద్యమం సమాఖ్య స్వభావంతో, సమగ్రమైన డిమాండ్లతో ముందుకు పోవలసిన అవసరం నానాటికి స్పష్టమవుతుంది.

**దళిత రాజకీయోద్యమం**

తొలినాటి నుండీ, దళిత సమాజంలో రూపొందిన నాయకత్వాన్ని ఆకర్షించడానికీ, తమలోకి చేర్చుకోడానికి పాలకపార్టీలు వలలు విసురుతూనే ఉన్నాయి. రిజర్వేషన్ల వల్ల 'దొరగారి పాలేర్లు'గా ఉన్న నాయకులను మినహాయిస్తే, దళిత ఉద్యమాలను నడిపి నాయకులుగా ఎదిగిన వారిని ఏదో రూపంలో పాలకపార్టీలు ఆకర్షించాయి.

పాలక పార్టీలకూ, పాలక రాజకీయాలకూ ప్రత్యామ్నాయంగా దళిత రాజకీయాలను ముందుకు తీసుకెళ్ళి దళిత రాజ్యాధికారాన్ని సాధించాలనే ఉద్దేశంతో ప్రయత్నాలు జరుగుతున్నాయి. షెడ్యూల్డు కులాల సమాఖ్య, బొజ్జా అప్పలస్వామి గారు, ఆనందబాబు

మొదలైన వాళ్ళూ, రిపబ్లికన్ పార్టీ ఎంతో కాలంగా పనిచేస్తోంది. అయితే అధికారాన్ని హస్తగతం చేసుకోవడంలో అది చూపించిన ప్రభావం తక్కువే అని చెప్పవచ్చు. కత్తి పద్మారావు ఉద్యమంలోకి వచ్చిన తర్వాత 'పేద ప్రజల పార్టీ' ప్రయోగం దారుణంగా విఫలమైంది. బి.ఎస్.పి. ముందే రాష్ట్రంలో ప్రవేశించినా, ఉత్తరప్రదేశ్‌లో అధికారాన్ని స్థాపించిన తర్వాత 1994లో బి.ఎస్.పి. ప్రభంజనం రాష్ట్రంలో బలంగా వీచింది. ఒక దశలో అధికారాన్ని హస్తగతం చేసుకొంటాం అనేంతగా కాన్షీరామ్ ప్రభావం రాష్ట్రంలో కన్పిస్తోంది. అయితే నాయకుల దళారీతనం, గ్రామాల్లో దళితుల పైన పట్టులేకపోవడం, అనుభవరాహిత్యంతో ఆ ప్రయత్నం విఫలమయ్యింది.

బి.ఎస్.పి. నుండి బయటికి వచ్చిన సత్యమూర్తి స్థాపించిన బి.ఆర్.పి. పెద్దగా ప్రభావం చూపలేదు. ఆ తర్వాత సత్యమూర్తి నుండి చీలిపోయిన పార్వతి, గౌతమ్‌ల వర్గంకూడా పెద్ద ప్రభావం చూపలేదు. దళిత రాజకీయోద్యమం సమాఖ్య స్వభావంలో ముందుకు నడవాలని కృష్ణమాదిగ అధ్యక్షుడిగా మహాజన్ ఫ్రంట్ ఏర్పడింది. అయితే అది పని మొదలుపెట్టే నాటికే నాయకుల్లో లుకలుకలు స్పష్టంగా కన్పించాయి. బి.ఎస్.పి. ప్రయోగం నుండి ఏ గుణపాఠాలూ అది నేర్చుకోలేదు. సమాఖ్య స్వభావంలో నడవాలన్న ఒక మంచి లక్షణం తప్ప మరేమీ మిగల్చని విదూషకత్వ పునరావృతంగా మహాజన ఫ్రంట్ మిగిలింది. సమాఖ్య అంటే వ్యక్తుల కలయిక కాదనీ, సమూహాల కలయిక అనే విషయాన్ని గుర్తించి అమలు చేయలేదు. ఎన్నికలే పరమావధి అయ్యింది. దాంతో దళిత రాజకీయోద్యమ వైఫల్యం స్పష్టంగా కన్పిస్తుంది.

దళితులు స్వేచ్ఛగా, స్వతంత్రంగా ఓటు వేయగలగాలంటే గ్రామాల్లో పరాధీనత పోవాలి పరాధీనత పోవాలంటే దళితులకు భూవసతి, ఆర్థికాభివృద్ధీ పెరగాలి. నిజమైన రాజ్యాధికారం గ్రామాల్లో పొలం గట్ల దగ్గర ఉంది. అక్కడ సంబంధాల్లో మార్పు రాకుండా ఏ రాజకీయోద్యమమూ విజయవంతం కాదు. కమ్మవారు రాజ్యాధికారాన్ని సాధించిన క్రమాన్ని దళిత రాజకీయోద్యమం పాఠంగా స్వీకరించాలి.

దశ రాజ్యాధికార దశ కాబట్టి మిగతా అంశాలకు ఉద్వాసన చెప్పడం కన్పిస్తుంది. భూమి కోసం, ఆత్మగౌరవంకోసం, భుక్తికోసం, గౌరవ ప్రదమైన జీవితం కోసం జరిగే పోరాటాల్లో దళతులు పాల్గొని, నిలబడకపోతే రాజకీయంగా వెనకబడి వుంటారనే విషయాన్ని అర్థం చేసుకొని దళిత రాజకీయోద్యమం నడవాలి. ఆ ప్రయత్నం యింకా మొదలు కావాల్సి ఉంది.

**నాలుగు రోడ్ల కూడలిలో....**

దళిత ఉద్యమం – దళిత సాహిత్యోద్యమం ఇవేళ అరుదైన నాలుగు రోడ్ల కూడలిలో నిలబడి ఉంది. దళిత జీవితం లేవనెత్తిన అనేక ప్రశ్నలు అపరిష్కృతంగానే మిగిలి ఉన్నాయి.

1. భూమిపైన, వేతనం కోసం దళిత హక్కులు
2. జీవనాధార వనరులపైన దళిత హక్కులు
3. దళిత స్త్రీలు–సమానత్వం సమస్య
4. ఎస్సీ రిజర్వేషన్లు – ఉద్యోగాలు
5. ప్రాణ రక్షణ – భద్రత హక్కు

ఈ హక్కులను దళిత ఉద్యమం ఎజెండాలోకి తీసుకొని ఒక సమగ్రమైన ఉద్యమాన్ని నిర్మించవలసిన అవసరం ఉంది. దళిత స్త్రీ విముక్తికి ఉద్యమం యింకా మెరుగవలేదు. దళిత కులాల్లో మాల, మాదిగలు తప్ప మిగతాకులాల వారి సమస్యలు యింకా ఎజెండాలోకే రాలేదు. అన్నింటిని కలుపుకొని, అన్ని కులాల ఆకాంక్షలకు ప్రాతినిధ్యం వహించే సమాఖ్య స్వభావంతో ఉద్యమం మొదలు కావాలి. అది రాజ్యాధికార సాధన దిశగా పయనించాలి. వ్యక్తి కేంద్రంగా నడిచే రాజకీయ స్థానంలో సమిష్టి ఆకాంక్షల్ని ప్రతిఫలించే సమిష్టి నాయకత్వాన్ని రూపొందించాలి.

కుల ఐక్యత అంటే వ్యక్తులు కాదు.సమూహాల ఐక్యతకాదు. సమూహాలకు ప్రాతినిధ్యం వహించే నాయకత్వం రూపొంది అన్ని కులాల ఐక్యతను సాధించాలి.

భూ సంస్కరణల అమలు, రిజర్వేషన్ల పరిరక్షణ, విద్య, ఉద్యోగాల్లో స్థానం, అంటరానితనం రూపాల నిర్మూలన మొదలైన అంశాలతోపాటు దళితుల రక్షణ, ఆత్మగౌరవం ప్రాతిపదికగా ఉద్యమం నడిచినప్పుడే రాజకీయోద్యమం విజయవంతమవుతుంది.

దళిత స్త్రీ రచయితలుగా చల్లపల్లి స్వరూపరాణి, జాజుల గౌరి మొదలైన వాళ్ళు ముందుకు వచ్చినప్పటికీ గ్రామాల్లో అశేషంగా ఉన్న దళిత స్త్రీ కవుల్నీ, భావుకుల్నీ సమన్వయం చేసుకొని దళిత స్త్రీవాద ఉద్యమాన్ని నాయకులు ముందుకు తీసుకు వెళ్ళాలి.

**దళిత రచయితలకు సూచనలు**

1. దళిత రచయిత శాశ్వత ప్రతిపక్షంగా వ్యవహరించాలి. అధికార పీఠాలకూ, చివరకు దళిత నాయకత్వానికి కూడా నిర్మాణాత్మక ప్రతిపక్షంగా వ్యవహరించాలి.
2. కేవలం దళిత వచన కవిత్వం కాక కథ, నవల, ఆత్మకథ అభివృద్ధికి దోహదపడాలి.
3. వ్యక్తిగత ఇమేజ్‌లకన్నా సమిష్టి ఇమేజ్‌లోనే వ్యక్తులకు కూడా పేరు ప్రతిష్టలుంటాయనే విషయాన్ని గ్రహించాలి.

4. దండోరా ఉద్యమం లాంటివి తలెత్తినప్పుడు, దళిత కులాల మధ్య వైరుధ్యాలు తలెత్తినప్పుడు దళిత కవులు, రచయితలు మధ్యవర్తిత్వ పాత్రను వహించాలి తప్ప అంతా ప్రలోభాలకు గురికాకూడదు.
5. మరాఠీ దళిత ఉద్యమం పాఠాలు నేర్చుకోవాలి.
6. ఏక నాయకత్వం కాక సమిష్టి నాయకత్వంలో పని చేయడానికి అలవాటు పడాలి.
7. మరాఠీ దళిత సాహిత్యం అద్భుతమైన విజయాలను సాధించింది. కానీ వాళ్ళను నిర్బంధాలతో కాక చప్పట్లతో, బిరుదులతో, పొగడ్తలతో ఓడించారు. దాని నుండి గుణపాఠాన్ని స్వీకరించాలి.
8. దళిత సాహిత్య ప్రచురణకు ఒక సమిష్టి ప్రచురణ సంస్థను రూపొందించుకోవాలి.
9. విమర్శ, ఆత్మ విమర్శ ఆ విధంగా ముందుకు నడవాలి.
10. పుస్తకాలు రాసిన వాళ్ళనే కవులుగా, రచయితలుగా గుర్తించడం కాక, కలం పట్టిన ప్రతి ఒక్కరినీ ప్రోత్సహించాలి.
11. అనామకంగా మిగిలిపోయిన అనేక మంది దళిత స్త్రీ రచయితలను ప్రోత్సహించి వారి నాయకత్వంలో ముందుకు వెళ్ళడానికి సిద్ధపడాలి.
12. యితర సాహితీ రూపాలపైన దృష్టిని సారించాలి.
13. ఆలస్యం అయ్యింది కానీ యింకా గాఢాంధకారం అలుముకోలేదు.
14. దళిత ముద్రను కాలం మీద వేద్దాం.

**సాక్షి హ్యూమన్ రైట్స్ వాచ్ సహకారంతో డిసెంబర్ 1999న హైదరాబాద్ పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్శిటీలో జరిగిన 'దళిత సాహిత్య సదస్సు' లో చేసిన ప్రసంగ పాఠం.**

# దళిత కవితా పోరు పతాక జాషువా

జాషువా పుట్టిన నూరేళ్ళ తర్వాత, తన అస్తిత్వాన్ని తాను అన్వేషించే క్రమంలో దళిత ప్రపంచం జాషువాను గుండెలకు హత్తుకొంటున్నది. ఆయన అక్షరాలను స్పృశిస్తే ఆవేదనా, ఆగ్రహం కలగలిసిన కన్నీటి కణికలు జలజలా రాలుతాయి. బతుకొక సముద్రమై అలల అక్షరాలనధిరోహించి గుండె చెలియలికట్టపైన తనను తాను ఆవిష్కరించుకొంటుంది. కవిత్వమొక పెనుగులాటై జీవితాన్ని ధరించి సమతాకాంక్షల పరిమళాన్ని వెదజల్లుతుంది. తన కవిత్వం గురించి జాషువా గారే చెప్పుకొన్నట్లు 'సలసల కాగి చిందిన కన్నీటి బిందువులు' ఆయన కవితలు.

దళిత ఆకాంక్షలను వ్యక్తీకరించడానికి తన గొంతుకనిచ్చి శిఖరాగ్రస్థాయిలో దళిత జీవన స్వప్నాలనూ, ఆవేదనలనూ, సంఘర్షణనూ తన కవిత్వంలో దృశ్యీకరించాడు. మాదిగతల్లి లింగమాంబకు, గొల్లతండ్రి వీరయ్యకు 1895 సెప్టెంబర్ 28వ తేదీన పుట్టిన గుర్రం జాషువా 1971 జూలై 24వ తేదీన చనిపోయేంతవరకూ మనిషిగా, కవిగా జీవితాంతం పెనుగులాడాడు. తెలుగు సమాజం ఆయనను కవిగా తిరస్కరించింది. అనేక అవమానాలమధ్య, అవహేళనల మధ్య, తిరస్కారాల మధ్య దుర్భర దారిద్ర్యం మధ్య ధిక్కారమే జవాబుగా జాషువా కవితా జీవితప్రస్థానం కొనసాగింది. వెయ్యేళ్ళ తెలుగు సాహితీ చరిత్రలో మొట్టమొదటి సారిగా అంటరాని మానవుణ్ణి కథానాయకుణ్ణి చేసి గబ్బిలం కావ్యం రాయడం ద్వారా దళిత కవితా పోరుపతాకాన్ని తెలుగు గడ్డమీద ఆయన సగర్వంగా ఎగురవేశాడు.

ఒక మనిషికి ఒకే విలువను ఇవ్వక, కొందరిని దైవ సమానులుగా, కొందరిని పశువులకన్నా హీనులుగా చూస్తోన్న దుర్మార్గపు సామాజిక రాజనీతిని నిలువెల్లా ధిక్కరిస్తూ కలం పట్టిన జాషువా తనకు ఇద్దరు గురువులని చెప్పుకున్నాడు. మొదటి గురువు పేదరికమైతే, రెండవ గురువు కుల మతభేదం. మొదటిది తనకు సహనాన్ని నేర్పితే రెండవది ఎదిరించే శక్తిని నేర్పిందని ఆయన రాసుకొన్నాడు. ఇది అక్షరాలా నిజం. ఆ స్వీయానుభవంతో లోకాన్ని చదివిన జ్ఞానంతో గుండెల్లో మంటలు రేగే ఆ అనుభూతితో ఆయన తన కవితా యాత్రను కొనసాగించాడు. ఆయన రసం కరుణవీరం. అడుగడుగునా అవమానిస్తోన్న సమకాలీన సమాజంపై నిరంతర పోరాటంగా ఆయన తన సాహితీ సమరాన్ని సాగించాడు.

ఆయన కవిత్వం విన్న ఒక వైష్ణవ పూజారి 'కవితలల్లిన అంటరాని వాడిని నరికినను సమంజసమేనని పురాణాలు ఘోషిస్తున్నా యన్నాడు. ఒక రైలు ప్రయాణంలో జాషువా కవిత్వం విన్న ఒక పెద్దమనిషి ఆ కవితల సొగసుకు మురిసిపోయి మెచ్చుకున్న తర్వాత జాషువా కులం అడిగి తెలుసుకొని 'ఛీఛీ సరస్వతి అంటు పడిందని' ఛీత్కరించుకొని లేచిపోయాడు.

ఆ సంఘటనను జాషువా

**"నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి రూప రే**
**ఖా కమనీయ వైఖరుల గాంచి భళీ భళి యన్న వాడె నీ**
**దే కులమన్న ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోవుచో**
**బాకున గ్రుమ్మినట్లుగును ప్రార్థివ చంద్ర! వచింప సిగ్గగున్"**

అని వివరించాడు. ఇట్లా గుండెల్లో ఎన్నో బాకు పోట్లతో జాషువా కవిత్వం రక్తసిక్తమయింది.

1943 కాకినాడ సాహితీ సభలో త్రిపురనేని రామస్వామి చౌదరి, కాటూరు వెంకటేశ్వరరావు ప్రభృతులతో పాటు జాషువాని ఆహ్వానించారు. అయితే వేదికపై అందరితోపాటు కుర్చీ వేయకుండా జాషువాకు దూరంగా వేశారు. అంతేకాక ఆయనను మైకు ముందుకు ఆహ్వానించడానికి ఇప్పుడు గుర్రం జాషువా పంచమస్వరంలో తన కవిత్వాన్ని వినిపిస్తాడు అని ప్రకటించారు. అంటే జాషువా అంటరానివాడు అని మైకు ముందు ఏ మొహమాటమూ లేకుండా ప్రకటించడమే. అయితే జాషువా ఈ అవమానాలతో క్రుంగిపోయి కన్నీటి సముద్రంలో మునిగిపోయి అస్త్ర సన్యాసం చేయలేదు. ద్విగుణీకరించిన ఆత్మవిశ్వాసంతో తన ఆత్మగౌరవాన్ని ప్రకటించుకొన్నాడు. అదే సభలో

**"గవ్వకు సాటిరాని పలుగాకులు మూకలసూయచేత న**
**న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే?**
**యివ్వసుధా స్థలిన్ బొడమరే రసలబ్ధులు గంటమూనెదన్**
**రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్"**

అని కవిత్వం చదివి సభలోని వాళ్ళ నోళ్ళు మూయించాడు. సమాజం అన్ని విధాలా అవమానిస్తూ ఎంతో సామాజిక బాధ్యతతో దేశానికి, పేదలకి, దళితులకీ, స్త్రీలకీ, వేలాడుతున్న సంకెళ్ళను ఛేదించడానికి తన కవితాకరవాలాలను విసిరాడు.

**'వాని రక్తంబు నాహరించి**
**ఇనుప గజ్జెల తల్లి జీవనము సేయు**
**కసరి బుసగొట్టు నాతని గాలిసోక**
**నాల్గు పడగల హైందవ నాగరాజు'**

అంటూ వర్ణాశ్రమ ధర్మాల హైందవ కుల వ్యవస్థ నీడల్లో దళితుడి దయనీయమైన పరిస్థితిని వివరించాడు.

**'వాని రెక్కల కష్టంబు లేనినాడు**
**సస్యరమ పండి పులకింప సంశయించు**
**వాడు చెమ్మటలోడ్చి? ప్రపంచమునకు**
**భోజనము పెట్టువానికి భుక్తిలేదు'**

అంటూ జాషువా హిందూ సమాజంలో ఎవరైతే అంటరానివారో, వారే ఈ దేశంలోని సకల సంపదలకూ పునాదిగా వుండి, సృష్టికర్తలై వుండి తాము మాత్రం తింటానికి తిండిలేకుండా వున్నాడన్న దుర్మార్గపు వాస్తవాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రించాడు.

**'ఎవదారగించు నమృతభోజనంబున**
**గలిసెనో యీ లేమ గంజిబువ్వ**
**ఎవడువాసము చేయు శృంగార సౌధాన**
**మునిగెనో యిన్నారి పూరిగుడిసె**
**ఎవని దేహము మీది ధవళాంబరములలో**
**బొసగెనో యిన్నాతి ముదుక పంచె**
**ఎవడు దేహము సేర్చు మృదుతల్పముల లోన**
**నక్కెనో యీ యమ్మ కుక్కిపడక**
**వసుధపైనున్న భోగసర్వస్వమునకు**
**స్వామత వహించి మనుజుండు ప్రభావ మందు**
**ఎవడపహరించె నేమయ్యె నీమెసుఖము**
**కలుషమెరుగని దీని కొడుకుల సుఖంబు?**

తలలు బద్దలయ్యే ఈ ప్రశ్నలను అనాధ దళిత స్త్రీని వర్ణిస్తూ జాషువా ఎక్కు పెట్టారు. జాషువా అనాధ కేవలం దళిత స్త్రీకాదు. ఆమె బహిష్కృత భారతమ్మ. ఆయన వేసిన ప్రశ్నలు భేతాళ ప్రశ్నలు. సమాధానం తెలిసీ చెప్పకపోతే తల వేయి వ్రక్కలవుతుందని నిలదీస్తాయవి.

**శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలు రాయకముందే**
**'ఒకడు చిన్నమ్మ కరదోలనూగుచుండ**
**నొకడు పెద్దమ్మ కటిక దృష్టికి దపించు**
**ప్రకృతి జనయిత్రి యనుగు గారాల సుతుల**
**నొకని ద్వేషించు నొకని అభ్యుద్ధరించు'**

అని జాషువా రాశాడు

ఒక వైపు హైందవ దురాచారాలను ఎండగడుతూ అంటరానితనాన్ని నిరసిస్తూ, జనసామాన్యాన్ని దుర్భర దారిద్ర్యంలోకి నెట్టివేసిన దోపిడీని తునుమాడుతూ మరోవైపున స్త్రీల బానిసత్వాన్ని నిరసిస్తూ ఆయన రచనలు చేశాడు.

**'అబలయన్న బిరుద మంటించి, కాంతల**
**స్వీయశక్తుల నదిమి చిదిమినారు**
**సబలయన్న బిరుదు సాధించి హక్కుల**
**గడన చేసికొమ్మ కష్టచరిత'**

అని స్త్రీలు తమ అణచివేతలపైన తామే పోరాడి సబలలుగా హక్కుల్ని సాధించుకోవాలని ప్రబోధించాడు. ఆయన రచనల్లో స్త్రీలు ధీరోధాత్తులు. ఖడ్గక్కనకు బుద్ధిచెప్పిన ఆయన భార్య 'వీరచానమ్మ' అంతరిక్షంలోకి వెళ్ళిన తొలి మహిళ 'వీరకుమారి' వాలెంతీను తెరష్కోవ, ఇలా ఆయన రచనల్లో స్త్రీలందరూ రక్తమాంసాలతో, సొంత వ్యక్తిత్వాలతో వుంటారు. జాషువా కవిత్వం రాస్తున్న రోజులలోనే ఒకవైపున కవి సామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ, మరోవైపు రాయప్రోలు, కృష్ణ శాస్త్రి రచనలు చేస్తున్నారు. విశ్వనాధ సత్యనారాయణ ఈ దేశంలో వర్ణాశ్రమ ధర్మం చెక్కుచెదరకుండా ఉండాలనీ, భగవంతుడు ఏయే వర్ణాలవారికి ఏయే విధుల్ని కేటాయించాడో, ఆయా విధుల్ని తప్పకుండా నిర్వహించాలని త్రికరణ శుద్ధిగా నమ్మి నిర్మొహమాటంగా, నిష్కర్షగా తన రచనలు సాగించాడు. ఆయన రచనల్లో దళితులు సైతం ధర్మ పరిరక్షణ కోసం పరితపించిపోతారు. అందరికీ సేవచేయడం తమ హక్కుగా భావించి ఆ హక్కుకు భంగం కలిగితే బాధపడతారు. ఆరు నూరైనా భగవంతుని ఆదేశానుసారం వ్యవస్తీకృతమైన కులవ్యవస్థ ఉండాల్సిందేనని, అందుకోసమే విశ్వనాధ రచనలు సాగించాడు.

ఇంకోవైపు నండూరి సుబ్బారావు, కృష్ణశాస్త్రి భావకవితాఝరిలో ఊహాప్రేయసుల, ఊహావియోగాల, ఊహావిరహాలతో కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నారు. అటు సంప్రదాయ ధోరణినీ ఇటు భావకవితా ధోరణిని సునిశితంగా జాషువా పరిశీలించాడు. నన్నయ్య, విశ్వనాధల ధోరణితో ఇబ్బందులేవి లేవు, యుద్ధమే. భావ కవితా ధోరణి చూడటానికి సంకెళ్ళ పైన తిరస్కారం, స్వేచ్ఛ అంటే ప్రేమ కనబరుస్తున్నట్టుంది. వారి అంతర్ముఖత్వాన్ని శక్తివంతమైన దుఃఖాన్నీ జాషువా జాగ్రత్తగా పరిశీలించాడు. వారిలో స్వేచ్ఛంటే ప్రేమ, ఆదరాభిమానాలు, స్పందన గానీ, వారి విషాదంలో పీడిత జనాంగం కోసం ఒక్క కన్నీటిచుక్క గానీ కన్పించలేదు ఆయనకి.

**'పూతోటల మదచుంబర,**
**నాదముల విలాసవతుల నడచెడుగులనా**
**హ్లాదించు కవులకే నిరు**
**పేదల ఆక్రందనములు వీనులబడునా?**

అన్నసందేహం వచ్చింది.

**'ఎవతుక కోసమో కుమిలి ఏడ్చుచు చిక్కని తెల్లుకైత కా**
**యువులు కుదించి ఏమిటి కయోను యమునవే**
**పొనరిందునీవు? నీ**
**కవనము పాడుగాను! వెడగా ఇక నేనియు రమ్ము దారికిన్!**

అని భావకవిని హెచ్చరించాడు.

తెలుగు గడ్డ మీద వీరవిహారం చేస్తున్న ధోరణులను ఎద్దేవా చేసి ఇకనైనా జీవితం పునాదిగా, దేశ భవిష్యత్తు ప్రయోజనకరంగా రచనలు సాగించాలని ప్రబోధించాడు.

**"ప్రణయ కవి ఒకండు షాషాణకవి యొక్క**
**దేడ్చుకవి యొకండు నేక మగుచు ఊ**
**రొండొరులను చూచి ఓదార్చుకొనుచున్న**
**బాగుపడునె భావి భరతజాతి!**

అని నిలదీశాడు. ప్రణయ కవి నండూరి, పాషాణ కవి విశ్వనాధ, ఏడ్పు కవి కృష్ణశాస్త్రి వీళ్ళందరు సాహిత్యాన్ని ప్రజలకోసం సృష్టించడం లేదని అట్లా చేయవలసి వుందనీ జాషువా అభిప్రాయం. ఇట్లా దేశ, పీడిత, దళిత, స్త్రీజాతుల శృంఖలాలను ఛేదించడానికి పెదధోరణులను ఖండించడానికి కవిత్వం రాసిన జాషువాను తెలుగు సాహితీ చరిత్ర అంటరానివాడిగానే చూసింది.

ఎవడి మెప్పుకోసమో కాక నిర్మొహమాటంగా జీవిత వాస్తవికతను చిత్రించినందుకూ, దళితుడిగా పుట్టినందుకూ జాషువాను ఆనాటి నవ్య సాహిత్య సమితి దూరంగా వుంచింది. కవిత్వం అంటానికి వాళ్ళ ప్రమాణాల్లోనే వీలులేని ఎందరో కవుల కవితలను సంకలనం చేసిన ముద్దుకృష్ణ తన వైతాళికులు సంకలనంలో జాషువాను వెలివేశాడు. సమాజం పట్లా, జీవితం పట్లా నిబద్ధత లేని సాహితీవేత్తలూ, ధోరణులు జాషువాను నిర్లక్ష్యంచేశాయంటే దాని అర్థం చేసుకోవచ్చు. కానీ సామాజిక మార్పును తమ లక్ష్యంగా ప్రకటించుకొని ఎన్నెన్నో త్యాగాలను చేయడానికి సిద్ధపడిన అభ్యుదయ విప్లవ సాహిత్యోద్యమాలు కూడా జాషువాను అంటరానివాడిగానే చూశాయి. అసలు ఆయన ఉనికిని గుర్తించకపోవడమో, గుర్తించినా ఏవో ఛంధస్సులో పద్యాలు రాసిన అంటరాని వాడిగా చూడ్డమో చేశాయి. ఇది నిజంగా బాధాకరమైన అంశం. కమ్యూనిస్టు ఉద్యమం అంబేద్కర్‌ని ఎలా వెలి వేయడానికి ప్రయత్నించిందో, కమ్యూనిస్టు సాహిత్యోద్యమాలు జాషువాను అలాగే వెలివేసే ప్రయత్నం చేశాయి.

మహాకవిగా పేరు ప్రఖ్యాతులు పొంది కష్టజీవికి అండగా నిలబడతానన్న శ్రీశ్రీ తాను నిరసించే భావకవితా ధోరణిని పరాకాష్టకు తీసుకువెళ్ళిన కృష్ణశాస్త్రి కవిత్వాన్ని ఇది ఇక్షు సముద్రం అందరూ ఆస్వాదించండి అని సిఫారసుచేశాడు. అదే శ్రీశ్రీ తాను ఏ పీడితుల పక్షపాతినని ప్రకటించుకున్నాడో ఆ పీడితుల్లో పుట్టి, స్వంత గాయాలతో స్వంత ఆవేదనతో, స్వంత ఆగ్రహంతో కవితాజ్వాలల్ని సృష్టించిన జాషువాను తన 'వ్యూలు రివ్యూలు' లో ద్వితీయశ్రేణి కవిగా పేర్కొన్నాడు. దీని వెనుక 'కులం ఆడిన సయ్యాట' స్పష్టంగా వుంది.

ఈ నిర్లక్ష్యానికి ఎంతో ఆవేదన పడిన జాషువా 'ఎంత కోయిలపాట వృధాయయ్యెనో

కదా! చిక్కు చీకటి వనసీమలందు ఎన్ని వెన్నెల వాగులింకిపోయెనో కదా! కటిక, కొండల మీద మిటకరించి ఎన్ని కస్తురి జింక లీడేరెనో కదా! మురికి తిన్నెలమీద పరిమళించి ఎన్ని ముత్తెపు రాలు చిన్నమయ్యెనో కదా! పండిన వెదురుజొంపములలోన ఎంత గంధవహన మెంత తంగెటి జున్ను ఎంత రత్నకాంతి ఎంత శాంతి ప్రకృతి గర్భమందు భగ్నమైపోయెనో పుట్టరానిచోట బుట్టు కతన'

అని రాసుకున్నాడు. ఇందుకు తెలుగు సాహితీ చరిత్ర సిగ్గుతో తలవంచు కోవాలి. జాషువాను హృదయానికి హత్తుకోలేని సాహితీ చరిత్ర ఆత్మహత్య చేసుకోవాలి.

అంబేడ్కర్ సాగించిన యుద్ధం పునాదులమీద జాషువా వారసత్వం రూపొందుతుంది. ఆత్మగౌరవం, విముక్తికోసం పెనుగులాడుతున్న దళిత ప్రపంచం జాషువాను తన సాంస్కృతిక ఆయుధంగా మలచుకొంటున్నది. జాషువాను తన మార్గదర్శిగా దళిత కళారథ సారథిగా దళిత ప్రపంచం ఆవాహన చేసుకొంటున్నది.

ఇక ఇప్పుడు జాషువా ప్రజాస్వామిక సాహితీ యుగమే. ఇందులో ఒక మనిషికి ఒకే విలువ. తెలుగు సమాజానికి మహామహాకవుల, కవిసామ్రాట్టుల, అధికార పీఠాల బరువులు ఇకపైన ఉండవు. ఏ ప్రజాస్వామిక విలువలకోసమైతే జాషువా ప్రస్థానించాడో ఆ పోరాటం కొనసాగుతుంది. ఆ పోరాటానికి సజీవ స్ఫూర్తి జాషువా.

**సెప్టెంబర్ 2004 - బహుజన కెరటాలు**

# దళితవాదం చూపు, దారి

ఒక గ్రీకుపురాణ గాథ – భూదేవికీ, సముద్రుడికీ పుట్టిన కొడుకు అమితమైన బలపరాక్రమవంతుడు. ఎందరెందరో యోధానుయోధులు అతన్ని ఓడించడానికి విఫలయత్నాలు చేసి కొందరు విగతజీవులై పోయారు. మరి కొందరు పలాయనం చిత్తగించారు. ఈ పరిస్థితి దేవతలకు సైతం కంటగింపయ్యింది. ఆ భూమి పుత్రుడిని హతమార్చడానికి తమ సకల శక్తుల్నీ ధారవోసి ఒక వీరుడ్ని సృష్టిస్తారు. ఆ వీరుడు భూమి పుత్రుడితో తలపడి చంపేస్తాడు.

అయితే ఆ మృతశరీరం భూమిని తాకిన మరుక్షణం విచిత్రంగా అతనికి తిరిగి ప్రాణం వస్తుంది. ఇలా ఎన్నోసార్లు చంపేసినా అతను మళ్ళీ మళ్ళీ పుట్టుకొస్తాడు. దాంతో దేవతల వీరుడికి విసుగుపుట్టి వెనుదిరిగిపోతాడు. దేవతలు అతనిని అనునయించి 'నాయినా నువ్వ నిస్సందేహంగా అతన్ని హతమార్చగలిగిన శక్తి సామర్థ్యాలు ఉన్నవాడివే. కాని అతడు భూమి కుమారుడు. అతను భూమిపైన ఉన్నంత వరకూ అతని ప్రాణానికి ఎటువంటి ముప్పురాదు. కాబట్టి అతన్ని భూమికి దూరంచేసి చంపు' అని సలహా ఇచ్చారు. దేవతల వీరుడు రెట్టింపైన ఉత్సాహంతో భూమి పుత్రుడిని రెచ్చగొట్టి, కవ్వించి భూమికి దూరంగా తీసుకుపోయి చంపేసి ఆ శరీరం భూమిపైన పడకుండా జాగ్రత్త పడ్డాడు. దాంతో భూమి పుత్రుని చరిత్ర పరిసమాప్తమయ్యింది.

అవ్వడానికి ఇది పుక్కిటి పురాణగాథే అయినప్పటికీ ఈ కతలోని పాత్రలు ప్రాణంపోసుకొని తెలుగు సాహిత్యవీధిలో విచిత్రవిన్యాసాలు చేస్తున్నాయి. ఉదాహరణకు దళిత, స్త్రీవాద సాహిత్యం పైన జరుగుతున్న చర్చ. దళిత, స్త్రీవాదాలు పోస్ట్‌మోడ్రన్ ధోరణి కాబట్టి వ్యతిరేకిస్తున్నారు కొందరు. మరికొందరు పోస్ట్‌మోడర్న్ ధోరణిగా గుర్తించి అందుకే సమర్థిస్తున్నారు. వ్యతిరేకించినా సమర్థించినా దళితవాదాన్నీ, దళిత సాహిత్యాన్ని దాని భూమినుండీ, భూమికనుండీ దూరం చేస్తున్నారు. అప్పుడు అది ఆలింగనమైనా, యుద్ధమైనా అది దళితవాదానికీ, దళిత సాహిత్యానికీ మరణ సదృశ్యమే. ఏదేమైనా చర్చను ఇప్పుడు దళితవాదం, స్త్రీ వాదాలపైన గాక పోస్ట్‌మోడర్నిజం పైకి చాలా సమర్థవంతంగా తీసుకెళ్ళ గలిగారు. కానీ అదృష్టవశాత్తూ చర్చ మాత్రమే భూమికి దూరంగా జరిగింది. కానీ దళితవాదం దాని భూమిపైనే నిలబడి వుంది. అదే దాని ప్రాణం.

ఇంతకీ దళితవాదం పోస్ట్‌మోడర్న్ వాదం కాదా? అవునని రుజువు చేసేందుకు తంటాలు పడనవసరం లేదు. దళితవాదం పోస్ట్‌మోడర్న్ వాదం అవునా? కాదని ఖండించనూ అవసరం లేదు.

అగ్రవర్ణ భూస్వాముల అహంకారానికి పంటపొలాల్లో ప్రవహించిన దళితుల నెత్తుటి జ్వాలల్లోంచి ప్రభవించిన పోస్ట్‌కారంచేడూ, చుండూరు వాదం దళితవాదం. ప్రతిభ పేరుతో అగ్రవర్ణ కౌటిల్యం దేశం నలుమూలలా సాగించిన దమనకాండ నుండి పుట్టుకొచ్చిన పోస్ట్‌మండల్ వాదం దళితవాదం.

ఇది కేవలం హిందూ దేశమనీ, హిందువులు మాత్రమే ఈ దేశ పౌరులనీ పరమ కౄరంగా ప్రకటించి అందుకు ప్రతీకగా హిందూరాజ్యం కూలగొట్టిన బాబ్రీమసీదు విధ్వంసం అనంతర వాదం దళితవాదం. దేశంలోని ఎస్సీలూ, ఎస్టీలూ, బీసీలూ, మైనారిటీలూ ఈదేశ స్వతంత్రంలో, దేశ సార్వభౌమాధికారంలో, దేశ సంపదలో తమకు ఎటువంటి భాగస్వామ్యమూ లేదనీ, 'స్వతంత్ర భారతం'లో తమకు ఆత్మగౌరవం, ఆత్మరక్షణ లేవనీ తమ దేశాన్నీ, తమ చరిత్రనీ, తమ సంస్కృతినీ తమ చేతులతో తామే పునర్నిర్మించుకోవలసిన అవసరం వుందన్న స్థిర నిశ్చయం నుండి పుట్టినవాదం దళితవాదం.

దీనికి పునాది వేల ఏళ్ళుగా ఈ గడ్డమీద హైందవ అమానవీయ సంస్కృతికి వ్యతిరేకంగా జరిగిన, జరుగుతోన్న పోరాటాలలో వుంది. హిందూ ధర్మశాస్త్రాల ఆధిపత్యాన్ని తిరస్కరించిన చార్వాకుల ఉద్యమంలోనూ, బౌద్ధ సంఘవాదంలోనూ, భక్తి కవుల ఉద్యమాలలోనూ, జ్యోతిరావు ఫూలే, అంబేద్కర్, పెరియార్, నారాయణగురుల భావధారలోనూ ఇంకా అనేక ప్రాంతాల్లో సాగిన కుల నిర్మూలనా ఉద్యమాల భూమికతో దళితవాదం అభివృద్ధి చెందింది.

ఫూలే అంబేద్కర్‌లు కల్పించిన సైద్ధాంతిక పునాదితో దళితవాదం తన గమనంలో ఎదురవుతున్న అనేక జీవన వాస్తవికతలతో సుసంపన్నం అవుతూ తనను తాను ఎప్పటికప్పుడు పునర్‌నిర్వచించుకొంటూ ముందుకు సాగుతోంది. దళితవాదంలోని సామాజిక తత్వాన్ని గమనించి నిరాకరించదలచుకొన్నవాళ్ళకు దాని చూపూ, దారీ అర్థం కాకపోవడంలో ఆశ్చర్యపోవలసిన అంశమే లేదు. నిద్రపోతున్న వాళ్ళను నిద్రలేపగలం కానీ నిద్ర నటిస్తున్న వారిని నిద్ర లేపలేము కదా!

ఈ సామాజిక సాంస్కృతిక నేపధ్యం నుండి దళిత సాహిత్యాన్ని పరిశీలించవలసి వుంటుంది. తెలుగులో దళిత సాహిత్యం పుట్టిన తొలినాళ్ళలో వ్యక్తీకరణ కోసం తీవ్రమైన పెనుగులాటకు గురయ్యింది. తరాలుగా మూగబోయిన జాతి గొంతుక ఒక్కసారిగా పెనువిస్ఫోటనానికి గురయ్యింది. ఆవేదననీ కసినీ తీవ్రమైన గొంతుకతో వ్యక్తీకరించింది.

అయితే తర్వాత కాలంలో ముఖ్యంగా తొంభై ఆరులో దళిత సాహిత్యం మరింత పరిపక్వతను సాధించింది. ఈ క్రమంలో ప్రపంచంలో జరిగిన, జరుగుతున్న అనేక ఉద్యమాలు ప్రతిష్ఠించిన ప్రజాస్వామిక విలువలను స్వంతం చేసుకొన్నది. తీవ్రమైన ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తూనే స్త్రీల మనోభావాలను గాయపరిచే భాషనూ, భావాన్నీ వదిలించుకోగలిగింది.

ఇది స్త్రీవాదం దళితులవాదాల మధ్య స్నేహ పూరితంగా జరిగిన సంభాషణ, ఘర్షణల ఫలితం. అస్తిత్వంలో వున్న సామాజిక విలువలతో ఘర్షణ పడుతూ తనపైన తాను పోరాటంచేస్తూ దళితవాదం వేయిపూలుగా వికసిస్తోంది.

1996లో పదునెక్కిన పాట, బహువచనం, రచ్చబండ, నల్లకలువ, చండాల చాటింపు, అల్పపీడనం, హిందూ మహాసముద్రం, గూటం దెబ్బ, ప్రవహించే పాట, మేమే, కాస్త సిగ్గు పడదాం (దళిత సంఘీభావ కవిత్వం), చలపతి విజయవర్ధనం (ఉరిశిక్షకు వ్యతిరేకంగా దళిత ప్రజాస్వామిక కవుల, రచయితల రాజకీయ ప్రకటన), మాదిగ చైతన్యం (1997, ఫిబ్రవరి) మొదలైన కవితా సంకలనాలు వచ్చాయి. ఇంకా అనేక పత్రికల్లో, వివిధ వార్త దిన పత్రికల సాహిత్య ప్రత్యేక పేజీల్లో ఎంతో దళిత కవిత్వం అచ్చయింది. వెనకటికాలంతో పోల్చితే పరిమాణం దృష్ట్యానూ, గుణం దృష్ట్యానూ ఈ కవిత్వం ఎంతో ముందుకు వెళ్ళింది. ఎంతోమంది దళిత కవులు ఎంతో వస్తువైవిధ్యంతో దళిత జీవితంలోని అనేక కోణాలను స్పృశిస్తూ, అనేక అనుభూతులను మీటుతూ కవిత్వం రాశారు. ఎస్సీలు, బీసీలు, ఎస్టీలూ, మైనారిటీలు ముఖ్యంగా ఆయా శ్రేణుల్లోని స్త్రీలు తమవైన వ్యక్తీకరణలతో కవిత్వం రాశారు.

అంటరానితనాన్నీ, కుల వివక్షనీ, నిరసిస్తూ, ఆత్మగౌరవం కోసం కవిత్వం రాశారు. ఆకలీ పేదరికంపైనా, రకరకాల రూపాలలో దళితులపై జరుగుతున్న అనేకానేక దాడులకు నిరసనగా కవిత్వం రాశారు. రాజ్యాధికార సాధన దిశలో దళిత బహుజన సమూహాలను చైతన్యపరిచే కవిత్వం రాశారు.

ఈ కాలంలో వచ్చిన విలక్షణమైన, ప్రత్యేకమైన కవిత్వం మాదిగ కవిత్వం. జనాభా నిష్పత్తి ప్రకారం రిజర్వేషన్లలోనూ, హక్కులలోనూ భాగస్వామ్యం వుండాలన్న మాదిగ రిజర్వేషన్‌పోరాటసమితి ప్రారంభించిన ప్రజాస్వామిక పోరాటం నేపథ్యంలో మాదిగ చైతన్య కవిత్వం వచ్చింది. హిందూ అగ్రకుల రాజ్యం మనుషుల్ని కులాలుగా చీల్చి అణచివేస్తుంటే అణగారిన జాతుల మధ్య కూడా అసమానతల వివక్షలకు నిరసనగా ప్రశ్నల బాణాలతో ఈ కవిత్వం మాలల్ని కుదిపివేసింది.

రాజ్యంలో అంతర్భాగం కాదలచుకున్న వారు, రాజ్యాన్ని, బ్రాహ్మణవాదాన్ని అనుకరిస్తున్న వారు ఈ ప్రశ్నలతో గింజుకున్నారు. అయితే ఈ ప్రశ్నలు మాలల్లో ఆత్మ విమర్శకు ఎంతో దోహదపడ్డాయి. ముఖ్యంగా మాలల్లో నాయకులుగా, ఉద్యమ కారులుగా, ఉద్యోగస్తులుగా వున్నవారు అటు మాదిగలపట్లా, ఇటు మిగతా మాల సమాజం పట్లా ఎంతో బాధ్యతా రహితంగా వున్నారని నిలదీయడం మొదలైంది. ఆత్మవిమర్శ కవిత పేరుతో ఎన్నో కవితలు వెలువడ్డాయి.

విముక్తిని సాధిస్తానని ప్రకటించుకున్న వాడు ఒకానొక దశలో తానే అణచివేత

దారుడిగానో లేక ప్రగతికి వ్యతిరేకిగానో మారుతోన్న విచిత్రమైన సన్నివేశంలో అధికార పీఠాలను బద్దలు కొట్టాలన్న స్పృహ, చైతన్యాలను దళిత సాహిత్యం ప్రతిధ్వనిస్తోంది. రిజర్వేషన్ల ద్వారా, రకరకాల రాయితీల ద్వారా జీవితంలో ఎంతో కొంత వెసులుబాటును సాధించు కోగలిగిన వర్గాలు రాజ్యాన్ని అనుకరిస్తూ, రాజ్యంలో అంతర్భాగమైపోడానికి ఆత్రపడుతోన్న నేపథ్యంలో ఈ కుల నిర్మూలనా పోరాటం కొనసాగుతోంది. కులాలను నిర్మూలించడం కోసం అగ్రకులాధిపత్యాన్ని ఎదుర్కొనడం కోసం తమకు తాము కులాలుగా సంఘటిత పర్చుకోడమూ, అదే సమయంలో తమను తాము ఒక కులంగా రద్దుచేసుకొనే చైతన్యంతో కుల నిర్మూలనా పోరాటంలో పాల్గొనడమూ అనే రెండు అంశాలు ప్రజాస్వామిక ప్రక్రియలో ఇమిడి వున్నాయి. ఈ చైతన్యం మిగతా దళిత పోరాట రంగాలలో కన్నా దళిత సాహితీ సాంస్కృతిక రంగంలోనే ఎక్కువగా కనిపిస్తుంది.

ఇది సామాజిక రాజకీయ రంగాలలో ఆచరణగా అనువదితం కావలసివుంది. ఎంతగా అగ్రకుల హిందూ కాపట్యం మీద పోరాటం ప్రకటిస్తామో, అంతగా మనపైన మనం పోరాటం చేసుకోవలసిన అవసరాన్ని, చైతన్యాన్ని దళిత సాహిత్యం గుర్తింపజేస్తోంది. దీనికి ఏ కులమూ, ఏ సమాజమూ, ఏ వ్యక్తీ మినహాయింపు కాదు.

మరో విలక్షణమైన లక్షణం దళిత స్త్రీలు తమ స్వంత అనుభవాలనూ, అనుభూతులనూ స్వయంగా తామే కవిత్వీకరించడం. వాళ్ళు ప్రస్తుతం సంఖ్యరీత్యా తక్కువగానే వున్నప్పటికీ స్పష్టమైన అవగాహనతో దళిత స్త్రీ చైతన్యంతో కవిత్వం రాశారు. ముందుగా దళిత స్త్రీలుగా తామెక్కడ వున్నదీ ప్రకటించుకున్నారు. ఒకవైపున అగ్రకుల భూస్వామ్యం, అణచివేత, అవమానం, ఆర్థిక దోపిడి, మరోవైపున పితృస్వామ్యం, దళిత పురుషుల్లోనూ కొనసాగుతోన్న పురుషాధిక్య భావజాలం వీటన్నింటిపైనా తమ పోరాటం అనివార్యమన్న నిశ్చయాన్ని దళిత స్త్రీ వ్యక్తీకరించింది. అదే విధంగా స్త్రీలలోనూ అగ్రవర్ణ స్త్రీలకున్న పరిమితులను గుర్తింపజేస్తూ కవిత్వం రాశారు.

ఇప్పుడు చలామణిలో వున్న స్త్రీవాదం కేవలం అగ్రకుల మధ్యతరగతి సమస్యలనే పట్టించుకున్నదనీ దళిత స్త్రీ ఎదుర్కొంటున్న అనేకానేక సమస్యలు లెక్కకే రాలేదని ఎత్తిచూపుతూ దళిత స్త్రీలు కవిత్వం రాశారు.

మైనారిటీలు సైతం అటు హైందవ కాపట్యంపైన కవితాయుద్ధం చేస్తూనే తమలోనూ కరడు కట్టిన ఛాందసవాదంపైనా యుద్ధం ప్రకటించారు. ఒక్కమాటలో దళిత సాహిత్యం రెండు చేతులా రెండు కర్తవ్యాలను నిర్వహిస్తోంది. యుద్ధం, ఆత్మయుద్ధం. సమూహాల నుండి వ్యక్తులదాకా, తమ స్వంత వ్యక్తిత్వాలదాకా ఈ పోరాటాన్ని విస్తరింపజేస్తున్నారు. ఇది ఒక ప్రజాస్వామిక క్రమం.

ఈ క్రమంలో అంతర్భాగం అయ్యేందుకు కొంతమంది అగ్రకుల ప్రగతిశీల కవులు

సైతం తమ సంఘీభావాన్ని, ఆత్మ విమర్శనూ ప్రకటించారు. ఇది నిజంగా దళితవాదం సాధించిన ఒకానొక విజయం. ఇందుకు దళితవాదం కృషి ఎంతగా వుందో తమపైన తాము యుద్ధం ప్రకటించుకొన్న అగ్రకుల ప్రగతిశీల కవుల కృషి కూడా అంతగా పనిచేసింది. అయితే ఇది ఒక ఉద్యమ రూపంలో, స్థాయిలో లేదు.

ఈ ప్రక్రియను త్వరితం చేసి ప్రజాస్వామిక సంబంధాల ఏర్పాటును ప్రేరేపిస్తూ, ఒక సామాజిక రాజకీయాచరణ రూపొందవలసి వుంది. ఆ దారిని సుగమంచేసే దిశగా దళిత సాహిత్యం ప్రస్తానిస్తోంది. ఇదొక నిరంతర క్రమం. ఈ క్రమమే దళిత సాహిత్యం, దళితవాదం చూపూ. దారీ.. ఈ దారిలో ఎదురయ్యే మరిన్ని సరికొత్త సవాళ్ళకు సమాధానాలను అన్వేషిస్తూ దళితవాదం సుసంపన్నం అవుతుంది. ప్రజాస్వామిక విప్లవంతో తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తుంది.

ఇంతదాకా నేను చెప్పిందంతా పోస్ట్‌మోడర్నిజమే అయితే నన్నెవ్వరూ క్షమించక్కరలేదు. కానీ ఖండించినా, సమర్థించినా దళితవాదాన్ని దళితవాదంగా గుర్తించమని మనవి.

**'మరోదారి' ప్రారంభ సంచిక – మార్చి 1997**

# మేమూ, వాళ్ళూ, మీరూ....

మీరు అందంగా అబద్ధాలు చెప్పగలరు. అన్నీ అబద్ధాలే చెబుతారని కాదు. ఉదాహరణకు ఆశలనే నిజాలన్నంతగా నమ్మబలకగలరు. అటూ ఇటూ ఆకాంక్షలని అట్ట పేజీలుగా ముద్రించి మధ్యలో పచ్చి నిజాలను బద్దలు కొట్టగలరు. పగిలిన కలలపైన నెత్తురోడే పాటని నాట్యం చేయించగలరు. ఒకళ్ళు అనేకులై వేలవేల సామూహికాలై యుగాల నాడు వినిపించిన బృందగానాన్ని పురుటి పరిమళాలు చెరిగిపోని పాల చుక్కల పసినవ్వుగా ముక్తకంఠంతో పలికించగలరు.

ఒరే మీరూ! అద్దం ముందు నిలబడి మీ గాయాలను మీరు విప్పుకొంటుంటే మా ప్లాస్టిక్ సర్జరీ చిరిగిపోయి గుండె నెత్తురోడుతోంది.

మా సమాధులకు రంగులేసుకొని కాసేపు సుఖనిద్రలోకి పారిపోదామనుకొనేవేళ మేము మర్చిపోదామనుకొనే పేరునే పదేపదే పలవరిస్తూ ఎవర్రా మీరు దెయ్యపు సుడిగాలి లాగా వెంటతరుముతారు. ఒకానొక మౌనంలోకి నిష్క్రమించి ఎవడికో ఒకడికి చేతులు జోడించి కాసింత ఎంగిలి మెతుకుల 'అధికారాన్ని' కతుకుదామనుకొంటుంటే ఎందుకురా 'వళ్ళు జలదరించే పద్యమై' వేటాడుతారు. మేము కట్టుదిట్టం చేసిన మా శిబిరంలోని బాధితులనెవరో యోధుల్ని చేస్తున్నారు. శూర్పణఖా! ఏకలవ్యా! శంబూకా! కోటేశూ... లేచిపోకండ్రా... అయ్యో మేము అరువుతెచ్చుకున్న ప్రభుత్వ స్వభావాన్ని దగ్ధం చేస్తున్నారెవరో. గుండెల్లోంచి పాటల పిట్టేదో ఎగిరిపోయి మీ పద్యం లాగా అగ్ని కౌగిలై మమ్మల్ని అలుముకొంటున్నది. మనిషితనం తప్ప మరేమీ మిగల్చని మందు పాతరేదో లోలోపల విస్ఫోటిస్తున్నది.

రక్తసిక్తగాయాల పరాజితుడనై, దుఃఖితుడనై, బాధితుడనై, భూసురోపహతుడనై, నా పరాజయాలను ఒక ధిక్కారంగా విచ్చుకోనీయకుండా ఆమె మీద నా జెండా పాతి, ఆమెను నా సామ్రాజ్యంగా ఆక్రమించి విజేతగా ప్రకటించుకొన్నది నేనే. ఆమె సహజాతాలను ఒక నిట్టూర్పుగా ఆవిరి చేసి అసంతృప్తి చితిమంటల్లో దహనమవుతున్నది నేనే. ఇష్టపడ్డ దాన్నంతటినీ బూడిద చేసి, ఆ బూడిద పోగుల మీద భోరున కన్నీరై కుప్పకూలుతున్నదీ నేనే.

ఆమెను గెలిచాను కదా, ఆమెను లొంగదీశాను కదా, నన్ను నేను అమ్ముకొని ఆమెను బానిసగా కొనుక్కున్నాను కదా, నా మగతనాల పెత్తనాల నీడలన్నీ ఇంత శక్తిహీన మౌతాయేమిటి? మీ పద్యంలాగా ఆమె ఒక్క ధిక్కారపు చిరునవ్వు నవ్వితేనే నేను సాధించుకున్న అన్ని అధికారాలూ ఎదురు తిరిగి నా కాళ్లకు సంకెళ్ళవుతాయేమిటి? ఒరే... నా కాళ్ళ మధ్య బుసలు కొట్టే క్రోధాన్నెవరో పరపరా కోసేస్తున్నారు.

మనిషంటే నేను కదా? మనిషంటే ఆమె కాదా? మనిషంటే మీరు కాదా? మనిషంటే ఏకశిలా సదృశ్య నిర్మాణం కానే కాదా? ఎన్ని పొరల కుబుసాలు విడవాలిరా... ఎన్నెన్ని అగడ్తలు దాటాలిరా నాయినా. రా... నన్ను తాకి తుఫానుగా కరిగిపో, నన్ను కౌగిలించుకొని నన్ను దగ్ధం చెయ్యి... యీ గోరు వెచ్చటి స్పర్శ చాలదు. అగ్నిపాతమై కురిసే పాటై నను పెనవేసుకుపో. పక్క పోట్లు వద్దు. తే... పద్యమో, పదునైన ఖడ్గమో ఏదో ఒకటి ఇలా తే. మీ మీదికి కరవాలాలు విసిరినంత కర్కశంగా నడివీధిలో నిలబడి గుండెలమీద పగిలిన రాచపుండుల్ని మత్తుమందు లేకుండానే కోసేసుకుంటాను.

-- -- --

మీ పదాల 'మాయ'లో పడి నేనూ అందంగానో కురూపిగానో అబద్ధమే చెప్పాను. అన్నీ అబద్ధాలని కాదు. ఒక ఆకాంక్షనే నిజమన్నంతగా నమ్మబలికాను.

రాత్రికి రాత్రే శాంతి కోసం శిఖరాగ్ర సమావేశమేదో జరిగి శరీరమంతా జీవనదులు ప్రవహించవు కదా. పెనుమంటల పెనుగులాట కావాలి. నేను నా మీదా, ఆమె తన మీదా, మీరు మీ మీదా తిరుగులేని యుద్ధం ప్రకటించుకొని ఒక్కొక్క మండుతోన్న భూఖండమై సరిహద్దుల్ని నరుక్కుంటూ ఒకరినొకరు హత్తుకుపోవాలి.

ఎంత నెత్తురు చిందినా సరే, ఎన్ని కలలు పగిలినా సరే, ఎంత బోలుతనపు బడాయి డాబులు కూలిపోయినా సరే మేమూ, వాళ్ళూ, మీరూ ఒకే ఒక్క సామూహిక గానమై పల్లవిద్దామా? మేమూ, వాళ్లూ, మీరూ ఒలిచిపెట్టిన నిజాలను రెక్కల్లా కట్టుకొని ఒకే ఒక్క 'మనం' లోకి లేచిపోదామా?

(ఏమీ అనుకోవద్దు. అసలు విషయాన్ని ఫుట్ నోట్సులో మాత్రమే చెపుతున్నాను. 'అతని లోకంలోంచి, తెల్లపద్యాల్లోంచి, తెల్ల నిజాలలోంచి – ఆమె లోకంలోకి, నల్ల పద్యాలలోకి, నల్ల కలల్లోకి' ప్రవహించాలని తమ మొత్తాన్నీ ఒకే ఒక్క నల్ల అక్షరంగా పగలేసుకొని అఫ్సర్, నామాడి శ్రీధర్, ఒమ్మి రమేష్‌బాబు, ఎమ్.ఎస్. నాయుడు, పెద్ది రామారావులు (వాళ్ళీ క్రమంలోనే రాసుకొన్నారు) ఓ దీర్ఘరాత్రి కలగని 'అతడూ, ఆమె, 'మేమూ' అనే **A LONG DARK POEM** ని అచ్చేశారు. అందులో మా మీదా, వాళ్ళ మీదా, మీ మీదా, తమ మీదా ప్రేమ బాణాలు సంధించారు. అక్కడక్కడా తమను తామూ (బహుశా కావాలనే) ఖండించుకొన్నారు. ఏది ఎలావున్నా వాళ్ళ Complaint 'వనమూలికల వైద్యుడొకవైపు / ఉన్మాద శస్త్రకారుడొకవైపు / శిలాప్రభుత సాక్షి– బతుకునుంచి సమాధికి వలస' ఇది మనందరి Complaint కాదా, ఇది మనందరి ఫ్రస్ట్రేషన్ కాదా? వాళ్ళు మన చలనాన్ని డిమాండు చేస్తున్నారు. శతాబ్దాల 'అపరిచిత దుఖ్ఖాన్ని' ఒక్క స్వచ్ఛమైన చిరునవ్వుతో చెరిపేయాలన్నది వాళ్ల తపన. 'కన్నీళ్ల తీగెల నుండి ఎవర్ని వాళ్ళు లాక్కోవాలన్న రాక్షస'

ప్రయత్నం. నల్లబడ్డ రాత్రి నుండి రేపుగా తెల్లవారాలన్న ఘర్షణ వాళ్ళది. 'అర్ధనారినీ, అర్ధ సత్యాన్నీ, అర్ధ స్వప్నాన్నీ' కాక 'పులి పట్టిన చేతినే' ప్రేమించాలన్న కోరిక వాళ్ళది. ఇది కచ్చితంగా పగలేసిన పద్యం. అందరూ (నేనూ మీరే కదా) చదవండి. నచ్చిందా గుండెలకు హత్తుకోండి. నచ్చలేదా వాళ్ళ మీద యుద్ధాన్ని ప్రకటించండి. ఏదో ఒకటిచేయండి. పిడికిలి బిగించిన అక్షరాల డిమాండ్ ఇది.

ఇది మన మీద విమర్శ ప్రకటించిన వాళ్ల ఆత్మవిమర్శ. మన ఆత్మ విమర్శను వాళ్ళ మీద విమర్శగా డిమాండ్ చేస్తూ ఇచ్చిన సమ్మె నోటీసు. సకల అమానవీయ విలువల మీద ఒక యుద్ధం. ఇది కవిత్వ దృక్పథానికి ఒక చేర్పు కదా! బహుశా దళిత, స్త్రీవాదాల ఒకానొక గెలుపు కదా!!

**వార్త 'సృష్టి' 12 అక్టోబర్ 1996**

# శివమెత్తిన సాగరం

ఎడారి యిసుక తిన్నెలపై ఖర్జూర చెట్టు మొదలుకు ఆనుకొని కూర్చుని ఒక విరాగి ఆలపిస్తుంటే మంచున తడిసి బరువు బరువుగా వ్యాపించే వాయులీనాల మెలంకలీ. ఖైదు కటకటాలను మీటుకుంటూ బతుకుమర్మాలను విప్పి చెప్పే బైరాగితత్వం. గాయపడ్డ చిరుతపులి ఆర్తనాదం. సమాధుల దొడ్లో అత్యాచారానికి గురై మరణించిన బిడ్డ శవాన్ని ముందేసుకుని గుండెలవిసేలా భోరున రోదించే కన్నతల్లి కడుపుకోత. యుద్ధరంగాన పేలిన శతఘ్నుల రణన్నినాదం. ఉయ్యాలలో పసిపాపల నిదుర కన్నుల మెరిసిన అరవిరిసిన చిరునవ్వు.సతత హరితారణ్యంలో సూర్యోదయం వేళ రేలపూల పాట. శివసాగర్ కవిత్వం ఒక విశ్వాసం. ఒక ఓదార్పు. ఒక ఆత్మస్థైర్యం.

శివసాగర్ ప్రభావం నుంచి తప్పించుకోవడం మా తరానికి సాధ్యం కాలేదు. సృజనలోనో, అరుణతారలోనో మరెక్కడో శివసాగర్ కవిత్వం అచ్చయ్యిందంటే అదొక పండుగ. ఒక జాతర. ఆ నులివెచ్చదనాన్ని గుండెల్లో దాచుకొని అర్ధరాత్రి నగరం గోడల్ని జేగురు రంగు అక్షరాలతో అలంకరించే వాళ్లం. మాకు తెలిసో తెలియకుండానో ఆయన కవిత్వం గోడలపైన నినాదాలుగా వెలిసేది.

'నా రక్తం వృథాకాదు / నా మృత్యువు వృథాకాదు / నా నెత్తురు కోనేరులో నవలోకం వికసించును / నా మృత్యువు సన్నిధిలో జీవన రవళి వినిపించును'

కవిగా శివసాగర్‌ని తెలుగు సాహితీ ప్రపంచానికి పరిచయం చేయవలసిన అవసరం లేదు. విప్లవ నాయకుడిగా ఆయన నిర్వర్తించిన పాత్రనూ వివరించనక్కర్లేదు. కవుల్లో ఉద్యమకారుడిగా, ఉద్యమకారుల్లో ఉత్తమ కవిగా సమాజపు ఆకాంక్షలను శక్తివంతంగా వ్యక్తీకరించిన స్వాప్నికుడూ, ప్రేమికుడూ శివసాగర్. ఆయన కవిత్వం గురించి చేకూరి రామారావుగారు, వరవరరావుగారూ ఏనాడో చెప్పవలసింది చెప్పారు. ఆయన అక్షరాలనీ, అక్షరాలు బట్వాడా చేసిన భావాలనీ తూచి అంచనా కట్టారు. దాదాపు నలభై సంవత్సరాల కవితా ప్రస్థానంలో శివసాగర్ ప్రాసంగికత (రిలవెన్స్) గురించి రెండు మూడు మాటలాడుకోవాలి. ఆయన విద్యార్థి దశ నుంచే కవిత్వం రాస్తున్నా తాను 1968లో రాసిన 'తూర్పుపవనం వీచెనోయ్' గీతమే తొలిగీతంగా ఆయన ప్రకటించుకున్నాడు. ఆనాటి నుంచి ఈనాటి వరకూ ప్రతి చారిత్రక విభాత సంధ్యలోనూ, ప్రతి మలుపులోనూ ఆయన ముద్ర, పాత్ర చాలా స్పష్టంగా కనిపిస్తాయి. కాలం సమాజం మీదకి విసిరే సవాళ్లకు జవాబుగా శివసాగర్ కవిత్వం నిలుస్తుంది. సమాజం సంక్షుభితంగా ఉన్నప్పుడు, అలజడిగా ఉన్నప్పుడు, సందిగ్ధస్థితిలో ఉన్నప్పుడు ఒక స్పష్టతను పొందటానికి శివసాగర్ కవిత్వం అవసరమైంది. 'రైజ్ టు ది అకేషన్' అనే ఏకైక గొప్ప లక్షణం శివసాగర్ అనే కవి వ్యక్తిత్వాన్ని మిగతా అతి

గొప్ప కవుల నుంచి వేరుగా అద్వితీయంగా నిలబెడుతుంది. ఉదాహరణకు చైనా విప్లవం విజయవంతం అయి మావో నాయకత్వాన చైనాలో సాంస్కృతిక విప్లవం జరుగుతున్నప్పుడు ప్రపంచమంతా తూర్పు దేశాల వైపు దృష్టిని సారించింది. అప్పటి వరకు వీస్తున్న 'పడమటి గాలి' ని తూర్పు విప్లవ వెల్లువ నిలువరిస్తుందన్న విశ్వాసాన్ని చైనా విప్లవం కలిగించింది. ఆ ఉద్యమం 'ఈస్ట్ విండ్ ప్రివైల్స్ ఓవర్ ది వెస్ట్' అన్న నినాదాన్నిచ్చింది. ఆ నినాదానికి కవితా రూపమే 'తూర్పు పవనం వీచెనోయ్' పాట. నక్సల్బరి, శ్రీకాకుళ ఉద్యమ నేపథ్యాల నుంచి తెలుగు నేల మీద విప్లవ పరిస్థితులనూ అవసరాల్నీ చిత్రించి ఒక ఆశావహ దృక్పథాన్ని ఆ పాట కలిగించింది.

విప్లవకారులపైన కుట్రకేసులు పెడుతున్న సమయంలో 'న్యాయమూర్తులుం గారూ / సూర్యోదయం కుట్రకాదు / సూర్యుడు కుట్రదారుడు కాదు / విప్లవం కుట్ర కాదు / విప్లవకారుడు కుట్రదారుడు కాదు' అనే కోర్టు స్టేట్‌మెంట్ ఇస్తాడు. ఖైదులో ఉండగా ఏ మాత్రం నిబ్బరం కోల్పోకుండా కవి చందమామతో సంభాషణ జరుపుతాడు. 'శత్రుచేజిక్కితినని వెక్కిరించకు నన్ను / మిత్రద్రోహము చేత / శత్రు చేజిక్కితిని / చందమామా... చందమామా..' ఈ పాట శివసాగర్ గొంతుకలో వినాలి. కటకటాల వెనుక బతుకునీడ్వాల్సి వచ్చిన ప్రతి విప్లవకారుడికి అదొక గొప్ప అండ. ఓదార్పు. పళ్ల బిగువున నొప్పిని భరించడానికి అవసరమైన టానిక్.

శ్రీకాకుళ ఉద్యమ నాయకత్వం ఒక్కరొక్కరిగా ఒరిగిపోతున్నప్పుడు, మిగిలినవాళ్ళు అస్త్రసన్యాసం చేస్తున్నప్పుడు 'మేరిమి కొండల్లో మెరిసింది మేఘం' పాట వచ్చింది. విప్లవ రచయితల సంఘం ఏర్పడినా, సాహిత్యాన్ని ప్రజలకు సన్నిహితంగా తీసుకువెళ్లడానికి పాటే సాధనం అని గుర్తించినా ఎక్కువ మంది కవులు వచన కవిత్వమే రాశారు. పాట ఎలా రాయాలి అన్న సందిగ్ధత ఏర్పడినప్పుడు ఒక ట్రెండ్ సెట్టింగ్ పాటలా 'నర్రెంక చెట్టు కింద నరుడో భాస్కరుడో, పాట వచ్చింది. రూపం జాతీయంగానూ వస్తువు విప్లవాత్మకంగానూ ఉండాలన్న అవగాహనకు అక్షర రూపం ఆ పాట. ఆ తర్వాతనే గద్దర్, చెరబండరాజులాంటి వాళ్లు గొప్ప పాటలు రాశారు. విప్లవ కవిత్వం అంటే 'చంపు, కొట్టు, నరుకు' ఈ మాటలే కదా అన్న అభిప్రాయం వ్యక్తమవుతున్న వేళ మొత్తంగా విప్లవ సాహితీ శిబిరాన్ని శివసాగర్ కవిత్వం ఆ అపవాదునుంచి కాపాడింది. ఉరి పాట, ఉద్యమం నెలబాలుడు మొదలైన కవితలు అందుకు తార్కాణాలు. అలా విప్లవ కవిత్వంలోకి పిట్టల్నీ, పువ్వులన్నీ, చందమామనీ, వెన్నెల్నీ తీసుకువచ్చి కవిత్వానికి లాలిత్య సాంద్రతని పెంచాడు శివసాగర్.

యితరేతర కారణాల వలన తాను నిర్మించిన ఉద్యమం నుంచి తానే బహిష్కృతుడై దూరంగా వుండవలసిన పరిస్థితుల్లో 'అమ్మా నన్ను కన్నందుకు విప్లవాభివందనాలు' అన్న కవిత రాశాడు. ' నాకోసం ఎదురు చూడు' అని ఆశావహంగా చెప్పాడు.

దళిత సాహిత్యంలోకి ఆలస్యంగానే ప్రవేశించినప్పటికీ శివసాగర్ తనదైన ముద్రను నిలబెట్టుకొన్నాడు. ఆ రంగంలో అప్పటికే కవితాశరాలను సంధిస్తున్న మద్దూరి నగేష్‌బాబు, పైడి తెరేష్‌బాబులతో పోటీపడి రాశాడు. 'నడుస్తున్న చరిత్ర' కవితలో పురాణ ప్రతీకల్ని భౌతికవాద దృక్పథం నుంచి పునర్ వ్యాఖ్యానించాడు. 'మండుతున్న మాదిగ దప్పు' కవితలో దళిత కళా సౌందర్యాన్ని ఆవిష్కరించే ప్రయత్నంచేశాడు. 'నల్లటి సూరీడు' పాట ఈ కాలంలో వచ్చిన అతి కొద్ది గొప్ప పాటల్లో ఒకటి.

శివసాగర్ 1968 నుంచి 2004 వరకూ రాసిన కవిత్వం మొత్తాన్ని (కొడుకూ ఏసోబూ కవిత లేదు) ఇప్పుడు ఒకే పుస్తకంగా ఖమ్మం స్వేచ్ఛ ప్రచురణల వారు తీసుకువచ్చారు. యిది కేవలం శివసాగర్ వ్యక్తిగతమైన కవిత్వం మాత్రమే కాదు. నాలుగు దశాబ్దాల పాటు సమాజం ఎదుర్కొన్న విధ్వంసం యిందులో రికార్డయ్యింది. జాతి కన్నీళ్లు, ఆగ్రహం మాత్రమే కాదు. సంబరాలు కూడా ఉన్నాయి.

'పొదలో పొంచి వున్న అడవి ఎలుగు / నాపై క్రూరాతి క్రూరంగా దాడి చేసే వేళ / నడిరాత్రి వెన్నలమ్మే / నిశ్శబ్ధంగా నా దరి చేరి / ప్రేమతో నన్ను సాదరంగా అనునయించేవేళ' 'నా యవ్వనాన్ని నాకివ్వు' అని ఆయన ఒక సందర్భంలో జీవితాన్ని అడుకున్నాడు.

మొదటి పేజీ నుంచి చివరి పేజీ వరకు ఆయన ప్రతి వాక్యంలోనూ ఆ యవ్వనం తొణికిసలాడుతోంది.

శివసాగర్ నిత్యయవ్వనుడు.

**ఆదివారం ఆంధ్రజ్యోతి 20 ఫిబ్రవరి 2005**

# ఏతం బుద్ధాను సాసనం

1956 అక్టోబర్ 14, రోడ్లన్నీ నాగపూర్ వైపుకే దారి తీసాయి. రైళ్ళు, బస్సులు, లారీలు రకరకాల వాహనాలు అన్ని జనంతో కిక్కిరిసిపోయి ఉన్నాయి. ఏమీ దొరకని వారు కాలినడకనే బయలు దేరారు. ఆడ, మగా, పిల్లా, పాప అంతా నాగపూర్‌కు చేరుకున్నారు. తమను అంటరానివారిగా బానిసలుగా పశువులకన్నా హీనంగా చూసిన హిందూ మతాన్ని వదిలి, సమత మమతలను ప్రబోధించిన బౌద్ధ దమ్మాన్ని స్వీకరించడానికి నాగపూర్‌కు తరలిరావాల్సిందిగా బాబాసాహెబ్ డా॥ అంబేద్కర్ పిలుపునిచ్చారు. ఒక్క పిలుపు చాలు, ఆ మెదడులో వికసించిన ఆలోచనా కుసుమం చాలు, లక్షలాదిగా జనం తండోపతండాలు నాగపూర్‌కు తరలివచ్చారు. 13వ తేది సాయంత్రం నుండి జనం వస్తూనే వున్నారు. 14వ తేది కార్యక్రమం మొదలైంది. జనం వస్తూనే వున్నారు. ముందుగా అంబేద్కర్ బౌద్ధ భిక్షువు చంద్రమణి నుండి బౌద్ధ దీక్షను స్వీకరించారు. ఆ తర్వాత స్వయంగా బోధిసత్వ అంబేద్కర్, లక్షలాది మందికి బౌద్ధ దీక్షను ఇచ్చారు. ఇంకా జనం వస్తూనే వున్నారు. రాత్రయ్యింది. జనం ఇంకా వస్తూనే వున్నారు. మరుసటి రోజున అక్టోబర్ 15వ తేదీన, ఇంకా చాలా మందికి దీక్షనిచ్చారు. అంబేద్కర్ ఈ దీక్షా కార్యక్రమం దేశంలోనే కాక ప్రపంచవ్యాప్తంగా ఎంతోమంది దృష్టిని ఆకర్షించింది. ప్రపంచం నలుమూలల నుండి శుభ సందేశాలు వచ్చాయి. ఆయన నిర్ణయాల్ని ఎన్నో దేశాల ప్రముఖులు స్వాగతించారు.

డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ బౌద్ధ దమ్మాన్ని స్వీకరించే సమయానికి దేశంలో మహాబోధి సొసైటీ పనిచేస్తూ ఉంది. అయితే అది ఎంతో నిష్క్రియాపరంగా వుంది. బౌద్ధాన్ని విస్తృతంగా ప్రచారంచేసి సాధ్యమైనంత ఎక్కువ మందిని బౌద్ధులుగా తీర్చిదిద్దాల్సిన సొసైటీ కొంతమంది బ్రాహ్మణ మేధావులకే పరిమితమైంది. వారి భాషలో ప్రజలను, పామరులనూ ఉత్తేజపరిచే శక్తి ఉండడంలేదని అంబేద్కర్ ఒక సందర్భంలో అన్నారు.

హిందూమతం తనకు భిన్నంగా ఉన్న ఏ అంశాన్నయినా ధ్వంసం చేయడమో, అలా సాధ్యం కానప్పుడు తన ధృతరాష్ట్ర కౌగిలిలో ఇముడ్చుకొని సొంతం చేసుకోవడమో చేస్తుంది. అంబేద్కర్ బౌద్ధాన్ని స్వీకరించే సమయానికి బౌద్ధానికి హిందూ మతానికి పెద్దగా తేడా లేకుండా పోయింది. బుద్ధుడు విష్ణువు అవతారాల్లో ఒక అవతారంగా ప్రచారం జరిగింది. బుద్ధుని బోధనలలోకి కర్మ సిద్ధాంతం జొప్పించబడింది. అసలు బుద్ధుడు పరివ్రాజకత్వాన్ని ఎందుకు స్వీకరించాడు? ఒక రోగిని, వృద్ధుడిని, శవాన్ని చూడడం వల్ల మనసు వికలమై వెళ్ళిపోయాడని ప్రచారం చేశారు. అంబేద్కర్ ఆ ప్రచారాన్ని నిర్ద్వందంగా ఖండించారు. నీటి సమస్యపై రెండు గణాల మధ్య వివాదం చెలరేగి యుద్ధం జరిగే వాతావరణం నెలకొనడంతో, యుద్ధాన్ని నివారించేందుకు బుద్ధుడు పరివ్రాజకుడై అడవులకెళ్లాడు అన్న విషయాన్ని బుద్ధ

అండ్ హిస్ ధమ్మ అనే పుస్తకంలో అంబేద్కర్ స్పష్టం చేశారు. మనుషుల్ని మనుషులుగా గుర్తించి గౌరవించే వాతావరణం ఉండాలని బౌద్ధం ప్రబోధించిందని అందుకోసమే తాను, తన అనుయాయులు బౌద్ధాన్ని స్వీకరిస్తున్నామని తనది "నవయానమని" అంబేద్కర్ పేర్కొన్నారు.

కార్తిక్ నవయాన్ బౌద్ధ దమ్మాన్ని స్వీకరించారు. బోధిసత్వ అంబేద్కర్ పేర్కొన్న అంశాలను జీవితంగా అనువదించుకోవటానికి, జీవితంలో అనుసరించటానికి తనదైన కృషిని చేస్తున్నారు. వృత్తి రీత్యా న్యాయవాది. ప్రవృత్తి రీత్యా రచయిత, వక్త. ఈ రెండు ప్రావీణ్యతలనూ బౌద్ధ ధమ్మాన్ని ప్రచారం చేయడానికి కార్తిక్ నవయాన్ ఉపయోగిస్తున్నాడు. అందులో భాగమే ఈ పుస్తకం. చిన్ని చిన్ని పదాలతో విశాలమైన భావాలను అందిస్తున్నాడు అందరూ ఈ చిన్న పుస్తకాన్ని చదవాలనీ, చదివిన మేరకు ప్రచారం చేయాలని మనవిచేస్తున్నాను.

భవతు సబ్బ మంగళం!

**బత్తుల కార్తిక్ నవయాన్ రచించిన**
**అక్టోబరు విప్లవం పుస్తకం ముందుమాట**

# గుండె గొంతుకను దాటిన 'పంచమం' స్వరం

పద్మకి ఇంగ్లీషు గ్రామర్ ట్యూషన్ చెపుతున్నాడు శివయ్య. పద్మ తల్లి ఇద్దరికీ కాఫీ తెచ్చి ఇచ్చింది. ఎప్పటిలాగే.. పద్మకి స్టీల్ గ్లాసులో, శివయ్యకి సత్తుగ్లాసులో. పద్మవాళ్ళ ఈడిగ కులం పెద్ద గొప్పదేం కాకపోయినా శివయ్య మాదిగవాడు. శివయ్యను ప్రేమగా పలకరిస్తూనే అతనికి సత్తుగ్లాసులో కాఫీ ఇవ్వడం సహజమైన విషయంగా పద్మ తల్లి భావిస్తుంది. అలా కాఫీ ఇచ్చినప్పుడల్లా పద్మ ఎంతో అపరాధ భావనకు గురవుతుంది. అమ్మ ఇద్దరికీ స్టీల్ గ్లాసుల్లోనే కాఫీ ఇస్తే ఎంత బావుండుననుకొంటుంది. తన గ్లాసు అతనికిచ్చి, అతని గ్లాసు తను తీసుకోవాలని ప్రయత్నిస్తుంది. కానీ అదే జరిగితే పరిణామాలెంత తీవ్రంగా వుంటాయో శివయ్యకు తెలుసు. నిత్యమూ అనుమానాల మధ్యన, హింసల మధ్యన, హింసోన్మత్త ఎగతాళి చూపుల మధ్యన పుట్టి పెరిగినవాడు శివయ్య. ఆ సున్నిత తిరస్కృతి వెనుక ఎంతటి భయం దాగివుందో, ఎంతటి బీభత్సం పొంచి వుందో రచయిత చిలుకూరి దేవపుత్ర తన 'పంచమం' నవలలో బొమ్మ కట్టినట్లు చూపుతాడు.

తల్లాప్రగడవారి 'హేలావతి' నవల నుండి ఈనాటి వరకూ దళిత జీవితాన్ని చిత్రిస్తూ అనేక నవలలూ, కతలూ వచ్చాయి. దళితుడుగా పుట్టి, దళిత జీవితాన్ని జీవించి, ఆ బాధలోంచి, ఆవేదనలోంచి, ఆ అనుభవంలోంచి ఆవిష్కరించిన దళిత జీవన పరిణామమే 'పంచమం' నవల. దళిత జీవితం ఎంత సంఘర్షణకు లోనవుతుందో ప్రతి చిన్న కదలికతో సహా పట్టి మనకు అందించారు దేవపుత్ర.

ఇంటర్ రిజల్ట్స్ కోసం పేపర్ కోసం ఎదురుచూస్తుండడంతో మొదలవుతోంది నవల. ఎంతో ఎదురుచూసిన తర్వాత పేపర్ వస్తుంది. కాపోల్ల పిల్లలు, కమ్మోళ్ల పిల్లలు అందరూ తమ ఫలితాలను తెలుసుకోడానికి ఎగబడుతూ వుంటారు. మాదిగ శివయ్య కూడా ఇంటర్ పరీక్షలు రాసినవాడు. అతని గురించి ఎవరూ పట్టించుకోరు. తప్పినవాళ్లు తప్పంగా థర్డు క్లాసులో పాసైన వాళ్ళు పాసవ్వంగా చివరన తన నెంబర్‌ను కూడా చూడమని అడుగుతాడు. థర్డ్ క్లాసులో చూసి నువ్వు తప్పావురా అని తేల్చిపారేస్తారు. చివరకి అతని నెంబర్ ఫస్టుక్లాసులో వుండడం ఊరివాళ్ళకు ఎవరికీ కొరుకుడు పడదు. దళితుడి పట్ల పెద్ద కులపోళ్లు ఏర్పర్చుకొన్న అభిప్రాయాల్ని తప్పని రుజువు చేసుకోడానికి ఎంత నెత్తురు ధారపోయాలి? చదువుకు ఎగబడే దళితులు చాలామందికి అనుభవంలోకి వచ్చే విషయమే. కలుపుతీసే తల్లి, చెప్పులు కుట్టే తండ్రి, చెలకల్లో రెక్కలు ముక్కలు చేసుకొనే మేనమామ తోటి మాలోల్లు, మాదిగోల్లు వీళ్ల కళ్లల్లో మెరుపులు చాలు శివయ్యకి. జీతానికి పెడితే వచ్చే డబ్బులు రాకపోయినా సరే కొడుకుని పై సదువులు సదివించాలని నిర్ణయించుకొంటారు ఆ మాదిగ తల్లి తండ్రి. ఇక అక్కడి నుండి వాక్యాలకీ మనకీ మధ్యన దూరం చెరిగిపోతుంది. మనం అనంతపురం

జిల్లాలోని ఒక మారుమూల పల్లెటూరిలోకి వెళ్లిపోతాం. మనం వెళ్ళడంకాదు. చిలుకూరి దేవపుత్ర వాక్యాలు మన చుట్టూ ఆ వూరిని నిర్మిస్తాయి. పాత్రలకి రక్తమాంసాలనిచ్చి, ఒక కాలాన్నిచ్చి, ఒక స్థలాన్నిచ్చి, సందర్భాన్నిచ్చి, ఒక చరిత్రనీ, ఒక సంస్కృతిని ఇచ్చి, అనుభూతులనిచ్చి, అన్ని రాగద్వేషాలనూ ఇచ్చి మనల్ని కూడా ఆ వూరి మనుషులుగా మార్చేస్తాయి. మనం కూడా ఆ వూరిలో మనిషైపోతాము. పెద్ద రెడ్డో, సీతారావుడో, శంకరో, పద్మో, విద్యో, మాలతో, పురుషోత్తమో, కాఫీ హోటల్ దుర్గన్నో, కమ్మబిడ్డ రుక్మిణో, చాకలి ఓబులన్నో, ఆపై విఏవో, ఎమ్మార్వోనో, నారాయణప్పో, వెంకటమ్మో, పెద్దక్కో, దేవదానమో, ఉపముఖ్యమంత్రి కృపాకరరావో, సురేషో, వలీ, ఎవరం కాకపోతే పేట మనుషులమో ఎవరమో ఒకరిమి అయిపోతాము. ఒక కత మనం కూడా భాగస్వాములుగా సాగిపోతుంది. కతగా 'పంచమం' నవల తన అస్తిత్వాన్ని కోల్పోయింది. పాఠకులుగా మనలో మన అస్తిత్వాన్ని కోల్పోతాం. దృశ్యం కళ్లముందు నుండి కనుమరుగైపోతుంది. ఒక జీవన పరిణామం కొనసాగుతుంది. భూమికోసం దళితుల తపన, అగ్రవర్ణ భూస్వాముల ఆగడాలు, రెడ్డిబాబుల అసహనాలు, దళితుల ఆత్మగౌరవ చైతన్యం, ఇవి మాత్రమే కాదు. దళితుల బాగుకోసం నిరంతరం ఆలోచించే కమ్మ పురుషోత్తం, మాదిగ శివయ్యను తమలోకి సాదరంగా ఆహ్వానించే బ్రాహ్మణ క్రిష్ణశాస్త్రి కుటుంబం కూడా వుంటాయి. సైకిలెక్కినందుకే చితకతన్నే, అందిరికీ ఒకటే రకం గ్లాసుల్లో టీ ఇమ్మని అడిగినందుకు వెంటాడి వేటాడి నరికి చంపే అగ్రవర్ణ దౌష్ట్యం వుంటుంది. మాదిగ శివయ్యను పద్మ ప్రేమిస్తుంది. శివయ్యకు కులంకాని కులంలో, పెద్దకులంలో అమ్మాయిని ప్రేమించే సాహసం లేనేలేదు. కళ్లముందే ఒకే జీవితాన్ని పంచుకోవాలని కలలుకన్న కింది కులం బాబులన్న, పెద్దకులం రుక్మిణి జీవితాలు ఏమైపోయాయో శివయ్యకు బాగా తెలుసు. తిరుపతికి వెళ్లిపోయిన వాళ్ళిద్దర్నీ పట్టుకొచ్చి ఓబులన్నని అక్కడికక్కడే ముక్కలు ముక్కలుగా నరికిపారేసి, రుక్మిణికి గుట్టుచప్పుడు కాకుండా పెళ్లి చేసేస్తారు. అందుకే శివయ్యకి ప్రేమంటే భయం. శివయ్య క్రిష్ణశాస్త్రి చెల్లెలు విద్యను ప్రేమించాడేమోనని సందేహం. కానీ అతనికి సాహసం లేదు. చూస్తుండగానే ఆమె పెళ్లయిపోతుంది. కష్టపడి చదువుకొని ఆర్‌డిఓ అవుతాడు శివయ్య. ఎంత చదువుకొన్నా తనవారికేమీ చేయలేనన్న విషయం తెలుసుకోవడానికి శివయ్యకి ఎంతో కాలం పట్టదు. ప్రలోభపెట్టో, బెదిరించో తమ పబ్బం గడుపుకొనే పెద్దకులపోళ్ల పడగనీడల్లో నిజాయితీగల ఉద్యోగిగా కొనసాగడం ఎంత కష్టమో శివయ్య అనుభవం ద్వారా తెలుసుకొంటాడు. తొందరలోనే ఉద్యోగాన్ని పోగొట్టుకొంటాడు. కాఫీహోటళ్లలో చర్చలూ, కవులూ, కవిత్వంపైన చర్చలూ, మాదిగ దండోరా ఉద్యమం, రకరకాల ఉద్యమాలూ, ఊరికే వుండి ఏమి చేయలేమని గ్రహించిన సురేష్‌లు సాయుధులై పోవడాలూ, ప్రజాస్వామిక ఉద్యమాలూ అన్నీ కతలో సహజంగా ఇమడిపోతాయి. వట్టి రిపోర్టులుగా మిగిలిపోతాయేమోననిపించే చర్చలు కూడా

కతలో సజీవంగా ఒదిగిపోతాయి. మహాశ్వేతాదేవిలాగానే చిలుకూరి దేవపుత్ర కూడా జర్నలిజానికీ, కాల్పనికతకూ మధ్యనున్న సన్నటి గీతను చెరిపేశాడు. అద్భుతమైన జీవితావిష్కరణని చేశాడు. దళిత సాహిత్యం పని ఇక అయిపోయిందని సంబరపడే చాలామందిని ఈ నవల నిరాశపరుస్తుంది. సుందర్రాజు మాదిగోడు కతలు, ఆ తర్వాత పంచమం నవల ఆ ఆశల్ని అడియాసలు చేశాయి. మన స్నేహం అంతా రెండు అట్టల మధ్యన విస్తరించిన సజీవ జీవకావ్యం తోటి, ఆ అనుభూతుల తోటి, ఆ నెత్తుటి నులివెచ్చటి స్పర్శ తోటి ఆద్యంతమూ చదివేసింతర్వాత ఆ వాక్యాలని ముద్దాడకుండా వుండలేము కదా! ఆ అక్షరాలను శిరస్సుమీద కిరీటంలాగా ధరించి ఊరేగకుండా వుండలేము కదా! మీరు కూడా చదివి చూడండి.

**'పంచమం'**

**ఉద్యమాల నేపథ్యంలో తొలి దళిత నవల**

**వార్త 8.2.1999**

# గుండెను ఏకునాదంగా మీటిన పాట

పాటలు తీయని చుక్కల చనుబాల కోసమే. గుక్క తిప్పుకోలేని ఉద్వేగం సుళ్ళు తిరుగుతున్నది. పాటలు ఆత్మీయపు ఆలింగనం కోసమే. పాట అమ్మతనపు ఒడి కోసమే. పాటలు మమకారపు ఊయల కోసమే. హృదయాకాశం నక్షత్రాల కన్నులై చూస్తున్నది. ఎండిన గుండెలపైన పాటల తొలకరి తుషారాల చిరుజల్లుల కోసమే బతుకు భూమి నెర్రెలు విచ్చిన చూపులతో ఎదురుతెన్నులు చూస్తున్నది.

ఒక్క ఆలాపనతో అమ్మతనాన్నీ, దళిత కళా శ్రమ సౌందర్యాన్నీ, బతుకు పెనుగులాటనీ ఆవిష్కరించి మనసునిండా పోరు మంటల పాటై అల్లుకుపోయే వాగ్గేయకారుడు గోరటి వెంకన్న.

అతని పాట మనల్ని నిలదీస్తుంది. మనల్ని వెంటాడుతుంది. మనముందు మనిషై నిలబడి బతుకు పొరలన్నింటినీ వలచిపెట్టి జీవరహస్యాలను విశదపరుస్తుంది. మన గుండెలకే స్వరాలు మొలిచినట్లుగా, మన వెతల బతుకులకే నోళ్ళొచ్చి మాట్లాడినట్లుగా మనల్ని మనకే వివరించి చెప్తుంది. అతని పాట టీచరై, ఆర్గనైజరై మనల్ని నిలుచున్న చోట నిలువనీయక కర్తవ్యోన్ముఖుల్ని చేస్తుంది. గుండెను ఏకునాదం చేసి మీటుకుంటో పాడుకుంటో అతను నడిచిపోతుంటాడు. అతని పాట బిడ్డ కోసం ఎదురు చూసే అమ్మలాగా, అమ్మ పొత్తిళ్ళలో కేరింతలు కొట్టే నల్లసూరీడులాగా, పిడికిలై బిగుసుకునే ఆశయంలాగా, కన్నీటిని సుతారంగా మునివేలుతో తుడిచే ఒక అండాదండా లాగా మన గుండె లోలోపలికి చొచ్చుకుపోతుంది.

గోరటి వెంకన్న పాటను విశాఖ సముద్రపు హోరు నేపథ్య సంగీతంగా తొలిసారి విన్నాను. భూమి పొరల్ని చీల్చుకుని వర్తులాలు వర్తులాలుగా పైకెగజిమ్మే లావా ఫౌంటెన్ లాగా అతని పాట విప్లవ ప్రజానీకం సాగించే విజయ కవాతులాగా అతని నిబద్ధ పాదాల రవళి. ప్రతి కదలికా సంగీతమై లయించిపోయే సన్నివేశం. ఎదురుగా మంత్ర ముగ్ధుల్లా పాటలో లీనమై ఉగ్రూతలూగుతోన్న పాట, డప్పుల దరువుకు అనుగుణంగా అడుగువేస్తూ వేదిక మీద అతను బతుకును పాడుతోంటే వేదికకూ, జనాలకూ మధ్య సరిహద్దులు చెరిగిపోయి అందరూ ఆ క్షణాన, ఆ సందర్భాన పాటలోకి కరిగిపోతారు.

ఎంకన్న కంటే ముందే గద్దర్ ఈ అద్భుతమైన సన్నివేశాన్ని సాధించాడు. అయితే గద్దర్ పాటల ప్రవేశం చేసి పాటని అత్యున్నత దశకు తీసుకుపోయిన తర్వాత పాట గద్దర్ ముద్రని ధరించింది. ఎవరు రాసినా గద్దర్ లాగా రాసే ప్రయత్నం చేశారు. గద్దర్‌లాగా పాడే ప్రయత్నం చేశారు. పదాలనూ, బాణీలనూ, బతుకు చిత్రణనూ గద్దర్‌లాగే చేసే ప్రయత్నం చేశారు. పాట ఒకానొక మొనాటనస్ స్థితిలోకి వెళ్ళిపోయింది. ఆ మొనాటనీ

బద్దలు గొట్టి తమదైన శైలిని నిలబెట్టుకొని కూడా పాటని విజయవంతంగా జనం దగ్గరకు తీసుకువెళ్ళిన అతి కొద్ది మందిలో గోరటి ఎంకన్న ఒకరు. ఆ గాత్రంలోనూ, రచనలోనూ ఈ వైవిధ్యం స్పష్టంగా కనిపిస్తుంది.

"నీ ఆట ఏమాయెరో కూలన్న నీ పాట ఎటుబోయెరో మాయన్న" అని సాకీ తీసి పరాయీ కరణకి గురవుతున్న బతుకులలోంచి శ్రమ సౌందర్యాన్ని ఆవిష్కరిస్తాడు.

'ఎన్ని సార్లు ఈఘోరాలు / ఎంతమందిమి ఒరుగుదాము/ దళితన్న దండు కట్టుకుంటే బతకలేము' అంటూ కుమిలిపోతున్న, కూలిపోతున్న, నలిగిపోతున్న దళిత బతుకులకు పోరాట సందేశం వినిపిస్తాడు. అగ్రకుల దురహంకారులు చేసే 'ప్రతిభ' సిద్ధాంతాన్ని అపహాస్యం పాలు చేస్తాడు. రాజకీయ నాయకుల లంచగొండి తనాన్ని, ప్రజా వ్యతిరేకతనూ, పల్లెలదాకా పాకిన సామ్రాజ్యవాదాల విషపు కోరల్నీ ఎండగడతాడు. సంక్షేమ హాస్టళ్ళలో బడి పిల్లల బతుకును హృద్యంగా చిత్రిస్తాడు. వేయి పడగలెత్తి బుసలు గొడుతున్న కులం మతం మహమ్మారిని పాటల ఖడ్గాలతో తునాతునకలు చేస్తాడు. చారెడు భూమి కోసం ప్రజలు ప్రాణాలర్పిస్తుంటే రామజన్మభూమంటావేరా మతోన్మాదీ అని నిలదీస్తాడు. మరణించిన మిత్రుల చావులేని ఆశయాలను తన పాటల్లోకి ఆవాహన చేసుకొని సజీవం చేస్తాడు. తెలంగాణ పల్లెల్లో రాజ్యం చేస్తున్న హింస కరాళ తాండవాన్ని నిలువునా నిరసిస్తాడు. ఏమి చేసినా, ఏది రాసినా, ఏది పాడినా తనదైన శైలిలో చేస్తాడు. గోరటి ఎంకన్నది వాగ్గేయకారుల సంప్రదాయం కాలజ్ఞానం చెప్పే బ్రహ్మం గారి శిష్యుడుగా కనిపిస్తాడు. సంకెళ్ళను బద్దలు కొట్టే ఆఫ్రికన్ విప్లవకారుడిలాగా విజృంభిస్తాడు. తాను పాటై సమూహాలు సమూహాలుగా చీలిపోయి ఆ సమూహాలన్నింటి ఆక్రందనల అగ్రహాల రాగాలనీ మళ్ళీ తన ఒక్క గొంతులోనే పలికిస్తాడు.

ఇప్పుడు పాట ఒక సాహితీ రూపంగా వివక్షకు గురవుతుందని చాలా మంది బాధపడుతున్నారు. పాటని సాహితీ విమర్శకులు పట్టించుకోవడం లేదని వాపోతున్నారు. ఏ బాధా అక్కరలేదు. పాటకి అసలైన నిజమైన విమర్శకులు జనం. తమకు నచ్చని పాటను ఏ వాగ్వివాదమూ లేకుండా తిరస్కరిస్తారు. తమదైన పాటను తమ బతుకును కౌగిలించుకున్నంత గాఢంగా స్వంతం చేసుకుంటారు.

పాట జీవితమైనప్పుడు, పాట జీవన సంగ్రామమైనప్పుడు, పాట అణగారిన ప్రజల ఆశల ప్రతిఫలం అయినప్పుడు పాటకి ఎన్నటికీ మరణం లేదు. గోరటెంకన్నా మా గుండెల్లో ఏకునాదం మోతవై సోలిపో, ప్రజల నాల్కల మీద పదపదాల పాటవై కరిగిపో.

ఎంకన్న అన్ని పాటలూ కలిసి "ఏకునాదం మోత" అనే పేరుతో పుస్తకంగా అరుణోదయ వారు ప్రచురించారు. అందరూ కొని చదివి ఎప్పుడూ దగ్గరుంచుకోవాల్సిన

పుస్తకమిది. మన ప్రమేయం లేకుండానే ఈ పాటలు మన పెదవుల మీదికి తోసుకొస్తాయి. నిజమే అతను మనకి కవిత్వం చెబుతానన్నాడు. గానమాలపిస్తానన్నాడు. రకరకాల పద విన్యాసాలు చేసి చూపిస్తానన్నాడు. ఇన్ని మాటలు చెప్పి వట్టి బతుకునే మన చేతుల్లో పెట్టాడు. కాకుంటే బతుక్కి సంగీతాన్నలంకరించాడు. కవితాలయాల వెలుగు భూమికల నమర్చాడు. పాటకు భూమిక బతుకే కదా. ఇదుగో 'ఏకునాదం మోత' వినండ్రా బాబూ. కాసేపు మనల్ని ఆవరించుకొన్న అనేకానేక కాపట్యపు పొరల్ని తొలగించుకోవచ్చు. కాసేపన్నా ఒక అగ్ని స్నాత ముట్టించుకోవచ్చు. విప్లవోద్యమానికీ, దళితోద్యమానికీ మధ్య అక్షర రాగాలతో వారధి నిర్మించి రక్తసంబంధాన్ని నిలబెట్టినవాడు గోరటి ఎంకన్న.

## ఏకునాదం మోత ముందుమాట

# అంతర్ముఖుడి గాయాలాపన

నేను నామాడి శ్రీధర్ అనే 'మనిషి మాత్రుడు' ఆకుపచ్చ లోయగా కవిత్వించిన స్వప్న శకలాల శిథిల గోపురాన్ని అధిరోహిస్తున్నాను. ఆ జీవన శైథిల్యాల నుండి చిగురించే చిరుగడ్డి పరకల పచ్చిక బయళ్ళలో నడుస్తున్నాను.

గుండె ఒక పచ్చ పచ్చటి పచ్చి గాయాల వనమై విస్తరిస్తున్నది. పదానికీ పదానికీ మధ్యన నెత్తురోడే పిల్లన గ్రోవి పాట ప్రవహిస్తున్నది. ముసురు వానలో తడసిన పిచ్చి పావురమేదో బాధగా మూలుగుతున్న సవ్వడి వినిపిస్తున్నది. చీకటిని కాల్చీ కాల్చీ గుప్పెడు మసి బూడిదై కుప్పకూలిపోయే చిమ్నీ పగిలిన గుడ్డి దీపం నిట్టూర్పులు...యవ్వన తేజాన్ని తరలించుకుపోయే ఈదురు గాలి విలయ ఘోష కనుల ముందు కదులాడుతున్నవి.

శ్రీధర్ కవిత్వానికి ప్రదర్శనా స్వభావం లేదు. అతని జీవితం ఎదుర్కొన్న సంఘర్షణా, అవమానాలను మనం అతని అక్షరాలలో ఘనీభూత రూపంలో చూడవచ్చు. అతని కవిత్వం అంతర్ముఖుడి గాయాలాపన.

ఒకానొక చలి రాత్రిలో లేత అరచేతుల్లో పసిపాపలా ఎత్తుకొన్న తుపాకీని ఉంచుకొని సహచరులతో సంభాషించే నిశ్చయం. మనిషంతా ఒకే ఒక్క ధిక్కార స్వరంగా మూర్తీభవించిన ఉద్విగ్న దృశ్యం. మరో దృశ్యంలో 'ఈ పుండు మీంచి ఆ పేడ కడి మీదికి ఎగిరే ఈగలా – గదినుంచి ఆఫీసుకు... నాకేమో తుపాకీని కావలించుకొని భోరున విలపించాలని...' ఈ రెండుదృశ్యాల మధ్య జరుగుతున్న ఎడతెగని సంఘర్షణే శ్రీధర్ కవిత్వం.

వాడ పిల్లాడిగా పుస్తకాల సంచీని బుజాన శిలువలా వేలాడదీసుకొని గులాబీ బుగ్గలతో బడి తోటలోకి మురికి పాదాలతో ప్రవేశించి చెక్కిళ్ళ మీద తరాలనాడు ఎండిపోయిన కన్నీటి చారికలతోనే 'అదృష్టజాతకుల' సరసన ప్రతిభా పాటవాల పోటీలో నిలబడిన సాహసిగా అతను చాలా మందికి తెలుసు. దొంగచాటుగా శ్రీశ్రీ కవిత్వాన్ని చదువుకుంటూ పట్టుబడిపోయి తండ్రిచేత వీపు మీద వాతలుతేలేలా చావు దెబ్బలు తిని కూడా కవిత్వాన్ని కౌగిలించుకున్న వాడిగా అతను చాలా మందికి తెలుసు.

నిరాశా నిస్పృహలు మనిషిని ఆత్మహత్యా సదృశ్యమైన ధోరణిలోకి నెట్టివేసే ఒక గుండెలు బద్దలయ్యే భయానక సందర్భంలో కవిత్వమే అమ్మా నాన్నా స్నేహితులూ అయ్యి కాపాడింది. మిత్రులతో కలిసి అతను వెలువరించిన 'కంజర' కవిత్వం బులెటిన్‌లే అందుకు సాక్ష్యం.

ఒక కూడలి బిందువు దగ్గర దృశ్యం. ఫ్రీజ్ అయితే అంతా ఒక్కలాగే కనిపిస్తుంది. కొంచెం రివైండ్ చేస్తేగానీ ఎక్కడ మొదలైందీ తెలియదు. కొంచెం ఫార్వార్డ్ చేస్తే ఎటు పోతుందీ తెలుస్తుంది. పేగులు తెగిపోయే విషాదాన్ని పలికిస్తూకూడా ధిక్కార స్వరం.

నిర్మోహమాటత్వం. యుద్ధం, ఆత్మయుద్ధం. ఎక్కడా నంగితనం లేదు. మాటలకోసం దేవుళ్ళాడలేదు. కానీ తన లోలోపల కొనసాగుతున్న పురాగానాన్ని దాచిపెట్టాలన్న ప్రయత్నం భయంకరంగా విఫలమై కన్పిస్తుంది. ఈ ప్రయత్నంలో ఏదో తెలియని Gloominess ఏర్పడుతుంది శ్రీధర్! తుఫాను ముంచెత్తిన తర్వాత వజవజా వణికిపోతున్న కోనసీమై పోతుంది గుండె. కణకణ మంటల జ్వాలలూ మనమే. శీతల నవనీతాలు మనకు కావలసిన చోట బతుకు మెడమీది కాడి కావద్దు కదా. రెపరెప దీపాల ఆశలూ మనమే, అరచేతుల రక్షక పత్రాలూ మనమే మనకు కావలసిన చోట శ్వాస ఒక అసహనపు వేదన కావద్దు కదా!

1986 మంచి 96 వరకూ శ్రీధర్ ఉత్తేజాలూ, విరహాలూ, ఆరోపణలూ కవిత్వం రూపం తీసుకొని ఆకుపచ్చ లోయగా అచ్చయ్యింది. శ్రీధర్ గుండెను ఫోటో తీసినట్లు శివాజీ ముఖచిత్ర రూపకల్పన. బహుశా ఈ కవిత్వం ముమ్ముందు మన నుండి ఎంతోకొంత నేర్చుకొంటుంది. బహుశా ఈ కవిత్వం మనకు ఎంతో కొంత నేర్పుతోంది. కానీ శ్రీధర్! నీ కవిత్వానికి వెనకా ముందూ మాటల సిఫారసులు అవసరమా?

కవిత్వం అభిమానులంతా తప్పక చదవాల్సిన పుస్తకం.

**నామాడి శ్రీధర్ కవితల పుస్తకం**
**'ఆకుపచ్చలోయ'కు పరిచయం 28 ఫిబ్రవరి 1997**
**'ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక'**

# సాహితీ కాలుష్యంలో ఒక స్వచ్ఛమైన శ్వాస 'కక్క'

సాహిత్యానికి సంబంధించి దబాయింపులూ, బుకాయింపులూ తెలుగు గడ్డమీద కొత్తేమీ కాదు కానీ, ఈ మధ్య అవి మరింతగా పెచ్చరిల్లిపోతున్నాయేమో ననిపిస్తుంది. ముఖ్యంగా కాల్పనిక సాహిత్యం, కథాసాహిత్యం పేరుతో ఆ బుకాయింపులు తారాస్థాయికి చేరుకున్నాయి. ఇటీవలి కాలంలో కతల పేరుతో జరిగిన ఏ 'జాతర' నుండైనా అందుకు సవాలక్ష వుదాహరణలను ఇవ్వొచ్చు. ఆ దబాయింపులకు సరికొత్త పీఠాలను రూపొందించి, పీఠాధిపతులకు సరికొత్త ముఖాలు తొడిగి, వాళ్ళను రాజ్యాభిషిక్తులను చేయడానికి తమను తాము 'రచయితలు'గా పిలుచుకొనే భజనపరుల గుంపు నానాతంటాలూ పడుతుండటం ఇటీవలి వివరిహాసం. అందుకోసం వేదికలు సిద్ధం. (ఒకటి రెండు మినహాయింపులు ఎప్పుడూ వుంటాయి. అయినా క్షమించు గోర్కీ, నీకూ సాహిత్యానికీ ఎటువంటి సంబంధమూ లేదు. నీ 'డిజింటిగ్రేషన్ ఆఫ్ పర్సనాలిటీ'ని సరికొత్తగా తిరగరాసి నీ పేరుతోనే ప్రచారం చేస్తాం.)

గతంలో పాపులర్ సాహిత్యమనీ, సీరియస్ సాహిత్యమనీ ఆ రెంటినీ వేరుచేసే గీతేదో వున్నట్లుండేది. ఆ విభజన కథాకమామీషూ ఏమిటన్నది వేరే చర్చ. ఇప్పుడొస్తున్న సాహిత్యానికీ, రచయితల కలయికలకూ ఆ గీతేదో చెరిగిపోయినట్లనిపిస్తోంది. రూపసారాల్లో ఒక విస్తృతస్థాయిలో ఏదో పునరేరీకరణ జరుగుతున్నట్లుంది. ఎవరి మంచికో!?

భావకవులు వూహాప్రేయసుల్ని సృష్టించుకొని, వూహావియోగాన్నీ, వూహా విషాదాన్నీ కుమ్మరించారన్నట్లుగా ఇప్పుడు కాల్పనిక సాహిత్యం పేరుతో ఎక్కువ భాగం వూహా జీవితం చిత్రితమవుతుంది. సీరియస్ ముఖంపెట్టి పాపులర్ శైలిని ఆవిష్కరిస్తున్నామన్న దబాయింపు వినిపిస్తుంది. రెండు కొసమెరుపు వాక్యాలు దొరికితే చాలు. దానికి లింకుల్ని వూహిస్తే కథా, నవలా అయిపోతుంది. అందుకోసం జీవితం లాంటి వూహాజీవితాన్ని సంఘటనల్లాంటి వూహా సంఘటనలనీ, మనుషులు మాట్లాడుకొనే భాషలాంటి వూహాభాషనూ సృష్టించేస్తున్నారు. దానికి అందమైన కవర్ పేజీలూ, ప్రచారాల ఆర్భాటాలు.

'కక్క' అనే పేరుతో ఒక ఆధునిక 'క్లాసిక్' ఈ దశలోనే వచ్చివుండకపోతే తెలుగు భాషలో కాల్పనిక సాహిత్యానికి సంబంధించినంతవరకూ (ఇప్పటికీ) ఏ ఆశా బతికి వుండడానికి ఆలంబనే దొరికివుండేది కాదు. గతంలో అస్సలేమీలేవని కాదు. భవిష్యత్‌లో మరేమీ రావనీకాదు. కానీ ప్రాణాంతకమైన సాహితీ కాలుష్యం ఆవరించినప్పుడు ఒక స్వచ్ఛమైన ప్రాణవాయు తెమ్మెరలాగా 'కక్క' నవల వచ్చింది. ఆ నవలని అల్లినవాడు వేముల ఎల్లయ్య. బతుక్కి సంబంధించీ, భాషకు సంబంధించీ 'పణా' (Stakes) లేవీ లేనివాడు. అందుకే 'కక్క' నవల బతుకంత సజీవంగా, బతుకంత సాదాసీదాగా, బతుకంత అద్భుతంగా వచ్చింది.

దళిత సాహిత్యాన్నీ ఆ మాటకొస్తే తెలుగు సాహిత్యాన్నీ సజీవంగా వుంచడానికి నల్గొండ సాహితీ మిత్రులు ముఖ్యంగా గోసంగి మిత్రులు చేసిన కృషి ప్రతి మలుపులోనూ కన్పిస్తుంది. 'కక్క' నవలలో విచిత్రమైన భాషనూ, బతుకునూ చూస్తుంటే తెలుగువాళ్ళగా పుట్టినందుకు గర్వమేస్తుంది. చాలా అరుదుగా దొరికే సందర్భం. ఆ బతుకునుండీ, ఆ భాషనుండీ విశ్వ విద్యాలయాలూ, పీఠాధిపతులూ, నిఘంటు నిర్మాతలూ ఏం నేర్చుకొంటారో తెలియదు కానీ మన అమ్ములపొదిలోకి పదాల, భావాల శరాలను నల్గొండ కవులు, రచయితలు అందించారు. అక్కడివాడు వేముల ఎల్లయ్య. కవిగా అందరికీ తెలిసినవాడు. బతుకు పెనుగులాటలోంచి పుట్టినవాడు. కలం పట్టి, అవ్యక్త సమాజపు వ్యక్తీకరణలుగా నిలిచిన కొద్దిమందిలో శక్తివంతమైనవాడు. 'కక్క' నవల రాయడానికి అతనంతగా కష్టపడ్డాడని అనిపించదు. తను బతుకుతున్న తెలంగాణా పల్లె, అందులో మనుషులు, వాళ్ళమధ్య సంబంధాలు, రచ్చబండ, వూరి రాజకీయాలు, సంస్కృతి, ఆర్థిక జీవనం అన్నింటినీ మాదిగపల్లెలో నిలబడి చూపించాడు అంతే. ఒక సామాన్యమైన ప్రయత్నం. కానీ అందుకు ఎంత శక్తి కావాలో కక్క నవలలోని ఒక్కొక్క వాక్యం చదువుతుంటే అర్థం అవుతుంది. ఒక కన్ను మూసి చూడడానికీ, రెండు కళ్ళు తెరుచుకొని చూడడానికి మధ్య వున్న తేడా. పల్లెను వూరి నుండి చూడడానికీ, వాడవైపు నుండి చూడడానికీ వున్న తేడా మనకు స్పష్టంగా తెలుస్తుంది. మన మేధావుల మెదళ్ళలో 'భారతీయ గ్రామం' అన్న నమూనా భావన ఒకటి తిష్ట వేసుకొని కూర్చునివుంది. గ్రామాన్ని మాదిగ పల్లె నుండి చూపించడం ద్వారా వేముల ఎల్లయ్య ఆ నమూనాను తుత్తునియలు చేశాడు. ఆ ప్రయత్నంలో చిత్రితమైన బతుకు, భాష ఎంత విడదీయరాని అంశాలో!

నిజానికి వేముల ఎల్లయ్య రాయాలనుకొంటే ఇప్పుడు చాలామంది కథారచయితలు రాస్తున్న పాపులర్ శైలిలో రాయగలడు. కానీ అతని వుద్దేశం అదికాదు. బతుకు చుట్టూ ఏ మాయలూలేని, పాత్రల చుట్టూ ఏ తేజోవలయాలూ లేని వట్టి బతుకుని తనదైన రూపంలో, తనదైన భాషలో (ఎల్లయ్యవి కావు బతుకువి) వ్యక్తం చేయాలనుకున్నాడు. ఈ 'అసలుతనం' వల్ల ఎల్లయ్యను ఇప్పుడు కథలు చదువుతున్న పాఠకులు చాలామంది వెంటనే ఆమోదించలేకపోవచ్చు. దానివల్ల తేలిగ్గా చప్పట్లనూ, మెచ్చుకోళ్ళనూ పొందే అవకాశాన్ని ఎల్లయ్య తనంతట తానుగా విసిరిపారేసుకున్నాడు. అయితే 'చదవడం కూడా సృజించడం' అన్న ప్రక్రియకు ఎల్లయ్య తలుపులు తెరుస్తున్నాడు.

గుడిసెలో ముసలమ్మ గొణుగుతుంది. కక్కడి అయ్యమ్మ. మాదిగోల్ల ముసలమ్మ. కక్కడంటే తెలుసుకదా. ఈ కక్కడు కాదు. దళిత తత్వవేత్త. పోతులూరి వీరబ్రహ్మం శిష్యుడని చెప్తారు. అతని పేరు చాలామంది దళితులు పెట్టుకొన్నారు. మన కక్కడు అటువంటి పేరు పెట్టుకున్న మామూలు కక్కడు. అందరూ తల్లి కడుపు నుండి బయటపడేముందు తలను ముందు

బయటపెట్టి ప్రపంచంలోకి వస్తారు. కానీ కక్కడు ముందు కాళ్ళను బయటపెట్టి భూమిమీదికి వచ్చాడు. 'ఎదురు కాళ్ళతో పుట్టేవాడికి పిడుగు గండం' వుందనేది ఒక నమ్మకం.

'కక్కా! నీ పుట్కపాడుగాను. తొండికో మొండికో నువ్వెద్రు కాళ్ళ బుట్నోనివి! ఇసిరిసిరి వొర్షంల జరపైలంగుండాలే. లేకుంటే పిడుగుపడి జత్తవురా అని నెత్తి గొట్కోని మొత్కోని జెప్తున్న. నేనేం జెప్పుత ఎక్కడేడ్డు నా అన్నోల్లు లేన్దాన్ని ఆరి ఇనవైతివి..." ముసలమ్మ గొణుగుతూనే వుంది. ఎట్టైనా వాడి కాళ్ళకు పంచలోహపు కడియం వేసి ఎదురుకాళ్ళ బుట్టినందుకు వచ్చే పిడుగు గండం తప్పించాలని ముసిల్దాని ఆశ. కక్కడు మొత్తం దళిత సమాజానికి ప్రతీక. పిడుగు గండం ఏమోగానీ అడుగడుగునా బతుకుగండం. ఈ బతుకును చిత్రించడం ద్వారా ఎల్లయ్య ఒక చేత్తో సాహితీకారుడి కర్తవ్యాన్నీ, మరొక చేత్తో చరిత్రకారుడి కర్తవ్యాన్నీ నిర్వర్తిస్తున్నాడు. బతుకు నుండి చరిత్రను నిర్మించే పనిలో భాగస్వామి అవుతున్నాడు.

తల్లి కడుపున పడంగానే తాపేదారి దగ్గర జీతముండి బురద పొలంలో నాగలి దున్నుతున్న తండ్రిని ఎర్రతేలు కరిచి చనిపోయాడు. కడుపుతోవున్న తల్లిని ముసలమ్మే ఆదరించింది. కక్కడు పుట్టేనాటికి తల్లీ, నాయనమ్మలే వాడికి దిక్కు. బిడ్డల్ని ప్రేమతో పెంచడం అన్నదానికి ఏం నిర్వచనం యిస్తాం? 'ఈ ప్రేమలోకంలో ఎవరి ప్రేమలు వాళ్ళవి'. తల్లిప్రేమకు కూడా కులమూ, ఆర్థిక నేపథ్యాలూ వుంటాయి కదా! ఎంత గారాబాల కొడుకైనా పాలు మరిచీ మరవంగానే ఆటపాటలతో కాలం గడిపి, బడికి పోయి చదువుకొనే వయస్సులో కక్కడ్ని తల్లి పటేల్ ఇంట్లో పాలేరుగానే వుంచింది. పటేలింట్లో పాలబుగ్గల జీతగాడయ్యాడు కక్కడు. బిడ్డ ఎట్ట బత్కుతడో అని అంగలార్చుకొంటూనే చనిపోయింది ముసలమ్మ. ముసలమ్మ చనిపోయే సమయానికి పాలేరు కక్కడు మిగతా పసుల గాసే పొల్లగాండ్లతో పసుల పండగ చేసుకొంటున్నాడు. చావు వార్త తనతోటి పిల్లలకు తెలుసు. చెబితే కక్కడు ఏడ్చీ అన్నం తినడేమోనని తిన్న తర్వాత చెప్తామనుకుంటారు. 'హొయిసు సిన్న దైనోలైనా పెద్ద బుద్ధి తోటి బాదంత కడ్పుల దాసుకుండ్రు'.

'పీర్లాడు తాళ్ళల్లకు బొయ్యి కల్లు పట్వదెచ్చిండు వంటల్గింట్లోండి పటేల్లేన్ది జూసి బాయిల ఈతగొట్టి బోచర్ల తానం జేసింద్రు. నాల్గుదొడ్ల గొడ్లను వొక్కదగ్గర్కి గుంప్జేసి పండ్కోబెట్టిండు కక్కడు. అందరు ఖుషీగా అడ్వినంత తోర్నాల్గట్టి తీర్తిరు పూలతోటి తిర్నాల బాట్జేసింద్రు. పుచ్చకాయ పొల్గవ్వి పప్పన్నం ఎడ్ల పంతలగొట్టి కుంక్మ పూతల్తోటి అడ్విని ముత్తైదుని జేసినట్టు జేసింద్రు. ఎండు తుమ్మకాయలు జనుంకాయలు పస్లమెడల్ల దండలు గల్లుగల్లు మంటుంటె ఆనందంగ ఆవులు లేగదూడలు గంతులేస్తుంటే కాలుగల్పి పసుల పోరగాళ్ళు పాటల్ పాడ్తుంటే గుడ్డి గోరెంకల అర్పులు మేలతాలాలైనాయ్. గొడ్లు తాడ్తడి పచ్చిగడ్డి కంచెంత కలెదిర్గి మేత్తుంటే ఊరు ముత్తాలమ్మకు బోనాలు జేర్సినట్టుగ పసులు వొర్సబంతులాయె!"

బొమ్మ కన్పిస్తుందా. నవలంతా యింతే. అనేకానేక నలుపు, తెలుపు తైలవర్ణ చిత్రాలు. కత్తుల్తో మాట్లాడుతూ.

దెబ్బలు, పటేల్ అరుపులు, తన్నులు వీటిమధ్యే ఎదిగాడు కక్కడు. వీడి బాధల్ని చూడలేక ఏదో సాయం చేద్దామనుకున్న పొరుగు జీతగాడు ఎల్లయ్యకీ తల్లి కలెమ్మకీ (మన్మజార్స) 'లంజెరికం' అంట గట్టి పంచాయితీ పెట్టిస్తారు పాలోల్లు. ఆమెకీ కక్కడికి వున్న కాస్తంత భూమిలో వాటా యివ్వాల్సొస్తుందని వాళ్ళను వదిలించుకొనే ఆలోచన. దళిత జీవితాల్లో 'కమ్యూనిటీ' పాత్రని కళ్ళకు గట్టినట్లు చిత్రిస్తాడు ఎల్లయ్య. కలెమ్మ, కక్కడు సమూహంలో ఒంటరులైపోతారు. నేరం 'రుజువు' చేసి కులం నుండి వెలేస్తారు. 'వెలి' ఎంత దుర్మార్గమైందో అనుభవిస్తేకానీ తెలియదు. దాన్ని మన అనుభవంలోకి తెస్తాడు ఎల్లయ్య. అగ్రకులాల నుండి అరువు తెచ్చుకున్న ఆచారాలు ఎన్ని వదులుకోవాలో చెప్పకుండా చెప్పాడు. వీళ్ళని వొంటరులను చేసి హింసించిన కులమే అనేక సందర్భాల్లో కక్కడికి అండై నిలుస్తుంది. నువ్వు వొంటరివికావు. నీతో అందరంవున్నాం అని చాటిచెప్తుంది. అందుకోసం మొత్తం కులానికి కులమే దాడులకు గురవుతుంది. జైలు పాలవుతుంది. అయినా కలిసికట్టుగా నిలబడుతుంది. ఒకదాని కొకటి పూర్తిగా భిన్నమైన 'సామూహిక ప్రవర్తనలను' ఎల్లయ్య అద్భుతంగా కక్క నవలలో చిత్రించాడు. తల్లిమీద వచ్చిన అపవాదును మాపడానికి తానే పెళ్లి పెద్దయి తల్లికి పెళ్ళి సంబంధం చూసి, అత్తవారింటికి సాగనంపాడు. కొడుకు ఎట్ల పెరుగుతాడో అన్న దిగులుతో వెళ్ళలేక వెళ్ళలేక అత్తోరింటికి వెళ్ళిన తల్లి మళ్ళీ తిరిగిరాదు. చివరికి కొడుకు పెళ్ళికి కూడా రాదు. ఆమె బతుకుపోరు ఆమెది. తనకు తానే అన్నీ అయ్యి అవమానాల్నీ, కష్టాల్నీ భరిస్తూ కులంతో భాగమయ్యి సాగే కక్కడి జీవితమే 'కక్క' నవల. కక్కడి జీవితమంటే మొత్తం దళితుల జీవితం. అతని బతుకులోనూ,పనిలోనూ, పోరాటంలోనూ తోడూనీడా భార్య లస్మక్క. ఆమె తాత పకీరు. పకీరు తాతంటే గ్రాంసీ పేర్కొన్న Organic Intellectual. పెద్ద మాదిగోడు. ఊరి వెట్టి. అతని చుట్టూ తేజోవలయం ఏమీ వుండదు. అసాధారణ నాయకత్వ లక్షణాలు ఏమీవుండవు. అయినా నాయకుడు. గొప్ప మేధావి లక్షణాలేమీ వుండవు. అయినా మేధావి. బతుకు సారం తెలిసినవాడు. ఎట్లయినా కాలంలో భాగమయ్యి, వెట్టి హక్కును పొందాలని ఆశపడే కక్కడికి జీవన రహస్యాలను ఎన్నింటినో బోధిస్తాడు. అయినా అతను అమాయకుడు. ఆ వూరికి అవడం అతనే సర్పంచ్. కానీ ఆ విషయమే అతనికి తెలియదు. వాళ్ళకు వూరంటే పటేలే. పటేలే ప్రభుత్వం. అయితే అణచివేతల్లోంచి పెరిగే ఆత్మగౌరవం కాళ్ళకింద చెప్పుల్లాగా వుండనియ్యదు. అధికారాన్ని సవాల్ చేస్తారు. ఫలితంగా దాడులు. తెలంగాణా పటేళ్ళ 'రాజకీయాల్నీ' దుర్మార్గాల్నీ కళ్ళకు కట్టినట్టు చిత్రించాడు ఎల్లయ్య. కక్కడి పెళ్ళవుతుంది. దక్కలోల్లు చెయ్యాల. వాళ్ళ కథా వుంది యిందులో. కక్కడ్ని వెలేసిన కులమే అన్ని పనులూ

మీదేసుకొని కక్కడి పెళ్ళిచేసింది. ఆడోళ్ళు మగోళ్ళు పుట్ట బంగారం (పుట్టమన్ను) తేవడానికి వెళ్ళారు. అయితే మట్టి తేవడానికి పొయ్యినోళ్ళ మీద పటేళ్ళ దాడి. తలలు పగిలినయ్, నెత్తుర్లు కారినయ్. కూటికి పేదోళ్ళయినా కులానికి పేదోళ్ళం కామనుకొనే సూద్దరోళ్ళు (శూద్రులు – బీసీలు) కూడా వాళ్ళమాట వినకపోతే బతుకుందదన్న భయంతో పటేళ్ళ పక్షమే వున్నారు. పటేళ్ళలో ఇప్లవ రెడ్లు కూడా వున్నారు.

కమ్యూనిస్టు వుద్యమంలో చేరి ఎంతోమంది పటేళ్ళు భూములెలా సంపాదించుకున్నారో ఎల్లయ్య రాశాడు. తమ బతుకులలోంచి పుట్టిన కళల్ని 'జనపదాల' పేరుతో ఎలా కొల్లగొట్టారో రాశాడు. ఇవన్నీ చాలవన్నట్లు చాపకింద నీళ్ళలా 'ఆంద్రోల్లు, కమ్మోల్లు, తెలంగాణా పల్లెల్లోకి ఎలా ప్రవేశించారో, భూముల్ని సంపాదించుకోవడం మాత్రమే కాకుండా తిండిగింజల స్థానంలో పత్తి పొగాకు పంటల్ని ప్రవేశపెట్టి బతుకుల్ని ఎంతగా చిందరవందర చేశారో ఎల్లయ్య రాశాడు. తానావారి అవార్డు పొందిన 'రేగడి విత్తులు' నవలనీ, 'కక్క' నవలనీ ఒకేసారి పక్కపక్కనే పెట్టుకొని చదివితే ఆలోచనల్లోనూ, 'చూపు'లోనూ ఎంత తేడావుందో అర్థం అవుతుంది. ఒకటి Language of power మరొకటి Power of Language (అయినా సరే కథారచయితల 'ఐక్య' వేదికలు వర్ధిల్లాల్సిందే!). రేగడి విత్తులు నవలకు 'కక్క' నవల సరైన సమాధానం.

మట్టి తెచ్చుకున్నందుకే పటేళ్ళు దాడి చేశారు. కేవలం మట్టి పోయిందని కాదు. మట్టి మాత్రమేకాక భూములడుగుతారని వాళ్ళ భయం. దాంతోపాటు అధికారం అడుగుతారని భయం. దళితులు అదే చేశారు.

వేముల ఎల్లయ్య తెలంగాణా పల్లె ఆత్మని ఈ నవలలో చిత్రించాడు. కుట్రల్లోంచి, కుత్సితాల్లోంచి, దాడులనుంచి, అంటరాని అవమానాల నుంచి దళితుల్లో పెరుగుతున్న ఆత్మ గౌరవ చైతన్యాన్నీ, రాజ్యాధికారం కోసం దళితుల పోరాటాన్నీ రాశాడు. అన్నింటా అంతస్సూత్రంగా దళితుల జీవన సంస్కృతిని ఏమాత్రం రూపం చెదరకుండా చిత్రించాడు. జీవితంలోని సౌందర్యంతోపాటు, బీభత్సాన్ని చిత్రించాడు.

**'ఆదివారం వార్త' 24 సెప్టెంబర్ 2000**

# పాటా... రేలాపూతా... గోరటి వెంకన్నా... ఎందుకు పుడతాయి!

**నగరం గదిలో ఓ అర్ధరాత్రి**
**నేనూ ఖాదరన్నా సిగరెట్ పొగల కూలర్లతో...**
**కలత నిదురతో కలవరిస్తూ పక్క మీద పొర్లుతున్నదొక మహాకాయం**
**తీవ్రమైన పెనుగులాట, దుఃఖ సముద్రాల గుండెఘోష**
**ఆ గుండె మీద చెవిపెట్టి ఆ పలవరింతలను**
**అక్షరబద్ధం చేసేందుకు సకల ప్రయత్నాలూ చేస్తున్నాడు సౌదా.**
**అదొక మహా ప్రసవ సమయం.**
**అర్ధరాత్రి చీకటి కనుకొలకుల నుండి**
**కన్నీటి మెరుపుల పాట పుట్టింది**

గోరటి వెంకన్నని కనడానికి ఆ యీరమ్మ తల్లి ఎన్ని నొప్పులు పడిందో కానీ పాటని ప్రసవించడానికి గోరటి వెంకన్న పడిన నొప్పులకు ఆ ఎనిమిది కళ్ళూ ప్రత్యక్ష సాక్ష్యం. సకల మానవాళికీ చెందిన గాయాల నొప్పుల్ని స్వీకరించిన గొంతుక ఆలపించే పెనుతుపాను హోరును ఆ రాత్రి మేం విన్నాం. 'కన్నీరొక చుక్కన్న చాలు... ఏ కష్టమైన భరియింతును...' తెల్లవారిన తర్వాత పక్కలో సిద్ధార్థుడు కనిపించకుండాపోయినప్పుడు బహుశా యశోధర గుండెల్లో అదే తుఫాను హోరు వినిపించి ఉంటుంది. లేదా చెన్నుడో, జాంబవంతుడో పుట్టినప్పుడు ఆ హోరు వినిపించి ఉంటుంది. క్రీస్తో, అంబేద్కరో చనిపోయినప్పుడు గుండెల్ని అటువంటి దుఃఖపు హోరు ఆవరించి ఉంటుంది. ఎవరి కష్టం.... ఎవరి కన్నీరురా గోరెటెంకా! చుక్కలు చుక్కలుగా ఆ రాత్రిని పాట తడిబంధమై పెనవేసుకున్నది. యీరమ్మ తల్లి కొడుకును కనబోయి పాటను కన్నది. ఆ పసిగుడ్డు జాతి గుండెను తన గొంతుకతో మీటుతూ పెదవులపైన విశ్వరూప సాక్షాత్కారం గావిస్తున్నాడు. పాడియాడి అలసి సొలసి... గోరటెంకడెక్కడని... ప్రాణమిత్రులడిగినప్పుడు ప్రజలను చూపిస్తున్నాడు గోరటివెంకన్న. ఒక చరణాన్ని జనం మీదికి వదిలి కోరస్ పూర్తి కాకముందే అప్పటికప్పుడు కొత్త చరణాన్ని ఆశువుగా కైగట్టే ఎంకన్నది నిత్య ప్రసవవేదన.

గోరటి వెంకన్న రెండవ పాటల పుస్తకం మోహన్ అందంగా తీర్చిదిద్దిన ముఖచిత్రంతో 'రేలపూతలు'గా వచ్చింది. అంతకు ముందు 'ఏకునాదం మోత' పేరుతో వచ్చిన పుస్తకం అందరికీ తెలిసిందే. దానికి దీనికీ మధ్య ఒక అద్భుతమైన పరిణిత పరిణామం మనకు స్పష్టంగా కనిపిస్తుంది. గద్దర్ ఆగిపోకముందే ఒక పరిపక్వమైన గర్వకారణమైన వారసత్వాన్ని

తెలుగు పాటకు గోరటి ఎంకన్న సృజించియున్నాడు. మెక్సికన్ జపటిస్టా గెరిల్లాల ధిక్కారమూ, వ్యంగ్యమూ, బ్రెజిల్ భూమిలేని కూలీల పోరాట నాయకుడు తోలా ఆర్తీ ఆగ్రహమూ, పాల్‌రాబ్సన్, నెరుడాలను దక్షిణాఫ్రికా జూలూలతో రంగరించి పోతులూరి వీరబ్రహ్మంగారి గొంతులో పోస్తే పుట్టే గరళపు మొరటు తియ్యదనం గోరటి వెంకన్న గొంతుక. వెంకన్న తల్లి పాలుకాదు పల్లెపాట తాగి పెరిగినవాడు. బైరాగుల ధోరణికి చెందినవాడు. అయినా అత్యంతాధునిక, ఆధునికాంతర ధోరణులను జీర్ణించుకున్నవాడు. పల్లె అతని తల్లి.

'రేలపూతలు'లో పల్లె అందాలు, పల్లె విధ్వంసం, కరువు, కన్నీరు, సంబరాలు, తెలంగాణ, పాటపైన దాడి, ప్రతిఘటన, అమ్మ, సామూహిక దుఃఖం, ఆత్మవిమర్శ మొదలైన వస్తువులతో పాట ఉంది.

కరుణ, దుఃఖం, ధిక్కారం, కవితాత్మక విశ్లేషణ, తనను తాను దర్శించిన నిర్లిప్తత, తత్వజ్ఞానం అన్నీ కలగలిసిన ఒక సరికొత్త 'లావారసం' (శ్రీశ్రీ సృష్టించాలని కలలుకన్న రసం) గోరటి వెంకన్న పాటల ద్వారా మన అనుభూతుల్లోకి వస్తుంది. ఉపన్యాసాలిచ్చే చాలా మంది మేధావులు పాటని కవిత్వంగా గుర్తించడానికి నిరాకరిస్తారు. లేదా తటపటాయిస్తారు. గోరటి వెంకన్న పాట పుస్తకాన్ని ముందు పెట్టుకొని సంగీతాన్ని, రాగాన్నీ రద్దుచేసి చదవండి. అది అత్యాధునిక, ఆధునికానంతర పచ్చి పురుటి పరిమళాల కవిత్వం. పల్లె గుర్తుకు వచ్చినప్పుడల్లా వెంకన్న ప్రకృతి ముందర పసిబాలుడైపోతాడు. 'నా పల్లె అందాలు... చూసితే కనువిందురో...' వింటే మంచిది. వినకపోయినా చదివినా సరే ఏదో ఒక పురారాగం మిమ్మల్ని వెంటాడుతుంది. మహబూబ్‌నగర్ పల్లెల్నీ, రాయలసీమ పల్లెల్నీ (ననుగన్న నా తల్లి రాయలసీమ), ఆఫ్రికా, లాటిన్ అమెరికా పల్లెల్నీ వాటి సాధారణ లక్షణాలను ఇంత బొమ్మ గట్టినట్టు ఆవిష్కరించగలగిన విశ్వకవి గోరటి వెంకన్న మాత్రమే అవడం తెలుగువాళ్లు గర్వపడాల్సిన విషయం. 'కండరేగి తీపివోలె లచ్చుమమ్మో... నీ కంఠమెంత మధురమే ఓ లచ్చుమమ్మా...' పాట వెంకన్న గొంతులోనే వినాలి. దళిత యీస్తటిక్స్‌కి అత్యున్నత రూపం 'నీ చెమట చుక్కలు రాలుతుంటే లచ్చుమమ్మా.... ఆ చేను చెలకలు దోసిలొగ్గును లచ్చుమమ్మా...' అని గోరటి వెంకన్న ఆలపిస్తుంటే దుఃఖానికి సంబరానికి మధ్యన ఒక No Man's Land ను వెతుక్కోలేక కన్నీళ్ళ సౌఖ్యాన్ని పొందుతాం. పాఠకుల్నీ, శ్రోతల్నీ ఒక ambivalent situation లోకి నెట్టేస్తాడు. పల్లె అందాలను చూస్తూ అలా పరవశిస్తూనే ఉండిపోడు. పల్లె విధ్వంసాన్ని అత్యంత బాధ్యతతో పట్టి చూపించి చెలరేగిపోతాడు.

'పల్లె కన్నీరూ పెడుతోందో... కనిపించని కుట్రల తల్లీ బందియైపోతుందో...' అన్న పాట జనం నాల్కల మీద ఒక ఉద్యమ నినాదమైంది. మహబూబ్‌నగర్‌లో జరిగిన అంబేద్కర్ జాతరలో గోరటి వెంకన్న ఈ పాట పాడడం మొదలుపెట్టగానే పదివేలకు పైగా ఉన్న

శ్రోతలు తామే గాయకులై వెంకన్నను శ్రోతగా మార్చిన విషయాన్ని మర్చిపోవడానికి వల్లకాదు. గ్లోబలైజేషన్‌కి వ్యతిరేకంగా సెమినార్‌లూ, లక్ష ప్రదర్శనలూ, పదిలక్షల ఉపన్యాసాలు తీసుకురాలేని ప్రభావాన్ని ఈ పాట తీసుకువచ్చింది.

గ్లోబలైజేషన్ ప్రభావాన్ని దాన్ని ప్రతి నిర్దిష్టతలోనూ పట్టుకున్నాడు గోరటి వెంకన్న మయకోవిస్కీ రాసినట్లుగా 'కన్నం దొంగల్ని కన్నంలోనే' పట్టుకున్నాడు. బహుశా గ్లోబలైజేషన్ వ్యతిరేక ఉద్యమాలను నినాదాల స్థాయి నుండి, తిరునాళ్ళ స్థాయి నుండి నిర్దిష్టమైన వాస్తవ ఉద్యమరూపం స్థాయికి తీసుకువచ్చేందుకు ఈపాట రాసిన గోరటి వెంకన్న తెలంగాణా దళితుడు కావడమూ యాధృచ్చికమైన అంశాలు కావు. గద్దర్‌పైన కాల్పులు జరిగినప్పుడు వెంకన్న రాసిన పాట పాలకుల అసమర్ధతను ఎత్తిచూపుతూ పాట గెలుపు తథ్యం అని చాటి చెబుతుంది.

యింకా తత్వాల రూపంలో రాసిన పాటలు అనేక సందర్భాలకు అనేక రకాలుగా అన్వయం అయ్యే నిత్య సత్యాలు. 'రాత్రి', 'కొంగమ్మా...', 'తెల్లారిపోతుంది హరిదాస', 'మానవీయుల మరువబోకన్నా' లాంటి తత్వాలు ఈ దేశపు మరో ప్రపంచపు ఆత్మ. 'సేతానమేదుందిరా సేలన్ని బీడాయెరా!', 'ఏమి మారే ఏమి మారేరా... పేదోల్ల బతుకులో' లాంటి పాటలు కరువుకూ, కన్నీళ్ళకూ వ్యతిరేకంగా గ్రామీణ భారతం సాగించే యుద్ధానికి ఆయుధాలు. 'పాట పాడేటి పిల్లలు ఊట సెలిమల్లో... ఆటలాడేటి పిల్లలు మోటగిరుకల్లో....' పాటలో ఎంకన్న పల్లె పిల్లోడై పోతాడు. వాగులోన యీదే చేపై పోతాడు. ఒడ్డున ఊగే రెల్లుగడ్డైపోతాడు. పీకల పిట్టలు, కొంగల బారులు, పీతలు, కొత్తగవ్వలు అయిపోతాడు. యిక 'రేలా దూలా తాలెల్లాడేనెలా, నా తెలంగాణా పాట' తెలంగాణా సంస్కృతి ఔన్నత్యాన్నీ, పాలకుల నిర్లక్ష్యాన్నీ ఆగ్రహంగా తెలియజేసే పాట.

చదువుకొని పైకొచ్చి దళిత సమాజాన్నే మర్చిపోయిన దళిత ఆఫీసర్లమీద రాసిన పాట 'ఎందుకిట్ల మారెరో' అన్న పాట, 'సగటుబతుకు', 'వహ్వారే మా దొర' పాటలు ఎంకన్న లాంటి వాళ్ళు మాత్రమే రాయగలిగినవి. అమ్మ పాట గురించి చెప్పనక్కరలేదు. గోరటి ఎంకడు బతికున్న కాలంలోనే మనమూ పుట్టినందుకు మనం గర్వపడాలి. వాడొక బైరాగి. వాడొక పాటల చనుబాలు, వాడొక నిర్లక్ష్యపు బాటసారి. కుపిత ఆకాశ నేత్రంలోని ఎర్రటి జీర గోరటి వెంకన్న. ఈ పుస్తకం మీ దగ్గర లేకపోతే మీ అభిరుచులలో ఏదో లోపం ఉన్నట్లే. డబ్బులిచ్చి కొనుక్కునో, దొంగతనం చేసో పుస్తకాన్ని సంపాదించండి. పాటల్ని పారేసుకున్నది జనం గొంతుల్లోనే కదా అన్న ధీమాతో నడిచిపోయే వెంకన్నకు అక్షరాల్ని ఏరి పుస్తకాలుగా కూర్చే బలరాం లాంటి స్నేహితులండటం తెలుగుజాతి అదృష్టం.

**వార్త, ఆదివారం అనుబంధం, 16 నవంబర్ 2003**

# పిడికిళ్ళై మోహరించిన గుప్పెడు కవిత్వం

**"వాక్యమంటే చిందు బాగోతమయ్యా...**
**దాని రక్తం మారదు పెనురక్త చాపం**
**దాని గొంతెప్పుడూ జియాగూడ కబేల**
**గన్నేరు కాయల్ని తంగేడు మొగ్గల్ని**
**డొక్కలో కుక్కుకుంటుంది**
**దాన్నే పాము కాటేసిందో**
**దాన్నే కొరకాలిప్పుడు**
**దూప... దూప... సైసుబిడ్డా దూప..."**

సిద్ధార్థ పెదవులపైన వాక్యాలు చిందామె గజ్జెలు కట్టుకొని బాగోతమాడుతున్నాయి. పసితనం, పల్లెతనం, అమ్మతనం అంతా బెంగ బెంగ... సొంత గొంతులోంచి గుండె కార్చే కన్నీళ్ల జల.

**"అరేయ్**
**పల్లెకు పోయావా**
**నిర్ఘుంగా...**
**నిద్రపోయావా అక్కడైనా**
**కాలుతూ శివాలు వూగుతూ**
**వాక్యాలే వాక్యాలు**
**జీవితకాలాల నాకంతో శోకం**
**ఇద్దరిద్దరి నడుమ భగ్గుమనే ద్వేషం**
**కొలుముల కనుమలు"**

బతుకు పెనుమంటల పరిష్వంగంలోంచి తనను తాను సాంద్ర కవిత్వంగా ఆవిష్కరించుకుంటోంది.

కులం కలుషిత రేఖకు ఆవలివైపునే. అయినా అడుగుపొరల్లోనే, గీతలు చెరిపేందుకు లేదు. వూపిరాడదు. వుక్క పోస్తుంది. గాయం సలపరిస్తుంది. పైపైకి జరిగేందుకు వూరొప్పుకోదు. కిందకి కలిసేందుకు బతుకొప్పుకోదు. అంతటా ఎడతెగని సంఘర్షణ. ఆ ఘర్షణలోంచి పుట్టుకొచ్చింది – బిసి కులాల్లో పుట్టిన కవులు రాసిన కవిత్వం.

**"ఆగిన కాడల్లా కలే**
**కదిలిన దిక్కల్లా ఎడబొచ్చే**

**ఈత బొత్తల కొస నవ్వుల్లో**
**పొద్దు జల్లెడై పొడిసింది"**

అంటూ ఎం. వెంకట్ వెనుకబడ్డ కలల నెత్తుటిభాషను అక్షరాల్లోకి ఎక్కిస్తున్నాడు.

**"నీ దేవుడి మాన్యం పేర**
**నా తాత కండల్ని తిని పండిన**
**పంట మేసే బాపనయ్యా**
**అది పచ్చి నరమాంసాహారమే**
**కంటి కింద పుట్టు పండినా**
**పాడె మీదకే ఎక్కని గడ్డి**
**ఏలకేలకు ఎండ్లెళ్ళినా**
**ఈ కాడి కింది**
**ఎద్దులకు కలలేవి?**
**ఈ నేల ఈడ్చుక పోయినా బాగుండు**
**ఇంకా ఎన్నాళ్ళు**
**ఈత ఈతకు ఓ తరం మంద"**

ఎం.వెంకట్ పుట్టు కవిత్వం – నల్లగొండ గుండెల మీద నాట్యమాడిన కవిత్వం. కరువు కడిగేసిన కన్నీళ్ళ కవిత్వం – బి.సి. కవిత్వం.

కొంతమంది బి.సి. కవుల కవిత్వంతో 'వెంటాడే కలాలు (వెనుకబడ్డ కులాలు) అనే పేరుతో జూలూరు గౌరీశంకర్ సంపాదకత్వంలో ఒక కవితా సంకలనం వచ్చింది. ఇరవైమూడు మంది కవులు రాసిన డెబ్బై మూడు కవితలు ఇందులో వున్నాయి. బి.సి.ల పేరుతో పిలువబడే అనేక కులాలల్లో పుట్టిన కవులు తమ బతుకునూ, భాషనూ, ప్రాంతీయాత్మనూ కవిత్వంగా విన్పిస్తున్నారు. మాదిగ దండోరా వుద్యమం వచ్చిన తర్వాత కవిత్వం మరింత నిర్దిష్ట వాస్తవికతల్ని ప్రతిబింబించడం మొదలు పెట్టింది. అమూర్తత్వాన్ని విడనాడడం మొదలుపెట్టింది. ఆయా బి.సి. కులాల నిర్దిష్టతల్లోకి పూర్తిస్థాయిలోకి వెళ్ళలేకపోయినా యిది కూడా నిర్దిష్టతల్లోనుంచి మాట్లాడేందుకు చేసిన మంచి ప్రయత్నం.

**"పెనిమిటి కోసమే పెంచబడ్డదానా**
**నా ఇంటి వనవాసమొచ్చిన బోగం పిల్లా**
**నా అనుమానాల్లో నా సరదాల్లో**
**మనసు మానాలు చిట్లి**
**నా బృందావన బ్రోకర్ ప్రేమలో**

బట్టలూడిన నా పెళ్ళామా
... నా అశ్శరభశ్శరభల్లో వేసిన
నీ అడుగుల్లో ఎక్కిళ్ళు
నా కాలు కింద నలుగుతున్నా
నా మగాటని ప్రేమించమని
నా పులిచారల పౌరుషాన్ని
నీ పసుపు కుంకాలుగా ఇచ్చినా
నీ బొడ్డు పేగునే
నా వారసత్వంగా ఇచ్చినదానా
ముట్టుకున్నానా! నీ నొప్పుల్ని..."

ఎ. దుర్గాప్రసాద్ గొంతుక కలవరపెడుతోంది. పెను నిద్దుర ముఖాన ఛెళ్ళున చరుస్తుంది.

"మట్టిపెల్లల కెల్లి బుట్టిన మొల్కను
బుర్దనీల్ల కెల్లి లేసిన పువ్వనని సోయిదప్పిన
రామునికి అనుమంతునోలిగె నీకంకితమైన
నా కొమ్మ బత్కును సక్కని తల్లి సెట్టుకు
ముడేసుకున్ననని పాల పొంగునైన
మనం తల్లిబిడ్డలమని ఊరంత శంకూది
తాటిసెట్టంత నిక్కిన
నువ్వు యాష్టలకొచ్చి సావుదల ఊసెత్తితే
నా నోట్లె మన్ను బోయకు దొర్సానీ అని
నీ కాల్లకు సుట్టుకున్న"

అనిశెట్టి రజిత సహజమైన గొంతుక.

"ఒక్కడి కాళ్ళొత్తుతూ పొందిన అవమానాన్ని తీర్చుకునేందుకు
మరొకడి చేత నా కాళ్ళొత్తించుకొనేందుకు సిద్ధపడి
నాపై నేనే యుద్ధం ప్రకటించుకోవాల్సిన ముద్దాయినైపోతాను
అయినదానికీ కానిదానికీ
తలాడించటం అవసరమై
తలవంచటం అనివార్యమైపోయింది – నాకు
కూటికి తక్కువైనా
కులానికి కాదన్న అహానికి గురై
నన్ను కూటికీ – కులానికీ కాకుండా చేసిన వాడి కుట్రకు ఎరై

**ఊరవతల బతికే నా అన్నదమ్ముల**
**అనుబంధానికి బలైపోయాను”**

అంటూ కో.ప్ర బి.సి. జీవితాన్ని పలికిస్తున్నాడు. బాధ, ఆగ్రహం, అవమానం, పశ్చాత్తాపం కలగల్సిన భాష. ఇంకా జి. విజయలక్ష్మి, మందరపు హైమావతి, జూపల్లి ప్రేమ్‌చంద్, దెంచనాల శ్రీనివాస్, ప్రసేన్, సీతారాం, ఎన్.గోపి, ఎస్వీ సత్యనారాయణ, నాళేశ్వరం శంకరం, జూలూరు గౌరీశంకర్, ప్రసాదమూర్తి లాంటి ప్రముఖ కవుల కవిత్వం వుంది. అంతా బతుకు కవిత్వం. వరదయ్య పేరుతో కవిత్వం రాసిన జి. లక్ష్మీనరసయ్య, జుగాష్‌విలీలు దళిత కవులతో ఎక్కువ సన్నిహితత్వంతో మెలిగిన కవులు. గాయపడ్డ సందర్భాల ప్రతిస్పందనలు వాళ్ళ కవిత్వంలో చూడవచ్చు.

**తెలుగు కవిత్వంలో బి.సి. కవులు తొలినాళ్ళ నుండీ ప్రముఖ పాత్రనే పోషిస్తున్నారు. అన్ని తరాలకీ ప్రాతినిధ్యం వహించే విధంగా ఈ సంకలనాన్ని తెచ్చి వుంటే చాలా బాగుండేది. ఇకముందైనా చేస్తే బాగుంటుందన్న సూచన. మరీ ముఖ్యంగా సి.వి. కవిత్వం ఇప్పటికీ దళిత, బి.సి. కులాల కవులకు నిత్య నూతనోత్తేజం ఇచ్చే కవిత్వం. విప్లవ కవుల్ని సైతం ప్రభావితం చేసిన కవిత్వం. అలాగే నగ్నముని కవిత్వం. ఈనాటికీ రిలవెన్స్ వున్న కవిత్వం. వాళ్ళ కవిత్వాన్ని కూడా ఈ సంకలనం స్వంతం చేసుకొని వుంటే బాగుండేది. అదే విధంగా యిప్పుడు కూడా ఎంతో అద్భుతమైన కవిత్వాన్ని రాస్తున్న పగడాల నాగేందర్, కందుకూరి రమేష్‌బాబు, శోభాభట్, సురేంద్ర రాజు - యింకా ఎంతోమంది బి.సి. కవుల కవిత్వం యిందులో లేదు. వుండి వుంటే బాగుండేది.**

ఈ సంకలనానికి సంపాదకత్వం వహించిన జూలూరు గౌరీశంకర్, ప్రసేన్‌తో కలిసి రాసిన ముందుమాట ఈ సంకలనాన్ని తీసుకురావడం వెనుకనున్న ‘వుద్దేశ్యాన్ని’ స్పష్టం చేస్తుంది.

రాత్రికి రాత్రి అధికారాన్ని సంపాదించాలంటే దళితుల పైన దాడి చేయాలి. అకస్మాత్తుగా వార్తల్లో కెక్కాలంటే అంబేద్కర్ పైన దాడి చేయాలన్న ‘యుగ రహస్యం’ వీళ్ళిద్దరికి కూడా తెలిసిపోయిందనిపిస్తుంది. ఏదేమైనప్పటికీ ఈ ముందుమాటతో చాలామంది కవులకి ఏకీభావం లేదని వాళ్ళు నిజాయితీగానే ఒప్పుకున్నారు. ఎన్నిసార్లు ఎక్కడికక్కడ అధికార పీఠాలు కుప్పకూలిపోతూండడం మన కళ్ళతో చూడలేదు!

ప్రసేన్, జూలూరు గౌరీశంకర్‌ల కవిత్వంతో సహా బి.సి. కవిత్వం వర్థిల్లాలి. దానికి ఆహ్వానం.

**మే 2001**

**‘కృతి’, వార్త దినపత్రిక**

# బాధిత వర్గాల గొంతుల ప్రతిధ్వనులు

శ్రీశ్రీ గురించి సరిగ్గా అంచనా ప్రకటించగల ముగ్గురు మార్క్సిస్టు మేధావుల్లో ఒకరు కె.వి. రమణారెడ్డి (కేవీయార్) చెప్పాల్సింది చెప్పి, అనేక సందర్భాలలో యువకులతో పంచుకున్న అనేక అంశాలను కాగితం మీద పెట్టకుండానే వెళ్ళిపోయారు. మిగతా ఇద్దరు వరవరరావు, శివసాగర్ – ఇద్దరూ తారీఖులు దస్తావేజుల లెక్కల్లో కూరుకుపోయారు.

శ్రీశ్రీ పైనా శ్రీశ్రీ సాహిత్యం పైనా ఆయన బతికి వున్న కాలం నుండీ చర్చ జరుగుతూనే వుంది. అనేక సందర్భాలలో శ్రీశ్రీ కవిత్వాన్ని చదువుకోవడం, గుర్తుచేసుకోవడంతోపాటు విమర్శించడమూ జరిగింది. శ్రీశ్రీని ద్వేషించే వారి దగ్గర నుండి శ్రీశ్రీని అభిమానించి, ప్రేమించే వారి దాకా చాలామంది చాలా సందర్భాలలో శ్రీశ్రీని విమర్శించరు. ముఖ్యంగా ప్రముఖ మార్క్సిస్టు విమర్శకులు రాచమల్లు రామచంద్రారెడ్డి, కె.వి. రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు, వరవరరావు, రంగనాయకమ్మ లాంటివారు ఆయా సందర్భాలలో రచనల ద్వారానూ, ఉపన్యాసాల ద్వారానూ శ్రీశ్రీ పరిమితులపైన విమర్శలు చేశారు. చంద్ర రాజేశ్వరరావు, పుచ్చల పల్లి సుందరయ్య, కొండపల్లి సీతారామయ్య, కె.జి.సత్యమూర్తి వంటి కమ్యూనిస్టు విప్లవ నాయకులు అనేక సందర్భాలలో శ్రీశ్రీ విషయంలో జోక్యం చేసుకోవలసి వచ్చింది. ఇది మరీ విస్తృతలోకాల్లోని సుదూర చరిత్రేం కాదు. అంటే శ్రీశ్రీలోని ప్రగతిశీలాంశాన్ని స్వీకరించి ఆనాటికి పనికి రాడనుకున్న అంశాలను Negate చేయడం అనే గతితార్కిక ప్రక్రియ, శ్రీశ్రీ బతికి వుండగానే మొదలైంది.

తన పైన వచ్చిన అనేక విమర్శలకు శ్రీశ్రీ సానుకూలంగా స్పందించి తనను తాను సరిదిద్దుకొన్నట్లు ప్రకటించాడు. ఒక్కొక్కసారి తానే కరెక్ట్ అని బిగుసుకు కూర్చున్నాడు. ఒక్కటి మాత్రం నిజం. కాలానికి అనుగుణంగా తనను తాను మలచుకొనేందుకు అవసరమైతే మార్పులకు తనను తాను సరిచేసుకొనేందుకు శ్రీశ్రీ ప్రతిసారీ ప్రయత్నించాడు. అందుకే ఎన్ని ప్రలోభాలు ఎదురైనా అరసంలో కొనసాగకుండా శ్రీశ్రీ విరసంలో ఆనాడు చేరాడు. ఇప్పుడు ఆర్టిస్ట్ మోహన్‌లాంటి వారిని ఉబ్బితబ్బిబ్బు చేసి పరమానందభరితులను చేసిన 'అన్ని వామపక్ష రచయితల సంఘాల మధ్య కుదిరిన Consensus' పట్ల శ్రీశ్రీ ఏ విధంగా ప్రతిస్పందించేవాడో తెలియదు. ఇప్పుడు మళ్ళీ శ్రీశ్రీ పైన చర్చ మొదలైంది. ఎన్ని యుగాలకైనా శ్రీశ్రీయే మహాకవి అని అరమోడ్పు కన్నులతో శ్రీశ్రీ కవిత్వ సర్వస్వాన్ని కంఠోపాఠంగా అప్పజెప్పడం దగ్గర నుండి శ్రీశ్రీయే లేడన్న దాకా చర్చ రసవత్తరంగా రకరాలుగా సాగుతుంది.

ఇప్పటి చర్చా సందర్భం శ్రీశ్రీ రెండు దశాబ్దాల వర్ధంతే అయినప్పటికీ నేపథ్యం మాత్రం

1) దుర్మార్గంగా పెచ్చరిల్లుతున్న హిందూ మతోన్మాద ఫాసిజం – మైనార్టీలపైన దాడులు, ముఖ్యంగా ముస్లింల పైన దాడులు – పెరుగుతున్న ముస్లింవాద చైతన్యం 2) కులహింస

– కుల అణచివేత – కుల పితృస్వామ్యం – ఉద్యమాలు బలంగా లేకపోయినా మరింతగా బలపడుతోన్న దళిత ప్రశ్న 3) ప్రపంచీకరణ నేపథ్యంలో అగ్రరాజ్యాల వలసల నుండి వలసల్లో వలస స్పృహ – తెలంగాణ నినాదం.

ఈ నేపథ్యంలో కంచె ఐలయ్య, ఖాదర్ మొహియుద్దీన్, బి.ఎస్. రాములు, గుంపు సాహితీమిత్రులు చేసిన వ్యాఖ్యలను అర్థం చేసుకోవాలి. వీళ్ళంతా ఆయా బాధితవర్గాలకు గొంతునివ్వడానికి ప్రయత్నించారు. ఈ నిర్దిష్ట చారిత్రక సందర్భంలో 'మహాకవి' సాహిత్యంలో మా జీవితాలు ఎలా కన్పిస్తున్నాయి అని ఆయా బాధిత వర్గాలు అద్దంలో ముఖాలు చూసుకొన్నట్లుగా శ్రీశ్రీ సాహిత్యంలో తమ ముఖాలను చూసుకోవాలనుకున్నప్పుడు, శ్రీశ్రీ ప్రయోగవాద వికటత్వంలో వక్రీకరణకు గురైన వికృత ముఖాలే కన్పిస్తున్నాయి. లేదా అసలు కన్పించడం లేదు. రంగనాయకమ్మ శ్రీశ్రీ రచనలపైనా ప్రయోగాలపైనా, ఏనాడో విమర్శచేశారు. ఖాదర్ మొహియుద్దీన్‌కి చాలా కాలం పట్టింది.

విజయవాడ గండికోటవారి వీధిలో (కృష్ణాబాయి వుండే ఇల్లు) ఓ సాయంత్రం మహీధర రామమోహనరావు, బాలగోపాల్, ఎన్. వేణుగోపాల్, బి.ఎస్.రాములు, అల్లం నారాయణ, అఫ్సర్, ఉషా ఎస్. డానీ ఇంకా చాలామంది సాహితీమిత్రులు హాజరైన సమావేశంలో ఖాదర్ మొహియుద్దీన్ ఇంకా అచ్చుకాని తన పుట్టుమచ్చ కవితను చదివితే చాలామందిమి తట్టుకోలేకపోయాం. (అందరూ కాదు). ఖాదర్‌కి మత పిచ్చి పట్టిందనుకున్నాం. దీన్ని చారిత్రికంగా ఎలా అర్థం చేసుకోవాలో బాలగోపాల్ (అప్పటికింకా మార్క్సిస్టే) వివరించారు. అప్పటికి బాబ్రీమసీదు కూలిపోలేదు.

ఆయా అస్తిత్వాల చైతన్యం, స్పృహ పెరిగేకొద్దీ ఆ దృక్పథం నుండి ప్రపంచాన్నీ సాహిత్యాన్నీ అర్థం చేసుకొని వ్యాఖ్యానించడం జరుగుతుంది. అరసం తాను ఆవిర్భవించిన చారిత్రిక పరిస్థితిలో అదే పని చేసింది. విరసం అదే పని చేసింది. ఇప్పుడు దళిత, స్త్రీ, ముస్లిం, తెలంగాణవాదులు అదే పని చేస్తున్నారు. చరిత్ర గతంలోని మంచిని స్వీకరించి పనికిరాని దాన్ని తిరస్కరిస్తూ ముందుకే పోతుంది. వెనక్కి వెళ్ళదు. స్టాలిన్ మాటల్లో 'గుజ్జును స్వీకరించి టెంకను పారేస్తుంది'. శ్రీశ్రీ విషయంలోనూ అంతే జరుగుతుంది. ఆయనలోని ప్రగతిశీలాంశాలను ప్రగతిశీల సాహిత్యం ఏనాడో స్వీకరించింది. శ్రీశ్రీ సాహిత్యం నుండి స్వీకరించిన ప్రగతిశీలాంశం అంతా ఆయన పేరుతోనే డిపాజిట్ అయివుండదు. అది జాతి చైతన్యంలో భాగమైపోతుంది. ఇప్పుడు శ్రీశ్రీలోని టెంకను పడేసే చారిత్రిక కర్తవ్యాన్ని ఐలయ్య, ఖాదర్, బి.ఎస్.రాములు, గుంపు సాహితీమిత్రులు నిర్వర్తిస్తున్నారు.

గుంపు సాహితీమిత్రుల లేఖ పైన వచ్చిన ప్రతిస్పందనలు పెద్దగా ఆశ్చర్యం అన్పించవు. సద్దాం హుస్సేన్ విగ్రహం కూలిపోతే ఇరాక్ అంతా పండగలు చేసుకున్నారని సి.ఎస్.ఎన్. ఛానల్ చూపినట్లుగానే నగ్నముని దగ్గర నుండి అవనిగడ్డ మిత్రుల దాకా రాష్ట్రం నలుమూలల నుండీ, 'గుంపు' 'ముంపు' పైన తీవ్రమైన నిరసన వచ్చిందన్నట్లు చూపే ప్రయత్నం జరిగింది.

అది నిజమే అయినప్పటికీ ఐలయ్య దగ్గర నుండి గుంపు మిత్రుల దాకా వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవిస్తున్న వాళ్ళం వున్నామన్న విషయం చెప్పడానికి నాయీ ప్రతిస్పందన రాస్తున్నాను. మిగతా అభిప్రాయాలు ఎలా వున్నా నగ్నముని అభిప్రాయాన్ని మిత్రులు పట్టించుకొని తీరాలి.

గుంపు మిత్రులు నగ్నముని పైన చెంపకు చెయ్యిపెట్టి ఫోజివ్వడం వంటి వ్యాఖ్యానాలు చేసి వుండాల్సింది కాదు (నిజానికి విలోమ కథల పైన ఫోటో తర్వాత చాలా అందంగా కన్పించే నగ్నముని ఫోటో అలా చెంపకు చెయ్యి పెట్టుకు దిగిందే.)

గుంపు మిత్రుల లేఖ చదివిన వెంటనే వీళ్ళు నగ్నముని, ఎస్వీ, స్మైల్ వంటి ప్రేమాస్పదమైన వ్యక్తుల మీదికి దాడికి ఎందుకు దిగారు? అనిపించింది. తరచి తరచి చూస్తే 'గుంపు' లేఖను పదేపదే చదివితే తాము ఆప్తులని భావించిన వాళ్ళే భిన్నమైన అభిప్రాయాలు వ్యక్తం చేసినప్పుడు కలిగే నొప్పి నుండే మళ్ళీ బాణాలు విసిరారనిపించింది. గాయపడ్డ గొంతులోని తీవ్రతను ఎస్వీగానీ, నగ్నమునిగానీ అర్థం చేసుకోలేని వ్యక్తులేం కాదు. ఏదో ఒకరోజు గుంపు మిత్రుల నిష్ఠూరపు పలుకుల్లో నుండి పనికి వచ్చే అంశాలను వాళ్ళు స్వీకరిస్తారనే నా నమ్మకం. పోతే నగ్నముని గుంపు మిత్రుల లేఖకు తీవ్రంగానే ప్రతిస్పందించారు. ఒకవైపున తాను శ్రీశ్రీ యుగానికి చెందిన కవిని కాదని చెప్పారు. ఎమర్జెన్సీకి తాను వ్యతిరేకిననీ, శ్రీశ్రీ అనుకూలుడనీ చెప్తూ కనీసం ఆ ఒక్క విషయంలో శ్రీశ్రీ పట్ల తిరస్కారాన్ని ప్రకటించారు. మరోవైపు శ్రీశ్రీ గురించీ, ఉద్యమం (?) గురించీ ప్రాణవాయువు గవీరించీ గుంపు మిత్రులకు పాఠాలు చెప్పడం మొదలుపెట్టారు. ఉద్యమాల గురించి నగ్నముని దగ్గర నుండి పాఠాలు నేర్చుకోవాలసిన స్థితిలో ఇప్పటి తరం లేదు. పాఠాలు నేర్పడానికి బతికి వున్న అనేక ఉద్యమాలు కొనసాగుతూనే వున్నాయి. 'ఉదయించని ఉదయాలు'కు ఆరుద్ర రాసిన ముందుమాట, దాన్ని ఆయన భక్తిగా అచ్చువేసుకోవడమూ, నగ్నముని కవిత్వాన్నీ, శ్రీశ్రీ కవిత్వాన్నీ ప్రేమగా చదువుకున్న మాలాంటి వారికి ఇంకా గుర్తే వుంది. ఇంక శ్రీశ్రీ రిలవెన్స్ విషయానికి వస్తే శ్రీశ్రీ శైలిలో వరవరరావు ఎన్నడూ రాయలేదు. చెరబండరాజు ఎన్నడూ శ్రీశ్రీని అనుకరించలేదు. విరసం కవులెవరూ ఇప్పుడు ఆయన శైలిలో రాయడంలేదు. నగ్నముని కానీ, ఎస్వీకానీ, గుంపు కవులుగానీ, యిప్పటి కవులు మరెవరైనా కానీ శ్రీశ్రీ శైలిలో రాయడం లేదు. ఆ శైలికి కాలం చెల్లింది. వస్తువు విషయంలోనూ శ్రీశ్రీ నాటి అమూర్తస్థాయి నుండి ఇప్పుడు అది అనేకానేక నిర్దిష్టతలలోకి విస్తరించింది. మరి శ్రీశ్రీ పనికిరాడా? వర్తమానాన్నీ, భవిష్యత్తునీ ఉత్తేజపరిచే చరిత్రగా మిగిలిపోతాడు. దళితులు శ్రీశ్రీ నుండి ఎలా రాయకూడదో కూడా నేర్చుకుంటారు. కాలంతో నిలబడాలని ఎప్పుడూ తపనపడ్డ శ్రీశ్రీ తన పైన వచ్చిన విమర్శను స్వీకరించి తనను తాను సరిదిద్దుకొనేవాడో ఏమో!

**10 ఆగస్టు 2003 :: 'వార్త' సండే మ్యాగజైన్**

# సిరాచుక్కల నుండి శాంతి పావురాలను ఎగరేస్తున్న
# నేతల ప్రతాప్ కుమార్

నిలబడాలన్నా,నడవాలన్నా, ధిక్కరించాలన్నా గుండెల నిండా ఒక విశ్వాసం కావాలి. వెనక్కి వెనక్కి వెనక్కి జరిగిపోతున్నా అమాంతంగా దూసుకువచ్చి ముందుకే ఎగిరి దూకే సాహసం కావాలి. అంతం ఎక్కడో తెలియని చీకటి సొరంగాల గుండా పయనిస్తూ కనురెప్పల్ని రాపాడించి మిణుగురుల్ని రాజేసి ఒక సుప్త భావన గీతం రాసే సృజన కావాలి. యుద్ధ రంగాన సకల అస్త్రాలనూ కోల్పోయినా పిడికిళ్ళు బిగించి తొడలు చరిచి ఒక రణాన్నినాదాన్నిచ్చే తెగువ కావాలి. దమ్ముకావాలి. పళ్ళ బిగువున కన్నీళ్ళ సముద్రాలను అదిమిపట్టి లోలోపల కుమిలి కుమిలి పొగిలి పొగిలి ఏడ్చే గుండెకు స్వాంతనగా ఒక చల్లటి స్పర్శ కావాలి.

పరుగెత్తాలన్నా, బతకాలన్నా, పోరాడాలన్నా కాసింత పొగరు కావాలి. కొంచెం నిప్పు, కొంచెం నీళ్ళు, కొంచెం ప్రేమ, కొంచెం ఆగ్రహం కలగలసిన అమ్మతనం కావాలి.

నేతల ప్రతాప్‌కుమార్ కవిత్వం చదివితే మనం ఏది పోగొట్టుకున్నామో తెలుస్తుంది. మనకు అవసరమైంది ఏమిటో అర్థం అవుతుంది. కవిలోకం అతన్ని చూసి యితను కేవలం కవి మాత్రమే అనుకుంటారు. అతని అక్షరాలను స్పర్శించిన సంబర మెదళ్ళలో అల్లుకు పోయిన సాలెగూళ్ళ చిక్కుముడులేవో సుతారపు కొనగోటి స్పర్శతో సునాయసంగా విడిపోయి మస్తిష్కానికీ రెటీనాకీ మధ్యనున్న దృశ్యం స్పష్టమవుతుంది. అతను దగ్గరగా తెలిసిన వాళ్ళకి ప్రతాప్ ఉద్యమ జీవితం అర్థం అవుతుంది. కవైన ఉద్యమకారుడు. ఉద్యమకారుడైన కవి. నేతల ప్రతాప్ కుమార్.

పశ్చిమ గోదావరి జిల్లా నిడదవోలు మండలం విఘ్నేశ్వరం గ్రామంలో నేతల సత్యంగారు, శాంతికుమారి దంపతులకు జన్మించిన ప్రతాప్ కుమార్ విద్యార్థిగా, యువకుడిగా దళితమహాసభ ఉద్యమంలో చురుగ్గా పనిచేశాడు. తర్వాతి కాలంలో జర్నలిస్టుగా పనిచేసినా, లెక్చరర్‌గా పనిచేసినా అంబేద్కర్ సిద్ధాంతాన్ని, దళిత ఉద్యమసందేశాన్నీ ప్రచారం చేయడం ఆపలేదు. కవిగా పాలకంకి, నానీలు, అన్నం గిన్నె, దళిత నానీలు కవితల సంకలనాలను ఆయన వెలువరించాడు. కావ్యరంగమైనా, కార్యరంగమైనా ఆయనమొత్తం సృజనాత్మక కార్యాచరణకు భూమిక దళిత జీవితమే. గోపీ సృష్టించిన నానీలు ప్రక్రియను అద్భుతంగా స్వాధీనంచేసుకుని దళిత సాహిత్యాన్ని అన్ని ప్రక్రియల్లోకీ బలంగా తీసుకువెళ్ళగలం అని వ్యక్తిగా రుజువు చేసుకోడమే కాకుండా వర్ధమాన దళిత రచయితలకు ఒక నమ్మకాన్నిచ్చాడు. వచన కవిత్వంలో కూడా ఎంతో పరిపక్వతనూ, ఆర్తినీ, సాంద్రతనీ ప్రతాప్ సాధించాడు.

**"పువ్వులకో కాయలకో గాయాలైతే**
**కావ్యాలైపోయిన దేశంలో నేను పువ్వుగానో**
**ఆకుగానో పుట్టాల్సింది**

నా గుండెల్లో సూది గుచ్చుకొంటే చాలు ఏ కరుణశ్రీ కలం కరిగో కావ్యనాయికనై పోయుందును. – కారంచేడు మాదిగనయ్యాను. చుండూరు మాలనయ్యాను, చలకుర్తి మత్తవ్వనయ్యాను. అందుకే కవుల కలాలు తనకోసం కించమైనా కరగలేదు, కదల లేదు.

అంటూ సాహిత్యానికీ, సాహిత్యకారులకు కూడా కులతత్వం ఏ విధంగా జీర్ణించుకు పోయిందో కుండబద్దలు కొట్టినట్టు స్పష్టం చేస్తాడు. అయితే దళిత కవుల తరం తమపై నిర్లక్ష్యానికి ఏడుస్తూ కూర్చోలేదు. గంటమూనారు, రవ్వలు రాల్చారు. ఆంధ్రవాణి గరగరల్ పచరించారు! ఆ చిక్కనైన, పదునెక్కిన తరానికి వారసుడు నేతల ప్రతాప్ కుమార్. అంబేద్కర్ కోసం నేతల రాసిన 'అన్నంగిన్నె' కవిత అన్ని స్థాయిల్లోనూ విద్యార్థులకు పాఠ్యాంశంగా చేర్చదగినది.

**"అన్నంగిన్నెలో ఎప్పుడూ ఆ విగ్రహమే కనపడుతుంది.**
**మెతుకు మెతుకు మీద ఆ పేరు మెరుస్తూ వుంటుంది.**
**ఊరుకు చివరనున్న వాడ మొదట్లో నిలబడి**
**వాడ ఊరయ్యే చూపుడు వేలు సందేశం ఏదో**
**యిస్తూ వుంటుంది"**

అంటూ అంబేద్కర్ విగ్రహాన్ని గురించి నేతల రాశాడు. విగ్రహం అంటే అన్ని విగ్రహాల వంటిదికాదని, రాళ్ళూ సిమెంటు దిమ్మె కాదని, అది ఒక చైతన్యగీతం అనీ, మేలుకొలుపు పాట అనీ, దాహంతో తడారిపోయిన గొంతులో పోసిన దోసెడు నీళ్ళలాగా వుంటుందనీ, అసలు బొమ్మే అమ్మలాగా వుంటుందనీ, అన్నం గిన్నెలాగా వుంటుందనీ రాస్తాడు. ప్రతాప్ కవిత చదివిన తర్వాత ఏ వాడ మొదట్లోనయినా నిలబడివున్న అంబేద్కర్ విగ్రహాన్ని చూడండి. ఆ చల్లని తల్లి స్పర్శను అనుసరించండి. ఆ వెన్నెల వాగును గుండెల్లోకి ఆవాహన చేసుకోండి. గొప్ప స్ఫూర్తితో శరీరం వెలిగిపోతుంది.

దళిత బహుజనులకు స్ఫూర్తినిచ్చిన అందరి గురించి ప్రతాప్ కవిత్వం చెప్పాడు. కాన్షీరాం గురించి రాస్తూ

**'రాత్రి కాన్షీరాం**
**కల్లోకొచ్చాడు**
**కిందున్న నన్ను లేపి**
**కుర్చీలో కుదేశాడు'**

దళిత బహుజనుల రాజ్యాధికార సాధన గురించి ఎన్ని పుస్తకాలు, ఎన్ని ఉపన్యాసాలు సరిపోతాయి పై నాలుగు వాక్యాలముందు. మహిళలపైన సాగుతున్న అణచివేతను గురించి, వరకట్నం గురించి, సునామీ మృతుల గురించీ, రైతుల ఆత్మహత్యల గురించీ, దళిత కులాలలో వున్న అనైక్యత గురించీ నేతల రాశాడు. ఏం రాసినా కవిత్వం రాశాడు. దళిత స్పృహతో అంబేద్కర్‌వాద కవిత్వం రాశాడు. ముఖ్యంగా దళిత నానీలను చాలా శక్తివంతంగా రాశాడు. గోపీ చెప్పినట్లు నాలుగు వాక్యాల్లో మొదటి రెండులైన్లూ ఒక యూనిట్ గానూ, చివరి రెండు లైన్లు రెండోయూనిట్‌గాను వుండి రెండో యూనిట్‌వలన మొత్తం నానీకి జీవం వస్తుంది. ఈ లక్షణం ప్రతాప్ రాసిన ప్రతి నానీలోనూ కన్పిస్తుంది. కింది వాక్యంలోంచి పై వాక్యానికి ఒక విద్యుల్లత ప్రసరించి మొత్తం కవిత అంతా దేదీప్యమానంగా వెలిగిపోతుంది. విషాదమైనా, వ్యంగ్యం అయినా, ఆనందం అయినా ఏది ముట్టుకున్నా అది ఒక వెలుతురు తునక. అంగవస్త్రపు గాంధీనీ, సూటూ బూటూ వేసుకున్న అంబేద్కర్‌నూ పోలుస్తూ రాసిన కవిత వ్యంగ్యంగా వాస్తవికతను చిత్రీకరించింది. 'నాన్నా' కవిత గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఎవరి అమ్మా నాన్నలైనా అమ్మానాన్నలే. చాలామంది నాన్నలు బిడ్డలకు అమ్మతనాన్ని పంచిపెట్టి యిద్దరి తల్లుల ప్రేమను రుచి చూపిస్తారు. అంతటితోనే ఆగిపోకుండా మొత్తం దళితవాడ పిల్లలకు అమ్మతనాన్ని పంచిపెట్టిన ప్రతాప్ తండ్రి నేతల సత్యంగారి గురించి రాసేటప్పుడు నేతల మహా ఉద్వేగానికి గురవుతాడు. రైతుగా, బడిపంతులుగా, ప్రజావైద్యుడిగా, భూమిని పంపిణీ చేసిన వీరుడిగా సత్యంగారు వాడకు అందించిన సేవలను గుర్తుతెచ్చుకుంటూ నేతల గతంలోకి ప్రవహిస్తాడు. "అందుకే నాన్నా... ఈ నేల నీకు నమస్కరిస్తుంది. ఈ గోదావరి తల్లి నిన్ను దీవిస్తోంది. ప్రతి దళిత గుండె నీకు దండం పెడుతుంది" అంటాడు. చరిత్ర నమోదు చేయని సత్యంగారి లాంటి వ్యక్తిత్వాలు తెలుగు గడ్డపైన ఎన్నున్నాయో! అన్నింటినీ అక్షర బద్ధం చేయవలసిన అవసరాన్ని ప్రతాప్ గుర్తుచేస్తున్నాడు. ప్రతాప్ వృత్తిరీత్యా మాత్రమే ఉపాధ్యాయుడు కాదు. ప్రవృత్తి రీత్యా కూడా ఉపాధ్యాయుడు. ఆయన రాసిన ప్రతి కవితా ఒక ప్రబోధ గీతం. ఆ గీతాల బడిలో తడిసి పోవాలంటే పాలకంకి, దళిత నానీలు, అన్నంగిన్నె సంకలనాలను చదవండి. ఆయనకు 2007 విమలశాంతి జాతీయ కవిత పురస్కారం వచ్చింది. అన్నింటి కంటే తన వాక్యాలు జనం నాల్కల పైన నాట్యమాడుతుండటమే తనకు గొప్ప గౌరవం అని నేతల ప్రతాప్ కుమార్ భావిస్తాడు. అది యిప్పటికే అతనికి లభించింది. ప్రతాప్ వర్తమాన సాహితీ వీధుల్లో కవాతులు చేస్తున్న దళిత కవి సేనలతో కలసి ముందు భాగాన నడుస్తాడని ఆశిస్తున్నాను. యింకా దళిత జీవితంలోని సరికొత్త పార్శ్వాలను ఆవిష్కరిస్తూ మరిన్ని కొత్త సంకలనాలు తీసుకురావాలని కోరుకొంటున్నాను.

"ముక్కు మూసుకొని తపస్సు చేసిన ప్రతి ఒక్కడికీ దేవుడే ప్రత్యక్షమవుతుంటే ఆ మహనీయుడికి మాత్రమే మానవ సమాజం ప్రత్యక్షమైంది". ఆ మహనీయుడి బాటలో సిరా చుక్కల నుండి శాంతి పావురాలను ఎగరేస్తున్న ప్రతాప్‌కు జై భీమ్‌లు.

**మే, 2008 - బహుజన కెరటాలు**

# ఇది దళితుల యుగం

పాటా, పాటా ఎక్కడున్నావమ్మా, ఎవరి కన్నుగప్పి వెన్నెల్లో కలసి పోయావమ్మా, వెన్నెల నుంచి, అడవి నుంచి, తేనెనుంచి మనుషుల్లోకి దింపుకొచ్చే శక్తులొచ్చాయి కదా! పాటల తియ్యని చనుబాలు కోసమే, పాటల మమకారపు ఊయల కోసమే. గుక్క తిప్పుకోలేని ఆవేదన నాల్కమీద సుళ్ళు తిరిగి, సుళ్ళు తిరిగి నాట్య మాడుతున్న పదాలు.

చుండూరు రక్త పాతం జరిగి తుంగభద్ర కాల్వలో మానవ అవశేషాలను వెతుక్కుంటూ జోగాడుతున్న సమయంలో ఉదయ భాస్కర్ నాకు పరిచయం అయ్యాడు. మొదటిసారిగా ఆ మరణాలకు ఆగ్రహ నినాదాన్ని ఇచ్చిన కత్తి పద్మారావు పూరిపాకలో ఆయన్ని చూశాను. ఇప్పుడు ఆ పూరి పాకలేదు. ఆ సంరంభపు ఉత్సవ వేడుక లేదు. అయినా ఉదయ్ ఆనాటి సాంస్కృతిక వాతావరణాన్ని కాపాడటానికి ఇప్పుడొక పిచ్చి ప్రయత్నం చేస్తున్నాడు. పిచ్చి ప్రయత్నమని నాలాంటి పిచ్చివాళ్ళు అనుకుంటారేమో కానీ ఇంత గొప్ప ప్రయత్నాన్ని తక్కువ చేయడానికి నేను చలాన్ని కాదు, శ్రీశ్రీని కాదు. యిందులో విశ్వనాధ సత్యన్నారాయణ రాసిన పాటలు లేవు. కృష్ణశాస్త్రి రాసిన పాటలు లేవు. శ్రీశ్రీ రాసిన పాటలు ఆసలేలేవు. కానీ మా ఉదయ్ బతుకులో తడిచిన ఆణిముత్యాలను ఏరి పాటలుగా ఏర్చికూర్చి మీ కోసం పుస్తకంగా తీసుకొస్తున్నాడు. వాక్యాలను చదివితే సంగీతం వినిపించాలి. ఆడియో క్యాసెట్ కేవలం ఘోషతప్ప  భాష లేని సంగీతాన్ని వినిపించగలవు. ఒక అద్భుతమైన పుట అక్షరాలతో పాటు సంగీతాన్ని వినిపించగలవు కళ్లకు చెవులుంటే. ఉదయ్ భారతదేశం మొత్తానికి కాకపోయినా కనీసం ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సాంస్కృతిక ఉద్యమానికి నాయకత్వం వహిస్తాడని ఒక నమ్మకం.

ఇక ఈ పాటల విషయానికొస్తే ఇది పూర్తిగా దళిత పాటల సంకలనం. ఇంకొక మాట చెప్పాల్సి వస్తే పూర్తిగా దళిత కవులు రాసిన దళిత అక్షరాల అక్షరమాలిక.

ఉదాహరణకి : “చిలి” మహాకవి పాబ్లో నెరూడాతో పోల్చదగిన మరో మహాకవి “గోరటి వెంకన్న” పాట. భారత దేశానికి దార్శనికతను చూపిన మహనీయుల మీద “భీమసేన” పాట. ఈ దేశానికి, అణగారిన వర్గాలకు ధిక్కారాన్ని నేర్పిన గుఱ్ఱం జాషువా పాట. దళితుల నిద్రని మేల్కొలపటానికి ఒక భూపాలరాగపు తొలి సంధ్య పాట కత్తి పద్మారావు లేరా – లేరా దళితుల యుగ మిదెరా” పాట సంకలనం చేస్తూ ఉదయ భాస్కర్ ఈ పుస్తకాన్ని తీసుకొస్తున్నాడు. ఉదయ్ నాకు తెలిసినంత వరకు నాకు లాగానే మామూలు కార్యకర్త. నాకు లాగానే అతను గొప్ప కళాకారుడని గుర్తించడానికి 15 ఏళ్ళు పట్టింది. అందుకు నేను పశ్చాత్తాపపడుతున్నాను.

ఆంధ్ర దేశంలో తెలుగు భాష బతుకుతుందో చనిపోతుందోనని మేధావులందరూ ఆందోళన పడుతున్నారు. నన్నయ్య సృష్టించిన భాష ఖచ్చితంగా చనిపోతుంది. కానీ దళితులు సృష్టించిన భాష బతికే వుంటుంది. దానికి ఉదాహరణే ఈ పుస్తకం. కారణం నన్నయ్య తద్భవాలను సృష్టించారు. దళితులు అనేక బతుకుల నుండి పదబంధాలను సృష్టించారు. ఉదాహరణకు: వాన కురిసి సూర్యుడు వచ్చే సమయంలో ఇంద్ర చావం వెలుస్తుంది. ఆంధ్రకవి ఇంద్రధనస్సు అన్నాడు. కాని ఒక తెలంగాణ కవి సింగిడి తీగ అన్నాడు. రెయిన్ బోకి తెలుగు అనువాదం తెలియని చాలా మంది మనుషులకు ఇప్పటి వరకు సింగిడి అనే తెలుగు పదం వుందనే విషయం తెలియనే తెలియదు. ఇది తెలంగాణ యిచ్చింది. తెలంగాణ అంటే తెలంగాణ వెలమ దొరలు అని చంద్రశేఖర్‌రావు అనుకుంటాడు కానీ, తెలంగాణ మాదిగలిచ్చిన పదం అది. కానీ "ఏడేడు రంగుల సింగిడి తీగల" ఒక్కగానొక్క మహా మనిషి డా॥ బి.ఆర్. అంబేద్కర్ ఒక్కడే.

పాట శ్రమ నుండి పుట్టింది. శ్రమ సంగీతాన్ని పుట్టించింది. సంగీతం లయను సృష్టించింది. లయ గాంధర్వాన్ని సృష్టించింది. గాంధర్వం దళితుడి యింటికి చేరింది. అప్పుడు పదానికి రాగం, తాళం, పల్లవి ఏర్పడింది. ఉదా: ఉదయం 3 గం॥ల సమయంలో సముద్రం ఒడ్డున ఎవరైనా కూర్చోగలరా? కూర్చోగలిగితే 'సూర్యుడు' సముద్రం నుండి నిద్ర లేస్తూ వుంటాడు. సముద్రం ఎప్పటిలాగే తీరానికే ప్రవహిస్తుంది. ఎర్రటి కిరణాలు "కారల్ మార్క్స్, అంబేద్కరో" ఎవరికీ తెలియదు. చివరికి సముద్రం నీలి వర్ణానికి మారుతుంది. అది అంబేద్కర్. "బుద్ధుడు" చనిపోయే రోజున ఒక్కగానొక్క దళిత బిక్షువు ఆనందుడిని పిలిచి "ఆనందా! నేనింకా ఏమి చెప్పాలి" అని అడిగాడు. ఆనందుడు "ప్రభూ! మీరింకా చెప్పాల్సిందేమి లేదా" అని అడిగాడు. అప్పుడు బుద్ధుడు పంది మాంసం, పుట్టగొడుగుల కూరతిన్న యింటిలో విరేచనాలకు గురై మరణానికి మరొక ఘడియ సిద్ధంగా వున్న సమయంలో ఆనందుడిని పిలిచి ఒకే ఒక్క మాట చెప్పాడు. ఆనందా "అత్త దీపోభవా" అన్నాడు. అది అశోకునికి అర్థమైంది. అంబేద్కర్‌కి అర్థమయింది. మా ఉదయ భాస్కర్‌కి అర్థమైంది. అందుకే ఈ పుస్తకం. అత్త దీపోభవా అంటే "నిన్ను నీవే నమ్ముకో, నీ వెలుతురు నీవే అని". దాని కోసం మా ఉదయభాస్కర్ బృందం ఈ పాటలను ఎంపిక చేశారు. అందుకే పుస్తకానికి ఈ మాటలు రాస్తున్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను.

ఈరోజు తెలుగు భాష మరణిస్తుందా? జీవిస్తుందా? అనే ఒక చర్చను ప్రచార మాధ్యమాలు కొనసాగిస్తున్నాయి. తెలుగు భాష జీవం దళిత భాషలోనే వుంటుందనే వాస్తవాన్ని ఉదయ్ భాస్కర్ బృందం ఈ పాటలు ద్వారా, తన సంకలనం ద్వారా రుజువు చేస్తున్నారు. అధికార భాషా సంఘం అధ్యక్షుడు ఎ.బి.కె.ప్రసాద్ గానీ, ప్రెస్ అకాడమీ చైర్మన్ దేవులపల్లి అమర్‌గానీ చేయలేని పనిని నెత్తురోడే గాయకుడు, గద్దర్ లాంటి గాయకుడు రుజువు

చేస్తున్నాడు. తెలుగు భాష దళితుల కారణంగా బతికివుందనే వాస్తవాన్ని చాటి చెపుతున్నాడు. ఉదా: ముడ్డు కడిగి ముక్కు చీది ఎత్తిపెంచిన తనోల్లు, కరువొచ్చి కష్టమొచ్చి బతకలేక పట్నమొచ్చి. "ఈ భాషను స్వంతం చేసుకోలేని ఏ భాషైనా బతుకుతుందా? ఇది మా ఉదయభాస్కర్ మాట. తెలుగుభాష బతికే వుంటుందని ఒక నమ్మకాన్ని యిచ్చే ఒక ప్రయత్నం ఈ పుస్తకం. అధికార భాషా సంఘం భాషను బతికించాలని అష్టకష్టాలు పడుతుంది. భాష ప్రయత్నాలతో కాక పాటలతో బతుకుతుందని ఉదయ భాస్కర్ నిరూపించాడు. కారణం అంబేడ్కర్. ప్రయత్నం మాత్రమే ఉదయ భాస్కర్.

పాట శ్రమవిముక్తి కోసం గుండెలను పెదవుల కద్దే ఒక మాట. పాట ఒక తుపాకీ చేయలేని పని చేయగల్గిన ఒక తూట. అందుకనే మా ఉదయ్ తుపాకీ తూటకన్నా పాటని ఒక ఆయుధంగా ఎంచుకున్నాడు. పాట ఎంత గొప్ప ఆయుధమో అరుణోదయ, జన నాట్యమండలి, జన కళా మండలి, ప్రజా కళా మండలి, దళిత కళా మండలి, దళిత బహుజన మండలి, జనచైతన్య మండలి యిప్పటికే నిరూపించాయి. పాట ఎంత శక్తి వంతమైనదో మా ఉదయ్ ఈ పాటల పుస్తకం తీసుకురావడం ద్వారా కవులకు, కాలానికి ఒక విలువ నిస్తున్నాడు. ఉదా: కత్తిపద్మారావు

"డప్పుల మ్రోగిన గూడెమురా నీదే – గూడెమురా నీదే
పాటలు పుట్టిన గుండెయరా – గుండెయరా
కళల తల్లివి నీవేనోయి – నీవేనోయి
తంబుర నాదం తోటిరా"

తెలుగు భాష యింత విస్తారమైందని అధికార భాషా సంఘానికి తెలియదు. ప్రభుత్వానికి తెలియదు. ఈ పుస్తకం చదివితే శ్రోతలకు, ప్రేక్షకులకు మాత్రమే తెలుస్తుంది. ఇటీవల కాలంలో ఒక గ్రీకు సినిమా చూశాను. అందులో ఒక కవి తన మాతృభాషను మర్చిపోతాడు. పదాల కోసం పల్లెలు తిరుగుతూ ప్రజలను వేడుకుంటాడు. కాని మా ఉదయ్ తన సందేశంలో గద్దర్ని, పాటలో వంగపండుని కలగలుపుకున్న కళాకారుడు మా ఉదయ్.

అణగారిన జాతుల సంఘర్షణ నుండి పుట్టుకొచ్చిన పదాల మేలు కలయికే ఈ పుస్తకం. ఈ పుస్తకాన్ని తీసుకురావడానికి సహకరించిన దళిత బహుజన శ్రామిక యూనియన్‌కు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఇప్పటికైనా పాటల శక్తిని గుర్తించినందుకు సాహితీ సాంస్కృతిక కళారంగాలను గుర్తించినందుకు వారికి ధన్యవాదాలు.

**దళిత యుగం పాటలు ముందుమాట**

**13-12-2006**

# కంచికచర్ల కోటేశూ... స్టాన్లీ సురేషూ

**18, ఫిబ్రవరి 1969**

గుండెల మీది పాదముద్రల్ని భరిస్తూ దిగంతాల్లోకి పారిపోతున్న తొమ్మిదో నెంబరు జాతీయ రహదారి.

పొలాలనుండి గొడ్లూ, మ్యాట్నీ సినిమా నుండీ, పొగాకు కంపెనీలనుండీ జనాలు ఇళ్ళదారి పట్టారు. రోజూ అంతే... ఆ కాసేపు ఏ ఉద్యమమూ పిలుపివ్వని ఊరేగింపైపోతుంది రోడ్డు. గుప్పెడు శాంతి కోసం తమ గుడిసెలముందు తామే ధర్నాలు చేయడానికి హడావుడిగా పరిగెత్తే అల్పజీవుల ప్రవాహమై పోతుంది రోడ్డు. ఆ రోజుమాత్రం ఏ లాఠీ అదలింపులకో గుండెలు కలుక్కుమన్నట్టుగా ఉలిక్కిపడింది రోడ్డు.

అల్లంత దూరం నుండి మనిషాకారంలోని చితిమంటేదో నడిచివస్తున్నది. ఏ మంటల దెయ్యమో మరిచిపోయిన అర్జెంట్‌పనేదో గుర్తొచ్చి చీకటి పడకముందే ఊళ్ళోకి వచ్చేస్తున్నట్టు పెద్ద పెద్దగా అరుచుకుంటూ, భోరున ఏడ్చుకుంటూ, పడుతూ, లేస్తూ, అరుస్తూ ఆ రోడ్డుమీదుగా ఒక మంటల మానవుడు నడిచివస్తున్నాడు. గుండెలు గుభేలుమన్న గొడ్ల మందలు అడ్డదిడ్డంగా పరుగులుతీశాయి. భయంతో పారిపోలేకా, నిలబడలేకా చెల్లాచెదురైన జనం మందకు సామూహికంగా వణుకు జ్వరం పట్టింది. అంత భయంలోనూ సంగతేంటో తెలుసుకోవాలన్న కుతూహలం.

ఆ మంటల మానవుడు దగ్గరికి వస్తోన్న కొద్దీ మనిషి మాంసమూ, నెత్తురూ కుతకుతా ఉడుకుతున్న వాసన. అతను దగ్గరకు నడిచి వస్తోంటే జనం అతన్ని గుర్తుపట్టారు. అతను కోటేశు. కమ్మోరింట్లో పాలేరు కోటేశు. సూరీడు నిద్ర లేవకముందే చావిట్లో గొడ్లను నిద్రలేపి పేడకళ్ళు ఎత్తి, ఇంటిపనంతా అలవోకగా చేసి పారేసే నల్ల నిగారింపుల కోటేశు.

సందేళకి పొద్దుటన్నంలో కాసింత పుల్లపెరుగేసి పెడితే పరమాన్నం తిన్నంత సంబరపడిపోయే తెల్లగుడ్డల కోటేశు. మధ్యాహ్నం వేళకు పేడముద్దల్ని గోడకు పిడకలు కొడుతూ "రాత్రయితే దేవుడికి ఒక్కటే చందమామ... నాకు తెల్లారితే ఎన్ని వందల పచ్చపచ్చటి పేడ చందమామలో!" అనుకుంటూ తనుచేసిన పిడకల్ని చూసి తెగ మురిసిపోయే కంచికచర్ల కోటేశు... ఆరుకుట్ల కోటేశు.

ముసురుకొస్తున్న చావుతెరల్ని తరిమి కొట్టాలని ఆతృతతో వడివడిగా నడుస్తున్నాడు. వేగం పెరిగేకొద్దీ మరింత రెచ్చిపోయి అలుముకొంటున్నాయి మంటలు.

అందరూ అలా చూస్తునేవున్నారు. ఏ ఒక్కడూ మంటలనార్పే సాహసం చెయ్యడంలేదు. శ్వాస మసై పోవడం తెలుస్తోంది. చచ్చిపోతానేమోనన్న భయం. బతకాలన్న

ఆరాటం. అర కిలోమీటరు నడిచి ఆస్పత్రికి చేరుకున్నాడు. డాక్టరు భయపడ్డాడు. నిప్పులచేతుల్ని జోడించి బతిమాలాడు కోటేశు. బతికిస్తే పాలేరుతనం చేసైనా రుణం తీర్చుకొంటానన్నాడు. అంత బీభత్సంలోనూ డాక్టరుకు చట్టాలూ, కోర్టులూ, బహుశా కులం గుర్తుకొచ్చాయి. వైద్యం చెయ్యను పొమ్మన్నాడు. చేసేది లేక సగం బొగ్గూ, సగం మాంసమూ కలగలిపిన శరీరాన్ని పోలీసుస్టేషన్‌దాకా నడిపించాడు. పోలీసులు చెయ్యాల్సిన తాత్సారం చేసినా తప్పక పోయేటప్పటికి చేసేదిలేక బెజవాడ ఆస్పత్రికి తీసుకుపోయారు.

పందొమ్మిదేళ్ళ కోటేశు పని రాక్షసుడు. కాయకష్టంతో కండలుతిరిగిన శరీరం. చెప్పినా చెప్పకపోయినా ఉన్న పన్నంతటినీ బాధ్యతగా చకాచకా చేసేస్తాడు. ఉన్న బట్టల్నే మల్లెపువ్వుల్లా వుంచుకుంటాడు. సాయంత్రానికి శుభ్రంగా స్నానం చేసి తలకి ఆమదం రాసుకొని నున్నంగా తల దువ్వుకొని రోడ్డుదాకాపోయి రెండు బీడీ దమ్ములు లాగి వచ్చేవాడు. నల్లగా నిగనిగా మెరిసే కండలతో ఎవరు పలకరించినా తెల్లగా నవ్వేవాడు.

అమ్మగారిది ప్రౌఢవయసు. కోటేశు ఆమెకు ఎందుకు నచ్చాడో తెలియదు. అతని మీద మనసు పడింది. అది ప్రేమో, కాదో తెలియదు. ఒక రాత్రిపూట హెచ్చరికలు లేని తుఫాను లాగా గొడ్లచావిట్లో నిద్రపోయే కోటేశుపైనపడి అమాంతం పెనవేసుకు పోయింది. అప్పుడు కోటేశు ఆనందించాడో, భయపడ్డాడో తెలియదు. కాని తెల్లవారింతర్వాత ఎక్కువగా భయమే అతన్ని ఆవరించింది. తెలతెలవారుతుండగా ఆ ఇంటిని వదిలి వెళ్ళిపోయాడు.

అమ్మగారికీ భయమేసి వుంటుంది. తక్కువ కులపోడిపై తానే చెయ్యివేసానని చాడీలు అయ్యగారికి చెప్పేస్తాడనుకుందో ఏమో, తానే అత్తగారి దగ్గరకెళ్ళి రాత్రి తనను కోటేశు అల్లరి చేయబోయాడనీ, అందర్నీ లేపి నీ అంతు చూస్తానని బెదిరిస్తే పారిపోయాడనీ చెప్పింది.

ఇప్పుడు అతలాకుతలమైపోయింది కమ్మోరి వీధి. కోటేశుని వెతికి పట్టుకున్నారు. ఏరా చెంబులు ఎక్కడ అమ్ముకున్నావురా? అంటూ కసిగా చొక్కాపరాపరా చింపేసి కొట్టారు. కోటేశుకు అర్థంకాలేదు. నోటికొచ్చినట్టూ తిట్టుకుంటూ, ఇష్టమొచ్చినట్టు కొట్టుకుంటూ రచ్చబండకు దగ్గరకు లాక్కుపోయారు. పొద్దున్నే పాలు తీయడానికని వచ్చి తీసుకుని వెళ్ళాడు. ఆ తర్వాత చెంబులూ కోటేశూ లేడని సాక్షాత్తూ అమ్మగారే సాక్ష్యం. విషయమంతా అర్థమైపోయింది కోటేశుకి. నోరు మెదిపే అవకాశంలేదు. రచ్చబండ దగ్గర ఒదిగి ఒదిగి నిలబడ్డ తనవాళ్ళను చూశాడు. దీనంగా తలలు వంచుకున్నారు వాళ్ళంతా దొరలంతా. ఆగ్రహంతో ఊగిపోతున్నారు. కొట్టీకొట్టీ కోటేశును నెత్తుటిముద్దను చేసి కిందపడేసి బరబరా ఈడ్చుకుంటూ పొగాకు గ్రైండింగ్‌చేసే పందిరి గుంజకు కట్టేశారు. ఎక్కడినుండి వచ్చాయో కిరసనాయిలు డబ్బాలు. కోటేశుమీద కిరసనాయిలు వర్షంలా కురిసింది. ఒకడు అగ్గిపుల్ల

గీయడం అరే అంటిస్తారా అనడం, మంట ఆర్పేసి మూతిమీద గుద్దడం. ఇంకొకడు అగ్గిపుల్ల గీయడం కాల్చేస్తాం చెప్పరా అంటూ మంట ఆర్పేసి పొత్తికడుపులో కుమ్మడం. ఇలా ఎంతోసేపు చావుబతుకులమధ్య తన్నుకుంటున్న కోటేశు ప్రాణంతో పరాచకాలాడుకున్నారు. ఒక మండిన అగ్గిపుల్ల నిర్దాక్షిణ్యంగా కోటేశు మీద పడనేపడింది. మబ్బంత మంట దిగ్గున లేచింది. కోటేశుని మంటలు ఆక్రమించాయి. పందిరి తగలబడింది. కాసేపటికి బతుకుకోసం పరుగు లంకించుకున్నాడు. అందరూ చూస్తూనే వున్నారు.

ఎవరు ఆదుకొనే ప్రయత్నమే చెయ్యలేదు. అలుముకునే మంటలతో బతుకుకోసం చావుతీరంవైపు నడచిపోయాడు కోటేశు. ఆస్పత్రిలో నాలుగు గంటలపాటు చావుతో పెనుగులాడి, అలసిపోయి చావు ఒడిలో నిద్రపోయాడు.

కోటేశు చచ్చిపోయాడు. కాలీకాలని అతని కనురెప్పలమీద బతకాలన్న తపన అట్లానే వుండి పోయింది.

**7, మార్చి 1995**

అక్షరాలు అక్షరాలుగా విస్తరిస్తున్న బతుకై కళ్ళముందు పరుచుకున్న చూపు.

రక్తసిక్త గాయాలతో, కనిపించని మంటలు కాల్చివేస్తుంటే వాక్యాలమీదుగా మళ్ళీ నా కోటేశు నడిచివస్తున్నాడు. అతని పేరిప్పుడు స్టాన్లీ సురేష్. పాలేరుతనం వదలి అష్టకష్టాలు పడి చదువుకొని దేశదేశాలు తిరిగొచ్చి పాంటూ చొక్కా తొడుక్కున్న పంతులు కోటేశిప్పుడు స్టాన్లీసురేష్. దుక్కి దున్నినంత అవలీలగా చదువులు చదివి, పిడకలు కొట్టినంత నైపుణ్యంగా బొమ్మలు గీస్తాడు. పల్లెటూరినుండి దౌర్భాగ్య నగరంలోకి వచ్చిపడ్డాడు. అతనికంటే ముందే అమ్మగారూ, ఆమెని కన్న కమ్మదొరలూ, దొరసానులూ వచ్చేశారు. కోటేశు తెల్లబట్టలేసుకొంటే "ఏరోయ్ షోకులెక్కువయ్యాయి' అన్న అదిలింపులు...'మాల, మాదిగలకు చదువులెందుకు'గా స్థిరపడ్డాయి. ఒక ఉప్పెనలాగా పెనుబీభత్సంలాగా 'మానవ వైపరీత్య'మేదో కులం రూపమెత్తి బతుకు అంచులదాకా తరిమికొడుతుంటే అవమానంలోంచి మరో అవమానంలోకి కిరసనాయిలు మంటల నుండి లేజర్‌కిరణాల మంటల్లోకి పరుగులు తీస్తున్నాడు కోటేశు. అమ్మగారు పాతపాటే పాడింది. మరొక్కసారి కులమంటలు కోటేశుని కబళించాయి.

పుట్టకముందే హత్యకు గురై, మరణించిన చోటనే మళ్ళీమళ్ళీ పుట్టుకొచ్చి సరికొత్తగా చంపబడేందుకు సిద్ధమయ్యే ఒక వికృత చక్రభ్రమణమేదో తాండవమాడుతుంది. రచ్చబండ దగ్గర దీనంగా నిలబడ్డ జాతిజనం ఇంకా దీనంగానే, విషాదంగానే నిలబడివున్నారు.

ఇరవై ఎనిమిదేళ్ళక్రితం ఆస్పత్రిలో ఏదో చెప్పాలని ప్రయత్నించాడు కోటేసు. అర్థంకాలేదు. ఇప్పుడు చదువుకున్న కోటేశు స్పష్టంగానే మాట్లాడుతున్నాడు. 'బహుశా

ఇప్పుడు నేను చచ్చిపోవచ్చును' అనుకున్నట్టుగా "బహుశా ఇప్పుడు నేను జైల్లో కెళతాను అనుకుంటున్నాడు" తను.

మనం అప్పుడే మన ఘన చరిత్రను కీర్తించుకొనే బతుకు లౌక్యంలో కూరుకు పోయాం. అక్షరశిల్పాల ఆవేదన సౌందర్యాన్ననుభవిస్తూ ఒక మాసోచిస్టిక్ విలాసంలో మునిగి తేలుతున్నాం. కాలిపోతున్న కోటేశు ఆస్పత్రికీ, పోలీసుస్టేషన్‌కూ ఒక్కడే తిరుగాడినట్టు ఇప్పుడితను సెక్రటేరియట్ చుట్టూ ఒక్కడే తిరుగుతున్నాడు. బహుశా ఎవరో ఒకరు చచ్చిపోయిందాకా నెత్తురు రోడ్డుమీద పారకుండా మన ఆగ్రహం జ్వలించనంతగా మన చర్మం మొద్దుబారిపోయింది. గట్టు తవ్వుకున్నప్పుడు కందిమోడు గుచ్చుకుంటే పల్లెపల్లెంతా అల్లాడిపోవాలి కదా! ఒక మనిషి అవమానపడితే ఒక మనిషి గాయపడితే, జాతి జాతంతా నిర్ఘాంత పోయే కాలకేతువై కదలిరావాలి కదా! సురేష్ ఒక్కడే తిరుగుతున్నాడంటే మనకేదో అయ్యింది. కాదు. బాధితుల్ని పరామర్శించినట్లు పలుకరించి వచ్చేస్తున్నామంటే మనలో ప్రభుత్వ స్వభావమేదో వచ్చింది.

ఒక్కడే యుద్ధం చేయాల్సి వస్తుందంటే వీరవిప్లవ దళిత ఉద్యమాలు ఆత్మహత్య చేసుకోవాలి.

ఒంటరైపోయిన మనిషికి ఒక విశ్వాసపు ఆలంబన కావాలి. కనులముందు కదలాడే అడుగులసవ్వడి హఠాత్తుగా తడబడితే ఏదీ ఏదీ అన్న అలమటింపుల సంఘీభావం కావాలి. స్టాన్లీమీద పెట్టిన కేసులు దళిత ఉద్యమానికే ఒక సవాల్.

స్వంతగూళ్ళు వదిలిపెట్టి బయటికి రావే నా రాదారి కోయిలా!

**సెప్టెంబర్, అక్టోబర్ 1996 – చూపు**

# రెండు ఉద్యమాలు, రెండు కేసులు
# దళిత ఉద్యమం వర్ధిల్లాలి

జూలై 17,1985 కారంచేడు మారణకాండ జరిగి 19 ఏళ్ళు గడచిపోయాయి. ఆరోజు పుట్టిన పిల్లలకు యుక్తవయస్సు వచ్చింది. ఆ రక్తపు జ్వాలల నుంచి పుట్టిన ఉద్యమానికి కూడా యుక్తవయస్సు రావల్సి ఉంది. కాని అకాల వృద్ధాప్యమేదో దళిత ఉద్యమాన్ని ఆవరించిందేమో అనిపిస్తుంది. కారంచేడు ఉద్యమం నుండి ఎంతో మంది నాయకులు పుట్టుకొచ్చారు. ఆ తర్వాత 1991 ఆగస్టు 6వ తారీఖున చుండూరు మారణకాండ జరిగింది. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో పెద్ద చర్చ జరిగింది. ఇంత విస్తారంగా చర్చకు గురైన కేసుల పరిస్థితి ఎలా ఉందో రాబోయే తరానికి గుర్తుచేద్దామని ఈ పునరాలోకనం. ఇప్పుడు కారంచేడు రుధిరక్షేత్రం వట్టి వల్లకాడైంది... చుండూరు రక్తక్షేత్రంలో ఎగిరిన జెండా వెలిసి పోతుంది. కారంచేడు మారణకాండలో నిందితులు తప్పించుకున్నారు.

ప్రకాశంజిల్లా, పశ్చిమ మండలంలో సుసంపన్నమైన గ్రామం కారంచేడు. 17.7.85వ తేదీ ఉదయం 7 గంటల నుండి 10 గంటల మధ్యకాలంలో అగ్రకులస్తులు (కమ్మ కులస్తులు) దళితవాడపైన విచక్షణారహితంగా దాడిచేసి వారిని తరిమికొట్టి ఐదుగురిని హత్యచేశారు. 1984-85 రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల్లో తెలుగుదేశంపార్టీకి చెందిన అభ్యర్థికి వోటువేయమని అగ్రకులస్థులు చెప్పిన మాటని దళితులు వినకపోవడంతో ఘర్షణ మొదలైందని చెప్పవచ్చు. అయితే 16-7-1985వ తేదీ మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రివేళల్లో జరిగిన సంఘటనలు తక్షణ కారణాలు, ఆరోజు సాయంత్రం 3గంటల ప్రాంతంలో నిందితుల్లో ఒకరు మాదిగ కుంటలో పశువుల్ని కడగడానికి తోలుకు వెళ్ళాడు. ఆది మంచి నీళ్ళ చెరువు. పశువులకు కుడితిపెట్టి మిగిలిందాన్ని అతను చెరువులో పారేశాడు. దాన్ని ప్రశ్నించిన ఒక దళిత మహిళను అతను విచక్షణా రహితంగా కొట్టాడు. ఆమెను కాపాడడానికి ఇతర స్త్రీలు వచ్చారు.

సాయంత్రం 6 గంటలకు ఆ నిందితుడు, అతని తండ్రి కలిసి ఆ దళిత మహిళ (అంతకుముందు తాను కొట్టిన మహిళ) ఇంటికి వచ్చారు. ఆమెను ఇంటినుండి బయటకు లాగి మళ్ళీ కొట్టారు. అదే రోజు రాత్రి ఆమెను, ఆమె తండ్రిని పిలువనంపారు. అయితే వాళ్ళు వెళ్ళలేదు. దాంతో ఆ నిందితుడు మరికొంతమంది కమ్మకులానికి చెందిన వ్యక్తులు కూడబలుక్కొని 17.7.1985 ఉదయం దళితపల్లె మీద క్రూరంగా దాడిచేశారు. దుడ్డు వందనం,తేళ్ళ మోషే, తేళ్ళ ముత్తయ్య, తేళ్ళ యేసోబు, దుడ్డు రమేష్ అనే ఐదుగురిని దారుణంగా హత్యచేశారు. మరో 20 మంది గాయపడ్డారు. అదే రోజు పోలీసులు ఐ.పి.సి. 147,148,307,324,302,149 సెక్షన్ల కింద కేసును నమోదుచేశారు. ఈ ఊచకోత

నుండి రాష్ట్ర వ్యాప్తంగా శక్తివంతమైన దళితవుద్యమం పుట్టింది. 1989లో ఎస్సీ,ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టం రావడానికి ఈ ఉద్యమం కారణమయ్యింది.

**క్రింది కోర్టు తీర్పు :**

గుంటూరు అదనపు సెషన్స్ న్యాయమూర్తి తీర్పులో కుట్రకు సంబంధించిన ఆరోపణలు, దుడ్డు రమేష్ హత్య (డి-5) దోపిడీ, సాక్షులను గాయపర్చడం, ఆస్తుల విధ్వంసం మొదలైన ఆరోపణలు రుజువుకాలేదని ప్రకటించారు. మరణించిన ఐదుగురిలో నలుగురిని హత్య చేసినందుకు ఐదుగురు నిందితులకు ఐపిసి సెక్షన్ 302 కింద జీవిత ఖైదు విధించారు.

మరో 55 మంది ఐపిసి 148వ సెక్షన్ కింద (మారణాయుధాలతో దాడి) నేరస్తులుగా పరిగణించి ఐదుగురు మినహా మిగతా అందరికీ 3 సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించారు. శిక్ష మినహాయింపు పొందిన 5 గురికి 10,000 రూపాయలు జరిమానా, అది చెల్లించని పక్షంలో 3సంవత్సరాల కఠిన జైలుశిక్ష విధించారు. మిగతా 20 మందిని జడ్జి నిర్దోషులుగా పరిగణించి విడుదలచేశారు. ఆ 20 మందిని నిర్దోషులుగా వదిలేయడం పైన హైకోర్టుకు అప్పీల్‌కు వెళ్ళే ఆలోచన ప్రభుత్వం చేయలేదు.

**హైకోర్టు తీర్పు :**

అప్పీల్‌లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు నిందితులను నిర్ధోషులుగా విడుదల చేసింది. ఐదుగురు దళితుల హత్యా ఆరోపణలను రుజువు చేయడంలో ప్రాసిక్యూషన్ విఫలమయ్యింది కాబట్టి నిందితులను విడుదల చేస్తున్నామని న్యాయమూర్తులు పేర్కొన్నారు.

“దుడ్డు రమేష్ (డి-5) హత్యకేసులో ముద్దాయిలను కిందికోర్టు విడుదలచేస్తే దాన్ని ప్రశ్నిస్తూ ప్రభుత్వం అప్పీల్‌కు వెళ్ళలేదు. గాయపడిన సాక్షులు చెప్పిన సాక్ష్యాలు కూడా లోపభూయిష్టంగా వున్నాయి. వాళ్ళు దర్యాప్తు చేసిన అధికారులకి చెప్పిన విషయాలకూ, కోర్టులో చెప్పిన విషయాలు తేడాగా వున్నాయి. మిగతా సాక్షుల వివరణ కూడా ఒకదానికొకటి ఖండించుకొనేలా వున్నాయి. క్లుప్తంగా చెప్పాలంటే సంఘటనకు సంబంధించిన సాక్ష్యాలు వేరువేరు విధాలుగా వున్నాయి. మా శక్తివంచన లేకుండా కృషి చేసినా అసత్యం నుండి సత్యాన్ని వేరు చేయడం సాధ్యంకావడం లేదు. కాబట్టి అప్పీల్‌పట్ల శిక్షను రద్దు చేయడం మినహా మాకు వేరే గత్యంతరంలేదు” అని హైకోర్టు తీర్పు పేర్కొంది.

వాస్తవానికి, కారంచేడు మారణకాండకు సంబంధించి రెండు కేసులు దాఖలు అయ్యాయి. ఒకటి పోలీసులు పెట్టిన కేసు, రెండవది బాధితులు వేసిన ప్రైవేటు కేసు. పోలీసుల కులపక్షపాతము, అన్యమనస్క దర్యాప్తు కారణంగా దళితులు వారిని నమ్మలేదు. దాంతో ప్రైవేట్ కేసువేశారు. ఆ కేసులో సాక్ష్యాలన్నీ చాలా పకడ్బందీగా వున్నాయి. అయితే విచారణ సమయంలో రెండు కేసుల్ని కలిపేశారు. దాంతో అనేక సమస్యలు తలెత్తాయి. దళితులు

ప్రైవేట్ కేసులో చెప్పిన విషయాలకే కట్టుబడి వున్నారు. అవే వాస్తవాలు అయితే పోలీసు కథనం అందుకు భిన్నంగా వుంది. దాంతో రెండు కేసుల్ని కలపడం ద్వారా చెలరేగిన గందరగోళాన్ని నిందితులు బాగా వుపయోగించుకొన్నారు. విచారణ జరిపిన కోర్టు కూడా సాపేక్షికంగా బలంగా వున్న ప్రైవేటు కేసును కొట్టివేసి బలహీనంగా వున్న పోలీసు కేసులో నిందితులకు శిక్ష వేసింది. నిందితులు పోలీసు కేసుపైన హైకోర్టుకు వెళ్ళారు. రెండు కేసుల్నీ కలపడంవలన తలెత్తిన తేడాలు, లొసుగుల ఆధారంగా నిందితులను నిర్దోషులుగా వదిలేసింది. దాంతో మొత్తం కేసు నిందితులకు అనుకూలంగా మారింది.

**చుండూరు మారణకాండ విచారణ : ఆలస్య న్యాయం అన్యాయమే :**

1991 ఆగస్టు 6వ తేదీన 8 మంది దళితులను దారుణంగా హత్య చేసిన మారణకాండ జరిగింది. చుండూరు, పరిసర గ్రామాలకు చెందిన 250 మంది రెడ్డి కులానికి చెందినవారు లాఠీలు, ఇనుపరాడ్లు, కత్తులు, గొడ్డళ్ళతో చుండూరు దళిత పల్లెమీద దాడిచేసి 8 మందిని హత్యచేశారు. వాళ్ళ శవాలను గోనెసంచుల్లో కుట్టిపడేశారు. న్యాయం జరగాలని దళితులు ఉద్యమించడంతో ఈ సంఘటనకు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు వచ్చింది. కేసు ఎస్సీ,ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టం కింద నమోదైంది. రెండు సంవత్సరాల తర్వాత దర్యాప్తు పూర్తి అయింది. చార్జిషీటు దాఖలు చేశారు. 219 మంది ముద్దాయిలుగా 134 మంది సాక్షులుగా పేర్కొన్నారు.

గుంటూరు ఎస్సీ, ఎస్టీ ప్రత్యేక కోర్టు 13-10-1993న నిందితులకు సమన్లు జారీచేసి 10-1-94వ తేదీకివాయిదా వేసింది. మొదట ముద్దాయిలు తమకు న్యాయవాదులను పెట్టుకోడానికి కొంత సమయం కావాలని కోర్టును కోరారు. అందులో 37 మంది ముద్దాయిలు తమకు న్యాయవాదిని పెట్టుకొనేందుకు డబ్బు లేనందువల్ల సహాయం చేయమని కోరారు. కోర్టు ఈ విషయాన్ని హైకోర్టుకు తెలియజేసి నిందితులకు న్యాయవాదులను సమకూర్చడానికి తమ వద్ద నిధులు లేనందువల్ల అందుకోసం నిధులను విడుదల చేయవలసిందిగా హైకోర్టును అడిగింది. ఈ ప్రక్రియ 25-5-1994కు పూర్తయ్యింది. ఆ తర్వాత ఇద్దరు ముద్దాయిలు జామీనును ఉల్లంఘించి కోర్టుకు హాజరు కాకపోవడంతో ఆ యిద్దరిమీద వున్న కేసును మిగతా కేసు నుండి విడదీశారు. దీంతో మరో రెండు నెలలు గడిచిపోయాయి. మళ్ళీ కేసును17-10-1994కు వాయిదావేశారు.

ఆ తర్వాత బాధితులు క్రైస్తవులు కాబట్టి ఎస్సీ,ఎస్టీ చట్టం అన్వయంకాదనీ కాబట్టి తమను కేసునుండి విడుదలచేయవలసిందిగా నిందితులు క్రిమినల్ మిస్‌లేనియస్ పిటిషన్ దాఖలు చేశారు. ఆ తర్వాత విచారణ జరిపే న్యాయమూర్తి ఆ విషయంపై విచారణ జరిపి నిందితులు దాఖలుచేసిన పిటిషన్‌ను కొట్టివేశారు. ఈ అంశంపైన నిందితులు హైకోర్టులో

పిటిషన్ దాఖలు చేశారు. చట్టం అన్వయం అవుతుందా లేదా అని నిర్ణయించేందుకుగాను సాక్ష్యాలను నమోదు చేయవలసిందిగా హైకోర్టు విచారణ కోర్టును ఆదేశించింది. విచారణ జరిపే న్యాయమూర్తికి సాక్ష్యాలను నమోదు చేయడానికి రెండు నెలలు పట్టింది. ఆ తర్వాత బాధితులు దళితులేననీ, కాబట్టి చట్టం అన్వయం అవుతుందనీ ఉత్తర్వు జారీ చేశారు.

ఇదంతా జరిగిన తర్వాత సాక్షులకు తాజా సమన్లు వెళ్ళాయి. అయితే ఈసారి సాక్షులు సమన్లు తీసుకోడానికి నిరాకరించారు. ఈ కేసు విచారణ కోసమే చుండూరులో నిర్మించిన ప్రత్యేక కోర్టులోనే కేసును విచారించాలని కోరుతూ వారు సమన్లను తీసుకోలేదు. కేసు విచారణ జరుపుతున్న కోర్టు ఈ విచారణను చుండూరులోనే జరపాలని 17-10-1994న నిర్ణయించింది. అయితే నిందితులు అందుకు అభ్యంతరం తెలుపుతూ పిటిషన్ దాఖలు చేశారు. ఈ దరఖాస్తును 25-10-1994 జడ్జి కొట్టివేసి కేసు విచారణను 1-11-1994కు వాయిదా వేశారు. అయితే నిందితులు మళ్ళీ హైకోర్టుకు వెళ్ళారు. మొత్తం ప్రొసీడింగ్స్‌ను నిలుపుదలచేస్తూ హైకోర్టునుండి 28-10-2004 స్టే ఆర్డర్ తెచ్చారు. కొన్ని నెలల తర్వాత 30-2-1995వ తేదీన విచారణ గురించి యిరుపక్షాల అభిప్రాయాలనూ విని విచారణ జరగవలసిన ప్రదేశాన్ని నిర్ణయించవలసిందిగా ట్రయల్ కోర్టును హైకోర్టు ఆదేశించింది. ట్రయల్ జడ్జి దీనిపైన కూడా విచారణ జరిపి చుండూరుకు బదులు గుంటూరులోనే విచారణ జరపాలని నిర్ణయించారు.

మళ్ళీ సాక్షులకు సమన్లు వెళ్ళాయి. సాక్షులు విచారణ చుండూరులోనే జరగాలని కోరుతూ సమన్లు తీసుకోడానికి నిరాకరించారు. వాస్తవానికి రాష్ట్ర ప్రభుత్వం కేసు విచారణను చుండూరులోనే జరిపిస్తామని అంగీకరించి పాత పాఠశాల భవనాన్ని కోర్టు భవనంగా మార్చడానికి 3 లక్షల రూపాయలు ఖర్చు చేసింది. అయినప్పటికీ దళితులకు న్యాయాన్ని అందించే విషయాన్ని అంత చిత్తశుద్ధితో పట్టించుకోలేదు. సక్రమమైన పద్ధతిలో విచారణ జరిగి నిందితులకు శిక్ష పడేందుకు ప్రయత్నాలు చేయలేదు. నిందితులు విచారణను గుంటూరుకు మార్చమని దాఖలు చేసిన పిటిషన్‌ను తీవ్రంగా సవాల్ చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేయలేదు. ఫలితంగా సంఘటన జరిగి పదమూడు సంవత్సరాలైనా యింకా నిందితుల విచారణ మొదలు కాలేదు. విచారణలో యింత జాప్యం జరగడంవలన నిందితులు దళితుల బాధితులను వత్తిళ్ళకు గురిచేసే అవకాశం వస్తుంది. యిప్పటికీ విచారణను జాప్యం చేసేందుకు నిందితులు అనేక కుయుక్తులు పన్నుతూనే ఉన్నారు.

**చుండూరు దళిత కార్యకర్తలకు మాత్రం శిక్షపడింది.**

పై ఉదంతానికి పూర్తి భిన్నంగా చుండూరు మారణకాండ తర్వాత న్యాయం కోసం ఉద్యమిస్తున్న ఐదుగురు దళిత కార్యకర్తలపైన ప్రభుత్వం పెట్టిన కేసు మాత్రం త్వరితంగా

సాగింది. ఆరో ముద్దాయిగా ఆంధ్రజ్యోతి విలేకరి పేరు చేర్చారు. ఇందులో ఒక ముద్దాయి చుండూరు దళిత బాధితుల న్యాయపోరాట కమిటీ అధ్యక్షుడు మేడికొండు సుబ్బారావు.

చుండూరు మారణకాండ జరిగిన వెంటనే శాంతిభద్రతలను అదుపులో వుంచడానికి భారీ ఎత్తున పోలీసులను మోహరించారు. నిందితులను అరెస్టు చేయాలనీ, బాధితులకు పునరావాసం కల్పించాలనీ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ బాధితులూ, ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ కార్యకర్తలూ ఉద్యమం మొదలు పెట్టారు. శాంతియుత ఉద్యమంలో భాగంగా బాధిత కుటుంబాలు, దళిత మహాసభ కార్యకర్తలు నిరవధిక నిరాహారదీక్షను ప్రారంభించారు. 10-9-1991న తేదీన నిరాహారదీక్షలో వున్న దేవరపల్లి ప్రసాద్, పి.దయాసాగర్‌ల ఆరోగ్యం క్షీణించిందనే సాకుతో ఇద్దరు ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్‌లతో పాటు పోలీసు బలగాలు నిరాహార దీక్షా శిబిరానికి వెళ్ళాయి. ఆ యిద్దరినీ బలవంతంగా అంబులెన్స్ ఎక్కించారు. వారిపై ఐపిసి 109వ సెక్షన్ (ఆత్మహత్యా ప్రయత్నం) కింద కేసు నమోదుచేశారు.

**ఆ తర్వాత ఏం జరిగిందో పోలీసుల కథనం యిలా వుంది.**

10-9-1991వ తేదీన ఆ యిద్దర్నీ ఎక్కించుకున్న అంబులెన్స్ వెళ్ళిన 10-15 నిమిషాలకు (సుమారు సాయంత్రం 4 గంటల ప్రాంతంలో) పోలీసులు తిరిగి వెళ్ళిపోయే ప్రయత్నంలో వున్నారు. అయితే నిందితులు 200-300 మందితో గుమిగూడి కర్రలు, ఇనుపరాడ్లు, రాళ్ళు సూదులతో పోలీసుల మీద దాడి చేశారు. "తమ మీద రాళ్ళువిసిరి, సూదులతో గుచ్చారు. హెడ్ కానిస్టేబుల్ చిన సోమ్లా నాయక్‌ను రాయితో కొడితే అతని తలకు గాయం అయ్యింది. దాంతో అతను తన రైఫిల్‌తో కాల్పులు జరిపాడు. దళిత మహాసభ కార్యకర్త కొమ్మెర్ల అనిల్‌కుమార్‌కు బుల్లెట్‌లు తగిలాయి. దాంతో అతను మృతి చెందాడు". ఆ తర్వాత పోలీసులు గుంపును చెదరగొట్టారు.

సంఘటన జరిగన వెంటనే చుండూరు పోలీస్ స్టేషన్ సబ్ ఇన్స్‌పెక్టర్ ఒక నివేదికను రాసి ఎఫ్.ఐ.ఆర్.ను నమోదు చేశాడు (క్రైం.నెం. 98/91) ఐ.పి.సి. సెక్షన్లు 143 (చట్ట వ్యతిరేకంగా సమావేశం కావడం) 147 (దాడి) 148 (మారణాయుధాలతో దాడి) 324 (మారణాయుధంతో గాయపర్చడం), 323 (దాడిచేసి గాయపర్చడం), 353 (ప్రభుత్వోద్యోగిని విధి నిర్వహణ చేయనీయకుండా నేరపూరితమైన హింస, లేదా దాడికి పాల్పడడం) 332 (ప్రభుత్వోద్యోగిని విధి నిర్వహణ చేయనీయకుండా గాయపర్చడం) 109 ఆర్.డబ్ల్యు 149 (గుంపులో వున్న ప్రతి ఒక్కరూ ఒక ఉద్దేశ్యంతో నేరానికి పాల్పడ్డం) అనే సెక్షన్‌ల కింద కేసు పెట్టారు. నిందితులను అరెస్టు చేసి జామీను మీద విడుదల చేశారు. యిది పోలీసు కథనం

10-9-1991 చుండూరు సంఘటనపై ప్రత్యామ్నాయ నివేదిక అమ్నెస్టీ ఇంటర్నేషనల్ నివేదిక ప్రకారం, పోలీసులు నిరాహారదీక్షలో వున్న వారిని అరెస్టు చేయడానికి వచ్చారు. అరెస్టులను అడ్డుకోడానికి దళితులు ప్రయత్నించారు. దాంతో పోలీసులు ఎటువంటి హెచ్చరికలు లేకుండా కాల్పులు జరిపి అనిల్ కుమార్‌ను హత్యచేశారు. గుంపుగా పోగయిన జనానికీ పోలీసులకూ నచ్చచెప్పడానికి అనిల్ కుమార్ ప్రయత్నిస్తున్నాడని, ఆ ప్రయత్నంలో ఉండగా అతన్ని కాల్చి చంపారని దళిత కార్యకర్తలు చెపుతున్నారు.

**నగ్న సత్యాలు :**

స్పష్టంగా కన్పించే ఒక వాస్తవం ఏమిటంటే హెడ్ కానిస్టేబుల్ చిన సోమ్లా నాయక్ తలకు రాయితో గాయం అయిందా లేదా అన్న విషయంతో సంబంధం లేకుండానే అతను ఆ రోజు ఇన్‌ఛార్జి అధికారిగా వున్న డిఎస్పీ వుత్తర్వు లేకుండానే కాల్పులు జరిపాడు. ఫలితంగా అనిల్ కుమార్ చనిపోయాడు. ఒక వేళ పోలీసులకు రాళ్ళతో గాయాలు తగిలాయన్నది నిజమే అయినా, ఆ కారణం కాల్పులు జరపడానికి కావలసిన ప్రమాదకరమైన పరిస్థితిని కల్పించదు. చుండూరు మారణకాండపైన విచారణకు నియమితమైన జస్టిస్ గంగాధరరావు కమిషన్ ముందు స్వయంగా సోమ్లా నాయక్ ఈవిషయాన్ని అంగీకరించారు.

"నాకు రాయి తగిలింది. రక్తం కారడం మొదలయ్యింది. నేనుకిందపడిపోయాను. రాళ్ళు పడుతూనే వున్నాయి. వాడిని కొట్టండి అంటూ వాళ్ళరుస్తున్నారు. దాంతో నేను రైఫిల్ పేల్చాను. యింకా రాళ్ళు పడుతూనే వున్నాయి. నేను సహనం కోల్పోయాను.మళ్ళీ పేల్చాను. ఆ తర్వాత ఏమయ్యిందో నాకు తెలియదు. సూదులు పట్టుకొన్న 200 మంది స్త్రీలు పోలీసులపైన దాడిచేశారు. రాళ్ళు విసిరినందుకే కాల్పులు జరపకూడదని నాపై అధికారులు నాకు చెప్పలేదు" (ఉదయం - తెలుగు దినపత్రిక 13-12-1991)

అనిల్ కుమార్ విషయంలో కూడా అతన్ని కాల్చి చంపడం అన్నది కేవలం యాధృచ్ఛికంగా జరిగిన ప్రమాదం కాదు, పథకం ప్రకారం చేసిన హత్య అనడానికి ఆధారాలున్నాయి. చుండూరు మారణకాండకు అనిల్ కుమార్ ఒక ప్రత్యక్ష సాక్షి అనీ, ఆ మారణకాండకు సంబంధించి ఫిర్యాదుదారు కూడా కావడంతోపోలీసులు అతన్ని లక్ష్యంగా పెట్టుకున్నారని పత్రికలు రాశాయి. అతను యిచ్చిన ఫిర్యాదులో హత్యకు గురైన ఎనిమిది మందిలో ఒకరైన దేవరపల్లి రమేష్‌ను చంపినవారిలో అగ్రకులాలవారితోపాటు సి.ఐ. సాయిబాబా మరికొందరు పోలీసులు కూడా వున్నారని పేర్కొన్నాడు. చనిపోయిన వారిలో ఒకరికి అతను బంధువు, చుండూరు దళితవాడలో చురుకైన వ్యక్తి. చుండూరు దళిత బాధితుల న్యాయ పోరాట కమిటీకి ఉపాధ్యక్షుడు.

దళిత కార్యకర్తలపైన పెట్టిన కేసులో మరొక బలహీనమైన అంశం ఏమిటంటే ఇద్దరు కీలకమైన సాక్షులను విచారించకపోవడం. విచారణ ప్రారంభం కాకముందే యం.ఆర్.ఓ. చనిపోయారు. 10-9-1991వ తేదీన ఇన్‌ఛార్జిగా వున్న డి.ఎస్.పి.కి సమన్లు వెళ్ళినప్పటికీ విచారణ ఏ దశలోనూ అతను కోర్టుకు హాజరుకాలేదు. కాల్పులు జరపవలసిందిగా డి.ఎస్పీ తన మనుషులకు ఆదేశాలివ్వడానికి అనుమతినిచ్చే అధికారం వున్న ఏకైక వ్యక్తి ఆరోజు అక్కడ వున్న యం.ఆర్.ఓ. ప్రధాన సాక్షులు చెప్పిన విషయాల్లో కూడా అనేక లొసుగులున్నాయి. మొదటి సాక్షి చుండూరు ఎస్.ఐ కందా శ్రీనివాసులు. అతను తన సాక్ష్యంలో నాయక్‌కు తలపైన రాయివలన గాయం అయిన వెంటనే కాల్పులకు ఆర్డర్ యివ్వడం జరిగింది అని పేర్కొన్నారు. అయితే సంఘటన జరిగిన వెంటనే అతనే రాసిన రిపోర్టులో కాల్పులు జరపవలసిందిగా డి.ఎస్పీ ఇచ్చిన ఆర్డర్ మేరకే కాల్పులు జరిగాయన్న విషయాన్ని పేర్కొనలేదు. అధికారికంగా దర్యాప్తు చేసిన అధికారికి, ఎస్.ఐ. ఇచ్చిన అధికారిక స్టేట్‌మెంటులో కూడా ఈ విషయాన్ని పేర్కొనలేదు. తీర్పు ఉత్తర్వు ప్రకారం ఈ కేసులో సాక్షులెవరూ కాల్పులు జరపవలసిందిగా ఉత్తర్వులు జారీ అయ్యాయన్న విషయాన్ని చెప్పలేదు. రాళ్ళు తమ మీద పడడంతో సహనం కోల్పోయి కాల్పులు జరిపామని వాళ్ళు చెప్పారు. అయితే మిగతా వాళ్ళు గాలిలోకి కాల్పులు జరిపారు. నాయక్ నేరుగా అనిల్ కుమార్‌ను కాల్చాడు.

ఈ కేసులో మరో బలహీనత ఏమిటంటే, ఇందులో సాక్షులందరూ పోలీసులే. నిందితులను కోర్టులో చూసేముందు వారిని గుర్తుపట్టడానికి వీలుగా దర్యాప్తు చేసే అధికారులు ఎటువంటి ఐడెంటిఫికేషన్ పెరేడ్ నిర్వహించలేదు.

నాయక్ స్వయంగా యిచ్చిన స్టేట్‌మెంట్ (కాల్పులు జరపడానికి ఆర్డర్స్ లేవని) దళితుల్ని హత్యచేసిన వారిలో చుండూరు పోలీసులుకూడా వున్నారని అనిల్ కుమార్ చెప్పడం, గుమిగూడిన దళితుల చేతుల్లో రాళ్ళు, పిన్నులు మాత్రమే వుండడం ఈ వాస్తవాలన్నీ కాల్పులు జరగడానికి దారి తీసిన పరిస్థితులపైన అనేక సందేహాలను కలిగిస్తున్నాయి. కాల్పులు జరగడానికి కారణం ఏమిటి? ఎందుకోసం? మొత్తం గందరగోళంలో నిజంగా దురుసుగా వ్యవహరించింది ఎవరు? నిజంగా ఎవరు ఎవరిని గాయపర్చారు? నిజానికి ఎవరు చట్టాన్ని ఉల్లంఘించారు? ఎవరి హక్కులు వుల్లంఘనకు గురయ్యాయి? ఈ అంశాలన్నింటినీ కేసు విచారణలోనూ, తీర్పులోనూ పరిగణలోనికి తీసుకొని వుండాల్సింది.

అన్నింటినీ చూస్తే తేలేదేమిటంటో న్యాయంకోసం ఉద్యమంలో పాల్గొంటున్న దళిత కార్యకర్త అనిల్ కుమార్‌ను పోలీసులు అనవసరంగా, చట్ట వ్యతిరేకంగా కాల్చి చంపారు. అందుకు కాల్పులు జరిపిన నాయక్‌ను గానీ, అతని సహచరులనుగానీ ఎన్నడూ ప్రాసిక్యూట్

చేయడం గానీ క్రమశిక్షణా చర్యలు తీసుకోవడం కానీ చేయలేదు. అందుకు పూర్తి భిన్నంగా పోలీసుల మీద రాళ్ళు విసిరారనీ, వారిని పిన్నులతో గుచ్చారనీ దళిత కార్యకర్తలకు శిక్ష వేశారు. ఈ అంశాలనూ, సమస్యాత్మకమైన సందేహాలనూ లేదా జవాబులు దొరకని ప్రశ్నలను వేటినీ జడ్జిమెంట్ ఆర్డర్‌లో పరిగనలోనికి తీసుకోలేదు. ఆ తీర్పు ఐపిసి సెక్షన్ 143, 147, 332 ఆర్/ డబ్ల్యు 149 కింద క్రిమినల్ లా ఎమెండ్‌మెంట్ యాక్ట్ 7(1) కిందా ఆరుగురికి రెండేళ్ళు జైలుశిక్ష, 3,500 రూపాయలు జరిమానా విధించింది. ఆ తీర్పుపైన అప్పీల్‌కు వెళ్ళారు. ఆ తర్వాత జిల్లా కోర్టు ఆ కేసును కొట్టివేసింది.

రెండు కేసులు. ఒకటి చుండూరు దళితులను దారుణంగా హత్యచేసిన కేసు, రెండు చుండూరు దళితులు, దళిత కార్యకర్తలు పోలీసులు మీద రాళ్ళు రువ్వి, సూదులతో గుచ్చిన కేసు. రెండు కేసులపట్లా ప్రభుత్వం వేరువేరుగా వ్యవహరించింది. ఐదుగురు దళిత కార్యకర్తలు, ఒక జర్నలిస్టూ, పోలీసులపైన రాళ్ళు విసిరి సూదులతో గుచ్చారని అభియోగం మోపి వారికి శిక్ష పడిందాకా ప్రభుత్వం అన్ని ప్రయత్నాలూ చేసింది. విచారణ త్వరితంగా పూర్తయి శిక్ష విధించారు. అదే సమయంలో చుండూరు దళితులను హత్య చేసిన కేసు తొమ్మిది సంవత్సరాలైనా యింకా విచారణ ప్రారంభం కాలేదు. దళితుల కేసులో నిందితులకు శిక్షపడేట్టు చూడడంలో కనపర్చిన శ్రద్ధ, అగ్రవర్ణాల వారు నిందితులుగా వున్న కేసు పట్ల ప్రభుత్వానికి లేదా?

అయితే విచారణ చుండూరులోనే జరగడానికి ప్రభుత్వం చిత్త శుద్ధితో ప్రయత్నిస్తున్నట్లు కన్పించడం లేదు. దళితుల మీద వున్న కేసు పట్ల చురుగ్గా వ్యవహరించిన ప్రభుత్వమే, అగ్రకులాల వారిపైన వున్న కేసుపట్ల మందకొడిగా అనాసక్తంగా వ్యవహరిస్తుంది.

**జులై, ఆగస్టు – 2004 – బహుజన కెరటాలు**

# చుండూరు గుండె గాయం ఇప్పుడు సాక్ష్యం చెబుతుంది!

ఎట్టకేలకు చుండూరు కేసు విచారణ పధ్నాలుగు సంవత్సరాల తర్వాత మొదలైంది. కేసు విచారణ అసలు జరగనివ్వరాదనీ, జరిగినా దళితులు పోరాడి సాధించుకున్న చుండూరు కోర్టులో జరగనివ్వరాదనీ అనేక కుట్రలూ కుతంత్రాలూ జరిగాయి. ప్రభుత్వం సైతం ఈ కేసు విచారణ పట్ల దుర్మార్గమైన నిరాసక్తతనూ, నిర్లక్ష్యాన్ని ప్రదర్శించి దోషుల ప్రయత్నాలకు ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ సహకరించింది. మొత్తానికి చుండూరు దళితులు తాముపోరాడి సాధించుకున్న హక్కును నిలుపుకున్నారు. విచారణ చుండూరు కోర్టులోనే మొదలైంది.

చుండూరు దళితులు లొంగిపోతారనీ, సాక్ష్యాలుచెప్పరనీ, కేసువీగిపోతుందనీ అస్మదీయ, తస్మదీయ వర్గాలు పుకార్లు పుట్టించాయి. పత్రిక అచ్చుయ్యేనాటికి ఐదవసాక్షి తన వాంగ్మూలాన్ని వినిపించాడు. ఐదుగురు సాక్షులూ ఏ మాత్రం లొంగుబాటుతనాన్ని ప్రదర్శించకుండా నిర్భయంగా సాక్ష్యం చెప్పారు. చెబుతున్నారు. ఇది చుండూరు దళితులు, దళిత ఉద్యమం గర్వపడేసందర్భం. గాయాల పచ్చి యింకా మానలేదు. తల్లుల, భార్యల, బిడ్డల కన్నీటిధార ఆరలేదు. ఆవేదన, ఆగ్రహంతో చుండూరు గుండె గాయం యిప్పుడు సాక్ష్యంచెపుతుంది.

కారంచేడు కేసులో సైతం దళితులు అన్ని వైపులనుండీ వస్తోన్న వత్తిళ్ళను తట్టుకొని నిర్భయంగా సాక్ష్యం చెప్పారు. దళిత ప్రపంచం నమ్మకాన్ని కారంచేడు సాక్షులు వమ్ము కానీయలేదు. కిందికోర్టు నిందితులకు యావజ్జీవకారాగార శిక్షవిధించింది. అయినా కేవలం కొన్ని సాంకేతిక కారణాలను చూపి హైకోర్టు కొట్టివేసింది. యిప్పుడు మొత్తం దళిత ప్రపంచం చుండూరు విచారణ వైపు ఆశగా, ఆసక్తిగా, అనుమానంగా చూస్తోంది. కారంచేడు కేసులో జరిగిన సాంకేతిక లోపాలనీ, హైకోర్టు తీర్పునీ దృష్టిలో వుంచుకొని ప్రాసిక్యూషన్ తగిన జాగ్రత్తలు వహించాలని కోరుతున్నాం.

అనేక వందల యేళ్ళపాటు ప్రజలు జరిపిన పోరాటాల ఫలితంగా ప్రజలు కొంత ప్రజాస్వామిక వెసులుబాటును సంపాదించుకున్నారు. ఆ వెసులుబాటులో తమ ఫిర్యాదులని పరిష్కరించుకోవాలని దళిత ఉద్యమం ప్రయత్నిస్తోంది. ముఖ్యంగా డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ పోరాట నాయకత్వంతో ఆ వెసులుబాటు మరింత విస్తృతమైంది. కానీ ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి మాత్రమే శాసన, కార్యనిర్వాహక, న్యాయవ్యవస్థలను రూపొందించుకున్నారు. పాలనా వ్యవస్థలు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో దారుణంగా విఫలమయ్యాయి. ఆ వైఫల్యాలను ప్రజా సమూహాలు పదేపదే ఎత్తిచూపినా సరిచేసుకోడానికి చిత్తశుద్ధితోకూడిన ప్రయత్నాలేమీ చేయలేదు.

శాసన సభా చట్టాలనూ, నిర్ణయాలనూ అమలు చేయవలసిన కార్యనిర్వాహక వర్గమూ, అన్నింటికీ మించి సర్వస్వతంత్రంగా వ్యవహరించగలమని ప్రకటించుకున్న న్యాయవ్యవస్థ సైతం, కుల వ్యవస్థ తాలూకు ప్రభావాలనుండి బయట పడలేకపోతున్నాయి. సమాజంలోని అన్ని అవలక్షణాలూ ఆయా పాలనా వ్యవస్థల్లోకి జొరబడ్డాయి. ప్రభుత్వాలకి సంబంధించి సామాజిక న్యాయం అన్నమాట వట్టి నినాదప్రాయంగా మారిపోయింది.

ఒకవైపున శాంతి స్థాపనకోసం, ప్రజాస్వామ్యాన్ని ప్రతిష్టించడంకోసం, ప్రజాస్వామ్యంపట్లా, రాజ్యాంగం పట్లా నమ్మకం లేదని ప్రకటించిన నక్సలైట్లతో కూడా చర్చలుచేయడానికి సిద్ధపడ్డామని ప్రకటించి, చర్చల ప్రక్రియను ప్రారంభించిన ప్రభుత్వం దళితుల విషయంలో మాత్రం మిశ్రమ సంకేతాలనే పంపిస్తుంది. దళితుల సంక్షేమానికీ, రక్షణకీ కట్టుబడివున్నామని ఒకవైపున నోటిమాటలు చెబుతూనే న్యాయంకల్పించే విషయంలో మాత్రం దుర్మార్గమైన నిర్లక్ష్యవైఖరిని ప్రదర్శిస్తుంది.

చట్టాలపట్లా, రాజ్యాంగంపట్లా, ప్రజాస్వామ్యంపట్లా నమ్మకంతో నిలబడిన దళితులకు ఎక్కువ సందర్భాలలో నిరాశే ఎదురైంది.

బహుశా! చుండూరు విచారణ దళితుల సహనానికీ, ప్రజాస్వామ్యంపట్ల వారికున్న విశ్వాసానికీ ఆఖరి పరీక్ష అవుతుంది. ధైర్యంగా నిలబడి సాక్ష్యాలు చెపుతున్న చుండూరు దళితులవైపూ, జరుగుతున్న విచారణవైపూ ఆసక్తిగా ఎదురుచూస్తున్న దళిత ప్రపంచానికి ఒక నిర్ణయాత్మకమైన సందర్భమవుతుంది.

ప్రభుత్వానికీ దాని సమస్త అంగాలకీ ప్రజాస్వామికంగా వ్యవహరించడమూ, సామాజిక న్యాయాన్ని కల్పించడమూ సాధ్యం కాదన్న సందేశం, ఈ విచారణద్వారా అందితే, దళితులకు అంబేడ్కర్ సాక్షిగా ఆయుధాలు అందుకోవడం తప్ప మరో మార్గం మిగలదు. అది చట్టబద్ధంగానో, చట్టవ్యతిరేకంగానో కాలం నిర్ణయిస్తుంది.

కానీ జాతికి జాతి సాయుధమైతే దాన్ని ఎదుర్కొనడం ఏ ప్రభుత్వానికీ సాధ్యంకాదన్న విషయం చరిత్ర చాటిన సత్యం.

**నవంబర్,డిశంబర్ – 2004 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# మాదిగ దండోరా - మాల మహానాడు

" In history, as in nature, decay is the laboratory of life"

**ఎన్నో కష్టాలు పడినమీదట దళిత చైతన్య రథాన్ని యిక్కడివరకూ తీసుకు రాగలిగాను. ముందుకు తీసుకువెళ్ళడం మీకు కుదరకపోతే దాన్ని అక్కడే వుండనివ్వండి. వెనక్కి మాత్రం తీసుకువెళ్ళవద్దు - డా॥ అంబేద్కర్**

మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి ఎస్సీ రిజర్వేషన్లను ఎ.బి.సి.డి.లుగా వర్గీకరించాలని డిమాండ్ చేస్తూ ఉద్యమాన్ని నడుపుతుంది. ఉమ్మడి రిజర్వేషన్ విధానం వలన కొన్ని కులాలకే, ముఖ్యంగా మాల కులానికే ఎక్కువ లాభం చేకూరిందనీ, కాబట్టి ప్రతి కులానికీ రిజర్వేషన్ ఫలితాలు అందేలాగా జనాభా నిష్పత్తి ప్రకారం వర్గీకరణ జరగాలనీ వాదిస్తుంది. రాజ్యాధికారంలోనూ, దేశ వనరుల్లోనూ, చివరకి రిజర్వేషన్‌లోనూ ప్రతి ఒక్కరికీ ఎవరి వాటా వారికి దక్కాలన్నది అంబేద్కర్ ఆశయం. మాదిగ దండోరా డిమాండు న్యాయమైనది.

యీ డిమాండుకు కొంతమంది నుండి తప్ప సర్వత్రా మద్దతు లభించింది. రకరకాల కారణాలతో రకరకాల శ్రేణులు దీనికి మద్దతు ప్రకటించాయి. (1) మాదిగల డిమాండు ప్రజాస్వామికమైనది కావడం. (2) ఈ ఉద్యమం వలన మిగతా సమాజానికి పోయేదేమీ లేకపోవడం. (3) రిజర్వేషన్ కోటాని అదనంగా పెంచేది ఏమీ లేకపోవడంతో ప్రభుత్వానికి కూడా పెద్ద సమస్య కాకపోవడం. (4) తమ డిమాండు సాధనకు దండోరా నాయకులు శాంతియుతమైన పద్ధతులనే అవలంబించడంతో సమాజంలో యితరులకు యే అసౌకర్యమూ కలగకపోవడం. దీంతో దండోరా ఉద్యమం అందరి మన్ననలనూ పొందింది.

యిప్పటివరకూ దళితులంతా కట్ట కట్టుకొని అవసరమున్నా లేకపోయినా అందరినీ తిట్టిపోశారనీ, యిప్పుడు వాళ్ళల్లో వాళ్ళే ఒకళ్ళనొకళ్లు తిట్టుకొంటున్నారనీ, కొట్టుకొంటారనీ, శాడిస్టిక్ ఆనందం పొందిన వాళ్ళు పొందినప్పటికీ, మాదిగ దండోరా ఉద్యమానికి మద్దతునిచ్చిన వారంతా చిత్తశుద్ధితోనే తమ సంఘీభావం ప్రకటించారు. పన్నెండేళ్ళ క్రితం కారంచేడు మాదిగపల్లె మీద ఒక అగ్రకులానికి చెందినవారు దుర్మార్గంగా దాడిచేసి మాదిగ పల్లెలను నెత్తుటి మడుగుల్లో ముంచెత్తిన దారుణానికి పాల్పడినప్పుడు, ఆ నెత్తుటి జ్వాలల్లోంచి పుట్టిన దళిత ఉద్యమం పట్ల యిది విచ్ఛిన్నమైనదనీ, కులం సమస్య వర్గసమస్యలతో ముడిపడివున్నదనీ, కులం ఉపరితలమనీ, భూమి పోరు చెయ్యాలనీ రకరకాల సూత్రీకరణలు చేసి దళిత ఉద్యమానికి దూరంగానే వుండిపోయిన కమ్యూనిస్టు విప్లవ గ్రూపులు సైతం యిన్నేళ్ళ కాలంలో తమ అవగాహనలో వచ్చిన మార్పు వలన దండోరా ఉద్యమానికి మద్దతు ప్రకటించారు. ఆయా విప్లవగ్రూపులు, రచయితల సంఘాలు ఒక సంఘీభావ కమిటీగా ఏర్పడి దండోరా ఉద్యమానికి బాసటగా నిలిచాయి. మాల కులానికి చెందిన

దళిత నాయకులు కత్తి పద్మారావు, కె.జి. సత్యమూర్తి, గద్దర్ లాంటివాళ్ళు కూడా దండోరాకి మద్దతు ప్రకటించారు. కొంతమంది మాల కులానికి చెందిన కవులు, రచయితలు రిజర్వేషన్ వర్గీకరణను సమర్ధించారు. గద్దర్ స్వయంగా దండోరా సంఘీభావ కమిటీకి కన్వీనర్గా వ్యవహరించారు.

దండోరాని సమర్ధిస్తున్న కమ్యూనిస్టు నాయకులు గానీ, ఆయా విప్లవ గ్రూపులు గానీ, రచయితల సంఘాలు కానీ, దళిత నాయకులు, రచయితలు గానీ దండోరాకు సంఘీభావం ప్రకటించటమంటే కేవలం మద్ధతును తెలిపి, దండోరా కార్యక్రమాలకి హాజరు కావడమేనని భావించారు. తాము దేనినైతే న్యాయమైనదని భావిస్తున్నారో దాని గురించి మిగతా సమాజంలో ప్రచారం చేసి దానికి మద్దతును కూడగట్టే ప్రయత్నం చెయ్యలేదు. ముఖ్యంగా దండోరా డిమాండ్ వలన తాము నష్టపోతామేమోనన్న అలజడికి గురవుతున్న మాల కులానికి దీనివలన ఎవరికీ నష్టం లేదన్న విషయాన్ని విశదపర్చే బాధ్యత తీసుకోలేదు. ముఖ్యంగా దళిత నాయకత్వం దీనినొక బాధ్యతగా భావించలేదు.

మాదిగ దండోరా ఉద్యమకారుల తిట్లనుండి తప్పించుకొని, వారి మెప్పు పొందాలన్న ధ్యాసే వ్యక్తమైంది తప్ప మాలల్లో దీనిపట్ల సరైన చైతన్యాన్ని కలిగించే ప్రయత్నమే జరగలేదు. ఒకటీ అరా జరిగినా అవి యే ప్రభావాన్ని చూపని బలహీన స్వరాలుగానే మిగిలిపోయాయి.

మాదిగ దండోరా నాయకత్వం కూడా మాలల వలనే తమకు అన్యాయం జరిగిందనీ, తమ దుస్థితి అంతటికీ మాల కులస్తులే కారణమన్న అభిప్రాయాన్ని కలిగించారు. మాదిగ దండోరా రాష్ట్ర నాయకులైన మందకృష్ణ మాదిగ, కృపాకర్ మాదిగలు వ్యక్తిగతంగా యీ ప్రచారాన్ని ఖండించినప్పటికీ, 'మాలలు మా శతృవులు కాదు' అని పదేపదే ప్రకటనలు చేసినప్పటికీ జిల్లాల్లో, మండలాల్లో, గ్రామాల్లో మాల వ్యతిరేకత వైషమ్య స్థాయికి పెరిగింది. "త్రాచుపాము, మాలవాడు ఎదురైతే, పాముని వదిలేసి మాలవాణ్ణి చంపాలి" లాంటి నినాదాలు యింకా వెక్కిరిస్తూనే వున్నాయి. తెలిసి జరిగినప్పటికీ, తెలియక జరిగినప్పటికీ మాలమాదిగల మధ్య పరస్పరం అనుమానాలు, శతృభావం పెరిగింది. యీ దశలో రిజర్వేషన్ వర్గీకరణ సాధ్యాసాధ్యాలనూ, జరిపితే ఏవిధంగా జరగాలనీ ఆలోచించి, ఒక సాధారణ అభిప్రాయాన్ని రూపొందించడానికి మాదిగ దండోరా నాయకులతో చర్చలు జరిపే నాయకత్వం మాలల్లో కొరవడింది. దళిత నాయకులుగా చలామణీ అవుతున్న మాల కులంలో పుట్టిన నాయకులు తమను తాము మాల నాయకులుగా చెప్పుకోవడానికి సిద్ధపడలేదు. దీనిలోని తప్పొప్పులను చర్చించబోవడం లేదు. కానీ సామరస్య పూరితమైన వాతావరణంలో యిరు వర్గాల మధ్య చర్చలు జరిపే అవకాశాన్ని చేతులారా పోగొట్టారు. యీ పరిస్థితుల్లో మాల మహానాడు పుట్టింది. అయితే "రిజర్వేషన్ వర్గీకరణ" డిమాండును తిరస్కరిస్తూనే మాల మహానాడు పని ప్రారంభించింది. దాంతో యిక చర్చలే జరగలేని వాతావరణం ఏర్పడింది. మాల

మహానాడు ఏర్పడే నాటికే "మాల కులం అభివృద్ధి చెందిన కులం" అన్న అభిప్రాయానికి మిగతా సామాజిక శ్రేణులు వచ్చేశాయి. యిదే అభిప్రాయాన్ని ధృవీకరిస్తూ కొన్ని విప్లవ గ్రూపుల పత్రికలు వ్యాసాలు కూడా ప్రచురించాయి. నిజానికి వీరంతా మాల కులం అభివృద్ధి చెందిందని చెప్పడానికి ఏ ప్రమాణాలను ప్రాతిపదికగా తీసుకున్నారో తెలియదు. మొత్తం మాల జనాభాలో విద్యా, ఉద్యోగావకాశాలను పొందగలిగిన 3శాతాన్ని మినహాయిస్తే మిగతా 97శాతం మాల తల్లులు, తండ్రులు పల్లెల్లో, పట్టణాల్లో రోజు కూలీలుగా బ్రతుకు లీడుస్తున్నారు. పిల్లలు బడిమొఖమైనా ఎరుగక బాలకార్మికులుగా రోజులు వెళ్ళదీస్తున్నారు. నిరంతరం అవమానాలకు గురవుతూ, అంటరాని జీవితాలను గడుపుతున్నారు. విద్యా, ఉద్యోగావకాశాలను పొందని మాదిగల పరిస్థితి యింతే. అక్షరాస్యులై ఉద్యోగావకాశాలను పొందగలిగిన మాలల కన్నా విద్యా ఉద్యోగావకాశాలను పొందిన మాదిగల శాతం స్వల్పంగా తగ్గుతుంది. యీ వ్యత్యాసాన్నే చూసి మొత్తం మాలకులం అభివృద్ధి చెందిందన్న అబద్ధాన్ని పని గట్టుకొని ప్రచారం చేశారు. దాంతో మాలకులం ప్రజాస్వామిక శక్తులుగా కన్పించే ఎవరి మద్దతునీ, సానుభూతినీ పొందలేక పోయింది.

ముందుగానే వర్గీకరణను సమర్ధించి మాదిగలతో సుహృద్భావ చర్చలకు సిద్ధపడకుండా మాల నాయకత్వం చేసిన పొరపాటూ, రిజర్వేషన్ అమలులో జరిగిన అవకతవకలకీ, అసమతౌల్యానికీ మాలలే కారణమన్న ప్రచారం చేసిన మాదిగ నాయకత్వం పొరపాటూ, ఎవరు కదలబారితే వాళ్ళకు మద్దతు ప్రకటించి అంతటితో తమ పని అయిపోయిందనుకొని మిగతా బాధ్యతల్ని వేటినీ పట్టించుకోని ప్రజాస్వామిక శక్తుల, మేధావుల పొరపాటు అన్నీ కలిసి తడిసి మోపెడయ్యాయి. యిపుడు మాల మాదిగ కులాలు పరస్పరం శతృశిబిరాలుగా మారే పరిస్థితి దాపురించింది.

యీ మొత్తం ప్రహసనంలోనూ ప్రభుత్వం దుర్మార్గమైన వైఖరిని అనుసరించింది. జనాభా నిష్పత్తి ప్రకారం రిజర్వేషన్లను వర్గీకరించాలన్న మొదటి మెమోరాండం అందినవెంటనే ఎస్సీ, ఎస్టీల జాతీయ కమీషన్‌కు విషయాన్ని నివేదించవలసింది. ఆ పని చెయ్యలేదు. రిజర్వేషన్ వర్గీకరణకు సంబంధించి రాజ్యాంగ నిపుణులతోనూ, సామాజిక శాస్త్రవేత్తలతోనూ, యితర సామాజికోద్యమ నాయకులతోనూ ముఖ్యంగా మాలమాదిగ కులాల నాయకులతోనూ అఖిల పక్ష సమావేశాలు జరిపి ఒక సాధారణాభిప్రాయాన్ని తీసుకువచ్చే ప్రయత్నాలు చేయవలసింది. ఒక్కసారి వీలు కాకపోతే దఫదఫాలుగా చర్చలు నిర్వహించవలసింది. రెండు కులాలవాళ్లు ఎవరికి వాళ్ళు సభలు జరిపి, సమావేశాలు జరిపి ఒకరిని మరొకరు దూషించుకొంటూ, ఆయాకులాల మధ్య శతృత్వం పెరిగే వాతావరణం కల్పిస్తున్నప్పుడన్నా ప్రభుత్వం వైషమ్యాలను రూపుమాపే ప్రయత్నం చెయ్యవలసింది. అలా చేయకపోగా వైషమ్యాలు పెరుగుతుంటే చోద్యం చూసుకొంటూ కూర్చుంది. తెలుగుదేశం

పార్టీకి చెందిన మాదిగ మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు దండోరా పక్కన చేరి మంటల్ని ఎగదోసే ప్రయత్నం చేయడం యాధృచ్ఛికమైన విషయం కానేకాదు. తన స్వంత కులం పైన నిజంగా ప్రేమవున్న వారైతే తమ పదవులకు రాజీనామాలు చేసి ప్రభుత్వం నిర్లక్ష్యవైఖరిని ఖండించేవారు. ఆ పనేమీ చెయ్యకుండా సమీకృతమైన ఆయా కులాల సమస్యలను తమ స్వంత బలంగా ముఖ్యమంత్రికి చూపించుకొని తమ పదవుల్ని కాపాడుకొనే ప్రయత్నం చేశారు. మిగతా రాజకీయ పార్టీలు కూడా 'శ్మశానంలో బొగ్గులేరుకునే' వైఖరిని అవలంబించాయి.

1997 జూన్ ఆరవ తేదీన విడుదలైన జీవో 68లో షెడ్యూల్డు కులాల జాబితాలో వున్న ఆయా కులాల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక స్థాయిలను పరిశీలించిన తర్వాత కొన్ని కులాలు రిజర్వేషన్ సౌకర్యాన్ని ఎక్కువగానూ, మరికొన్ని తక్కువగానూ పొందాయనీ, కాబట్టి రిజర్వేషన్ ఫలితాలను అందరికీ సమంగా వర్తింపచేయడానికి ఎస్సీలను ఎ.బి.సి.డిలుగా వర్గీకరించాలని, రెల్లి గ్రూపునకు 1శాతం, ఆది ఆంధ్ర గ్రూపునకు 1శాతం, మాదిగ గ్రూపునకు 7శాతం, మాల గ్రూపునకు 6శాతం రిజర్వేషన్ కేటాయించాలనీ ప్రభుత్వం పేర్కొంది. ప్రభుత్వ ఉత్తర్వులో వివరించినట్లుగా అందరికీ రిజర్వేషన్ ఫలితాలు అందజేయడం అన్న స్ఫూర్తి ఎంత బాగున్నప్పటికీ ప్రభుత్వం వర్గీకరణకు అనుసరించిన పద్ధతి అనేక సందేహాలను చెలరేపే విధంగా వుంది.

(1) ఎస్సీలకు సంబంధించీ రిజర్వేషన్లకు సంబంధించీ ఏ ప్రధాన నిర్ణయం తీసుకోవలన్నా ఎస్సీ, ఎస్టీల జాతీయకమిషన్‌ను సంప్రదించాలనీ, రిజర్వేషన్ అమలుతీరును జాతీయ కమిషన్ సమీక్షించిన మీదట చేయవలసిన మార్పులను ప్రతిపాదిస్తూ పార్లమెంటు ముందుకు తీసుకువెళ్ళాలనీ, పార్లమెంటులో చర్చ జరిగిన మీదట రాష్ట్రపతి ఆమోద ముద్రతో రాష్ట్రాలు వాటిని అమలు చేయాలని భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 338 క్లాజు 9 స్పష్టంగా తెలియజేస్తుంది.

(2) రాష్ట్ర ప్రభుత్వం నియమించిన ఏకసభ్య కమిషన్ ఆయా కులాల జనాభా లెక్కల కోసం 1981 జనాభా లెక్కల సేకరణ పైన ఆధారపడింది. 1991 జనాభా లెక్కల జాబితానూ ఆ తర్వాత 1995 మధ్యంతర జనాభా లెక్కల సేకరణ జాబితానూ కేంద్ర ప్రభుత్వం ముద్రించింది. అవి అందుబాటులోనే వున్నాయి. జస్టిస్ రామచంద్రరాజు కమిషన్ 81 లెక్కలపైనే ఆధారపడడం అనేక సందేహాలను కలిగిస్తుంది.

(3) యీ 50 ఏళ్ల కాలంలో ఎస్సీల రిజర్వేషన్ కింద ఎంత శాతం ఉద్యోగాలు భర్తీ అయ్యాయి, ఏ కులానికి ఎంత శాతం లభించాయి, అనే కీలకమైన, అతి ప్రధానమైన ప్రశ్నకు జీవో 68 కానీ, జస్టిస్ రామచంద్రరాజు కమిషన్ రిపోర్టు కానీ అధికారిక లెక్కలను సమాధానంగా చూపించలేదు. యిప్పటికి రకరకాల లెక్కలు ప్రచారంలో వున్నాయి. అనేక

అపోహలు ప్రచారంలో వున్నాయి. ప్రభుత్వం అధికారిక లెక్కలు ప్రకటించివుంటే చాలా సందేహాలు సమసిపోయేవి.

(4) ఆది ఆంధ్ర కులం తమ జనాభాకు మించిన రిజర్వేషన్ ఫలితాలను పొందిందనీ కాబట్టి దానికి 1శాతం రిజర్వేషన్ కేటాయించాలని జీవో పేర్కొంది. ఆది ఆంధ్ర మాల అనీ, ఆది ఆంధ్ర మాదిగ అనీ, ఆది ఆంధ్ర అనీ సర్టిఫికెట్లలో నమోదైనవారు లక్షల మంది వున్నారు. వీళ్ళ మాలల కిందకి వస్తారా, మాదిగల కింది వస్తారా ఆది ఆంధ్ర కిందకి వస్తారా అన్నది జీవో స్పష్టంగా పేర్కొనలేదు. దీంతో సవాలక్ష సందేహాలు తలెత్తాయి. అలజడి మొదలైంది.

(5) 1950 రాజ్యాంగ ఉత్తర్వు (షెడ్యూల్డు కులాలు)లో ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి 59 కులాలూ, నవబౌద్ధులూ అనే అరవయ్యవ కేటగిరీ వున్నాయి. ప్రతి కులాన్ని ఒక స్వతంత్ర కులంగానే ఆ రాజ్యాంగ వుత్తర్వు పేర్కొంది. జీవో 68లో 59 స్వతంత్ర కులాలను నాలుగు ప్రధాన కులాల ఉపకులాలుగా పేర్కొన్నది. దీనివలన మళ్ళీ ఉమ్మడి రిజర్వేషన్లలో ఏ సమస్యలు తలెత్తాయో అవే సమస్యలు తలెత్తుతాయి. ప్రభుత్వం జి.వొ. యం.ఎస్. 68ని ఎంతో హడావుడిగా రూపొందించడంతో యిన్ని లొసుగులతో అది వచ్చింది. ప్రభుత్వ నిర్ణయాలకన్నా, కోర్టు తీర్పులకన్నా, ఎక్కువగా యిప్పుడు కావలసింది సంయమనం, హేతు బద్ధమైన చూపు. అటు మాదిగ నాయకత్వమూ యిటు మాల నాయకత్వమూ రెండూ వర్గీకరణ కేంద్రంగా చేసుకొని మాట్లాడుతున్నాయి.

వర్గీకరణ అమలయితేనే తమకు విముక్తి లభిస్తుందని మాదిగలు, అది అమలయితే తమకు భవిష్యత్ లేదని మాలలు ఆందోళన పడుతున్నారు. యిరువైపులా కదలబారుతున్న వాళ్ళంతా పేదరికం, నిరుద్యోగంతో సతమతమతోన్న యువకులు, తమ బిడ్డల భవిష్యత్ అగమ్యగోచరంగా కన్పించిన తల్లులు, తండ్రులు కులాలకు కులాలే ఆందోళనలో పడుతున్నాయి. బయటపడే దారి ఇరుకుగా వుంది. దాన్ని విశాలం చేసుకోవాలన్న తపన. యీ అసంతృప్తినీ, ఆగ్రహాన్ని ద్వారాల్ని మూసివేస్తున్న వ్యవస్థపైన కాక తమతోపాటు బతుకు ప్రయత్నాల్లో వున్న తోటి వాళ్ళపైన చూపిస్తున్నారు.

స్వంత కులాన్ని ప్రేమించి దాని సర్వతోముఖాభివృద్ధి కోసం పాటుపడడం నిజంగా అవసరమైన అంశం. మాదిగ నాయకత్వంగానీ, మాల నాయకత్వంగానీ అందుకు పూనుకోవడం నిజంగా ఆనందించాల్సిన విషయం. ముందు తమ తమ కులాల్లో చెలరేగుతున్న అసంతృప్తుల్ని సమీక్షించాలి. కారణాలను విశ్లేషించాలి. తోటి కులాన్ని ప్రేమించలేకపోయినా కనీసం తమ కులం ఒక్కటిగా సాధించుకోలేని అంశాలను సాధించడానికి యితర కులాలతో కలిసి పోరాడే అవకాశాన్ని మిగుల్చుకోవాలి. ముందు రిజర్వేషన్ అమలుకు సంబంధించిన ప్రచారంలో వున్న భ్రమల్ని తొలగించాలి. "ప్రతి

కులానికీ రిజర్వేషన్ అందాలి" అన్న ప్రజాస్వామిక విలువకు మాల మాదిగలు కట్టుబడాలి. ముఖ్యంగా మాల నాయకత్వం ఎంతో సమయమనం పాటించాల్సిన సమయం యిది. రిజర్వేషన్ వర్గీకరణను ముందు ఆమోదించాలి. ఆ తర్వాతనే వర్గీకరణలోని అవకతవకలను చర్చించాలి. మాదిగ దండోరా నమూనాలోనే మాలల్ని సమీకరించాలని ప్రయత్నం చేస్తే చాలా నష్టాలను ఎదుర్కొనవలసిన వస్తుంది. ముఖ్యంగా యిప్పుడు ప్రతి చిన్న పొరపాటుకూ భారీ మూల్యం చెల్లించాల్సి వుంటుంది.

కుల వృత్తితో సంబంధం లేని కులాల కదలికలను యిప్పటివరకూ అన్ని ప్రభుత్వాలు త్వరగా అణిచివేశాయి. తమిళనాడు, ఉత్తర ప్రదేశ్, కర్నాటక, యిప్పుడు మహారాష్ట్ర ఉదంతాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. దీనికి శాస్త్రీయమైన కారణాలను యింకా లోతుగా అధ్యయనం చేయవలసి వుంది. యీ దశలో సమాజంలోని అణగారిన కులాల మద్ధతుతో మాలలు ముందుకు నడవాలి. ముఖ్యంగా మాదిగల మద్ధతు మాలలకీ, మాలల మద్ధతు మాదిగలకీ యిప్పుడు అవసరం. ఉన్న రిజర్వేషన్ సౌకర్యాన్ని అన్ని కులాలూ పొందాలనే దానితో పాటు, ఒకవైపు నుండి రిజర్వేషన్ అమలు జరిగే అవకాశమున్న ప్రభుత్వ రంగం మూసుకుపోతున్న విషయాన్ని కూడా మాల మాదిగలు పరిగణలోకి తీసుకోవాలి. ఒక్కసారిగా ప్రభుత్వ రంగమంతా మూసుకుపోతే రిజర్వేషన్ అమలన్నది కాగితాలమీదే వుంటుంది. అన్ని దళిత కులాలూ కలిసి ప్రభుత్వరంగాన్ని పరిరక్షించుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. లేకపోతే ఎన్ని వర్గీకరణలను సాధించినా ఏ ఫలితమూ వుండదు.

ప్రైవేట్‌రంగంలో కూడా రిజర్వేషన్‌ని డిమాండు చేస్తామన్నది సర్కారీ నినాదం. నడక మొదలు కాకుండానే వెనకడుగు వేయడం. ప్రభుత్వరంగ సంస్థలన్నింటినీ ప్రైవేటు పరం చేయడానికి ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలకు ఏ నిరసనా తెలియచేయకుండా ఆమోదం తెలపడమే. యింతకంటే తిరోగమనం మరొకటి వుండదు. ఒకవేళ ప్రైవేట్ రంగంలో కూడా రిజర్వేషన్ అమలు చేస్తామని ప్రభుత్వం ప్రకటించినప్పటికీ భూసంస్కరణల చట్టంలో వున్నన్ని లొసుగులు వున్నాయి. 'శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలన్నట్లు' ప్రైవేట్ సంస్థలకు సవాలక్ష అవకాశాలున్నాయి. ఉదాహరణకి ఉమ్మడి కుటుంబంలో 640 పై చిలుకు మంది సభ్యులుగా చూపించుకొనే వీలుంది. తమ కుటుంబ సభ్యులతోనే కంపెనీని నడుపుకొనే అవకాశముంది. ఒక పెద్ద పరిశ్రమనో, సంస్థనో చట్టం అనుమతించిన మేరకు తమ స్వంత సభ్యులతో నడుపుకోగలిగిన చిన్న యూనిట్లుగా విడదీస్తారు. రిజర్వేషన్ మాటే వుండదు. వున్న అవకాశాన్ని పోగొట్టుకొని మబ్బుల్లో నీళ్ళకోసం ఎదురు చూసినట్లవుతుంది.

ఎన్నో పోరాటాల ఫలితంగా 1989 ఎస్సీ, ఎస్టీ అత్యాచార నిరోధక చట్టం వచ్చింది. ఎంతో ఐక్యంగా వుంటేనే దాని అమలు అంతంత మాత్రంగా వుంది. యిప్పుడు దళిత కులాలే పరస్పరం శతృవులుగా మారిపోతే ఆ చట్టం అవసరమే వుండదు. యిప్పటికే చట్టం

అమలు పోలీసుల చేతుల్లో వుండడంతో దళితులపైన దుర్మార్గమైన అత్యాచారాలతో పాల్పడుతున్నవాళ్ళు తప్పించుకుంటున్నారు. యిప్పుడు అగ్రకులాలకు దళితులపైన దాడులు చెయ్యడానికి తమ చేతులకు మట్టికాకుండానే సాధ్యమవుతుంది. మాలల్ని దెబ్బతీయడానికి మాదిగల్ని రెచ్చగొట్టి, మాదిగల్ని దెబ్బతీయడానికి మాలల్ని రెచ్చగొట్టి తమ పని కానిచ్చుకుంటారు. యీ క్రమం యిప్పటికే కొన్నిచోట్ల మొదలయ్యింది. ఆఫ్రికా దేశాల్లో యీ స్థితిని పాలక వర్గాలు యిప్పటికే సాధించారు. ఆయా కులాల్లో సాధ్యమైనంతమందిని దళారుల్ని తయారు చేసుకొని తమ పబ్బం గడుపుకొంటున్నారు. యీ స్థితిలో మాల మాదిగ నాయకత్వాలు ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. మేధావులు, ముఖ్యంగా మాలమాదిగ కులాలకు చెందిన మేధావులు రెండు కులాలమధ్య సామరస్య వాతావరణం నెలకొనడానికి తీవ్రమైన ప్రయత్నాలు చెయ్యాలి.

యిప్పటికే దేశంలో జరిగిన ఉద్యమాలు చేసిన పొరపాట్లను అనుభవిస్తూనే వున్నాం. చేసిన పొరపాట్లను వెనక్కి తీసుకోడానికీ, దాటవేయడానికీ ఎవరికైనా అవకాశం వుందేమోకానీ యిప్పడిప్పుడే పైకి చేరుకుంటున్న దళిత కులాలకు సమాజం ఆ వెసులుబాటును మిగల్చలేదు. తరాలపాటు అనుభవించాల్సి వస్తుంది. మనం అంబేడ్కర్ దళిత చైతన్యరథాన్ని ముందుకు తీసుకువెళ్ళగలమో లేదో, కనీసం వెనక్కి వెళ్ళడాన్ని ఆపుదాం. యిది మన చేతుల్లోనే వుంది. అవ్వాల్సిన ఆలస్యం అయ్యింది. మన కులాల, భవిష్యత్తు తరాలపట్ల ప్రేమతో, బాధ్యతతో యికనైనా వ్యవహరిద్దాం.

**జులై 2007 – బహుజన కెరటాలు**

**చూపు సౌజన్యంతో**

# దళిత వుద్యమం పురుగుల మందు తాగింది

యే మనిషికైనా తానింక జీవించవలసిన అవసరం లేదని ఎప్పుడు అనిపిస్తుంది? బతికేందుకు రేఖా మాత్రపు శ్వాసయినా మిగలలేదనిపించినప్పుడు. తనపైన తనకు గుప్పెడు విశ్వాసమైనా లేనప్పుడు. జీవితంలోని సకల రంగాలలోనూ దారుణాతిదారుణంగా విఫలమైపోయి ప్రపంచానికి యిక తన ముఖం ఏమాత్రం చూపించలేననుకున్నప్పుడు ప్రపంచమంతా మేరు పర్వతాకారాన్ని ధరించి తననే పరిహాసిస్తున్నట్లూ, తనని తిరస్కరిస్తున్నట్లు తనను శపిస్తున్నట్లు... నీకీలోకంలో తావేలేదు లేదు పోపొమ్మని ఆదేశిస్తూ వెంట తరుముతున్నట్లు అనిపించినప్పుడు ఒక భయానకమైన ఆత్మన్యూనతా భావాల తలపోతల బరువు గుండెలపైన మోయలేని భారంగా పరిణమించినప్పుడు చిరుకాంతి రేఖయినా కన్పించక అంతటా పెనుచీకట్లు ఆవరించినప్పుడు.

విజయం సాధించడమే జీవించడానికి ఏకైక అర్హతగా మొత్తం సమాజం గుర్తిస్తున్నప్పుడు యింటా బయిటా ఏ వైఫల్యం ఎదురైనా జీవించడం అనవసరమనే భావన వ్యక్తులకు కలుగుతుంది. ప్రతి మానవ ప్రయత్నానికీ విజయం సాధించడానికి ఎంత హక్కుందో విఫలం చెందడానికీ అంతే హక్కుందన్న విషయాన్ని సమాజం గుర్తించి గౌరవించకపోవడం వల్లనే విఫలమైన వ్యక్తులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. నిజానికి యివి సమాజమూ, పాలనా వ్యవస్థలూ కలగలసి చేస్తున్న హత్యలు అని ప్రముఖ సామాజిక మనస్తత్వ శాస్త్రవేత్త డుర్కీమ్ అంటారు. విస్తరించిన కొమ్మలు, రెమ్మలతో, పచ్చపచ్చటి ఆకులతో ఏపుగా ఎదిగిన ఒక వృక్షం నుండి ఒక్క ఆకు పండిపోయి, ఎండిపోయి, రాలిపోవాల్సి వచ్చినా ఆ వృక్షంలోని వేళ్ళ దగ్గరనుండి చిటారుకొమ్మల దాకా అన్ని భాగాలు అనుమతించాలి. అవన్నీ ఆ ఆకు నాశనమై రాలిపోవాలని కోరుకోవాలి అని ప్రముఖ లెబనీస్ కవి ఖలీల్ జిబ్రాన్ అంటారు. ఆ ఆకురాలిపోవడానికి మొత్తం చెట్టు బాధ్యత వహించాలి. అదే విధంగా ఆత్మహత్యపేరుతో చనిపోయిన ప్రతివ్యక్తి మరణానికీ మొత్తం సమాజం బాధ్యత వహించాలి. ఆత్మహత్యలన్నీ సమాజం చేసే హత్యలే.

ఆరేళ్ళ క్రితం ప్రముఖ దళిత విప్లవ కవి గాయకుడు విలాస్ గోఘ్రే ఆత్మహత్య చేసుకొని చనిపోయాడు. ఆయన దళిత్ పాంథర్స్ ఉద్యమంలోనూ ఆ తర్వాత నక్సలైట్ ఉద్యమంలోనూ మళ్ళీ దళిత ఉద్యమంలోనూ, మహారాష్ట్ర రిపబ్లికన్ పార్టీలోనూ క్రియాశీలకమైన పాత్ర పోషించిన నాయకుడు, గాయకుడు,కవి. బొంబాయిలోని రమాబాయి, అంబేడ్కర్ నగర్‌లో అంబేడ్కర్ విగ్రహానికి అగ్రకుల మతోన్మాదశక్తులు చెప్పులు దండను వేయడానికి నిరసనగా ఉద్యమిస్తున్న దళితులపైన పోలీసులు ఒక పథకం ప్రకారం కాల్పులు జరిపి అనేకమందిని హత్యచేయడాన్ని 'చూసి' దళిత కవి గాయకుడు విలాస్ గోఘ్రే చలించిపోయాడు. దళిత

ప్రజానీకాన్ని బలిగొన్న వ్యవస్థను సవాల్ చేస్తూ ఒక బలోపేతమైన ఉద్యమం నిర్మితం కావాలని కోరుకున్నాడు. నాయకులంతా ముక్కలు ముక్కలుగా చీలికలు పేలికలుగా, ఎవరికి వారుగా ఎవరెవరి ఎజెండాల్లోనో తమ జెండాలను ఎగరవేస్తూ పరస్పరం కలహించుకొంటూ కనీసం కలసికూర్చుని మాట్లాడుకొనే పరిస్థితి అయినా లేకుండా వున్నారు. అందరిచుట్టూ తిరిగాడు. బతిమాలాడు. శాపనార్థాలుపెట్టాడు. మహానాయకులెవ్వరూ అతని మాట వినలేదు. సత్యాగ్రహం చేస్తానని బెదరించాడు. అయినా ఆ మొద్దుబారిన చర్మాలు చలించలేదు. ముప్పయేళ్ళు ప్రజల కోసం ఆడీ, పాడీ, రాసీ, పనిచేసీ, నిర్బంధాల పాలై, కష్టాలనెదుర్కొంటూ ప్రజల ఆశల్ని, బాధల గాధల్నీ తన గుండె నుండి పలికించిన కవి గాయకుడు విలాస్ గోఘ్రే చివరిసారిగా తన ఆగ్రహాన్ని ప్రకటించాడు. అది ఆత్మహత్యాగ్రహం.

బొంబాయి మురికివాడలోని తన ఇరుకు గదిలో తనకు తాను ఉరివేసుకొని చనిపోయాడు. చనిపోయేముందు రెండు వాక్యాలు తన గదిగోడల మీదరాశాడు. ఒక మాట "జైభీమ్' యింకో మాట "దళిత నాయకులారా యికనైనా ఐక్యం కండి". తన మరణమైనా దళిత ఉద్యమాన్ని ఐక్యం చేస్తుందని భ్రమపడిన కవి ఇకలేడు. అతని మరణాన్ని ఒక సంస్మరణ సభతో మరిచిపోయింది దళిత ఉద్యమం. ఒక దయనీయమైన నిస్పృహతో, నిరాశతో, ఏం చేసినా సమస్య పరిష్కారం కాదన్న ఖేదంతో మనుషులు చనిపోతారు. బతుకుపట్ల ఆశల్నిపెంచి, జీవించేందుకు కావలసిన ధైర్యాన్నీ, స్థైర్యాన్నీ యిచ్చి ముందుకు నడుపుతూ తమ సమస్యల్ని తామే పరిష్కరించుకొనే దిశగా వ్యక్తుల్ని సమూహాలుగా చేసి, ఒకరికొకరిని అండగా నిలిపి, ఒకరికోసం అందరం, అందరికోసం ప్రతి ఒక్కరం అనే భావాన్ని పెంపొందించాల్సిన ఉద్యమం ఆత్మహత్య ఎందుకు చేసుకుంటుంది? పోనీ ఎవరినీ భయపెట్టని, ఎవరి హృదయాలనూ కరిగించని, ఏమీ సాధించని ఆత్మహత్యనే ఒకానొక, ఏకైక ఉద్యమ రూపంగా ఎందుకు ఎంచుకొంటుంది? ప్రకాశంజిల్లా ఒంగోలులో భూమికోసం ఉద్యమిస్తున్న ఒక దళిత కార్యకర్త ఉద్యమ వ్యూహంలో భాగంగా కలెక్టర్ ఆఫీసులో పురుగులమందు తాగి ఆత్మహత్య చేసుకొని చనిపోవడం ఒకానొక విడి సంఘటనగానే అనిపిస్తుంది. కానీ అది మొత్తం దళిత ఉద్యమం వున్న స్థితికి ప్రతీకగా నిలుస్తుందా అనిపిస్తుంది. ఐక్యత లేకపోవడం అనే పురుగుల మందునీ, లక్ష్యసాధన నుండి వైదొలగడం అనే పురుగులమందునీ, నా మాట తప్ప మరొకరి మాట వినన్న నిరంకుశ పోకడలనే పురుగుల మందునీ, సరైన వ్యూహమూ, సరైన ఎత్తుగడలూ ఏమీ అవసరం లేకుండా ఎప్పటికి ఏదొస్తే దానికే ప్రాధాన్యతనిచ్చే ప్రాప్తకాలజ్ఞతకు కొట్టుకుపోయే పురుగుల మందునీ దళిత ఉద్యమం ప్రతి క్షణం తాగుతూనే వుందనిపిస్తుంది. ఒంగోలులో నత్తల హనుమంతరావు అనే దళిత కార్యకర్త పురుగుల మందుతాగి చనిపోవడం ప్రత్యక్షమైన భౌతిక వ్యక్తీకరణ. నిజానికీ పురుగుల మందు తాగింది నత్తల హనుమంతరావుకాదు. రాష్ట్రస్థాయి నుండి,

జిల్లా, గ్రామ స్థాయి వరకూ విస్తరించి వుందనిపిస్తున్న దళిత ఉద్యమం.

1985 జులై 17వ తేదీన అదే ప్రకాశంజిల్లాలోని కారంచేడు గ్రామంలో దళితులపైన అగ్ర కుల కమ్మ భూస్వాములు దారుణమైన దాడిచేసి నెత్తురు టేరుల్ని పారించి దుర్మార్గమైన హత్యాకాండకు పాల్పడ్డారు. రాష్ట్ర వ్యాప్తంగా దళిత సమూహాలు ఉలిక్కిపడ్డాయి. గుండెలు కలుక్కుమన్నాయి. అయితే కన్నీళ్ళతో మరిగిపోలేదు. కారంచేడు పంటపొలాల్లో ప్రవహించిన నెత్తుటి నుండి మహోన్నతమైన ఉద్యమం ఉద్భవించింది. విముక్తి ఉద్యమాలు, చరిత్ర, సాహిత్యం, సాహితీ చరిత్ర, సకల విజ్ఞాన రంగాలూ కారంచేడు నుండి పాఠాలు నేర్చుకొన్నాయి. కారంచేడు లేవనెత్తిన ప్రశ్నలు జాతీయ, అంతర్జాతీయంగా చర్చించబడ్డాయి. జ్ఞానంలో, వైఖరుల్లో, నైపుణ్యతల్లో కారంచేడు ప్రశ్న పెనుమార్పులు తీసుకువచ్చింది. 1989లో భారత పార్లమెంటు విప్లవాత్మకమైన ఎస్సీ,ఎస్టీ, అత్యాచారాల నిరోధక చట్టాన్ని ఆమోదించడానికి పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ కారంచేడు ఉద్యమం కారణమయ్యింది. కారంచేడు ఉద్యమం నుండి అప్పటివరకూ లక్ష్య రహితంగా తిరుగాడే వ్యక్తులు నాయకులయ్యారు. బాధ్యతలు స్వీకరించారు. ఎందరో గొప్ప వక్తలుగా తయారయ్యారు. రాష్ట్రంలోని అన్నీ జిల్లాలలోనూ వందలాదిమంది నిబద్ధులైన అంకితభావం కలిగిన యువ నాయకులు ఎదిగి వచ్చారు. కారంచేడు ఉద్యమం ఫలితంగా ఎంతోమందికి ఉద్యోగాలొచ్చాయి. భూములొచ్చాయి. నాయకత్వ స్థానాలొచ్చాయి. అప్పటివరకూ సమాజం మార్పుకోసం ఉద్యమిస్తున్న విప్లవ శిబిరాలలో దళిత ప్రశ్న మౌలికమైన చర్చలను లేవదీసింది. ఎన్నెన్నో విజయాలను సాధించింది. కారంచేడు సంఘటన జరిగి 19 సంవత్సరాలు గడుస్తుంది. కీర్తించుకొంటూ గతకాలపు చరిత్రనే చెప్పుకుంటూ కాలంగడిపే పనిని సజీవమైన వుద్యమాలు చేయనక్కరలేదు. మనిషైనా, ఉద్యమమైనా తప్పులు చేస్తారు. వాటిని కప్పిపుచ్చుకోవడం కంటే వాటిని గుర్తించి, పరిహరించేందుకు ప్రయత్నించడం మంచి నాయకత్వం చేయవలసిన పని. ఆత్మగౌరవం, ఆత్మరక్షణ, స్వావలంబన, రాజ్యాధికారంలో వాటా మొదలైన అంశాలను సాధించడం లక్ష్యంగా మొదలైన ఉద్యమం, కారంచేడు ఉద్యమం చుండూరు ఉద్యమం, నీరుకొండ ఉద్యమం, ఒంగోలు ఉద్యమం, చీమకుర్తి ఉద్యమంగా పిలవబడడంలో అర్థం ఏమిటి? ఉద్యమం ఒక సమగ్రతను కోల్పోవడం. కొన్ని డిమాండ్ల సాధనే ఏకైక అంతిమ లక్ష్యంగా మారిపోయింది. ఒక దీర్ఘకాలిక, నిరంతరాయంగా కొనసాగే ఉద్యమంగా, దానికి సంబంధించిన నిర్మాణాన్నీ, దిశనీ, చూపునీ, ఏ సంఘమూ, ఏ "ఉద్యమమూ" అభివృద్ధి చేయలేదు. భూమికోసం, అత్యాచారాల నిరోధం కోసం, గౌరవ ప్రదమైన జీవితంకోసం, వనరులపైన, రాజ్యాధికారంలోనూ వాటాను సాధించడం కోసం ఒక సమగ్ర ఉద్యమం రూపొందలేదు.

అందరూ అంబేద్కర్ పేరే చెపుతారు. అనుసరించే వ్యూహాలు, ఎత్తుగడల్లోనూ పెద్దగా

మార్పేమీ ఉండదు. అయినా సవాలక్షసంఘాలు, సవాలక్ష జెండాలు, సవాలక్ష శిబిరాలు, బాధితులు దళితులే అయినా డిమాండ్లు సరైనవే అయినా ఒక నాయకుడు మొదలు పెట్టిన వుద్యమానికి మరో నాయకుడు మనస్ఫూర్తిగా సకల శక్తులతో మద్ధతునివ్వడు. "ఉద్యమాన్ని" మొదలుపెట్టిన నాయకుడు బాధిత ప్రజల మేలు కోసం అన్ని శక్తుల్నీ సమీకరించడు. అందర్నీ ఆహ్వానించడు. తన స్వంత యింట్లో పెళ్ళి వ్యవహారంగా దళిత నాయకత్వం మైకుల ముందూ, శవాలముందూ, సమాధుల ముందూ, ప్రభుత్వ అధికారుల ముందూ, రాజకీయ నాయకులముందూ అంగలార్చుతోంది. డిమాండ్లను నెరవేర్చుకొని విజయం సాధించడమే ఏకైక పరమ లక్ష్యంగా మారిపోయినప్పుడు ఏం చేసయినా విజయం సాధించాలనే పట్టుదల పెరుగుతుంది. విజేతలు మాత్రమే నేతలు, ఒక్కడే నాయకుడు అన్న బ్రాహ్మణీయ భావజాలం దళిత ఉద్యమం నరనరానా జీర్ణించుకుపోవడం కనిపిస్తుంది. దళిత విముక్తి, రాజ్యాధికార సాధనకోసం ఒక సమగ్ర వ్యూహం మాట బుద్ధెరుగు, కనీసం పదిసంవత్సరాలకు ఒక కార్యచరణ ప్రణాళిక కూడా తయారు చేసుకోలేని దయనీయమైన స్థితిలో ఈనాడు దళిత ఉద్యమం వుంది. విజయాలను ఎన్నైనా చెప్పుకోవచ్చు. లోపాలను గుర్తించి సవరించుకోకపోతే ఏ ఉద్యమమైనా మరణిస్తుంది. అది హత్యకావచ్చు, ఆత్మహత్యే కావచ్చు.

అందరి తత్వమూ అంబేద్కరిజమే, అందరి లక్ష్యమూ నిజంగా దళితుల విముక్తి, రాజ్యాధికార సాధనే అయినప్పుడు ఐక్యత ఎందుకు సాధ్యంకాదు? కనీసం ఒక వుమ్మడి వ్యూహాన్నీ, ఎత్తుగడల్నీ, పోరాట రూపాలనీ అందరూ కలసి నిర్ణయించుకొనే పరిస్థితి వుండాలి. దీన్ని వ్యతిరేకించే వారి ప్రయోజనాలను శంకించాలి. సందేహించాలి. ప్రజల ముందు బహిరంగ చర్చచేయాలి. ఎవరు నాయకత్వం వహిస్తున్నా వారికీ, వారి అనుచరులూ, సహచరులకీ, వారు పని చేస్తున్న ప్రజా సమూహాలకీ మధ్యన నిర్మాణాత్మకమైన, పారదర్శకమైన సంబంధాలుండడంతో పాటు కచ్చితంగా వారందరికీ, ముఖ్యంగా నాయకత్వానికి అంబేద్కరిజంపైనా, దళిత విముక్తి తత్వాలపైనా, నాయకత్వ లక్షణాలపైనా తగిన శిక్షణ వుండాలి. వారి అంకితభావం ప్రతి సందర్భంలోనూ అగ్నిపరీక్షకు గురి కావాలి. యివేమీ లేకపోతే ఏ ఉద్యమమైనా ఆత్మహత్య చేసుకొంటుంది.

ఒక మనిషైనా, ఉద్యమమైనా, విఫలం చెందుతుంటే ఏ మనిషికైనా గుండెలు కలుక్కు మనవద్దా, మనుగడకోసం ఆందోళన చెందుతుంటే ఆ మనిషికో, ఉద్యమానికో చేయూత నివ్వాలని తపన చెందవద్దా, ఆరాటపడవద్దా?

విఫలం చెందే హక్కూ మనిషికీ, ఉద్యమానికీ వుంటుందని గుర్తిద్దాం. లోపాలను గుర్తింపచేసి అన్ని అవరోధాలను అధిగమిస్తూ పడుతూ, లేస్తూ ముందుకే నడిచే సజీవ

ఉద్యమాన్ని రూపొందించేందుకు మన దగ్గర నుండే ప్రయత్నాలు మొదలుపెడదాం.

విజేతలనూ, చక్రవర్తులనూ, యుద్ధవీరులనూ కీర్తించి జీవికను, విలాసజీవితాన్నీ ఆర్జించే కవులు, కళాకారులకు కాలం చెల్లిపోయింది. దళిత కవులు, కళాకారులు, మేధావులు, బాధ్యతలు గుర్తించిన దళితులందరు దళిత ఉద్యమంలో భాగంగా వుంటూనే ఉద్యమ నాయకత్వానికి ఒక సృజనాత్మకమైన, ఒక నిర్మాణాత్మకమైన శాశ్వత ప్రతిపక్షంగా కీలకమైన పాత్ర పోషించడానికి బాధ్యతలు స్వీకరించాలి.

ఏమీ మిగలలేదని కాదు, అంతా అయిపోయిందనీ కాదు. ఒక శిల్పి వులితో కఠిన శిలల్లో వుండకూడని భాగాలను నిర్దాక్షిణ్యంగా చెక్కేసి, అద్భుతమైన శిల్పంగా మలచినట్లుగా మన మీదికి మనం పోరాటాన్ని ఎక్కుపెట్టుకోవాలి. జాతి చెక్కిళ్ళ మీద నిలిచిన ఒక్క కన్నీటి బిందువు నుండి ఇంద్ర ధనస్సులను ఆవిష్కరించాలి. ఒక కల కనాలి. దాని సాఫల్యానికి నడుం కట్టాలి. మూడువేల సంవత్సరాల అణచివేతనూ, అవమానాలనూ, హింసనూ భరిస్తూ వున్న జాతి మొత్తం ప్రపంచానికి మనుషులుగా బతికే పాఠాలు నేర్పాలి. అందుకోసం మనం నేర్చుకోవాలి. కొంచెం కష్టమే కావచ్చు. మనం నిర్మించే భవిష్యత్తుకు వెలుగుబాటల్ని నిర్మించాలి.

**జులై, ఆగస్టు - 2004 - బహుజన కెరటాలు**

# దళితులకు ఆయుధాలివ్వండి

మన అపధర్మ ముఖ్యమంత్రి నారాచంద్రబాబు నాయుడుగారు నక్సలైట్ల హింసను ఎదుర్కొనడానికి ప్రజలకు ఆయుధాలిస్తానని ప్రకటించారు. నక్సలైట్లకు ప్రజలే బుద్ధి చెపుతారని వారికి వ్యతిరేకంగా ఒక ప్రజాయుద్ధం జరుగుతుందని సెలవిస్తున్నారు. శాసన సభ ముందస్తు రద్దుకు నక్సలైట్లనే కారణంగా చూపారు. అభివృద్ధి జరగక పోవడానికి, ధరలు పెరగడానికీ అన్నింటికీ నక్సలైట్లే కారణం అన్నట్లుగా ఆయన మాట్లాడుతున్నారు. ప్రభుత్వ వైఫల్యాలన్నింటినీ కప్పిపుచ్చడానికి నక్సలైటు బూచిని ఆయన ముందుకు తెస్తున్నారు. నలుగురూ నవ్విపోతారన్న యింగిత జ్ఞానమైనా లేకుండా ఆయన ప్రకటనల మీద ప్రకటనలు గుప్పిస్తున్నారు. 'నక్సలైట్ల హింస' అన్నసాకును అడ్డం పెట్టుకొని ఈ ఎన్నికల వైతరిణి దాటాలన్నది ఆయన ఆలోచన అని అర్థం చేసుకోడానికి పెద్దగా తెలివి తేటలు అవసరం లేదు. ఈ ఎత్తుగడ ఆయనకు ఎన్నికల్లో ఉపయోగపడవచ్చు. ఉపయోగపడకపోవచ్చు. కానీ ప్రజల పేరుతో ఆయుధాలను ఎవరికిస్తారు? ముందుగా ఎన్నికల బరిలో నిలవబోతున్న తెలుగుదేశం, బి.జె.పి.నాయకులకూ, ఆయన అనుచరులకీ యిస్తారు.కొంత కాలం నక్సలైట్లతో పనిచేసి బయటికి వచ్చి కిరాయి హంతకులుగా బతుకుతున్న నయీముద్దీన్ లాంటి వాళ్ళకి యిస్తారు. తెలుగుదేశం తరపున పనిచేస్తున్న ఫ్యాక్షనిస్టులకు యిస్తారు. వాళ్ళంతా కలసి నక్సలైట్లను అంతం చేస్తున్నామన్న పేరుతో తమకు వ్యతిరేకంగా పని చేసే వాళ్ళందరినీ కాల్చి చంపుతారు. నక్సలైట్లతో కాంగ్రెస్‌కూ, టి.ఆర్.ఎస్.కూ సంబంధాలున్నాయని యిప్పటికే తెలుగుదేశం, బి.జె.పి. నాయకులు ప్రకటించారు. ఆ పేరుతో పోటీకి దిగుతున్న టి.ఆర్.ఎస్. కాంగ్రెస్ నాయకులనూ, కార్యకర్తలనూ, గ్రామాలలో కాంగ్రెస్ నాయకులనూ, కార్యకర్తలనూ గ్రామాలలో వున్న మామూలు ఓటర్లనీ భయభ్రాంతులనుచేసి, అవసరమైతే హత్యలుచేసి ఈసారి అధికారంలోకి రావాలని పాలక పార్టీలు భావిస్తున్నాయన్నది స్పష్టమవుతుంది. ఒక్క మాటలో రాజ్యహింసను ప్రైవేటీకరించడానికీ, ప్రైవేటు హింసకు చట్టబద్ధత కల్పించడానికి చంద్రబాబు నాయుడు ప్రయత్నిస్తున్నారన్న విషయం స్పష్టమవుతుంది. ఈ ప్రయత్నం కేవలం ఎన్నికలలో గెలవడం కోసం మాత్రమే కావచ్చు. కానీ ఆ ప్రక్రియ ఒక్కసారి మొదలైందంటే భూమి సేనలూ, రణవీర్ సేనలూ, అగ్రకులాల సేనలూ చట్టబద్ధంగా హత్యా కాండలకు పాల్పడే ప్రమాదం వుంది. రాష్ట్రంలోనూ, దేశంలోనూ దళితులపైనా, ఆదివాసులపైనా, మైనారిటీలపైనా దుర్మార్గమైన దాడులు, అత్యాచారాలు జరుగుతున్నాయి. అవి మరింత పెరిగే ప్రమాదం వుంది.

దళితులపైన దాడులు జరిగే అవకాశమున్న ప్రాంతాలలో దళితులకు అవసరమైతే ఆయుధాలు యివ్వాలని 1995 ఎస్సీ,ఎస్టీ (అత్యాచారాలు) రూల్స్ సూచిస్తున్నాయి. రాష్ట్రం మొత్తం దళితులపై అత్యాచారాలు జరిగే అవకాశమున్న ప్రాంతమేనని తెలుగుదేశం ప్రభుత్వమే నియమించిన జస్టిస్ పున్నయ్య కమిషన్ ప్రకటించింది. ఈ రాష్ట్రంలో దళితుల పైన ముప్పేటలా సాగుతున్న పరమభయంకరమైన కులహింస నక్సలైట్లు చేస్తున్న హింసకంటే స్వభావంలోనూ, పరిమాణంలోనూ అత్యంత ప్రమాదకరమైంది. అలాంటి హింస ఈ ఎన్నికల సమయంలో మరింత పెరిగే ప్రమాదం వుంది. కాబట్టి ఆత్మరక్షణ కోసం ఓటు హక్కువున్న దళితులందరికీ ఆయుధాలివ్వాలి. స్వేచ్ఛగా తమకు యిష్టమైన అభ్యర్థికి ఓటు వేయగలిగిన వాతావరణం కల్పించాలి. ఆ స్వేచ్ఛను భంగపరిచే పార్టీల నాయకులు, అభ్యర్థులపైన ఎస్సీ,ఎస్టీ అత్యాచారాల (నిరోధక) చట్టం 1989లోని సెక్షన్ 3(1) (7) ప్రకారం కేసులు నమోదు చేయాలి.

**ఫిబ్రవరి 2004 – బహుజన కెరటాలు**

# ఆదివాసీ గుండెల్లో ఆగ్రహజ్వాల

వాళ్ళు పారిపోతున్నారు. స్వంత గూళ్ళను వదిలి పసిపాపల్లా సాదుకున్న పంటపొలాలనొదిలి, ఇన్నేళ్ళూ పెంచుకొన్న ఆశల్ని వదిలి వాళ్ళు పారిపోతున్నారు. ఒక నమ్మకద్రోహమేదో వాళ్ళను బతుకు అంచుల దాకా తరిమి తరిమి కొడుతున్నది. ఆశలూరే కన్నులతో 'నాగరిక' సమాజం దగ్గర దగ్గిరకు జరిగిన ఆదివాసీ జనాంగం ప్రాణభీతితో తరలిపోతున్నది. రెడ్డినాగంపాలెం అంతా దాదాపు ఖాళీ అయిపోయింది. పాతిక కుటుంబాలు ఊరొదిలి వెళ్ళిపోయాయి.

ఎనభయ్యేళ్ళ భద్రమ్మ ఒక్కతే కుక్కి మంచంమీద పడుకొని వలావలా విలపిస్తున్నది. "నాకు ఊహ తెలిసిందగ్గర్నించీ మా జాతికి ఇంత ఆపద ఎన్నడూ రాలేదయ్యా! మా వాళ్ళకు ఏం జరుగుద్దో" అని ఒక్కొక్క సంగతీ గుర్తు తెచ్చుకొంటూ గుడ్లనీరు కుక్కుకుంటోందామె. ఆమె కుటుంబంలోని ఆడవాళ్ళూ, మగవాళ్ళూ, పిల్లా – పాపా అందరూ పారిపోయారు. ఆమెకు నాలుగు రోజులుగా తిండీ – నీళ్ళూ లేవు. అంత ఆపదలోనూ తన బిడ్డలకి ఏం కాకుండా వుండాలని ఆమె కనిపించని దేవుణ్ణి వేడుకుంటోంది. ఒక్క రెడ్డినాగంపాలెం మాత్రమే కాదు. పశ్చిమ గోదావరి ఏజెన్సీ ప్రాంతంలోని పోలవరం, బుట్టాయిగూడెం, జీలుగుమిల్లి మండలాల గ్రామాలన్నింటా ఇదే పరిస్థితి కొనసాగుతోంది. ఇప్పుడు ఏజెన్సీ గ్రామాలన్నిటా పోలీసులు సాయుధ కవాతులు చేస్తున్నారు. కనిపించిన ఆదివాసీలను కన్పించినట్లు చితకబాదుతున్నారు. అక్రమకేసుల్లో ఇరికించి జైళ్ళల్లో కుక్కుతున్నారు. స్త్రీలను విచక్షణారహితంగా చిత్రహింసలు పెడుతున్నారు. ఒక భీతావహ వాతావరణం ఆ గ్రామాలన్నిటా నెలకొని వున్నది.

ఇదంతా గిరిజనులవల్లనే జరుగుతుందని పోలీసులూ, రెవిన్యూ అధికారులూ, చోటామోటా రాజకీయ నాయకులు అందరూ ఆరోపణలు చేస్తున్నారు. మెంటే పద్మనాభం వంటి వృద్ధ రాజకీయ నాయకులు (మాజీ యంపీ) రంగంలోకి దిగి గిరిజనేతర రైతులను గిరిజనులనుండి కాపాడడానికి ఎటువంటి కార్యాచరణకైనా దిగుతానని ప్రగల్భాలు పలుకుతున్నారు. గిరిజనులు బరితెగించారనీ, గిరిజనులు విల్లంబులు ధారణ చేసి 'సభ్య' సమాజాన్ని భయాందోళనకు గురి చేస్తున్నారనీ వారిపైన 'టాడా' వంటి చట్టాన్ని ప్రయోగించాలనీ, కల్లోలిత ప్రాంతాలుగా గిరిజన మండలాలను ప్రకటించాలనీ వారెన్నడూ 'నాగరీకుల' మీదకు ఆదివాసులు కాలుదువ్వకుండా తగిన చర్యలు చేపట్టాలనీ గిరిజనేతర రైతులు ప్రభుత్వాన్ని కోరుతున్నారు.

ఆదివాసులు విల్లంబులు చేపట్టిన మాట నిజమే. వాళ్ళు ఏ పంటలకోసమైతే ప్రాణాలనైనా అర్పించడానికి సిద్ధపడ్డారో ఆ పంటల్నే నాశనం చేసిన మాటా నిజమే. రక్షిస్తారనుకున్న

పోలీసులు తమ కళ్ళముందే తమ రక్త బంధువులను హింసిస్తోంటే బాణాలను ఎక్కుపెట్టి రెండువందల మంది సాయుధ పోలీసులను గంటల తరబడి నిలవరించిన మాటా నిజమే. ఈ చర్యలను నేరాలుగా చూపించి కక్ష సాధించుకుంటోంది రాజ్యం. వాళ్ళను ఏకాకులను చేసి, వాళ్ళను నేరస్తులను చేసి వాళ్ళ నోటిదగ్గర కూడు కొల్లగొట్టి వాళ్ళ జీవితాలను చిన్నాభిన్నం చేయడానికి కంకణం కట్టుకొంది 'పౌరసమాజం'.

ఆదివాసుల న్యాయమైన హక్కులకోసం, చట్టబద్ధంగానే వాళ్ళకున్న అవకాశాలకోసం నిలబడినందుకు వాళ్ళు చట్ట వ్యతిరేక నేరస్తులెందుకయ్యారని ఎవరూ ఆలోచించడమే లేదు. వాళ్లు కేవలం మీరూ చట్టాన్ని గౌరవించండి అని మాత్రమే అడుగుతున్నారు. చట్టాన్ని కాపాడడానికి ప్రాణాలకైనా తెగిస్తామని నిలబడుతున్నారు.

1950 షెడ్యూల్డ్ ప్రాంతాల ఉత్తర్వు ప్రకారం పశ్చిమగోదావరి జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాన్ని రాష్ట్రపతి షెడ్యూల్డు ప్రాంతంగా ప్రకటించారు. ఈ ప్రాంతంలో కోయ, కొండరెడ్డి తదితర ఆదివాసీ జాతులు నివాసముంటున్నారు. వీరి ప్రధానవృత్తి వ్యవసాయం. షెడ్యూల్డు ప్రాంతంగా ప్రకటించిన ఏజెన్సీలో భూముల్ని గిరిజనేతరులకు బదలాయించడాన్ని నిషేధిస్తూ "1959 ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు ఏరియా భూ బదలాయింపుల నియంత్రణ చట్టం" అమలులోనికి వచ్చింది. ఈ చట్టం ప్రకారం గిరిజనుల నుండి ఏ గిరిజనేతరుడూ భూమిని కొనరాదు. గిరిజనుడి నుండి గిరిజనేతరుడికి ఎట్టి పరిస్థితుల్లోనూ భూబదలాయంపు జరగరాదు. కానీ భూమి చేతులు మారుతూనే వుంది. తమకు న్యాయంగా చెందవలసిన భూముల్లోనే ఆదివాసులు కూలిపని చేసి బతుకులీడ్వవలసి వస్తోంది. అధికారుల నిర్లక్ష్యం. లంచగొండితనం రాజకీయ నాయకుల దుర్మార్గపు కుట్రలూ ఆదివాసుల జీవితాలతో ఆడుకొన్నాయి. జిల్లాలోని మొత్తం 101 ఏజెన్సీ గ్రామాల్లోనూ, 28 జమిందారీ గ్రామాల్లోనూ ఇదే పరిస్థితి కొనసాగుతుంది. 1970లో '59 చట్టాన్ని సవరిస్తూ 1 ఆఫ్ 1970 చట్టం వచ్చింది. ఈ చట్టం ప్రకారం గిరిజనుల మధ్య కూడా భూ బదలాయింపు జరగకూడదు. కానీ ఎన్నో వేల ఎకరాల గిరిజనుల భూమి గిరిజనేతరుల చేతుల్లోనే వుంది. దీంతోపాటు జమీందారీ గ్రామాల్లో మరొక దుర్మార్గం జరిగింది. మామూలుగా జమిందారీ గ్రామాల్లో భూమిని కౌలుదారులకిచ్చి కౌలు వసూలు చేసుకొనేవాళ్ళు. అయితే జమిందారీల రద్దు కాలంలో తమ భూముల్ని పోగొట్టుకోకుండా వాళ్ళు లోపాయికారిగా ఆ భూముల రద్దుకు ముందు తేదీలను వేసి "ఇతరులకు" పట్టాలు రాసిచ్చారు. అప్పుడు వాళ్ళెట్లా రాస్తే అట్లాగే అమలయ్యింది. తమ భూములకు మాత్రమే పట్టాలివ్వడం కాకుండా తమకు చెందని బంజరు భూములకు కూడా జమిందారులు పట్టాలిచ్చారు. గిరిజనులకు చెందవలసిన ఆ భూములు అన్యాక్రాంతమై పోయాయి. ఈ విషయాలన్నీ తెలిసీ ప్రభుత్వాధికారులు తప్పుల్ని సవరించుకొనే ప్రయత్నం చేయాల్సింది పోయి లంచాలు తిని, చట్టాల్లో లొసుగుల్ని వెతికి

పొరపాట్లకు చట్ట బద్ధతను కల్పించే ప్రయత్నం చేశారు. కాలం చెల్లిపోయిన 1917 చట్టాన్ని చూపించే ప్రయత్నం చేశారు. (ఈ చట్టం ప్రకారం ప్రభుత్వ అధికారుల అనుమతితో భూమిని ఎవరికైనా బదలాయించవచ్చు)

అయితే ఆదివాసులు చట్టాలను తెలుసుకొన్నారు. తమ కోర్కెలు అన్యాయం కాదని తెలుసుకున్నారు. మళ్ళీ భూముల్ని సర్వే చేయించండి, బంజరు భూములకు ఇచ్చిన పట్టాలను రద్దు చేసి మళ్ళీ పంపిణీ చేయించండి, గిరిజనుల భూములను ఆక్రమించిన గిరిజనేతరులను పంపించెయ్యండి అని న్యాయమైన కోరికలనే ప్రభుత్వాన్ని కోరారు. 'శక్తి' వంటి స్వచ్ఛంద సేవాసంస్థలు ఆదివాసులను చైతన్యవంతుల్ని చేయడంలో ప్రముఖపాత్ర వహించాయి. అధికారులు తగిన చర్యలు చేపట్టడంలో తాత్సారం చేశారు. దీంతో ఎన్నో ఏళ్ళుగా గిరిజనేతరుల భూముల్లోకి పనులకు వెళ్ళడం గిరిజనులు మానుకున్నారు. 1992-95 మధ్య కాలంలో కొంతమేరకు భూమి పంపిణీ ఆవశ్యమైనదని అధికారులు ప్రకటించారు. అయితే ఆ భూమిని కూడా గిరిజనులకు పంచనివ్వకుండా గిరిజనేతరులు అడ్డుకున్నారు. 1995 మేలో జీలుగుమిల్లి మండలంలోని జిల్లేళ్ళగూడెంలో గిరిజనులకు పట్టాలివ్వడానికి గిరిజనేతరులు అడ్డుకోవడంతో పరిస్థితి ఉద్రిక్తంగా మారింది. నూటనలభైనాలుగో సెక్షన్ విధించారు. గిరిజనేతరుల పట్టాలను రద్దు చేస్తానని ఆర్డీవో హామీ ఇచ్చినప్పటికీ ఇంతవరకూ ఏమీ జరగలేదు. పోలవరం మండలంలోని మనుగుపాలెం కోయనాగంపాలెం గ్రామాల్లో గిరిజనేతరులు అక్రమంగా ఆక్రమించిన బంజరు భూముల్లో సాగును ఆదివాసులు అడ్డుకొన్నారు.

1995 జులై 13వ తేదీన సమస్యను ఏదోమేరకు పరిష్కరించి ఉద్రిక్తతను సడలించడానికి గిరిజన, గిరిజనేతరుల మధ్య ఒక ప్రయత్నం జరిగింది. గిరిజనేతరులకు ప్రాతినిధ్యం వహించే ఏజెన్సీ రైతు సంఘం, శక్తి సంస్థల మధ్య జరిగిన సమావేశాలు మూడు అంశాలపై ఒక అంగీకారానికి వచ్చారు. (1) భూమికి సంబంధించిన రికార్డుల్ని ప్రజలందరి ముందు చదవాలి (2) గిరిజనులకు న్యాయంగా సంక్రమించాల్సిన భూముల్ని వెంటనే వాళ్ళకు ఇచ్చేందుకు తగిన ఉత్తర్వులు జారీ చెయ్యాలి (3) సరైన పట్టాలు, కాగితాలు వున్న గిరిజనేతరుల భూముల్లోకి గిరిజనులు చొరబడరాదు.

ఈ మూడు అంశాలపై అందరూ ఆమోదించిన మీదట భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా తాటిరామన్న గూడెం, మునుగోపాల గ్రామాల్లో కలెక్టర్ ఆధ్వర్యంలో భూముల వివరాలను ప్రజలందరి ముందూ చదివారు. ఆ వివరాల ప్రకారమే 1400 ఎకరాల భూమి గిరిజనులకు అప్పటికప్పుడే పంపిణీ చేయవచ్చని తేలింది. అయినా అధికారులు పంపిణీ చేయలేదు. దాంతో ఆదివాసుల గుండెల్లో ఆగ్రహజ్వాలలు చెలరేగాయి. తాము ఒక విద్రోహానికి గురయ్యామన్న ఆందోళనకు వారు గురయ్యారు. ప్రభుత్వం తమ

న్యాయమైన కోర్కెలు నెరవేర్చేదాకా గిరిజనేతరులను భూముల్లో వ్యవసాయం చేయనివ్వం అని గిరిజనులు నిర్ణయించుకున్నారు. ఉద్యమం మరోమలుపు తీసుకొంది. తమకు దక్కవలసిన భూముల్లో మామిడికాయలు, జీడిమామిడి కాయలను గిరిజనులు కోసుకోవడం మొదలుపెట్టారు. దాదాపు ఉద్యమం అన్ని గ్రామాలకూ విస్తరించింది. రెవిన్యూ అధికారులు అగ్రకుల భూస్వాములకు తొత్తులుగా వ్యవహరించారు. తెలివిగా విషయాన్ని పక్కదారి పట్టించడానికి దళితులకూ (షెడ్యూల్డు కులాలకు), ఆదివాసులకూ మధ్య ఘర్షణలు చెలరేపడానికి ప్రయత్నించారు. బుట్టాయిగూడెం, జీలుగుమిల్లి మండలాల రెవిన్యూ అధికారులు ఆదివాసుల కోరికకు అనుకూలంగా ప్రతిస్పందిస్తున్నట్లు నాటకమాడడానికి అగ్రకుల భూస్వాముల అక్రమ ఆక్రమణలో వున్న వేలాది ఎకరాల భూమిని వదిలివేసి షెడ్యూల్డుకులాలను వారి ఆధీనంలోవున్న భూముల్ని ఖాళీ చేయవలసిందిగా తాఖీదులను పంపారు. దాంతో దళితుల్లో ఆందోళన చెలరేగింది. షెడ్యూల్డు కులాలవారిని అడ్డంపెట్టుకొని 1996 ఆగస్టు ఐదవ తేదీన ఆదివాసులపై గిరిజనేతరులు దాడులు జరిపారు. మండల కార్యాలయాలపై దాడిచేసి భూమి రికార్డులను తగులబెట్టారు. జీలుగుమిల్లి, జంగారెడ్డిగూడెం మండలాఫీసులను ధ్వంసం చేశారు. నిరుపేద దళితులకూ, ఆదివాసులకూ మధ్య ఘర్షణని సృష్టించి తమ భూముల్ని కాపాడుకోవాలని అగ్రవర్ణ భూస్వాములు కుట్ర పన్నారు. ఇరువర్గాలమధ్య కొట్లాటలు జరిగాయి. ఏం జరిగినా భూముల్ని విడిచేది లేదని గిరిజనులు గట్టిగా నిలబడ్డారు. అగ్రకుల పెత్తందార్ల, రాజకీయనాయకుల, అధికారుల కుట్రల్ని విచ్ఛిన్నం చేస్తూ దళిత ఆదివాసీలమధ్య సంఘీభావ సంబంధాలను నెలకొల్పడానికి కూడా ఆదివాసులు ప్రయత్నం చేశారు. తమ న్యాయమైన పోరాటంలో తమకి మిత్రులెవరో శత్రువులెవరో తెలుసుకోగలిగినంత చైతన్యంతోనే ఆదివాసులు తమ ఉద్యమాన్ని నడుపుతున్నారు. 1997 ఫిబ్రవరి 24వ తేదీన దళిత – ఆదివాసీ సమన్వయ కమిటి ఏర్పడింది. అంతర్గత ఘర్షణలను నివారించడానికి ఒకరికొకరు సంఘీభావాన్ని ప్రకటించుకోడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి.

ఇంత ప్రజాస్వామికంగా, ఇంత శాంతియుతంగా ఆలోచిస్తున్న ఆదివాసుల ఆందోళనను అర్థం చేసుకొని నిజాయితీగా పనిచేయవలసిన రెవిన్యూ అధికారులు పోలీసులకు పని కల్పిస్తున్నారు. ఈ సమస్యను శాంతిభద్రతల సమస్యగా చూసే ప్రయత్నం చేస్తున్నారు. భూముల్లోకి వెళ్ళనివ్వకుండా అడ్డుకుంటున్న ఆదివాసులపైన విచక్షణారహితంగా దాడిచేస్తున్న గిరిజనేతరులను నిలువరించేది పోయి ఆత్మరక్షణ కోసం ప్రయత్నించిన గిరిజనులపైన అక్రమకేసులు బనాయించి వేధిస్తున్నారు. దాదాపు రెండువేలమంది పైన అక్రమకేసులు బనాయించారు.

ఇప్పుడు ఒక బీభత్స దృశ్యంగా మారి పోయింది పశ్చిమ గోదావరి ఏజన్సీ.

ఏప్రిల్ 12న దొండపూడి, రాజుపాలెం, సాగిపాడు గ్రామాలకు చెందిన గిరిజనేతరులు ఒక్కుమ్మడిగా గిరిజనులపైన దాడిచేశారనీ, ఆదివాసీ స్త్రీలను బట్టలూడదీసి కొడుతుంటే సహించలేని ఆదివాసులు విల్లంబులతో వారిని ఎదుర్కొన్నారనీ ఇరువైపులా గాయపడ్డారనీ, ఆగ్రహావేశంలోవున్న గిరిజనులు ఇళ్ళని తగుల బెట్టారు తప్ప ముందుగా వారేమీ చేయలేదని ప్రత్యక్షసాక్షి రంగాయమ్మ చెప్తోంది. అరెస్టు చేసిన వాళ్ళను విడుదల చేయాలని ఆదివాసీ మహిళలు పోలవరం పోలీస్‌స్టేషన్‌ముందు నినాదాలు చేస్తున్నారు.

ఇవేళ్టికి వాళ్ళు పారిపోయి వుండవచ్చు. ఇవేళ్టికి వాళ్ళు జైళ్ళపాలయి వుండవచ్చు. ఇవేళ్టికి వాళ్ళు క్షతగాత్రులై వుండవచ్చు. కానీ వాళ్ళు తిరిగివస్తారు. తమ భూమిమీద తమ పేరును వాళ్ళు రాసుకుంటారు. న్యాయం తమవైపే వున్నదన్న విశ్వాసం వాళ్ళను ప్రాణాలను సైతం లెక్కచెయ్యని ఉద్యమం దిశగా నడిపిస్తున్నది. ఈసారి కూడా వాళ్ళను పోలీసుల మొరటు బలంతో అణచివేయవచ్చు. కానీ వాళ్ళ ఆందోళన ఆగదు.

ఇప్పటికైనా ప్రభుత్వాధికారులు సక్రమంగా సర్వే జరిపి గిరిజనులకు చెందవలసిన భూమిని వారికే ఇవ్వాలి. అందుకోసం ఆదివాసులు సాగిస్తోన్న న్యాయమైన పోరాటానికి సంఘీభావంగా సభ్యసమాజం నడుంకట్టాలి.

వారి ఆందోళన ఏ రూపం తీసుకున్నా అందుకు బాధ్యత ప్రభుత్వానిదే. ఇప్పటికైతే వాళ్లు ప్రజాస్వామిక పద్ధతులనే ఎంచుకున్నారు.

బహుశా మనం మనుషులమేనని నిరూపించుకోడానికి వాళ్ళు మనకిస్తున్న ఆఖరి అవకాశం.

**ఆధారం : సాంఘిక సంక్షేమశాఖ నివేదిక, సి.పి.యం. ఏజన్సీ రైతుసంఘం ప్రకటనలు, శక్తి నివేదిక, ఆయా పత్రికల్లో వచ్చిన రిపోర్టులు**

**మే,ఆగస్టు - 1997 - చూపు**

# ముస్లింలు దళితుల ఐక్యత అత్యంత అవసరం

**సవాల్ : ముస్లింలోకి కన్వర్ట్ అయినవాళ్లలో దళితులే ఎక్కువుంటారని తెలుస్తుంది కదా... అలాంటి ముస్లింలను ఎఫ్.సి. కేటగిరిలోకి చేర్చడంపై మీ అభిప్రాయం?**

**జవాబ్ :** దళితులు మతం మార్చుకోవడం అనేది తమ విముక్తి ఉద్యమంలో భాగంగా చేశారు. అంటే అది వారికి మతపరమైన ఆచరణకన్నా ఎక్కువగా ఒక సామాజిక ఆచరణ. తమని పూరవతల అంటరానివారిగా వుంచిన హిందూ మతం కన్నా ఏ మతమైనా మంచిదేనన్న అభిప్రాయంతో దళితులు పెద్ద సంఖ్యలో ఇస్లాం మతాన్నీ, క్రైస్తవ మతాన్నీ ఆశ్రయించారు. చాలా మేరకు దళితులను ఆ మతాలు అక్కున చేర్చుకొని స్వాంతన నిచ్చాయి. అయితే హిందూ మతం మహా సామాజిక విప్లవంగా మొదలైన బౌద్ధ విప్లవాన్ని కూడా వదలలేదు. అన్నింటిలోకీ జొరబడి కులవ్యవస్థను చెక్కుచెదరకుండా కాపాడుతుంది. కులం చర్చిలోకి కూడా జొరబడడం అనేది ఒక చారిత్రక విషాదం. కొంతమేరకు ఇస్లాం కులం గీతల్ని చెరిపేయగలిగింది అని చెప్పవచ్చు. అయితే ఇస్లాంలో ఆ కులం తాలూకు జాడలు వర్గంగా ఘనీభవించాయి.

ముస్లింలోని నిరుపేదల్లో ఎక్కువమంది దళిత, యితర కింది కులాల నుండి వచ్చినవాళ్లే అయివుంటారు.

యితర మతాలను స్వీకరించిన దళితులకు కూడా రాజ్యాంగం కల్పించిన సదుపాయాలను, రిజర్వేషన్లను, యితర రాజ్యాంగ రక్షణలను అనువర్తింపచేయాలని దళిత ఉద్యమం ఎప్పటి నుండో డిమాండు చేస్తూనే వుంది. దేశంలోని పౌరులు తమకు యిష్టమొచ్చిన మతాన్ని స్వీకరించవచ్చు అని రాజ్యాంగంలోని 25వ అధికరణం చెపుతుంది. ఫలానా మతం స్వీకరించిన కారణంగా మీకు యిప్పటి వరకూ వున్న అవకాశాలను తీసివేస్తాం అని చెప్పడం రాజ్యాంగాన్ని వుల్లంఘించడమే. దీనిపైన ఒక సమిష్టి ఉద్యమం రావలసిన అవసరం వుంది. దళిత ఉద్యమం ఎదుర్కొంటున్న సవాళ్లలో యిది ఒకటి.

**సవాల్ : దళిత ముస్లింల ఐక్యత గురించి చర్చజరుగుతూ ఉంది కదా.. సాధ్యమంటారా?**

**జవాబ్ :** దళిత, ముస్లింల ఐక్యత సాధ్యమవుతుందా లేదా అన్న దానికన్నా అవసరమా కాదా అని ప్రశ్న వేసుకొంటే మంచిది. యిప్పుడు వున్న పరిస్థితుల్లో హిందూ మతోన్మాదం ఫాసిస్టు రూపం తీసుకోవడానికి కావలసిన భూమిక దేశంలో రూపొందుతోంది. దాని మొదటి బాధితులు ముస్లింలూ, దళితులే.కాబట్టి ఐక్యత అత్యంత అవసరం. సాధ్యమవుతుందా అన్నది తర్వాత ప్రశ్న. అంత తేలికైన విషయంకాదన్నది మనకు అనుభవంలోకి వచ్చిన విషయమే. కొంతమంది నాయకులు, లేదా కొంత మంది కవులు నినాదం ఇస్తే రెండు సాంస్కృతిక సమూహాలు కలిసిపోవు. ఒక లోతైన అధ్యయనం జరగాలి. దళిత సంస్కృతిలో, ముస్లిం సంస్కృతిలో వున్న సాధారణ అంశాలను పట్టుకోవాలి. తీవ్రంగా విబేధించే అవకాశాలున్న అంశాలను తెలుసుకోవాలి. వీటన్నింటి ప్రాతిపదికగా ఒక సమగ్రమైన కార్యాచరణను రూపొందించాలి. యిందుకు రెండు వైపులనుండీ నిజాయితీతో కూడిన ప్రయత్నం జరగాలి. ఈ సాంస్కృతిక సమ్మేళనం మాత్రమే రెండు వేర్వేరు వర్గాలను మిత్రవర్గాలుగా వుంచగలుగుతుంది.

ప్రస్తుతానికి ముస్లిం, దళితుల ఐక్యత ఒక రాజకీయ నినాదంగా మాత్రమే వుంది.

నిజానికి దళిత ఉద్యమానికి ముస్లింల సహాయం జాతీయోద్యమం నాటినుండీ వుంది. డా॥ బి.ఆర్. అంబేద్కర్‌ను రాజ్యాంగ రచనా సంఘానికి ఎన్నిక కాకుండా గాంధీ నాయకత్వం లోని కాంగ్రెస్ పార్టీ సకల ప్రయత్నాలూ చేసినప్పుడు బెంగాల్ నుండి అంబేద్కర్ ఎన్నిక కావడానికి ముస్లింలీగ్ ఎంతో దోహదపడింది. అదేవిధంగా అంబేద్కర్ దళితుల కోసం మహారాష్ట్రలో విద్యా సంస్థలను ఏర్పాటు చేయడంకోసం ప్రయత్నాలు చేస్తున్న తరుణంలో నిజాం ఆర్థిక సాయం చేయడం దళితులు మరచిపోలేరు.

**సవాల్ : దళిత కల్చర్ గురించీ, దళిత దేవతల గురించి చర్చ ఎందుకు మరుగున పడుతోంది? ఆర్యుల సంస్కృతి, ఆ దేవుళ్ల దళితుల్ని ఆక్రమిస్తుంటే ఊరుకుంటున్నారే.. ఈ పరిస్థితి ఎక్కడికి దారితీస్తుంది?**

**జవాబ్ :** దళిత సంస్కృతి గురించిన చర్చ జరగాల్సినంతగా జరగడం లేదేమో కానీ మరుగున పడిందనడం నిజంకాదు. దళిత ఉద్యమం ఎంతగా సామాజికార్థిక ఉద్యమమో అంతకన్నా ఎక్కువగా సాంస్కృతిక వుద్యమం. జోతిబా పూలే నడిపిన వుద్యమాన్ని అధ్యయనం చేసినా, అంబేద్కర్ వుద్యమాన్ని అధ్యయనం చేసినా అది మనకు స్పష్టంగా తెలుస్తుంది. అంబేద్కర్ అనంతరం చాలా సందర్భాలలో దళిత వుద్యమం యాధృచ్ఛికతకు గురైంది. తక్షణ సమస్యలకు మాత్రమే స్పందించడం పెరగింది. సాంస్కృతిక ఉద్యమాన్ని విస్మరించే ఏ ఉద్యమమైనా పాక్షిక విజయాలకే పరిమితం కావలసి వుంటుంది. బహుశా దళిత ఉద్యమం తనను తాను సమీక్షించుకొంటోంది... లోపాలను సవరించుకొంటుంది.

**సవాల్ : ముస్లింలపై జరుగుతున్న ఊచకోతలపై దళిత క్రిస్టియన్స్ మాట్లాడటంలేదు. అమెరికా తరపున నిలబడ్డట్టు కనిపిస్తుంది. ఏమంటారు?**

**జవాబ్ :** ముస్లింలపైన జరిగే అరాచకాలకు దళితులు, దళిత క్రిస్టియన్స్ స్పందించాల్సినంతగా, స్పందించాల్సిన తీరులో స్పందించడం లేదన్నమాట నిజమే. దానికీ అమెరికాకీ సంబంధం లేదు. రోజూ కూలీకి వెళ్లి ఆదివారం చర్చికి వెళ్లే దళిత క్రైస్తవుడికి అమెరికా వూసే తెలియదు. దళిత క్రైస్తవులంటే ప్రతి ఆదివారం ప్యాంటూ, షర్టూ టక్ చేసుకొని, పట్టు చీరెలు కట్టుకొని బైబిళ్లు పట్టుకొని చర్చికి వెళ్తూ కన్పించే నగర జీవులు మాత్రమే అన్న అపోహ వుంది. అది అపోహ మాత్రమే. మామూలు దళిత క్రైస్తవుడు, మామూలు దళితుడు, మొత్తంగా దళిత వుద్యమం అమెరికాని వ్యతిరేకించి తీరాల్సిందే. దక్షిణాఫ్రికాలో జరిగిన జాతి వివక్షా వ్యతిరేక ప్రపంచ సదస్సులో దళితులు పాలస్తీనాకు మద్దతుగా అమెరికానూ, ఇజ్రాయేల్‌నూ వ్యతిరేకించిన విషయం తెలిసిందే. అందులో దళిత క్రైస్తవులు కూడా ఎక్కువ సంఖ్యలోనే వున్నారు. అయితే సంపన్న చర్చి అమెరికా అనుకూల వైఖరి అవలంబించే అవకాశం వుంది. యిది దళిత ఉద్యమానికి ఎంతగా సమస్యో, ముస్లిం ఉద్యమానికి అంతే సమస్య.

**ఇంటర్వ్యూ : స్కైబాబ -సం॥ 2005**
**వేముల ఎల్లయ్య, స్కైబాబ సంపాదకత్వంలో వెలువడిన**
**ముస్లిం సాహిత్య సంకలనం : ముల్కి నుండి**

# బుద్దుడు.. అశోకుడు.. అంబేద్కర్.. కాన్షీరామ్

అతనొక వీలునామా రాశాడు, నా అస్థికలు, చితాభస్మము ఏ నదిలోను కలపరాదని ఆజ్ఞాపించాడు. డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ చనిపోయిన యాభై ఏళ్ళకు మరణించిన ఒక మహా మనిషి. అంబేద్కర్ స్థాపించిన విలువల్ని నిలబెట్టడానికి జీవించి మరణించిన మనిషి.

కాన్షీరామ్ అస్థికలు ఏ నదిలోనూ కలపలేదు. కాని జాతి జీవన స్రవంతిలో ఆయన జీవనాదం మారుమ్రోగుతూనే ఉంది.

డా॥ బాబా సాహెబ్ అంబేద్కర్ దళితులకు, అణగారిన వర్గాలకు, అవకాశాలు లేని మనుషులకు, అవమానాలు పొందుతున్న మనుషులకు అధికారాన్ని చవి చూపించాలని కలలుగన్నాడు. ఆయన జీవించి వుండగా అది కలగానే మిగిలిపోయింది. ఆ కలను నిజం చేయగలిగిన మనిషిని జగజ్జీవన్‌రామ్‌లో వెతుక్కున్నాడు, అదొక వైఫల్యం. పంజాబీ రాందాసియా కులంలో పుట్టిన కాన్షీరామ్ దేశంలో అతిపెద్ద రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌లో ఒక చమార్ యువతి అయిన మాయావతిని ముఖ్యమంత్రి చేసి, ఏనాడూ అసెంబ్లీకి వెళ్ళాలని ఊహించను కూడా ఊహించని కులాలకి చెందిన వారిని ఎమ్మెల్యేలుగా గెలిపించి, మనువాద బ్రాహ్మణీయ శక్తుల మీద విజయం సాధించాడు.

బుద్ధుడు కోరుకున్న సంక్షేమ రాజ్యాన్ని ఆచరణలో పెట్టినవాడు అశోక చక్రవర్తి. దళితులు పాలకులు కావాలన్న అంబేద్కర్ కలల్ని నిజం చేసిన వాడు కాన్షీరామ్. ఇప్పుడు బుద్ధుడులేడు, అశోకుడు లేడు, అంబేద్కర్ అంతకంటే లేడు. కాన్షీరామ్‌ని కూడా కోల్పోయింది దేశం. కానీ కాన్షీరామ్ ఆశయం మాత్రం బతికే వుంటుంది. ఆ ఆశయాన్ని నిజం చేసే మనుషులు బ్రతికే వుంటారు. ఈ వేళ దేశం సామ్రాజ్యవాద శక్తులతో, హిందూ మతోన్మాద శక్తులతో కునారిల్లుతున్న సమయాన కాన్షీరామ్ లేని లోటు స్పష్టంగా అర్ధమవుతుంది. ఆయనే వుంటే హిందూత్వ శక్తులకు వ్యతిరేకంగా, మనువాద శక్తులకు వ్యతిరేకంగా, వారి "మీడియా–మాఫియా–మనీ" కి ప్రత్యామ్నాయ శక్తిని ఖచ్చితంగా నిర్మించి వుండేవాడు. ప్రపంచంలో వేల కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి సొంత ఆస్థిలేని మనుషులు ముగ్గురే ముగ్గురు వున్నారు. కారల్‌మార్క్స్, అంబేద్కర్, కాన్షీరామ్.

ఇప్పుడాయన లేడు. మాయావతి దగ్గర నుండి మండల స్థాయి వరకు ఎంతో మంది నాయకులున్నారు. వారిప్పుడు చేయాల్సింది కాన్షీరామ్‌ని ఆరాధించడం కాదు, ఆచరించాలి. కాన్షీరామ్‌ని స్మరించుకోవడం అంటే ఆయన కలలుగన్న బహుజన సమాజం నిర్మించడం. బాబాసాహెబ్ కలలను నిజం చేసిన ఏకైక వ్యక్తి కాన్షీరామ్. ఆ మహనీయునికి జోహార్లు అర్పిస్తూ, మరణానికి సంతాప సూచకంగా "బహుజన కెరటాలు" పతాకాన్ని అవనతం చేస్తుంది. కాన్షీరాం మరణంతో దుఃఖ సాగరంలో మునిగిపోయిన బహుజన లోకంతో శోకాన్ని పంచుకుంటుంది.

**కాన్షీరామ్‌కి మరణం లేదు! అతని ఆశయానికి మరణం లేనే లేదు!!**

**నవంబర్, డిశంబర్ 2006 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# నగేష్ అంటే సాహితీ సముద్రంలో సునామీ

**జనవరి 10,2005**

తెలతెలవారుజామున పొన్నూరు రోడ్లమీద నడుస్తున్నాను. సెల్‌ఫోన్ కోకిల కూయడం మొదలు పెట్టింది. కాలర్ ఐడి అద్దం మీద నాకిష్టమైన పేరు మద్దూరి... మద్దూరి... మద్దూరి... డిస్‌ప్లే అవుతుంది. 'అయ్యా ఎట్లున్నావురా' అనడుగుతున్నాను. అవతలివైపు గొంతుక వాడిది కాదు. ఏదో అపరిచిత స్వరం వాడి ఫోను నుండే వాడి మరణ వార్తను చేరవేసింది. 9వ తేదీ రాత్రి ఒంటిగంటకు మద్దూరి నగేష్‌బాబు భౌతిక శరీరం శాశ్వత నిద్రలోకి వెళ్ళిపోయింది.

కొన్ని రోజులుగా అనారోగ్యంతో విజయవాడ నాగార్జున ఆస్పత్రిలో వుంటున్నాడు. అమితంగా యిష్టమైన క్రిస్మస్ పండుగ రోజున వాడిని చూద్దామని నేనూ, పల్నాటి శ్రీరాములు, ఆత్మకూరి చెన్నయ్య, ఇంగిలాల రామచంద్రయ్య వెళ్ళాం. మేం వెళ్ళేసరికే ప్రసాదమూర్తి వున్నాడు. నీరసంగా వున్నాడు. కానీ కుదుట బడినట్లే కన్పించాడు. ఫోనులో ఎప్పుడు పలుకరించినా ఒక దుఃఖపు తెరలాగా కరిగి నీరైపోయే మద్దూరి విజయశ్రీ ఆ రోజు కాస్త తేటగా కన్పించింది. బాగా కోలుకుంటున్నాడని చెప్పింది. వాడి యిటీవలి 'నరలోక ప్రార్ధన' పుస్తకాన్ని కనిగిరిలో ఆవిష్కరిద్దాం అని చెన్నయ్య అడిగాడు. జనవరి పదోతారీఖున పెట్టుకోపోమ్మన్నాడు. పదో తారీఖు కల్లా లోకం మీద నిరసనతో వెళ్ళిపోయాడు. నువ్వు చచ్చిపోతే నిన్ను బుజాలమీదుగా సాగనంపుతానన్నాడు? నా శవాన్ని ఈ దేశ ముఖచిత్రంగా ముద్రిస్తానన్నాడు. మూడు పెగ్గుల ఓదార్పునిచ్చాడు. మాట నిలబెట్టుకోకుండా వెళ్ళిపోయాడు. మోసం చేశాడు. బహుశా జీవన్మృతుల మూకల మధ్యన మసలలేక మృతులను నిద్రలేపడానికి వెళ్ళిపోయాడు. నాగప్పగారి సుందరరాజు, మద్దెల శాంతయ్యలతో కలసి అసలు సిసలైన దళిత రచయితల సంఘాన్ని నిర్మిద్దామని హడావుడిగా వెళ్ళిపోయాడు.

ఒక రకంగా నగేష్ అదృష్టవంతుడు. అతనికి ఇద్దరు తల్లుల ప్రేమ దొరికింది. ఒక తల్లి కన్నతల్లి, మరో తల్లి అతన్ని పెళ్ళాడిన మద్దూరి విజయశ్రీ. సముద్ర గర్భాన చెలరేగిన భూకంప పెనుప్రళయంలాంటి నగేష్‌బాబును గుండెల్లో దాచుకొని సాదుకున్నారు. దళిత సమాజంలోని అలజడినీ, శోకాన్నీ, ఆగ్రహాన్నీ, కలవరాల్నీ, భయాందోళననీ, రక్తనాళాల్లోకీ, గుండెల్లోకీ మొత్తంగా శరీరంలోకీ ఆవాహన చేసుకున్నాడు మద్దూరి నగేష్‌బాబు.

కారంచేడు నెత్తుటి జ్వాలల్లోంచి దళిత ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసినప్పుడు ఆ ఉద్యమం ఆలంబనతో దళిత సాహిత్యోద్యమం పుట్టిపెరిగింది. అంతకు ముందు దళితులెవ్వరూ దళిత సాహిత్యాన్ని సృష్టించలేదని కాదు. అప్పటికి ఉధృతంగా నడుస్తున్న విప్లవ సాహిత్య శిభిరాలలో ఇమడలేక, తనదైన సొంత బాణీని సమకూర్చుకోలేక సంప్రదాయ సాహితీ వేత్తలను అనుసరిస్తూ పేలవమైన చిత్రణగా మాత్రమే దళిత సాహిత్యం వుండేది. కారంచేడు ఉద్యమం తర్వాత

కూడా దళిత సాహిత్యోద్యమానికి స్వంత గొంతుక రూపొందలేదు. దళిత ఉద్యమానికి ఆనాడు నాయకత్వం వహించిన బొజ్జాతారకంగారు, కత్తిపద్మారావుగారు ఇద్దరూ కవులే నన్న విషయం అందరికీ తెలిసిందే. అయితే ఉద్యమంలోనూ, తత్వంలోనూ వాళ్ళుతీసుకు రాగలిగిన పెనుమార్పుల్ని దళిత సాహిత్యంలో తీసుకురాలేకపోయారు. ఉద్యమంలో విప్లవాత్మకంగా వున్నవాళ్ళు సాహిత్యంలో పేలవంగా మిగిలిపోయారు. దళిత సాహిత్యాన్ని ప్రధాన స్రవంతిలోకి తీసుకువెళ్ళడంలో వీళ్ళు అంతగా విజయవంతంకాలేదు. అందుకు వాళ్ళనే బాధ్యుల్ని చేయడం అనవసరం. కారణాలు అనేకం. ఆ తర్వాత విప్లవ సాహితీ శిబిరం నుండి దళితత్వాన్ని అందుకున్న నేనూ, బి.ఎస్.రాములు, సాహు, ఉ.సా (శివసాగర్ అప్పటికి దళిత కవిత్వం రాయడం మొదలు పెట్టలేదు. గద్దర్ అద్భుతమైన దళిత పులులమ్మా... పాటరాసినప్పటికీ తనను తాను దళిత కవిగా చెప్పుకోడానికి అంగీకరించలేదు), కంచె ఐలయ్య, కో.ప్ర, సతీష్ చందర్, లక్ష్మీనరసయ్య, పి.సి.రాములు తదితరులం దళిత స్పృహనుండే రాయడం మొదలు పెట్టినప్పటికీ విప్లవ భాషతోనే రాయడం కొనసాగించాం. ఎప్పటినుండో కవిత్వం రాస్తున్న ఎండ్లూరి సుధాకర్ సినారే తదితర ప్రముఖ కవుల ప్రభావంలోనే రాశాడు. శిఖామణి ఇస్మాయిల్ తదితరుల ప్రభావంతో కవిత్వం రాశాడు. యిద్దరూ 'మంచి' కవిత్వం రాశారు. కానీ దళిత గొంతుక 'గరగరల్ పచరించ' లేకపోయారు. చుండూరు సంఘటన తర్వాత రెండు కలాలు, రెండు గళాలు రంగం మీదకి వచ్చాయి. భారత సమాజానికి 'సునామీ' పెను ప్రళయ విధ్వంస హేల యిటీవలి అనుభవం.కానీ ఆ యిద్దరి రంగ ప్రవేశంతో తెలుగు సాహితీ ప్రపంచం 'సునామీ' అనుభవాన్ని 90లలోనే చవిచూసింది. ఆ యిద్దరూ నరసరావుపేట పిల్లాడు మద్దూరి నగేష్‌బాబు, ఒంగోలు గద్దలగుంట కుర్రాడు పైడితెరేష్‌బాబు, వాళ్ళిద్దరికీ అడ్డగోలు కమ్మోళ్ళ పిల్లగాడు త్రిపురనేని శ్రీనివాసు, జి. లక్ష్మీనర్సయ్య తోడయ్యారు. యిక విజృంభణ మొదలయ్యింది. ఏ మాటకామాట చెప్పుకోవాలి. ఆంధ్రజ్యోతి ఆదివారం సంచిక దళిత కవిత్వానికి ఒక వేదికగా మారింది. శ్రీను బతికివున్నంతకాలం అది కొనసాగింది.

మాల మాదిగ పల్లెల అసలైన భాషనూ, యాసనూ మాత్రమే కాదు. దళిత పల్లెల ఆకాంక్షలను యధాతధంగా వ్యక్తీకరించడం నగేష్‌బాబుతోనే మొదలైంది. ఉదాహరణకు నగేష్ రాసిన 'అలగాతల్లి' కవిత. అమ్మంటే అప్పటిదాకా ఆత్మీయత, అనురాగం, చల్లనివెన్నెల, కానీ నగేష్ దళిత తల్లిని చిత్రించాడు. అమ్మంటే శవాల కొట్టుముందు ఒక కన్నీటిమడుగు. బొందలగడ్డలో సమాధిబండకైనా నోచుకోని ఏకాకి శిలువ. ఆమెని వర్ణించడానికి మీ భాషచాలదని, భాష ఎంత బలహీనమైపోయిందో ఎత్తి చూపుతాడు. ఒక దళిత స్త్రీ అత్యాచారానికి గురైన సందర్భంలో 'మానం పోతే కడుక్కుంటాను... రొమ్ముల్ని కొరికేశావు కదరా! రేపొద్దున నా పిల్లలకి పాలెట్టా యివ్వాలిరా...! నా బట్టా అని రాస్తాడు. నగేష్ తెచ్చిన రచ్చబండ, వెలివాడ, లోయ, మీరేవుట్లు, నరలోకప్రార్థన సంకలనాలు, తాను రాణీ శివశంకరశర్మతో

కలసి రాసిన ఊరు -వాడ, తన సంపాదకత్వంతో వెలువడిన విడి ఆకాశం కానీ మొత్తంగా దళిత వ్యక్తీకరణకు ప్రాతినిధ్యం వహించేది. నగేష్‌బాబు, తెరేష్‌బాబులు కవిత్వం రాయడం మొదలుపెట్టిన తర్వాతనే శివసాగర్, కత్తిపద్మారావులాంటి వాళ్ళు తాము రాస్తున్న కవిత్వాన్ని చెక్ చేసుకోవడం మొదలుపెట్టారు. ఉదాహరణకు అంతకు ముందు కత్తిపద్మారావు రాసిన దేశం డైరీ, జైలు గంటలు మొదలైన కవితా సంకలనాలనూ, నగేష్ రాయడం మొదలు పెట్టిన తర్వాత రాసిన నల్లకలువ, నీలికేక కవితా సంకలనాలను చూస్తే నగేష్ ప్రభావం ఆయన మీద ఎంతగా వుందో అర్థం అవుతుంది. చారిత్రిక విభాత సంధ్యల్లో అనేక సందర్భాలలో ట్రెండ్ సెట్టర్‌గా వున్న శివసాగర్ సైతం మద్దూరి ప్రభావం పడిన తర్వాతనే నడుస్తున్న చరిత్ర, మండే మాదిగ డప్పులాంటి మంచి 'దళిత కవిత్వం' రాశాడు. ఖాజా లాంటి అద్భుతమైన కవి అతని సాన్నిహిత్యంతోనే ఎదిగాడు. రాంరెడ్డి లాంటి వాళ్ళు కవులుగా రూపొందడంలో నగేష్ పాత్ర ఎవరూ కాదనలేనిది. ప్రగతిశీలురుగా కన్పించే అగ్రకుల కవులను మీరు దళిత కవిత్వం రాయనవసరంలేదని సంఘీభావ కవిత్వం రాయించాడు. నగేష్ లేకపోతే 'కాస్తసిగ్గుపడదాం' అన్న కవితా సంకలనం రావడం అంత తేలిగ్గా సాధ్యం అయ్యేదికాదు.

దళిత సాహిత్యోద్యమానికి యింతగా కంట్రిబ్యూట్ చేసిన నగేష్ దళిత ఉద్యమంలో మమేకం కావాలని తపనచెందాడు. యం.ఆర్.ఓ.గా పనిచేస్తూ కూడా ఒక ప్రొఫెషనల్ దళిత కార్యకర్తగా పనిచేయడానికి ఆరాటపడ్డాడు. దాని వలనే ఎక్కువ కలతచెందాల్సిన పరిస్థితి అతనికి ఏర్పడింది. దళిత ఉద్యమం ఉచ్ఛదశలో వున్నప్పుడు వాడు పరోక్ష అభిమానిగానే వుండేవాడు. అది క్షీణించడం మొదలు పెట్టిన తర్వాత దళిత ఉద్యమానికి సన్నిహితంగా వచ్చాడు. కత్తిపద్మారావు, మందకృష్ణ మాదిగ లాంటి 'మహా' నాయకులను కలిశాడు. మహా ఆశనిపాతం. వీళ్ళని కలవకుండా వుంటే ఎంతో బాగుండేదని నగేష్ చాలాసార్లు వాపోయాడు. తగిలిన గాయాలు స్వంత గాయాలు కాదు. అగ్రకుల సమాజం వాడ్ని ఏడ్పించినప్పుడల్లా వాడు మరింత పదునెక్కాడు. దళిత ఉద్యమం క్షీణించడమే వాడిని ఎక్కువగా కృంగదీసింది. ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ దళిత ఉద్యమ నాయకులే అతని మరణానికి కారణం.

"కవులు చావరు చంపబడతారు

అనేక కారణాలవల్ల

కవులు మొండివాళ్ళు

ఎన్నిసార్లు చంపినా బతికే ఉంటారు.

మద్దూరి నగేష్‌బాబు అనే కవి 2005 జనవరి 10వ తేదీనుండి కవిగా మరణించి కవిత్వంగా జీవించడం మొదలుపెట్టాడు. దళితకవి రెండవ రాకడని ఆహ్వానిస్తున్నాను.

**జనవరి-2005 బహుజన కెరటాలు - ఆంధ్రజ్యోతి సౌజన్యం**

# ఆకురాలు కాలంలో ఆగ్రహ గీతం

1996 సెప్టెంబర్ 21వ తేదీన ప్రముఖ మరాఠీ దళిత రచయిత, దయా పవార్ చనియాడు. మరాఠీ గడ్డ మీద అస్పృశ్య మానవుడ్ని సాహితీ వీధుల్లోకి సగర్వంగా ప్రవేశపెట్టి అంతవరకూ చలామణిలో ఉన్న సాహితీ ప్రమాణాలను ధిక్కరించి బతుకు లోలోపల కోణాలన్నింటినీ అత్యద్భుతంగా చిత్రించిన దళిత సాహిత్యోద్యమకారుల్లో దయాపవార్ ఒకరు. రూపంలోనూ సారంలోనూ ధిక్కార స్వరాన్ని వినిపించిన దయాపవార్ ఎన్నో మహత్తరమైన అనుభవాలను మనకు అందించి పోయాడు.

బతుకంటే పుట్టడం, పెరగడం, చనిపోవడమే అయితే ఏ సమస్యా లేకుండా, ఏ రాగద్వేషాలూ లేకుండా పుట్టి గిట్టవచ్చు. కానీ ఈ మూడింటి మధ్య బతుకు ఎంతో సంఘర్షణకు గురవుతుంది. బతుకు సంక్షుభిత కాలమవుతుంది. కల్లోల కన్నీటి సంద్రమవుతుంది. అధికారంగా, అహంకారంగా కేంద్రీకృతమైన దౌర్జన్యం సగటు బతుకును అవమానాలతో, కన్నీళ్ళతో, దుర్భర దారిద్ర్యంతో, అత్యాచారాల అరాచకాలతో ముంచెత్తుతుంది.

రంగుల కలల్లేవు. ఇంద్రధనస్సు జెండాలు లేవు. మట్టిలో, తొలకరిలో రెండూ కలగలసిన పరిమళంలో ఏ భవిష్యత్ వాగ్దానాలూ లేవు. పాలూ తేనెలు ప్రవహించే వాగ్దత్త భూఖండం లేదు. మండుతున్న గుండెకు ఒక చిరు పలకరింపుల స్వాంతన లేదు. గుండెకూ గుండెకూ మధ్యన మనిషికీ మనిషికీ మధ్యన శాశ్వత అసహనమై పరచుకొన్న మండుటెడారులు. మళ్ళీ మళ్ళీ ప్రతిధ్వనించే విజేతల వికటాట్టహాసాలు, కన్నీటి సంద్రాలలో కొట్టుమిట్టాడుతోన్న ఆకాంక్షలు. ఒక విద్రోహం, ఒక అమానుషం, ఒక వాగ్దాన భంగం మనుషుల్ని స్పృశ్యులుగా, అస్పృశ్యులుగా చీల్చి కొందరికి అధికారమిచ్చి, అహంకారమిచ్చి, సంపదలనిచ్చి మరికొందరికి అవమానాలిచ్చి, ఆవేదనలనిచ్చి దుర్భర దారిద్ర్యాలనిచ్చిన సామాజిక రాజధర్మపు నాలుగుపాదాల నడక.

ఆరుగాలమూ పల్లెల పైన, వెలివాడల పైన దుర్మార్గపు దాడిగా విరుచుకుపడే అగ్రకుల అహంకారం. గుడిసె కడుపుల్లో రోహిణీ వడగాల్పులు. దళిత జనావళి నెత్తురుతో తడిసిన నేల పచ్చపచ్చటి పంట విప్లవమై దొరల గాదెల్లో విలసిల్లుతున్న వైనం. నిరంతరం ఘర్షణలో కాసింత ఊపిరి కోసం, బతుకులో కాసింత వెసులుబాటు కోసం అంటరాని మానవులు పెనుగులాడుతున్న నేపథ్యం.

పాతికేళ్ల ప్రాయం వచ్చిన సొరాజ్యం. జెండాలు జెండాలుగా రజతోత్సవ స్వతంత్ర వేడుకల్ని అధికారవర్గాలు జరుపుకుంటుంటే శవాలు శవాలుగా నడిచిపోతున్న దళిత జీవితం.

ఈ నేపథ్యం నుండి, ఈ ఘర్షణ, వత్తిడి నుండి మహారాష్ట్ర గడ్డ మీద 'దళిత పులి' గాండ్రించింది. 70వ దశకంలో నెలకొన్న దారుణమైన సంక్షుభిత పరిస్థితులను బద్ధలు

కొడుతూ దళిత పాంథర్స్ ఉద్యమం ఆవిర్భవించింది. దళిత పాంథర్స్ అందరూ కవులూ రచయితలు కావడం విశేషం. ఈ పోరాటం నుండి, ఈ నెత్తుటి జ్వాలల వెలుగు నుండి ఈ అవమానాల, ఆవేదనల, ఆగ్రహాల నుండి దళిత సాహిత్యోద్యమం పుట్టింది. అందులో దయాపవార్ గొంతు విలక్షణమైనది.

అప్పటి వరకూ మన తెలుగు సాహితీసీమలో కొనసాగినట్లే మరాఠీ సాహితీ ప్రపంచంలోనూ నోట్లో వెండీ బంగారు చెంచాలతో పుట్టిన సరస్వతీ వరపుత్రులు మాత్రమే రచయితలుగా, సాహితీవేత్తలుగా చెలామణీ అయ్యారు. దళిత పాంథర్స్ ఉద్యమం దళిత సాహిత్యోద్యమం ఆ సాంప్రదాయాన్ని తునాతునకులు చేసింది. అంతవరకూ రాజ్యమేలిన సాహితీ ధోరణులు సాహితీ గౌరవాన్నివ్వడానికి నిరాకరించిన మట్టికాళ్ళ అంటరాని మానవుడ్ని మరాఠీ దళిత రచయితలు సగర్వంగా సాహితీ వీధుల్లో నడిపించారు. ఆ అంటరాని మానవుడు అక్షరమూర్తిగా నడచిపోతుంటే అంతవరకూ సురక్షితంగా సుస్థాపితమైన సాహితీ విలువల్నీ ధ్వంసమై పోయాయి. ఆ విధ్వంసం నుండి ఒక సరికొత్త కళా సౌందర్య శాస్త్రాన్ని దళిత రచయితలు ఆవిష్కరించారు. ఆ క్రమం అంతటిలో దయాపవార్ ఒక విశిష్టమైన వ్యక్తిత్వంతో ప్రధాన భూమికను నిర్వహించారు. అప్పటి దాకా పేరు మోసిన నాయకులో, ప్రఖ్యాత విఖ్యాత వ్యక్తిత్వాలో, విప్లవకారులో వీరు మాత్రమే 'ఆత్మకథ'లు రాసుకోవాలన్న భ్రమ ఒకటి కొనసాగింది. దళిత రచయితలు ఆ భ్రమల్ని చావు దెబ్బతీశారు. దయాపవార్ 'బలూతా' పేరుతో తన ఆత్మకథను రాశాడు. ఇది 1978లో అచ్చయ్యింది. అంతకు ముందే 1974లో 'ఖోంద్‌వాడా' రాశారు. 1935 సెప్టెంబర్ 15వ తేదీన పుట్టిన దయాపవార్ ఒక అంటరానివాడిగా తనను తాను మనిషిగా నిలబెట్టుకోడానికి, తన జాతి ఆవేదనలకు గొంతుక నివ్వడానికి తనను తాను రచయితగా మలచుకోడానికి ఘర్షణ పడ్డాడు. ఖోంద్‌వాడాకు 1975లోనూ, బలూతాకు 1979లోనూ మహారాష్ట్ర ప్రభుత్వ సాహితీ పురస్కారం లభించింది. భారత ప్రభుత్వం ఆయనకు పద్మశ్రీ బిరుదు నిచ్చింది. బలూతా ఆధారంగా 'అత్యాచార్' అనే మరాఠీ సినిమా తీశారు. 1983లో కిట్టల్, చావ్ డీ పుస్తకాలను ప్రచురించాడు. రచయితగా కవిగా సాహిత్యరూపంలోనూ, సారంలోనూ దయాపవార్ తనదైన ధిక్కార స్వరాన్ని ముద్రించాడు. 1986లో పశ్చిమ జర్మనీలోని ఫ్రాంక్ ఫర్ట్‌లో జరిగిన ప్రపంచ పుస్తక ప్రదర్శనకు దయాపవార్‌ను ఆహ్వానించారు. మొత్తం భారత దేశం నుండి ఇరవై అయిదు మంది రచయితలను ఆ పుస్తక ప్రదర్శనకు ఆహ్వానించారు. అయితే పశ్చిమ జర్మనీలోని పత్రికలన్నీ ఇద్దరంటే ఇద్దరే రచయితల వార్తలనూ, వ్యాఖ్యలనూ, ఇంటర్వ్యూలనూ ప్రచురించడానికి పోటీ పడ్డాయి. ఒకరు ఆదివాసీల జీవితాలను సజీవంగా చిత్రించిన మహాశ్వేతాదేవి అయితే రెండవ వారు దయాపవార్. దేశ దేశాల్లో దళిత చైతన్య బావుటాను ఎగరవేశాడు దయాపవార్. ఆయన ఆత్మకథ బలూతా ఇంగ్లీషులోకి మాత్రమే కాక ఫ్రెంచి, జర్మన్ భాషల్లోకి కూడా

అనువాదమయ్యింది. తన బలూతా ఆత్మకథలో ఒక చోట దాగడు పవార్ – అతనే దయాపవార్ – ఒక అంటరాని మానవుడిగా అవమానాల ఆవేదనల శిలువను క్రీస్తులాగా బుజానెత్తుకొని భారంగా నడచిపోతుంటాడు. అయితే ఈ శిలువ మోసే అంటరాని మానవుడికి క్రీస్తులాగా తల చుట్టూ తేజోవలయం ఏదీ వుండదు. బాధ, అవమానం మూర్తీభవించిన మనిషి శిలువ భారాన్ని అలా మోయలేక మోస్తూ సొక్కుతూ సోలుతూ నడచిపోతూ ఒక నల్లటి చుక్క మన కనుల ముందు నుండి అనంతాల్లోకి ఫేడవుట్ అవుతున్నట్లుగా ఆ మనిషి ఒక సమూహంలోకి అంతర్ధానమవుతాడు. తీరని అవసరాలు ఒక పక్క కనీస అవసరాలను కూడా తీర్చుకోలేని, దయనీయమైన పరిస్థితులు ఒక పక్క, అంటరాని ఆకలి మంటల మానవుడి కథే దయాపవార్ ఆత్మకథ. తన ఆత్మకథ అంటే అది తన జాతి ఆత్మకథ. తన దేశం ఆత్మకథ. తన దేశాన్ని ఒక సుక్షేత్రంగా కరిగించి క్షామాన్ని మింగిన గరళ కంఠుడి ఆత్మకథ. అందులో విద్రోహ రాజకీయాలు, ఎమర్జెన్సీ చీకటి చిత్రితమైంది. కవిత్వంలోనూ దయాపవార్ తనదైన శైలిలో దళిత ధిక్కార స్వరాన్ని వినిపించాడు. ఒక కవితలో వాల్మీకిని సంబోధిస్తూ (మహాకవీ!) "వాల్మీకీ, నువు మహాకవివి కాబట్టి! రామ రాజ్యపు ఘనకీర్తినే గానం చెయ్యాలా?" అని ప్రశ్నిస్తాడు. అంతటితో ఆగక క్రౌంచపక్షికి గాయమై నేల కూలితేనే నీ గుండె బద్దలైపోయి కవిత్వం కరుణరసంగా ప్రవహించింది కదా మరి నువు పుట్టిన అంటరాని వెలివాడలో నీ స్వంత జనాల నెత్తురు సతతం ఏరులై పారుతున్నదే, వారి ఆక్రందనల శోక గీతాలు నీ చెవినైనా తాకలేదా! వారి కోసం ఒక్క వాక్యమైనా ఎందుకు రాయలేదని నిలదీస్తాడు. నిన్ను 'మహాకవి' అనలేనని తెగేసి చెప్తాడు. మరొక కవితలో "ఇది బాధల వృక్షం, బోధి వృక్షంలాగా దీని వేళ్ళు భూమి లోలోపలికి పాకుతున్నాయి. అయితే బోధి వృక్షం పుష్పిస్తుంది. కానీ నా బాధల వృక్షం నిత్య శిశిరంలా ఆకులు రాలుస్తుంది" అని గుండెలు కరిగించే మెలాంకలీ రాగాన్ని పలికిస్తాడు. దళిత సాహిత్య ఉద్యమంలో దయాపవార్ ఎన్నో అద్భుతమైన ఆవిష్కరణలు చేశాడు. 1989లో హైదారాబాద్‌లో జరిగిన అఖిల భారత దళిత రచయితల మహాసభ నిర్వహణకు ఎంతో కృషి చేశాడు.

ఆ సభలో దళిత రయితల కర్తవ్యాన్ని గురించీ, దళిత సాహిత్యోద్యమం సాధించిన విజయాలను గురించీ సాధించవలసిన లక్ష్యాల గురించీ ఆయన ప్రసంగించారు.

భారత దళిత సాహిత్యోద్యమ చరిత్రలో మరచిపోలేని ముద్రలు వేసిన దయాపవార్ మన మధ్యన లేడు. కానీ ఆయన జీవితం, ఆయన సాహిత్యం, ఆయన భాగమై సాగిన ఉద్యమం, అది అందించిన మంచీ చెడూ అనుభవాలు మనతోనే వున్నాయి. రెండింటి నుంచీ తెలుగు సాహిత్యోద్యమం గుణపాఠాలు నేర్చుకోవాలి. ఇవాళ మనం చర్చోపచర్చల్లో గుండెలు బాదుకుంటున్న అనేక అంశాలను పాతికేళ్ల క్రితమే మహారాష్ట్ర దళిత సాహిత్యోద్యమం

చర్చించింది. ఎన్నో సత్యాలను ఆవిష్కరించింది. కవిత్వంపైనా, ఆత్మకథపైనా దళిత జెండాను ఎగురవేసింది. ఈ ప్రయత్నాలన్నింటిలోనూ దయాపవార్ అగ్రభాగాన నిలబడ్డాడు. దయాపవార్ నుండి దళిత సాహిత్యోద్యమం సాహితీ సృజన ఎలా చేయాలో నేర్చుకోవాలి. అదే విధంగా ఏమేం చెయ్యకూడదో కూడా నేర్చుకోవాలి.

ముఖ్యంగా కులవ్యవస్థ మీద నిప్పుల రక్తం కురిపించిన మరాఠీ దళిత సాహిత్యోద్యమం తర్వాత చీలికలు పీలికలయ్యింది. చిన్న పత్రికల ఉద్యమంతో పెద్దపెద్ద ప్రచురణా సంస్థల గుండెల్లో వణుకు పుట్టించిన సాహిత్యోద్యమం ఒకానొక వ్యవస్థగా ఘనీభవించింది. కొత్త సూరీళ్ళను పిడికెట్లో ధరించిన రచయితలు అవార్డుల కోసం, బిరుదుల కోసం, గుర్తింపుకోసం, ఒక పొగడ్త కోసం అకాడెమీల ముందూ, ప్రభుత్వాల ముందూ చేతులు కట్టుకు నిలబడిన దారుణమైన విషాదం మనం మరచిపోకూడదు.

దళిత సాహిత్యోద్యమం అంటే ప్రజాస్వామిక విలువల స్థాపనకోసం జరిగే ఉద్యమం అనీ, సాహితీ ప్రపంచానికి మహాకవుల, యుగకవుల బరువులు అక్కరలేదన్న ఒక మహోన్నతమైన విలువను ఆవిష్కరించిన దళిత రచయితలే ఎవరికి వారు ఒక్కొక్క ద్వీపంగా మారిపోయి, తమను తామొక మహాకవిగా అభివర్ణించుకొని, తమ చుట్టూ పొగడ్తల వర్షాలు కురిపించే బట్రాజుల గుంపుల్ని పోగేసుకొని అధికార పీఠాలుగా మొదలైన తర్వాత మరాఠీ దళిత సాహిత్యోద్యమం సాధించిన విజయాలన్నీ ఒక గత కాలపు ఘనకీర్తిగానే మిగిలిపోయిన చారిత్రక వాస్తవాన్ని మనం గుర్తుంచుకోవాలి. చరిత్ర నుండి గుణపాఠాలు నేర్చుకోలేని వాడు చరిత్రను నిర్మించలేడు.తన చలనశీలతకు తన కీర్తికాంక్షే అవరోధంగా మారే ఒక విచిత్రమైన సన్నివేశం నుండి దళిత సాహిత్యోద్యమం బయట పడాలి. చరిత్ర పునరావృతం కాకూడదు కదా.

ఈ ప్రయత్నాల్లో తెలుగు దళిత సాహిత్యోద్యమానికి దయాపవార్ ఒక సజీవ స్ఫూర్తి. ఆయన విజయాలనుంచీ, ఆయన వైఫల్యాల నుంచీ పాఠాలు నేర్చుకొని దళిత సాహిత్యం మరింత పరిపుష్టం కావాలి. ఇదే మనం దయాపవార్‌కు ఇచ్చే ఘనమైన నివాళి.

**వార్త 'సృష్టి' 26 అక్టోబర్ 1996**

దయాపవార్ కవిత

# ఓ మహాకవీ!

వాల్మీకీ!
నువు కవులకే కవివి కాబట్టి
మహాకవివి కాబట్టి
నువు రామరాజ్యపు
ఘనకీర్తినే గానం చెయ్యాలా?

నువ్వు పుట్టింది అంటరాని వెలివాడలోనే కదా!
నవ్వుల్నెరుగక, పువ్వుల్నెరుగక
విషాదం మూర్తీభవించిన ముఖాలు
బతుకులీడ్చే నికృష్టపు వాడలోనే కదా!
దుర్భర దారిద్ర్యమే
ఒక గుడిసెల సమూహంగా రూపొందినట్టు
అవమానాలతో నిలిచివుండే దళితవాడలోనే కదా!
నేల కూలిన క్రౌంచపక్షిగాయాలను చూసే
కరుణతో నిండిన నీ గుండె బద్దలై పోయిందే
మరి నిత్యమూ కష్టాలతో కన్నీళ్లతో కునారిల్లే
నీ జాతి జనాల ఆకలి కేకల ఆర్తనాదాలూ,
గుండె గాయాలూ, శోక గీతాలూ
నిజంగా నీకు విన్పించనే లేదా?
నువు కీర్తించే రామరాజ్యంలోనే
నీకు పేగుబంధం, నీ నెత్తుటి బంధువు
శంబూకుడు నేల కూలి పోయాడు కదా
ఆ ప్రవహించిన నెత్తుటి జ్వాలల స్పర్శ
నిన్ను తాకనైనా లేదా?
అయితే ఓ మహాకవీ!
నిన్ను మహాకవని ఎలా పిలిచేది
నీ జాతి అవమానాల పైన
ఒక్కటంటే ఒక్క వాక్యం రాసినా
నీ పేరును మా గుండెల మీద చెక్కుకొనే వాళ్ళం
వాల్మీకీ!
నిన్ను మహాకవి అని పిలువలేను.

**దయాపవార్ కవిత అనువాదం : కలేకూరి ప్రసాద్**

# చావులేని ఆశయాల ఆవాహనే సంస్మరణ

శంకర్ గుహనియోగిని హత్యచేశారు. ఎవరైనా ఒక మనిషి మాత్రుడిని ఎందుకు చంపుతారు? 'నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరుగు, ధన్యజీవులతో ఎవరికీ పేచీ వుండదు. కానీ కొందరు ప్రేమికులు ఉంటారు. నవనవోన్మేషంగా వికసించే పువ్వుల్ని ప్రేమిస్తారు. పసిపాపల ముఖాల్లో విరబూసే నవ్వుల్ని ప్రేమిస్తారు. మట్టిగడ్డల్లో, బొగ్గు పొరల్లో పరిమళించే మనిషితనాన్ని ప్రేమిస్తారు. అంతటితో సరిపెట్టుకోక తాము ప్రేమించే వాటి సహజ వికాసానికి అవరోధంగా నిలిచే శక్తులన్నింటినీ నిలువెల్లా ద్వేషిస్తారు. పేచీ అల్లా వీరితోనే. శంకర్ గుహ నియోగి మట్టిమనుషుల్ని ప్రేమించాడు. అందుకనే... కేవలం అందుకనే అతన్ని చంపేశారు. గని కార్మికుల కాలనీలో సారాకొట్టు పెట్టుకొని ప్రజల బలహీనతలను సొమ్ముచేసుకునే చిన్న వ్యాపారస్తుడి దగ్గర నుండి గని యజమానుల నుండి, అంతర్జాతీయ కుంభకోణాల్లో చిక్కుకున్న జాతీయ నాయకుల దాకా శంకర్ గుహనియోగి చచ్చిపోవాలని కోరుకొని అందుకు కుట్రచేసి అతని శరీరాన్ని తూటాలతో తూట్లు పొడిచారంటే నియోగికి కష్టజీవుల మీదున్న ప్రేమ ఎంతగా దోపిడీ దారుల పునాదుల్ని కదల్చివేసిందో అర్థం అవుతుంది. అయితే ఆయనను హత్యచేసిన 1991 సెప్టెంబర్ 28వ తేదీ నుండి శంకర్ గుహ నియోగి జీవించడం మొదలు పెట్టాడు.

ఎక్కడో అస్సాంలో పుట్టి, పశ్చిమబెంగాల్‌లో పెరిగిన నియోగి ఛత్తీస్‌గడ్ దుర్గ్ జిల్లాలోని తన బంధువులను చూడడానికి వచ్చాడు. అక్కడికి వెళ్ళిన తరువాత కేవలం తన అంకుల్ మాత్రమే కాక అక్కడి ప్రజలు కూడా తన బంధువులేనన్న విషయాన్ని గుర్తించాడు. ఆ గ్రహింపుకు అడ్డువచ్చే కులం, ప్రాంతం, వర్గం అనే అంశాలను ధ్వంసం చేశాడు. సన్నగా, సున్నితమనస్కుడిగా, బక్కపల్చగా వుండే శంకర్ గుహ నియోగికి ఖనిజ నిక్షేపాలతో అపారమైన వనరులతో నిండివున్న సంపన్నమైన ఛత్తీస్ ఘడ్ ప్రాంతం పేదలతో నిండివుండడం విచిత్రంగా అనిపించింది. బాధ్యతారహితులైన స్వార్థశక్తులు ఛత్తీస్‌ఘడ్ సహజ వనరులను పీల్చి పిప్పిచేస్తూ ఆ ప్రాంత ప్రజల అవసరాలను పట్టించుకోకుండా తమ సంపదను పెంచుకున్నారు. వారే ఆ ప్రాంత రాజకీయ, ఆర్థిక రంగాలను శాసించారు. అమితమైన సంపదను ఒనగూర్చే గనులు, పరిశ్రమలు, కలప డిపోలు ఎన్నివున్నా వీటన్నింటిలో బానిసలుగా బతుకులు వెళ్ళదీయాల్సిన దుర్భరమైన వాతావరణంలోకి ప్రజలు నెట్టబడ్డారు. 1959లో ఖిలాయ్ ఉక్కు కర్మాగారం వెలిసింది. ఐనా దీనివల్ల కాంట్రాక్టర్లు బాగుపడ్డారే తప్ప స్థానిక ప్రజల జీవన స్థితిగతుల్లో ఏవిధమైన మార్పు రాలేదు. ఉన్న కార్మిక సంఘాలు, ఉద్యమాలూ కాంట్రాక్టర్ల చెప్పుచేతల్లో నడిచేవి. కార్మిక నాయకులు కాంట్రాక్టర్ల కటాక్ష వీక్షణాల కోసం పడిగాపులు కాసేవారే.

ఈ పరిస్థితుల్లో నియోగి ఛత్తీస్‌ఘడ్ ప్రాంతంలో కాళ్ళూని, ఆ ప్రాంత ప్రజల భాష తెలుసుకొని, బాధలు తెలుసుకొని వారిలో ఒకడిగా కలిసిపోయాడు. భిలాయ్ ఉక్కు కర్మాగారంలో కార్మికుడిగా పనిచేస్తూ బ్లాస్ట్ ఫర్నేస్ యాక్షన్ కమిటీ అనే సంఘాన్ని స్థాపించాడు. అన్యాయాలను సహించలేనివాడిగా ప్రతి సమస్యపైనా స్పందించి ఉద్యమాలు నిర్మించాడు. కార్మిక నాయకుడంటే కాస్తో కూస్తో సొమ్ము చేసుకొని, పైరవీలు చేసి ఏదో ఒక రాజకీయ పార్టీ ప్రాపకం సంపాదించి యువజన నాయకుడిగా ఖద్దరు బట్టలేసి మెలమెల్లగా పార్టీ టికెట్ సంపాదించి ఎమ్మెల్యేగానో, స్థానిక నాయకుడిగానో ఎదగడం ఒక క్రమం. అయితే శంకర్ గుహ నిజంగానే కార్మికుల అభ్యున్నతికోసం విముక్తికోసం ఉద్యమించడం ప్రారంభించాడు. దాంతో దోపిడీ యంత్రాంగానికంతటికీ అతను చంపదగిన వ్యక్తిగా మారిపోయాడు. పోలీసుల వేధింపు మొదలైంది. చిత్రహింసలు మొదలయ్యాయి. మంచి మనిషిగా ఎవరు జీవించినా తట్టుకోలేని వ్యవస్థ అతన్ని వెంటాడింది.

ఆ పరిస్థితుల్లో శంకర్ గుహ నియోగి ఒక శక్తివంతమైన కార్మిక సంఘాన్ని (ఛత్తీస్ ఘడ్ మైన్స్ శ్రామిక సంఘ్) స్థాపించి దానికి నిర్వహణ కార్యదర్శిగా పనిచేశాడు. 1977 నుండి తాను చనిపోయే వరకూ 15 సంవత్సరాల పాటు ఆయన నడిపిన కార్మికోద్యమం భారతదేశంలో విముక్తి ఉద్యమం ఏవిధంగా జరగాలో భారత ప్రజలకు తెలియజెప్పింది. అతనికి కార్మికోద్యమం అంటే 'ఫ్యాక్టరీగేటుకు, ఎనిమిది గంటల షిఫ్ట్ కాలానికి' పరిమితమయ్యేది కాదు. కేవలం ఫ్యాక్టరీలోని సమస్యలకు మాత్రమే పరిమితమైంది కాదు. శంకర్ గుహ నియోగి మొట్టమొదటి సారిగా కార్మికోద్యమం అంటే జీవితంలోని అన్ని కోణాలనూ పరిగణలోనికి తీసికొని వాటి అంతస్సంబంధాలనూ గ్రహించి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, వ్యక్తిగత జీవన రంగాలన్నింటిలోనూ ఏకకాలంలో పోరాటం మొదలుపెట్టాడు. ఆర్థిక దోపిడీకి వ్యతిరేకంగా పోరాటం చెయ్యవలసిన అవసరాన్ని గుర్తిస్తూనే అది మాత్రమే చాలదని కార్మికుడు ఏకకాలంలో కార్మికుడుగా వుంటూనే గిరిజనుడిగా కూడా వుంటున్నాడు. గిరిజనుడు ఆత్మగౌరవంతో తలెత్తుకోకుండా సమగ్ర సామాజిక అభివృద్ధి కోసం జరిగే ఉద్యమంలో భాగస్వామి కాలేడు. అంటే ఒకేసారి సాంస్కృతిక సామాజిక, ఆర్థిక దోపిడీలకు వ్యతిరేకంగా పోరాటం చేయాలి అని నిశ్చయించుకున్నాడు.

ఇది నియోగి సామాజిక తత్వ శాస్త్రం. దాన్ని ఆచరణలో పెట్టుకోడానికి ఆయన ఛత్తీస్‌ఘడ్ ప్రాంతంలో కార్మికోద్యమం నిర్మించాడు. కేవలం ఫ్యాక్టరీలకు, గనులకూ మాత్రమే పరిమితమైతే ఉద్యమం బతకలేదని తన ఉద్యమాన్ని గ్రామాలకు విస్తరింపజేశాడు. పోరాట ఫలితాలు నిలబడాలంటే కార్మికుల ఆదాయాన్ని కొల్లగొట్టే ఇతర అంశాలపైనా పోరాటం చెయ్యాలని ఆయన గుర్తించాడు. సారా, జూదం, వ్యాపారమై పోయిన వైద్య విధానం వీటన్నింటి మీద ఆయన ఉద్యమాన్ని నిర్మించి పోరాటం చేశాడు. పర్యావరణ ఉద్యమం,వైద్య

ఉద్యమం ఆయన ఉద్యమంలో అంతర్భాగమయ్యాయి.

పద్నాలుగేళ్ళపాటు ఏ విధమైన చీలికా లేకుండా గ్రీన్ రెడ్ ఫ్లాగ్ ఉద్యమం కొనసాగింది. శంకర్ గుహను హత్యచేసినా అది కొనసాగుతూనే వుంది. శంకర్ గుహ జీవితం, ఉద్యమాన్ని ఒక ఉద్విగ్నస్మృతిగా భరత్ డోగ్రా చిన్న పుస్తకంలో చిత్రించారు. దాన్ని మల్లెపల్లి రాజం మెమోరియల్ ట్రస్ట్ గోదావరిఖని వారు "జీవితమే ఉద్యమమై..." అనే పేరుతో ముద్రించారు. దీన్ని కాసుల ప్రతాపరెడ్డి అనువదించారు. దీని వెనుక ఒక సమగ్రమైన సామాజికతత్వ శాస్త్రాన్ని ప్రజల ఆచరణగా అనువదించాలన్న తపన అంతసూత్రంగా పనిచేసింది.

శంకర్ గుహ జీవితం నుండి, ఉద్యమంనుండి, త్యాగశీలత నుండి మనం ఎన్నో పాఠాలు నేర్చుకోవాల్సి ఉంది. మహావిముక్తి ఉద్యమాలు నేర్చుకోవడానికి సిద్ధపడినా లేకపోయినా దళిత ఉద్యమం మాత్రం ఖచ్చితంగా శంకర్ గుహ స్ఫూర్తిని ఆయన ఉద్యమంలో సాధించిన సమగ్రతనూ స్వంతం చేసుకోవలసిందే. చావులేని ఆశయాలను ఆవాహన చేసుకోవడమే కదా సంస్మరణ.

జీవితమే ఉద్యమమై... పుస్తకాన్ని ప్రచురించడం ద్వారా మల్లెపల్లి రాజం మెమోరియల్ ట్రస్ట్ ఆ కర్తవ్యాన్ని సాధించింది. గతం నుండి పాఠాలు నేర్చుకోని ఉద్యమమేదీ అభివృద్ధి చెందదు. మరీ ముఖ్యంగా అయా ఉద్యమాలు ఆవిష్కరించిన సత్యాలను స్వీకరించకుండా ఏ ఉద్యమం ముందుకు సాగదు. దళిత ఉద్యమానికి శంకర్ గుహ ఒక చైతన్యాయుధం.

**అక్టోబర్ 1996 ఏకలవ్య సౌజన్యంతో**

# మనిషితనం తప్ప ఏమీ తెలియని ఒట్టి చేతల మనిషి...

ఎలామరణించాలో తెలిసిన మనిషికి, ఎలా జీవించాలో తెలుస్తుంది అంటారు కబీర్. మనిషి మరణం అతను జీవించిన విధానాన్ని తెలియజేస్తుంది. జీవితం మరణంలో ప్రతిఫలిస్తుంది.

భారత సామాజిక విప్లవ కారుడు మహాత్మ జ్యోతిబా ఫూలే తన మరణ శయ్యపై వుండి, తుది శ్వాస విడవడానికి సిద్ధంగా వున్నప్పుడు, ఆయన మిత్రుడు, ఆయన దగ్గరకొచ్చి "జోతిబా! నీకింకా తీరని కోరికలేమైనా ఉన్నాయా? చనిపోవడానికి భయపడుతున్నావా?" అని అడిగాడు. అప్పుడు జ్యోతిబా "నేను చేయవలసినదంతా చేశాను. నా మరణం నా కర్తవ్యాన్ని నిలువరించలేదు. ఇకముందు నా ఆశయాలను, కర్తవ్యాలను నా సహచరులు, సన్నిహితులు, అనుచరులు కొనసాగిస్తారు. ఇప్పుడు నేను నిశ్చింతగా మరణించగలను" అని చెప్పాడు... ఈమాటలు చెప్పడానికి ఎంతో గుండెదిటవు కావాలి. చావు బతుకుల మధ్య ఒక సన్నటిగీతగా విస్తరించిన జీవన రహస్యాలు తెలిసివుండాలి.

ఇటీవల మనలను విడిచి వెళ్ళిపోయిన మహాతత్వవేత్త బొడ్డు రామకృష్ణ గారిని ఎవరైనా ఇటువంటి ప్రశ్నలు అడిగారో లేదో తెలియదు. ఆయన ఏమి చెప్పి వుండేవాడో తెలియదు. అయితే మరణించేంతవరకు ఆయన చేతల ద్వారానే తన మాటలను ప్రపంచానికి అందించాడు. ఒక సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా, మహాపండితుడుగా పేరు ప్రఖ్యాతులు గాంచే అవకాశం వుంది ఆయనకు. ఎంతో ధనరాశులను పోగు చేసుకునే అవకాశం వుంది ఆయనకు. ఎన్నో సన్మానాలను పొందే అవకాశం వుంది. మహాధనవంతుల, అధికారుల, మంత్రుల, ప్రభుత్వాల ప్రాపకం పొందే అవకాశం వుంది ఆయనకు. అయితే ఆయన కొన్ని విలువలకు కట్టుబడిన మనిషి తన జీవితాన్ని కొన్ని ఆశయాలతో గడపాలని నిర్ణయించుకున్న మనిషి. కేవలం మాటలు మాత్రమే చెప్పి జీవితం మరో విధంగా వున్నా ఫరవాలేదనుకొని బతుకులు కీర్తి కండూతి కోసం కబేళాలలో వేలాడదీసే మనుషుల కాపట్యాన్ని నిలువునా నిరశించిన మనిషి. అందుకే కళాశాలల విద్యావిధానం ఆయనకు నచ్చలేదు. ప్రిన్సిపాల్ ఉద్యోగానికి రాజీనామా చేశాడు. సంపద సమకూరే మార్గాలను తిరస్కరించాడు. అమ్మా, నాన్నలు లేని పిల్లలకు ముందుగా అమ్మతనాన్ని, తరువాత తండ్రితనాన్ని పంచిపెట్టాడు. కొంచెం మంచితనం, కొంచెం ఆర్థిక వనరులు వున్న ఎవరైనా చేయగలిగిన పనే ఇది. ఆయన ఉద్దేశ్యం కేవలం దాతృత్వం, ధర్మ కర్తృత్వం కాదు. ఆయన ఆశయం మొత్తం సమాజానికి కాయకల్ప చికిత్స చేసి హేతువుపైన ఆధారపడిన సశాస్త్రీయమైన రక్త కణాలను మానవుల రక్తనాళాలలోకి ఎక్కించడం.

ఆశయాలను, విలువలను ప్రకటించుకొన్న చాలా మంది మనకు తెలుసు. కానీ అవకాశాలకోసం, వాటికి తిలోదకాలు ఇచ్చి, దారితప్పి అందుకు రకరకాల సాకులు చెప్తున్న వాళ్ళను చూస్తున్నాం. అయితే రామకృష్ణగారు ఆచరణశీలియైన భౌతికవాది. ఇతరుల విషయంలోను, తన స్వంత విషయంలోను ఎన్నడూ రాజీపడని వ్యక్తి. అందుకే చార్వాకుల దగ్గర నుండి అంబేద్కర్ దాకా ఆయన ప్రేమించని మనుషులే లేరు. మతం సాధికారిత నిచ్చిన కుల వ్యవస్థను ఆయన తీవ్రంగా ద్వేషించాడు. కుల నిర్మూలన జరగాలంటే, కులాంతర వివాహాలు జరగాలన్న అంబేద్కర్ మాటను ఆచరణలో పెట్టడానికి ఆయన స్వయంగా ఎన్నో కులాంతర వివాహాలు నిర్వహించాడు. మరొక ముఖ్యమైన విషయం ఈ దేశంలో కేవలం ఆర్థిక విప్లవం మాత్రమే వస్తే చాలదని, లేదా సామాజిక విప్లవం మాత్రమే వస్తే చాలదని, సాంస్కృతిక విప్లవం వచ్చిన రోజునే సామాజిక పరివర్తన సాధ్యమవుతుందని ఆయన భావించాడు. సమాజంలో కొనసాగుతున్న మతమౌఢ్యాన్ని, మతం పేరుతో కొనసాగుతున్న అరాచకాలను, అకృత్యాలను అరికట్టాలంటే, ఒక ప్రజాస్వామిక, ప్రత్యామ్నాయ సాంస్కృతిక ప్రచారం చేయాలని ఆయన ఆలోచించాడు. కేవలం ఆలోచనతోనే ఆయన ఆగిపోలేదు. ఆయన ఆచరణశీలి. ముందుగా విద్యను సంస్కరించాలని మంగళగిరి సమీపంలోని నిడమర్రు గ్రామంలో "చార్వాక విద్యాపీఠం" నెలకొల్పాడు. అది మానవీయ విలువలు ప్రబోధించే, విద్యనందించే ఒక పాఠశాల మాత్రమే కాదు. నిడమర్రులోని చార్వాక విద్యాపీఠాన్ని సందర్శించిన వారెవరైనా ముందుగా ఆశ్చర్యపోతారు. ఉదాహరణకు, గేటు దగ్గరకి వెళ్ళగానే మనకు వేమన విగ్రహం కన్పిస్తుంది. అందరికీ తెలిసిన వేమన బట్టలూడ తీసుకొని దిగంబరుడై పిచ్చివాడులాగా తిరిగేవాడు. కానీ ఇక్కడ వేమన నిండు బట్టలతో, మేధో తేజస్సుతో కన్పిస్తాడు. ప్రపంచమంతా శ్రీరాముని పూజిస్తుంటే ఇక్కడ పరమసాత్వికుడైన రావణబ్రహ్మ విగ్రహం కన్పిస్తుంది. పురాణాలు పరమ వికృతంగా చిత్రించిన శూర్పణక మహా సౌందర్యరాశియైన యోధురాలుగా కన్పిస్తుంది. జ్యోతిరావ్‌పూలే, సావిత్రిబాయి పూలే, అంబేద్కర్‌లు కనిపిస్తారు. ఒక ప్రత్యామ్నాయ సంస్కృతిని సమాజానికి అలవాటు చేయడానికి ఆయన అహర్నిశలు తపించాడు. ఆయన శిష్యులుగా చెప్పుకున్న చాలామంది హేతువాదులుగా ప్రకటించుకొని, స్వార్థ ప్రయోజనాల కోసం దానికి భిన్నంగా ప్రవర్తించినపుడు వారిని బహిరంగంగా విమర్శించడానికి, ఖండించడానికి ఆయన ఏ మాత్రం వెనుకాడలేదు. మూలవాసుల్ని చంపిన ఆర్యులు చేసుకొనే పండుగలు, పబ్బాలకి ప్రత్యామ్నాయంగా ప్రతి సంవత్సరం ఫిబ్రవరి రెండవ శనిఆదివారాలలో ఆయన నాస్తికమేళాలు నిర్వహించేవాడు. ప్రకటించుకొన్న ఆశయాలకోసం తన జీవితాన్నంతటినీ కొవ్వొత్తిగా కరిగించుకున్న ఆ మహామనిషి ఇప్పుడు మన మధ్య లేడు. బహుశా, ఇప్పుడు ఆయన పేరుతో సంతాపసభలు జరుపుతారు. ఆకాశమంత ఎత్తు ఎదిగిన ఆయన భుజం మీద చెయ్యివేసి మేమంతా

ఒకటేనని చెప్పుకోవడానికి ప్రయత్నిస్తారు. సమాధుల మీద మొలిచిన మైకు కోకిలలు గొంతులు చించుకొని భోరున ఏడుస్తాయి. చందాల వసూళ్ళ కార్యక్రమం కూడా బహుశా మొదలు కావచ్చు. గుంట నక్కలు, మంత్రగాళ్ళు తమను తాము ఆయన వారసులుగా ప్రకటించుకుంటారు.

కానీ ఆయన స్థాపించిన చార్వాక విద్యా పీఠం ఆయన ఆశయాలకు ప్రతీకగా నిలిచేవుంది. దాని స్ఫూర్తిని కొనసాగించడమే మనం ఆయనకిచ్చే నిజమైన నివాళి.

కొంతమంది జీవించి మృతప్రాయులుగా బ్రతుకుతారు. రామకృష్ణగారు మరణించి ఒక సజీవ ఆశయంగా, ధృవతారగా వెలుగుతూనే ఉంటారు. ఆ వెలుతురుని ఆవాహన చేసుకోగలిగిన నిబద్ధత, సత్తా, దమ్ము, ధైర్యం కల్గిన తరం ఇప్పుడు కావాలి! ఆ తరానికి స్వాగతం!!

**2007 మే - బహుజన కెరటాలు సంపాదకీయం**

# దళితుల గుడిసెల్లోనా...
# వెలిగిన చందామామా!

**"గాలి కాలుష్యం... నీరు కాలుష్యం... ఈ నాగకరికత కాలుష్యం**
**ఈ ప్రజాస్వామ్యం కాలుష్యం... మన సోషలిజం కాలుష్యం**
**ఆక్సిజన్‌లో మోనాక్సైడ్ ....వాటర్‌లో క్లోరైడ్**
**నాగరికతలో వేదాంతం.... ప్రజాస్వామ్యంలో మోనార్కిజం**
**.....సోషలిజంలో క్యాపిటలిజం**
**కాలుష్యం కానిదేది? దేశంలో భ్రష్టుపట్టని పదార్థమేది? ఆలోచనేది?**

**– అమరుడు సాహు**

సాహు చచ్చిపోయి అప్పుడే నాలుగేళ్ళయి పోయింది. అతను మన మధ్య లేడు. కానీ అతను మన ముందుంచి పోయిన ప్రశ్నలు మాత్రం... సకల రంగాలనీ ఆవరించిన కాలుష్యంపైన అతను ప్రకటించిన అసహనం మాత్రం ఆశలు తీరని పూర్వీకుడి ఆత్మలాగా మన అంతరంగాలనూ, మన కార్యాచరణనూ నిలదీస్తూ తిరుగాడుతోనే వున్నాయి. అతనిప్పుడు మన మధ్యన లేడు.అతని పాట వుంది. వీధుల్లో అనాథ బాల్యపు ఆగచాట్లు గమనించినప్పుడో... పల్లెపల్లె గుడిసె నడుమ పొడిచే చందమామపైన చీకటి మేఘాలు ముసురుకున్నప్పుడో, ఏ కొండ చెక్కిళ్ళ మీదనో ఎండిన కన్నీటిచారికలు కన్పించినప్పుడో బిరుసు యిసుక తిన్నెల్లో అంతరించిపోయిన ఒయాసిస్సుల జాడలు కదులాడినప్పుడో గుండెలు కలుక్కుమని అతను తలపుకొస్తాడు. అతని స్మృతులు మదిలో మెదలగానే నిరంతరాయంగా తుడుముల మోత విన్పిస్తుంది. కానీ అతను నడిచి వచ్చిన బాండేబాట ఎక్కడో మూసుకుపోయిన చప్పుడు. అతను రగిలించిన చేతనా జ్వాల ఏ కొత్త సమాధిమీదనో మిణుకు మిణుకుమంటున్న దృశ్యం. "ఉన్మత్త శస్త్రకారుడొకవైపు... వనమూలికల వైద్యుడొకవైపు... శిలాప్రభువు సాక్షి".

"సాహూ! నువు రగిలించిన వెలుగు దివ్వె ఇంకా ఆరిపోలేదు అంటూ ఏ దగ్ధ హృదయమో దిగంతాలనుండి వేసిన పెనుకేక నీరసరాగమై విన్పిస్తోనో వుంటుంది. బహుశా ఏ గోండు గూడెమో గుండెలు బద్దలై కొట్టుకుంటూ వుండి వుంటుంది. బహుశా ఏ అర్ధరాత్రో ఉలిక్కిపడి లేచి సాహు గుర్తుకొచ్చి అల్లం నారాయణ వెక్కి వెక్కి ఏడుస్తూ వుంటాడు. బహుశా చచ్చుబడిన చేతులతో జలజలా రాలిపడిన జ్ఞాపకాలను అక్షరాల్లోకి ఎత్తుకోడానికి విఫల ప్రయత్నాలు చేస్తూ అల్లం రాజయ్య నిట్టూర్పులు విడుస్తూ వుంటాడు. సాహు సాంస్కృతిక విప్లవ దళపతిగా విజయ కవాతులు చేస్తుంటే ఒక పెను ఊరేగింపై సాగిపోవాలని కలలు కనీకనీ ఒక్కసారిగా సాహు అంతర్ధానమైపోతే తట్టుకోలేక మస్తిష్కంలో ఏ వాయులీనం తంత్రులో పుట్టుకున్న తెగిపోతే భ్రమలు తీరని పిచ్చికేకలేవో వేస్తూ బి.ఎస్.రాములు ఉన్మత్తంగా పలవరింతల

వరదై బహుశా కరిగి పోతుండవచ్చు.

కానీ మనం చాలా అదృష్టవంతులం. ఎన్నో విషయాలు, రెటీనాకీ మస్తిస్తానికీ మధ్య రెపరెపలాడుతుండగానే మర్చిపోగలం. ఎవరూ పట్టక సుదూరాల్లోకి పరుగులు తీస్తున్న వాణ్ణి చూపిస్తాం. ఎన్ని విస్ఫోటనాలు జరిగినా నిద్రలేవని వాణ్ణి చూపిస్తాం. తప్పంతా ఇద్దరిమీదకీ తోసేసి ఆత్మహనన పద్యాల్లోకి నిర్వ్యాపకంగా కూరుకుపోతాం. మహా అయితే ఏమీ చేయలేని తనానికి కాసేపు వాళ్ళనీ వీళ్ళనీ కలిసి "ఏం చెయ్యలేక పోతున్నాం వాళ్ళు చూడు వీళ్ళు చూడు' అంటూ మన నిష్క్రియాపరత్వానికి కారణాలని ఎవరి మీదనో మోపి మరువలేని బాధలోని తియ్యదనాలను ఆస్వాదిస్తూ కూర్చుండి పోతాం.

కానీ సాహు మనల్ని ఊరికే వదలడు. అదొక దెయ్యపు సుడిగాలి ప్రశ్న. చచ్చిపోతూ చచ్చిపోతూ సాహు మన ముందుంచిపోయిన ప్రశ్నలను మహోద్యమాలేవీ పట్టించుకోవు నిజమే. కానీ బతుకులో మార్పు అవసరమైన మనం గూడా... బతుకే ఒక ఎడతెగని పోరాటమై పోయిన మనం కూడా మర్చిపోతే ఎలా? పెను మార్పుల్ని సాధిస్తానని ప్రకటించుకున్నవాడు ఎదురైన బతుకు వాస్తవికతల్ని తప్పించుకోవడానికి విఫల ప్రయత్నాలు చేస్తున్నాడు. బతుకు వాస్తవాల నుండి మొదలైనవాడు "ఊర్ధ్వముఖుడై రాజ్యాలను అనుకరిస్తాడు" పేర్లనవసరం. మనందరం ఎన్ని ప్రగల్భాలు పలికాం.

ఎన్ని ప్రకటనలు చేశాం. ఏమై మిగిలాం? అగ్రకుల దుర్మార్గపు రాజ్యాన్ని వ్యతిరేకించకుండా, ఏ రాజీ లేక ఆధిపత్య పీఠాలను కూల్చకుండా, మనమీద మనం ఎడతెగని పోరాటాన్ని ప్రకటించకుండా బతుకు మూలమూలల్లో పేరుకుపోయిన చీకటి సామ్రాజ్యాలను తునాతునకలు చెయ్యకుండా ఒక నిరంతర సంఘర్షణా జ్వలనంలో ఏ ఆధిపత్యపు అచ్ఛాదనలు లేని వట్టి మనిషిని ఆవిష్కరించకుండా మనం బతికేదెందుకు? బతుకు ప్రత్యేకతలే పట్టని విప్లవోద్యమం, దోపిడీ రాజకీయాలనే అనుకరిస్తూ దళిత ఉద్యమం.. రెండూ సరిచేసుకొని కులవర్గ నిర్మూలనకోసం దళిత ప్రజాస్వామిక విప్లవం జరగాలన్నది సాహు స్వప్నం. మనకు ఎంతో తెలివి. ఈ అంశం తప్ప అన్ని విషయాలూ మాట్లాడుకుంటున్నాం.

సాహూని నిజంగా ప్రేమించడమంటే సాహూ వదిలిపోయిన ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించడం. సాహూని నిజంగా సజీవ స్మృతిగా మార్చుకోడమంటే సాహూ సూచించిన మార్గాల్లో కార్యశీలురమై సాగిపోవడం. మన బతుకుల్లోకీ, మన పెనుగులాటల్లోకీ ఒక మంటల ఊరేగింపై సాహూని ఆవాహన చేసుకోనవసరం లేదా? ఇకనైనా సాహు మనముందుంచిన విమర్శలను ఆత్మవిమర్శగా స్వీకరించి మనల్ని మనం మార్చుకోవలసిన అవసరం లేదా? అసహనపు ఆవేదన నుండి మనల్ని మనం విముక్తి చేసుకోనవసరంలేదా? ఈ క్రమానికి శనిగరం వెంకటేశ్వర్లు ఎలియాస్ సాహు సాంస్కృతిక విప్లవ దళపతి.

మళ్లీ తుడుం మోత మోగిద్దాం రా. మళ్ళీ బాండేబాట రగిలిద్దాం రా. మన గూడేల్లో మన వాకిళ్లల్లో అడుగుల్లోకి చిందు తొక్కుతూ నడచి రా... సాహూ అమర్ రహే!

**ఏకలవ్య సౌజన్యంతో**

# దగ్ధమైనా సరే సూర్యుడినే కౌగలించుకున్నవాడు

మన లోపలి సముద్రాల మీద అవిశ్రాంత యుద్ధం ప్రకటించిన వాణ్ణి క్షమించలేం. మరీ ముఖ్యంగా మన ముందొక ప్రశ్నల నిలువుటద్దాన్ని నిలబెట్టి పదేపదే మన బోలుతనాన్ని గుర్తుచేసే వాణ్ణి అసలు క్షమించలేం. బహుశా అందుకే వ్యవస్థలేవీ త్రిపురనేని శ్రీనివాస్‌ను క్షమించలేవు.

చిన్నవైనా, పెద్దవైనా గోడల్ని పగులగొట్టడం వాడు తీసుకున్న కాంట్రాక్టు. అందుకే ఇరుకుగోడల మధ్య నిర్బంధపు జీవితాల్ని గడుపుతున్న మానవులకు అతను ఆత్మీయుడయ్యాడు. స్త్రీవాదులు పురుషుల జోక్యాన్ని సహించరని ఒక అపోహ వుంది. అలాగే దళితులు అగ్రకులస్తులకు వ్యతిరేకులని మరో అపోహ వుంది. ఒక పురుషుడై వుండీ, ఒక అగ్రకులస్థుడై వుండీ శ్రీనివాస్ ఇద్దరికీ సన్నిహితుడూ, ప్రేమపాత్రుడూ, ఆత్మీయుడూ అయ్యాడు. ఓల్గా, శివసాగర్, ఇతర దళితకవుల ప్రతిస్పందనే అందుకు తార్కాణం. త్రిపురనేని శ్రీనివాస్ అనే ఒక అగ్రకుల మిత్రుడికోసం లెక్కలేనన్ని దళిత స్మృతిగీతాలను దళిత కవులు రాస్తున్నారు. బహుశా ఇది ఏ ఇతర భాషల చరిత్రలోనూ లేదు.

తనకుతాను ఎవరూ నియమించని ఒక సాహిత్యోద్యమ కార్యకర్తగా ప్రకటించుకొని దళిత స్త్రీవాద ఉద్యమాల కర్తవ్యాలను భుజాన వేసుకున్నాడు. చాలామందికి బతుకొక మెడమీద కాడి. కానీ త్రిశ్రీకి సృజనాత్మకంగా లేని బతుకు బతుకు కాదు.

నవ్వుతున్నట్టే వుంటాడు, సరదాగా మాట్లాడుతున్నట్టే వుంటాడు, ఉండీ వుండీ అందమైన పదాలతోనే అవే అందమైన నవ్వులతోటే 'భూమ్యాకాశాల మధ్య ఎవరిపాట వాళ్ళు రాసుకోవాలి' అంటాడు. స్వంత బాధల్ని, స్వంత కలల్ని స్వంత భాషలో రాయండ్రా అని కవుల్ని దబాయిస్తాడు.

"అప్పుడే తెల్లవారెను.......' అన్నట్లు గాకుండా 'అతనికి పదిరోజులుగా జిగట విరేచనాలు' అనే వాక్యంతో కథ మొదలు పెట్టే దమ్ముందా అని కథకుల్ని నిలదీస్తాడు. సాంప్రదాయాల మూసలంటే వాడికి ద్వేషం. అందుకే అతను పోరాడే దళిత బహుజన శక్తులకు అంత దగ్గర వాడయ్యాడు. ఒంగోలులో జరిగిన విరసం మహాసభల్లో బాధ్యతా రాహిత్యం ఆరోపణతో అతన్ని బహిష్కరించారు. పురాణం సుబ్రహ్మణ్యశర్మ సంపాదకుడిగా ఉన్నంతకాలం ఆంధ్రజ్యోతిలో రచనలు చేయకూడదన్న విరసం తీర్మానాన్ని ఉల్లంఘించాడన్నది అతని బాధ్యతా రాహిత్యం. అటువంటి శ్రీనివాస్ ఎవరూ ఆదేశించకుండా ఇన్ని బాధ్యతల్ని ఇంతే చిన్న వయస్సులో ఎలా నిర్వహించాడన్నది ఆశ్చర్యకర అంశమే. ఏ పత్రికనైతే బహిష్కరించాలని

‘విప్లవ శక్తులు’ భావించాయో అదే పత్రికను బహిష్కృత కంఠాలకు వేదికగా మలచాడు శ్రీనివాస్. ఇది ‘ఆంధ్రజ్యోతా, దళిత జ్యోతా’ అని ఆశ్చర్యపోయేంతగా పత్రికను దళిత సాహిత్యం దగ్గరకు తీసుకువచ్చాడు. అది శ్రీనివాస్ ప్రత్యేక కత. అది శ్రీనివాస్ నిబద్ధత.

దళిత బహుజన ప్రపంచం ఒక నమ్మదగిన మిత్రుడ్ని కోల్పోయింది. తమ కలల్లోనూ, అవసరాల్లోనూ, ఆవాసాల్లోనూ తన ఖాళీని అలాగే వుంచేసి శ్రీనివాస్ వెళ్ళిపోయాడు.

**‘విలువల్ని భగ్నం చేయటమే**
**జీవితమైనప్పుడు**
**మృత్యువును కౌగలించుకునైనా మాట నిలబెట్టాలి’**
**అన్న శ్రీనివాస్ తను మరణించిందాకా అదేమాటమీద ఉన్నాడు.**
**‘వెన్నెల కురిసినా చంద్రుణ్ణి**
**ప్రేమించలేను**
**దగ్ధమైనా సరే**
**సూర్యుడినే కౌగలించుకుంటాను’ అంటూ**

దళిత సూర్యోదయంతో పెనవేసుకుపోయిన శ్రీనివాస్ మాటలు మనకాదర్శం. తాను ఏ దుర్మార్గపు విలువల్ని భగ్నం చేయాలనుకొని బతుకంతా ఘర్షణ పడ్డాడో ఆ విలువలపైన పోరాటంలోనే దళిత బహుజన శక్తులు శ్రీనివాస్ స్ఫూర్తిని బతికించుకుంటాయి.

సెప్టెంబర్ **1996** : ఏకలవ్య సౌజన్యంతో

# డా.కె.ఆర్. నారాయణన్ అమర్ రహే

"మన సమాజపు అట్టడుగు పొరల నుండి మొలకెత్తి ఈ పవిత్ర భూమి ధూళీ దూసరలో పెరిగిన ఒక వ్యక్తిని దేశంలోని అత్యున్నత పదవికి ఎన్నుకోవాలని జాతియావత్తూ ఏకగ్రీవంగా భావించడం అనేది సామాన్య మానవుడి ఆశలు, ఆకాంక్షలు, అతనికి చెందిన అంశాలు దేశ సామాజిక రాజకీయ జీవితపు కేంద్ర స్థానానికి చేరుకొనడానికి ప్రతీక. రాష్ట్రపతిగా నేను ఎన్నిక కావడం ఈ నేపథ్యంలో జరిగినందుకు నేను ఎంతగానో ఆనందిస్తున్నాను. నాకు లభించిన వ్యక్తిగత గౌరవం కన్నా అదే నన్ను అమితంగా సంతోషపరుస్తుంది".

1997 జులై 25వ తేదీన పార్లమెంటు సెంట్రల్ హాలులో రాష్ట్రపతిగా ప్రమాణ స్వీకారం చేసిన సందర్భంగా డాక్టర్ కె.ఆర్. నారాయణన్ పై మాటలు చెప్పారు. 1920 అక్టోబర్ 20వ తేదీన కేరళలోని కొట్టాయం జిల్లా ఉజవూర్‌లో పుట్టి 2005 నవంబర్9వ తేదీన న్యూఢిల్లీ ఆర్మీ రీసెర్చి అండ్ రిఫరల్ ఆస్పత్రిలో మరణించే వరకూ కొచెరిల్ రామన్ (కె.ఆర్.) నారాయణన్ జీవితమంతా పై మాటల సారాంశమే ప్రతిఫలించింది. ఆయన తన ఎనభై ఐదు సంవత్సరాల జీవితాన్ని ఎంతో అర్థవంతంగానూ, స్ఫూర్తిదాయకంగానూ గడిపారు. విద్యావేత్తగా, దౌత్యవేత్తగా, రాజనీతిజ్ఞుడిగా, మానవతా వాదిగా ఆయన తన జీవితం ద్వారా సమకాలీన సమాజం పైన తనదైన ప్రభావాన్ని వేసి ఎన్నో అనుసరణీయమైన సందేశాలను యిచ్చారు. ముఖ్యంగా రాష్ట్రపతి పదవి ఆయన్ని అలంకరించి తనను తాను గౌరవించుకొన్నది. రాష్ట్రపతి పదవిని ఏ విధంగా నిర్వహించవచ్చునో ఆయన పునర్నిర్వచించారు.

ఇప్పుడు ఆయన మన మధ్యన లేరు. మనిషి మరణం బాధాకరమైన అంశమే. అయినా వారి స్మృతి బతికివున్న మనుషులను నడిపించే సజీవ స్ఫూర్తిగా వుండేలా జీవించిన వారు జాతి జీవితంలో పెనవేసుకుపోతారు. మన దేశ చరిత్రలో డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ తర్వాత డాక్టర్ కె.ఆర్.నారాయణన్ పేరే అతి కాంతివంతంగా కన్పిస్తుంది. అడ్డంకులను అధిగమిస్తూ ఆత్మగౌరవాన్ని కాపాడుకొంటూ అపారమైన ప్రతిభాపాటవాలను ప్రదర్శిస్తూ తాము అనుకున్నదాన్ని సాధించడంలో ఇద్దరికీ అనేక పోలికలున్నాయి.

కొచ్చెరల్‌రామన్ వైద్యాల్ ఏడుగురి పిల్లల్లో నాల్గవ కుమారుడు కె.ఆర్. నారాయణన్. తండ్రి సంప్రదాయ సిద్ధ, ఆయుర్వేద వైద్యుడు, అంటరాని దళిత (పరవన్) కులం తాలూకు అవమానాలు, అవరోధాలు, దుర్లభమైన పేదరికం, అయినా పిల్లల్ని చదివించాలని తండ్రి పట్టుదల. పుస్తకాలకీ, ఫీజులకీ డబ్బుండేది కాదు. ఆ విధంగా వరిపొలాలకు అడ్డంపడి రోజూ 15 కిలోమీటర్ల నడిచి చదువు సాగించాడు. ట్రావెన్‌కోర్ యూనివర్శిటీ నుండి ఇంగ్లీషు లిటరేచర్‌లో ఎంఏ పాసైన మొదటి దళితుడు కె.ఆర్. నారాయణన్. ఇప్పటి ట్రావెన్

కోర్ దీవాన్ సి.పి. రామస్వామి అయ్యర్ ఆయనకు లెక్చరర్ ఉద్యోగం కాక గుమస్తా పని ఇస్తానన్నాడు. కారణం ఆయన వచ్చినప్పుడు నారాయణన్ ఖద్దరు లాల్చీ వేసుకొని చేతికి రోల్డుగోల్డు గడియారం (ఎవరో ఇచ్చారు) పెట్టుకొని వున్నాడు. అది సిల్కు లాల్చీ అనీ, నిజమైన బంగారు గడియారం అనుకున్న అయ్యర్ ఒక దళితుడికి ఇంత షోకా అని కోప్పడి అతనికి ఉద్యోగం ఇవ్వడానికి నిరాకరించాడు. దానికి నిరసనగా నారాయణన్ లెక్చరర్ ఉద్యోగంతోపాటు యూనివర్శిటీ ఇచ్చే డిగ్రీని కూడా స్వీకరించకుండానే వెళ్ళిపోయాడు. 50 ఏళ్ళ తర్వాత ఆ యూనివర్శిటీ అభ్యర్థనమేరకు ఆయన ఆ పట్టాను స్వీకరించాడు.

కుటుంబ సమస్యలు పెరిగిపోవడంతో ఆయన ఢిల్లీ వెళ్ళి కొంతకాలం “ది హిందూ', టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికల్లో జర్నలిస్టుగా పనిచేశాడు. ఈ కాలంలోనే ఆయన గాంధీని ఇంటర్వ్యూ చేశాడు. 24 ఏళ్ళ వయస్సులోనే ఆయన అడిగిన ప్రశ్నలు సమాజంపట్ల, కులవ్యవస్థ పట్ల, రాజకీయాల పట్ల ఆయనకు ఎంతటి పరిపక్వమైన అభిప్రాయాలున్నాయో అర్థం అవుతుంది. ఆ తర్వాత జె.ఆర్.డి.టాటా స్కాలర్‌షిప్‌తో లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్‌లో ప్రపంచ ప్రఖ్యాత రాజనీతి శాస్త్రవేత లాస్కీ ఆధ్వర్యంలో రాజనీతి శాస్త్రంలో బి.ఏ.ఆనర్స్ డిగ్రీ పూర్తిచేశాడు. ఆ విధంగా హెరాల్డ్ స్వయంగా నారాయణన్ ఉద్యోగం కోసం నెహ్రూకి సిఫారసు లేఖ కూడా రాశారు. కాని నెహ్రూని కలిసేందుకు ఆయన వ్యక్తి గత కార్యదర్శి మత్తయ్య అవకాశం ఇవ్వలేదు. అప్పుడు డా॥ అంబేడ్కర్ జోక్యంతో నెహ్రూని కలసి విదేశాంగ శాఖలో నారాయణన్ ఉద్యోగం సంపాదించుకున్నారు. 1949లో ఇండియా ఫారిన్ సర్వీస్‌లో చేరాడు. రంగూన్, టోక్యో, లండన్, కాన్‌బెర్రాలలోని భారత దౌత్య కార్యాలయాలలో వివిధ స్థాయిల్లో పనిచేశారు. బర్మా (రంగూన్)లో పనిచేస్తున్నప్పుడే బర్మా వనిత మాట్రింట్ ట్రింట్‌తో వివాహమయ్యింది (1951 జూన్8). ఆ తర్వాత ఆమె తన పేరును ఉషా నారాయణన్‌గా మార్చుకున్నారు. ఆమెకూడా నారాయణన్‌లాగే మంచి సాహిత్యాభిమాని, రచయిత్రీ కావడం విశేషం. 1967–69 కాలంలో థాయ్‌లాండ్‌లోనూ 1973–75 కాలంలో టర్కీలోనూ 1976–78 కాలంలో చైనాలోనూ భారత రాయబారిగా పనిచేశాడు. 1978లో ఆయన ఫారిన్ సర్వీస్ నుండి పదవీవిరమణ చేశాడు. 1979లో అంతర్జాతీయంగా ఖ్యాతి పొందిన జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్శిటీ (జె.ఎన్.యు.) వైస్ చాన్సలర్‌గా పనిచేశారు. 1980–84 కాలంలో అమెరికాలో భారత రాయబారిగా పనిచేశాడు. ఆ తర్వాత కాలంలో రాజకీయాలలో (కాంగ్రెస్) చేరి కేరళలోని ఓట్టపాళం నియోజకవర్గం నుండి వరసగా మూడుసార్లు (1984,1989,1991) పోటీ చేసి విజయం సాధించారు. కేంద్ర ప్రణాళికా శాఖ సహాయ మంత్రిగా (1985) విదేశీ వ్యవహారాల మంత్రిగా (1985–86) శాస్త్ర సాంకేతిక అణుశక్తి అభివృద్ధి శాఖ మంత్రిగా (1986–89) పనిచేశారు. చేరిందీ

పనిచేసిందీ అధికార రాజకీయాల్లోనే అయినా ఆ రాజకీయాల మురికిని ఆయన అంటించుకోలేదన్న విషయం ఆయన రాజకీయ జీవితాన్ని పరిశీలించిన ఎవరికైనా స్పష్టంగా అర్థం అవుతుంది.

1984లో ఆయన రాజకీయాల్లోకి వచ్చేనాటికి సమాజంలో సంక్షోభం తీవ్రంగా పెరిగింది. దేశమంతటా కొత్త సంపన్న వర్గాల కులాలు పైకెదిగి తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోవడానికి దళితులపైన దాడులు చేయడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో 1985 జులై 17 తేదీన కారంచేడు మారణకాండ జరిగింది. ఆ రక్తంలోంచి దళిత ఉద్యమం, దళిత చైతన్యం పెరిగింది (సరిగ్గా 12 సంవత్సరాలకు అదే రోజున 1997 జులై 17న కె.ఆర్. నారాయణన్ రాష్ట్రపతిగా గెలుపొందడం యాదృచ్ఛికమే కానీ గుర్తుంచుకోవాల్సిన సందర్భం) దళితులకు రక్షణ, అభివృద్ధితో పాటు రాజ్యాధికారం కావాలన్న స్పృహ దళిత సమాజంలో పెరిగింది. 1991 ఆగస్టు 6వ తేదీన చుండూరు హత్యాకాండ జరిగింది. రాష్ట్రవ్యాప్తంగా ఆందోళన జరిగింది. ఆ సందర్భంగా అన్ని పార్టీలకు చెందిన 120 మంది పార్లమెంటు సభ్యులు (దేశ చరిత్ర లోనే మొదటిసారి) దళితులకు రక్షణ కల్పించవలసిందిగా రాష్ట్రపతికి వినతి పత్రం సమర్పించి మాట్లాడటానికి వెళ్ళారు. అప్పటి రాష్ట్రపతి వెంకట్రామన్ వాళ్ళను కలవడానికి అనుమతించలేదు. ఆ అవమానం నుండి దళితుడే రాష్ట్రపతి కావాలన్న డిమాండ్ వచ్చింది. 1992 ఆగస్టు 21వతేదీన కె.ఆర్. నారాయణన్ ఉపరాష్ట్రపతిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు. ఆయన పేరును మాజీ ప్రధాని వి.పి. సింగ్ ప్రతిపాదించడం విశేషం. ఆయన ఉపరాష్ట్రపతిగా ఎన్నికైన కొన్ని నెలలకే 1992 డిసెంబర్ 6వ తేదీన హిందూ మతోన్మాదుల చేతుల్లో బాబ్రీమసీదు కూలిపోయింది. 'మహాత్మాగాంధీ హత్య తరువాత యింతటి భయానకమైన విషాదం మరొకటి జరగలేదు' అని ఆ సందర్భంగా ప్రకటించడానికి ఆయన ఏమాత్రం వెనుకాడలేదు.

1997 రాష్ట్రపతి అభ్యర్థిగా అన్ని పార్టీలూ కె.ఆర్. నారాయణన్ పేరును ప్రతిపాదించాయి. అయితే మతోన్మాద పార్టీ అయిన శివసేన దాన్ని వ్యతిరేకించి టి.ఎన్.శేషన్‌ను అభ్యర్థిగా నిలబెట్టింది. హిందూ ఫాసిజానికి మారుపేరైన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆరెస్సెస్) ఆయనకు భారతీయ సంస్కృతిపట్ల సరైన జ్ఞానం, అవగాహనలేదని ప్రకటించి ఆయన్ని ఓడించవలసిందిగా పిలుపునిచ్చింది. అయితే ఆయన 95శాతం ఓట్లు సాధించి గెలుపొందారు. ఆయనకు భారతీయ సంస్కృతి పట్ల ఎంతటి లోతైన అవగాహన వుందో సమాజం పట్ల ఎంతటి బాధ్యత వుందో ప్రతి సందర్భం రుజువు చేసింది. ఆయన రాష్ట్రపతి పదవి చేపట్టేంతవరకూ రాష్ట్రపతి అంటే "రబ్బరు స్టాంపు" అన్న అభిప్రాయమే వుంది. ఆయనకు ముందు పనిచేసిన వాళ్ళందరూ ప్రభుత్వం ఎక్కడ సంతకం చేయమంటే అక్కడ సంతకంచేసి ప్రభుత్వం రాసిచ్చిన ఉపన్యాసాలను మాత్రమే చదివి వూరుకొనే వాళ్ళు. కె.ఆర్. నారాయణన్

మాత్రమే రాష్ట్రపతి పదవిని ఎంత సృజనాత్మకంగా, ఎంతటి బాధ్యతాయుతంగా నిర్వహించవచ్చునో చూపించాడు. సమాజంలో కొనసాగుతున్న సామాజిక ఆర్థిక అసమానతలు, దళితులు, వెనకబడిన వర్గాలు, స్త్రీలు అనునిత్యం అనుభవిస్తున్న కష్టాలను పదేపదే ప్రభుత్వానికి గుర్తుచేసి నిర్దిష్టమైన చర్యలు చేపట్టవలసిందిగా సూచించాడు. 1998 ఫిబ్రవరి 16వ తేదీన ఎన్నికలు జరిగిన సందర్భంగా అందరి పౌరుల్లాగానే వరుసలో నిలబడి తన ఓటు హక్కును వినియోగించుకొన్నాడు. అంతకు ముందు రాష్ట్రపతులెవరూ ఓటు వేయలేదు. మరీ ముఖ్యంగా 2000 జనవరి 26వ తేదీన భారత రిపబ్లిక్ స్వర్ణోత్సవం సందర్భంగా జాతిని ఉద్దేశించి ఆయన చేసిన ప్రసంగం అద్వితీయమైనది. అప్పుడే బి.జె.పి. నాయకత్వంలోని ఎన్.డి.ఎ. ప్రభుత్వం భారత రాజ్యాంగం స్వరూపాన్నే మార్చే ఉద్దేశంతో రాజ్యాంగాన్ని సవరించాలని ప్రయత్నాలు చేస్తుంది. అప్పుడాయన రాజ్యాంగం విఫలమైందా? రాజ్యాంగాన్ని మనం విఫలంచేశామా? అన్న ప్రశ్న వేసి సంచలనం సృష్టించారు. ఏ రాజ్యాంగం అయినా అది మంచివారి చేతిలో పడితే అది మంచిదవుతుందన్న అంబేద్కర్ మాటల్ని ఆయన ఉటంకించారు. ప్రభుత్వాలు స్థిరంగా వుండడం కన్నా అవి జవాబుదారీ తనంతోనూ, బాధ్యతతోనూ ఉండడం ముఖ్యమని అంబేద్కర్ చెప్పారనీ ఆ మాటలతో తాను పూర్తిగా ఏకీభవిస్తున్నాననీ ఆ చారిత్రక ఉపన్యాసంలో కె.ఆర్. నారాయణన్ చెప్పారు. భోపాల్ ప్రకటన వెలువడినప్పుడు ఆయన ఎంతో సానుకూలంగా స్పందించి దేశ నిర్మాణంలో ప్రైవేటురంగం చురుగ్గా పాల్గొనాల్సిన అవసరం వుందనీ ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు అమలు చేయాలనీ పిలుపునిచ్చారు. దేశానికీ, సమాజానికీ కూడా ఇది తీవ్రమైన సంక్షోభం అని ఆయన గుజరాత్ మతకలహాలను అభివర్ణించారు. విద్యను కాషాయీకరించే ప్రయత్నాన్ని కూడా ఆయన తీవ్రంగా నిరసించారు. పదవీ విరమణ తర్వాత కూడా ఆసియా సోషల్ ఫోరం, వరల్డ్ ఫోరం తదితర వేదికలపై ఆయన మానవ హక్కుల సందేశాన్ని యిచ్చారు. మరొక్క ముఖ్యమైన విషయం ఏమిటంటే ఆయన పదవిలో వున్నంతకాలం ఏ మత ప్రదేశాలకు, బాబాలు, అమ్మల దగ్గరకూ వెళ్లలేదు. మిగతా ప్రధానులూ, రాష్ట్రపతులూ ఎవరూ ఈ విలువకు కట్టుబడి లేరు. ప్రజలకు బాధ్యత వహించండి. జవాబుదారీగా వుండండి అని ప్రభుత్వాల్ని హెచ్చరించారు. దేశ నిర్మాణంలో పాలుపంచుకొని అట్టడుగు వర్గాలకు మీ పరిశ్రమల్లో చోటివ్వండి అని ప్రేవేటు రంగానికి పిలుపునిచ్చారు. సెక్యులర్ విలువల్ని కాపాడుతూ మానవీయంగా బతకండి అని పౌర సమాజానికి పిలుపునిచ్చాడు. దళితులకు అణగారిన వర్గాలకూ అంబేద్కర్ని గుర్తుంచుకోండి, ఆయన చెప్పిన బోధించు, పోరాడు, సమీకరించు అనే మాటలకు ఈనాడు మరింత ప్రాధాన్యత పెరిగిందనీ మీ భవిష్యత్తును నిర్మించుకోడానికీ మీరే నడుంకట్టాలని పిలుపునిచ్చారు.

ఇప్పుడాయన లేరు. ఆయన పిలుపు వుంది. ఆయన స్ఫూర్తి వుంది. ఆయన స్మృతి వుంది. ఆయన్ని స్మరించుకోవడం అంటే ఆయన యిచ్చిన పిలుపును ఒక క్రియాశీలమైన ఆచరణగా అనువదించడం. దేశంలోని మిగతా అందరి కంటే దళిత ఉద్యమంపైనా, దళిత సమాజంపైనా ఆబాధ్యత ఎక్కువగా వుంది. రాజ్యాంగ స్ఫూర్తిని కాపాడటానికి, సెక్యులర్ విలువలని కాపాడడానికీ, అసమానతలను తొలగించడానికి, సామాజిక న్యాయం సాధించడానికి, ముఖ్యంగా ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లను సాధించడానికి, ఎస్సీ,ఎస్టీల సంక్షేమ కార్యక్రమాలపై గవర్నర్ల నివేదికను అమలు చేయించడానికి ఉద్యమించడం ద్వారా మాత్రమే ఆయనకు మనం నిజమైన నివాళిని అర్పించగలం. మన ఆలోచనల ద్వారా, మన మాటల ద్వారా, మన చేతల ద్వారా ఆ మహా మనిషిని బతికించుకుందాం. మనల్ని మనం విముక్తి చేసుకోవడం ద్వారా ఆ విముక్తి మానవుడ్ని బతికించుకొందాం. కబీర్ చెప్పినట్లుగా ఏవిధంగా జీవించాలో తెలిసిన మనిషి, ఏ విధంగా మరణించాలో తెలిసిన మనిషి, మరణానికి కూడా ఒక అర్థవంతమైన జీవితాన్నిచ్చిన మనిషి మన కె.ఆర్.నారాయణన్. ఆయనకు చావులేదు.

**డిసెంబర్ 2005 – బహుజన కెరటాలు**

# నాలుగో హరిశ్చంద్రుడు యికలేడు!

అంతకు ముందు బండారు రామారావు గారు, ఆ తర్వాత డి.వి. సుబ్బారావుగారు అలా అనిపించారు. ఆ యిద్దరినీ తనలోకి ఆవాహన చేసుకొని తనదైన శైలిని సుందరంగా మలచుకున్నవాడు చీమకుర్తి. ఒక పద్యాన్ని ఒక రాగంలో అంటాడు. ప్రేక్షకులు కచ్చితంగా ఒన్స్‌మోర్ అంటారు. ఈసారి యింకొక రాగంలో అంటాడు. మరోసారి ఒన్స్‌మోర్ అంటే యింకో రాగం సిద్ధం. రాగాలు అతని నాల్కపై అలుపులేని నాట్యాలాడేవి. యిప్పుడతను లేడు.

ఒకసారి ఒంగోలులో చీమకుర్తి నాగేశ్వరరావు నాటకముందని పోస్టర్లేశారు. చీమకుర్తి ఫోటోవేశారు. అదే సుందర రూపం. మగవాళ్ళను సైతం అచ్చెరువొందించే ఆకర్షించే అందగాళ్ళు అరుదుగా కనిపిస్తారు. చీమకుర్తి నాటకం చూడకుండా వెళ్ళిపోవడం ఎవరికి సాధ్యం. టైంకు ప్రదర్శన జరిగేచోటుకు వెళ్లాం. ఎందుకో ఆ రాత్రి నాటకం రద్దయ్యింది. అయినా నాగేశ్వరరావును చూడకుండా వెళ్లలేకపోయాం. యలవర్రు సాగర్ ఫోను చేశాడు. యింట్లోనే వున్నాను రండన్నాడు. వస్తే ఏం పెడతావనడిగాడు. వేడివేడి నాటుకోడి పెడతానన్నాడు. ఎందుకైనా మంచిదని తిని రాత్రి పన్నెండు గంటలకు చీమకుర్తి అగ్రహారం చేరుకున్నాం. మాంచి మసాలా ఘుమఘుమ. ఏం తెచ్చార్రా అనడిగాడు. ఏం తీసుకెళ్ళాలో మాకు బాగా తెలుసు. సరే తిండికి లెగండన్నాడు. ముందో పద్యం పాడమన్నాం సరే కానీయండని గొంతు సవరించుకున్నాడు. యిక ఆ రాత్రికి నిద్రలేదు. వూరికీ నిద్రలేదు. పైన చందమామ చీమకుర్తి దేహం. రాగాల తీగెలుతీగెలుగా చీలిపోయి మెలికలు మెలికలు తిరిగి మళ్లీ తాడులా అల్లుకుపోయింది. ఒక సలసలకాగే జలధార పాతాళం నుండి ఫౌంటేన్లా పైకెగదన్ని పర్వత శిఖరాలను అభిషేకించినట్లు ఆరోహణ, ఘోషిస్తూ కిందకు జారుతున్న జలపాతంలా అవరోహణ. కవి కత్తి కల్యాణ్ ఆ స్వరం ముందు సాగిలపడ్డాడు. అందరూ తన్మయులమై మరచి పోతుండగా పాటను అక్కడ ఆపి పసిపిల్లాడిలాగా పకపక నవ్వాడు. రాగాన్ని ఎక్కడ విరిస్తే ప్రపంచం ఒళ్ళంతా అణువణువూ పులకించి పోతుందో చీమకుర్తికి తెలుసు. అందుకోసం నిరంతరం ప్రయోగాలు తానెలా చేసింది చెప్పాడు. బతుకు పొరల్లోంచి స్వరాల రహస్యాలను చెప్పాడు. 'కలవారి యింఢ్ల లోపుల... అంటూ చీమకుర్తి గొంతుక భూపాల రాగాన్ని అందుకోగానే సూరీడు హడావుడిగా బయటకొచ్చాడు.

2005, ఏప్రిల్ 14వ తేదిన గుంటూరు జిల్లా అనంతవరంలో అంబేడ్కర్ జయంతి సభకు వెళ్ళి తిరిగివస్తున్నాం. అర్ధరాత్రి అమృతలూరు చేరుతుండగా వారణాసి పద్యం వినపడింది. ఆ గొంతుక చీమకుర్తిదని ఎవరూ చెప్పనక్కరలేదు. వీధుల నిండా జనం చుట్టప్రక్కల ఊళ్ల నుండి బళ్ళు కట్టుకుని వచ్చిన జనం. హడావుడిగా తోసుకుంటూ వేదిక

దగ్గరకు వెళ్ళాం. మమ్మల్ని చూసి గుర్తుపట్టి పద్యమాలపిస్తూనే పలుకరించాడు. పలుకరించింది మమ్మల్నో, చంద్రమతినో మాకు తప్ప ఎవ్వరికీ తెలియదు. ఎందుకో ఆ రోజు సరిగా పాడలేక పోతున్నాడు. మనిషి బాగా నీరసించి వున్నాడు. పాడుతూనే సాగర్‌కి సైగచేసాడు. సాగర్ గబగబా పరుగెత్తుకెళ్ళి వెనక్కి వచ్చాడు. ఆ రాత్రి మద్యం షాపులు తెరిచే వుంటాయని అతనికీ తెలుసు. చంద్రమతి పద్యం పాడుతుండగా వెనక్కి వెళ్ళి గుటకేసి వచ్చాడు. అయినా పాడలేక పోతున్నాడు. జనంలో ఓపిక మాత్రం నశించలేదు. గుండెల్లో నిలచిపోయే గమకం ఏదో ఒకటి వస్తుందని ఆశగా ఎదురుచూస్తూనే ఉన్నారు. బహుశా మాకులాగే వాళ్ళూ ఈ పద్యాన్ని పలానా ఊళ్లో ఇలా అన్నాడు, ఆ ఊళ్లో ఇలా అన్నాడు. మరో ఊళ్లో ఇంకోలా అన్నాడు అన్న జ్ఞాపకాల దొంతర్లలోకి జారిపోయి ఉంటారేమో. సాధారణంగా కాటి సీను వచ్చేంత వరకూ నిద్రపోయి కాటిసీను మొదలైన తర్వాత మేల్కొనే అలవాటు చాలా మంది ప్రేక్షకులకు ఉండేది. మేల్కొని ఉన్నవాళ్ళు కూడా కాటిసీను ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చునే వాళ్ళు, ఆరోజు చీమకుర్తి కాటిసీను హరిశ్చంద్రుడు కాదు. పాడలేక పాడీపాడీ చీమకుర్తి వేదిక దిగిన వెంటనే వీధులు కాళీ అయిపోయాయి. బాగా ఎదురుచూసే కాటి సీను చూడకుండానే జనం వెళ్ళిపోయారు. వాళ్లంతా చీమకుర్తి కోసమే వచ్చిన వాళ్ళు. గతంలో బందారు రామారావుగారి కోసమే వచ్చిన వాళ్ళు, ఆ తర్వాత డి.వి. సుబ్బారావు కోసం వచ్చిన వాళ్ళు. ఆ తర్వాత వచ్చేది చీమకుర్తి కోసమే. యిప్పుడు అతను లేడు.

తిరుపతిలో రాష్ట్ర ప్రభుత్వం నంది నాటకోత్సవాలు నిర్వహించి రంగస్థలం నటులకు బహుమతి ప్రధానం చేస్తున్నప్పుడు నాగేశ్వరరావు పార్థివ దేహం చీమకుర్తి అగ్రహారంలోనే వుంది. కళాకారుడు, కేంద్ర మంత్రి దాసరి నారాయణరావుగారు కళాకారుల కష్టాలను గురించి ఎంతగానో కన్నుల్లో నీరు నింపుకుని కలత చెందారు. చీమకుర్తి నాగేశ్వరరావు గొప్పతనాన్ని గురించి కానీ, కనీసం సంతాపంగానైనా కానీ, ఆయన "ఎందుకో" ఒక్క మాటైనా మాట్లాడలేదు. మెగాస్టార్ చిరంజీవికి పద్మభూషణ్ అవార్డు వచ్చినందుకు అందరూ చేరి ఆనందించే వేళైనా ఆ మహా కళాకారుడిని తలచుకోలేదు. కనీసం ప్రభుత్వమైనా సంతాపం ప్రకటించలేదు. బహుశ మాలవాడైనందుకో ఏమో!

చీమకుర్తి నాగేశ్వరరావు ఒక తరం సాంస్కృతిక అవసరాలను తీర్చిన అద్భుతమైన, అపురూపమైన కళాకారుడు.

అతని విగ్రహం వేయడానికి, అతని కుటుంబాన్ని ఆదుకోవడానికీ ప్రకాశంజిల్లాలో చీమకుర్తి అభిమానులు ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలిసింది. ప్రభుత్వం కూడా కొంచెం కళాస్పర్శతో స్పందించి, జాతి సాంస్కృతిక వారసత్వ సంపదగా నిలిచిన చీమకుర్తి నాగేశ్వరరావును గౌరవించి ఆయన కుటుంబాన్ని ఆదుకోవాలి. అతను నడిచిన ఈ మట్టిమీద బతుకుతున్నందుకైనా అందరూ స్పందించాలి.

చీమకుర్తి నాగేశ్వరరావు చనిపోయాడు. అతనెవరూ... అని అడిగితే పల్లెటూళ్ల రంగస్థలాలు చెబుతాయి. కళాకేంద్రాలు చెబుతాయి. గొడ్లను కాసే బుడ్డోళ్ళు చెబుతారు. కళ్యాణమండపాలు, కళాభిమానుల గుండెలు చెబుతాయి. అతని అమృత గానాన్ని యింకా పరవశంగా మోసుకు తిరిగే పైరగాలులు చెబుతాయి. హరిశ్చంద్రుడు వుంటే గింటే అతను చీమకుర్తి నాగేశ్వరరావులాగే వుంటాడన్న ముద్రని పల్లె మస్తిష్కాల్లో ముద్రించాడు చీమకుర్తి నాగేశ్వరరావు. నా దృష్టిలో వుంటే గింటే అసలు హరిశ్చంద్రుడు ఒకటోవాడైతే, రెండోవాడు బండారు రామారావు, మూడోవాడు డి.వి.సుబ్బారావు, నాలుగో హరిశ్చంద్రుడు చీమకుర్తి.

**ఫిబ్రవరి 2006 – బహుజన కెరటాలు**

**ఆంధ్రజ్యోతి సౌజన్యం**

# బోధిసత్వ అంబేడ్కర్ కలలపంట సామ్రాట్ కాన్షీరామ్

అప్పుడే కుట్టించుకొన్న కొత్త బట్టలు వేసుకొని ట్రంకు పెట్టెలు చేతపట్టుకొని, సంచులు మోసుకుంటూ భార్యాబిడ్డలతో తడబడే అడుగులతో ఉత్తరప్రదేశ్ ఎమ్మెల్యే క్వార్టర్స్ కారిడార్లలో నడుస్తున్నారు కొంతమంది వ్యక్తులు. ముఖాలు చూసి వారి కులాల పేర్లను చెప్పగల మేధావులున్న మన దేశంలో వాళ్ళెవరో కనుక్కోవడం పెద్ద కష్టమైన పనేమీ కాదు. వాళ్ళు అందరి బట్టలు ఉతికే చాకలివాళ్ళు. అందరికీ క్షవరాలు చేసే మంగలి వాళ్ళు. దూదేకుల పింజారీవాళ్ళు. గుర్జార్లు, వాల్మీకులు, కుండలు చేసే కుమ్మరులు.

అయితే వాళ్ళు అక్కడికి వచ్చింది తమ తమ కులవృత్తులను చేయడానికి కాదు. దేశంలోనే అతిపెద్ద రాష్ట్రం, జపాన్, పాకిస్తాన్ దేశాల కంటే కూడా పెద్దభూభాగం కల రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్ ప్రభుత్వంలో మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేయడానికి. ఏనాడూ తమ స్వంత గ్రామాల్లో పంచాయితీ కార్యాలయాల్లోకి కూడా వెళ్ళని వాళ్ళు ఏనుగు అంబారీ ఎక్కి ఉత్తరప్రదేశ్ రాజధానికి ఎకాఎకిన వచ్చివాలారు. నేడు ఉత్తర భారతాన్ని ఏనుగుల గుంపు చుట్టుముట్టింది. ఆ ఏనుగులకు అంబారీలను అలంకరించి మట్టికాళ్ళ మొరటు చేతుల మనుషులను, అణగారిన మనుషులను నిరంతరం అవమానాలకూ, అత్యాచారాలకు గురవుతున్న మనుషులను, అంటరాని మనుషులను, పల్లెల్లో పది మంది నడిచే రహదారుల్లో నడిచి వెళ్ళినందుకే దాడులకూ హత్యాకాండలకు గురైన మనుషులను రాచవీధుల గుండా ఠీవిగా నడిపించుకు వచ్చాడు ఒక సామాన్యుడు, మాన్యుడు, అసమాన్యుడు, ఆయనే మాన్యశ్రీ కాన్షీరామ్. బుద్ధుడు కలలు కన్న సమతాసమాజాన్ని సామ్రాట్ అశోకుడు నిజం చేశాడు. నా ప్రజలు ఈ దేశంలో పాలితులుగా కాక పాలకులుగా ఉండాలి అని అంబేడ్కర్ కన్న కలల్ని సాఫల్యం చేశాడు మాన్యశ్రీ కాన్షీరామ్. స్వతంత్ర భారతదేశ చరిత్రలోనే మొట్టమొదటి సారిగా దేశంలోనే అతిపెద్ద రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి ఒక చమార్ మహిళను ముఖ్యమంత్రిగా చేసి చెప్పులు కుట్టే చేతులకు రాజదండాన్ని అందించాడు.

యిదంతా రాత్రికి రాత్రే జరిగిపోలేదు. ఎన్నో రోజులు, ఎన్నో నెలలు, ఎన్నో సంవత్సరాలు, ఎన్నో దశాబ్దాలు సాగిన రాజకీయ వ్యవసాయం. త్యాగశీలమైన ఆచరణ, నిరంతర శ్రమ, తపన, సంఘర్షణ, ఎన్నో అవమానాలు, కాన్షీరామ్ రాజీలేని పట్టుదల, అంబేడ్కర్ ఆశయాల పట్ల వున్న అచంచలమైన విశ్వాసం, బహుజన సమాజం పట్ల వున్న అమితమైన ప్రేమ, ఎన్ని అవరోధాలు, అడ్డంకులు ఎదురొచ్చినా ఎదురొడ్డి నిలబడగలిగిన శక్తి సామర్థ్యాలు, మొండితనం వీటన్నింటి వలన దళితులు రాజ్యాధికారాన్ని చవి చూడగలిగారు.

ఆత్మకూరి చెన్నయ్య రచించిన (రచించావంటే ఆయన ఒప్పుకోవటం లేదు. కేవలం కూర్పరిని మాత్రమే అంటున్నాడు కానీ ఆయనే రచించాడంటున్నాను) ఈ పుస్తకాన్ని చదువుతుంటే కళ్ళలో దుఃఖపు పొరలు కమ్ముకొస్తున్నాయి. గతకాలపు అవమానాలు తలపోతల బరువు చేతనో యిప్పటి విజయాల ఆనందం చేతనో తెలియడం లేదు. బహుశా రెండూ కలగలసిన ఉద్విగ్నత ఒక ఉద్వేగం. డాక్టర్ ఎండ్లూరి చిన్నయ్య గారు, డాక్టర్ విజయభారతి గారు రాసిన అంబేడ్కర్ జీవిత చరిత్రల సరసన ఈ పుస్తకం ఖచ్చితంగా నిలబడుతుంది. అతను పుట్టాడు. అతను జీవించాడు. అతను మరణించాడు. అని రాసి ఏ వ్యక్తి జీవిత చరిత్రనైనా ముగించవచ్చు. పుట్టుకకీ, మరణానికి మధ్య నున్న జీవితమనే ఊరేగింపు కేవలం ఒక వ్యక్తి తాను ఎదుర్కొన్న ఒడిదుడుకులు, విజయాలు, వైఫల్యాలను మాత్రమే తెలపదు. ఆనాటి సమకాలీన జీవన పరిస్థితులు సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితులు, మనిషికీ మనిషికీ మధ్య వున్న సంబంధాలు, అనుబంధాలు, వైషమ్యాలు అన్నింటినీ తెలియజేస్తుంది. చారిత్రక వ్యక్తుల వ్యక్తిత్వాలను గుండెల్లో తడి వున్న వ్యక్తి మాత్రమే పట్టుకోగలడు. ఆ పని ఆత్మకూరి చెన్నయ్య ఎంతో నిబద్ధతతో విజయవంతంగా చేయగలిగాడు. చెన్నయ్య ఒక మంచి మనిషిగా తెలుసు. అట్టడుగు ప్రజల జీవితాలు సుఖంగా ఉండాలని కోరుకునే వ్యక్తిగా తెలుసు. దళిత ఉద్యమ కార్యకర్తగా, నాయకుడుగా తెలుసు. అంతకుమించి జాతి కోసం ఎలాంటి త్యాగానికైనా సిద్ధపడే నిబద్ధత ఆచరణ కలిగిన వ్యక్తిగా తెలుసు. ఈ పుస్తకంలోని ప్రతి వాక్యంలోనూ ఆయన ప్రాణ వాయువు వుంది. దేశాన్ని దున్ని దున్ని గుండెల్ని చిలికి చిలికి గుప్పెడు అక్షరాల గింజల్ని పండించి పావురాళ్ళగా ఎగరేసినట్లు కాన్షీరామ్ పోరాట జీవితంలోని ప్రతి ఘట్టాన్ని గొప్ప తైలవర్ణ చిత్రాలుగా చిత్రించాడు చెన్నయ్య. భారత దేశంలోనే కాన్షీరామ్ జీవితంపై వచ్చిన అద్భుత గ్రంథం ఇది.

1956 డిసెంబర్ ఆరవ తేదీన డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ మరణించే రోజు వరకూ కాన్షీరామ్‌కు అంబేడ్కర్ గురించి ఏమీ తెలియదు. అప్పటికి ఆయన బి.యస్సీ పూర్తి చేసి డెహ్రాడూన్‌లోని స్టాఫ్ కాలేజీలో ఉన్నత విద్య పూర్తి చేసాడు. కొంతకాలం భారతీయ భూ వైజ్ఞానిక సర్వే విభాగంలో ఉద్యోగం చేశాడు. అదే సంవత్సరం డిసెంబర్ 6వ తేదీన బాబాసాహెబ్ అంబేడ్కర్ చనిపోయారు. కాన్షీరామ్‌తో పాటు ఉద్యోగం చేస్తున్న ఆయన మిత్రుడు శ్రీ గైని అంబేడ్కర్ మరణవార్తను తట్టుకోలేక మూడు రోజుల పాటు అన్నం నీళ్ళు మానివేసి కంటికి మింటికీ ఏకధారగా విలపిస్తుంటే కాన్షీరామ్ కదిలిపోయాడు. అప్పటి వరకూ అంబేడ్కర్ పేరు వినడమే కానీ ఆయన వ్యక్తిత్వాన్ని, ఆయన నడిపిన సామాజిక, రాజకీయ ఉద్యమాలను తెలుసుకునే అవకాశం ఆయనకు రాలేదు. అయితే మిత్రుడు శ్రీ గైని దుఃఖం నుండి కాన్షీరామ్ అంబేడ్కర్ పట్లా ఆయన రాజకీయ ఆశయాల పట్ల ఆకర్షితుడు అయ్యాడు. ఆయన జీవితాన్ని, ఉద్యమాన్ని, రచనలనీ లోతుగా అధ్యయనం చేసి బాబాసాహెబ్ సిద్ధాంతాన్ని

గుండెల్లో నింపుకున్న మహామనిషి కాన్షీరామ్.

కాన్షీరామ్ ఉద్యమ ప్రస్థానంలో తన తల్లికి రాసిన ఉత్తరం కానీ, ఆయన నిర్మించిన సంస్థల చరిత్ర కానీ బామ్‌సెఫ్, డిఎస్ 4, బహుజన సమాజ్‌పార్టీ నిర్మాణం కోసం ఆయన సాగించిన కృషి, కార్గిల్ నుండి దక్షిణాది వరకూ సాగించిన సైకిల్‌యాత్రలు, ప్రసంగాలు, ఉద్యమాలు అన్నింటి గురించి నేను చెప్పేదేమీ లేదు. పుస్తకం మీ ముందు వుంది. ఒక్క అక్షరాన్ని మిస్సయినా మీరేదో కోల్పోతారు.

యిది బహుజన సమూహాలను, మొత్తంగా మానవాళిని అమితంగా ప్రేమించిన ప్రేమ మూర్తి చరిత్ర. యిది జాతీయ నాయకులకూ, ప్రధాన ప్రసార సాధనాలకూ కొరకరాని కొయ్యగా మారిన ఒక రాజకీయ దురంధరుడి చరిత్ర. వందల కోట్ల రూపాయలను ఎడమ చేత్తో ఖర్చు చేస్తూ స్వంత ఆస్తి లేని ఒక నిరుపేద చరిత్ర. ఒక బౌద్ధ భిక్షువు ఏ విధంగా వుండాలో ఆ విధంగా జీవించిన ఒక బౌద్ధ భిక్షువు చరిత్ర. యిది ఆత్మకూరి చెన్నయ్య గుండె లయలో విలీనమైన ఒక మహామనిషి చరిత్ర. ఈ పుస్తకాన్ని అందరూ విధిగా చదవాల్సిన పుస్తకం. చదివి దాచిపెట్టుకోకుండా మరొకరు చదివేందుకు అందించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను. యింతటి గొప్ప పుస్తకానికి ముందుమాట రాసే అవకాశం కలిగినందుకు ధన్యుడనయ్యానని విన్నవించుకొంటున్నాను.

**ఆత్మకూరి చెన్నయ్య సంకలనం చేసిన**

**కాన్షీరామ్ పోరాటం - జీవితం**

**పుస్తకానికి ముందుమాట తేది:-16-05-2007**

# మాయావతిని గెలిపించి
# తాము గెలిచిన బహుజనులు!

చాలా మంది అనుకోవడానికి ఇబ్బందిపడ్డారు కాని ఉత్తర ప్రదేశ్ ఎన్నికల్లో ఎక్కువమంది అనుకున్నదే జరిగింది. మాయావతి నాయకత్వాన బహుజన సమాజ్ పార్టీ అత్యంత మెజార్టీ కలిగిన పెద్ద పార్టీగా విజయం సాధించింది.

ఒకవైపున ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి నాయకత్వం వహిస్తున్న ములాయం సింగ్ ఆధ్వర్యంలో సమాజ్‌వాది పార్టీ అధికార యంత్రాంగాన్ని, అమితాబ్ బచ్చన్, జయాబచ్చన్, జయప్రదలాంటి సినీ తారలను రంగంలోకి దించింది. అమర్ సింగ్‌లాంటి అన్ని విధాల, అన్నిరకాల వ్యూహాలను అమలుచేయగల సమర్థుడు ములాయం సింగ్‌కి దళపతిగా వ్యవహరించాడు.

మరొక వైపున హిందూత్వ నినాదంతో భారతీయ జనతాపార్టీ అతిరథ మహారథులందర్ని పూర్తిగా ఉత్తరప్రదేశ్ ఎన్నికలపైనే కేంద్రీకరించారు. పార్టీ జాతీయ నాయకుడు రాజ్‌నాథ్‌సింగ్, పార్టీలో సర్దార్ పటేల్‌గా పేరుగాంచిన లాల్‌కృష్ణ అద్వాని, అందరిలో మంచివాడని పేరు తెచ్చుకున్న అటల్ బిహారీ వాజ్‌పేయ్ ఇతర మహామహులు రంగంలోకి దిగారు.

డబ్బులు ఏరులై ప్రవహించింది. "ప్రిన్స్ చార్మింగ్ డార్లింగ్ ఆఫ్ మిలియన్స్" అన్న పేరుతెచ్చుకున్న జవహర్‌లాల్ నెహ్రూ కుటుంబ రాజకీయ వారసుడు, ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు, ప్రచ్ఛన్న ప్రధానమంత్రి కుమారుడు భావిభారత ప్రధానిగా ప్రచారంలోకి వచ్చిన రాహుల్ గాంధీ స్వయంగా ఎన్నికల ప్రచారానికి సారధ్యం వహించాడు. ఆయనకు చేదోడు వాదోడుగా అతిరథ మహారథులెందరో! అన్ని రాష్ట్రాల నుంచి కాంగ్రెస్ పార్టీ సీనియర్ నాయకులు వెళ్లారు.

ప్రచారం ముమ్మరంగా సాగింది. గెలుపు నీదా నాదా అన్నంత ఉత్కంఠ చివరిదాకా కొనసాగింది. మామూలు పౌరులు సరే, ఎప్పటికప్పుడు ఏ రాజకీయ పరిణామం జరిగినా తక్షణం తమ వాఖ్యానాన్ని వినిపించడానికి సదాసిద్ధంగా ఉండే రాజకీయ విశ్లేషకులు, మేధావుల్లో కూడా ఈ ఉత్కంఠ కొనసాగడం కొంచెం విచిత్రంగానే అనిపించినా అసహజంగా ఏమీలేదు.

దళితులు ఏనాటికీ రాజ్యాధికారానికి రాగూడదు. వాళ్లు ఎప్పటికీ పాలితులుగానే, బానిసలుగానే, ఎప్పుడు ఎక్కడ ఉన్నవాళ్లు అక్కడే ఉండాలి అనుకునేవాళ్లు ఏమనుకుంటున్నారో చర్చించుకోవడం పెద్దగాఅవసరం లేదు. దళితులకు రాజ్యాధికారంలో తమ వాటాను తాము సాధించుకోవడమే వారి పని.

నేను తెలుగుగడ్డమీద మేధావులుగా గుర్తించి, గౌరవించే ఇద్దరు మేధావుల వ్యాఖ్యానాలు, ప్రతిస్పందనలు చదివిన తరువాత ఇది రాస్తున్నాను. కొంచెం దిగులు, కొంచెం అసహనం, కొంచెం కోపంతో వాళ్ల గతంలో పోషించిన అన్ని అంశాలను గౌరవిస్తూనే ఇది రాస్తున్నాను.

ఎన్. వేణుగోపాల్ విరసంలోనూ మిగతా మేధావి సర్కిల్‌లోనూ మేధావిగా గుర్తింపు పొందినవాడు. ఆయన మాటకు విలువనిచ్చే వాళ్లు చాలామంది (నాతో సహా) ఉన్నారు. ఆయన దళితుల విముక్తికి సాయుధపోరాట మార్గమొక్కటే శరణ్యమని నమ్మినవాడు. ఎన్నికలు ఎందుకూ పనికిరావని ఆయన అభిప్రాయం. అయినా ఎన్నికల జయాపజయాలు, వ్యూహాలు, పరిణామాలు, చరిత్ర గురించి వ్యాఖ్యానించడానికి సిద్ధపడ్డాడు. ఆయన లేవనెత్తిన ముఖ్యమైన అంశాలుఒకటి, డబ్బు ఎక్కువ ఖర్చు పెట్టారు. రెండు, బ్రాహ్మణులకు అధిక ప్రాధాన్యతను ఇచ్చారు. అవినీతి ప్రస్థావన కూడా తెచ్చారు.

సాయుధపోరాటాన్ని కొనసాగించడానికి ఎంత డబ్బు ఖర్చు పెడుతున్నారో, ఎంత దుర్వినియోగం అవుతుందో ఆయా విప్లవ పార్టీల, పత్రికల నివేదికలు చూస్తే స్పష్టంగా అర్థమౌతుంది. ఎన్నికల రాజకీయాలలో డబ్బు, మాఫియా, మీడియా ప్రభావం ఎంత ఉంటుందో దాన్ని ఎలా అనుకూలంగా మలుస్తారో న్యాయంగా జర్నలిస్టు అయిన వేణుగోపాల్‌కు తెలుసు. తెలిసీ ఒక దళిత మహిళ ముఖ్యమంత్రి కావడం మంచిదేనని ఒప్పుకుంటూనే బి.యస్.పి. విజయంపట్ల తన వ్యతిరేకతను విషం గక్కినట్లు వ్యక్తంచేశాడు. అదే అసలైన బ్రాహ్మణిజం!

ఇక ఉ.సాంబశివరావుగారు రాసిన వ్యాసం. ఆయన మొదట నుండి బి.యస్.పి.పట్ల వ్యతిరేకంగానే ఉన్నాడు. అప్పటిదాకా సత్యమూర్తిగారితో కలిసి ఉన్న సాంబశివరావుగారు పెద్దాయన దారి తప్పిపోయాడని ప్రకటించాడు. బహిరంగ వేదికలపైన ఉపన్యాసాలు ఇచ్చాడు. మొదటినుండి ఆయన బి.యస్.పి.కి వ్యతిరేకంగానే ఉన్నాడు. కాన్షీరాం అనుసరించే విధానాలను వ్యతిరేకిస్తూనే ఉన్నాడు. పరవాలేదు. ఎస్సీలు, ఎస్టీలు, బి.సి.లు, మైనారిటీలు ఐక్యంగా రాజ్యాధికారం సాధించడానికి కాన్షీరామ్ నేతృత్వం వహించిన బి.యస్.పి. పార్టీ వ్యూహాన్ని ఆయన ఎప్పుడూ వ్యతిరేకిస్తూనే ఉన్నారు. అదే నమూనాలో ఆంధ్రాలో రాజ్యాధికారం సాధించడానికి కృష్ణ మాదిగ, గౌతమ్, వినయ్‌కుమార్‌లతో కలసి రాజకీయ ప్రయత్నాలు చేశాడు. ఆయన చిత్తశుద్ధిని శంకించడం లేదు. మాయావతి ముఖ్యమంత్రి అయిన దగ్గరనుండి ములాయం చేపట్టిన రాజకీయ చర్యలు, గూండా చర్యలను గమనిస్తే ములాయం అధ్వర్యంలో ప్రభుత్వం నడిపినప్పుడు దళితులపైన జరిగిన భయానకమైన అత్యాచారాలు, అంబేద్కర్ విగ్రహాలను అవమానించే అనేక కుత్సిత చేష్టలు ఉ.సా. అర్థం చేసుకొని ఉండేవాడు. ములాయంను బి.సిలకు ప్రతినిధిగా భావించడం ఉ.సా. మెదడులో

ఎక్కడో జరిగిన లోపం. ములాయం సింగ్ స్పష్టంగా పాలకవర్గాల ప్రతినిధి.

ఇప్పుడు మాయావతి గెలిచింది. ఎవరు ఏం చేస్తారు? ఏం చేస్తారో చూద్దాం! మాయావతికూడా ఉత్తరప్రదేశ్ రాష్ట్ర, దేశ రాజకీయాల్లో ఏం పాత్ర పోషించబోతుందో కనీసం ఎదురుచూసే సంయమనం పాటించాలి.

లక్నోలో పెరియార్ మీటింగ్‌ను బహిష్కరించి ఆయన్ను లక్నో ప్రవేశించనీయకుండా చేసిన పరిస్థితుల నుండి, అదే లక్నో నడిబొడ్డున పెరియార్ మేళా జరిపించడం, అధికారంలోకి వచ్చిన మొదటి నెలలోనే పది లక్షల ఎకరాలను పేద ప్రజలకు ముఖ్యంగా దళిత బహుజనులకు పంచిపెట్టిన (కాగితాల్లోకాదు, నిజంగా) ఘనత బి.యస్.పి. ప్రభుత్వానిదే. మల్లేపల్లి లక్ష్మయ్య గారి లాంటి దళితమేధావులు ఇది అనుసరణీయం కాదు అనే వ్యాఖ్యానం చేశారు. ఇది చరిత్ర నిరూపించే అంశం.

కాన్షీరామ్ ఒక్కమాట అన్నారు

"నా ప్రజలకు రాజ్యాధికారం రుచి చూపించడానికి నేను ఎవరి భుజాల పైనైనా ఎక్కుతాను. నా భుజాలపైన మాత్రం ఎవరినీ ఎక్కనీయనని" ప్రకటించారు. అదేదారిలో మాయావతి. దళిత బహుజనుల అభివృద్ధి కోసం రాజ్యాధికారం సాధించింది. ఆమె పైన అవినీతి ఆరోపణలుకూడా ఉన్నాయి అంటున్నారు చాలా మంది మేధావులు. రానీ... ఎన్ని ఆరోపణలు, అభియోగాలు వచ్చినా నిర్ణయించేది కాలం, చరిత్ర. చరిత్ర నిర్మాణంలో బి.యస్.పి. ఇంకొక ముందడుగు వేసింది.

ఇప్పుడు బుద్ధుడు లేడు, అంబేద్కర్ లేడు, కాన్షీరామ్ లేడు, మాయావతి తన వంతు ప్రయత్నం చేస్తుంది. కొంచెం చూడండి. విమర్శించవద్దని కాదు. మీ మీ దృక్పథాల నుండి కాక వాస్తవాల ప్రామాణికంగా విమర్శించండి. దళిత బహుజనులు ఈ దేశ సింహాసనాలపైన కూర్చొని రాజ్యాధికారాన్ని చలాయించే కాలం ఇంకెంతో దూరంలేదు.

గుండె జబ్బులున్నవాళ్లు, కాస్త పరీక్షలు చేయించుకొని మందులువాడండి, రాబోయే పరిణామాలకు సిద్ధపడండి.

వస్తున్నది దళిత బహుజన రాజ్యం. బ్రాహ్మణులు సైతం (బ్రాహ్మణిస్టులు కాదు) దళితుల అండన చేరే చారిత్రక పరిణామం మొదలైంది. కొంచెం మీ మేధావులంతా మీ తూనిక రాళ్లను కాలానుగుణంగా మార్చుకోండి!

**బహుజన కెరటాలు**

# విజేతలను వణికించిన ఓటమి

ఆమె సంకల్పం - తాత్కాలికంగానే అయినా - ఓడిపోయివుండవచ్చు. కానీ ఆ పదిరోజులు ఈ దేశ రాజకీయాలను నడుపుతున్నామని భావిస్తున్న అతిరధ మహారధుల దగ్గర నుండి గ్రామ స్థాయి చోటా మోటా రాజకీయ నాయకుల దాకా ఎవరికీ కంటి మీద కునుకు లేకుండా చేసింది. కాళ్ళ కింద భూమి మాత్రమే కాదు మొత్తం శరీరం లోలోపలి ప్రతి కణమూ గజగజా వణికిపోయింది. మాకు ఎదురే లేదు అని ధీమాగా తిరిగే నాయకులెవ్వరూ నిల్చున్న చోట నిలువ లేదు. మొత్తం భారతీయ రాజకీయ సముద్రంలో సుడిగుండాలు చెలరేగాయి. ఏసీ రూముల్లో మాత్రమే వుండే నాయకులకు ముచ్చెమటలు పోశాయి. ఒక విపరీత కాలమేదో దాపురించబోతున్నట్లు ప్రతి గుండె కలవరపడింది. ఈ దేశాన్ని యికముందు ఎవరు పరిపాలిస్తారు? భయంతో కూడిన సందేహం రాజకీయ జీవుల్ని వెంటాడి వేటాడింది.

దేశ రాజకీయాల్లో యింత అలజడిని ఎవరు సృష్టించగలరు? ఒకే ఒక్క ప్రకటనతో అతిరథ బహురథ మహారథుల రథ చక్రాల్ని కదలనివ్వకుండా ఎవరు నిలువరించగలరు?

బెహెన్ జీ మాయావతి. నిజానికి ఆమె తాత్కాలికంగా కూడా ఓడిపోలేదు. మొత్తం పార్లమెంటరీ రాజకీయం అంతా ఆమె చుట్టూ తిరిగింది. యిప్పటికీ తిరుగుతుంది.

యిష్టమైనా లేకపోయినా ఆమెను సమర్ధిస్తూ కొందరు, ఆమెను బహిరంగంగానే వ్యతిరేకిస్తూ కొందరు తమ తమ రాజకీయాల్లో నిమగ్నమయ్యారు. ఆమె పేరు చెబితేనే ఢిల్లీ పార్లమెంటు ప్రాంగణం దడదడలాడింది. వామ పక్షాల దగ్గరనుండి చంద్రబాబు నాయుడు, టి.ఆర్.ఎస్. వంటి పార్టీలదాకా మా తదుపరి ప్రధాని మాయావతి అని ప్రకటించక తప్పని పరిస్థితి వచ్చింది.

యు.పి.ఏ ప్రభుత్వం ఆమెరికాతో చేసుకోతలపెట్టిన అణు ఒప్పందానికి నిరసనగా బహుజన సమాజ్ పార్టీ అధినేత్రి మాయావతి ఆ కూటమికి తన పార్టీ మద్ధతును ఉపసంహరించుకోవడంతో అసలు కథ మొదలైంది. ఆ తర్వాత వెనువెంటనే వామపక్షాలు కూడా తమ మద్ధతును ఉపసంహరించుకోవడంతో మన్మోహన్ సింగ్ ప్రభుత్వం పార్లమెంటు విశ్వాసాన్ని చూరగొనవలసిన పరిస్థితి ఏర్పడింది.

అణు ఒప్పందం భారతదేశానికి ఏ మాత్రం మేలు చేసేది కాదనీ, అందునా అమెరికా పెత్తందారీతనమూ, పెద్దన్నయ్యతనమూ చలాయించే ఐ.ఎ.ఇ.ఎ ఒప్పందం ఏకపక్షంగా వుంటుందనీ, దాని వలన దేశ సార్వభౌమాధికారమే పోయే ప్రమాదం వుందనీ మాయావతి స్పష్టం చేసింది. అంతేకాకుండా పాశ్చాత్య దేశాల నుండి యుద్ధ భయంతో మొత్తం ముస్లిం దేశాలు ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని బతుకుతున్నాయనీ, ఈ ఒప్పందం వలన వాళ్ళ

మనోభావాలు మరింతగా గాయపడి వారిలో అభద్రతా భావం గూడు కట్టుకొంటుందనీ మాయావతి వివరించింది.

విషయం ప్రధాని మన్మోహన్ సింగ్‌కు తెలుసు, యు.పి.ఎ అధినేత్రి సోనియా గాంధీకి తెలుసు, యింకా అతిరథ మహారథులైన పెద్దలందరికీ తెలుసు. అయినా అణు ఒప్పందం వైపే వాళ్ళు మొగ్గు చూపారు.

అమెరికాతో వాళ్ళకున్న 'అణు' బంధం అంతటిది. అణు ఒప్పందానికి దేశం వ్యతిరేకంగా వుందని, ముఖ్యంగా యు.పి.ఎ.ను సమర్ధించే ప్రధాన పక్షాలు దాన్ని వ్యతిరేకిస్తున్నాయని తెలిసిన వెంటనే అణు ఒప్పందం ప్రతిపాదనని ప్రభుత్వం ఉపసంహరించుకోవలసింది. లేదా యింటా బయటా అసమ్మతీ, అవిశ్వాసం వ్యక్తం అవుతున్న నేపథ్యంలో రాజీనామా చేసి ప్రభుత్వాన్ని రద్దు చేసి ఎన్నికలకు వెళ్ళి వుండవలసింది. కానీ సోనియాగాంధీ నాయకత్వంలోని యు.పి.ఎ ప్రభుత్వం విశ్వాస పరీక్షలో నిలబడదలచుకుంది. అమెరికా సామ్రాజ్యవాదం, బహుళజాతి కంపెనీలు, అంబానీల ప్రయోజనాలను కాపాడడానికి దేశ గౌరవాన్ని సార్వభౌమాధికారాన్ని అమెరికాకు వినమ్రంగా తాకట్టు పెట్టడానికి సిద్ధపడ్డారు. యింటా బయటా జనమంతా ముఖాల మీద ఉమ్ములు వేస్తున్నా ఉమ్ముల్ని తుడుచుకుని నవ్వుల్ని నటించడానికే సిద్ధపడ్డారు.

పార్లమెంటు ఎంతగా పందులదొడ్డిగా మారగలదో, ప్రజల ఓట్లతో గెలిచిన పార్లమెంటు సభ్యులలో ఎంత వెకిలితనముందో ఈ ప్రహసనం రుజువుచేసింది. ఎంపీల కొనుగోలు కోసం నేరుగా అంబానీలే రంగంలోకి దిగారు. కరుడు కట్టిన కమ్యూనిస్టు, క్రమశిక్షణతో ఎదిగిన స్పీకర్ సోమనాథ్ ఛటర్జీ పార్లమెంటు సౌఖ్యాల మోహంలో కూరుకుపోయాడు. యు.పి.ఎ అధినేత్రి సోనియాగాంధి ప్రధానమంత్రి పదవి కోరివచ్చినా తిరస్కరించిన త్యాగశీలిగా పలువురి మన్ననలను అందుకున్న అధినేత్రి స్వయంగా గుర్రాల కొనుగోలు కేంద్రాన్ని తెరచి బేరసారాలను చూడడం ఒక చారిత్రిక విపరిహాసం. యితర పార్టీల యంపీలను ఎరవేయడం, వాళ్ళు పార్టీ కట్టడులు దాటి బయటకు వచ్చేలా చేయడం, వారిని సకల విధాలా ప్రలోభ పెట్టడంవంటి హేయమైన కార్యక్రమాలన్నింటికీ సోనియాగాంధి సారధ్యం వహించింది. తన అర్ధశాస్త్రం, తన గణాంకాలు తప్ప మరింకే విషయాలు తనకు పట్టవన్నట్లుగా కనిపించే ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ ఈ తతంగంలో తైతక్కలాడారు. ఎంతో కాలంగా అణుఒప్పందాన్ని వ్యతిరేకిస్తున్న ములాయం సింగ్, అమర్ సింగ్‌లు స్వయంగా యంపీల కొనుగోలు వ్యవహారానికి దళపతులుగా వ్యవహరించారు. అనేక అక్రమాలకు పాల్పడ్డారు. అంతా ఇసుక తక్కెడ పేడతక్కెడ అయ్యింది. కార్పొరేట్ సంస్థల కోసం, బహుళ జాతి సంస్థల కోసం అమెరికా కోసం యుపిఎ ప్రభుత్వం సకల అడ్డదారులు తొక్కింది.

యింత గందరగోళంలో కూడా మొక్కవోని ధైర్యంతో నిలబడిన ఏకైక నాయకురాలు

మాయావతి. దేశం కోసం, దేశంలోని దళిత బహుజనులే కాక సర్వజనుల కోసం, అణగారిన మూడో ప్రపంచ దేశాల కోసం ఆమె యోధురాలిగా నిలబడింది. దేశానికి కారుచీకట్లో ఒకే ఒక్క కాంతిరేఖ మాయావతి.

విశ్వాసం వీగిపోతే మాయావతి ప్రధానమంత్రి. ఒక స్త్రీ, ఒక దళితురాలు, ఒక మాదిగ స్త్రీ ప్రధానమంత్రి పీఠాన్ని అధిష్టించడానికి కుల సమాజం అంత తొందరగా ఎందుకు ఒప్పుకొంటుంది? ఉలిక్కిపడింది. కలత చెందింది. కలవరపడింది. సర్వశక్తుల్నీ కూడగట్టుకొని ఆమెను ప్రధానమంత్రిగా కాకుండా చేయడానికి మానవ ప్రయత్నాలన్నీ చేసింది. డబ్బు, అధికారం, పలుకుబడి, కుల సంబంధాలు అన్నీ రంగంలోకి దిగాయి.

విశ్వాస పరీక్ష యుపిఎ పక్షాలకు ముఖ్యంగా కాంగ్రెస్ పార్టీకి జీవన్మరణ సమస్య. అది ఎంతకైనా తెగిస్తుంది, దానికి శత్రుపక్షంగా వ్యవహరిస్తున్న ఎన్.డి.ఎ కూటమి కూడా ముఖ్యంగా దానికి నాయకత్వం వహిస్తున్న భారతీయ జనతా పార్టీ కూడా లోపాయికారీగా వ్యవహరించింది. పేరుకి కాంగ్రెస్ పార్టీకి వ్యతిరేకులే అయినా ఒక దళిత స్త్రీ మాయావతి ప్రధానమంత్రి అయ్యే విషయంలో మానసికంగా ఒక్కటిగానే వున్నారు.

అన్ని అడ్డదారులు తొక్కి యుపిఎ ప్రభుత్వం విశ్వాస పరీక్షలో నెగ్గింది. విశ్వాసాన్ని కొనుక్కోవడం కోసం వాళ్ళు పంచిన డబ్బు పార్లమెంటులో పదిలంగానే వుంది. ఆయారామ్ గయారామ్‌ల ఉరుకుల పరుగుల తొక్కిసలాటలో అన్ని పార్టీల ముఖాలపైనా పడిన బురద అలానే వుంది.

ఒక్క మాయావతి కడిగిన నల్లని వజ్రంలా భారత రాజకీయాకాశంలో ధృవతారలా నిలబడివుంది. అమెరికా కనుసన్నల మధ్యన కార్పొరేట్ సంస్థలు వెదజల్లిన డబ్బు సంచుల మధ్య, సోనియాగాంధి ఆదేశాల మేరకు రాజశేఖర రెడ్డిలాంటి తైనాతీల దాకా ఆడిన రాజకీయ చదరంగాల మధ్య, ములాయం సింగ్, లాలూ ప్రసాద్ యాదవ్ తదితర అస్మదీయుల విద్రోహాల మధ్య బలహీనుడైన మన్‌మోహన్‌సింగ్ గజగజ వణుక్కుంటూ విశ్వాసపరీక్షలో గెలిచాడు.

చిత్రమైన గెలుపు. ఓటమి కంటే హీనమైన గెలుపు. ఒక్క మాయావతి మాత్రమే ఓడిపోయి కూడా విజయ దరహాసాలతో నిలబడి వుంది. ఆమె నవ్వులో నేనే భావి ప్రధానిని అన్న ప్రకటన వుంది. ఆమె ఠీవిలో వేల ఏళ్ళుగా ఆత్మగౌరవం కోసం దళితులు సాగిస్తున్న పోరాటం వుంది.

ఆమె ఓడిపోయింది నిజమే. కానీ గెలిచిన వాళ్ళందరినీ గజగజా వణికించిన ఓటమి. భవిష్యత్ విజయానికి సోపానంగా మారిన ఓటమి.

ప్రపంచానికి ఒక నమ్మకం కుదిరింది. భావి భారత ప్రధాని మాయావతి.

**జులై 2008 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# కరుణానిధికి జేజేలు పలుకుదాం!

ఓ ఉన్మాదానికి విశ్వాసమన్న పేరు పెట్టారు. ఒకానొక దుర్మార్గపు అరాచక రాజకీయానికి ప్రజల మనోభావాలన్న సున్నితపు జలతారు తొడుగు తొడిగారు. పత్రికలు, ప్రసారసాధనాలు సైతం అదీ తప్పే, ఇదీ తప్పే అన్న గోడమీద పిల్లి వైఖరి అవలంబించేలా ఎమోషనల్ బ్లాక్ మెయిల్‌కు గురిచేశారు.

రాముడు మళ్ళొక్కసారి సాధనమయ్యాడు. ఆయుధమయ్యాడు. భారతీయ జనతా పార్టీ తన ఎన్నికల ప్రచారానికి మళ్ళొక్కసారి రాముణ్ని ముందు పెట్టి కుచ్చిళ్ళు సవరించుకుంటుంది. రామ జన్మభూమి వివాదం అలాగే వుంది. గోద్రా సంఘటన సాకుతో గుజరాత్‌లో జరిగిన దుర్మార్గమైన మారణకాండ, జనహననం, నరమేధం ఇంకా దేశం గుండెల మీద పచ్చి పచ్చి గాయంగా రసి కారుతూనే వుంది. ఇప్పుడు హిందూ ఫాసిస్టు ఉన్మాదుల అమ్ముల పొదిలోకి రామసేతువు పేరిట మరొక మారణాయుధం చేరింది. బి.జె.పి. శ్రేణుల్లో సమరోత్సాహం చెలరేగింది. ఎన్నో లక్షల ఏళ్ళ క్రితం జరిగిందో లేదో తెలియని రామాయణంలోని లంకకు, వానర ఆదివాసులు కట్టారని చెబుతున్న వారధి, నిజమో కాదో తెలియదు

"కలదు కలండనె వాడు కలడో లేడో" అన్న సందేహం ముమ్మాటికీ లేనేలేదు. గౌతమ బుద్ధుడు లాగా శ్రీరాముడు చారిత్రక పురుషుడు కాదు. ఒక వేళ అయితేగియితే అతడు దక్షిణాదికి వచ్చిన దాఖలాలు చరిత్రలో లేవు. ఒకవేళ శ్రీరాముడనే వాడుంటే వాల్మీకి రామాయణం ప్రకారమే అతడొక స్త్రీలోలుడు. పచ్చి వ్యభిచారి. తాగుబోతు, మద మత్సర ఉన్మాది. అయినా రాముడు సెంటిమెంట్‌ను భారతీయ జనతాపార్టీ వాడుకోదలుచుకుంది. హిందూ మతోన్మాదులు ఒకవైపు, హిందూ సెక్యులరిస్టులు మరోవైపు రామసేతు వివాదాన్ని రాజకీయం చేసే దుశ్చర్యకు పాల్పడుతున్నారు.

ఆ వారధి శ్రీరాముడి సారథ్యంలో వానర సేనలు కట్టిందేనని హిందూ మతోన్మాదులు ప్రచారం చేస్తూ, హిందువులను రెచ్చగొట్టే ప్రయత్నం చేస్తుంటే, మరోవైపున ఆ వాదనకు సాంకేతిక సాధికారతను కల్పించటానికి నిపుణులుగా చెప్పుకుంటున్న వాళ్ళు, అదే వారధి సునామీకి అడ్డుగా నిలబడి, తమిళనాడుకు ఎక్కువ ప్రాణనష్టం జరక్కుండా నిలువరించగలదని ప్రచారం చేస్తున్నారు. ఆధిపత్య వాదులు, ఉన్మాదులు మతంపేరుతో, కులంపేరుతో సాగించే అకృత్యాలను ప్రజలు సహితం ఆమోదించే పరిస్థితి వస్తే అది ఫాసిజం అవుతుంది. అయితే ఉన్మాదాన్ని, అణచివేతను, అరాచకాలను ఎదుర్కొన్న ప్రజల వీరగాధలు చరిత్ర పొడవునా నమోదయ్యే ఉన్నాయి. అటువంటి ఒకానొక వీరగాధ ఆధునిక భారతంలో నమోదయింది. అది కరుణానిధి అనే జానపద వీరుడు రూపంలో నమోదయ్యింది.

పెరియార్ నిర్మించిన ద్రవిడ ఉద్యమానికి రాజకీయ వారసులుగా ఎదిగి, రాజకీయాధికారాన్ని చేజిక్కించుకున్న ద్రవిడ పార్టీలు పెరియార్ ఆశయాలకు ఏనాడో తిలోదకాలిచ్చాయి. మళ్ళీ ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు కరుణానిధి సిసలైన పెరియార్ వారసుడుగా మాట్లాడి భారత ప్రజాస్వామిక వాదుల పరువు నిలబెట్టారు. శ్రీరాముడి వ్యవహారాన్ని వాల్మీకి రామాయణం నుంచే ఉటంకించి, రామసేతువు విషయాన్ని ఉతికి ఆరేశాడు. భారతీయ జనతా పార్టీ ఉలిక్కిపడింది. సంఘ పరివారం అంతా కదలబారింది. పదే పదే ముస్లింలను వ్యతిరేకించే సంఘపరివారం, ఫత్వా జారీచేయటం అనే ముస్లిం సాంప్రదాయాన్ని సొంతంచేసుకుంది. కరుణానిధి తల, నాలుక కోసి తెచ్చి ఇచ్చిన వారికి బంగారం ఇస్తానని ప్రకటించింది. అయితే కరుణానిధి కలవరపడలేదు. భయపడలేదు. తల నరికేసినా, నాలుక కోసేసినా, కళ్ళు పీకేసినా తానన్న మాటలకే కట్టుబడి వుంటానని అవే మాటల్ని పునరుద్ఘాటించారు. తన తలకు బంగార మంత విలువ పెంచినందుకు తన ప్రజలకు కృతజ్ఞతలు తెలియజేశారు. దుర్మార్గపు అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా బోనులో నిలబడి గర్జించిన సద్దాం హుస్సేన్ లాగా వీరుడుగా నిలబడ్డారు.

వాల్మీకి సాక్షిగా, అంబేద్కర్ సాక్షిగా, పెరియార్ సాక్షిగా, కాన్షీరామ్ సాక్షిగా రామసేతువు లేదు. లేదు. లేదు.

కరుణానిధి అందుకే ప్రజాస్వామిక వాదులందరి తరపున బోనులో నిలబడ్డారు. అందుకు ప్రజాస్వామ్యాన్ని ప్రేమించే ప్రజలందరూ ఆయనకు జేజేలు పలకాలి. ముందు సరిగానే స్పందించిన యూ.పి.ఏ ప్రభుత్వం రాజకీయ వత్తిళ్ళకు భయపడి, లొంగిపోయి, ప్లేటు ఫిరాయించి మాట మార్చింది. కేంద్రం కరుణానిధి మార్గాన్నే అనుసరించాలని భారత ప్రజలంతా ప్రభుత్వంపై వత్తిడి తీసుకురావాలి. ముఖ్యంగా ఈ దేశానికి భవిష్యత్ పాలకులైన దళిత బహుజనులు ఈ కర్తవ్య సాధనకు ముందుండి నడవాలి.

**2007 అక్టోబర్ – బహుజన కెరటాలు సంపాదకీయం**

# ఒక మహా విద్రోహానికి ముప్పాతికేళ్ళు!

దళితులపై జరుగుతున్న అత్యాచారాలకు వేల ఏళ్ళ చరిత్రే వున్నప్పటికీ, ఆధునిక ఇండియా చరిత్రలోనే జరిగిన అత్యాచారాల్లోకెల్లా ఘోరమైన అత్యాచారం, 1932 సెప్టెంబర్ 24వ తేదీన జరిగింది. అది ఒక మహా విద్రోహం. కొమ్ముల కోరల మహా రాక్షసుల రూపంలో ఆ దాడి జరిగివుంటే, దళితులు ఎదుర్కొనేవారో, పోరాడేవారో, పోరాడి ఓడిపోయేవారో, గెలిచి ఓడేవారో, ఓడి గెలిచేవారో, చరిత్ర నమోదు చేసి వుండేది. ఆ దాడి గాంధీ బోసినవ్వుల రూపంలో జరిగింది. అదే పూనా ఒప్పందం.

దళిత అణగారిన కులాలకు బహుజన జాతులకు జరిగిన దారుణమైన ద్రోహం. దళితులకు ఏకైక నాయకుడైన బాబాసాహెబ్ డా. బి.ఆర్.అంబేద్కర్‌తో పాటు యావద్భారత దేశంలో ఈ ఒప్పందంతో దళితులు వంచించబడ్డారు. భారత జాతిపితగా పేరొందిన గాంధీ కుట్రపూరితంగా చేసిన దుర్మార్గంతో, విద్రోహపూరితంతో, బ్లాక్‌మెయిలింగ్‌తో చేసిన ఒప్పందం అది. గాంధీ బోసినవ్వుల నుండి విషం కురిసింది. ఆశలూరు కన్నులతో నింగిని చూసే దళిత పసి కన్నులలో నిప్పుల వాన కురిసింది. ఒక తరం జీవితాల పైన భయానకమైన చీకటి మేఘం ముసిరింది.

కమ్యూనల్ అవార్డు ప్రకటించిన నాటినుంచీ గాంధీ అన్నం తినటం మానేశాడు. దళితుల హక్కులను మాత్రమే తినటం మొదలు పెట్టాడు. ఆ రోజు నుండి అంబేద్కర్ పైన తీవ్రమైన వత్తిడి మొదలైంది. 1930లో జరిగిన మొదటి రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కి గాంధీ హాజరు కాలేదు. భారత స్వాతంత్ర్యానికి సంబంధించిన కీలకమైన సమావేశానికి స్వాతంత్ర్య పోరాట రధసారధిగా తనను తాను అభివర్ణించుకున్న గాంధీ దూరమయ్యాడు. దళిత జాతులకు మాత్రమే ప్రతినిధిగా వెళ్ళిన డా॥ అంబేద్కర్ మొత్తం దేశం తరుపున మాట్లాడారు. బ్రిటిష్ పాలకులపైన నిప్పులు చెరిగారు. దేశ ప్రయోజనాలకే తాను మొదటి ప్రాధాన్యతనిస్తానని స్పష్టంచేశారు. అప్పుడు కాంగ్రెస్ తరపున, దేశం తరుపున కాన్ఫరెన్స్‌కి హాజరైన వారికెవరికీ నోట మాటలేదు. అతిరథ మహారథులున్నారు. అయినా గాంధీ లేకుండా మేమేమీ మాట్లాడలేమని వాళ్ళు స్పష్టం చేశారు. గాంధీ మాటే మామాటని ప్రకటించి మౌనంగా ఉండిపోయారు. ఒక వైపున దళిత హక్కులు, మరో వైపున దేశ ప్రయోజనాలు రెండు చేతులా, రెండు కర్తవ్యాలను ఒక్క అంబేద్కర్ మాత్రమే ఒంటి చేత్తో నిర్వర్తించాడు. గాంధీతో సహా భారత జాతీయ నాయకులందరు అంబేద్కర్ పాత్రను ప్రశంసించారు. ముఖ్యంగా గాంధీ, అంబేద్కర్ దేశభక్తిని, నిబద్ధతను స్వయంగా వేనోళ్ళ కొనియాడాడు. రెండవ రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌కి గాంధీ స్వయంగా హాజరైనాడు. అప్పటినుండి అంబేద్కర్ దళితుల హక్కుల కోసం మాత్రమే మాట్లాడటం మొదలుపెట్టారు. ముఖ్యంగా ఎన్నికల్లో ప్రధాన

రాజకీయపక్షాల తరుపున దళితులే ఎన్నికైనప్పటికీ, దళితులకు ఒరిగేది ఏమీలేదని వాళ్ళని గెలిపించినప్పటికీ అగ్రకులాలకు పాలేరులుగా మాత్రమే వాళ్ళు ఉంటారని అంబేద్కర్ ప్రకటించారు. కాబట్టే దళిత ప్రతినిధులను దళితులు మాత్రమే ఎన్నుకొనే వాతావరణం ఉండాలని అందుకు కమ్యూనల్ అవార్డు మాత్రమే పరిష్కార మార్గమని అంబేద్కర్ వాదించారు. గాంధీ అంబేద్కర్‌ను అడ్డుకునేందుకు శత విధాలా ప్రయత్నించాడు. అంబేద్కర్ వాదనా పటిమ ముందు మహరాష్ట్రలోని హిందూ నాయకులు, కాంగ్రెస్ నాయకులు దేశస్థాయిలోనే రాజగోపాలచారి వంటి జాతీయ నాయకులు వీగిపోయారు. చివరకు జె.డి బిర్లా లాంటి పారిశ్రామిక వేత్తలను రంగంలోకి దించారు. (గాంధీ చనిపోయింది సబర్మతి ఆశ్రమంలో కాదు జె.డి. బిర్లా ఇంట్లో).

1932 ఆగష్టు 17వ తేదిన అంబేద్కర్ లండన్ నుంచి భారతదేశం తిరిగి వచ్చారు. అప్పటివరకు ఏ సమావేశంలోనూ అంబేద్కర్ వాదనలకు గాంధీ సమాధానం చెప్పలేదు. బహిరంగంగా వ్యతిరేకించనూ లేదు. అంబేద్కర్ భారతదేశానికి వచ్చిన మరుక్షణమే బ్రిటీష్ ప్రధాని రామ్‌సే మెక్డోనాల్డ్ కమ్యూనల్ అవార్డును మంజూరు చేస్తూ ప్రకటన చేశాడు. ఇది దళిత జాతుల పోరాటాలు అంబేద్కర్ రూపంలో సాధించుకున్న విజయం. అంబేద్కర్‌ను వాదనలో, తర్కంలో హేతువాదంలో జయించడం సాధ్యంకాదని గుర్తించిన గాంధీ ఇక ఏ మార్గమూ లేని పరిస్థితుల్లో హిందూ ప్రజల మనోభావాలను రెచ్చగొట్టడానికి పూనుకున్నాడు. అందుకు ఒకటే మార్గం ఆమరణ నిరహారదీక్ష. తనకు చావాలన్న కోరిక ఏమాత్రమూ లేదు. రవీంద్రనాధ్ ఠాగూర్‌కు ఆయన పర్సనల్ సెక్రటరీకి రాసిన లేఖలే అందుకు తార్కాణం. జాతిపితగా ప్రజల్లో గాంధీకున్న జనాకర్షణను ఉపయోగించుకొని, అంబేద్కర్‌ని ఓడించడానికి గాంధీ పూనుకున్నాడు. గాంధీ దగ్గర సహేతుకమైన వాదనేదీ లేదు. ప్రజలను ఒప్పించడానికి కావలసిన విశ్వసనీయతలేదు. ఆఖరి అస్త్రం తాను ప్రాణ త్యాగం చేస్తానన్న బ్లాక్‌మెయిల్. ఆ బ్లాక్‌మెయిల్ వలన అంబేద్కర్ అన్నిచోట్ల వాదనల్లో గెలిచినా న్యాయాన్ని పొందలేక పోయారు. ప్రపంచమేధావిగా, న్యాయశాస్త్రనిపుణుడిగా అనేక దేశాల రాజ్యాంగాలను అవుపోసన పట్టిన విజ్ఞుడిగా, అంబేద్కర్ తన వాదాన్ని ప్రపంచం ముందు నిలబెట్టారు. ప్రపంచంలోని పీడిత జాతులందరి తరుపున సామాజిక న్యాయం కోసం బోనులో నిలబడ్డారు.

* * * *

గాంధీ మరణిస్తే దానికి కారణం అంబేద్కరేననే వాతావరణం దేశ వ్యాప్తంగా సృష్టించ బడింది. కమ్యూనల్ అవార్డు సాధించిన ఆనందంతో "మనం ఈ దేశానికి పాలకులం కాబోతున్నామని మీ గోడల మీద రాయండి" అని అంబేద్కర్ చేసిన ప్రకటనను ఆచరణలోకి రాకుండా గాంధీ కుయుక్తులు, కుట్రలు పన్ని అడ్డుకున్నాడు. దళితులకు గాంధీచేసిన ఆ మహాద్రోహానికి ఇప్పుడు ముప్పాతికేళ్ళు.

.....................................

అంబేద్కర్ కలలపంట సామ్రాట్ కాన్షీరామ్, పి.వి. నరసింహారావు ప్రధానిగా ఉన్నప్పుడు కాంగ్రెస్‌తో ఎన్నికల పొత్తుపెట్టుకొని మొత్తం 425 స్థానాలున్న యూ.పి. అసెంబ్లీలో బి.యస్పీకి 300 సీట్లు, కాంగ్రెస్‌కి 125 సీట్లలో పోటీకి ఒప్పందం చేసుకొని "ఇది అంబేద్కర్ - గాంధీల ఒప్పందం" అని మనువాదులకు సవాల్ విసిరారు.

.....................................

చెప్పులు కుట్టే చేతుల్లోకి అధికార రాజ దండాన్ని అంది పుచ్చుకొని ఆర్యావర్తనంలో అధికార పగ్గాలు చేపట్టి చరిత్రను తిరగరాసింది మన మాయావతి!

.....................................

ఇప్పుడు వంద మంది గాంధీలు పుట్టినా, దళితులు పాలకులయ్యే ప్రక్రియను అడ్డుకోలేరు. మనం ఈ దేశానికి పాలకులం కాబోతున్నామని మన అంబేద్కర్ చెప్పిన మాటలను ఇక నిర్భయంగా గోడలమీద రాద్దాం! ఆ రాతల్ని నిజం చేద్దాం!!

**2007 సెప్టెంబర్ - బహుజన కెరటాలు సంపాదకీయం**

# యింతకీ... గెలిచింది ఎవరు!?

'తన్నోడి నన్నోడెనా... నన్నోడి తన్నోడెనా' అంటూ నిండు సభలో ద్రౌపది నిలదీస్తున్నప్పుడు సభలోని పెద్దలకే కాదు కురుసభలోని రాతి గోడలకు కూడా సమాధానం తెలుసు. నిజాన్ని అందరూ వెంటనే ఒప్పుకోక పోవచ్చు.

కవి కాబట్టి కనీసం కులుమనాలీ శీతల పవనాల మధ్య విహరించేటప్పుడయినా మాజీ ప్రధాని వాజ్‌పాయ్ తన ప్రభుత్వం కుప్పకూలిపోవడానికి కారణాలని విశ్లేషించి నిజాలని ఒప్పుకున్నాడు. గుజరాత్‌లో ముస్లింలపైన దుర్మార్గమైన దాడులు చేసి రాష్ట్రాన్ని అల్లకల్లోలం చేసి రక్తపుటేరుల్లో ముంచిన పాపానికి నరేంద్ర మోడిని అప్పటికప్పుడు ముఖ్యమంత్రి పదవి నుండి తప్పించకపోగా మళ్ళీ ఆయన్నే ప్రభుత్వాధినేతగా ఆమోదించడం వల్లనే తమ ప్రభుత్వం కుప్పకూలిపోయిందని ఆయన ఒప్పుకున్నారు. మోడీ విధానాన్ని ఒక అనుసరణీయమైన నమూనాగా దేశమంతటా అమలు చేయాలని భారతీయ జనతా పార్టీ భావించింది. అయితే దేశం యావత్తు మోడీ నమూనానూ, దుర్మార్గపు హిందుత్వ రాజకీయాలను బేషరతుగా తిరస్కరించాయి. రాష్ట్రంలో కూడా బయటకు చెప్పుకున్నా చెప్పుకోకపోయినా చంద్రబాబు నాయుడు నిరంకుశ ప్రజావ్యతిరేక విధానాలవల్లనే తాము ఓడిపోయామని తెలుగుదేశం పార్టీ శ్రేణులు ఒప్పుకొంటూనే వున్నాయి.

వాళ్ళు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా కచ్చితంగా ఎన్.డి.ఎ. ప్రభుత్వం అనుసరించిన ప్రజా వ్యతిరేక విధానాలకూ ముఖ్యంగా భారతీయ జనతాపార్టీ హిందుత్వ విధానానికే ప్రజలు స్పష్టమైన వ్యతిరేకతను ప్రకటించారన్నది వాస్తవం.

ఓటమి సరే. ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా పరాజితులు పాలన నుండి పక్కకు తొలిగి పోయారు. విజయం సంగతే అడ్డదిడ్డంగా వుంది. ఉబ్బితబ్బిబ్బులుగా ఉంది.

యిది నక్సలైట్ల ఎజెండా విజయం అని ప్రముఖ విప్లవ రచయిత పేర్కొన్నారు. కేంద్రంలో మన్‌మోహన్ సింగ్, రాష్ట్రంలో వై.ఎస్. రాజశేఖరరెడ్డి ప్రభుత్వాధినేతలు అయ్యారు. నక్సలైట్ల ఎజెండా విజయం పొంది సాధించదలచుకున్న ఫలితం యిదేనా? యిది ప్రజా ఉద్యమాల విజయం అని ప్రముఖ దళిత నాయకుడు పేర్కొన్నారు. ప్రజా ఉద్యమాలు అంటే ఎన్నో ఏళ్ళుగా ఈదేశంలో సాగుతున్న వామపక్ష ఉద్యమాలు, దళిత బహుజన సామాజిక ఆర్థిక రాజకీయోద్యమాలు, మహిళా విమోచనోద్యమాలు. యివన్నీ గెలవడం అంటే మన్‌మోహన్ సింగ్, రాజశేఖర్ రెడ్డిలు ప్రభుత్వాధినేతలు కావడమా?

ప్రజలు స్పష్టంగానే వున్నారు. బుద్ధుడి కాలం నుండి ఈనాటి వరకు ప్రజావ్యతిరేక విధానాలన్నింటినీ వ్యతిరేకిస్తూనే వున్నారు. తిరస్కరిస్తూనే ఉన్నారు. ధిక్కరిస్తూనే వున్నారు. వ్యవస్థపైన, ఉనికిలో వున్న విధానాలపైన ప్రజలకున్న వ్యతిరేకతను ఒక ప్రత్యామ్నాయ

రాజకీయ నిర్మాణంలోకి, ఒక ప్రజా అధికార నమూనాలోకి సమీకరించడంలో ఆయా ప్రజా ఉద్యమాలు చూపే చొరవను బట్టే ఆయా ఉద్యమాల జయాపజయాలు ఆధారపడి వుంటాయి.

ప్రజలు మూకుమ్మడిగా ఒక దుర్మార్గాన్ని తిరస్కరించిన తరువాత దేన్ని ఎంచుకోవాలో తెలియక తాము ఏనాడో తిరస్కరించిన కాంగ్రెస్ పార్టీని ఎంచుకోవలసి రావడం నిజంగా ఎంత విషాదం. వ్యాఖ్యానాలు ఏమైనా చేయవచ్చు. ఏ వివరాలైనా యిచ్చుకోవచ్చును. బి.జె.పి. అనుసరించిన, అనుసరిస్తున్న మతవాద, ప్రపంచ బ్యాంకు అనుకూల, సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలకు ద్వారాలను తెరిచింది కాంగ్రెస్ పార్టీయే. ఈ విధానాలను ప్రజలు తిరస్కరించినప్పుడు వామపక్ష భావాల, లౌకికవాద విలువలు దళిత బహుజన సమాజవాద వేదికను ప్రజలకు అందుబాటులోకి వుంచవలసిన వామపక్ష, దళిత బహుజన ఉద్యమాలు ప్రజలు తిరిగి కాంగ్రెస్ పార్టీని ఎన్నుకోవడమే విజయంగా భావించడం ఆత్మవంచన, పరవంచన కాదా?

తాచుపాము కాటేసి పోయిన మనిషి ప్రాణం కోసం పెనుగులాడుతుంటే అతని దగ్గరికి వానపాము వెళ్ళి 'మరి మా జాతంటే ఏమనుకున్నావ్' అని కాలరెగరేసినంత హాస్యాస్పదంగా లేదా?

యింతకూ ప్రజా ఉద్యమాలుగా చెప్పుకొనే ఉద్యమాలు తామోడి ప్రజల్ని ఓడించాయా? గెలిచిన ప్రజల విజయాన్ని తమ విజయంగా చెప్పుకుంటున్నాయా?

ఒక లౌకిక సామ్యవాద రాజకీయ ప్రత్యామ్నాయాన్ని ప్రజలకు చూపించడం కదా అసలు విషయం.

ఎక్కువ కష్టపడాల్సి రావచ్చు. కానీ గెలుపుకు అడ్డదారులు లేవు.

**జూన్ 2004 – బహుజన కెరటాలు**

# మఠాల్లో హంతక ముఠాలు!

కంచిపీఠాధిపతి జయేంద్ర సరస్వతిని తమిళనాడు పోలీసులు ఒక హత్య కేసులో నిందితుడిగా అరెస్టు చేశారు. బహుశా చాలా అరుదైన సందర్భాలలో 'చట్టం తన పని తాను చేసుకు పో యింది. హిందూ సామ్రాజ్యవాదం విస్తరణకు హిందూ దేవాలయాలు చేసిన కృషికంటే 'మఠాలు' నిర్వహించిన క్రూరమైన పాత్రే ఎక్కువని స్వామి ధర్మతీర్థ ఏనాడో చెప్పారు. హిందూమతం పేరుతో జరిగిన అనేకానేక దారుణాలకు, అకృత్యాలకు, అత్యాచారాలకు, దుర్మార్గాలకు మఠాలు ఆధ్యాత్మిక సమర్ధనను, సాధికారతను యిచ్చాయి. కంచి 'మఠం' పరమ పవిత్రమైనదనీ, పురాతనమైనదనీ, అది శంకరాచార్యుడు స్థాపించినదనీ, దాని అధినేత జయేంద్ర సర్వస్వతిని అరెస్టు చేయడం ద్వారా హిందువుల మనోభావాలను గాయపర్చారని విశ్వహిందూ పరిషత్, అరెస్సెస్, బి.జె.పి.లు దేశవ్యాప్తంగా గగ్గోలు పెడుతున్నాయి. కంచి 'పీఠం'తో సహా ఏ శంకరమఠము హిందువులందరి మనోభావాలకు ఏనాడూ ప్రాతినిధ్యం వహించలేదు. సరికదా శైవ, వైష్ణవ సంఘర్షణలతో జరిగిన రక్తపాతానికి శైవుల తరఫున ప్రాతినిధ్యం వహించాయి. అన్నింటికీ మించి బౌద్ధారామాల పైన జరిగిన దుర్మార్గమైన దాడులకు, జరిగిన రక్తపాతానికీ శంకర మఠాలు నాయకత్వం వహించాయి. కంచి పీఠాన్ని ఆది శంకరాచార్యుడు స్వయంగా ఏర్పాటు చేయలేదన్న వాస్తవం వేరే సంగతి. అది చరిత్ర కారులు తేల్చుకుంటారు. అయితే కంచి శంకర పీఠం ఎన్నడూ సమస్త హిందువుల మనోభావాలకు ప్రాతినిధ్యం వహించలేదు. సరికదా హిందువుల్లోని ఒక వర్గం మనోభావాలను ఎప్పుడూ అది గాయపరుస్తూనే వుంది. అది అశోక్ సింఘాల్‌కీ తెలుసు. అద్వానికీ తెలుసు.

హిందూమతం పట్ల అద్వానికీ, బిజెపికీ, విశ్వహిందూ పరిషత్‌కు ఎంత ప్రేమ వుందో ఈ ఉదంతం ద్వారా తెలుస్తుంది. నిజంగా కంచిపీఠాన్ని అతి పవిత్రమైన పీఠంగానే వాళ్ళు భావిస్తుంటే, ఆ పీఠం పవిత్రతను నాశనం చేసే నేరారోపణలకి గురైనందుకు, ఆ పీఠం ప్రతిష్ఠను వార్తల్లోకెక్కి పాడు చేసినందుకు పీఠం పరువు మర్యాదలను కాపాడేందుకు జయేంద్ర సరస్వతి పైన వాళ్ళు నిప్పులు చెరిగేవాళ్ళు. దాన్ని వాళ్ళు రాజకీయం చేయదలచుకున్నారు. బాబ్రీమసీదు విధ్వంసం తర్వాత కేంద్రంలో, అనేక రాష్ట్రాల్లో అధికారం కోల్పోయిన తర్వాత వాళ్ళకొక బలమైన ప్రచారాస్త్రం లేకుండా పోయింది. జయేంద్ర సరస్వతి చేసిన దుర్మార్గమైన నేరం వాళ్ళకు పట్టుకొమ్మగా అనిపించింది. దాంతో దాన్ని దేశవ్యాప్త అంశంగా ప్రతీఘాతక ఉద్యమాలను చెలరేపాలని విఫల ప్రయత్నాలు చేస్తున్నారు.

చట్టం ముందు అందరూ సమానమేనని భారత రాజ్యాంగం చెపుతుంది. అందరూ సమానం కాదని సాక్షాత్తు ఈ దేశానికి ప్రధాన మంత్రిగా పనిచేసిన వాజ్‌పేయి, ఉప ప్రధానిగా చేసిన అద్వానీలు చెపుతున్నారు. ఒక హత్యానేరంలో ముద్దాయిగా ఉన్న వ్యక్తిని

అరెస్టుచేసి కోర్టులో ప్రాసిక్యూట్ చేయడాన్ని వాళ్ళు తప్పుపడుతున్నారు.

ఒక ప్రజాస్వామిక ప్రక్రియను వ్యతిరేకించే వాళ్ళకు ప్రజాస్వామిక రాజకీయాల్లో వుండే హక్కు, అర్హత వుండడానికి వీలులేదు. కానీ వాళ్ళు యింకా జాతీయ రాజకీయాల్లో ప్రముఖులుగానే కొనసాగుతున్నారు.

మఠాల నిర్వహణ పేరుతో జరుగుతున్న దారుణమైన అవినీతి కార్యకలాపాలను సమర్థిస్తూ అధికారపీఠాలకోసం జరిగే కుట్రలో కూరుకుపోయి, హత్యాకాండలను సైతం రాజకీయాలకు అనుకూలంగా మార్చుకునేంతగా దిగజారారు.

రాజ్యాంగ స్ఫూర్తిని విశ్వసించే ప్రజలెవ్వరూ ఈ దురాగతాలను ఈ అవకాశవాద రాజకీయాలను సహించరు. క్షమించరు. హంతక ముఠాలను పెంచి పోషిస్తున్న మఠాల బండారాల పైన వెంటనే సమగ్రమైన విచారణ జరిపి బాధ్యులందరి పైనా తగినచర్యలు చేపట్టాలి. కంచి మఠంలోనూ, సత్య సాయిబాబా ఆశ్రమంలోనూ జరిగిన హత్యాకాండలతో పాటు బాబాల పేరుతో, అమ్మల పేరుతో చలామణీ అవుతున్న అన్ని మఠాలపైనా సుప్రీంకోర్టు న్యాయమూర్తి సమగ్రమైన విచారణ జరిపించి నేరస్థులందరినీ ఏ మినహాయింపు లేకండా శిక్షించాలి.

మతం వ్యక్తిగతం అయినంత వరకు పర్వాలేదు. అది సామాజిక అంశంగా, రాజకీయ అంశంగా మారితే దాని వికృత విన్యాసాలకు జనం తలలూపే పరిస్థితి ఉంటే అది ఫాసిజం అవుతుంది. ఆ విషం మఠాల నుండి సరఫరా అవుతుంది. ఆరెస్సెస్, బి.జె.పి., విశ్వహిందూ పరిషత్‌లు దానికి ఆజ్యం పోస్తున్నాయి.

యిది బుద్ధుడు పుట్టిన భూమి. అంబేద్కర్ రాజ్యాంగాన్ని అందించిన లౌకిక రాజ్యం. యిక్కడ మతతత్వ రాజకీయాలకు తావేలేని విధంగా ప్రజలు ఉద్యమించాలి. నిజంగానే చట్టం తన పని తాను చేసుకుపోవాలి.

**నవంబర్, డిసెంబర్ 2004 - బహుజన కెరటాలు**

# రెండు అస్తమయాలు - వొకటే గాయం

**డిసెంబర్ ఆరు. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ చనిపోయిన రోజు.**
**డిసెంబర్ ఆరు. బాబ్రీ మసీదు విధ్వంసం జరిగిన రోజు.**
**కోట్లాది హృదయాలు గాయపడ్డ రోజు.**

1891 ఏప్రిల్ 14వ తేదిన పుట్టిన, 1956 డిసెంబర్ 6వ తేదీన చనిపోయిన డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ గురించి నిజానికి బాధపడవలసిన విషయమేదీ లేదు. అరవై ఐదేళ్ళ పాటు జీవించిన మనిషి, తను జీవించదలచినట్లుగా జీవించిన మనిషి అస్తమించడం గురించి పెద్దగా విచారించవలసిన అవసరం లేదు. కానీ అనేక అవరోధాలను ఎదుర్కొని, అనేక ఆంక్షలను అధిగమించి తాను ఏమేమి సాధించాడో, దాన్ని మునుముందుకు తీసుకుపోయే వారసత్వం రూపొందకపోవడం, కనీసం అంబేద్కర్ ఎక్కడ ఆగాడో ఆ స్థాయి వరకైనా చేరకపోవడం నిజంగా అంబేద్కర్ లేని లోటును పదేపదే తలపుకు తెస్తుంది. దళిత జీవితం యిరుక్కుపోయిన చిక్కుముడులను, వాటిని విప్పడానికి జరుగుతున్నాయని చెప్పే ప్రయత్నాల బోలుతనాన్నీ చూస్తుంటే అంబేద్కర్ యింకా బతికే ఉండడం ఎంత అవసరమో పదే పదే స్పష్టమవుతోంది. కానీ అంబేద్కర్ చనిపోయారు.

తరాలుగా విద్యకు, జ్ఞానానికీ దూరమైన అంటరాని కులాల వారిని విద్యావంతుల్ని చేసి, హిందూత్వ సామాజిక నిర్మాణంలోని అట్టడుగు పొరల్లో అనేక కులాలుగా, ఉపకులాలుగా చీలికలు పేలికలుగా ఉన్న అస్పృశ్యులను ఐక్యం చేసి, వారిని మిగతా మనుషులందరితో సమానులుగా ప్రధాన స్రవంతి సామాజికులుగా తీర్చిదిద్ది, కులంపేరుతో, కులవ్యవస్థకు సాధికారితనిచ్చే మతం పేరుతో మనుషుల్ని పశువుల్లాగా చూసే దుర్మార్గపు సామాజిక నీతి స్థానంలో సమతా భావనలు వెల్లివిరిసేట్టు చేసి, అందరికీ సమానవకాశాలుండే పౌరసమాజాన్ని నిర్మించి పౌరులందరి బాధ్యతనూ స్వీకరించి, సమాజానికీ, సమానాత్వానికీ జవాబుదారీగా వుండే ప్రభుత్వాన్ని కలిగివుండే గణతంత్ర రాజ్యాన్ని ఏర్పర్చాలని అంబేద్కర్ కలలు కన్నారు.

అంబేద్కర్ జీవన పరిణామాన్ని, ఆయన దశలవారీగా చేసిన కృషినీ సునిశితంగా పరిశీలిస్తే ఆయన 'క్రాంత దర్శనం' మనకు స్పష్టంగా అర్థమవుతుంది. ప్రతి అడుగూ ఆయన ఎంత ముందు చూపుతో, ఎంత స్పష్టతతో, ఎంత బాధ్యతాయుతంగా వేశారో అర్థమవుతుంది. ఈ స్పష్టతను సాధించడానికి ఆయన సామాజిక పరిస్థితులతో ఎంతగానో పెనుగులాడారు. తొలుత తాను చదువుకొన్నారు. లక్షలాది పుస్తకాలనే కాక, దేశదేశాల్లోని సామాజిక నిర్మాణాలను, మనుషులందరూ మంచిగా మెసిలే సమాజ నిర్మాణం కోసం జరుగుతున్న అనేక ప్రయత్నాలను అధ్యయనం చేశారు. అంటరాని బాలుడిగా ప్రాథమిక పాఠశాలలో అనేక అవమానాలను పొందిన దశనుండి, ఈ దేశానికి ఒక రాజ్యాంగం

రాసిపెట్టే దశవరకు, ప్రకటించిన ఆశయం కోసం మంత్రి పదవిని తృణప్రాయంగా వదిలివేసిన స్థితి నుండి లక్షలాది మంది సహచరులతో బౌద్ధాన్ని స్వీకరించి, ఆయన నిర్వాణం పొందేంతవరకూ నిత్య విద్యార్థిగా అధ్యయనం చేస్తునే వున్నారు. అంటరాని కులాలవారు చదువుకొని ఒక జ్యోతి మరొక జ్యోతిని వెలిగించే రీతిగా తరాల నుండి తరాలకు విద్యాజ్యోతిని అందించి, వారిని ఐక్యపరిచి తన కలల్ని సాఫల్యం చేసే దిశగా సమాజ చోదకులుగా మొదటి తరం విద్యావంతులు పనిచేస్తారని అంబేద్కర్ ఆశించారు. ఈ మొదటి ఆశకు అంబేద్కర్ జీవించిన కాలంలోనే విఘాతం కలిగింది. లక్నోలో జరిగిన సమావేశంలో అంబ్కేర్ స్వయంగా ఈ విషయాన్ని ఆవేదనగా చెప్పారు. 'నా దళితులు విద్యావంతులై, మొత్తం దళిత సమాజాన్ని విద్యావంతుల్ని చేసి వారిని విముక్తి దిశగా నడిపిస్తారని ఆశించాను. కానీ పొట్టకూటికోసం కుమ్ములాడుకొనే గుమాస్తాల గుంపును యిక్కడ చూస్తున్నాను' అని ఆయన కళ్ళనుండి కన్నీరు కారుతుండగా ఆవేదనగా అన్నారు. విద్యావంతులై, ఉద్యోగస్తులైన దళితులు అంబేద్కర్ స్వప్నానికి అప్పుడు పొడిచిన వెన్నుపోటు యింకా పచ్చిగాయంగానే వుంది. ఉద్యోగస్తులైన దళితులు తమ కులాల నుండి దూరమైపోయి ఒక కొత్త సంపన్న వర్గంగా రూపొందడానికి తహతహలాడుతున్నారు. చీలికలైన దళిత కులాలను ఐక్యపర్చి విముక్తి దిశగా నడిపించడం కాక మరిన్ని చీలికలకు, మరింత అనైక్యతకు ఆజ్యం పోస్తున్నారు. తాము పొందిన అవకాశాలను మిగతా వారికి అందనివ్వకుండా, అవకాశాలన్నీ మొదట (అన్ని దళిత కులాల్లోనూ) ఉద్యోగస్తులైన వారి కుటుంబాల మధ్యనే ఉండిపోయేలా అడ్డుగోడలు కడుతున్నారు. వారి అభ్యున్నతే మొత్తం దళితుల అభ్యున్నతిగా కన్పించే విధంగా వ్యవహరిస్తున్నారు. షెడ్యూల్డు కులాల ఐక్యత సుదూర కాలంలో సాధ్యం అవుతోందన్న ఆశైనా మిగలని వాతావరణం ఏర్పడ్డానికి కారణం వీళ్లే. ఈ మధ్య ఐక్యత కోసం ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలుస్తోంది. కానీ జరుగుతోన్న సంప్రదింపులు, ప్రయత్నాలను చూస్తుంటే నాయకుల మధ్య ఐక్యత కోసం మాత్రమే ప్రయత్నాలు జరుగుతున్నట్లు అన్పిస్తోంది. హైందవ కులతత్వం ఏ విధంగా దళిత కులాల వారిని అనైక్యుల్ని చేసిందో, దళిత నాయకులు కూడా దళిత కులాలను, కులాల్లో గ్రూపుల్ని చీల్చివేశారు. (నిజానికి వీళ్ళు అశేష దళిత ప్రజానీకానికి కాక కేవలం విద్యావంతులు, ఉద్యోగులైన దళితులకు మాత్రమే ప్రతినిధులుగా వున్నారు) తమ నుండి మిగిలిన చివరి దళితుడ్ని కూడా చీల్చిన తర్వాత యిప్పుడు ఐక్యతారాగాలు పాడుతున్నారు. ఒంటరులుగా మిగిలిపోయిన దళిత 'నాయకులు' యిప్పుడు తమలో తాము ఒక్కటీ కావాలని ఊసులాడుకొంటున్నారు. (దానికి ఎంత పెద్దపేరు పెట్టినా, 'రౌండ్ టేబుల్' చిన్న పేరే అనుకోండి!) కానీ అంబేద్కర్ కోరుకున్నది 'ఒంటరుల' ఐక్యతను కాదు. సమూహాల ఐక్యతను. ఆ ప్రయత్నం యింకా మొదలు కావలసే వుంది. ఆయన కన్న మరో తీరని కల – కులాలను నిర్మూలించి సమతా భావాల సమాజాన్ని నిర్మించడం.

అందుకోసం దళిత శక్తులు కృషి చేయడం. యిందుకు సాధనంగా దేవుడి ప్రమేయం లేని, మనిషి కేంద్రంగా వుండే బౌద్ధాన్ని ముందుకు తీసుకురావడం. అయితే ఈ గడ్డమీద పుట్టి పెరిగి వేల ఏళ్ళు తన సమతాభావాల ప్రభావాన్ని ఈ దేశం మీద వేసిన బౌద్ధాన్ని బ్రాహ్మణీయ శక్తులు ఏనాడో యిక్కడి నుండి తరిమి వేశాయి. ఆశయాల మీద కౌటిల్య క్రౌర్యాన్ని ప్రదర్శించి రక్తసిక్తం చేశాయి. మిగిలివున్న బౌద్ధ అవశేష శకలాలపైన తమ జెండాలను పాతి బ్రాహ్మణీయం చేసి, బౌద్ధాన్ని సమాజంతో పనిలేని మతాలుగా కుదించివేశాయి. దాన్ని ప్రజల మతంగా మార్చే ప్రయత్నం ఏదీ సమగ్రంగా మొదలే పెట్టలేదు (కొద్దో గొప్పో ప్రయత్నాలు జరుగుతున్నా అంబేద్కర్ మిగతా ఆశయాలతో సంబంధం లేకుండా జరుగుతున్నాయి కదా!) విద్రోహానికి గురైన ఆయన మరో స్వప్నం దళితుల రాజ్యాధికారం. దళితులందరూ విద్యావంతులు అవ్వడానికి విద్యాలయాల స్థాపన ఒక ఉద్యమంగా చేపట్టి, దళిత కులాల మధ్య ఐక్యతను సాధించడానికి షెడ్యూల్డు కులాల ఫెడరేషన్‌ను స్థాపించిన అంబేద్కర్ యిది మాత్రమే చాలదనుకొన్నారు. బౌద్ధం సహాయంతో దళితులూ, సవర్ణులూ కలగలిసిపోయే ఒక మహాప్రయత్నం జరుగుతూ సమాజానికి జవాబుదారీగా వుండే ప్రభుత్వాన్ని ఏర్పర్చేందుకు కృషిచేసే రిపబ్లిక్ పార్టీని స్థాపించాలని ఆయన కలగన్నారు. దాని స్థాపన జరగకుండానే అంబేద్కర్ కన్నుమూశారు. ఎంత విస్తృత స్వభావంతో, ఎంత సెక్యులర్ విలువలతో దళిత రాజకీయోద్యమం నడవాలని అంబేద్కర్ కలగన్నారో దానికి పూర్తి భిన్నంగా అంబేద్కర్ తర్వాతి 'దళిత రాజకీయాలు' నడిచాయి. హైందవ రాజకీయాలకు ప్రత్యామ్నాయంగా దళిత రాజకీయాలు నడవాల్సిందిపోయి, సవర్ణ రాజకీయ పార్టీల పేలవ అనుకరణగా, హిందూత్వ శక్తులతో ఏ మాత్రం తలపడలేనంత బలహీనంగా తయారయ్యాయి. అంబేద్కర్‌కు ముందు, అంబేద్కర్ కాలంలోనూ, అంబేద్కర్ చనిపోయిన తర్వాత ఎన్నో మహోన్నతమైన ప్రయత్నాలు జరిగినప్పటికీ ఆ ప్రయత్నాలన్నింటినీ నీరుగార్చే విధంగా దళిత రాజకీయాలు కొనసాగాయి. దళిత సమాజపు అట్టడుగు పొరల్లోంచి నాయకత్వం రూపొందాల్సిన అవసరం పదేపదే స్పష్టమౌతుంది. అంబేద్కర్ స్పష్టమైన ఆశయం, స్పష్టమైన కార్యాచరణ పథకం దళిత రాజకీయ శక్తులకు ఏ మాత్రం అర్థమైందో కానీ హైందవ రాజకీయ శక్తులకు స్పష్టంగానే అర్థమయ్యింది. అంబేద్కర్ స్ఫూర్తిని నాశనం చేయడానికి అడుగడుగునా ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి. దేశ వ్యాప్తంగా అంబేద్కర్ విగ్రహాలను కూలగొట్టడం, చెప్పుల దండలతో అవమానించడం దగ్గర నుండి అరుణ్‌శౌరి లాంటి వారు అంబేద్కర్‌పైన అసృత ప్రచారం చేయడం దాకా అంబేద్కర్ ఆశయాలపై ఎంత తీవ్రమైన ద్వేషాన్ని పెంచుకున్నారో స్పష్టంగా అర్థమవుతుంది.

ఏ హైందవ శక్తులైతే ఈ దేశంలో మనుషుల్ని పశువులుగా చేసి, కులవ్యవస్థను సృష్టించాయో, ఆ శక్తులే బాబ్రీమసీదును కూలగొట్టాయి. బాబ్రీ మసీదును గానీ, అంబేద్కర్

విగ్రహాలను గానీ వాళ్ళు కేవలం కట్టడాలుగా, బొమ్మలుగా భావించి కూలగొట్టడం లేదు. ఈ దేశం హిందూత్వ దేశమని మరొక్కసారి చాటిచెప్పడానికి, ఈ దేశంలో హైందవ సామాజిక నిర్మాణానికి భిన్నంగా మరే ఆశయమూ, విశ్వాసమూ బతికి బట్టకట్టడానికి వీలేలేదని మరొక్కసారి చాటిచెప్పడానికి మాత్రమే వాళ్ళు ప్రతీకాత్మకంగా బాబ్రీ మసీదును కూలగొట్టారు. ఈ దేశంలో జాతీయోద్యమ కాలం నుండీ, దేశ విభజన కాలం నుండీ, స్వర్ణోత్సవ స్వతంత్ర వేడుకల దాకా ముస్లింలను యితర మైనారిటీలను ఊచకోత కోస్తూనే వున్నారు. ముంబాయిలో, సూరత్‌లో, హైదరాబాద్ పాతబస్తీలో, నల్లగొండలో, గ్రామగ్రామంలో కన్పించిన వారిని కన్పించినట్లు నరికి చంపి, స్త్రీలపైన లైంగిక అత్యాచారాలకు పాల్పడి, దారిలో పోయేవారిని బట్టలూడదీసి సున్తీ చేసుకొన్న ప్రతి మనిషినీ దారుణాతిదారుణంగా హత్యచేసే దుర్మార్గం కొనసాగుతోంది. అన్ని రాజకీయ పార్టీలు, లోపల్లోపలో, బహిరంగంగానో హిందూత్వాన్ని నరనరానా జీర్ణించుకొని పోయి ఈ దేశాన్ని మళ్ళీ అంధకార యుగంలోకి నడిపించడానికి సకల సన్నాహాలూ చేస్తున్నాయి. క్రైస్తవ సన్యాసినుల మీద లైంగిక దాడులకు పాల్పడడం, ముస్లింలను ఊచకోత కోయడం, ప్రార్థనా స్థలాల మీద దాడులు చేయడం అన్నీ అందులో భాగంగానే జరుగుతున్నాయి. ఈ దేశంలో పుట్టి ఈ దేశం గర్వపడే అన్ని అంశాల్లోనూ భాగస్వాములైన ప్రజానీకాన్ని 'విదేశీ' ముద్రవేసి దారుణమైన అభద్రతా భావానికి గురిచేసి విద్యకు, ఉపాధికీ, పౌరసత్వానికీ, పాలనా యంత్రాంగంలో ప్రాతినిధ్యానికీ ముస్లింలను దూరం చేసి తమ గడ్డకు తమను పరాయిలుగా మార్చే కుట్ర అమలవుతున్నది.

ఇది కేవలం ముస్లింల సమస్య మాత్రమే కాదు. సెక్యులర్ విలువల్ని నమ్మి ప్రజాస్వామిక సమాజం రూపొందాలనుకొనే శక్తులందరి సమస్య. ఏళ్ళనాటి అభద్రతా భావం నుండి ఇప్పుడిప్పుడే ముస్లింలలో ఈ దేశం మాది కూడా అన్న విశ్వాస ప్రకటన చేసే ప్రయత్నాలు కన్పిస్తున్నాయి. యిప్పుడిప్పుడే ఆకాంక్షలను రాజకీయాచరణగా మలచే ప్రయత్నాలు కన్పిస్తున్నాయి. దళిత బహుజనాల సమూహాల్లోనూ ఒక నిస్పృహ నుండి, ఒక విద్రోహం నుండి తిరిగి తలెత్తాలనే తపన బయలుదేరుతోంది. అన్ని ప్రజాస్వామిక శక్తులూ, అన్ని సెక్యులర్ శక్తులూ ఐక్యంగా పనిచేయాలనే స్పృహ తలెత్తుతోంది. రెండవ శ్రేణి నాయకులుగానో, నాయకుల వటవృక్ష నీడల్లో గొంతులు మూగబోయి గ్రామాల్లో నేటికీ అదే దీక్షతో పనిచేస్తున్న అద్భుతమైన శక్తియుక్తులున్న నాయకులు అట్టడుగు పొరల్లోంచి దూసుకువచ్చి అంబేద్కర్ చైతన్య రథాన్ని ముందుకు తీసుకువెళ్ళేందుకు సన్నాహాలు ప్రారంభించి అంబేద్కర్ ఆశయ సాధనా దిశగా నడకను ప్రారంభిస్తారనే ఆశ కలుగుతోంది. మళ్ళీ దళిత గొంతుకలు మిగతా ప్రజాస్వామిక ఆకాంక్షల్ని కలగలుపుకొని మారుమ్రోగుతాయి. బహుశా మళ్ళీ దళిత కులాలు సరికొత్త తేజంతో ఊరేగింపై సాగుతాయి. ఆయా అత్యాచారాల సంఘటనలు జరిగినప్పుడే కదలబారే ఆందోళన స్థాయి నుండి (వేంపెంట సంఘటనలో అదీలేదు) ఒక సమగ్రమైన విముక్తి వ్యూహంతో ముందుకు సాగే ప్రయత్నాలు నిజంగా మొదలైతే అంబేద్కర్‌కి అదే నివాళి.

**బహుజన మహాబోధి – డిసెంబర్ 1998**

# శిలువల గుండెల్లో త్రిశూలాలు

**తండ్రీ వీరేమి చేయుచున్నారో వీరెరుగరు కనుక వీరిని క్షమించుము.**
**(చనిపోయే ముందు శిలువ మీద జీసస్ పలికిన ఏడు మాటల్లో ఒకటి)**

బలహీనుడు ఎవరినీ శిక్షించలేడు. క్షమించనూలేడు. ఎవరికీ అండగా నిలబడనూ లేడు. తనను తాను కాపాడుకోనూ లేడు.

ఒక అవాంఛిత పెను ప్రళయం ముందు అంగలార్చే నిస్సహాయపు ఒంటరి కాందిశీకునిలాగా వజవజా వణుకుతున్నది దేశం. తనను తాను ముక్కలుగా నరుక్కొని ప్రతి శకలమూ ఒక మహాభినిష్క్రమణంలోకి క్షీణిస్తోంటే పరమ పారవశ్యపు 'వేదాంత ఘడియల్లో' జోగాడుతోంది దేశం. తరాలుగా విన్పించిన నిరసన ధ్వనులు, బిగిసిన పిడికిళ్ళు, ధిక్కార స్వరాలు, పోరు నినాదాల పద కవాతులు అన్నీ ముందుకొచ్చే క్రౌర్యపు కరాళ తాండవం ముందు బలహీనంగా సాగిలపడుతున్నాయి. మళ్ళొక్కసారి చరిత్రను క్షీణ క్షణాలు ఆక్రమిస్తున్నాయి.

వాళ్ళు మాతృదేవతలను ధ్వంసం చేశారు. వాళ్ళు ఈ గడ్డ మీది మట్టి మనుషుల ఆకాంక్షల్నీ, విశ్వాసాలనీ చిద్రుపలు చేశారు. కలల్ని చిదిమి వేశారు. ఈ నేల మీద పుట్టి సకల ప్రపంచానికీ సమతా కుసుమాల పరిమళాల్ని అందించిన బౌద్ధ ధర్మాన్ని తునాతునకలు చేశారు. వాళ్ళు సూఫీల దర్గాల ముందు ఎగిరే శాంతి కపోతాల మెడల్ని కర్కశంగా కోసివేశారు. ముస్లిం బోధనల్ని లోహపాదాల కింద నలిపివేసే దుర్మార్గపు ప్రయత్నాలు చేస్తూనే వున్నారు. అన్నింటికీ పరాకాష్ఠగా బాబ్రీమసీదును కూలగొట్టారు. ముంబాయిలో, సూరత్‌లో, దేశం నలుమూలల్లో ముస్లింలను ఊచకోత కోశారు. జాతీయోద్యమ కాలం నుండి, దేశ విభజన కాలం నుండి ఈనాటి దాకా ముస్లిం వ్యతిరేకత తారాస్థాయిలో విజృంభిస్తోనే వుంది. నిన్నమొన్న పాకిస్తాన్ ఆటగాళ్లు ఆడతారని ఫిరోజ్‌షా కోట్ల మైదానాన్ని శత్రువును చంపినంత కసిగా తూట్లు పొడవడం చూస్తే ఎంత స్థాయిలో అసహనం పెచ్చరిల్లుతున్నదో అర్థం అవుతోంది.

యిప్పుడిక క్రైస్తవుల మీద దాడులు మొదలు పెట్టారు. క్రైస్తవ సన్యాసినులపైన లైంగిక అత్యాచారాలకు పాల్పడ్డారు. క్రైస్తవ ప్రార్థనా స్థలాలను నేలమట్టం చేస్తున్నారు. మంటల్లో దగ్ధం చేస్తున్నారు. క్రైస్తవ మతం స్వీకరించిన వారిని భీతావహుల్ని చేస్తున్నారు. వారిపైన ముప్పేట దాడులు చేస్తున్నారు. ఎక్కడ చూసినా కాషాయం మంటల రెపరెపల్లో విజేతల వికటాట్టహాసాలు మారుమోగిపోతున్నాయి.

శివ సైనికులు, బజరంగ్ దళ్ సైనికులు, విశ్వ హిందూ పరిషత్, సంఘ పరివార్ వారు యిప్పుడు దేశంలో వీరవిహారం చేస్తున్నారు. ఈ దేశ సంస్కృతీ చరిత్రల నిర్మాతలైన

ప్రజానీకాన్ని తమ కనుసన్నల్లో మసలుకోవాలని ఆదేశిస్తున్నారు. ఆంక్ష మీరితే పరిణామాలు ఎంత తీవ్రంగా వుంటాయో చేతల ద్వారా తెలియజేస్తున్నారు. ఏ మత విశ్వాసాలు కలిగివుండాలో, ఎలా ఆలోచించాలో, ఎటువంటి అభిరుచులను పెంచుకోవాలో, ఏ ఆహారపుటలవాట్లను పెంపొందించుకోవాలో, ఏ సినిమాలు చూడాలో, ఏం పేర్లు పెట్టుకోవాలో, ఏ బట్టలు కట్టుకోవాలో నిర్దేశించే స్థాయికి వాళ్ళు చేరుకున్నారు.

'క్షణం క్షణం మా కణం కణం దేశమాతకే సమర్పణం' అన్న నినాదాన్ని వాళ్ళిచ్చినప్పుడు చాలా మందికి దేశభక్తియుతమైన పారవశ్యంతో గుండెలు ఉప్పొంగి వుంటాయి. 'మన ధర్మం పరమ గంగ – పర ధర్మం ఎండమావి' అన్న నినాదం ధర్మ ప్రచారంలో భాగంగానే చాలా మంది అర్థం చేసుకొనివుంటారు. కానీ ఆ నినాదాల్లో పదానికీ పదానికీ మధ్యనున్న ఖాళీలో ఎంతటి పెనుబీభత్సం పొంచి వుందో, ఎంతటి హైందవ కౌటిల్యం దాగివుందో అర్థం అయ్యేటట్టు చేయడానికి ఏ విధమైన ఆచ్ఛాదనలూ లేని కార్యక్రమంలో వాళ్ళు ముందుకు సాగుతున్నారు. అంతకు ముందు రాత్రిపూట చేసిన కార్యక్రమాలను, రహస్యంగా నిర్వహించిన కార్యకలాపాలను, బిజెపి అధికారంలోకి వచ్చిన తర్వాత బహిరంగంగా, పట్టపగలు కొనసాగిస్తున్నారు. ఏ చట్టాల భయమూ లేదు. శిక్షల భయమూ లేదు. ప్రభుత్వం అండన తమ దుర్మార్గాలను నిరాఘాటంగా సాగించుకొంటున్నారు. బాబ్రీ మసీదు విధ్వంసం సమయాన పి.వి. నర్సింహారావు ప్రభుత్వం ఎంత దుర్మార్గంగా 'మౌన ప్రేక్షక పాత్ర' వహించినట్లు కన్పించి మొత్తం విధ్వంస కార్యక్రమానికి మార్గ దర్శకత్వం వహించిందో ఇప్పుడు కేంద్రంలోనూ, గుజరాత్ రాష్ట్రంలోనూ అధికారంలో వున్న బిజెపి ప్రభుత్వాలు మైనారిటీలకు రక్షణ కల్పించాల్సిన బాధ్యతను పక్కనపెట్టి, దారుణంగా దాడులు చేస్తున్న హిందూ మతోన్మాదులను నిలువరించే కర్తవ్యాన్ని పక్కనపెట్టి చోద్యం చూస్తున్నట్టు కన్పిస్తూ దాడులను ప్రోత్సహిస్తున్నాయి. విశ్వ హిందూ పరిషత్‌కూ, బిజెపికీ మధ్య, అశోక్ సింఘాల్‌కూ వాజ్‌పేయికీ మధ్య తలెత్తాయని చెప్తున్న 'ప్రణయ కలహాల' అపార్థాలన్నీ వట్టి బూటకం. ఈ దేశంలో హిందువులు తప్ప మరెవ్వరూ ఉండరాదన్న దుర్మార్గమైన ఊహకు ప్రాణప్రతిష్ఠ చేయడానికి బిజెపి, విహెచ్‌పి కూటమి అన్ని నయవంచనలనీ, అన్ని కుతంత్రాలనీ ఉపయోగిస్తున్నది.

గుజరాత్ రాష్ట్రంలో క్రైస్తవులపైన కుట్రపూరితమైన దాడులకు వాళ్ళిప్పుడు పాల్పడుతున్నారు. చర్చీలను కూలగొట్టడం, మత ప్రచారకులను కొట్టడం, హింసించడం, చంపుతామని బెదిరించడం, క్రైస్తవ మత గ్రంథమైన బైబిల్ ప్రతులను తగులబెట్టడం వంటి ఎన్నో దారుణాలకు వాళ్ళు పాల్పడుతున్నారు.

గుజరాత్‌లోని డాంగ్స్ జిల్లాలో అమాయకపు ఆదివాసీలు క్రైస్తవంలో చేరినందుకు వాళ్ళను భయ భ్రాంతులను చేస్తున్నారు. క్రైస్తవుల మీద వాళ్ళు మాత్రమే దాడి చేయడం కాకుండా,

ఆదివాసీల మధ్యనే తగవులు సృష్టించి హింసాజ్వాలలకు ఆజ్యం పోస్తున్నారు. క్రైస్తవులను అక్రమ కేసుల్లో యిరికించి పోలీసుల చేత చిత్రహింసలు పెట్టిస్తున్నారు.

జమలపాడు అనే ఆదివాసీ గ్రామంలో ఆదివాసీ క్రైస్తవుల పైన దాడి చేశారు. యిప్పటికీ వాళ్ళు ఏ ప్రళయం ముంచుకొస్తుందోనని బిక్కుబిక్కుమంటూ కాలం గడుపుతున్నారు. దివాన్ తాంబ్రన్ అనే గ్రామంలో రాత్రి ఎనిమిది గంటల సమయంలో ఆదివాసీలందరూ ప్రార్ధనా సమావేశంలో వుండగా హిందూ మతోన్మాదులు ఆకస్మికంగా దాడిచేశారు. ఆ చీకట్లో అందినవాళ్ళను అందినట్లుగా కర్రలతో, లాఠీలతో చితకబాదారు.

కుడ్కాన్ గ్రామంలో ప్రేమ్‌చంద్ అనే ఒక క్రైస్తవ బోధకుడిని తన ప్రార్ధనా కార్యక్రమం ముగించుకొని సైకిల్‌మీద తిరిగి వస్తుండగా అతన్ని గ్రామపెద్దలే పట్టుకొని తీవ్రంగా కొట్టారు. దాగాపాడా గ్రామాంలో క్రిస్మస్ వేడుకల్ని జరుపుకొంటున్న ఆదివాసీ క్రైస్తవుల పైన రాళ్ళ వాన కురిపించారు. రాళ్ళు విసురుతున్న వారిని నిలువరించే ప్రయత్నం చేసిన వారిపైన అక్రమకేసుల్ని బనాయించారు. పోలీసులు వాళ్ళను చిత్రహింసలు పెట్టారు. యింకా ఉమర్‌పాడా, పీపల్‌యామా, జర్సోల్, ధావాల్‌దోడ్, బాప్కోల్, బోర్కాల్, దారాపాడా తదితర గ్రామాల్లో ఆదివాసీలపైన దాడులు జరిగాయి. ప్రార్ధన చేస్తున్నారన్న కారణంచూపి, ఆవుమాంసం తిన్నారన్న కారణం చూపి, రకరకాల బొల్లు కారణాలు చూపి క్రైస్తవులపైన దాడులు చేస్తున్నారు. భాపకాల్ డాన్, సింగానో, లఖన్ కదమల్, దాల్లీ దోడ్, బోర్కాహోల్ తదితర గ్రామాల్లో చర్చీలను తగులబెట్టారు. కూలగొట్టారు. విధ్వంసం చేశారు. డాంగ్స్ జిల్లాలో మొదలైన విధ్వంసం పక్కనే వున్న వల్సాద్, సూరత్‌లకూ, సౌరాష్ట్రలోని రాజ్‌కోట్ జిల్లాకు యితర ప్రాంతాలకూ వ్యాపించింది.

చాలా సంఘటనల్లో ప్రభుత్వ యంత్రాంగం అంతా దుర్మార్గమైన మౌనాన్ని వహించింది. కొన్ని సంఘటనల్లో విశ్వహిందూ పరిషత్ వారి చేతులకు మట్టంటకుండా 'కాగల కార్యాన్ని' పోలీసులే తీర్చారు. వాళ్ళు దాడి చేయదలచుకొన్న వారిని పోలీసులకు అప్పజెబితే పోలీసులు వాళ్ళను స్టేషన్‌లో పెట్టి కుళ్ళబొడిచారు. అమాయక క్రైస్తవులపైన దాడిచేసిన వారిని అరెస్టు చేయకుండా దాడికి గురైన వారిని అరెస్టు చేశారు. ఒకవైపున భౌతిక దాడులు జరుగుతుంటే మరొకవైపున జిల్లా యంత్రాంగం ఆదివాసీలకు ప్రభుత్వం ప్రకటించిన హక్కులను క్రైస్తవ ఆదివాసీలకు లేకుండా చేస్తున్నది. స్కూళ్ళల్లో ఉచిత విద్య, స్కాలర్‌షిప్‌లు, యూనిఫారాలు అందనివ్వకుండా ఆదేశాలనిచ్చింది. ఆదివాసీ క్రైస్తవులకు కులం సర్టిఫికెట్లు యివ్వడం లేదు. డాంగ్స్ జిల్లా అంతటా విశ్వహిందూ పరిషత్ వారు, హిందూ మతోన్మాదులూ, ప్రభుత్వ యంత్రాంగమూ అన్నీ కలగలసి తీవ్రమైన దాడులకు పూనుకొన్నాయి.

డాంగ్స్ జిల్లా దక్షిణ గుజరాత్‌లో ఉంది. నర్మదా నదీజలాలతో సుసంపన్నమైన భూములతో సిరులు కురిసే సీమ దక్షిణ గుజరాత్. డాంగ్స్ జిల్లాలో మాత్రం విచిత్రమైన వైచిత్రి

కన్పిస్తుంది. అందమూ, ఆకలీ కలగలిసిన బీభత్స సౌందర్యం అక్కడ తాండవమాడుతుంటుంది. కొండలు, గుట్టలు, సెలయేళ్ళు, పచ్చగా కళకళలాడే వృక్షాలు ఒకవైపున, పరిమితమైన అవకాశాలతో, చిన్ని ఆదాయాలతో ఆకలితో నకనకలాడుతుండే ఆదివాసీ జనాలు ఒకవైపున మనకు కనిపిస్తారు. నిత్యదరిద్రంలో మగ్గిపోయే ఆదివాసీల జీవితాల్లోకి క్రైస్తవమత ప్రచారకులు ప్రవేశించి సాధ్యమైనంత మేరకు వాళ్ళ బతుకుల్లో మార్పులు తీసుకురావడానికి ప్రయత్నించారన్నది ప్రభుత్వాలు కూడా అంగీకరించే విషయమే. పాఠశాలలు పెట్టి, ఆదాయవనరులను పెంపొందించే ఆర్థిక కార్యక్రమాలను చేపట్టి ఆదివాసీలను చైతన్యవంతుల్ని చేసే ప్రయత్నం చాలా ఏళ్ళుగా క్రైస్తవ మత ప్రచారకులు సాగిస్తున్నారు. ఆదివాసీలంతా క్రైస్తవులై పోతారేమోనన్న భయం, అసహనం ఆనాటి నుండీ హిందూ శక్తులను పట్టి పీడించింది. 1948లో మన తొలి హోంమంత్రి సర్దార్ వల్లభాయి పటేల్ స్వయంగా డాంగ్స్ ఆదివాసీలు క్రైస్తవం పట్టులోకి పోకుండా కార్యక్రమాలు చేపట్టవలసిందిగా సర్వోదయ నాయకులను ఆహ్వానించాడు. ఏనాడూ వాళ్ళ బాగోగులను పట్టించుకోని ప్రభుత్వం కానీ, హిందూ సమాజం కానీ ఆదివాసీలు క్రైస్తవం తీసుకుంటే మాత్రం ఉలికి పడుతోంది. అల్లర్లను చెలరేపుతున్నది. ఆదివాసీలను ఇబ్బందుల పాలు చేస్తున్నది.

విశ్వ హిందూ పరిషత్, సంఘ్ పరివార్ నాయకులు చాలా బహిరంగంగా ఈ దాడులను నిర్వహిస్తున్నారు. హిందువులలో అసహనాన్ని రేకెత్తిస్తున్నారు. తోటి వారిపట్ల సహనశీలంగా వుండే వారిని సైతం రెచ్చగొడుతున్నారు. భారతదేశం హిందూదేశమనీ, క్రైస్తవం కానీ, ముస్లిం మతం కానీ పరాయి మతాలని ప్రచారం చేస్తున్నారు. నిజానికి భారతీయులంతా ఎన్నడూ బ్రాహ్మణీయ మతావలంబీకులుగా లేరు. ముఖ్యంగా ఆదివాసీలు, దళిత, బహుజన జాతులకు హిందూ మతం పేరుతో కొనసాగే బ్రాహ్మణ మతానికీ ఎటువంటి సంబంధమూ లేదు. ఉంటే గింటే దాని పడగనీడల్లో అణగారిపోయిన సంబంధం మాత్రమే వుంది. బానిసలై, బాధితులై, హింసోన్మత్తత కింద నలిగిపోయిన సంబంధం మాత్రమే వుంది. బ్రాహ్మణీయ హిందూమతం స్థానిక ఆచారాలనూ, విశ్వాసాలనూ నాశనం చేసి తన వర్ణాశ్రమ ధర్మాన్ని ప్రజల మీద రుద్ది స్వతంత్ర జీవులను దుర్మార్గపు కులచట్రం కిందికి తీసుకొచ్చి నిచ్చెనమెట్ల వ్యవస్థను సృష్టించింది. ఇప్పుడీ బ్రాహ్మణీయ మత ప్రతినిధులు హిందూ సామ్రాజ్య వాదం ఏ నేరాలయితే చేసిందో, ఏ ఘోరాలకైతే పాల్పడిందో, ఆ నేరాలనూ, ఘోరాలనూ యితర మతాల మీదికి నెడుతున్నారు. ముఖ్యంగా క్రైస్తవం మీదికి. క్రైస్తవ మతం ఆంగ్లేయుల మతమనీ, విదేశీపాలకుల మతమనీ బూటకపు ప్రాచారం మొదలుపెట్టారు. నిజానికి క్రైస్తవ మతం భారత దేశంలోకి ఎన్నడో ప్రవేశించింది. జీసస్ చనిపోయిన కొన్ని సంవత్సరాలకే దాదాపు రెండు వేల సంవత్సరాలనాడు జీసస్ పన్నెండు మంది శిష్యుల్లో ఒకరైన సెయింట్

థామస్ ఈ దేశానికి క్రీస్తు బోధనల్ని తీసుకువచ్చాడు. ఒకవేళ క్రైస్తవ మతం భారతదేశానికి పరాయిదైతే, బ్రాహ్మణీయ హిందూమతంకూడా ఈ దేశ మూలవాసులకు అంతే పరాయిది. బ్రాహ్మణీయ హిందూమతం అవకాశాలను నిరాకరించిన ప్రజానీకం వేరే జీవన విధానాల వైపుకు ఆశగా ప్రయాణం చేశారు. దేశంలో మత మార్పిడులు జరిగిన ఏ సందర్భంలో చూసినా మనకు యిది కన్పిస్తుంది. హైందవ కుల నిర్మాణంలో విసిగి వేసారిపోయిన ప్రజానీకం బౌద్ధ, క్రైస్తవ, సిక్కు, ఇస్లాం మతాలను స్వీకరించారు.

యిప్పుడు విశ్వహిందూ పరిషత్‌వారు అల్లర్లకు కారణం క్రైస్తవ మత ప్రచారకులేనని ప్రచారంచేస్తున్నారు. ప్రజలు ఏ మతాన్నైనా స్వీకరించవచ్చు. ఏ మత విశ్వాసాన్నైనా ప్రచారం చేసుకొనవచ్చునన్న రాజ్యాంగంలోని 25వ ఆర్టికల్ సారాన్ని ఉల్లంఘిస్తున్నారు. మిషనరీలు డబ్బు ఆశచూపి, రాయితీలను ఆశచూపి ప్రలోభపెట్టి, బలవంతపెట్టి, మత మార్పిడులు చేస్తున్నారని ఆరోపిస్తున్నారు. అదే జరిగివుంటే దేశంలో క్రైస్తవుల జనాభా కేవలం రెండు శాతం మాత్రమే వుండేది కాదు.

ఆత్మగౌరవ స్పృహను ఈ దేశంలోని అణగారిన శక్తులు ఎప్పుడు కనపర్చినా ఆ ఒక్క కారణంతో వాటిపైన దాడులు చేసిన హిందూ మతోన్మాదం యిప్పుడు క్రైస్తవాన్ని సాకుగా చూపుతోంది. (చుండూరులో దారుణమైన ఊచకోత సందర్భంలో చినజియ్యర్ స్వామి వ్యాఖ్యలు అందరికీ యింకా గుర్తుండే వుంటాయి) దళితులపైన, ఆదివాసీలపైన దాడులు జరిగినప్పుడు వారు హిందువులుకారనీ, పరాయి మతస్తులేననీ, కాబట్టి వారు చంపదగిన వారేనని హిందూ పీఠాలు ప్రవచిస్తున్నాయి. ప్రతి సంఘటననీ వాళ్ళు రాజకీయం చేస్తున్నారు. ముస్లింల, క్రైస్తవులపైన జరుగుతున్న దాడులకు 'మరో క్విట్ యిండియా ఉద్యమం' అని వారు పేరు పెట్టుకున్నారు. భారతదేశం భిన్న మతాల, భిన్న సంస్కృతుల, భిన్న ఆచారాల సమ్మేళనం అని ఒకవైపున చెప్తూనే మరో వైపున హిందూధర్మమే పరమమైనదనీ, దానిని తప్ప వేరొక ధర్మాన్ని అనుసరించడానికి వీలులేదని వాళ్ళు అత్యవసర పరిస్థితిని ప్రకటించారు. సెక్యులర్ రాజ్యాంగమూ, దాన్ని కాపాడుతానని ప్రమాణాలు చేసిన ప్రభుత్వమూ అన్నింటి సాక్షిగా ఉన్మత్త రాజకీయ క్రీడలాడుతున్నారు వాళ్ళు.

వాళ్ళన్నీ తెలిసే చేశారు. నిర్దిష్ట లక్ష్యంతోనే చేశారు. విషాదం ఏమిటంటే తెలిసి తెలిసీ జరుగుతున్న ఉన్మత్త చర్యలను నిలువరించడానికీ, క్షమించకుండా ఉండడానికీ బలం కలిగిన శక్తేదీ యింకా రూపొందలేదు.

ఒక నిష్క్రియాపర్వతం మనల్ని కబళించి వేస్తుంది. మన మహాప్రయత్నాన్నీ విలాప వాక్యాల్లోకి కుదించుకుపోతున్నాయి. బలవంతులు తాము చేయదలచుకొన్న పనుల్ని యధేచ్ఛగా చేసుకుపోతుంటే బలహీనులు కేవలం చర్చల్లో కూరుకుపోయినట్లుగా ఏ చర్యాలేని చర్చా

కార్యక్రమమే మన మహా విప్లవ వ్యూహంగా మారుతున్నది.

నిత్యమూ నీడలా వెంటాడే మృత్యుభీతి, వెన్నుపూసల్లోంచి జరజరా పాకే అతి శీతల రాత్రి, మాటల్ని నిర్వీర్యం చేసే మహా నిశ్శబ్దం ఆవరిస్తోంటే మనం 'బాధే సౌఖ్యమనే భావన'ల్లో మునిగి తేలుతున్నాం. ఈ పరిస్థితి వ్యక్తులకే పరిమితం కాలేదు. మొత్తం సమాంతర, సెక్యులర్ రాజకీయాలనీ పట్టి పీడిస్తున్నది. ఏ వీపీ సింగో, మరొకరో, సెక్యులర్ విలువల్ని రాజకీయాల్లో పెంచుతారని కూర్చోవడం మినహా మరో ప్రయత్నమేదీ సాగడం లేదు.

ముఖ్యంగా దళిత బహుజన రాజకీయశక్తులు హిందూత్వ శక్తులను ఎదుర్కొనడంలో అమిత బలహీనంగా వున్నాయి. అన్ని బాధిత శక్తులతో ముస్లిం, క్రైస్తవ, బౌద్ధ, సిక్కు తదితర మత మైనారిటీలతో, దళిత బహుజన సమూహాలతో కింది నుండి ఒక సెక్యులర్ రాజకీయోద్యమం నిర్మితం కావలసిన అవసరం రోజురోజుకూ స్పష్టమవుతున్నది. ఈ పరిస్థితుల్లో క్రైస్తవ సమూహాలు తమ మోనాస్టరీల నిర్వ్యాపకత్వం నుండి బయటపడి యితర శక్తులతో ముఖ్యంగా ముస్లిం, దళిత బహుజన శక్తులతో ఐక్యం కావడానికి ప్రయత్నాలు మొదలుపెట్టాలి. అందుకు చర్చి లోపల చాలా మార్పులు జరగాలి. మరీ ముఖ్యంగా చర్చి లోపల కులనిర్మూలన జరగాలి.

వాళ్ళు యిక్కడితో ఆగరన్నది స్పష్టం. మనం ఏం చేయబోతున్నామనేదే యిప్పుడు ముఖ్యం. యిప్పుడూ మౌనంగా వుంటే... రక్షించడానికి బహుశా భగవంతుడు సైతం బలహీనుడవుతాడు.

**బహుజన మహాబోధి – జనవరి 1999**

# బీహార్ దళితులకు ఆయుధాలివ్వండి

'మాకు డబ్బులొద్దు. నష్టపరిహారం వద్దు. మాకు ఒకే ఒక్క సహాయం చేయండి. మాకు ఆయుధాలివ్వండి. అదే మీరు మాకు చేసే సాయం' అని దళిత మహిళ చిలారీదేవి ముఖ్యమంత్రినీ, రాజకీయ నాయకులనూ నిలదీసి అడిగింది. ఆమె భర్తను కూడా కాల్చి చంపేశారు.

ఇరవై మూడు అమాయక ప్రాణాలను నిర్దాక్షిణ్యంగా నేలకూల్చింది రణ్‌బీర్ సేన.

దేశం గణతంత్ర దినోత్సవ సంబరాల్లో మునిగిపోయి వుంది. దళిత రాష్ట్రపతి దేశాన్నుద్దేశించి ప్రసంగించారు. అయితే స్వతంత్రం అంటే ఏమిటో, గణతంత్రం అంటే ఏమిటో ఆ రోజున దళితులకు మళ్ళొక్కసారి తెలిసివచ్చింది.

జనవరి 26వతేదీ. బీహార్, జెహానాబాద్ జిల్లాలోని శంకర్ భిగా గ్రామం. దాదాపు 70 దళిత కుటుంబాలు. అందరూ పండుగ ఉత్సాహంలో వున్నారు. బీహార్ గ్రామీణ ప్రాంతాల్లో ప్రతి సోమవారం శివుడి భజనచేస్తారు. ఆటపాటలతో గడిచిపోతుంది. ఆ రాత్రి మాత్రం శంకర్ భిగా దళితుల మీద శివుడి మూడో కన్ను తెరుచుకున్నదన్నట్లుగా ఒక్కసారిగా భూమిహారుల ముష్కరుల మూక రణ్‌బీర్ సేన దళం 100 మందికిపైగా సాయుధంగా వచ్చి పడింది. దాదాపు రాత్రి ఎనిమిదిన్నర సమయంలో తుపాకుల మోతలతో ఆ ప్రాంతం దద్దరిల్లిపోయింది. 25 నిమిషాలపాటు జరిగిన కాల్పుల్లో 19 మంది దళితులు అక్కడికక్కడే నేలకూలిపోయారు. మరో నలుగురు గాయపడి తర్వాత మరణించారు. మొత్తం 23 మందిని ఒక్కరాత్రి మట్టుబెట్టిన రణ్‌బీర్ సైనికులు వికటాట్టహాసాలతో, నినాదాలతో వెనుదిరిగి పోయారు. జిరవాన్ దేవి తన భర్తకు ఇష్టమైన శనగల కూర వండుతోంది. ఆ కూర చేసిపెడితే ఆ తర్వాత అర్వాల్ బజార్‌లో జరిగే గణతంత్ర ఉత్సవాలకు తనని తన ముగ్గురు కూతుళ్ళనీ తీసుకువెళ్తానని అతను ఆమెకు మాటిచ్చాడు. ముగ్గురూ ఎదిగిన బిడ్డలే. కూర వండుతోండగానే ఆమెకు రణ్‌బీర్ సైనికుల తుపాకీ తూటా తగిలింది. అక్కడికక్కడే కుప్పకూలిపోయింది. ముగ్గురు కూతుళ్లూ చనిపోయారు. భర్తా చనిపోయాడు. కన్పించిన వాళ్ళను కన్పించినట్లు కాల్చి పడేసి వెళ్లిపోయారు.

శంకర్ భిగా సంఘటనకూ వేంపెంట సంఘటనకూ చాలా దగ్గర పోలికలున్నాయి. అంతకుముందు జనవరి 23వ తేదీన మావోయిస్ట్ కమ్యూనిస్ట్ సెంటర్ (ఎంసిసి) వారు సందా గ్రామంలోని (గయా జిల్లా) నావల్ సింగ్ అనే అగ్రకుల భూస్వామిని చంపేశారు. అతనిపైన ఎన్నో అత్యాచారాల కేసులు, హత్యకేసులున్నాయి. అప్పుడే రణ్‌బీర్ సేన కమాండర్ ఇన్ – చీఫ్ బరణేశ్వర్ సింగ్ దీనికి ప్రతీకారంచేసి చూపిస్తాం' అని ప్రకటించారు. అమాయకపు దళిత పల్లె మీద తమ ప్రతాపం చూపించారు. నిజానికి ఇది పై సంఘటనకు

ప్రతీకారం కాదు. దళితులు ఆత్మగౌరవ చైతన్యం ఎక్కడ చూపించినా అక్కడ అణచివేయడానికి రణ్‌బీర్ సేనను బీహార్ అగ్రకుల భూస్వామ్య వర్గాలు పెంచి పోషిస్తున్నాయి. వాళ్ళకు అన్ని ప్రభుత్వాలు, అన్ని పాలక రాజకీయ పక్షాల మద్దతు వుంది. 17 వేర్వేరు గ్రామాల్లో జరిగిన మారణకాండల్లో 210 మందిని రణ్‌బీర్ సేన చంపివేసింది. 1997 డిసెంబర్‌లో రణ్‌బీర్ సేన వారు లక్ష్మణ్‌పూర్ బాతే గ్రామంలో జరిపిన ఊచకోతలో 63 మందిని చంపేశారు. శంకర్ భిగాకి లక్ష్మణ్‌పూర్ బాతే గ్రామం కేవలం 12 కిలో మీటర్ల దూరంలోనే వుంది.

నక్సలైట్లను తుడిచిపెట్టడానికే రణ్‌బీర్ సేన పుట్టింది అని వాళ్ళు ప్రకటిస్తున్నప్పటికీ నిజానికి వాళ్ళు ప్రతిసారీ దళిత పల్లెల మీదనే దాడులు చేస్తున్నారు. చట్టం అన్నా, కోర్టులు అన్నా ఏ మాత్రం భయంలేదు. ప్రభుత్వం అంటే లెక్క లేదు. పోలీసులకూ, పాలనా యంత్రాంగానికీ రణ్‌బీర్ సేన కదలికలన్నీ స్పష్టంగా తెలిసినప్పటికీ వాళ్ళను నిలువరించే ప్రయత్నం చేయడంలేదు.

అంతా జరిగిన తర్వాత రబ్రీదేవి ప్రభుత్వం వారికి ఒక్కొక్కరికీ లక్షా నలభై వేల రూపాయల ఎక్స్‌గ్రేషియా, ఒక యిల్లు, ఒకరికి ఉద్యోగం యిస్తానంటుంది. ఆ మాటలు విన్న చిలారీదేవి మాకు డబ్బులొద్దు. ఆయుధాలివ్వమంటుంది. దళితులందరూ అదే పరిస్థితిలో వున్నారు. బీహార్‌లో దుర్మార్గమైన హింసారాజ్యం కొనసాగుతోంది. (ఈ సాకుతో రబ్రీదేవి ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయాలని జార్జ్ ఫెర్నాండెజ్, బిజెపిలు డిమాండ్ చేస్తున్నారు. నిజానికి దీంట్లో వాళ్ళ భాగస్వామ్యం కూడా వుంది)

ఈ పరిస్థితుల్లో దళితులు ఆయుధాలు కావాలని డిమాండ్ చేస్తున్నారు. దళితులు సాయుధులైతే, దళిత సైన్యం ఏర్పడితే, ప్రజాస్వామిక ప్రక్రియలపైన దళితులు విశ్వాసం కోల్పోతే ఆ 'నేరం' ప్రభుత్వాలదే. నిత్యావసర వస్తువుల్ని సరఫరా చేసినట్లుగా దళితులకు రేషన్ కార్డుల మీద తుపాకుల్ని, తూటాల్నీ సరఫరా చేయాలని డిమాండ్ చేస్తున్నాం.

**బహుజన మహాబోధి – జనవరి 1999**

# కులము, మేడే

'ప్రపంచ కార్మికులారా ఐక్యంకండి' అన్న నినాదం యిప్పటికీ గుండెల్ని ఉత్తేజ పరుస్తూనే వుంటుంది. పిడికిళ్ళు బిగించిన సమూహాలకు సమూహాలు.

సమైక్యంగా గడ్డ గుండె మీదుగా నడిచిపోతోంటే శతృవు గుండెలదిరే దృశ్యాన్ని ఊహించుకోవడమే ఒక ఉద్విగ్నమైన అనుభూతి. అణగారిన మనుషులందరూ ఒక్కసారి నినదిస్తే పుట్టే పాటల మెరుపుల్నీ, వురుముల్నీ గుండెల్లోకి ఆవాహన చేసుకోవటం కవిత్వమై చెలరేగిపోవడం ఒక సుందర స్వప్నం.

కానీ ఇక్కడ కులం గీతలు గీస్తుంది. దోపిడీ కులాలకీ, దోపిడికి గురయ్యే కులాల మధ్యన కూడా విభజన రేఖల్ని గీస్తుంది. 'కులవ్యవస్థ శ్రమ విభజనే కాదు శ్రామికుల విభజన కూడా' అని అంబేడ్కర్ అన్నది అందుకే. పరస్పరం కలహాలతో మునిగిపోయి, ఒకరినొకరు సందేహించుకుంటూ ఎడమొగం పెడమొగంగా వున్న పరిస్థితే యింకా కొనసాగుతోంది. ఐక్యంగా వుండాల్సిన తరుణంలో విభేదాల గురించి మాట్లాడ్డానికీ, విభేదాలను చర్చించుకోవలసిన సమయంలో ఐక్యతా నినాదాలివ్వడానికీ అలవాటు పడిపోయాం. విబేధాలను గుర్తిస్తూనే, వాటిని వుంచుకొని ఐక్యంగా వుండటం మనకింకా అలవాటు కాలేదు. కానీ రాష్ట్రంలోనూ దేశంలోనూ త్వరత్వరగా జరిగిపోతోన్న పరిణామాలను చూస్తుంటే దళిత, పేద, అణగారిన కులాల భవిష్యత్తు పట్ల తీవ్రమైన ఆందోళన కలుగుతుంది. ప్రపంచీకరణ పేరుతో జరుగుతున్న పరిణామాలు, రాజకీయాలు కాషాయీకరణ, ప్రభుత్వాల దళిత వ్యతిరేక విధానాలు వీటన్నింటినీ దృష్టిలో వుంచుకొని దళిత కులాలన్నీ ఐక్యం కావలసిన అవసరం యింతకు ముందుకు కంటే యిప్పుడు మరింత పెరిగింది.

ఐక్యత అనగానే పదిమంది నాయకులు ఒక వేదిక మీదికి వచ్చి ఐక్య వేదికలు రూపొందించి కాగితాల మీద ఐక్యతను సాధించడం పరిపాటై పోయింది. ఆయా నాయకుల చిత్తశుద్ధిని శంకించడం లేదు కానీ అటువంటి ప్రయత్నాల వలన పెద్దగా ప్రయోజనం లేదని చరిత్ర రుజువు చేసింది. గ్రామస్థాయిలో చర్చ జరగాలి. కుల పంచాయితీలలో చర్చ జరగాలి. ఈ ప్రక్రియను ఇప్పటికప్పుడు ప్రారంభించడానికి అవకాశమున్న మాదిగ దండోరా నాయకత్వం, మాల మహానాడు నాయకత్వం ముందుకు రావాలని 'నిఘా' సవినయంగా మనవి చేస్తుంది. మిగతా దళిత సంఘాలు, కుల సంఘాలు, వామ పక్షాలు, యితర హక్కుల సంఘాలు ఈ ప్రక్రియకు దోహదపడే కార్యక్రమాలు రూపొందించాల్సిన అవసరాన్ని గుర్తించవలసిందిగా 'నిఘా' విజ్ఞప్తి చేస్తుంది.

**'నిఘా' మే 2002**

# కాషాయ ఫాసిస్టులకు వ్యతిరేకంగా రాజకీయోద్యమం రావాలి

**"నేను వలీ, జీవన పరంపరలో ఎంత మైమరిచిపోయాను**
**మృత్యువుకే కష్టమైపోయింది నన్ను వెతకడానికి"**

అన్వర్ తెలుగు చేసిన వలీ గుండె యింకా కొట్టుకుంటూనే వుంది. వలీ! ఎంత నమ్మకం ఈ జాతిమీద మీకు. కానీ మరణం నీ సమాధి చుట్టే పొంచి వుంది. యిప్పుడీ గడ్డ మీద బతుకుతున్న ఏ ప్రాణికీ అంత నమ్మకాన్ని ప్రకటించే సాహసం లేదు. యిది వున్మాదుల రాజ్యం. కాకుంటే యిది పవిత్రుల రాజ్యం. వలీ! యిది వెయ్యిన్నొక్క వైఫల్యాల ప్రేమ. కాకుంటే వట్టి ప్రగల్భాల ప్రేమ. కాషాయానికి కవిత్వం ప్రత్యామ్నాయం కాదు... అంటూ ఖాదరన్న గొణుక్కుంటున్నాడు. బాబ్రీ మసీదు విధ్వంసానికి ముందే యీ భవిష్యత్ ప్రమాదాన్ని గుర్తించినవాడు. పుట్టుమచ్చలో ముస్లిం అస్తిత్వాన్ని, హింసనీ, బతుకునీ పలికించినవాడు. యిప్పుడు మళ్ళీ యిన్నాళ్ళ తర్వాత ఒక గొప్ప కవిత రాశాడు. నిజం. కానీ యిప్పుడు గొప్పదనాన్ని కీర్తించలేను. ఆయన గొణుగుడే నా గుండెలోనూ, బహుశా చాలామంది గుండెల్లోనూ ప్రతిధ్వనిస్తున్నది.

అక్షరాల్లోనూ, ఆకారంలోనూ, ప్రవర్తనలోనూ అత్యంత మృదువుగా కన్పించే స్మైల్ సాబ్ అక్షరాల కన్నులు నిప్పుల కణికల్ని కన్నీటిగా కారుస్తున్నాయి. యిక స్కైబాబ ఆగ్రహం సరేసరి. షాజహానా అక్షరాల్లో నిలువెత్తు ప్రేమ, ఆగ్రహం, విషాదం కలగలిసిన వ్యక్తీకరణ.

అన్వర్, స్కైబాబ సంపాదకత్వంలో 'అజాం' కవితా సంకలనం వచ్చింది. 'గుజరాత్ గాయం' పేరుతో అన్ని వర్గాల కవులు గుజరాత్ మారణకాండ మీద స్పందించి రాసిన కవిత్వంతో ఒక సంకలనం వచ్చింది. 'అజాం' స్వంత నొప్పి. బహుశా మనం పొందే నొప్పి. ఎక్కడో ఒకచోట మనం మిస్ అయ్యే వేదన. కనే తల్లి మాత్రమే చెప్పగలిగే ప్రసవ వేదన. 'అజాం' కవితా సంకలనంలో అనేకమంది ముస్లిం కవులున్నారు. కొత్తగా రాసిన కవులున్నారు. అందరి అక్షరాలు బాధలో తడిసిన ఆగ్రహ నినాదాలు.

కానీ మనం కవులం. వట్టి కవి మాత్రులం. బాధితులకు బంధువులం. ఎక్కడైనా, ఏదైనా అఘాయిత్యం జరిగితే గుండెలు కలుక్కుమంటాయి. కన్నులెర్రబారతాయి. గుండె ద్రవిస్తుంది. పిడికిళ్ళు బిగుసుకుంటాయి. ఒక నినాదమవుతాం. ఒక కవితవుతాం. ఒక మహాసభ అవుతాం. అంతే మరేమీ కావడం లేదు. జాన తాడుకి అంటుకున్న నిప్పురవ్వ మందు గుండెకి చేరి విస్ఫోటనమయ్యేలోపే ఎక్కడో లింకు తెగుతోంది. పది చూపులు కలిసినచోట పుట్టాల్సిన అగ్ని పుట్టడం లేదు. మత పిడికిళ్లు బిగిసిన చోట మెరవాల్సిన

మెరుపు మెరవడం లేదు. 'అల్లా ఈ చేతులు వట్టి దువాఁకేనా' అని అడుగుతున్నాడు స్కైబాబ. "కూలిపోయిన గోడలు/ లేచి ఎటువైపు వెళతాయో తెలియదు/...అనుమానం లోంచి తెరుచుకునే మార్గం/ ఎక్కణ్ణించి మొదలవుతుందో తెలీదు" ఖాదరన్న గొణుక్కుంటున్నట్టే ఉన్నాడు. తెలిసిందేదో చెప్పడానికి తెలీదని చెప్తున్నట్టే వున్నాడు.

అందరి ఆకాంక్షల్లోనూ ఒక చర్య కావాలి. రాజకీయ చర్య. తొగాడియా నోటికి తాళం పెట్టే చర్య. మోడి దూకుడుకు అడ్డుకట్ట వేసే చర్య. స్వాతంత్ర్యోద్యమ కాలం నుండీ ఆ మాటకొస్తే అంతకు ముందు నుండి ఎన్నో సామాజికోద్యమాలు నడిచిన గడ్డ– హిందూ సామ్రాజ్యవాదానికి అడ్డుకట్ట సామ్యవాద సమతా భావాలు కాకున్నా కనీసం లౌకిక వాద భావాలను జాతి ఆత్మగా నిలబెట్టిన గడ్డ– ఉన్మాదుల విశృంఖల హింసాకాండ ముందు జాలి గొలిపే మౌనాన్ని ప్రదర్శిస్తుంది. యిదీ ఈనాటి విషాదం. స్వాతంత్ర్య సముపార్జనలోనూ, రాజ్యాంగ విలువల నిర్మాణంలోనూ పైచేయిగా నిలిచిన లౌకిక విలువలు, అందుకోసం సాగిన ప్రయత్నాలు మౌన ప్రేక్షక పాత్ర వహించే మరణానంతర స్థితి కొనసాగుతోంది. 'కాషాయాలకి కవిత్వం ప్రత్యామ్నాయం కాదు' మళ్ళీ ఖాదరన్న మాట. యిప్పుడు గుజరాత్ మారణకాండనీ, కాషాయమూకల దుర్మార్గాలని వ్యతిరేకిస్తున్న వాళ్లంతా అనుకొని మరో ప్రత్యామ్నాయం కోసం పూనుకోవలసిన సమయం. లేకుంటే నిరసన కవిత్వాలన్నీ వట్టి తద్దినాలయ్యే సమయం. కాకుంటే కొంచెం శ్రుతి మించితే సంబరాలయ్యే సమయం.

గుజరాత్ మారణకాండలో దళితులు, ఆదివాసీలు, బీసీలు పాల్గొన్నారని స్కైబాబ ఆరోపణ. చాలాచోట్ల జరిగింది నిజం. సిగ్గుతో తల లోలోపలికి ముడుచుకు పోతోంది. నిజం. ఈ విషయాన్ని చాలామంది దళిత మిత్రులతో చర్చించాను. అంతకు ముందే క్రైస్తవుల మీద దాడి పేరుతో, అదే గుజరాత్‌లో దళితుల మీద, ఆదివాసీల మీద దాడులు చేసింది హిందూ పరివారమే. గుజరాత్ మారణకాండకు నిరసనగా దళితుడైన రామ్ విలాస్ పాశ్వాన్ రాజీనామా చేశాడుగానీ, ఫరూక్ అబ్దుల్లా, అతని కొడుకు ఉమర్ అబ్దుల్లా హిందూ పరివారంతోనే అంట కాగాడు.

డర్బన్‌లో దళిత సమస్య చర్చకు వస్తున్నప్పుడు హిందూ ఎజెండాను ముందుకు తీసుకు వెళ్ళినవాడు ఉమర్ అబ్దుల్లా. కాశ్మీర్‌లో నేషనల్ కాన్ఫరెన్స్ ఓడిపోతే హిందూ మతోన్మాద శక్తులతో అంటకాగినందుకు తగిన ఫలితం అనుభవించారని దళిత మేధావులెందరో భావించారు.

ఉద్వేగాలను, ఉద్రిక్తతలను కాసేపు పక్కన పెట్టి వామపక్షాల నుండీ, దళిత బహుజన ఉద్యమాల నుండీ జరిగిన వైఫల్యాలను అంగీకరించి ఒక సమీక్ష చేసుకోవాలి. ఇదే ఇప్పటి అవసరం. అదే సమయంలో ముస్లిమ్ సమాజం తోటి పీడిత శక్తులతో కలవడానికి చేసిన, చేస్తున్న ప్రయత్నాలను కూడా సమీక్ష చేయాలి. దోషుల్ని క్షమించమని కాదు, హంతకుడికి

తగిన శిక్ష పడాల్సిందే. సంఘపరివారంలో భజరంగ్ దళ్ పుట్టుకని జాగ్రత్తగా అధ్యయనం చేయాలి. ఈ దాడుల్ని యిలా చేయడానికే భజరంగ్ దళ్ పుట్టింది. దళితులు పాల్గొన్నా, ఆదివాసీలు పాల్గొన్నా ఈ దాడుల మొత్తాన్ని భజరంగ్ దళ్ రాజకీయాల్లో భాగంగా చూడాలి. అలానే ఎదుర్కొవాలి. రేపు ముస్లింలలో ఒక వర్గానికో లేదా మరో వర్గానికో వ్యతిరేకంగా ముస్లింలనే అది సమీకరించినా ఆశ్చర్యపోనక్కరలేదు.

కాబట్టి ప్రధాన స్రవంతి రాజకీయాలతో సహా కాషాయమూకలకు వ్యతిరేకంగా ఫాసిస్టు వ్యతిరేక రాజకీయోద్యమం ఒకటి కావాలి. "ఇప్పుడు చుడియా మౌనవ్రతాన్ని వీడింది/ మాటల తల్వార్‌లను చూపులతో సంధించింది/ కాషాయపు ఆకుల్ని చిత్తుచిత్తుగా తొక్కేసింది" జమీలా నిషాత్ మాటలు చేతల్లోకి అనువాదం కావాలి.

**8 డిసెంబర్ 2002, ఆదివారం వార్త :**

**'అజాం' గుజరాత్-ముస్లిం కవితా సంకలనం - సంపాదకులు: అన్వర్, స్కైబాబ**

# ఈ ఫలితాల నుండి పాఠాలేమైనా నేర్చుకుంటామా!?

యిటీవల నాలుగు రాష్ట్రాల శాసన సభలకు జరిగిన ఎన్నికల ఫలితాలు దేన్ని రుజువు చేస్తున్నాయి? అతిపెద్ద కమ్యూనిస్టు పార్టీలుగా చెప్పుకొనే రెండు పార్టీలు వున్నాయి. హిందూ మతోన్మాదానికి, సామ్రాజ్యవాదానికి, స్థానిక భూస్వామ్య వర్గానికి, పెట్టుబడిదారీ వర్గానికీ వ్యతిరేకంగా సాయుధ పోరాటాన్ని కొనసాగిస్తున్నామని చెపుతున్న నక్సలైట్ పార్టీలు బలంగానే ఉన్నాయి. సోషలిస్టు శక్తులమనీ, ప్రజాస్వామిక వాదులమనీ, సెక్యులరిస్టులమనీ, చెప్పుకునే చిన్నా చితకా పార్టీలు లెక్కకు మించి వున్నాయి. యిక దళిత బహుజన సంఘాలు, పార్టీలు ప్రతి జిల్లాలోనూ కనిపిస్తాయి. అందరి లక్ష్యం మతోన్మాదాన్ని, ప్రపంచీకరణాన్నీ వ్యతిరేకించడమేనని అనేక ప్రకటనలు, సదస్సులు, సమావేశాలు, ప్రదర్శనల ద్వారా చాటి చెప్పుకున్నారు.

యిప్పుడు నాలుగింట మూడు రాష్ట్రాలలో బి.జె.పి. విజయ పతాకం ఎగురవేసింది. దేశమంతా గుజరాత్ దారుణ మానవ మేథాన్ని ఖండించినట్లేవుంది. దేశమంతా సకల రంగాలకాషాయికరణని నిరసిస్తూన్నట్లేవుంది. కవులు, కళాకారులు, గాయాలను తడుముకొని దుఃఖిస్తున్నట్లేవుంది.

కానీ మూడు రాష్ట్రాల్లో గుజరాత్‌లో హంతక పాత్ర వహించిన పార్టీ, దేశ ఆర్థికవ్యవస్థను నేరుగా ప్రపంచ బ్యాంకు  ఆంక్షల పాదాల ముందు సాగిలపడేట్టు చేసిన బి.జె.పి. విజయం సాధించింది.

ఈ ఫలితాలు దేన్ని రుజువు చేస్తున్నాయి? రకరకాల పేర్లతో చలామణి అవుతున్న ప్రజాస్వామిక పార్టీలకు, బృందాలకూ ఈ దేశ సగటు ప్రజానీకానికి మధ్యన ఎంతటి పూడ్చలేని అగాధాలు విస్తరించాయో ఈ ఫలితాలు స్పష్టం చేస్తున్నాయి. ఎప్పటిలాగే నెపం కాసేపు ప్రజల మీద వేసి కాసిన్ని వేడినిట్టూర్పులు విడిచి యీ జనం యింతే... వీళ్ళెప్పటికీ మారరు అని తిట్టుకొని ఆత్మ తృప్తిని పొందడం మనకు అలవాటైపోయింది.

ఈ దేశానికి వేల యేళ్ళుగా మత మౌఢ్యాన్ని, ఆధిపత్యాన్ని అహంకారాన్ని ధిక్కరించిన చరిత్రవుంది. చార్వాకుల దగ్గర నుండి, బౌద్ధ, జైన దార్శనికుల దగ్గర నుండి భక్తి కవులదాకా ఈ దేశ ప్రజ నియంతృత్వానికి వ్యతిరేకంగా తిరుగులేని పోరాటం నడిపింది. ఈనాటికీ ఆ వారసత్వం ఈ దేశంలో కొనసాగుతూనే వుంది.

మతోన్మాద అహంకారాన్ని అధికారంలోకి రాకుండా నిలువరించడంలో, నిరోధించడంలో ఈదేశ ప్రజలు విఫలమయ్యారా? దళిత, బహుజన, మహాజన, కార్మిక, కర్షక, శ్రామిక వర్గాల ప్రతినిధులమనీ, మతోన్మాదానికి పెట్టుబడిదారీ విధానానికి

వ్యతిరేకులమనీ ప్రకటించుకున్న ఆయా పార్టీలు విఫలమయ్యాయా?

ప్రతిసారీ ప్రజల మీద నెపం నెట్టి వేయలేము. దుర్మార్గమైన నిరంకుశ ఉన్మాదానికి తలవొంచి దాన్ని ఆమోదించే స్థితికి ఈ దేశ ప్రజలు ముఖ్యంగా అన్ని రకాల అణచివేతలకీ వ్యతిరేకంగా పోరాడవలసిన స్థితికి ప్రజలు వచ్చారంటే ఎవరికీ జవాబుదారీతనం లేదా?

ఈ రాష్ట్రాల శాసన సభల ఎన్నికలు మా పాలనకు రిఫరెండం అని బి.జె.పి. వాళ్ళు ప్రకటిస్తే అవి నిజమేనని అన్ని ప్రజాస్వామిక, లౌకిక, వామపక్ష, దళిత, బహుజన, మహాజన రాజకీయ శక్తులు అంగీకరిస్తాయా?

ఒక ఆత్మావలోకనం చేసుకోవలసిన సమయం

ఒక ఆత్మవిమర్శ చేసుకోవలసిన సమయం

యిప్పుడు అన్ని భేషజాలనూ వదలి, అన్ని పరిమితులనూ వదిలించుకొని ఈ దేశ ప్రజానీకానికి ఒక విశ్వాసాన్ని కలిగించవలసిన సమయం. ఈనాటి స్థితి ఏనాడో లెబనాన్ కవి ఖలీల్ జబ్రాన్ తన కవితలో వ్రాసినట్టుగా వుంది.

'గుంట నక్కలే మహానాయకులుగా, మంత్రగాళ్ళే తత్వవేత్తలుగా చెలామణి అయ్యే జాతిని చూసి జాలిపడండి.' ఈ దేశానికి తక్షణ అవసరం గుంటనక్కలనీ, మంత్రగాళ్ళనీ చూసి జాలిపడడం కాదు. వాళ్ళను తరిమికొట్టడం యిందుకు అంబేద్కర్ ఏమన్నా పనికివస్తాడో ఏమో? యింకోప్రయోగం చేసి చూస్తారా? ఈ వైఫల్యాల నుండి ఏమైనా పాఠాలు నేర్చుకుంటారా?

**డిసెంబర్, 2003 బహుజన కెరటాలు సంపాదకీయం**

# సోనియా ... సోనియా

అధికారాన్ని గెలుచుకోవడానికి ఏ వాజ్‌పాయైనా చాలు. కానీ సింహాసనాన్ని ఒక గడ్డిపోచలాగా తిరస్కరించడానికి ఎంతో శక్తికావాలి. గొప్ప ఆత్మబలం కావాలి. అరచేతుల్లో అగ్నిజ్వాలల్ని దాచుకొని చిరునవ్వులు చెదరనివ్వని దీక్ష కావాలి. ఒక మహా సంకల్పం కావాలి.

పరిత్యాగాలు ఈ దేశంలో గతంలో ఎప్పుడూ జరగలేదనికాదు. యికముందెన్నడూ జరగవనీ కాదు. కానీ ఏ మహా పరిత్యాగానికీ తక్కువ కాని పద్ధతిలో ఆమె అధికారపీఠాన్ని త్యజించింది. సోనియా గాంధి అధికారాన్ని తిరస్కరించగల శక్తిని ప్రదర్శించింది.

ఇటలీలో పుట్టి ఈదేశానికి ఒక సాధారణ గృహిణిగా వచ్చిన ఒక మామూలు స్త్రీకి మాత్రమే ఈ దేశాన్ని పాలించే అర్హత వుందని మొండిగా వాదించడం కాదు. ఒక మామూలు భార్యగా, ఒక మామూలు కోడలిగా, పిల్లల తల్లిగా ఈ దేశంలో బతికిన ఆమెను ఈ దేశ రాజకీయాల్లో కీలకమైన పాత్ర పోషించే స్థితికి గత ముప్ఫై ఏళ్ళ రాజకీయ పరిణామాలు తీసుకొచ్చాయి. ఈనాడు జాతీయ స్థాయిలో ప్రత్యామ్నాయ నాయకురాలిగా ఆమె ఎదగడం ఒక చారిత్రక వాస్తవం. ఆమె తప్ప మరెవరూ లేకపోవడం దౌర్భాగ్యమే కావచ్చు. అందువల్ల ప్రధాని కావడానికి అది ఆటంకం కానవసరం లేదు. ఇందిరాగాంధి చనిపోయి, రాజీవ్ గాంధి చనిపోయి తాను దేశరాజకీయాల్లో ముఖ్యపాత్రను పోషించాల్సిన పరిస్థితులు సోనియా గాంధి ముందుకు వచ్చినప్పటి నుండే విదేశీయత అన్న అంశాన్ని సంఘపరివార శక్తులు ముందుకు తెస్తూనే ఉన్నాయి. దేశ దాస్య శృంఖలాలను తెంచడానికి తెల్లవారికి వ్యతిరేకంగా ఉద్యమించిన జాతీయోద్యమ స్ఫూర్తితో ఆమె రాజకీయ రంగప్రవేశాన్ని అడ్డుకోబోయారంటే అర్థం చేసుకోవచ్చు. అదేమీ కాదు. నిజానికి బి.జె.పి., సంఘ పరివార్ నేతృత్వంలోని హిందూత్వ శక్తులు ఏనాడూ సామ్రాజ్యవాద మార్కెట్ శక్తులకు వ్యతిరేకంగా ఉద్యమించిన చరిత్రే లేదు సరికదా మార్కెట్ శక్తులకు తొత్తులుగానే పనిచేశారు. ప్రపంచ బ్యాంకు ముందు దాసోహమవటానికి ఏ అభ్యంతరమూ లేని వీళ్ళకి దేశంలో సోనియా కీలకమైన పదవులను చేపట్టడానికి నిజానికి ఏ అభ్యంతరమూ వుండనవసరం లేదు. నిజానికి సంఘ పరివార్ హిందూ ఉగ్రవాద శక్తులు సోనియాను సాకుగా చూపి ఈ దేశ రాజ్యాంగంపైన, లౌకిక విలువలపైనా, ప్రజాస్వామిక సూత్రాల పైనా దుర్మార్గమైన దాడిని చేయడానికి పూనుకున్నాయి. ఆమెను అడ్డుపెట్టుకొని మైనారిటీల హక్కుల్ని కాలరాయదలచుకున్నాయి. రామమందిర నిర్మాణాన్ని ప్రచారం చేసినంత కంటే ఎక్కువగా సోనియా విదేశీయత పైన ప్రచారం చేశారు. అయితే ప్రజలు ఆ ప్రచారాన్ని తిరస్కరించారు. సోనియాను దేశం స్వంతం చేసుకొంది.

హిందూత్వ శక్తుల పట్ల తమ తిరస్కారాన్ని వ్యక్తంచేసింది. ప్రజల తీర్పు అంత స్పష్టంగా వున్నప్పటికీ సుష్మా స్వరాజ్, ఉమా భారతి వంటి భారతీయ వనితలు తమ తీవ్రమైన వ్యతిరేకతను ప్రకటించారు. దేశం మొత్తం ఆమెను కావాలనుకొంటే వీళ్ళు ఆమె పట్ల వ్యతిరేకతను ప్రదర్శించి హైందవ సంస్కృతిలో భాగమైన తమ వెకిలితనాన్ని బయటపెట్టుకున్నారు. సోనియా ప్రధాని పదవిని చేపడితే తాను గుండు గీయించుకొని తెల్లచీరె కట్టుకొని కటికనేలపైన నిద్రిస్తానని సుష్మా స్వరాజ్ ప్రగల్భాలు పలికింది. గత ఎన్నికల్లో బళ్ళారిలో ప్రజలు ఆమెను ఓడించి సోనియాను అత్యధిక మెజారిటీతో గెలిపించినప్పుడే ఆమె ఆ పని చేసివుండాల్సింది. ఉమాభారతి, గోవిందాచార్యులు కూడ యిటువంటి వ్యాఖ్యానాలే చేశారు. యింతకీ వీళ్ళకెవరు నచ్చుతారు? మొత్తం గుజరాత్ రాష్ట్రాన్ని మంటల్లో మసిచేసి పసిపాపల, గర్భవతుల, అమాయకుల నెత్తురుతో తడిసిన చేతులతో వికటాట్టహాసంచేస్తున్న నరేంద్ర మోడీలు నచ్చుతారు. ఎవరి శవాలవి? ఎవరి రక్తం అది? యిటలీ జాతీయులవి కాదు. ఈ గడ్డమీద పుట్టిన భారతీయుల రక్తం. భారతీయులను చంపి భారతజాతిగా గర్వించడం సుష్మాకీ, ఉమా భారతికి యిష్టమేమోకానీ భారత ప్రజలు ఆ దృశ్యం మీద ఖాండ్రించి ఉమ్మేసి తిరస్కరించారు. ఈ దేశపు ప్రజాస్వామ్యం గెలిచింది.

“జీవితంలో ఎక్కడి నుండి వచ్చామన్నది ముఖ్యం కాదు. ఎక్కడికి వచ్చినామన్నది ముఖ్యం’ అని ఎర్నెస్ట్ హెమంగ్వే అనే రచయిత అంటాడు. సోనియాకు ఎక్కడికి వెళ్ళాలో స్పష్టంగానే తెలుసు. సగటు భారతీయ రాజకీయ నాయకురాలిగా సోనియా గాంధి పైన మనకి ఎన్ని విమర్శలైనా వుండొచ్చు. కానీ రాజకీయ నాయకురాలిగా వుండడం తద్వారా ఉన్నత పదవులు పొందడం ఈ దేశ రాజ్యాంగం ఆమెకిచ్చిన హక్కు.

అత్యున్నత పదవిని త్యజించి సోనియా మంచిపనే చేసిందేమో కానీ ఈ దేశంలోని మెజారిటీ ప్రజలు సుష్మాస్వరాజ్‌ను బోడిగుండుతో చూడాలని కోరుంటే ఏం చేస్తారు?

**జూన్ 2004 - బహుజన కెరటాలు**

# దేశం 'వె..లి...గి...పోతుందా' !!?

బోధి వృక్షమో మరో వృక్షమో అవసరం లేకుండానే అకస్మాత్తుగా జ్ఞానోదయం ఏదో కలుగుతున్నట్లే వుంది. ఎంత తెలివి. ఎంత ఎరుక! ఈ దేశ ప్రజ నిజంగానే జ్ఞాన వంతులై పోయారనిపిస్తుంది.

బేగంపేట విమానాశ్రయం దగ్గర కారెక్కితే అటు జూబిలీ హిల్స్‌దాకా యిటు రామోజీ ఫిల్మ్ సిటీదాకా ఎక్కడా ఎర్రలైటు పడకుండా జామ్మని దూసుకుపోయే విధంగా సమ్మోహనంగా నిర్మితమైన ఫ్లైవోవర్లు, నిజమే దేశం మెరిసిపోతుంది. ఉన్నట్టుండి రహదారులు నాలుగు బుజాలు ధరించి యోజనాలు యోజనాలుగా విస్తరిస్తున్నాయి. ఎంత సంబరం. ఎంత సౌభాగ్యం, ఎంత అందం...ఆనందం! నిజంగానే దేశం మురిసిపోతుంది. అయ్యా చంద్రబాబు నాయుడూ, కవీ వాజ్‌పేయీ మీ ఊహల వుయ్యాలలో జగత్తంతా చీప్ లిక్కర్ తాగి మత్తుగా వూగులాడుతుంటే ఎంత గొప్పగా వుంది. ఎంత మధురంగా వుంది.

జరిగేవన్నీ మంచికేనని తలపోయడం ఈ దేశానికి ఉగ్గుపాలతో పోసిన విద్య. అంతా మంచే జరుగుతుందిలే, నాయినా అద్వానీ త్రిశూలధారుడివైరా! గుజరాత్ హోమ గుండాల నుండి మల మలమాడి బొగ్గైపోయిన స్టెయిన్స్ పసి బిడ్డల ఆర్తనాదాల నుండి దళితుల ఊచకోతల నుండి పారే రక్తప్రవాహాల నుండి అన్నార్తుల ఆకలి కేకల నుండి చీకటి చిచ్చులు నుండి ఈ దేశాధినేతగా అభిషిక్తుడనై మళ్ళీ మళ్ళీ నువ్వేరా! పొద్దునే మా పేగుల్లో ఆకలి కరకర చిచ్చుల పొడుస్తున్న మాట నిజమే. వట్టి జ్వరం వస్తేనే మందులందక ప్రాణాలు హరించుకుపోతున్న మాటా నిజమే. కరువు కాటకాలతో విలవిలలాడుతున్న మాటా నిజమే. మా ఆకలి చావులు నిజమే. ఆత్మహత్యలూ నిజమే. చదువుకొన్నా కొలువులు దొరక్క బతుకు బజారున పడడం నిజమే. బడిలో ఆట పాటలతో గడపవలసిన మా బిడ్డల బాల్యం మట్టిలో బురదలో చెమటలో కరుగుతున్న మాటా నిజమే. అయినా 'జరిగేదంతా మంచికేనని తలపోయడమే' పనిగా బతుకులీడుస్తున్నాం నాయినా, అంబానీల సామ్రాజ్యం 'హాయిగా వుందనుకొండని'. (ఫీల్‌గుడ్) నినాదమిస్తే అప్పుడర్థం కాలేదు. అద్వానీ శంఖుతీర్థంలా నినాదమిస్తే యిప్పుడు నిజంగానే అర్థం అవుతుంది.

రాజకీయాలు సిగ్గులేని స్థాయి ఏనాడో చేరాయి కానీ యింత వరకు బొంకుల నాటకంగా మార్చడం మీకే సాధ్యం. మా ఆకలి అబద్ధం, అత్యాచారాలు అబద్ధం. మీరు బలిసిపోవడం అబద్ధం. దేశం అంగాంగం విదేశీ మార్కెట్లో తాకట్టు పడటం అబద్ధం. ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాల పైన మీరు పెట్టిన సంతకాలు అబద్ధం. పల్లెల్లో కరాళవిహారం చేస్తున్న ప్రొక్లెయిన్లు అబద్ధం. దళారుల గోదాముల్లో నిండుతున్న పనికి ఆహారం అబద్ధం. మీ

కుంభకోణాలు అబద్ధం. అయ్యా నిజంగానే మా దేశం వెలిగిపోతుంది. యిక్కడంతా మంచిగానే వుంది.(రియల్లీ వి ఆర్ ఫీలింగ్ వెరీగుడ్) శవాల కొట్టు వాసన మాకు అలవాటైపోయింది. మృత్యు స్పర్శ మాకు కుసుమ కోమలంగా వుంది. మీకు నిజంగానే సిగ్గులేదు కాబట్టే మీరు ఏం చెప్పినా వింటాం.

మా సంగతి సరేకానీ మీసంగతేంటి? అయ్యా చంద్రబాబూ, వాజ్‌పేయీ, అద్వానీ, మహానాయకులారా... బాత్‌రూం నుండి నేరుగా బయటకి వచ్చినట్టున్నారు. ఒకసారి మీవైపుమీరు చూసుకొండి.

దేవతా వస్త్రాలు.

అయ్యా, ఈ దేశం వెలిగిపోవడంలేదు. దేశం కడుపు భగభగ మండిపోతూ గుండె తారు మరిగినట్లు కుతకుత ఉడికిపోతుంది.

**ఫిబ్రవరి 2004 - బహుజన కెరటాలు సంపాదకీయం**

# ఉత్తరాపథాన ప్రతిధ్వనించిన దక్షిణాది విప్లవజ్వాల

**( 1995 సెప్టెంబర్ 16,17,18 తేదీలలో లక్నోలో జరిగిన పెరియార్‌మేళా విశేషాలు )**

సెప్టెంబరు పదహారవ తేదీ ఉదయం పదిన్నర గంటలు, పుట్టనుండి దండ్లు దండ్లుగా బయటకు వచ్చే చీమలబారుల్లాగా చెలియలి కట్టల్ని తెంచుకుని ఉరికిపడే సముద్ర కెరటాల్లాగా లక్నో రైల్వేస్టేషన్ నుండి నినాదాలహోరుతో నిరంతరాయంగా కవాతు చేస్తూ బయటకు వచ్చే పోటెత్తిన జనసముద్రాలు. నగరం నడిబొడ్డున నీలిసముద్రం ఊరేగింపు జరుపుతున్నట్లు... అగ్నిపర్వతాలన్నీ ఒక్కచోట సమావేశమై ఆనందంగా కేరింతలు కొట్టినట్లు దేశం మూలమూలల నుండి నగరానికి చేరుకున్న బహుజన సమూహాలు జాతర జాతరగా నడిచిపోతుంటే నగరం నడిబొడ్డున వేల ఏళ్ళుగా మౌనంగా ప్రవహిస్తోన్న గోమతీ నది పిడికిళ్ళు బిగించిన నినాదమై ఎగిరే నీలిపతాకమై పరవళ్ళు తొక్కింది.

లక్నోలో పెరియార్ మేళా. ఎక్కడో దక్షిణాపథాన నూట పదిహేడేళ్ళ క్రితం పుట్టి, బతుకంతా దేవుళ్ళనీ, దెయ్యాలనీ తిట్టుకుంటూ, మగవాళ్ళ పెత్తనాన్ని నిరసిస్తూ, దోపిడీ పీడనలు పోవాలని బతుకును ఊరేగింపు చేసిన ఒక తమిళ వృద్ధ సింహానికి తరతరాలుగా మనుషుల్ని బానిసలుగా మార్చే హైందవ ధర్మం ప్రభవించిన ఆర్యావర్తనంలో నీరాజనాలు. తమిళ నెత్తురుకూ ఉత్తరాదికీ వున్న తల్లి పేగుబంధమేదో కదులాడింది. లక్షలాదిగా లక్నోకు తరలివచ్చిన బహుజన సమూహాలకు భాషాభేదాలేవీ అడ్డంకులు కాలేదు. చిరునవ్వులతో సమస్త భాషని ఒక్క నినాదం చేసినట్లు రకరకాల భాషా సంస్కృతుల నుండి వచ్చిన వాళ్ళందరూ ఒకే ఒక్క భాష మాట్లాడారు. అది అంబేడ్కర్ భాష. అది పెరియార్ భాష. అది కాన్షీరాం చిరుస్వప్నం. అది మూడు దశాబ్దాలుగా బహుజన సమాజ్ పార్టీ త్యాగాల పునాదితో సాగించిన రాజకీయ ప్రస్థాన హోరు.

సెప్టెంబర్ 16,17,18 తేదీలలో ఉత్తర ప్రదేశ్ రాజధాని నగరం లక్నోలో జరిగిన 'పెరియార్ మేళా'లో పాల్గొనేందుకు వివిధ రాష్ట్రాల బహుజన సమాజ్ పార్టీ శాఖల ఆధ్వర్యంలో బహుజనులు లక్షలాదిగా తరలివచ్చారు. తమిళనాడు నుండి రెండు ప్రత్యేక రైళ్ళు. హైద్రాబాద్ నుండి బెంగుళూరు నుండి కలకత్తా నుండీ గుజరాత్ నుండీ అంబేడ్కర్ పుట్టినగడ్డ మహారాష్ట్ర నుండీ అనేక ప్రత్యేక రైళ్ళలో బహుజన సమూహాలు కదలివచ్చాయి. లక్నో నగరమంతా పెళ్ళికి వచ్చే అతిథులను సాదరంగా ఆహ్వానించే విడిదిల్లులాగా వుంది. ఎటు చూసినా ఎగిరే నీలిజెండాల రెపరెపలు. ప్రధాన కూడళ్ళలో ఆకాశానికి అంటుతున్నట్లున్న పెరియార్ ఇ.వి.ఆర్. నాయకర్ కటౌట్లు. బహుజన సంస్కృతికి అద్దం పడుతున్నట్లుంది లక్నో. వచ్చినవారందరినీ రైల్వేస్టేషన్ నుండి వారి వారికి బస ఏర్పాటు చేసిన స్థలాలకు బస్సుల్లో తరలించారు. నల్ల చొక్కాలు, నల్లజెండా మధ్యలో అరుణారుణ సూర్యుడి గుర్తుతో పెరియార్ నిర్మించిన ద్రవిడ కజగం కార్యకర్తలు సైనిక కవాతులు చేస్తూ ముందుండి నడిచారు. తమిళనాడు, ఆంధ్ర, కర్నాటక, గుజరాత్ తదితర రాష్ట్రాల నుండి వచ్చిన వారికి దుబగ్గాలోని

విశాలమైన మార్కెట్ యార్డ్ భవనాల్లోనూ మిగతావారికి నగరం నడిబొడ్డున ఉన్న ప్రభుత్వ మెడికల్ కాలేజీల్లోనూ వసతులు ఏర్పాట్లు చేశారు. గ్యాస్ పొయ్యిల మీద నిరంతరం వంటా వడ్డింపు. ఎందరు తిన్నా తరగని బియ్యం, గోధుమలు. దేనికీ కొదువ లేని ఏర్పాట్లు. భోజన కార్యక్రమాలే ఒక పెద్ద ఆనందోత్సాహాలు నిండిన జాతర.

బహుజన సమాజ్ పార్టీ జాతీయ అధ్యక్షులు శ్రీ కాన్షీరాం ఢిల్లీనుండి విమానం దిగి నేరుగా దుబగ్గా వచ్చారు. వెనుక అధికార గణాలు. అణిచివేత తప్ప ధైర్యంగా నిలవడం తెలియని బహుజనులు నిజమైన అధికారం రుచిని చవి చూశారు. దేశంలో మొట్టమొదటి బహుజన రాజ్యంలో అప్పటివరకూ క్రూరత్వానికీ, అత్యాచారాలకూ మారుపేరుగా గణతికెక్కిన ఉత్తరప్రదేశ్ పోలీసులు క్రమశిక్షణ కలిగిన స్వచ్ఛంద సేవకుల్లాగా సేవలందించారు. మర్యాద మన్ననలతో దళిత శక్తులకు సేవచేసి తమ జన్మను తరింప చేసుకోవాలన్న ఆరాటం వారిలో కనపడింది. పదహారవ తేదీన మధ్యాహ్నం 'పరివర్తన చౌక్'లో ఏర్పర్చిన విశాలమైన వేదిక మీద పలు రాష్ట్రాల కళాకారుల సాంస్కృతిక ప్రదర్శనలతో మేళా ప్రారంభమయ్యింది. నిజమైన ప్రత్యామ్నాయ సంస్కృతికి అద్దం పట్టాయా ప్రదర్శనలు.

## పరివర్తన్ చౌక్

ఉత్తరప్రదేశ్‌లో మాయావతి నాయకత్వంలో బహుజన సమాజ్ పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత లక్నో నడిబొడ్డున విశాలమైన స్థలంలో పరివర్తన చౌక్ నిర్మించారు. దానిని సామాజిక పరివర్తన కోసం తమ జీవితాలను అంకితం చేసిన మహనీయులకు అంకితం చేశారు. అందులో భారత సమాజాన్ని సమూలంగా మార్చి సమతా సమాజాన్ని ఏర్పర్చడానికి కృషి చేసిన డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్, మహాత్మా ఫూలే, ఛత్రపతి సాహూ మహరాజ్, నారాయణగురు – పెరియార్ల విగ్రహాలని త్వరలో ప్రతిష్టిస్తామని జాతీయ అధ్యక్షులు శ్రీ కాన్షీరాం ప్రకటించారు.

అధికార వీధుల్లోకి మట్టి మనుషులు రావడాన్ని అగ్రకుల హిందువులు తట్టుకోలేకపోయారు. బి.జె.పి. కక్కలేక, మింగలేక చచ్చింది. కాంగ్రెస్ ఉండబట్టలేక అసెంబ్లీలో తన అక్కసునంతా వెళ్ళకక్కింది. పెరియార్ మేళా పేరుతో అధికార దుర్వినియోగం జరుగుతుందని కాంగ్రెస్ పార్టీ అసెంబ్లీలో లేవనెత్తింది. ముఖ్యమంత్రి కుమారి మాయావతి ఒక్కటే సమాధానం. "ఈ దేశాన్ని సంస్కరించాలనీ, ఈ దేశంలో మానవతా కుసుమాలను పూయించాలనీ తమ జీవితాలను అంకితం చేసి ఉద్యమించిన స్ఫూర్తిదాతలను స్మరించుకోవడం కన్నా మిన్నైన విషయం మరొకటి లేదు. ప్రభుత్వాన్ని నడపడం కన్నా కూడా దళిత దార్శనికులను స్మరించుకోవడమే నాకు ఆనందదాయకమైన విషయం' అని ప్రకటించింది.

పదిహేడవ తేదీన పరివర్తన్ చౌక్‌లో జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తూ 'మాయావతి ఎవరి వత్తిళ్ళకూ లోనై పనిచేయదు. బహుజన సమాజాన్ని అడ్డుకోవాలని ఉవ్విళ్ళూరి కాంగ్రెస్ మట్టికొట్టుకుపోయింది. ఇప్పుడు బి.జె.పి. అడ్డుకోవాలనుకుంటే దానికి అదే గతి పడుతుందని'

ఆమె హెచ్చరించింది. 'ఈ రోజు బహుజన సమాజ్ పార్టీ ప్రధాన కార్యదర్శిగా నేను పెరియార్ మేళా ఉత్సవాల్లో పాల్గొంటున్నాను. రేపు అక్టోబరు రెండవ తేదీన గాంధీ జయంతిని ముఖ్యమంత్రిగా జరుపుతాననీ చెప్తూ గాంధీని, నెహ్రూను ప్రజలెవరూ స్మరించుకోవడంలేదనీ అనాథ శవాలకు అంత్యక్రియలు జరిపే బాధ్యతను ప్రభుత్వం ఏవిధంగా తీసుకుంటుందో అదే విధంగా గాంధీ నెహ్రూల జన్మదినాలను ప్రభుత్వాలు జరుపుతున్నాయనీ అయితే అంబేడ్కర్, ఫూలే, నారాయణగురు, సాహు మహారాజ్, పెరియార్‌ల ఉత్సవాలను ప్రభుత్వాలు జరపవలసిన అవసరం లేదనీ, ప్రజలే తమ నేతల్ని గుండెల్లో దాచుకుని వారి జన్మదినోత్సవాలను ఆనందోత్సాహాలతో జరుపుకుంటారనీ" ఆమె అన్నారు.

సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన ద్రవిడకజగం నాయకుడు, పెరియార్ సహచరుడు శ్రీ వీరమణి మాట్లాడుతూ పెరియార్ స్త్రీల సమానత్వం కోసం పోరాడారనీ, కుమారి మాయావతిని దేశంలో అతిపెద్ద రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌కు ముఖ్యమంత్రిని చేయడంద్వారా ఆయన కలను శ్రీ కాన్షీరామ్ నిజం చేశారనీ అన్నారు. పెరియార్ పోరాట వారసత్వాన్ని ముందుకు తీసుకువెళ్తూ ఆచరణలో దాన్ని నిజం చేస్తున్న శ్రీ కాన్షీరాంకు ఆయన తమిళనాడు నుండి తీసుకువచ్చిన పెరియార్ బంగారు శాలువాను కప్పారు.

సభకు అధ్యక్షత వహించిన బహుజనుల ప్రియతమ నేత బి.ఎస్.పి. జాతీయ అధ్యక్షులు శ్రీ కాన్షీరాం మాట్లాడుతూ "పెరియార్ వంటి నేతలు సామాజిక, సాంస్కృతిక పరివర్తనను సమాజంలో తీసుకువచ్చారనీ ఇప్పుడు తాను వారు సాధించిన విజయాల పునాదులపైన నిలబడి రాజకీయ పరివర్తనకూ కృషి చేస్తున్నాననీ అన్నారు. ప్రభుత్వాధికారాన్ని చేపట్టడంతోనే సరిపోదని కార్యనిర్వాహక వర్గంలోనూ, న్యాయశాఖలోనూ బహుజన సమూహాలు చొచ్చుకుపోవాలనీ" ఆయన ఉద్బోధించారు.

"సామాజిక విప్లవాన్ని విజయవంతం చేయడానికి బహుజనులు ముందుకు రావాలని ఆహ్వానిస్తూనే బహుజన శత్రువులనుకూడా యుద్ధానికి రమ్మని ఆహ్వానిస్తున్నానని ఆయన ప్రకటించారు. పెరియార్ మేళాకు శత్రువులే ఎక్కువగా ప్రచారం చేశారని ఆయన అన్నారు. మీకు సత్తావుంటే తేల్చుకోడానికి రండని" ఆయన బహుజన శత్రువులను సవాల్ చేశారు.

'బహుజన రాజ్యాన్ని భారత భూభాగమంతటా విస్తరింపచేయాలనీ అది తాను జీవించి వున్న కాలంలోనే జరగాలని' ఆయన గద్గద స్వరంతో అన్నారు.

దక్షిణాదిన జరిగిన సామాజిక విప్లవాల స్ఫూర్తిని స్వంతం చేసుకున్న ఆర్యావర్తం బహుజన జాతుల పాలనకై చేతులు సాచి ఆహ్వానిస్తున్నట్లుగా చెరవీడిన స్వేచ్ఛా భావనలతో లక్నో బహుజన సమూహాలకు వీడ్కోలు పలికింది. తమిళనాట పుట్టిన చైతన్య జ్వాల ఉత్తరావనిలో వినిపించిన యుద్ధశంఖారావమై పల్లెపల్లెనా బహుజన రాజ్యాధికార పతాకమెగరేస్తుందని సభ శపథం పూనింది.

జాతి జాతి నిర్ఘాత హేతువై కాలకేతువై కదం తొక్కినట్లు దిక్కులు పిక్కటిల్లే నినాదాలు చేస్తూ జనం కదలబారారు. మేళా సభ ముగిసింది. బహుజన రాజ్యాధికార ఉద్యమం కొనసాగుతోంది.

**అక్టోబర్ 1995 - బహుజన సమాజ్**

# కాలమేమీ మారలేదు! బాధలేవీ తీరలేదు!!

కొత్తసంవత్సరం వచ్చింది. అందరికీ మంచి జరగాలని 'బహుజన కెరటాలు' ఆకాంక్షిస్తున్నది.

మంచి జరగడం ఎవరి విషయంలోనైనా మామూలు విషయమేమో కానీ దళిత బహుజనుల విషయంలో అదంత మామూలు విషయంకాదు. కాలం తన ముళ్ళచక్రాల రథాన్ని దళిత బహుజన సమూహాల గుండెల మీదుగా నడిపించుకుపోతుంది. క్యాలెండర్ మాత్రమే మారింది. అవమానాలు పోలేదు. అత్యాచారాలు ఆగలేదు. సమాజం దళితుల కోసం దాచివుంచిన అత్యాచారాలేవీ ఆగలేదు. ఎప్పటిలాగే సరికొత్త సవాళ్ళను వెంటేసుకొని దళిత బహుజనుల ముంగిట వాలింది కొత్త సంవత్సరం.

అగ్రకుల అహంకారం కారంచేడు పంటపొలాలలో దళిత జీవుల్ని నరికి చంపింది. చుండూరులో దళితుల్ని వెంటాడి వేటాడి నరికి చంపడం మాత్రమే కాక శవాలను గోనె సంచిలో కుట్టేసి తుంగభద్రలో విసిరేశారు. యిప్పుడు ప్రకాశంజిల్లా తురకపాలెం గ్రామంలో శివయ్యను హత్యచేశారు. శవం మటుమాయం చేశారు. భర్తను కోల్పోయిన భార్య, తండ్రిని కోల్పోయిన బిడ్డలు శివయ్య హత్య గురించి పోలీసుల దృష్టిని తీసుకువస్తే శవం చూపించమని అడిగే పరిస్థితి. హంతకులు, పోలీసులు కలగలసిపోయిన పరిస్థితి.

******

ఒక్క మహబూబ్ నగర్ జిల్లా నుండే 16 లక్షల మంది దళిత బహుజనాలు పల్లెల విడిచి, ప్రేమగా సాదుకున్న ఇళ్ళలోగిళ్ళను విడిచి నగరాలకు వలసెళ్ళిపోయారు. పనిలేదు. వేతనంలేదు. కడుపు కింత తిండిలేదు. పనికి ఆహారం పథకాలన్నీ కాంట్రాక్టర్ల గోదాముల్లోకి, రాజకీయనాయకుల జేబుల్లోకి ప్రవహించాయి. కరువు కాంట్రాక్టర్ల, రాజకీయ నాయకుల, దళారుల పాలిట సిరులు కురిసే కల్పతరువుగా మారిపోయింది. పనిచేసే మనుషులకు పనిలేకుండా చేసి ప్రొక్లెయిన్లను తీసుకువచ్చారు. యంత్రభూత కోరల్లో దళిత బహుజనుల కూలీ బతుకు చితికిపోయింది. ప్రపంచబ్యాంకు ఆదేశాలను శిరసా వహిస్తున్న ప్రభుత్వాలు సంక్షేమాన్నీ సబ్సిడీలను, ప్రజాహితాన్ని పక్కన పెట్టేశారు. ప్రైవేటీకరణ, సరళీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణల విశ్వరూపంల పల్లెపట్టుల్లో వికృత తాండవమాడుతోంది. తలవంచి బతకలేక, తలఎత్తి నిలువలేక బతుకు అంచుల్లోకి పరుగులు పెడుతోంది దళిత జీవితం. జీవించడానికి ఎటువంటి ఆదరువు మిగలక అల్లాడుతోంది దళిత బతుకు.

******

రాష్ట్రంలో పరిపాలిస్తున్న తెలుగు దేశం ప్రభుత్వం శాసన సభను రద్దుచేసి ఎన్నికల

కోసం ఉబలాటపడుతుంది. కేంద్రంలో అధికారం చెలాయిస్తోన్న బిజెపి నాయకత్వంలోని ఎన్.డి.ఎ. ప్రభుత్వం పార్లమెంటును రద్దుచేసి 'ముందస్తు' ఎన్నికలకు వెళ్ళాలనే నిర్ణయించింది. మూడువేల ఐదువందల కోట్ల రూపాయల 'వెలుగు' నిధులు ఏ అన్నార్తుల ఆకటి చీకటిచిచ్చునూ ఆపలేదు. శాసనసభలో పసుపుపచ్చ దీపాలను వెలిగించేందుకు నిధులకీ ఆరాటంగా వుందేమోననిపిస్తుంది. 'పేదరిక నిర్మూలన నుండి పేదరికం తగ్గింపు, వేషం మార్చుకున్న ప్రపంచబ్యాంకు నిధులు తెలుగుదేశం పార్టీ ఎన్నికల నిధులుగా వుపయోగపడబోతాయన్నది సర్వత్రా విన్పిస్తున్న బహిరంగ రహస్యపు గుసగుస. పార్టీలన్నీ దళిత బహుజనుల కోసమే పుట్టాయని మళ్ళొక్కసారి నమ్మించడానికి నానాతంటాలూ పడుతున్నాయి. బహుశా ఆ రెండు రోజులూ మత్తెక్కిన మస్తిష్కాలతో ఏ గతకాలపు తలపోతల బరువు లేకుండా మరో ఐదేళ్ళ పాటు ఎవరినో గద్దెనెక్కించి చేతులు దులుపుకుంటారు ఈ దేశపు దళిత బహుజనులు. నిన్న దుర్మార్గంగా కన్పించిన పార్టీ యీరోజు అత్యంత ప్రేమాస్పదంగా కన్పిస్తుంది. నిన్న ఆప్త మిత్రునిగా కన్పించిన పార్టీ ఇవేళ పరమ శత్రువుగా కన్పిస్తుంది. అధికారం అనే ఏకైక ఎజెండాలో ఎత్తులూ, జిత్తులూ, పొత్తుల పావులు చకచక కదలిపోతున్నాయి.

******

దళిత రాజ్యాధికారం అన్నది నినాదం స్థాయి దాటి ఒక్క అడుగైనా ముందుకు వేయలేదు. తెలుగు గడ్డమీద ఉద్యమాలు జరుగుతున్నట్టే వున్నాయి. అంబేద్కర్ జయంతులు, వర్ధంతులు, సమీకరణలు పెరుగుతున్నట్టే వున్నాయి. ఏ బహిరంగ సభ జరిగినా పిడికిళ్ళు బిగుసుకొని నినాదాలు హోరెత్తించే జనం తండోపతండాలుగా తరలివస్తూనే వున్నారు.అయినా అత్యాచారాలు ఆగలేదు. రాజ్యధికారం దిశగా ముందడుగు లేదు. ఆర్థిక సాధికారత అనేది అందని ఆకాశ కుసుమంగానే వుంది. ఈ పరిస్థితుల్లో అందరికీ మంచి జరగాలనే ఆకాంక్ష అంత సులభతరమైనదేమీ కాదు. అదొక ఘర్షణ! అదొక వుద్యమానికి పిలుపు! దళిత బహుజన ఉద్యమాన్ని సమీక్షించి మారుతున్న కాలానికి అనుగుణంగా భవిష్యత్ కార్యాచరణ ప్రణాళికను రూపొందించాల్సిన అవసరాన్ని గుర్తింపు చేసే మేలుకొలుపు పాట.

******

యివాల్టి ఆ వూరి పేరు తురకపాలెం కావచ్చు. ఆ శవాల్ని వెలికి తీసిన సమాధి
అసలు పేరు. భారతదేశం...

కాలమేమీ మారలేదు! బాధలేవీ తీరలేదు!!

**జనవరి 2004 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# పోతివిరో చంద్రబాబు... పేదోళ్ళ ఉసురు తగిలి...

అనుకున్నట్లుగానే నారా చంద్రబాబునాయుడు ఓడిపోయాడు. దళితుల, పేదల, ఆదివాసుల, స్త్రీల, పసిపిల్లల ఉసురు తగిలి తెలుగుదేశం ప్రభుత్వం కుప్పకూలి పోయింది. ప్రపంచబ్యాంకుకు విధేయంగా వుంటే చాలు మరెవరికీ జవాబుదారీగా వుండనవసరం లేదని చంద్రబాబు నాయుడు భావించాడు. కనీసం స్వంతపార్టీలో ఒక చర్చలేదు. సమన్వయం లేదు. నిరుపేదల స్థితిగతులపైన ఎటువంటి ఆరా లేదు. ప్రభుత్వం అనుసరిస్తున్న సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాల వలన బక్క రైతులు ఆత్మహత్యల పాలవుతున్న సంగతి, దళితులపైన నానాటికీ పెరిగిపోతున్న అత్యాచారాల సంగతి, ప్రతిక్షణం వలవల విలపిస్తూ వలసెల్లిపోతున్న కూలీల సంగతి, ఉపాధి కోల్పోయి రోడ్లమీద పడ్డ ప్రభుత్వరంగ సంస్థలు, కార్మికులు, ఉద్యోగుల సంగతి చంద్రబాబుకు తెలియక కాదు. తెలియదనుకున్న ప్రతి సందర్భంలోనూ ఆయా వర్గాలు తమ తమ ఆందోళనలోనూ, నిరసనలో వ్యక్తం చేస్తూనేవున్నారు. ప్రజలు ఆందోళనకు దిగినపుడల్లా వారి సమస్యలను సానుకూలతతో పరిశీలించి తగిన పరిష్కార మార్గాన్ని ఎన్నుకొనే ఆలోచన చేయడం కాకుండా అణచివేతనూ, నిర్బంధాన్నే పరిష్కారమార్గంగా ప్రజలపైన ముఖ్యంగా ఉద్యమించే ప్రజల పైన ఉక్కుపాదాన్ని మోపాడు. విచ్చలవిడిగా బూటకపు ఎన్‌కౌంటర్ హత్యాకాండ అమలు జరిపాడు. రాష్ట్ర వ్యాప్తంగా తమ సమస్యపై కదలబారిన అంగన్‌వాడీ టీచర్లు, ఆయాలపైన స్త్రీలని కూడా చూడకుండా దుర్మార్గంగా లాఠీఛార్జీ చేయించాడు. మాలమహానాడు ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో జరిగిన ర్యాలీకి లక్షలాదిగా తరలివచ్చిన మాలజనం పైన కర్కశంగా దాడులు నిర్వహించి, మాలలను గుర్రాల పద ఘట్టనల కింద తొక్కించి అమాయకుల మరణాలకు కారణమయ్యాడు. విద్యుత్ ఛార్జీల పెంపునకు నిరసనగా కదంతొక్కిన ప్రజానీకంపై పరమ పాశవికంగా కాల్పులు జరిపి నరమేథం సృష్టించి తన రక్త దాహాన్ని తీర్చుకున్నాడు. బతుకు భారమైన నిరుపేద బడుగుజనం ఏమాత్రం గొంతెత్తినా నిరంకుశంగా దాన్ని అణచివేసేందుకే ప్రయత్నించేవాడు. యిన్ని అకృత్యాలను ప్రజలు సహిస్తారనీ, మీడియా మాయాజాలంతో ఎవరినైనా మభ్యపెట్టవచ్చుననీ భ్రమించిన చంద్రబాబు నాయుడు ప్రజలు నానాటికీ అందించిన వ్యతిరేక సంకేతాలను ఏమాత్రం లెక్కచేయలేదు. అన్నింటికీ మించి దళిత, మైనార్టీ ప్రజలపైన ఫాసిస్టుదాడులకు పాల్పడి దేశానికి దుర్మార్గమైన దాడులను చవిచూపించి మారణహోమం సృష్టించిన సంఘ్‌పరివార్, విశ్వ హిందూ పరిషత్, బి.జె.పి.కూటమి ఆధిపత్యం వహిస్తున్న ఎన్.డి.ఏ. ప్రభుత్వానికి అండగా నిలబడి ప్రజావ్యతిరేక విధానాలకు మద్ధతుగా నిలబడ్డారు. యిన్ని ప్రజావ్యతిరేక విధానాలను ప్రజలు గమనిస్తారనీ దాన్ని వ్యతిరేకిస్తారనీ, అవసరమైతే సరైన గుణపాఠం చెబుతారనీ ఏమాత్రం ఆలోచించకుండా కరువు కోరల్లో చిక్కిన ప్రజల

కడుపులు కొట్టి తాను సహాయపడిన కాంట్రాక్టర్లు, పచ్చచొక్కా తమ్ముళ్ళు తనని ఆదుకొంటారని భావించాడు. అవసరమున్నా అవసరం లేకపోయినా ప్రభుత్వోద్యోగులను వేధించాడు. అవమానించాడు. ఆ రకంగా అన్ని వర్గాల ప్రజలకు ద్రోహంచేసిన చంద్రబాబు పతనాన్ని ఏ శక్తీ ఆపలేకపోయింది. చంద్ర గ్రహణాన్ని వదిలించడానికి జనం ప్రభంజనమై కదిలింది. జాతి జాతి నిర్ఘాతపాత సంఘాత హేతువై కాలకేతువై కదలబారినట్టు ఉవ్వెత్తున ఎగిసిన నిరసన కెరటం చంద్రబాబుని చిత్తు చేసింది. అది కాంగ్రెస్ పాలిట వరమైంది. యిది కాంగ్రెస్ విజయం అనడంకన్నా సామాన్యుడి ఆగ్రహం అని కాంగ్రెస్ వారికీ తెలుసు. కాంగ్రెస్ పార్టీకి కొంచెం కూడా సిగ్గులేదన్న విషయం వాళ్ళే పదేపదే బయటేసుకుంటున్నారు.

జనం యిచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకుండా పరస్పర కలహాలతో, పదవీ వ్యామోహంతో ఒకళ్ళమీద ఒకళ్ళు ఆరోపణలు చేసుకుంటూ ముందు నిలబడిన వాళ్ళ కాళ్ళు నరికి కుట్రలు పన్నుకుంటున్నారు. ఒక స్థిరమైన సంక్షేమ ప్రభుత్వాన్ని అందివ్వగలమనే హామీని యిచ్చే సామర్థ్యాన్ని కనపర్చలేకపోతున్నారు. ప్రజలు ఏ పరిస్థితుల్లో కాంగ్రెస్ పార్టీకి అధికారాన్ని కట్టబెట్టారో, ఆ పరిస్థితులను విస్మరిస్తే చంద్రబాబుకు పట్టిన గతి కంటే అతి దయనీయమైన స్థితిలో ప్రజాజీవితం నుండి బయటకు వెళ్ళి పోవలసి వస్తుందని కాంగ్రెస్ నేతలు గుర్తించాలి. చంద్రబాబుకు జలగండం తగిలింది. కరెంటుషాకు కొట్టింది, అంతిమంగా పేదప్రజల ఉసురు తగిలింది. అందరి నిరసనలు పనిచేసి పరాభవంతో పదవిని కోల్పోయాడు. కాంగ్రెస్ పార్టీ విద్యుత్ విషయంలోనూ, నీటి వసతుల విషయంలోనూ యిచ్చిన వాగ్దానాలలోనూ, ప్రజల జీవనభృతి విషయంలో యిచ్చిన వాగ్దానాలనూ విస్మరిస్తే చంద్రబాబు నాయుడుకంటే దారుణమైన పరిస్థితులను ఎదుర్కొవలసి వస్తుందని బహుజన కెరటాలు హెచ్చరిస్తుంది. నక్సలైట్ల పట్ల, ప్రత్యేక తెలంగాణా పట్ల చేసిన వాగ్దానాలు నిలుపుకొని కరువుసమస్య, దళితులపై జరిగే అత్యాచారాల సమస్య, వలసలు, నిర్వాసాలు వీటిని పట్టించుకోవాలని ప్రజల తరఫున బహుజన కెరటాలు కొత్త ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంది.

**మే 2004 – బహుజన కెరటాలు**

# ద్రోహ కాలం

ప్రజల నమ్మకానికి ఒక వెన్నుపోటు. అంకురించే ఆశలపైన విషపు వాన. అనుకున్నంతా అయ్యింది. ఒక మహా విద్రోహానికి కాంగ్రెస్ ప్రభుత్వం తెర తీసింది. ద్రోహ కాలం ఈ గడ్డమీద మళ్ళీ ప్రారంభమయ్యింది.

తొమ్మిదేళ్ళపాటు తెలుగుదేశం పాలనలో ప్రజలు అష్టకష్టాలు పడ్డారు. బతకలేక ఆత్మహత్యలు చేసుకొన్నారు. చనిపోలేని వాళ్ళు జీవచ్ఛవాలుగా బతికారు. అకృత్యాలు, అత్యాచారాలతో పల్లెసీమలు తల్లడిల్లిపోయాయి. దళిత బహుజన జనాంగం పొట్ట చేతపట్టుకొని చెట్టొపుట్ట తిరిగారు. వున్న వూళ్ళు వదలి వలసెల్లి పోయారు. నిరంతరం హింసారాజ్యమేలింది. నక్సలైట్ల ఏరివేత పేరుతో పల్లెల్లో పోలీసుల క్రౌర్యం జులుం చేసింది. చిత్రహింసలు, అక్రమ నిర్బంధాలతో బండెడు శోకాన్ని కడుపులో దాచుకొని చిన్న అలికిడికే వజవజా వణికిపోయే చిగురాకుల్లా పల్లెలు ప్రాణాలరచేత పట్టుకొని బతికాయి. నగరాలు మాఫియాల నీడలో భయం గుప్పెట్లో చిక్కుకుపోయాయి.

విసిగి వేసారిన జనం గత ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీని ఓడించారు. ఒక మార్పును కోరుకున్నారు. కొంచెం ఊపిరి పీల్చుకొనే వెసులుబాటును కోరుకున్నారు. ఈ సంధికాలంలో పాదయాత్రల పేరుతో, బస్సుయాత్రల పేరుతో ఊరూరా తిరిగి కాంగ్రెస్ పార్టీ అనేక హామీలనిచ్చింది. అవినీతి పాలనకు చరమగీతం పాడండని పిలుపునిచ్చింది. తాము అధికారంలోకి వస్తే నిరుపేదలు సైతం కళకళలాడే పరిపాలనను అందిస్తామని చెప్పింది. ఉచిత విద్యుత్‌నిస్తామని చెప్పింది. దశల వారీగా మద్యాన్ని నిషేధిస్తామని చెప్పింది. ముఖ్యంగా ప్రజా జీవితాలలో శాంతిని నెలకొల్పేందుకు నక్సలైట్లతో శాంతి చర్చలు జరుపుతామని చెప్పింది. నక్సలైట్లు ఏ ప్రజాసమస్యలనైతే తమ ఎజెండాగా పెట్టుకొని పోరాడుతున్నారో ఆ సమస్యలను తక్షణం పరిష్కరిస్తామని చెప్పింది.

యిన్ని మాటలిచ్చి అధికారంలోకి వచ్చి ఏ ఒక్కమాటా నిలబెట్టుకొనే దిశగా చర్యలుచేపట్టలేదు. ప్రజాసంక్షేమం పేరుతో తమ పార్టీ కాంట్రాక్టర్లకు, పెద్ద పెద్ద కంపెనీలకు, మద్యం మాఫియాలకు ఉపయోగపడే కార్యక్రమాలనే చేపట్టింది. భూమి పంపిణీ పేరుతో మాయల మరాఠీ నాటకం ఆడింది. ఒక వైపున నక్సలైట్లతో శాంతి చర్చలను ప్రారంభించినట్లే ప్రారంభించి అర్థం లేని విధివిధానాల దగ్గర పట్టుబడుతూ కాలం వెళ్ళబుచ్చింది. కాల్పుల విరమణ జరిగిన ఆ కాసిన్ని రోజులూ జనంగుండెల మీద చేతులువేసుకొని నిద్రపోయారు. కనీసం కొంతకాలం అయినా ప్రశాంత వాతావరణం కొనసాగుతుందనీ, ఒక ప్రజాస్వామిక వెసులుబాటు దొరుకుతుందనీ ప్రజలు, ప్రజాస్వామిక వాదులు ఆశించారు.

చర్చల ప్రక్రియ మొదలై మొదటి దశ కొనసాగుతుండగానే పోలీసులు కోవర్టులను ప్రవేశపెట్టారు. ఎన్‌కౌంటర్లు జరిగాయి. చర్చలు జరగలేని పరిస్థితులను ప్రభుత్వమే కల్పిస్తుంది. పోలీసులపై అదుపును కోల్పోయినట్లుగా పరిస్థితి కన్పిస్తుంది. ముఠాహత్యలు, ఫ్యాక్షన్ హత్యలు పెచ్చరిల్లిపోయాయి. అధికారుల, అధికార పార్టీ రాజకీయ నాయకుల కనుసన్నలతో హత్యలు జరిగిపోతున్నాయన్న చర్చ సర్వత్రా వినిపిస్తుంది.

చంద్రబాబు నాయుడు తొమ్మిదేళ్ళు పాలించి తెచ్చుకున్న చెడ్డపేరును వై.ఎస్.రాజశేఖర రెడ్డి ప్రభుత్వం తొమ్మిదినెలల్లోనే గడించింది. రానున్న కాలంలో పరిపాలన ఏ విధంగా వుండబోతుందో ఈ తొమ్మిది నెలలోనే రుచిచూపించింది.

ఐదేళ్ళవరకూ తమ ప్రభుత్వానికి ఢోకా లేదన్న ధీమాతో కాంగ్రెస్ ప్రభుత్వం వ్యవహరిస్తుంది. చంద్రబాబు నాయుడు లాగా ఓడిపోయేంతవరకైనా అస్తవ్యస్త విధానాలతో పబ్బం గడుపుకోవచ్చుననుకుంటుంది. ప్రజాస్వామిక ఉద్యమాలు ఈ ధీమాను దెబ్బకొట్టగలగాలి. ప్రజా ఆగ్రహం చెలరేగితే ఎటువంటి శక్తివంతమైన వ్యవస్థలయినా తలదించక తప్పదన్న సందేశాన్ని ప్రభుత్వానికి యివ్వగలగాలి. అందుకోసం ప్రజాస్వామిక శక్తులు ఐక్యం కావాలి.

ముఖ్యంగా నక్సలైట్లతో చర్చలు జరగవేమోనన్న వాతావరణం కల్పించడానికే ప్రభుత్వం కవ్వింపు చర్యకు పాల్పడుతుంది. యీ సమయంలో ఎంతో సంయమనం పాటించి చర్చలకు దిగివచ్చేలా ప్రజావత్తిడిని పెంచేందుకు కృషి జరగాలి. ముందునుండే ప్రజా వ్యతిరేక విధానాలపైన నిరసన ప్రకటించకపోతే అవి మరింత వికృతరూపం దాలుస్తాయి. కాబట్టి ప్రభుత్వ విద్రోహాన్ని ఎదుర్కొనే ఒక ప్రజా ఉద్యమానికై పోరాడే శక్తులను ఒక వేదిక పైకి తెచ్చేందుకు ప్రయత్నాలు మొదలవ్వాలి.

**ఫిబ్రవరి 2005 - బహుజన కెరటాలు సంపాదకీయం**

# ఉండవల్లి ఉన్మత్త ప్రేలాపన

అనుకోకుండానే అని వుండవచ్చా, అయితే అతని అగ్ర కుల అహంకారం అంతా బయిట పెట్టుకున్నాడు. కడుపులోని విషం అంతా వెళ్ళగక్కాడు. చిరునవ్వుల ముఖంలోంచి వేయిపడగల హైందవ నాగరాజు బుసలు కొడుతూ బయట కొచ్చాడు.

రాజమండ్రి పార్లమెంటు సభ్యుడు ఉండవల్లి అరుణ్ కుమార్ అంబేద్కర్ పైన అనుచిత వ్యాఖ్యలు చేయడం ద్వారా తన బ్రాహ్మణీయ తత్వాన్ని ఏ మాత్రం దాచుకో కుండా నిలువెత్తు మనువు విగ్రహంలాగా నిలబడ్డాడు.

అంబేద్కర్ రాజ్యాంగం రాయడం ఓ దురదృష్టకరమనీ, దాని వల్లనే చట్టాలు తెస్తున్నారనీ వాటి నుండి ప్రభుత్వ ఉత్తర్వులు వస్తున్నాయనీ, వాటిని అమలు చేయవలసిన దుస్థితి తమకు కలుగుతుందనీ ఆయన వ్యాఖ్యానించాడు. ఈ దేశానికి ఒక పురాణం అవసరం అయితే ఆదివాసీ దళితుడైన వాల్మీకి రామాయణాన్ని రాసియిచ్చాడు. ఒక యితిహాసం అవసరం అయితే బ్రాహ్మణుడు కాని వ్యాసుడు మహాభారతాన్ని రాసియిచ్చాడు. ఈ దేశానికి ఒక రాజ్యాంగం అవసరమైతే అంటరానివాడైన డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ రాసి యిచ్చాడు. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ప్రజాస్వామిక దేశానికి ఒక సామ్యవాద లౌకిక రాజ్యాంగాన్ని రాసిన డాక్టర్ అంబేద్కర్‌ను దూషించడం అనే దుశ్చర్యకు రాజ్యాంగాన్ని అమలు చేస్తామని ప్రతిజ్ఞ చేసి అధికారం చేపట్టిన పాలకపార్టీ సభ్యుడైన అరుణ్ కుమార్ పాల్పడుతున్నాడు.

తాను ఏ రాజ్యాంగంపైన ప్రమాణం చేసి పార్లమెంటు సభ్యుడిగా కొనసాగుతున్నాడో ఆ రాజ్యాంగాన్ని రాజ్యాంగ నిర్మాతను అవమానించి, కించపరిచి కూడా యింకా పార్లమెంటు సభ్యుడిగా కొనసాగడం మన మహా భారతదేశంలో తప్ప ఏ ప్రజాస్వామిక దేశంలోనూ సాధ్యం కాదు.

భూలోకంలో ఏదైనా మంచిపని జరిగితే దివినుండి దేవతలు పూలవానలు కురిపించేవారన్నది కట్టుకథ కావచ్చు. కానీ డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ రాజ్యాంగ రచనను పూర్తిచేసి రాజ్యాంగ సభకు సమర్పిస్తున్న వేళ మొత్తం ప్రపంచం హర్షధ్వానాలు కురిపించింది. రాజ్యాంగ నిపుణులు, మేధావులు ముక్కుమీద వేలేసుకున్నారు. ప్రజలు ఆనందతాండవ మాడారు.

మరి అరుణ్ కుమార్‌లాంటి వాళ్ళకు అంబేద్కర్ కానీ ఆయన రాసిన రాజ్యాంగం కానీ ఎందుకు నచ్చుడం లేదు? కారణం చాలా చాలా సుస్పష్టం. రాజ్యాంగం ఈ దేశంలో కొనసాగుతున్న అసమానతలను నిషేధిస్తుంది. కులం, మతం, లింగం, వర్ణం, పుట్టుక,

జాతి, వృత్తుల కారణంగా ఒక మనిషి మరో మనిషిపై ఆధిపత్యాన్ని, దోపిడీనీ అమలు చేయడాన్ని నిషేధిస్తుంది. అంటరానితనాన్ని పాటించడం శిక్షార్హమైన నేరంగా ప్రకటిస్తుంది. సమాజంలో సంపదనీ, హక్కుల్నీ అనుభవిస్తున్న వాళ్ళకు పెత్తనాలు చలాయిస్తున్నవాళ్ళకు పరిస్థితిలో ఎటువంటి మార్పు లేకుండా యధాతథస్థితి కొనసాగాలని కోరుకొంటున్న వాళ్ళకూ అందుకోసం ప్రయత్నిస్తున్న వాళ్ళకు సహజంగానే రాజ్యాంగాన్ని చూస్తే చిరాకేస్తుంది. అసహనం కలుగుతుంది. రకరకాల విచిత్ర ప్రకోపాలన్నీ కలుగుతాయి. రాజ్యాంగ నిర్మాత అంబేద్కర్ తలపుకొస్తే వళ్ళంతా కారం పూసుకొన్నట్లు వుంటుంది.

అందరి కడుపు మంటా అరుణ్ కుమార్ వ్యాఖ్యల రూపంలో బయటపడింది. ప్రజాస్వామికవాదిగా ఫోజులు కొట్టిన అరుణ్ కుమార్ పచ్చి కులతత్వ వాదిగా, రాజ్యాంగ వ్యతిరేకిగా తేలిపోయాడు.

జానపదగాథల్లో మాంత్రికులూ, మాయలమరాఠీలు రకరకాల మారువేషాలు ధరించి నాయికానాయకులను రకరకాల ఇబ్బందులుకూ, ఇక్కట్లకూ గురిచేస్తారు. చివరకు నాయకుడి చేతిలో చచ్చేటప్పుడు మాత్రం అసలు రూపంలో చస్తారు. అరుణ్ కుమార్, అరుణ్‌శౌరి, రంగనాయకమ్మ లాంటి వాళ్ళకు చావుకాలం దగ్గర పడి అసలు స్వరూపాన్ని బయటేసుకుంటున్నారు. దేశాన్ని మధ్య యుగాల్లోకి తీసుకువెళ్ళాలని ప్రయత్నిస్తున్న వాళ్ళను చరిత్ర క్షమించదు. అరుణ్ కుమార్ లాంటి వాళ్ళు ఎన్ని వ్యాఖ్యలు చేసినా ఈ దేశం చరిత్ర, వర్తమానం, భవిష్యత్‌లలో అంబేద్కర్ పేరు సజీవంగా పెనవేసుకొని వుంటుంది. సూర్యుడిపైన ఉమ్మివేయాలని ప్రయత్నించే ఉండవల్లిలాంటి వాళ్ళే ముఖానికి ఉమ్మి పులుముకొంటారు. వాళ్ళను అంబేద్కర్ తరం క్షమించదు. ఉన్మత్త ప్రేలాపనలతో కండకావరం చూపిన ఉండవల్లి అరుణ్ కుమార్ జాతిమొత్తానికి క్షమాపణ చెప్పేదాకా, రాజ్యాంగం పట్ల అవిశ్వాసం ప్రకటించినందుకు ఆ రాజ్యాంగం ద్వారానే సంక్రమించిన పార్లమెంటు సభ్యత్వానికి అతను రాజీనామా చేసే వరకూ దళితులు ఉద్యమిస్తారు. యిది బాబాసాహెబ్ అంబేద్కర్‌ను సూర్యుడిగా వెలిగించుకొని విముక్తిపథంలో రాజ్యాధికారం దిశగా పయనిస్తున్న తరం. యిది కులతత్వపు కుళ్ళు కుత్సితాలను చీల్చి చెండాడుతున్న తరం. వచ్చేకాలం అంతా దళిత బహుజనులదే.

**ఫిబ్రవరి, మార్చి - 2008 - బహుజన కెరటాలు సంపాదకీయం**

# గ్లామర్ రాజకీయాలకు బలైన సౌందర్యం!

ఒక ఇంద్రచాపమేదో మబ్బుతెరల మీద కదులాడినట్టుండేది. పక్షుల రాగాల సంగీతాన్ని అలంకరించుకున్న పూలవనం లాగుండేది. ప్రత్యూషవేళ పూరేకులపైన ఆవరించిన ఒక పరాగ తుషారం లాగుండేది. కారు మేఘాల్లో మెరిసిన వెండి మబ్బుల నవ్వు లాగుండేది. అచ్చం అచ్చుబోసిన సౌందర్యం లాగుండేది.

సీతాకోకచిలుకల రెక్కల్ని కాలం పరమ కర్కశంగా కత్తి విరిచినట్లు పెనుమంటలు ఆమెను కబళించాయి. తెలుగు గడ్డ మీద వర్ధిల్లిన కళా సౌరభాల చరిత్రలో మరో అధ్యాయం పరమ విషాదంగా ముగిసింది. సౌందర్య చనిపోయింది. సినీ వినీలాకాశంపైన జిగేల్ జిగేల్‌మని మెరిసిన తారలు నేల రాలిపోవడం కొత్తేమీ కాదు. నట జీవితంలో సంతృప్తికరమైన పాత్రలను పోషించి, నిర్మాతగా తనదైన ముద్రను వేయడానికి ప్రయత్నించి పెళ్ళి చేసుకొని గృహిణిగా స్థిరపడాలని ఆమె తపన పడింది.

ఎక్కడో ఒక్కచోట తనను తాను స్థిరీకరించుకోవాలన్న ఆరాటం. అధికార రాజకీయాల్లో సినీతారల ప్రవేశం అన్నది అంతకు ముందు నుండే వున్నప్పటికీ ఎన్టీరామారావు రాజకీయ రంగప్రవేశం చేసిన తర్వాత సినీ పరిశ్రమలలోని ప్రముఖులు అధికార రాజకీయాలవైపు అమితంగా ఆకర్షితులు కావడం మొదలైంది. సినీ గ్లామర్, రాజకీయాలు కలగలసి పోయాయి. జయలలిత ఎమ్జీయార్‌ల లాగానే తమకూ అధికారం కలసి వస్తుందన్న అభిప్రాయం వాళ్ళల్లో పెరిగింది. సినీతారలకు ప్రజల్లో వున్న అభిమానాన్ని తమ తమ పార్టీలకు అనుకూలంగా మార్చుకోవాలన్న ఆశ రాజకీయనాయకులకు కూడా పెరిగింది. దాంతో సినీరంగంలో పెద్ద పెద్ద తారల దగ్గర నుండి చిన్న చితకావేషాలు వేసేవారిదాకా ఏదో ఒక రాజకీయ పార్టీలో చేరడమో లేదా ఆ పార్టీల తరఫున ప్రచారం చేయడమో మొదలు పెట్టారు. సినీరంగం నుండి రాజకీయాల్లోకి పెద్ద ఎత్తున వలసలు ప్రారంభమయ్యాయి. షూటింగ్‌లకు కాల్షీట్లు యిచ్చినట్లుగా ప్రచారాలకు కాల్షీట్లు యివ్వడం మొదలైంది.

పరిస్థితి యింతే అయితే కాలగమనంలో జరిగిన ఒక పరిణామంగా దీన్ని అర్థం చేసుకోవచ్చు. కానీ సినీ ప్రపంచం చుట్టూ ఒక మాఫియా ముఠా పెరిగింది. సినీ ప్రముఖుల కదలికలను నియంత్రించే ఒక భయానకమైన యంత్రాంగం ప్రారంభమైంది. వాళ్ళకు అధికార పార్టీలతో, అధికార యంత్రాంగంతో నిరంతర సంబంధాలున్నాయి. ప్రభుత్వంలో వున్న పార్టీ కూడా తమకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తారేమోనని అనుమానం వచ్చిన సినీతారల ఇళ్ళపైన ఇన్‌కమ్ టాక్స్ దాడులు జరిపించడం, యితర రకాల వేధింపులకు గురిచేయడం సర్వసాధారణమైపోయింది.

దాంతో తమ యిష్టాయిష్టాలతో సంబంధంలేకుండా తారలు రాజకీయ ప్రవేశం చేయవలసి వస్తుంది. ఏదో ఒక పార్టీకి ప్రచారం చేయవలసి వస్తుంది. జిలుగు వెలుగుల జీవితాలను ఒక నిరంతర భయం నీడలా వెంటాడుతున్న పరిస్థితి కొనసాగుతుంది.

ఈ పరిస్థితుల్లో సౌందర్య బి.జె.పి.కి ప్రచారం చేయడానికి సిద్ధపడింది. అన్ని రకాల వత్తిడులూ ఆమె మీద పనిచేశాయని వదంతులు వినవస్తున్నాయి. అన్నీ నిజం కాకపోవచ్చు. యాభై ఏళ్ళనాటి కాలం చెల్లిన హెలికాప్టర్‌లో ఆమె ప్రయాణం చేయాల్సిన అవసరం ఏమొచ్చిందన్న ప్రశ్న వినవస్తుంది. దానికి కూడా ఏదో ఒక సాంకేతిక సమర్ధనను చూపించవచ్చు. అయినా సౌందర్య మరణం కాలధర్మం కాదు. వట్టి ప్రమాదం మాత్రమే కాదు. రాజకీయనాయకుల, సినీప్రముఖుల రెండింటినీ సంధానపరిచే మాఫియా ముఠాల విశృంఖలమైన అధికార పిపాస ఆమె మరణం వెనుకవుంది. రాజకీయాల్లోకి ఎగబాకాలని ఆరాటపడే సినీతారలకు, ముఖ్యంగా స్త్రీలకు అతిపెద్ద గుణపాఠం.

**ఏదో వెతుకులాట, రంగుల కలలు**
**ఒక నిండు ఆకాంక్షను వట్టి మరీచికల్లోకి**
**ఆవిరి చేశాయి.**
**ఏ కొండ చెక్కిళ్ళ మీదనో**
**ఎండిన కన్నీటి చారికలు కన్పించినపుడు**
**బిరుసు యిసుక తిన్నెల్లో**
**అంతరించిపోయిన ఒయాసిస్సుల జాడలు గోచరించినపుడు**
**గుండెలు కలుక్కుమని**
**ఆమె గుర్తుకొస్తుంది.**

**మే, 2004 - బహుజన కెరటాలు**

# సుఖానికైనా, దుఃఖానికైనా ఎప్పుడు కలిసున్నామని!?

భలే సంబరంగావుంది. మహదానందంగా వుంది. ఎన్నడూ వాళ్ళ ఇళ్ళవైపూ లోగిళ్ళవైపూ తొంగైనా చూడనివ్వని అగ్రకులాల దొరలంతా ఇవ్వాళ మమ్మల్ని కూడా కలుపుకొని "సమైక్య" నినాదాన్నిస్తున్నారు. ఖడక్ ఖద్దరు చొక్కాల గరగరల మధ్యన, గులాబీల అత్తరుల పరిమళాల మధ్యన వీపుకు అంటుకుపోయిన కడుపులతో అంటరాని బతుకులు అలాయిబలాయి తీసుకొని కలిసి నడిచే సన్నివేశం ఎంత బాగున్నది.... ఎంత బాగున్నది.

అయ్యా దొరల్లారా, బాబుల్లారా! మాకూ ఎప్పటికీ యిలాగే కలిసే వుండాలని వుంది. కానీ ఊరికీ వాడకీ మధ్యన మీరు గీసిన కులం కలుషిత రేఖ చెరిగిపోకుండా యింకా అలాగే వుంది. కిరసనాయిలు మంటల్లో భగభగ మండిపోయి మలమలా మాడి మసైపోయిన కంచికచర్ల కోటేశు గుర్తుకొస్తూనే వున్నాడు. కారంచేడు దుర్మార్గం, నీరుకొండ, చుండూరు, చీమకుర్తి దారుణాలు తలపుకొస్తూనే వున్నాయి. కలలోనైనా మెలకువనైనా మిమ్మల్నీ మీ వారసుల్నీ తలచుకొంటే గుండెలు జలదరిస్తూనేవున్నాయి. పేగులు ఉండలు చుట్టుకు పోతూనే వున్నాయి.

అయినా కలసిపోదామనే మా కోరిక–వీధుల్లో చెప్పులేసుకొని నడిచినందుకు వంటిమీద తేలిన నెత్తుటి వాతలు తేలిన జ్ఞాపకం, ఊరుమ్మడి బావిలో మంచినీళ్ళు తోడుకున్నందుకు రక్తపుటేరులు ప్రవహించిన జ్ఞాపకం. తెల్లబట్టలేసుకున్నందుకు, మంచి చదువులు చదువుకున్నందుకు, ఆత్మ గౌరవంతో బతుకుతున్నందుకు మీరు దళితపల్లెలపై దాడి చేసి సామూహికంగా ఊచకోత కోసిన జ్ఞాపకం. గాయాలు చెలరేగుతున్నా బాధను పళ్ళబిగువున అదిమిపట్టి ఒక కల కందామనే ప్రయత్నం అంటరానితనం లేని, అత్యాచారాలు లేని, దుర్మార్గపు దాడులు లేని, దౌర్జన్యాలు లేని ఒక సరికొత్త సమాజాన్ని కల కందామనే ప్రయత్నం. మీ నోటి నవ్వులు ఎలావున్నా నొసళ్ళ వెక్కిరింపులు తెలుస్తూనే వున్నాయి స్వామీ. మాకు కాగితాలపైన మాత్రమే స్వతంత్రం, సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వాలు వద్దు. వినీవినీ విసుగెత్తిపోయాం. చెవుల్లో జిల్లేళ్ళు మొలిచాయి. మా బతుక్కింత శాంతి కావాలి. అధికారంలో, వనరుల్లో మా వాటా మాకు కావాలి.

ప్రత్యేక తెలంగాణా కోసం అక్కడి ప్రజలు ఉద్యమిస్తున్నారు. ఆ ప్రజా ఉద్యమాన్ని బహుజన కెరటాలు స్వాగతిస్తున్నది. అయితే తెలంగాణాలో ఎవరు అధికారానికి వస్తారు. అక్కడైనా సరే దొరలు పోయేందుకు ఉద్యమించాలని బహుజనకెరటాలు పిలుపు నిస్తున్నది. 'నీ బాంచెన్ దొరా' అనే పరిస్థితి ఇంకానా 'ఇకపై సాగదు యికపై సాగదు' అని లక్షలాది దళిత బహుజన గొంతుకలు నినదించాలని బహుజన కెరటాలు ఆకాంక్షిస్తున్నది. సీమాంధ్రలోనూ వనరులు, రాజ్యాధికారంలో తమ హక్కు కోసం దళిత బహుజనులు ఉద్యమించాలని బహుజన కెరటాలు పిలుపునిస్తున్నది.

అందరూ ఆనందంగా వుండగలిగే ఏర్పాటుకోసం కృషి చేయడమే ఎవరైనా చేయవలసిన పని. అంతేతప్ప ఏదో ఒక సూత్రంలో బిగించి వుంచడం వలన ఎవరికీ వుపయోగం వుండదు.

**"బహుజన హితాయ బహుజన సుఖాయ"**

**జై బహుజన ఆంధ్ర, జై బహుజన తెలంగాణ**

**జనవరి, ఫిబ్రవరి 2010 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# ఉన్న ఆ ఒక్కడూ పట్టుబడి పోయాడు

కూలిపోక తప్పదని తెలిసీ మహా ప్రళయానికి ఎదురు నిలవడం చాలా మందికి ఒకానొక ఉన్మాద చర్యగా అన్పించవచ్చు. విశ్వ విజేతల ముందు ప్రపంచమంతా సాగిలపడి మొక్కుతున్నప్పుడు ఒక అర్భకమైన గడ్డిమొక్క నిటారుగా నిలబడి ధిక్కరించడం పరమ దుస్సాహసమని అందరూ అనుకోవచ్చు. మొదలు కాకముందే ఓటమి ఖరారైపోయిన యుద్ధాన్ని మొదలు పెట్టడమే ఒక దుందుడుకు చర్యగా కన్పించవచ్చు. అతను యుద్ధాన్ని మొదలుపెట్టాడు. అతను ప్రళయం ముందు నిలబడ్డాడు. విశ్వ విజేతలను ధిక్కరించాడు. అనుకున్నట్లుగానే అతను ఓడిపోయాడు. కానీ అతని ఓటమి విశ్వ విజేతలను గజగజ వణికించే ఓటమి.

అతని పేరు సద్దాంహుస్సేన్. ఒక తుంటరి. ఒక ధిక్కారి. ఒక అరాచకుడు. యుద్ధ పిపాసి. శత్రువుల పాలిట పరమదుర్మార్గుడు. అరివీర భయంకరుడు. చాలా మందికి నాయకుడు. మరెంతో మందికి నాయకుడు. కవి, రచయిత, కళాకారుడు. సాహితీ ప్రేమికుడు, బాగ్దాద్ జానపద వీరుడు. అందరూ నిదురపోయేవేళ అతను మేల్కొన్నాడు. అందరూ అస్త్ర సన్యాసం చేసిన వేళ అతను సాయుధుడయ్యాడు. శ్వేత సౌధపు గులాబీ పెదవులపై మెరిసిన తెల్లటి చిరునవ్వులో అతను భయానకమైన మృత్యుకాంక్షను పసిగట్టాడు. **"To Rebel is the Just"** అన్న సంకల్పంతో యుద్ధానికే సిద్ధమయ్యాడు సద్దాం.

మారణహోమాన్ని సృష్టించగల జీవరసాయన ఆయుధాలను సద్దాం నేతృత్వంలో ఇరాక్ తయారు చేస్తుందని అమెరికా ఆరోపణ. సద్దాం హుస్సేన్ పరిపాలనలో ఇరాక్‌లో ప్రజలకు పౌరహక్కులు లేకుండా పోయాయనీ, సద్దాం నియంతృత్వ పరిపాలనకు చరమగీతం పలుకకపోతే మానవాళి మనుగడే లేదని అమెరికా వివరణ. సద్దాం హుస్సేన్ వెంటనే ఇరాక్ సింహాసనం పైనుండి గద్దెదిగాలనీ, లేదంటే యుద్ధం చేసైనా సరే సద్దాంను పదవీచ్యుతడ్ని చేస్తామనీ అమెరికా ప్రకటించింది. అమెరికా చెప్తున్నట్లుగా తమ దగ్గర జీవ రసాయన ఆయుధాలేవీలేవనీ, తమ దేశ అంతర్గత వ్యవహారాలలో తల దూర్చద్దనీ ఇరాక్ ప్రకటించింది. ఆ ప్రకటనకు ఏ మాత్రం విలువ యివ్వకుండా ఐక్యరాజ్య సమితి అధికార బృందం ఇరాక్‌లో పర్యటించి మూలమూలలా గాలించి అమెరికా ఆరోపిస్తున్నట్లుగా ఇరాక్‌లో జీవరసాయన ఆయుధాల నిల్వలు కానీ, వాటిని తయారుచేస్తున్న ప్రయోగశాలల జాడలు కానీ ఏమీ లేవని నివేదించింది. అయినా అమెరికా యుద్దానికి సిద్ధమయ్యింది. రష్యా, ఫ్రాన్సులాంటి దేశాలూ, ఐక్యరాజ్య సమితి భద్రతా మండలి యుద్ధం వద్దని విజ్ఞాపనలు చేశాయి. అయినా అమెరికా అధ్యక్షుడు బుష్ యుద్ధం ప్రారంభించాడు. ఐక్యరాజ్య సమితి నుండి రష్యా, ఫ్రాన్సుల దాకా వ్యక్తం చేసిన యుద్ధ వ్యతిరేకత ఎంత పేలవమైనదో స్పష్టమైంది.

ప్రపంచ పోలీసు అమెరికాకు, మాజీ ప్రపంచ రౌడీ బ్రిటన్ జత కలిసింది. అతి ప్రాచీన మెసపటోమియా నాగరికతకు అద్దం పట్టిన బాగ్దాద్ పైన మరొక్కసారి బాంబులదాడి మొదలైంది. ఓడిపోయినా లొంగిపోయేది లేదని ప్రకటించిన సద్దాం హుస్సేన్ అమెరికా దాడులను ఎదుర్కోడానికే సిద్ధపడ్డాడు. దాడులు మొదలైన కొద్ది రోజులకే యుద్ధం ముగిసిపోతుందని అమెరికా అధ్యక్షుడు ప్రకటించాడు. కానీ యుద్ధం కొన్ని నెలలపాటు కొనసాగింది. అమెరికా సేనలు బాగ్దాద్‌ను ఆక్రమించాయి. సద్దాం అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాడు. అమెరికా తొత్తులుగా వుండగలిగిన వారిని ఇరాక్ పాలకమండలిలో చేర్చి త్వరలో ప్రజాస్వామ్యాన్ని ప్రతిష్ఠిస్తామని అమెరికా ప్రకటించింది. సద్దాం ఓటమికి ఇరాక్ ప్రజలు సంబరాలు చేసుకున్నట్లుగా సి.ఎన్.ఎన్., బి.బి.సి.లాంటి అమెరికా అనుకూల ప్రసారసాధనాలు ప్రచారం చేశాయి. అయినా ప్రతిరోజూ ఏదో ఒకచోట అమెరికా సైనికులపైన గెరిల్లా దాడులు జరుగుతూనే ఉన్నాయి. చాలామంది ఇరాకీలు చనిపోయారు నిజమే. కానీ అమెరికన్ సైనికులకు విజయం  నల్లేరుమీద నడకలాగా రాలేదు. ప్రతిరోజూ అమెరికా సైనికులు కూడా చనిపోతూనే ఉన్నారు. చివరిదాకా పోరాడడానికే సద్దాం ప్రజలు నిర్ణయించుకున్నారు.

**అసలు అమెరికా ఇరాక్‌పైన యుద్ధమెందుకు తలపెట్టింది?**

ఇరాక్‌లోని కుర్దులు సమస్యను యుద్ధానికి ప్రధాన కారణంగా అమెరికా చూపుతోంది. కుర్దులు ఇరాక్‌లోని ఉత్తర భాగంలోనూ, ఇరాక్‌లోనూ, టర్కీలోనూ, రష్యాలోని కొన్ని భాగాలలోనూ విస్తరించి జీవిస్తున్నారు. ఈ ప్రాంతాలనన్నింటినీ కలిసి కుర్దుస్తాన్‌గా ఏర్పాటు చేయాలని కుర్దులు ఏనాటి నుండో పోరాడుతున్నారు. ఎప్పుడు పోరాటం తలెత్తినా ఆయాప్రాంతాలలోని ప్రభుత్వాలు కుర్దుల తిరుగు బాటును అణచివేస్తూనే వచ్చాయి. సద్దాం హుస్సేన్ ఇరాక్‌లోని కుర్దుల తిరుగుబాటును పరమ కిరాతకంగా అణచివేశాడు. తలెత్తిన కుర్దులను, స్వంత దేశం కావాలన్న కుర్దుల ఆకాంక్షల్ని అణచివేశాడు. అదేవిధంగా ఇరాక్ దక్షిణ ప్రాంతంలో నివశించే షియాల పట్లకూడా సద్దాం హుస్సేన్ అంతే దుర్మార్గంగా వ్యవహరించాడు. కుర్ధిస్తాన్ డిమాండ్‌కు అమెరికా గానీ, బ్రిటన్‌గానీ, మరే అగ్రదేశంకానీ ఇప్పటి వరకూ చేసిందేమీలేదు. ఐక్యరాజ్య సమితి ద్వారా ఆ సమస్యను పరిష్కరించడానికి ఆ దేశాలు ప్రయత్నం చేసివుండవచ్చు. అరబ్బు దేశాలన్నింటితోపాటు ప్రపంచ దేశాల ఏకాభిప్రాయాన్ని సాధించి 'కుర్దుస్తాన్' ఏర్పాటును సుగమం చేసి వుండవచ్చు. అమెరికాగానీ, యితర దేశాలు కానీ అటువంటి ప్రయత్నమేమీ చేయలేదు.  సరికదా సద్దాం హుస్సేన్‌కు చాలాకాలం అమెరికా మద్దతునిచ్చి అతనికి ఆయుధాలను విక్రయించింది. ఒక దేశం మీదికి మరో దేశాన్ని ఎగదోసి రెండుదేశాలకూ ఆయుధాలను అమ్ముకున్న నికృష్టపు చరిత్ర అమెరికాది. ఇరాన్, ఇరాక్ యుద్ధ సమయంలో అమెరికా నిర్వహించిన పాత్రను పరిశీలిస్తే

చాలా స్పష్టంగా ఈ విషయం అర్ధమవుతుంది.

కుర్దు ప్రాంతంలోకి ఇరాక్ సేనలు చొచ్చుకు పోయాయనీ, అదేవిధంగా కువైట్‌లో యుద్ధానికి సిద్ధపడిందనే సాకుతో 1991జనవరి 16వ తేదీన అమెరికా ఇరాక్ పైన ప్రత్యక్ష యుద్ధానికి తలపడింది. దాదాపు మూడువేల వైమానిక దాడులు ఇరాక్‌పైన జరిపింది. అనేక లక్షల టన్నుల బాంబుల వర్షం కురిపించింది. ఆ యుద్ధంలో దాదాపు ఇరవైవేలమంది ఇరాకీయులు చనిపోయారు. నిషిద్ధ ప్రాంతాల్లో ఇరాక్ విమానాలు తిరుగుతున్నాయనే పేరుతో 1993 జనవరి 13న మరోసారి ఇరాక్‌పైన ప్రత్యక్ష యుద్ధానికి తలపడింది. మళ్ళీ ఇప్పుడు ఈ యుద్ధం నిజంగానే అమెరికా దురాక్రమణలనూ దుర్మార్గాలను ప్రపంచ పటం నుండి తుడిచిపెట్టడానికే ఈ దాడులకు సిద్ధపడుతుందా? అలా జరిగితే నిజంగా మంచిదే కదా. ప్రజాస్వామిక విలువలను ప్రతిష్టించడం కోసం నియంతలనూ, నిరంకుశులనూ గద్దె దించాలనే సత్సంకల్పం ప్రపంచానికి మేలుచేసే అంశమే కదా అనిచాలా మందికి అన్పించవచ్చు. కానీ చరిత్ర తెలిసిన వారెవరూ ఆవిధంగా అనుకోరు. ప్రభుత్వాలను కూలగొట్టడానికి, వాటి స్థానంలో తమకు అనుకూలమైన కీలుబొమ్మ ప్రభుత్వాలను ఏర్పర్చుకోడానికి అమెరికా ఎంత రక్తపాతాన్ని సృష్టించిందో చరిత్రలో నమోదయ్యేవుంది. చిలీ.. అనేక ఇతర లాటిన్ అమెరికన్ దేశాలలో అమెరికా ఎటువంటి దుర్మార్గమైన చర్యలకు పాల్పడిందో అందరికి తెలుసు. వియత్నాంలో సృష్టించిన రక్తపాతం, పసిపిల్లల దగ్గర నుండి పండు ముసలుల వరకూ మనుషులను శవాల గుట్టలుగా మార్చేసిన వైనం, వియత్నాం ప్రజల వీరోచిత పోరాటగాధలు యింకా కళ్ళముందు కదులాడుతోనే వున్నాయి. వియత్నాంలో అమెరికన్ సైనికులు పాల్పడిన దురాగతాలను ప్రపంచ మానవాళి ఎన్నటికి క్షమించదు. అటువంటి అమెరికా ప్రజాస్వామ్యాన్ని, ప్రపంచశాంతిని పరిరక్షించడం అనేది వట్టిమాట. అసలు ప్రపంచ శాంతి భగ్నమయ్యిందే అమెరికా వలన. తన మార్కెట్ విస్తరణ కోసం, ప్రపంచంపైన తన రాజకీయ ఆధిపత్యం కోసం అన్ని దేశాలమీద ఆంక్షలు విధించడం, షరతులకు లొంగని వారిపైన యుద్ధం ప్రకటించడం అమెరికాకు పరిపాటి అయ్యింది. అరబ్బు ప్రపంచం చమురు నిక్షేపాలకు నిలయం. చమురు బావుల మీద సంపద మీద కన్నేసిన అమెరికా తదితర పాశ్చాత్య దేశాలు అరబ్ ప్రపంచం పైన పట్టును సాధించడానికి శతవిధాల ప్రయత్నాలు చేసాయి. చేస్తున్నాయి. సౌదీ అరేబియా వంటి అతిరథ మహారథ అరబ్ దేశాలన్నీ అమెరికాకు పాదాక్రాంతమయ్యాయి. మిగిలింది కొరకరానికొయ్య సద్దాం. తనకు అనుకూలంగా వున్నంతకాలం సద్దాంను సెక్యులరిస్టుగా, మంచివాడిగా అమెరికా కొనియాడింది. ఎదురు తిరిగేసరికి అతనొక నరహంతకుడిగా ప్రచారం చేస్తుంది. యుద్ధం మొదలుపెట్టింది. యుద్ధం చేసైనా మనుషుల్ని చంపైనా తన విస్తరణను కొనసాగించాలన్నది అమెరికా ఆలోచన. అమెరికా, దాని దళాలకు ఎదురొడ్డి నిలబడినవాడు సద్దాం ఒక్కడే.

గతంలో రష్యావుండేది. రష్యా కూలిపోయిన తరువాత అమెరికా ఆగడాలకు హద్దులు లేకుండా పోయాయి.

"రష్యాలో కమ్యూనిజం ఏమి సాధించిందో తెలియదు కానీ రష్యా అనేదే లేకపోతే, కమ్యూనిజం భయాన్నే అది కలిగించకపోతే యూరప్ దేశాలన్నీ దుర్మార్గపు నియంతృత్వ దేశాలుగా మారిపోయివుండేవి. కమ్యూనిజం భయంతో అవి ప్రజాస్వామిక దేశాలుగా మారక తప్పని స్థితిని అది కలుగజేసింది. యూరప్ దేశాలకు భయాన్ని రష్యా ఒక వరంగా ఇచ్చింది." అని ప్రముఖ చరిత్ర కారుడు ఎరిక్ హాబ్స్‌వామ్ అన్నారు. ఇప్పుడు రష్యా కుప్పకూలిపోయింది. మిగిలింది ఒక్కడే. అతని పేరు సద్దాం హుస్సేన్.

యుద్ధం ముగిసిందని అమెరికా ప్రకటించిన కొన్ని రోజులకు సద్దాం హుస్సేన్ ఒక బంకర్ (కలుగు)లో పట్టుబడిపోయాడు అని రాయడానికి పత్రికలు ఏమాత్రం సిగ్గుపడలేదు. అది కలుగు కాదు అతను ఎలుకా కాదు. అమెరికా సైనికులు ఆనందం పట్టలేక అరిచారు. ఎంతో యుద్ధం చేయాల్సి వస్తుందని ఊహించిన అమెరికన్ సైనికులకు ఒక్క తుపాకీ గుండుకూడా పేలకుండా సద్దాం హుస్సేన్ దొరికిపోవడం నమ్మలేని విషయం.

అతను దొరికిపోయినప్పుడు పుస్తకాలు చదువు కొంటున్నాడు. కవిత్వం చదువుకొంటున్నాడు. దాంతోపాటు ప్రముఖ రష్యన్ నవలా రచయిత ఫ్యోదొర్ దోస్తొవిస్కీ రాసిన 'క్రైం అండ్ పనిష్‌మెంట్' అరబిక్ అనువాదం దొరికింది'. ఆ నవలలోని పాత్రలు సోనియా, రాస్కల్నికోవ్ చాలాకాలం ప్రపంచాన్ని వెంటాడారు.

నాకు కూడా 1990ల వరకూ దోస్తొవిస్కీ సృష్టించిన సోనియా అంటేనే ఎక్కువ ప్రేమ వుండేది. ఆమె మాటల్ని వింటూ, ఆమె సన్నిధిలో గడిపి వేయాలనివుండేది. ఆమె చూపిన త్రోవలోనే నడవాలనిపించేది. యిప్పుడు రాస్కల్నికోవ్ అంటేనే అమితమైన ఆకర్షణ పెరుగుతుంది. నాయకుడో, ఖల్‌నాయకుడో, అరాచకుడో, పరివర్తన పొందేందుకు తపిస్తున్నవాడో రాస్కల్ని కోవ్ అంటేనే ఒక తెలియని **Fascination** కలుగుతుంది. సద్దాం హుస్సేన్‌ను గురించి అనుకున్నట్లే అతను గెలవాలని అతను నిలవాలని అనుకున్నాం. రాస్కల్నికోవ్, సద్దాం హుస్సేన్‌లు ప్రపంచానికి నిత్యావసర వస్తువుల్లాంటి అవసరాలనిపిస్తుంది.

ఇరాక్ ఓడించిన అమెరికా విజయ గర్వంతో చిరు దరహాసాలు చిందిస్తుంది. ఎప్పటిలాగానే ప్రపంచ శాంతి గురించీ, మానవ హక్కుల గురించి మాట్లాడుతూనే వుంది. తన మార్కెట్ విస్తరణ జరిగిపోతూనే వుంది. తలెత్తిన ప్రతిదేశానికీ హెచ్చరికలు పంపిస్తూనే వుంది. ఆ హెచ్చరికలను సవాల్ చేసి అమెరికా ఆధిపత్యాన్ని నిలువరించడానికి కలిసికట్టుగా నిలబడాల్సిన మూడో ప్రపంచ దేశాధినేతలు అమెరికాకు సాష్టాంగ ప్రమాణాలు చేయడానికి ఒకరితో మరొకరు పోటీ పడుతున్నారు. తమ దేశాల ప్రభుత్వాలను నిలదీసి సామ్రాజ్యవాద

ప్రపంచీకరణ యుద్ధానికి వ్యతిరేకంగా నిలబెట్టేందుకు ఉద్యమించాల్సింది మూడో ప్రపంచ దేశాల ప్రజానీకమే. యిప్పుడు ప్రపంచ సామాజిక వేదిక సభలు జరగబోతున్నాయి. ఎప్పటిలాగే ఈసారీ శుష్క నినాదాలు పరిమితులు దాటి, బలమైన ఉద్యమనిర్మాణం దిశగా ప్రజల్ని ముందుకు తీసుకువెళ్ళలేక పోతే అది మరో కోటప్పకొండ తిరునాళ్ళే.

అమెరికా ముందు దేశాల అధినేతలు కీలుబొమ్మలైపోతే ప్రజలు ఈ పరిస్థితిని చక్కదిద్దలేని బలహీనులైతే ఏమిటి దారి? ప్రపంచంలో యుద్ధాన్నీ, శాంతిని నిర్ణయించగలిగింది ప్రజలు మాత్రమే. ప్రజలకొక ఉత్తేజం కావాలి. ఒక నినాదం కావాలి. వొళ్ళంతా పిడికిలై బిగుసుకు పోయేంత స్ఫూర్తికావాలి.

యుద్ధం ముగిసిపోలేదని అమెరికాకూ తెలుసు. కాకపోతే ఉన్న ఆ ఒక్కడూ పట్టుబడి పోయాడు. అతన్ని చంపేయనూవచ్చు. లేదా ప్రాణాలతో మిగిలించి శాశ్వత ఖైదీగా వుంచి, అంతటి శత్రువును కూడా చంపకుండా వదిలేసిన కరుణామూర్తిగా అమెరికా మరో నాటకానికి తెరతీయవచ్చు.

ప్రపంచ ప్రజల శత్రువైన అమెరికా సామ్రాజ్యవాదానికి నిజాయితీ గల నికార్సయిన పరమ శత్రువు సద్దాం హుస్సేన్ యిప్పుడు అమెరికాకు బందీ. మొత్తం దృశ్యం ముందు మనమంతా మౌన ప్రేక్షకులం.

**జనవరి 2004 బహుజన కెరటాలు**

# కాలం.. వీరులకే సలాం చేస్తుంది !

"ఉరికంబం మీద నిలిచి, ఊహాగానం చేసెద, నా ఊహల ఊయలలో, మరోజగత్ వికసించు"

సద్ధాం హుస్సేన్ చనిపోతాడని అతనికీ తెలుసు. కళ్ళముందే ఎదిగి వచ్చిన బిడ్డలను చంపారు. కళ్ళముందే ఆగ్రహ నినాదాలిస్తున్న అనుయాయులైన వీరులను చంపారు. మెసపొటేమియా నాగరీక ప్రపంచం విస్తుపోయేలాగా మారణ కాండ జరిగింది.

కానీ మృత్యువు కౌగిలిలో వీరుడు చలించడు.

సద్ధాం హుస్సేన్ వీరుడు, అతడు బాధితుడు కాదు, అమరుడు !

ప్రపంచ తీవ్రవాది జార్జి బుష్‌ను వ్యతిరేకించిన ఒక్క గానొక్క మొనగాడు.

ఇప్పుడింక ఏ భ్రమలూ లేవు, ఆశలూ లేవు. సద్ధాం హుస్సేన్‌ను ఎక్కడైనా, ఏదేశంలోనైనా ఏ గడ్డమీదైనా చంపేస్తారు.

కానీ... సద్ధాం హుస్సేన్ దేశభక్తి ముందు, సామ్రాజ్యవాద, విస్తరణవాద వ్యతిరేకత ముందు ఆ ఉరిత్రాడు వణికి వుండదా? అతడు మరో నియంత అని పత్రికలు ఘోషించాయి. అతని మరణానికి (హత్యకు) ఒక సాధికారతను ఇచ్చే ప్రయత్నం చేశాయి.

అతను నియంత అవునో, కాదో ఇరాక్ ప్రజలకు తెలుసు, మెసపొటేమియా నాగరికతకు తెలుసు.

ఎడారి గాలులలో ఖర్జూరపు చెట్లు మీదుగా వీచే గాలులు మోసుకుపోయే వాయులీన రాగాలకు తెలుసు.

అతని సారధ్యంలో దేశం తిన్నదో, లేదోకాని వెన్నుపూసను నిటారుగా నిలబెట్టడం నేర్చుకుంది.

ఒక యాంకీ మామ, ప్రపంచ పోలీసై నలుదిక్కులా తన దురాక్రమణలను విస్తరిస్తుంటే, ఒకే ఒక్కడు కొదమ సింహంలా గర్జిస్తే, అమెరికా ప్రభుత్వం, సైన్యం, ఇరాక్‌లోని వారి తొత్తులు కుడితిలో పడ్డ ఎలకల్లా తన్నుకులాడారు. ఇరాక్ ప్రజల సార్వభౌమాధికారాన్ని కాపాడడానికి, ఆత్మగౌరవాన్ని నిలబెట్టడానికి సద్ధాం యుద్ధానికే సిద్ధమయ్యాడు. అమెరికా సింహాసనం ముందు సాగిలపడి వుంటే, బుష్ అహంకారం ముందు లొంగిపోయి వుంటే తిరిగి సద్ధాంనే దేశాధ్యక్షుడిగా అమెరికా ప్రకటించి వుండేది. బుష్‌కు లొంగలేదు. ఒక నిస్సహాయస్థితిలో నేల మాళిగలో తల దాచుకోవాల్సివచ్చినప్పుడు కూడా కవిత్వం చదువుకుంటూ, ఖురాన్ పఠిస్తూ రాగ ద్వేషాలకు అతీతంగా కాలం గడిపాడు.

శత్రువు హంతక ముఠాలు మత్తు మందు చల్లి పట్టుకున్నప్పుడు, "నేను ఇరాక్ అధ్యక్షుణ్ని,

సద్దాం హుస్సేన్‌ని" అని సగర్వంగా ప్రకటించుకున్నాడు. నల్లకోట్లు, నీలిరంగు నోట్లతో ఒక దేశం, ఒక కోర్టులో ఫైసలా అయ్యే కేసు కాదు నాది, అని గర్జిస్తూ అమెరికా నియమించిన కోర్టు బోనెక్కాడు. సాధారణంగా బోనులో నిలబడిన మనిషి పైన ఆరోపణలు చేసి విచారణ జరిపిస్తారు. కాని సద్దాం హుస్సేన్ బోనెక్కి అమెరికా ప్రభుత్వ దుర్మార్గాలపైన ఆరోపణలు చేశాడు. న్యాయవాదులసాక్షిగా, న్యాయమూర్తుల సాక్షిగా, సాక్షాత్తూ న్యాయదేవత సాక్షిగా, అమెరికా దురాగతాలపై ఆరోపణలు చేసి, విచారణ జరిపి తీర్పు ప్రకటించాడు.

అమెరికాకు మరణ శిక్ష విధించాడు. బుష్ ప్రభుత్వానికి అదే భయం, సద్దాం హుస్సేన్ బతికుంటే తమకు మరణం తప్పదని భయం. నిజానికి సద్దాం హుస్సేన్ నియంతగా వ్యవహరించి వుంటే, తప్పులు చేసివుంటే అతన్ని శిక్షించే బాధ్యత ఇరాక్ ప్రజలదే. బుష్ చేసిన తప్పులకు, యుద్ధనేరాలకు అతన్ని పది వేలసార్లు ఉరితీయాలి. ప్రపంచ ప్రజలందరిపట్ల తీరని ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక యుద్ధనేరాలకు వాడు పాల్పడ్డాడు.

సద్దాం అనే ఒక్కగానొక్క యుద్ధ వీరుడు తన ప్రయత్నాలకు ఎదురుగా నిలబడినందుకు ప్రపంచానికి, తన దేశ ప్రజలకు అబద్ధాలు చెప్పి, మారణహోమం సృష్టించి వేలాదిమంది హతమయ్యే యుద్ధాన్ని నడిపి, ఆ ఒక్కగానొక్క ధిక్కారిని పట్టుకొని అక్రమంగా విచారణ జరిపించి, హడావిడిగా హత్య చేయించాడు.

నిజానికి సద్దాం హుస్సేన్‌ను హత్య చేయించడం ద్వారా అమెరికా ఆత్మహత్య చేసుకుంది.

ప్రపంచ ప్రజల ముందు దోషిగా నిలబడింది,

ఉరికంబం ముందు చెరగని చిరునవ్వుతో ధిక్కారంగా నిలబడ్డ సద్దాం ముఖాన్ని ప్రపంచప్రజలు మర్చిపోరు.

ఆ సమయంలోనే విజేతగా విర్రవీగవలసిన బుష్ ముఖంలో కదులాడిన చలి, వణుకు జ్వరాన్నీ ప్రపంచ ప్రజలు మర్చిపోరు.

సద్దాం హుస్సేన్ అమర్‌రహే !

సద్దాం ధిక్కారం అమర్‌రహే !!

అమెరికా సామ్రాజ్యవాదం నశించాలి !!!

అంతా సరే గానీ ....

అమెరికా ప్రభుత్వం, ఇన్ని అఘాయిత్యాలకు పాల్పడుతుంటే, స్వేచ్ఛా విగ్రహపు నీడలలో బతికి పోతున్న అమెరికా ప్రజానీకం ఏం జేస్తున్నారు? చర్మం మొద్దు బారి పోయిందా?

కానీ ఎప్పటికైనా, ప్రజలే గెలుస్తారు !

**జనవరి 2007 – బహుజన కెరటాలు సంపాదకీయం**

# నెత్తురోడిన శాంతి కపోతం రేచెల్ కోరీ

ప్రపంచం అంతా శాంతి సమాధానాలు నిండి, మనుషులంతా పరస్పర సహకారాన్ని అందించుకొంటూ సుఖ సంతోషాలతో గడపాలని రేచెల్ కోరీ కోరుకొంది. స్వంత దేశంలో నిలువనీడకోసం ఎన్నో ఏళ్ళుగా పోరాడుతున్న పాలస్తీనా ప్రజల మీద ఇజ్రాయేలీ సైనిక దళాలు దుర్మార్గంగా చేస్తున్న బాంబుల యుద్ధాన్ని చూసి, వాళ్ళు సృష్టిస్తున్న రక్తపాతాన్ని చూసి చలించిపోయింది. మహిళలు, పౌరుల మీద అంతటి రక్తపాత యుద్ధాన్ని కొనసాగిస్తున్న ఇజ్రాయేల్ ప్రభుత్వం మద్దతునివ్వడమూ, సంపూర్ణ సహాయ సహకారాలను అందించడాన్ని తట్టుకోలేకపోయింది. అమెరికాలో పుట్టినందుకు సిగ్గుపడింది. కలవరపడింది. అమెరికా పౌరులందరినీ ప్రపంచం అంతా శతృవులుగా చూస్తారేమోనని భయపడింది. పాలస్తీనాకు మద్దతుగా ఏర్పడిన అంతర్జాతీయ సంఘీభావ ఉద్యమం (ఇంటర్నేషనల్ సాలిడారిటీ మూవ్‌మెంట్)లో ఆమెచేరింది. పరమ క్రూరంగా సాగుతున్న ఇజ్రాయేల్ సైనిక దురాక్రమణను శాంతియుతంగా వ్యతిరేకించడం, దాడిని నిలువరించడం ఈ ఉద్యమం లక్ష్యం.

2003 మార్చి 16వ తేది గాజాస్ట్రిప్‌లోని ఆక్రమిత ప్రాంతమైన భూభాగంలో ఆమె వుంది. ఆ రోజే మామూలు పౌరులు నివశించే ఒక పాలస్తీనా యింటిని కూలగొట్టడానికి ఇజ్రాయేల్ సైనిక బుల్‌డోజర్ వచ్చింది. యింటిని కూలగొట్టవద్దని, యిక్కడ నివశిస్తున్నది మామూలు పౌరులేనని అరిచి కేకలు పెట్టింది రేచెల్ కోరీ. ముందుకు రావద్దని కేకలువేస్తూ బుల్‌డోజర్‌కు ఎదురుగా నిలబడింది. శాంతిని కోరుకొంటున్న అమెరికన్ పౌరులు కొందరు వచ్చి ఇటువంటి విధ్వంస కార్యక్రమాలను నిలువరించే ప్రయత్నాలు చేస్తున్నారని ఆ ఇజ్రాయేల్ సైనికులకు తెలుసు. బుల్‌డోజర్‌ను ముందుకు తీసుకురావద్దని అడ్డం నిలబడ్డ యువతి అమెరికన్ శాంతి కార్యకర్త అని ఆ బుల్‌డోజర్ నడుపుతున్న సైనికులకీ తెలుసు. అయినా నిర్దాక్షిణ్యంగా ఆమె మీదుగా బుల్‌డోజర్‌ను నడిపాడు ఇజ్రాయేల్ సైనికుడు. ఇరవైమూడేళ్ళ రేచెల్ కోరీ శరీరం బుల్‌డోజర్ పళ్ళ చక్రాల కింద నుజ్జునుజ్జయి పోయింది. రేచెల్‌ను చంపిన కొన్ని రోజులకో బ్రెయిన్ ఏవరీ అనే మరో అమెరికన్ శాంతి కార్యకర్త పైన ఇజ్రాయేల్ సైనికులు కాల్పులు జరిపారు. కర్ఫ్యూ సమయంలో ప్రజలకు ఏమైనా అవసరం వుందేమోనని తెలుసుకోవడానికి వెళ్ళిన అతని పైన జెనిన్‌లో కాల్పులు జరిపారు.

ఆమె చనిపోవడానికి కొన్ని రోజుల ముందు ఆమె యింటికి పంపిన ఒక ఇ-మెయిల్‌లో అమెరికా పౌరురాలిగా యిక్కడ తనకు చాలా గౌరవం లభిస్తుందని రాసింది. మీరు చూడాల్సిందే తప్ప ఊహించలేరు. చూసినా మీరు ఇది నిజమా అని ఆశ్చర్యపోతారు. ఒక నిరాయుధురాలైన అమెరికా పౌరురాలిని హత్యచేస్తే ఇజ్రాయేల్ సైన్యం ఎన్ని ఇబ్బందులను ఎదుర్కొన వలసి వస్తుందో వాళ్ళకు తెలియదా, అని ఆమె ఆ లేఖలో రాసింది. బహుశా ఆ ధైర్యంతోనే ఆమె బుల్‌డోజర్‌కు ఎదురుగా నిలబడి వుంటుంది. యుద్ధ పిపాసులకు విధ్వంసమే

ముఖ్యం అన్న సంగతి ఆమె గుర్తించలేక పోయింది. ఇజ్రాయేల్‌కి అమెరికా మద్దతునిస్తుంది. కాబట్టి అమెరికా పౌరుల్ని ఏమీ చేయరని అమె అనుకొంది. అమెరికా పౌరుల మీద ఇజ్రాయేల్ ఇంత ఘాతుకాలకు పాల్పడినా అమెరికా ఏ చర్యా చేపట్టకపోవడమే ఇక్కడ విషాదాంత వైచిత్రి. కోరీ మృతిపై ఇజ్రాయేల్ ప్రభుత్వం కంటితుడుపు విచారణకు ఆదేశించింది. 2003, జూన్ మాసంలో ఇజ్రయేల్ పోలీసులు ఒక నివేదికను సమర్పించారు. ఆ బుల్‌డోజర్‌ను వై.ఎస్., ఇ.వి. అనే సార్జంట్లు నడిపారనీ, వాళ్ళకు రేచెల్ సరిగా కనిపించలేదనీ, కాబట్టి యిది ప్రమాదమే తప్ప, ఉద్దేశ పూర్వకంగా చేసిన హత్యకాదని ఆ నివేదిక పేర్కొంది. అయితే రేచల్ ఆ రోజు చాలా దూరానికైనా కన్పించే ఆరంజ్ జాకెట్ వేసుకొందనీ, అంతర్జాతీయ సంఘీభావ ఉద్యమకారులు ధరించే క్రాస్ గుర్తు ఆ జాకెట్‌పైన స్పష్టంగా కన్పిస్తుందని 9మంది ప్రత్యక్ష సాక్షులు స్పష్టంగా పేర్కొన్నారు. నిజానికి రేచెల్ చనిపోయిన రోజున రెండు బుల్‌డోజర్లు అక్కడ వున్నాయి. ఒక్కొక్క దానిలో ఇద్దరేసి సైనికులున్నారు. అన్నిటికీ మించి ఇజ్రాయేల్ ప్రభుత్వం విడుదలచేసిన నివేదికలో ఆమె పోస్ట్‌మార్టం రిపోర్టును ఉల్లేఖించారు. ఆమె పక్కటెముకలు విరిగిపోయి, వెన్ను దెబ్బతిన్నదనీ బహుశా ఆమె కొండలు ఎక్కి దిగేటప్పుడు జారిపడి మరణించి వుంటుందని ఆ నివేదిక పేర్కొంది.

నివేదిక పూర్తి పాఠాన్ని అందజేస్తానని ఇజ్రాయేల్ ప్రధాని అమెరికా అధ్యక్షుడు జార్జిబుష్‌కు మాట ఇచ్చినప్పటికీ నివేదిక పూర్తి పాఠాన్ని విడుదల చేయలేదు. "విదేశాల్లో ఎవరైనా అమెరికా పౌరులు హత్యకు గురైతే దానిపైన పూర్తి పరిశోధన జరిపించడం మాకర్తవ్యం" అని అమెరికా విదేశాంగశాఖ ప్రకటించింది. అయితే కొద్ది కాలానికే పరిశోధన పూర్తయిపోయిందనీ, రేచెల్ హంతకుల పైన విచారణ జరగడంలేదని, నివేదిక పూర్తి పాఠాన్ని ఇవ్వడానికి ఇజ్రాయేల్ అధికారులు అంగీకరించడంలేదనీ విదేశాంగశాఖ అధికారులు రేచెల్ తల్లిదండ్రులు క్రేగ్, కిండీ కోరీలకు తెలియజేశారు. అమెరికా ప్రభుత్వం నుండి ఎంతో వత్తిడి తెచ్చిన మీదట ఆ నివేదికను చదివి నోట్సు రాసుకోడానికి కోరీ తల్లి దండ్రులకూ, మరో ఇద్దరు అమెరికా విదేశాంగశాఖ అధికారులకు అనుమతినిచ్చారు. ఆ నివేదికను చదివిన విదేశాంగశాఖ అధికారులు అదంతా లోపభూయిష్టంగానూ, ఒకదానికి ఒకటి పొంతన లేకుండానూ ఉన్నదని పేర్కొన్నారు.

ఈ విషయమై అమెరికన్ కాంగ్రెస్‌లో చర్చ జరగాలనీ, ఇజ్రాయేల్ దురాగతాలకు వ్యతిరేకంగా కాంగ్రెస్ ఒక తీర్మానం చేయాలనీ పట్టుబడుతూ 56 మంది సెనేటర్లు సంతకాలు చేసి డిమాండ్ చేశారు. అయితే అమెరికా కాంగ్రెస్‌లో ఇజ్రాయేల్‌కు అనుకూలంగా వుండే సెనేటర్లే ఎక్కువమంది వుండడంతో ఆ తీర్మానం ఆమోదించబడకుండా వుండేందుకు తీవ్రమైన ప్రయత్నాలు చేస్తున్నారు.

తన స్వంత పౌరులను హత్యచేసినప్పటికీ ఇజ్రాయేల్ మీద వత్తిడి తేవడానికీ దానిపైన తగిన చర్యలు చేపట్టడానికి అమెరికా ప్రభుత్వం ముందుకు రావడం లేదు. ఇజ్రాయేల్

హింసాకాండను సమర్ధిస్తూనే వుంది. వేలాది మంది పాలస్తీనీయులు ప్రతి రోజూ చనిపోతూనే ఉన్నారు. పాలస్తీనా విమోచన నాయకులను లక్ష్యంగా పెట్టుకొని ఇజ్రాయేల్ తన హత్యాకాండను కొనసాగిస్తూనే వుంది. పాలస్తీనా భూభాగంలో అమెరికన్ పౌరులు చనిపోయిన సందర్భంలో అమెరికన్ ప్రభుత్వం నానాయాగీ చేసింది. ఎఫ్.బి.ఐ. సకాలంలో అక్కడికి వెళ్ళి పరిశోధన చేసింది.

అమెరికా పౌరుల్ని ఇజ్రాయేల్ చంపితే ఒకరకంగానూ, పాలస్తీనా చంపితే ఒక లాగానూ స్పందిస్తూ అమెరికా ప్రభుత్వం ద్వంద్వ ప్రమాణాలను పాటిస్తుంది. తన స్వంత పౌరుల ప్రాణాలనీ, పరువునీ, భద్రతనీ ఫణంగా పెట్టయినా సరే అరబ్బు దేశాలపైన తన ఆధి పత్యాన్ని కొనసాగించడానికి ఇజ్రాయేల్ ఇష్టారాజ్యంగా ప్రవర్తిస్తున్నా దాన్ని నామమాత్రంగా నైనా ఖండించకుండా దానికి అమెరికా ప్రభుత్వం మద్దతునిస్తుంది. ఇజ్రాయేల్ ప్రసార సాధనాలు కోరే మృతిని వక్రీకరించాయి. యీజిప్టు నుండి గాజా స్ట్రిప్‌కు ఆయుధాలు సరఫరా అయ్యే దారిని సైనికులు  ధ్వంసం చేస్తుంటే దానికి కోరీ అడ్డు పడిందని కొన్ని పత్రికలు రాశాయి. అయితే అది నిజం కాదని ఐక్యరాజ్య సమితి అధికారులు కూడా ధృవీకరించారు. దాదాపు 900 పౌరులు నివశించే యిళ్ళను ధ్వంసం చేశారని ఐక్యరాజ్య సమితి పేర్కొంది. దూసుకు వచ్చే సైనికులను శాంతి ప్రదర్శనల ద్వారా అడ్డుకోగలమని నమ్మిన వందలాది మంది కోరీలాంటి అమెరికన్ యువతీ యువకులు ఇజ్రాయేల్ ఆక్రమణ భూభాగంలో శాంతికోసం పనిచేస్తున్నారు. ఎన్నడూ మానవ హక్కులను గౌరవించిన చరిత్రే ఇజ్రాయేల్‌కు లేదు. శాంతి పట్లా, ప్రజాస్వామ్య, ప్రజల పట్ల దానికేనాడూ నమ్మకంలేదు.

యింతటి నియంతృత్వ పాలననూ, హింసోన్మాదాన్ని, రక్త పిపాసను ఒక శాంతి కపోతం ఎదుర్కోగలదన్న భ్రమతో అక్కడికి వెళ్ళిన రేచెల్ కోరీ నెత్తురోడిన పావురమై నేల రాలిపోయింది. ఆమె తన తల్లికి రాసిన మరో ఇ-మెయిల్‌లో ఇలారాసింది.

“మనలో ఎవరి జీవితాన్నైనా, సంక్షేమన్నైనా ఒక ఉక్కు పిడికిలి నలిపేస్తుంటే, ఏదో ఒక రోజు మనము, మన పిల్లలూ నివసించే యిళ్ళని బుల్‌డోజర్స్ వచ్చి కూలకొడతాయని తెలిస్తే, మనం పెంచుకున్న పచ్చటి తోటల్ని నాశనం చేస్తారని తెలిస్తే, మనలో కొంతమందిని విపరీతంగా కొట్టి మరో 149 మందితో కలిపి ఖైదీలుగా తీసుకు వెళితే మనల్ని మనం రక్షించుకోడానికి ఏదో ఒక హింసాత్మక పద్దతులను అవలంబించడానికి ప్రయత్నిస్తామని నువ్వు అనుకుంటావా? ఉన్న శకలాలపైనా రక్షించుకోడానికి జనం హింసకు పాల్పడతారని నువ్వనుకోవా? యిటువంటి పరిస్థితుల్లో తమను తాము రక్షించుకోడానికి ప్రజలు ఏది మంచి మార్గమైతే దాన్నే అవలంబిస్తారని నేననుకుంటున్నాను. క్రెగ్ అంకుల్ కూడా అదే చేస్తారనుకొంటాను. నేను కూడా అంతే చేస్తాననుకొంటా” అని రాసింది. ఆమె అంతే చేసింది. అమరత్వాన్ని పొందడాన్ని మించిన సాహస ప్రదర్శన మరొకటి లేదని చరిత్ర చెబుతుంది. ఒక ఆశయం కోసం తన స్వంత దేశం మద్దతుతో ఇజ్రాయేల్ సాగించిన దురాగతాలకు ఎదురు నిలిచి రేచెల్ కోరీ అమరత్వాన్ని సాధించింది.

**మే, 2004 - బహుజన కెరటాలు**

# ఇకనైనా పశ్చాత్తాప ప్రకటన చేస్తారా?

ఫిబ్రవరి పదమూడోతేదీన ఆస్ట్రేలియా ప్రధానమంత్రి కెవిన్‌రడ్ కాన్‌బెర్రాలోని పార్లమెంటు భవనంలో ఒక ప్రకటన చేశాడు. రోజువారీ రాజకీయ ప్రకటన కాదు. ఒక పశ్చాత్తాప ప్రకటన. ఒక క్షమాపణ. రెండువందల సంవత్సరాలుగా ఆ దేశపు భూమి పుత్రులు, మూలవాసులు తెల్లజాతి అహంకారం కింద ఎదుర్కొన్న అత్యాచారాలు, దుర్మార్గపు దాడులు, శిశు హననాలు, దారుణ మారణకాండలకు వాటిని కొనసాగించిన జాతికి చెందిన వారిగా సిగ్గుపడుతున్నామని ప్రకటించాడు.

కేవలం ప్రకటన వలన మాత్రమే రెండు శతాబ్దాల జీవితాలకూ, సంస్కృతికీ, చరిత్రకూ, విద్యా ఆరోగ్య మానసిక అభివృద్ధికీ జరిగిన నష్టం భర్తీ అవుతుందనికాదు. ఆ అమానవీయ విధ్వంసం జాతి గుండెల్లో గడ్డకట్టుకుపోయిన కన్నీటి గాయాల సముద్రంలా నిరంతరం సలపరిస్తూనేవుంటుంది. స్వంతగడ్డ పైన బానిసత్వం. తల్లిపేగు తెంచుకొని నేలమీదపడి పగిలిన కుండ పెంకుల్లా చెల్లా చెదురై ఏయే మూలలకు ఎగిరిపడ్డారో, భూమిపైన కాళ్ళు నిలదొక్కుకొనే ప్రయత్నంలో పాలకోసం కంకఠిల్లి కంకఠిల్లీ ప్రాణాలే వదిలారు. బతికి బట్టకట్టిన వాళ్ళు ఏ తెల్ల యజమానుల క్రూరపు చూపుల్లో బతుకుల్ని కరిగించుకున్నారో, భార్యలకు దూరమైన భర్తలు, కుటుంబాలకు దూరమైన తండ్రులు బతుకులు ఏవిధంగా తెల్లారిపోయాయో, భర్తలకు, కుటుంబాలకు దూరమైన తల్లులు, భార్యలు బిడ్డలు ఏ తెల్లదొరల ఎస్టేటుల్లో ఆడబానిసలుగా, ఉంపుడు గత్తెలుగా జీవితాల్ని ఎలా మార్చారో చరిత్ర నమోదు చేయలేదు. అక్షరబద్ధం కాని చరిత్రలో, అవ్యక్త చరిత్రలో ప్రతి పొరలోనూ ఆస్ట్రేలియా భూమిపుత్రుల కన్నీళ్ళూ నెత్తురూ పేరుకుపోయి వున్నాయి. ఈ మానవ ద్వేషపు జ్వాలల్లో కనలిన బతుకులకు మరమ్మత్తులేదు. మరి ఆస్ట్రేలియా ప్రధానమంత్రి పశ్చాత్తాప ప్రకటనకు ప్రాసంగికత ఏమిటి? అందులో పెద్ద విశేషం ఏమిటి?

ప్రపంచంలో అహంకరించిన జాతులు, దుర్మార్గాలకు పాల్పడిన జాతులు, మానవత్వానికే వ్యతిరేకమైన చర్యలకు పాల్పడిన జాతులు తమ పూర్వీకులూ, తామూ ఒడిగట్టిన అకృత్యాల పట్ల పశ్చాత్తాపాన్ని ప్రకటించుకోడానికి పూనుకొంటున్నాయి. ఆధిపత్యసమాజాలలోని కొన్ని వర్గాల్లోనైనా ప్రజాస్వామిక ఆకాంక్షలు పొడచూపుతున్న జాడలు ఈ ప్రకటన ద్వారా కనిపిస్తున్నాయి. పీడనకూ, దోపిడీకీ వివక్షకు గురవుతున్న వారికి ఆ పరిస్థితి ఎంతటి బాధాకరమైన అంశమో దుర్మార్గాలకు పాల్పడుతున్న వారికి అది అంతగా సిగ్గుపడాల్సిన విషయమన్నది వాళ్ళు గుర్తిస్తున్నారు. యిది ఆధునిక ప్రపంచ చరిత్రలో ఆశావహమైన పుటలు తెరుచుకొంటున్న దశకు నాందిగా భావించవచ్చు. ప్రతి మనిషికీ ఒకే విలువ వుండడం అనేది ఎంతగా సాధించవలసిన స్వప్నం! ఆ దిశలో ప్రపంచం కనీసం ఆలోచించడం, సంభాషించడం ప్రారంభించింది.

**మరి మన సంగతేమిటి? :** ఈ గడ్డపైన మూలవాసులపైనా, ఆదివాసులపైనా జరిగిన దాడులకూ హింసకూ, దౌర్జన్యాలకూ, అత్యాచారాలకూ వేల ఏళ్ళ చరిత్ర వుంది. కాలం కనురెప్పల పైన ఒక సుదీర్ఘమైన చీకటి యుగం కదిలాడింది. కులవ్యవస్థ రూపంలో,

భూస్వామ్యం రూపంలో, అంటరానితనం రూపంలో దుర్మార్గమైన వివక్ష కొనసాగింది. వేల యేళ్ళ చరిత్ర పొడవునా రక్తసిక్త గాయాలు. దారుణమైన కులవ్యవస్థ కాలానుగుణంగా తన రూపాన్ని మార్చుకొంటూ తన వేయిపడగల విషపు పడగల్ని విసురుతోనే వుంది. స్వతంత్రం వచ్చిందని, దేశం ఒక ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని ఆమోదించి అమలు చేస్తున్నానని ప్రకటించుకొంది. ఆ రాజ్యాంగం ప్రకారం చట్టంముందు అందరూ సమానులే. ప్రతి మనిషికీ ఒకే విలువ. కానీ వాస్తవ జీవితంలో మాత్రం అది నిజరూపం దాల్చలేదు. పౌరసమాజం అనుకున్నంతగా పౌరస్వభావాన్ని సంతరించుకోలేదు. అహంకారాన్నీ, ఆధిపత్య భావజాలాన్నీ, హింసా ప్రవృత్తినీ ఏ మాత్రం వదులుకోలేదు. పుట్టుక కారణంగా, చేపట్టవలసి వచ్చిన వృత్తుల కారణంగా, ఒకరు ఉన్నతులనీ ఒకరు నీచులనీ భావించే తత్వం పోలేదు. యిది కేవలం నమ్మకంగా మాత్రమే వుంటే సరే. కానీ ఆ నమ్మకం ఆచరణలో ఎంత హింసాత్మకంగా ప్రతిఫలిస్తుందో దళిత బహుజనులు స్థానిక స్థాయి నుండి అంతర్జాతీయ స్థాయి వరకూ సాక్ష్యాధారాలతో సహా చూపారు. అతి సామాన్యంగా కన్పించే మనుషులు కులం కలుషిత రేఖను దాటితే కొమ్ముల కోరల మహా రాక్షసులుగా ప్రవర్తించే పరిస్థితే ఈనాటికీ కొనసాగుతుంది. ఈ దుర్మార్గాలను నిరోధించవలసిన ప్రభుత్వం నిందితులను శిక్షించవలసిన ప్రభుత్వం కిమ్మనదు. అవసరమైతే వారి కొమ్ము కాస్తుంది. నిందితులు ఏ శిక్షా లేకుండా బయట పడేలా వ్యవహరిస్తుంది.

కనీసం కుల వ్యవస్థ, దాని తాలూకూ హింస, వివక్షలు వాస్తవమేననీ వాటిని సవరించడానికీ వాటి ద్వారా తలెత్తే సమస్యలను పరిష్కరిస్తామనీ ప్రకటించడం లేదు. అసలు భారతదేశానికి సంబంధించి కులం అనేది చరిత్రకు సంబంధించిన అంశమే తప్ప యిప్పుడు కులం లేనేలేదని అంతర్జాతీయ వేదికలపైన బుకాయించడానికి సాహసించింది. ఈ పరిస్థితుల్లో ఈ దేశానికి అన్నం పెడుతున్న దేశ భూమిపుత్రులు దళితులు, ఆదివాసులకు ఒక నమ్మకం కలిగించడానికి సామాజిక చేతనలో ఒక పరివర్తన మొదలైందన్న రుజువు కావాలి. యింతకాలం సాగించిన దురాగతాలకు కొంచెమైనా సిగ్గుపడుతున్నామన్న సాక్ష్యం కావాలి. ఒక పశ్చాత్తాప ప్రకటన కావాలి. ఆ ప్రకటన నిజ జీవితంలో ఆచరణలో అనువాదంకావాలి.

అందుకు కెవిన్ రడ్ ప్రకటన భారతదేశానికి ఏమైనా పాఠం నేర్పుతుందా? పాఠాలు నేర్చుకోని ఎన్నో సామ్రాజ్యాలు కుప్పకూలిపోయాయి.

బాధితులుగా, పీడితులుగా ఈ దేశంలో తరాల తరబడి కునారిల్లిన దళిత బహుజనులు మౌనంగా వుండడానికి సిద్ధంగా లేరు. పాలకవర్గాలు పాఠాలు నేర్చుకున్నా నేర్చుకోకపోయినా దళిత బహుజనులు చాలా పాఠాలు నేర్చుకున్నారు. అందుకే రాజ్యాధికారాన్ని సాధించే దిశగా ఈ గడ్డ గుండెలమీద కవాతులు మొదలు పెట్టారు. అంతిమ విజయం దళిత బహుజనులదే.

యికనైనా ఈ దేశ పాలకులు పశ్చాత్తాపాన్ని ప్రకటించరా?

**ఫిబ్రవరి, మార్చి 2008 - బహుజన కెరటాలు**

# అరాఫత్ అసలుపేరు ప్రేమ, పోరాటం

అమెరికా అధ్యక్షుడు జార్జిబుష్‌కు గుండెలమీద బరువు దిగిపోయివుండవచ్చు. ఇజ్రాయేల్ ప్రధాని షారోన్ సంతృప్తిగా వూపిరి పీల్చుకొని వుండవచ్చు. జియోనిస్టు మూకలు ఆనందంగా కేరింతలు కొట్టివుండవచ్చు. రమల్లాలోని ఆ సమాధి మాత్రం మౌనంగా వుండదు. తన గర్భాన అగ్నిపర్వతాన్ని దాచుకున్న భూభాగం ప్రశాంత నిద్రలో మునిగిపోలేదు. ఇజ్రాయేల్ ఆక్రమిత ప్రదేశాల్లో బతుకునీడుస్తూ జీవన్మరణ పోరాటాన్ని కొనసాగిస్తున్న 35లక్షల మంది పాలస్తీనీయులకు ఆయన యింకా ఒక సజీవ పోరాట స్ఫూర్తి. 'పెద్దాయన మమ్మల్ని నడిపిస్తాడు. ఆయనే మా నాయకుడు' అని ప్రతి గుండే నినదించింది. అబూ అమర్... యింక నువ్వు విశ్రాంతి తీసుకో... నీ పోరాటాన్ని మేం ముందుకు తీసుకుపోతాం' అని పాలస్తీనా పోరాట యోధులు గర్జించారు.

బతుకంతా అవిశ్రాంత పోరాటంలో గడిపిన యోధుడు యాసర్ అరాఫత్, నవంబర్ 11న శాశ్వతంగా కన్ను మూసినట్లు పారిస్‌లోని పెర్సీ సైనిక్ ఆస్పత్రి వర్గాలు అధికారికంగా ప్రకటించాయి. నిజానికి అరాఫత్ జీవితమంతా చావుకీ బతుక్కీ మధ్యన కనిపించే సన్నటి జీవనరేఖ పైనే గడిచింది. ఆయన్ని హత్యచేయడానికి ఇజ్రాయేలీ ఇంటెలిజెన్స్ వర్గాలు ఎన్నోసార్లు ప్రయత్నించాయి. యిప్పుడు కూడా ఆయనకు గృహనిర్బంధంలో విషప్రయోగం చేసి చంపివుంటారన్న ఆరోపణలు వున్నాయి.

1929 ఆగస్టు 24వ తేదీన పుట్టిన యాసర్ అరాఫత్ పూర్తిపేరు మహమ్మద్ అబ్దుల్ రవూఫ్ అత్ - అరాఫత్ - అల్ -కాద్వా జెరూసలేంకు చెందిన అతి ప్రాచీన హుస్సేనీ కుటుంబానికి చెందినవాడు. నాలుగేళ్ళ వయస్సులోనే తల్లిని కోల్పోయాడు. ఆయన యవ్వన కాలం అంతా కైరోలో గడిపారు. యువకుడిగానే 1948లో జియోనిస్టులపై జరిగిన యుద్ధకాలంలో ఆయన పాలస్తీనాకు ఆయుధాలను చేరవేయడంలో సహాయపడ్డాడని చెప్తారు. కైరో యూనివర్శిటీ నుండి సివిల్ ఇంజనీరింగ్ పట్టభద్రుడయ్యాడు. కైరో యూనివర్శిటీలోనే ఆయన రాజకీయ జీవితం ఆరంభమయ్యింది. 1950లో పాలస్తీనా స్టూడెంట్స్ యూనియన్‌కు నాయకత్వం వహించాడు. ఆ తర్వాత ఉద్యోగం కోసం కువైట్ వెళ్ళాడు. అక్కడ స్వంతంగా ప్రారంభించిన వ్యాపారం లాభసాటిగానే నడిచింది. ఆ డబ్బుతో పాలస్తీనా విమోచన కోసం సాయుధ పోరాటాన్ని నడిపేందుకు అల్‌ఫతా అనే సంస్థను ప్రారంభించాడు. ఆ సంస్థ ఆధ్వర్యంలో నడిచిన 'ఫులస్తీనా (మా పాలస్తీనా) అన్న పత్రిక అంతర్జాతీయంగా పాలస్తీనా సమస్యను ప్రచారం చేయడంలో విజయవంతం అయ్యింది. అప్పటివరకూ పాలస్తీనా సమస్య అంటే కేవలం 'శరణార్థుల సమస్య'గానే చూసిన ప్రపంచం, యాసర్ అరాఫత్ ప్రవేశంతో స్వతంత్ర పాలస్తీనా భూభాగం కోసం పోరాటంగా గుర్తించడం మొదలుపెట్టింది. 1960ల మధ్య కాలానికి అరాఫత్ స్థాపించిన అల్‌ఫతా ఇజ్రాయేల్‌కు వ్యతిరేకంగా గెరిల్లా యుద్ధం ప్రారంభించింది. అరబ్బు దేశాల సహాయ సహకారాలతో వేరువేరు పద్ధతుల్లో రకరకాల వర్గాలు సాగించే అన్ని పోరాటాలనీ ఒకే గొడుగు కిందకు తీసుకువచ్చేందుకు పాలస్తీనా

విమోచనా సంస్థ (పి.ఎల్.ఒ.) ఏర్పడింది. 1964లో అరాఫత్ పి.ఎల్.ఒ. అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. ఏ వర్గానికి ఏ వర్గంతోనైనా గొడవలుండొచ్చు. ఆ మాటకొస్తే అరాఫత్ స్థాపించిన అల్‌ఫతాతో కూడా అనేక సంస్థలు గొడవ పడ్డాయి. కానీ అందరూ ఆమోదించే ఏకైక నాయకుడు అరాఫత్ ఒక్కడే.

తొలుత జోర్డాన్ సహాయంతో తమ స్థావరాలను ఏర్పర్చుకొని ఇజ్రాయేల్ పైన గెరిల్లా దాడులు నిర్వహించారు. ఆ తర్వాత లెబనాన్‌ను స్థావరంగా చేసుకొని తమ పోరాటాల్ని నిర్వహించారు. కొద్ది కాలంలోనే పాలస్తీనా విమోచనా సంస్థను స్వతంత్రంగా పోరాటాలను నడుపగలిగిన సంస్థగా ఆయన తీర్చిదిద్దాడు. ఈ మధ్యకాలంలో ఆయనపైన వ్యక్తిగతంగా ఎన్నో హత్యాప్రయత్నాలు జరిగాయి. ప్రవాసజీవితం. ప్రతిక్షణం బాంబుల మోతలు, తుపాకుల కాల్పులు. నేలకొరిగిపోతున్న వేలాదిమంది పాలస్తీనా స్త్రీలనూ, పురుషులనూ, పిల్లల్నీ ఆయన కళ్లారా చూశాడు. గుండెల్లో ఆశయం ఒక్కటే. స్వంత గడ్డపైన పాలస్తీనా ప్రజలు పరాయిలుగా బతికే పరిస్థితి పోవాలి. పాలస్తీనా స్వతంత్రదేశంగా రూపొందాలి. తమ తిరుగులేని పోరాటాలతో పాలస్తీనా విమోచన సంస్థ పాలస్తీనా సమస్యకు అంతర్జాతీయ గుర్తింపును తీసుకువచ్చింది. అమెరికా మధ్యవర్తిత్వం నెరపడానికి ముందుకు వచ్చింది. పాలస్తీనాను స్వతంత్ర దేశంగా ప్రకటిస్తే, పాలస్తీనా శరణార్థులకు తిరిగి తమ గడ్డకు తిరిగివచ్చే హక్కును కల్పిస్తే పోరాటాన్ని జరపడం ఆపేస్తామని ఆయన ప్రకటించాడు. కొన్ని రాజీలు పడ్డాడన్న విమర్శలకు గురయ్యాడు. స్వంతమనుషులే ఆయనను విమర్శించారు. అయినప్పటికీ పాలస్తీనా ఆశయ సాధనకోసం ఆయన ముందుకే సాగిపోయాడు. 1974లో పాలస్తీనాకు ఐక్యరాజ్య సమితి పరిశీలకురాలి హోదాను కల్పించారు. ఆ సందర్భంగా ఆయన ఐక్యరాజ్య సమితిలో చేసిన ఉపన్యాసం చారిత్రికమైనది.

“ఒక చేత్తో శాంతికి చిహ్నమైన ఆలివ్‌కొమ్మను తీసుకొచ్చాను. మరో చేత్తో దాన్ని కాపాడడానికి తుపాకీని తీసుకువచ్చాను. నా చేతిలో ఆలివ్ కొమ్మను కిందపడి పోనీయకండి”. అని ఆయన ప్రపంచ దేశాధినేతల సమక్షంలో ప్రకటించాడు. దాదాపు 70 దేశాలు పాలస్తీనాను స్వతంత్ర దేశంగా గుర్తించడానికి అరాఫత్ సాగించిన నిర్విరామమైన కృషే కారణం. 1985లో ఐక్యరాజ్య సమితి గుర్తింపును పాలస్తీనాకు సాధించిపెట్టాడు. 1990లో అరవైఏళ్ళ వయస్సులో సుహాను పెళ్ళిచేసుకున్నాడు. 1988లో నెహ్రూ శాంతి బహుమతి, 1994లో నోబెల్ శాంతి బహుమతి ఆయనకు లభించాయి.

తుదిశ్వాస విడిచేవరకూ ఆయన తన ప్రజలకోసం కన్నీళ్ళు కార్చాడు. తన ప్రజలనూ, సంస్కృతినీ, చరిత్రను ప్రేమించాడు. తన మాతృదేశం విముక్తికోసం చివరి క్షణం వరకూ పోరాడాడు. ఆయన్ని కోల్పోయిన పాలస్తీనా ప్రజానీకం భోరున విలపిస్తుంది. వారి పోరాటాల్లో ఆయన ఎప్పుడూ సజీవుడే. ప్రపంచంలో మానవత్వం పట్ల ప్రేమను ప్రకటించే అందరికీ ఆయన ఆత్మీయుడే. మధ్య ప్రాచ్యపు చేగువేరాగా పేరొందిన ఆయన ప్రపంచ ప్రజల విముక్తి పోరాటాల్లో ఎగిరే పతాక.

**నవంబర్, డిసెంబర్ –2004 – బహుజన కెరటాలు**

# నల్లనల్ల సూరీడి గుండె గాయపడింది

హైదరాబాద్ ప్రెస్‌క్లబ్ మీటింగ్‌లంటే విసుగూ, విరక్తి కలుగుతున్న రోజులు. కేవలం పదిమంది కలుస్తారని తప్ప ఉపన్యాసాలకోసం జనం ఆసక్తిగా రావడం మానేసిన రోజులు. సభ ప్రారంభం అయ్యేవరకూ లోపల వుండి ప్రారంభంకాగానే గేటు దగ్గరకో, మెట్ల దగ్గరకో, చాయ్ పానీకో, సిగరెట్ పొగల కబుర్లకో పరుగులు పెట్టే రోజులు. కానీ ఆరోజు మాత్రం సభాప్రాంగణం కిక్కిరిసిపోయింది. బయటినుండి లోపలికి తోసుకు వెళ్ళాలని సభికులు ఆత్రపడ్డారు. కదలనైనా కదలడంలేదు. ఊపిరి బిగపట్టి వక్త గొంతుక వెలువరించే ప్రతి అక్షరాన్నీ గుండెల్లోకి ఆవాహన చేసుకోవాలన్న తపన చెందారు. నిగనిగలాడే ఒకనల్లటి గంభీరగళం, ఒక దట్టమైన మేఘంలా ఆ రోజున వాతావరణాన్ని అలంకరించింది. యుగాల నుండి చెవుల్లో పేరుకుపోయిన సీసపు తుప్పు వదలిపోతుంది. ఒక్కొక్క ఆప్తవాక్యం గుండెల్ని పెనవేసుకొంటుంది. నరాల్లో నెత్తురూ, విద్యుత్తూ కలసి ప్రవహిస్తున్నాయి. ఆయన తెలుగులో మాట్లాడలేకపోతున్నందుకు క్షమాపణ అడుగుతున్నాడు. కానీ సభలో వున్నవాళ్ళంతా ఒక మహోద్విగ్నమైన ఉపన్యాసాన్ని తెలుగులో విన్నారు. ఆయన మాట్లాడింది ఇంగ్లీషులోనే. పాల్ రాబ్సన్ గొంతుకకు గద్దర్ గొంతుకని అంటుగట్టి గోరెటెంకడు పాటపాడినట్లు ఆ మాటల ధార అలా సాగిపోతుంది. గూగీ వా థియాంగో (కానీ జ్యూగీ అనో న్యూగీ అనో పిలవాలని కెన్యా మిత్రురాలు చెప్పింది. కానీ తెలుగులో గూగీయే బాగుంటుందని చెప్పాను) వేదిక మీద నుండి మాట్లాడుతున్నాడు. అది వుపన్యాసం కాదు. గుండెతో గుండె చేసే సంభాషణ. ఆ రోజంతా తెలుగు కవులతో అనేక విషయాలు పంచుకున్నాడు గూగీ. సాహిత్యంలో పరిచయం వున్న వాళ్ళందరికీ గూగీ పేరు చిరపరిచితమే. ఆయన రాసిన 'వీప్ నాట్ చైల్డ్ (ఏడవకు బిడ్డా!)' 'పెటల్స్ ఆఫ్ బ్లడ్ (రక్త రేకలు)' 'డెవిల్ ఆన్ ద క్రాస్' ('మట్టికాళ్ళ మహారాక్షసి' గా తెలుగులో వచ్చింది') నవలలు ప్రపంచ వ్యాప్తంగా ఎంతో ప్రచారం పొందాయి.

వలసవాదాన్ని మనసా, వాచా, కర్మణా తీవ్రంగా వ్యతిరేకించి అందుకోసం రచనలు చేసినవాడు గూగీ. మొదట్లో తల్లిదండ్రులు పెట్టిన పేరు జేమ్స్. గూగీ పేరుతోనే అనేక కథలు రాశాడు. వలసవాదానికి ప్రతీక అయిన జేమ్స్ అన్నమాటను తన పేరుతో వుంచుకొరాదని గూగీ వాథియాంగో (గూగీ సన్ ఆఫ్ థియాంగో) పేరుతో రాయడం మొదలు పెట్టాడు. ఎన్నో నాటికల్ని రాసి ప్రదర్శింపజేశాడు. వలసవాద పాలకులు ఆయన రచనల్లో మండుతున్న అగ్నిగోళాలను చూశారు. ఆయన రచనలపై నిషేధం వేటు వేశారు. ఆయన నాటికలను ప్రదర్శించడానికి వీలులేదని ఆంక్షలు విధించారు. అయితే గూగీ నిర్భంధాలకు చలించిపోలేదు. తన నాటికల రిహార్సల్స్‌ను గ్రామాల్లో ప్రజల ముందు చేశాడు. నిజానికి అవి రిహార్సల్స్ కాదు ప్రదర్శనలే. చివరకు ఆయననే జైల్లో బంధించారు. అది 'గూగీ డిటెయిన్‌డ్' అనే పేరుతో అచ్చయ్యింది. రాజకీయ కారణాలతో జైల్లో గడపవలసివచ్చిన

వాళ్ళకు ఆ జైలు డైరీ ఎంతో స్ఫూర్తినీ, స్థైర్యాన్నీ యిస్తుంది. ప్రపంచవ్యాప్తంగా కవులూ, రచయితలూ, మానవహక్కుల ఉద్యమ కార్యకర్తలూ ఎంతో వత్తిడి తీసుకు వచ్చిన మీదట గత్యంతరంలేని స్థితిలో గూగీని విడుదల చేశారు. తెల్లవారి పాలన కెన్యా గడ్డ మీద కొనసాగినంతకాలం ఆ దేశంలో కాలుమోపనని శపథం చేసి గూగీ అమెరికా వెళ్ళిపోయాడు. వలస పాలనకు ప్రతీకగావున్న ఇంగ్లీషు భాషలో యింక రచనలు చేయనని తన మాతృభాష అయిన 'గీకుయు' భాషలోనే రచనలు చేస్తున్నాడు. భాషా సామ్రాజ్యవాదంపైన అనేకవ్యాసాలు రచించాడు. తన స్వంత గడ్డమీద వలసపాలన అంతమయిందన్న వార్త విన్న తర్వాత మాత్రమే తిరిగి స్వంత దేశానికి వెళ్ళిరావాలని అనుకున్నాడు. గూగీ స్వంత దేశానికి వస్తున్నాడన్న వార్త విన్న యూనివర్శిటీ విద్యార్థులు ఆనందంతో గంతులు వేశారు. వీధుల్లో సంబరాలు చేసుకున్నారు. ఆయనతో కలసి ముఖాముఖీ సంభాషించే క్షణాల కోసం, ఆ గుండెలు ఆరాటపడ్డాయి. గూగీ రానేవచ్చాడు.

నైరోబీలోని గూగీ స్వంత ఇల్లు. భార్యాసమేతంగా విడిదిచేసి వున్నాడు. గూగీ వాధియాంగో, ద సన్ ఆఫ్ ద సాయిల్, మహా రచయిత. ఇన్నేళ్ళ తర్వాత స్వంత ఇంటికి తిరిగి వచ్చిన గూగీ పైన ఆకస్మికంగా దాడిజరిగింది. ఎవరు? తన మాతృదేశాన్ని విపరీతంగా ప్రేమించిన గూగీపైన ఎవరు దాడి చేస్తారు? గూగీని తీవ్రంగా గాయపర్చారు. ఆయన కళ్ళ ముందే ఆయన భార్యను రేప్ చేశారు. కెన్యా సమాజం వులిక్కిపడింది. మొత్తం ప్రపంచమే తల్లడిల్లి పోయింది. జాతి ఆత్మను ప్రతిఅక్షరంలో ప్రతిఫలించిన గొప్ప రచయిత పైన స్వంత దేశంలో జరిగిన దుర్మార్గమైన పరమ పాశవికమైన దాడిని నిలువరించలేక పోయినందుకు సిగ్గుపడింది.

మహాస్వాప్నికుడా! నీపై జరిగిన దుర్మార్గమైన దాడిలో తెలుగు గడ్డ మీద మేం గాయపడ్డాం. నీ గాయాలను మా గుండెల మీద మోసుకుంటూ... వలసవాదపు వికృతరూపాన్ని మా తరాలకు చూపిస్తాం. చితికిన బతుకుల దుఃఖాన్నీ, కలల్నీ నువ్వు ఎప్పటిలాగే గానం చెయ్యి... వలసవాదం అంటే మూర్తీభవించిన క్రూరత్వం... వలసవాదం అంటే పరమ దుర్మార్గమైన దాడి. సమస్త పీడిత హృదయాలూ దుఃఖాన్నీ, గాయాన్ని పంచుకొంటున్నాయి. ఖండాంతరాలకు అడ్డంగా ప్రవహించే కన్నీటి ప్రవాహాలను పిడికిళ్ళలో బిగించి ఒక శపథం చేద్దాం. నీకూ, నీ భార్యకూ మనస్తాపం కలిగించిన దుష్టశక్తులను ఈ భూమి మీద నుండి పారద్రోలే వరకూ గళాలను, కలాలనూ, సకల శక్తులనూ ఒడ్డి పోరాడతామని సంతకం చేద్దాం. అంతదాకా ఒక సలసల కాగే కన్నీటి బొట్టు సంఘీ భావంగా...

**2004 సెప్టెంబర్ - బహుజన కెరటాలు**

# ప్రపంచం గుండెల్ని కొల్లగొట్టిన కవి పాబ్లో నెరూడా

పాబ్లో నెరూడా చిలీ దేశపు కవి అంటే చాలా మంది నమ్మరు. ప్రపంచ దేశాలన్నింటిలో పీడితుల పక్షాన నిలబడిన వాళ్ళందరూ తమ గుండెమంటల్నే అక్షరాలుగా ఆయన వాక్యాల్లో చూసుకున్నారు. 1971లో ఆయన సాహిత్యానికి నోబెల్ బహుమతి వచ్చింది. మన దేశానికి ఆయన రెండుసార్లు వచ్చారు. అమెరికా దురహంకారాన్ని తీవ్రంగా ఎండగడుతూ ఆయన రాసిన కవితలు యిప్పటికీ సామ్రాజ్యవాదులను వ్యతిరేకించే గొంతుకలకు ఆయుధాలుగా పనిచేస్తూ వున్నాయి. 1973 సెప్టెంబర్ 11వ తేదీన అమెరికా ప్రత్యక్ష ప్రోద్భలంతో చిలీ ప్రభుత్వాన్ని కూలదోయడానికి దుర్మార్గమైన సైనిక కుట్ర, తిరుగుబాటు జరిగింది. అప్పటికి అనారోగ్యం నుండి కోలుకొంటున్న నెరూడా చిలీ ప్రజలు ఎన్నుకొన్న విప్లవ నాయకుడు ఆ దేశాధ్యక్షుడు అలెండీని సైనికులు దుర్మార్గంగా కాల్చిచంపిన వార్తను తట్టుకోలేక ఆ దిగులు, ఆగ్రహంతో 1973 సెప్టెంబర్ 23వ తేదీన చనిపోయారు. ఆయన మరణం ఆయన జీవితాన్ని తెలియజేస్తుంది. అందుకే మరణం తర్వాత ఆయన భార్య మెటెల్టా ఉరోషియా నెరూడా, దుర్మార్గంగా హత్యకు గురైన మరో కవి గాయకుడు విక్టర్ బారా సతీమణి జోన్ జారాలు నెరూడా గురించి రాసిన వివరాలివి.

**కవి మరణం:** పాబ్లో నెరూడా చాలా సంతోషంగా బతికిన మనిషి అని ఎవరైనా చెప్పగలరు. ఆయన రాతల నుండి కూడా దాన్ని గ్రహించవచ్చు. మంచాన పడ్డప్పుడు కూడా ఆయనలో ఆ లక్షణం పోలేదు. ఆయన అనారోగ్యం నుండి దాదాపు కోలుకున్నాడు. అయితే సైనికకుట్ర, తిరుగుబాటు జరిగిన రోజు ఆయన పట్ల దారుణమైన రోజుగా నిలిచి ఆయన్ని కలచివేసింది. సాల్వడర్ అలెండీ మృతి చెందారని తెలిసిన వెంటనే డాక్టర్ నన్ను పిలిచి ఈ విషయం పాబ్లోకి తెలియనివ్వకండి. తెలిస్తే యిప్పటి దాకా పడ్డ కష్టమంతా వృధా కావచ్చు. రోగం మళ్ళీ తిరగబెట్టి ప్రాణాపాయం కలుగవచ్చు అని చెప్పారు. నెరూడా మంచం ముందు టీవి ఉంది. రోజు పత్రికలన్నీ తెప్పించుకొని చదివే అలవాటు ఆయనకు. అంతేకాక రేడియో కూడా వుంది. అలెండీ హత్యవార్త అర్జెంటీనాకు చెందిన మెండోబా రేడియో స్టేషన్ ప్రసారం చేసిన వార్తల ద్వారా మాకు తెలిసింది. ఆ ప్రకటనే పాబ్లో నెరూడాను చంపేసింది. అవును ఆ ప్రకటనే ఆయన్ని చంపింది. అలెండీ మృతిచెందిన మరుసటిరోజున పాబ్లోకి విపరీతమైన జ్వరం వచ్చింది. ప్రధాన వైద్యుడిని అరెస్టుచేశారు. అసిస్టెంటులు ఎవ్వరూ మందులిచ్చే సాహసం చేయలేదు. ఏ వైద్య సహాయమూ అందక రోజులు గడిచే కొద్దీ పరిస్థితి మరింత క్షీణించడం ప్రారంభమైంది. ఐదురోజులు గడచిన తర్వాత ఫిజిషియన్ కలిసి ఆయన్ని క్లినిక్‌కు తీసుకువెళ్ళక తప్పదు. అతని ఆరోగ్యం దారుణంగా క్షీణించింది అని చెప్పాడు. ఆ రోజంతా పాబ్లో రేడియో వింటూనే ఉన్నాడు. అర్జెంటీనా, సోవియట్ యూనియన్ స్టేషన్లు తిప్పుతున్నాడు. ఆయనకు పరిస్థితి అర్థమైంది. ఆయన దీర్ఘ నిద్రలోకి వెళ్ళేవరకూ ఆయన మెదడు ఎంతో చురుగ్గా వుంది.

ఒక ప్రైవేటు అంబులెన్సును పిలిచాను. శాంటియాగోకి బయలుదేరాం. దారి మధ్యలో అంబులెన్సు ఆపి తనిఖీచేసారు. నేను అతని దగ్గరే కూర్చొనివున్నాను. నన్ను కిందికి దించి నన్నూ అంబులెన్సునూ తనిఖీ చేశారు. నెరూడా తీవ్రంగా కలతకు గురయ్యాడు. 'ఆయన పాబ్లో నెరూడా, ఆరోగ్యం బాగా క్షీణించింది. మమ్మల్ని వెళ్ళనివ్వండి, అని నేను చెబుతూనే వున్నాను. ఆస్పత్రికి వెళ్ళేసరికి పరిస్థితి చాలా క్షీణించింది.

రాత్రి పదిన్నరకు పాబ్లో చనిపోయాడు. నగరంలో కర్ఫ్యూ వుండడంతో ఆస్పత్రికి ఎవరూ రాలేదు. శాంటియాగోలోని యింటికి ఆయన శవాన్ని తీసుకు వెళ్ళాను.యిల్లు ధ్వంసం అయిపోయి వుంది. పుస్తకాలు చెల్లాచెదురు చేశారు. అంతటి ఉద్రిక్త పరిస్థితుల్లోనూ పాబ్లోను చివరిసారిగా చూడడానికి వందలాదిమంది జనం తరలివచ్చారు.అందరి ముఖాల్లోనూ విషాదం తాండవమాడుతుంది. పరిస్థితి గంభీరంగా మారింది. యింతలో కొందరు "పాబ్లో నెరూడా" అని ముక్తకంఠంతో నినదించారు. మరికొందరు "యిక్కడే వున్నాడు" అని బదులిచ్చారు. శ్మశానానికి చేరేటప్పటికి వేలాది గొంతుకలు అంతర్జాతీయ గీతాన్ని ఆలపిస్తూ నెరుడాని అనుసరించాయి. **– మెటల్టా నెరూడా**

నెరూడా గౌరవార్థం వందలాది మంది అక్కడ చేరారు. వీధులనిండా సైనికుల పహారా. మెషిన్ గన్స్ ఎక్కుపెట్టి వున్నాయి. రహస్య పోలీసుల నిఘా, నేనూ, క్వేనా ఊరేగింపు ముందు నడుస్తున్నాం. కానీ రానురాను నడవడం కష్టమై నేను వెనుకబడి పోయాను. తండోపతండాలుగా జనం ఊరేగింపులో చేరుతున్నారు. సైనికులు తిరుగుతూనే ఉన్నారు. మారణాయుధాలు బెదిరిస్తూనే వున్నాయి. శ్మశానం వైపు నడుస్తున్నాం. ఒకరి తర్వాత ఒకరు, ఒక్కొక్క చరణం తర్వాత మరొక్క చరణంగా పాబ్లో కవితాగానం చేస్తున్నారు. దారి యిరువైపులా జనం నిలబడివున్నారు.

'సుబే ఆ నాసెర్ కాన్‌మిగో, హెర్‌కూనో'వ, (లేచిరా సోదరా... నాతో పాటు మళ్ళీ నువు జన్మించాలి) అన్న నెరూడా కవిత మారుమోగుతుంది. ఆ తర్వాత ఫాసిస్టు పాలనకు వ్యతిరేకంగా నెరూడా రాసిన కవిత "రండి...రండి.. వీధుల్లో ప్రవహిస్తున్న నెత్తురును చూడండి" అన్న కవితను సామూహికంగా గానం చేయడం మొదలు పెట్టారు. నేను నడుస్తుంటే నేను ఒంటరిని కాననిపించింది. యిది పాబ్లో అంతిమయాత్ర మాత్రమే కాదు. యిది విక్టర్ జారా అంతిమ యాత్ర. యిది ఎందరో అమాయకంగా చనిపోయిన వారి అంతిమ యాత్ర అనిపించింది. కొంతమంది విదేశీ జర్నలిస్టులో, టీవి వాళ్ళో వుండటంతో సైన్యం మా జోలికి రాలేదు. అయితే శ్మశానానికి చేరేటప్పటికి ఒక సైనిక పటాలం తుపాకులను బారు పెట్టి ముందుకు వచ్చింది. జనం చెదరలేదు. 'నెరూడాని చూడుడి.. జనంలో వున్నాడు' జనం నినదిస్తున్నారు. యింతలో అంతర్జాతీయ గీతాన్ని అందుకున్నారు. మొదట్లో భయం భయంగా.. ఆ తర్వాత ఎంతో ధైర్యంగా పాడారు. ప్రజా ప్రభుత్వం ఏర్పడ్డాక జరిగిన ఆఖరి ప్రజా ప్రదర్శన యిది. నియంతృత్వం ఫాసిస్టుకోరలు సాచిన దుర్మార్గపు పాలన మొదలైన తర్వాత జరిగిన మొదటి మహా ప్రజల ప్రదర్శన యిది. **– జాన్ జారా**

# యిప్పుడింక నువ్వు నాకు స్వంతం

యిప్పుడింక నువ్వు నాకు స్వంతం
నా కలలో నీ స్వప్నాలతో సహా
విశ్రమించు
యిప్పుడింక
ప్రేమా, బాధా, పనీ
అన్నీ నిద్రపోవలసిందే
ఈ చీకటి రాత్రి కనిపించని
చక్రాల మీదుగా కదలిపోతుంది
నిద్రించే ఆకాశంలాగా పవిత్రంగా
నా పక్కనే వున్నావు నువ్వు
ప్రేమ మాత్రమే
నా కలల్లో నిద్రపోతుంది
నువ్వు వెళ్ళి పోతావు
కాల ప్రవాహాల కెరటాల మీదుగా
మనిద్దరం కలిసే వెళతాం
ఈ దోబూచులాటల నీడల గుండా
నాతో కలసి ఎవరూ పయనించరు
నువ్వు మాత్రమే
నిత్య హరితంగా...
నువ్వు నిత్య చందమామవి... నిత్య సూర్యకాంతివి
నీ చేతులు సుతిమెత్తని పిడికిళ్ళని తెరుచుకున్న వెంటనే
మృదువైన రేఖలు జారిపడ్డాయి
నీ కనురెప్పలు రెండు
బూడిద రంగు రెక్కల్లాగా అలా మూసుకొని వున్నాయి
ఈ రాతిరి... ఈ ప్రపంచం... ఈ గాలి...
తమ లక్ష్యాలను మార్చుకొన్నాయి.
నువ్వు లేక నేను నీ కలగా మిగిలాను
కేవలం కలగా
కే..వ..లం కలగా
అంతే.. మరేమీ కాదు

**– పాబ్లో నెరూడ**

**జులై, ఆగస్ట్ – 2004 – బహుజన కెరటాలు**

# పంజరంలో పాలపిట్ట పాట పాడేదెందుకో!?

చాలా మందికి అమెరికా అంటే అదొక గొప్ప స్వేచ్ఛా ప్రపంచం. చాలా మందికి అమెరికా అంటే చేయెత్తి ఆహ్వానించే స్వేచ్ఛా ప్రతిమ (Statue of Liberty) అక్కడ దేవదూతల్లాంటి తెల్లటి మనుషులు. మల్లె పువ్వుల్లా నవ్వుతూ వుంటారు. కానీ అమెరికన్ మురికి వీధుల్లో దుర్భర దారిద్ర్యాన్ననుభవిస్తూ, అతిపెద్ద స్వేచ్ఛా స్వర్గంలో మధ్యయుగాల బానిసత్వపు నరకాన్ననుభవిస్తున్న నల్లజాతి వారికి ఆ తెల్లటి చిరునవ్వుల వెనుక ఎన్ని చీకటి మేఘాలు ముసురుకున్నాయో తెలుసు. జీవికి స్వేచ్ఛంత అవసరమో మార్టిన్ లూథర్‌కి తెలుసు. అంబేద్కర్‌కి తెలుసు. మాయా ఆంగెలోకి తెలుసు. స్వేచ్ఛ కోసం పాడడం అంటే పంజరాన్ని ముక్కలు చేయడానికి పెనుగులాడడం కదా! అందుకే కలం పట్టింది మాయా ఆంగెలో. చీకట్లో మగ్గుతున్న మనిషి వెలుతురును ఆకాంక్షించడం అంటే చీకటి పైన పోరాటం ప్రకటించడం కదా! స్వంత గాయాల స్వంత బాధలను, దుర్మార్గపు సామాజిక చట్టంనుండి విముక్తి పొందేందుకు చేసే స్వంత పోరాటంను, ఈ క్రమంలో తన జీవితానికి ఎదురైన చీకటి వెలుగులను చిత్రించడానికి ఆమె కలం పట్టింది. ఆమె కలం నుండి అక్షరాలు అక్షరాలుగా జాలువారిన విముక్తి గీతాలు పంజరాన కట్టుపడ్డ పాటల పిట్ట స్వేచ్ఛ కోసం మెలాంకలీ రాగంలో పలికిన ఆగ్రహ గాయాలు.

మాయా ఆంగెలో 1928లో మిస్సోరిలోని సెయింట్ లూయిస్‌లో జన్మించింది. ఆమె చిన్నప్పుడే తల్లి తండ్రులు విడిపోయారు. దాంతో ఆమె, ఆమె తమ్ముడూ వారి అమ్మమ్మ ఇంటికి వెళ్ళారు. ఆమె అమ్మమ్మ, ఆర్కాన్సాస్‌లోని స్టాంప్స్‌లో జనరల్ స్టోర్ నడుపుతుండేది. ఆ కాలంలో ఆ జనరల్ స్టోర్ నల్లజాతి వారందరికి కేంద్రస్థానంగా వుండేది. మాయా ఆంగెలోని ఎనిమిదేళ్ళ వయస్సులో ఆమె తల్లి ప్రియుడు రేప్ చేశాడు. దాంతో ఒక ఐదేళ్ళ పాటు ఆమె గొంతుక మూగవోయింది. తర్వాతి కాలంలో ఆమె, ఆమె తమ్ముడూ తన తల్లితో గడిపిన స్టాంప్స్‌కు పూర్తిగా భిన్నమైన వాతావరణం. మాయా ఆంగెలోకి పదహారేళ్ళ వయస్సు వచ్చేనాటికే ఆమె ఒక బిడ్డకు తల్లియ్యింది. సంవత్సరాలు గడుస్తోన్న కొద్దీ ఆమె జీవన ప్రస్థానం అనేక మలుపులకూ అనేక పెను మార్పులకూ, ఘర్షణలకూ గురయ్యింది. రెస్టారెంట్లలో పనిచేసింది. క్లబ్ డాన్సర్‌గా, పాటలు పాడేదానిగా, నటిగా నల్లజాతి హక్కుల ఉద్యమకారిణిగా, పత్రికా సంపాదకురాలిగా, కవిగా, తల్లిగా అనేక పాత్రల్ని ఆమె పోషించింది. అన్నింటిలోనూ కొంచెం తృప్తి, కొంచెం అసంతృప్తి, ఎడతెగని ఘర్షణ... తనది ఒక దేశ దిమ్మరి బతుకైపోయిందని ఆమె తన గురించి తాను చెప్పుకొంది. ఆమె ఇరవైలలో యూరప్, ఆఫ్రికాలలో పర్యటించింది. తర్వాత ఆమె నివాసం న్యూయార్క్‌కు మారింది. అక్కడ నైట్ క్లబ్ సింగర్‌గా తన జీవికను కొనసాగిస్తూ హార్లమ్ రైటర్స్ గిల్డ్‌లో సభ్యురాలిగా చేరి తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించింది. 1960 ప్రాంతంలో అమెరికాలో చెలరేగిన నల్లజాతి విముక్తి ఉద్యమాలలో చురుకైన పాత్ర నిర్వహించింది. ఆఫ్రికన్ రివ్యూ పత్రికకు

సంపాదకురాలిగా అనేక సంవత్సరాలు ఘనాలో గడిపింది.

కవిగా ఆమె గొంతుక ఎంతో విలక్షణమైంది. స్పష్టంగా సూటిగా సున్నితమైన ప్రశ్నలతో ఆమె సమాజాన్ని కుదిపి వేసింది. ఆమె అక్షరాల నిండా గుండెలు తెగి ప్రవహించే వేడి కన్నీటి ప్రవాహాలు. చరిత్ర ఒక అనుభూతిగా ఆమె అక్షరాలను వారధిగా చేసుకొని గుండె గుండెకూ అందుతుంది. విషాదాన్ని, సంభ్రమాన్ని కలగలసిన కొత్త రాగాన్ని ఆమె గొంతుక పలికించింది.

ఆమె "ఐ షల్ నాట్ బి మూవ్డ్", "అండ్ స్టిల్ ఐ రైజ్" "జస్ట్ గివ్ మి ఎ డ్రింక్ ఆఫ్ కూల్ వాటర్ బి ఫోర్ ఐ డై" అనే కవితా సంకలనాలను వెలువరించింది. ఆమె జీవిత చరిత్రను ఐదు భాగాలుగా ప్రచురించింది. పంజరంలో చిక్కుకున్న పక్షి పాటెందుకు పాడుతుందో నాకు తెలుసు (ఐ నో వై ద కేజ్డ్ బర్డ్ సింగ్స్) అంటూ ఆమె జీవిత చరిత్ర మొదటి భాగాన్ని ప్రచురించింది. అందులో మన దేశంలో ప్రతి గ్రామంలోనూ నిజానికి ఊరు, వాడలుగా రెండు గ్రామాలు ఏ విధంగావున్నాయో అమెరికన్ సమాజంలోనూ నల్ల అమెరికా, తెల్ల అమెరికాలు అదే విధంగా వున్నట్లు ఆమె హృద్యంగా చిత్రీకరించారు. 1930లలో దక్షిణ అమెరికా సామాజిక స్థితి గతులన్నీ వ్యక్తిగత స్పర్శతో ఆమె చిత్రించింది. ఆమె తల్లీ, తండ్రి విడాకులు తీసుకోవడంతో విచ్ఛిన్నమైపోయిన ఒక నిరుపేద నల్లజాతి కుటుంబం ఎన్ని అవస్థలు పడుతుందో ఆమె అందులో చిత్రించింది. ఆర్కాన్సాస్‌లోని స్టాంప్స్‌లో తెల్లవారి జాత్యహంకారం ఏవిధంగా వుంటుందో, అధికారం చెలాయించగలిగినవాళ్ళు మనుషులతో ఏ విధంగా ప్రవర్తిస్తారో ఆమె తెలుసుకొంది. తన తండ్రి నుండి విడిపోయిన తల్లి మరొక ప్రియుడ్ని ప్రేమిస్తే, తండ్రి లాంటి ఆమె తల్లి ప్రియుడే తనను పరమ దుర్మార్గంగా రేప్ చేస్తే ఒక ఎనిమిదేళ్ళ పసిబాలిక మనోభావాలు ఏవిధంగా వుంటాయో ఆమె చిత్రించింది.

ఆమె జీవిత చరిత్ర రెండవ భాగాన్ని "గాదర్ టుగెదర్ ఇన్ మై నేమ్" ( నా పేరున అందరూ ఐక్యమవ్వండి) అనే పేరుతో ఆమె వెలువరించింది. అందులో నిరుద్యోగిగా, తననూ తన బిడ్డనూ పోషించుకోడానికి సుసంపన్నమైన అమెరికన్ సమాజంలో పరమ దుర్భరమైన జీవితాన్ని ఆమె ఎలాగడిపిందో చిత్రించింది. అనేక దుకాణాల్లో సేల్స్‌గర్ల్‌గా, క్లబ్బుల్లో డాన్సర్‌గా, గాయకురాలిగా, చివరికి వ్యభిచారిగా, మాదక ద్రవ్యాలను అమ్మేదానిగా ఆమె పనిచేసింది. సమాజం చివరి పొరల్లోని జీవితం ఎంత దారుణంగా వుంటుందో ఆమె చవి చూసింది. మూడవ భాగం 'సింగింగ్ అండ్ స్వింగింగ్ అండ్ గెటింగ్ మెర్రీ లైక్ క్రిస్ట్‌మస్ అనే పేరుతో వివరించింది. డాన్సర్‌గా యూరప్, ఆఫ్రికా పర్యటనను ఇందులో చిత్రించింది. నాల్గవ భాగం. "ది హార్ట్ ఆఫ్ ఎ వుమన్" (ఒక స్త్రీ హృదయం) గా ఆమె ప్రచురించింది. ఒక స్త్రీగా, అందునా అణగారినజాతికి చెందిన స్త్రీగా ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొన్న మాయా ఆంగెలో తన జీవితానుభవాల నుండి, ఒడిదుడుకుల నుండి పొందిన

నిరాశ నిస్పృహల నుండి తన గమ్యాన్నీ, జీవనగమనాన్నీ నిర్దేశించుకొన్నది. పదునెక్కిన కలంతో రచనా వ్యాసంగాన్ని కొనసాగించింది. కాలిఫోర్నియా వదలి న్యూయార్క్‌కు వచ్చి హార్లమ్ రచయితల సంఘంలో సభ్యురాలైంది. నల్లజాతి హక్కుల ఉద్యమంలో కీలకమైన పాత్రను నిర్వహించింది. నల్లజాతి విముక్తికోసం తన జీవితాన్ని బలిదానంచేసిన 'నల్లక్రీస్తు' మార్టిన్ లూథర్ కింగ్‌కు ఉత్తర ప్రాంత సమన్వయకర్తగా ఆమె పనిచేసింది. అదే క్రమంలో ఆమె దక్షిణాఫ్రికా స్వతంత్ర పోరాట యోధుడు వాసుమ్జేమేక్‌ను వివాహం చేసుకొంది. వాళ్ళిద్దరూ కొంతకాలం ఈజిప్టులో ఉన్నారు. అయితే అనేక కారణాలవల్ల వాళ్ళిద్దరూ కలిసి ఉండలేకపోయారు.

ఐదవ భాగం, 'ఆల్ గాడ్స్ చిల్డ్రన్ నీడ్ ట్రావిలింగ్ ఘోస్ట్' అనే తన ఆఫ్రికా అనుభవాలను రచించింది. ఘనాలో ఆఫ్రికన్ వ్యూ సంపాదకురాలిగా ఆమె వెళ్ళింది. ఒక నల్లదేశంలో నల్లజాతి స్త్రీగా జీవించడం ఎంతో ఆనందకరమైన విషయంగా ఆమె భావించింది. అయితే ఆమె "మాతృభూమి" కల చెదిరిపోయింది. తను కోరుకున్నట్లుగా, తను ఊహించినట్లుగా తన ఆఫ్రికాలేదు. అక్కడ అరాచకాలు, అక్కడ అధికారదుర్వినియోగం. భ్రమలు తొలిగిన వేకువ ఆమెను మానవహక్కుల ఉద్యమకారిణిగా కావించింది. సమాజంలో లుప్తమై పోయిన 'ప్రేమ'ను పునః ప్రతిష్టించడానికి  ఆమె తన కలల్నీ,కలాన్నీ సారించి ఉద్యమిస్తోంది.

ఆమె కచ్చితంగా అంతర్జాతీయ దళిత సమాజానికి ప్రతీక. సమాజం ఏవగించుకొనే చీకటి బ్రతుకు నుండి వెలుగును ఆవిష్కరించడానికి ఆమె కవితలు రాసింది.

**"పుట్టడం ఎంత కష్టతరమో**
**మరణించడం ఎంత దారుణమో**
**మంత్రసానులకి, పొత్తిగుడ్డలకి తెలుసు.**
**జనన మరణాల మధ్య ప్రయాణమేకదా జీవితం**
**నక్షత్రాల మధ్య పోసుకోలు కబుర్లలా**
**మన ప్రయాణం ఎందుకు?**
**బహుమానమేదో కోల్పోయాం**
**బహుశా దాని పేరు 'ప్రేమ' "**

అట్లా కోల్పోయిన ప్రేమ కోసం ఆమె ఉద్యమిస్తూనే వున్నది. మనుషుల మధ్య ప్రేమను, సౌభ్రాతృత్వాన్నీ నాశనం చేస్తున్న పరిస్థితులను ఆమె ద్వేషిస్తూనే వుంది.

**ఆగస్టు, సెప్టెంబర్, అక్టోబర్ 1996 – దళిత రాజ్యం సౌజన్యంతో**

# పిడికెడు ఆత్మగౌరవం కోసం

నేను ఎప్పుడు పుట్టానో తెలియదు గానీ
వేల ఏళ్ళ క్రితం ఈ గడ్డ మీదనే చంపబడ్డాను
పునరపి మరణం పునరపి జననం
నాకు కర్మ సిద్ధాంతం తెలియదు కానీ
మళ్ళీ మళ్ళీ మరణించిన చోటనే పుడుతున్నాను
నా దేహం ఈ దేశంలో కరిగిపోయి
గంగా సింధూ మైదానమయ్యింది
నా కనుగుడ్లు కన్నీరై ద్రవిస్తే
ఈ దేశంలో జీవనదులు ప్రవహించాయి
నా సిరల నుండి జీవధాతువులు స్రవిస్తే
ఈ దేశం సస్యశ్యామలమై సిరులు కురిసింది
త్రేతాయుగంలో నేను శంభూకుణ్ణి
ఇరవై రెండేళ్ళ క్రితం నా పేరు కంచికచర్ల కోటేశు
నా జన్మస్థలం కీలవేణ్మణి, కారంచేడు, నీరుకొండ
ఇప్పుడు కరుడు కట్టిన భూస్వామ్య క్రౌర్యం
నా గుండెల మీద నాగేటి కర్రులతో పచ్చబొడిసిన పేరు చుండూరు
ఇక చుండూరు నామవాచకం కాదు సర్వనామం
ఇప్పుడు ప్రతి గుండె ఒక చుండూరు, రగిలే రాచపుండూరు
నేను జన సమూహాల గాయాన్ని గాయాల సమూహాన్ని
తరతరాలుగా స్వతంత్ర దేశంలో అస్వతంత్రుణ్ణి
అవమానాలకూ, అత్యాచారాలకూ, మానభంగాలకూ,
చిత్రహింసలకు గురై
పిడికెడు ఆత్మగౌరవంకోసం తలెత్తినవాణ్ణి
ధనమదాంధ కులోన్మత్తుల రాజ్యంలో

బతకడమే ఒక నిరసనగా బతుకున్నవాణ్ణి
బతికేందుకు పదేపదే చస్తున్నవాణ్ణి
నన్ను బాధితుడని పిలువకండి
నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి, నేను అమరుణ్ణి!
లోకానికి సంపదల్ని మిగిల్చేందుకు క్షామాన్ని మింగిన
గరళ కంఠుణ్ని నేను
శీర్షాసనం వేసిన సూర్యోదయాన్ని
నిటారుగా నిలబెట్టేందుకు
సూర్యుడి నెత్తి మీద యీడ్చితన్నినవాణ్ణి
రగిలే గుండె కొలిమిలో నినాదాలు సరిపిస్తున్నవాణ్ణి
నాకు జాలి జాలి మాటలద్దు కన్నీటి మూటలొద్దు
నేను బాధితుణ్ణి కాదు అమరుణ్ణి
ఎగిరే ధిక్కార పతాకాన్ని
నా కోసం కన్నీరు కార్చకండి
మీకు చేతనైతే
నన్ను నగరం నడిబొడ్డున ఖననం చేయండి
జీవన రవళిని వినిపించే వెదురువనాన్నై వికసిస్తాను
నా శవాన్ని ఈ దేశం ముఖచిత్రంగా ముద్రించండి
చరిత్ర పుటల్లోకి సుందర భవిష్యత్తుకై పరివ్యాపిస్తాను
మీ గుండెల్లోకి ఆవాహన చేసుకోండి
ఒక పెనుమంటల పెనుగులాటనై
మళ్ళీ మళ్ళీ ఈ దేశంలోనే ప్రభవిస్తాను